# చరిత్రహీనులు

శరత్ బాబు
రచన

బొందలపాటి శివరామకృష్ణ
అనువాదం

దేశి కవితా మండలి
విజయవాడ, 2

అసగసగి పడమర ఒక పెద్దపట్టణంలోని సంగతి. చలికాలం ప్రారంభమైంది. రామకృష్ణ పరమహంసగారి శిష్యుడొకాయన ఏదో ఒకమహాత్కార్యానికై చందాల వసూళ్ళకని వచ్చాడు. దానికై ఒకసభ ఏర్పాటు చెయ్యాలనీ, ఆ సభకు ఉపేంద్రబాబుగారిని అధ్యక్షులుగా వుంచాలనే తలంపుతో, ఒకనాడు వుదయానే కాలేజీ విద్యార్థులు కొందరు అతనిదగ్గరకు వచ్చి కూర్చున్నారు.

"అయితే ఆ మహాత్కార్యం ఏదో కొంచెం చెబుదురూ!" అన్నాడు ఉపేంద్రుడు.

"అదే ఇంకా ఏమీ తెలియలేదు. అందుకే ఈ సభ యేర్పాటు చేసేది. సభలో స్వామిగారే విషయమంతా విపులంగా ముచ్చటిస్తారట" అన్నారు విద్యార్థులు.

ఉపేంద్రుడు ఇంకేం ఎదురుప్రశ్న వెయ్యకుండా వప్పుకున్నాడు. ఇలా వప్పుకోటం అతనికి అలవాటైపోయింది. విశ్వవిద్యాలయ పరీక్షలన్నీ ఘనతగా పాసయిన తాను, విద్యార్థి ప్రపంచంలో మాన మన్ననలకు పాత్రుడైనసంగతి అతనికి తెలుసు అందుకనే వారికి ఏ అవసరం వచ్చినా ఉపేంద్రుడు మాట త్రోసెయ్యలేడు. విశ్వవిద్యాలయ సరస్వతికి కృపాపాత్రుడైన తర్వాత, న్యాయాలయ లక్ష్మిని సేవిస్తూన్నా పిల్లల జమినాస్టిక్ దగ్గరనుంచి ఫుట్‌బాల్, క్రికెట్, డిబేటింగు క్లబ్బులలోని వున్నతస్థానాలన్నీ అతనికే ప్రాప్తిస్తూంటాయి. కాని ఇవ్వాళ వీరు అధ్యక్షత వహించమంటూ వచ్చిన సభలో వాటిలోలాగ వూరికినే కూర్చుంటే కుదరదు. ఏదైనా కొంత మాట్లాడటం అవసరం. ఒకవిద్యార్థి నుద్దేసించి "సభకు వచ్చిన తర్వాత ఏదైనా మాట్లాడవలసి వస్తుంది. సభ వుద్దేశమేమిటో తెలియకుండా అధ్యక్షత వహించటం ఎలాగో నాకేం బోధపడటంలేదు" అన్నాడు.

అతనిప్రశ్న చాల సమంజసమైనదన్న సంగతి ఎవరికీ అంతుపట్టలేదు. బైటవాకిట్లో విద్యార్థి బృందం ప్రపంచంలోని గొప్పగొప్ప సత్కార్యాలలిష్టు తయారుచెయ్యటంలో మునిగివుంది. ఇంతలో ఎవరో ఒకవ్యక్తి దివాకరుని గది

లోంచి వారందరినీ చూడనట్టు తప్పించుకుని మెదలకుండా తలవంచుకు పోతున్నాడు.

దివాకరుడూ మహేంద్రుని పెత్తల్లికొడుకు. తలిదండ్రులు చిన్నతనంలోనే పోవటంవల్ల పెత్తల్లి గారియింటివద్దనే పెరిగాడు. బైటవైపు గదిలో వుంటూ వుంటాడు. వయసు పద్ధెనిమ్మిదేళ్లుంటాయి. ఎఫ్. ఏ. ప్యాసయి, బి. ఏ. చదువుతున్నాడు.

తలవంచుకు తప్పుకుపోతున్న వ్యక్తిమీద మహేంద్రునికిన్నీ సహజంగానే పిల్చి "ఆరే, సతీశ్! అలా తప్పుకు పారిపోతావే ఇటురా!" అన్నాడు.

పట్టుపడ్డ తర్వాత సతీశుడు సిగ్గుతో దగ్గిరకువచ్చి నుంచున్నాడు. "ఇంత కాలం ఎక్కడున్నావురా?" అన్నాడు మహేంద్రుడు

కొంచెం స్థిమితపడి సతీశుడు నవ్వుతూ— "అలహాబాదు బాబాయిగారింటికి వెళ్ళాను" అన్నాడు. ఇంకేదో అడగబోతూండేప్పటికి ఫ్రెంచికట్ మీసాల కళ్ళజోడు యువకుడు—కన్నుగొట్టి "ఎందుకు? హృదయానికి ఇప్పుడు బాధకలిగిందా?" అన్నాడు ఇకిలించుతూ.

అతన్ని ఈ సంవత్సరంకూడా యెందున్న పరీక్షకు పంపలేదన్న సంగతి అందరికీ తెలుసు. ఈమాట అనేటప్పటికి అందరికీ అసహ్యమూ, కష్టమూ కలిగింది. మొహాలు చిన్నబోయినాయి. అందరూ తలవొంచుకున్నారు. ఈ పరిహాసం ఎవరికీ నచ్చలేదు. వెనక వత్తాసు దొరక్కపోయేటప్పటికి పరిహాసకుడే నోరుమూసుకోవలసి వచ్చింది. కాని అతనికి సమాధానంగా సతీశుడు చిరునవ్వుతో "హృదయమున్నవాడికే బాధా వుంటుంది. తెలుస్తుంది. భూపతిబాబూ! పాసయే ఆశ అనండి, గాలిప అనండి, ఆనాడే—నాకు తెలిసి వచ్చినరోజునే వదలిపెట్టాను. కాని మా నాన్నగారు మాత్రం ఇంకా వదలిపెట్టలేకుండా వున్నారు. దీనికి చింతపడుతున్నారనుకుంటే వారొక్కరే! కాని వారుకూడా కులాసాగానే కూర్చుని ప్లీడరీ చేసుకుంటున్నారు. ఏమైనా అను భూపతిబాబూ! ఈనాటికి వారుకూడా కళ్లుతెరిచారు" అన్నాడు.

దానిమీదట అంతా ఘక్కున నవ్వారు. దానిలో నవ్వవలసిన విశేషమేమీ లేదు. కాని భూపతిబాబూ పరిహాసం సతీశుని మనస్సును కష్టపెట్టలేనందుకు అందరికీ సంతోషం కలిగింది.

"అయితే ఇంతటితో నువ్వు నిత్య సంధ్యలు పూర్తిగా వదలి పెట్టినట్టేనా?" అన్నాడు ఉపేంద్రుడు.

"నేను పట్టుకు పాకులాడింది మాత్రం ఎప్పుడని, ఇవ్వాళ వదలిపెట్టటానికి? నిజం చెబుతున్నాను ఉపేంద్రబాబూ!— ఆ దమ్ముపీడ నే నెన్నడూ కొని తెచ్చుకోనూలేదు. ఏదైనా వుంటే అది కాస్తా ఇవ్వాళతో పూర్తిగా వదలిపోయింది. ఇక కాలేజీలూ, స్కూళ్ళూ అనే పేరూ, ప్రాణం లేని చోటికెళ్ళి హాయిగా బ్రతుకుతాను."

"కాని ఏదోఒకటి చెయ్యకతప్పదుగా మానవజన్మ ఎత్తిన తర్వాత! మానవుడు ఉద్దేశహితంగా బ్రతకలేడు. అది అంత మంచిదికూడా కాదు" అన్నాడు ఉపేంద్రుడు.

ఉద్దేశరహితంగా ఉండను. అలహాబాదునుండి ఒక కొత్త "ఉద్దేశం" తోనే వచ్చాను. ఒకసారి బాగా ప్రయత్నించి చూస్తాను, ఎంతవరకు సఫల మౌతుందో?"

ఆ కొత్త ఉద్దేశమేమిటో విందామని అందరూ అతని మొహంకేసి చూడసాగారు. ఇది చూచి అతను సిగ్గుతో తలవంచుకొని "మా వూళ్ళో మలేరియాలాగా కలరాకూడా భీభత్సంగా తాండవమాడుతూ వుంటుంది. ఒక్కొక్కప్పుడు ఆ అయిదారు వూళ్ళల్లో గాలించినా ఎక్కడా ఒక్క డాక్టరు కూడా దొరకడు. నేను మా వూరు వెళ్ళి హోమియోపతీ వైద్యం మొదలు పెడతాను. మా అమ్మ చనిపోయేముందు నాకు కొంత డబ్బు యిచ్చిపోయింది. దానితో మా యింటివద్ద ఒక డిస్పెన్సరీ పెడతాను. నవ్వులాట కాదు అన్నయ్యా! మీరు చూస్తూ వుండండి. నేను తప్పకుండా చేసితీరతాను. నాన్నగారు కూడా ఒప్పుకున్నారు. వారితో ఒకటి రెండు నెలలు వుండి కలకత్తా హోమియోపథీ పాఠశాలలో చేరతానని చెప్పాను" అన్నాడు.

"ఒకటి రెణ్ణెల్ల తర్వాతే ఎందుకని?" అన్నాడు ఉపేంద్రుడు.

"ఈలోగా కొంచెం పనివుంది. దక్షిణపాడ నవనాట్యమండలినుండి కొంత మంది విడిపోయి ప్రత్యేకంగా ఒక నాటకసమాజాన్ని స్థాపించుకున్నారు. దానికి మన విపినబాబే ముఖ్యుడు. అతనే నాకు తంతిమీద తంతియిచ్చి ఇక్కడికి రప్పించాడు. వారి 'కన్సర్ట్ పార్టీ' ఏర్పాటు చేసిగాని నే నింకేపనిలోను ప్రమేయం పెట్టుకోనని మాట యిచ్చాను" అన్నాడు సతీశుడు.

ఈ మాటలకు ధీశీమాంటి అంతా ఆశ్చర్యపడ్డారు. సతీశునికికూడా ఆశ్చర్యపడింది కొంచెం ప్రశాంతంగావున్న తర్వాత "మురళి వాయించేవారెవరూ లేరు. అందుకని దివాకరునివరకు వచ్చాను. ఈ రాత్రికి ఏమైనా ఏర్పాట్లు చేస్తే నేనింకెక్కువగా గానించే అవసరం వుండదు" అన్నాడు సతీశుడు.

"అతను ఏమన్నాడు?" అని అడిగాడు ఉపేంద్రుడు.

"ఏమంటాడు? పరీక్షల యేశావు యేడుస్తున్నాడు. రెండుసంవత్సరాలు కష్టపడి చదువుకున్న చదువు ఒక్క రాత్రి చదవలేపోయినంత మాత్రాన ఎలా చెడిపోతుందో నా కర్థం కావడంలేదు. నిజంగా ఒకరాత్రితోనే చెడిపోయే చదువేఅయితే, దానిని వదలిపెట్టటమే మంచిది. ఇలా చదివి పాసవటం లోకులకు ఘనతగా వుండవచ్చునుగాని, నేను మాత్రం అలాఅనుకోను. నీకేం కోపం రానుగా వుపేంద్రబాబుగారూ! నేను మిమ్మల నెరుగున్నట్లు కీర్తివరూ ఎరగరు. జిమ్నాస్టిక్ దగ్గరనుంచి, ఫుట్ బాల్, క్రికెట్, గ్రౌండులవరకు చాలా కాలం నేను మీ శిష్యత్వమే చేసాను. మీ వెంట తిరిగి అనేకవిధాల మీరు కాలాన్ని ఎలా వినియోగపరుస్తున్నదీ చూసాను. అనేకపరీక్షల వ్యాపారంకూడా ఎరుగుదును. కాని ఏ పరీక్షలోనూ రెండవసారి కూర్చున్నట్టు కనపడదు" అన్నాడు సతీశుడు.

ఉపేంద్రుడు ఆ విషయాన్ని అంతటితో ముగించాలనే వుద్దేశంతో "కాని సతీ, నాకు మురళివాయించటం చేతగాదుగా!" అన్నాడు.

"నేనుకూడా మీరికళలో ఎందుకు వెనకబడివున్నారా అని తరచు అనుకుంటూవుంటాను. చాల ఆశ్చర్యంకూడా కలుగుతుంది. సరేగాని, ఈ నిట్ట మధ్యాహ్నపు మీ సమావేశానికి కారణం?" అన్నాడు సతీశుడు.

చలికాలపు ఎండకు వీపులు మాడుతున్నా, పై పంచలు నెత్తిన వేసుకుని గుమిగూడి కూర్చున్నారు. ఎంత పొద్దెక్కిందీ ఎవరికీ అంతుపట్టలేదు. సతీశుని మాటతో అందరూ చకితులై లేచి నుంచున్నారు. భూపతి వెళ్ళబోతూ "అయితే వినుంటారు వుపేంద్రబాబుగారూ!" అన్నాడు.

"నాకేం అభ్యంతరం లేదు. కాని స్వామిగారి ఉద్దేశం ముందుగా తెలిసివుంటే బాగుండేది. ఏమీ తెలుసుకోకుండా వెంగళాయిలా రావడానికి నాకు కొంచెం మనసులో పీకుతూనేవుంది" అన్నాడు ఉపేంద్రుడు.

"ఇలాంటి విషయాన్ని వారు మాకేమీ చెప్పలేదు. క్లిష్టాతిక్లిష్ట విషయాలను విశదంగా బోధించే సమయం రానంతవరకు మొదలకుండా వుంటేనే మంచిది. లేకపోతే దీని పర్యవసానం తీరని చెడుగా పరిణమిస్తూ వుంటుంది" అన్నాడు భూపతి.

అంతా మాట్లాడుకుంటూ బయటకువచ్చి దారికిపక్కగా నుంచున్నారు.

"అసలు సంగతి ఏమిటి బాబూ?" అన్నాడు సతీశుడు.

భూపతి ఉపేంద్రుని ఆపి "సతీశ్ బాబూ! చందాలిష్టులో మీ పేరు కూడా వేయాలి. మీ ప్రశ్నకి మేమిప్పుడు సరైన సమాధానమివ్వలేము. ఎల్లుండి సాయంత్రం కాలేజీహాలుకు దయచెయ్యండి. అక్కడ స్వామిగారే స్వయంగా విషయమంతా చెబుతారు" అన్నాడు.

"ఎల్లుండి నేను రావటం అసంభవం భూపతిబాబూ! ఆరోజున మాకు ఫుల్ రిహార్సల్లు. నేను లేకపోతే ఒక్క నిమిషంకూడా సాగదు" అన్నాడు సతీశుడు.

భూపతి ఆశ్చర్యపడుతూ "ఏమిటి? థియేటరులో ఏదో సామాన్యమైన రిహార్సల్లు పడి, నష్టమౌతుందని ఆ మహత్కార్యానికి చేయూతనివ్వలేకపోతానా? ఎవరైనా వింటే ఏమనుకుంటారు?" అన్నాడు.

"తెలుసుకోకుండా, ఆలోచించకుండాకూడా లోకులు అనేకమనుకుంటూవుంటారు. అంతదాకా ఎందుకు? ఇప్పుడు మీసంగతే చూడండి! ఏమీ తెలుసుకోకుండానే మీరో పనికి ఇంతఘనత ఇస్తున్నారు. నేనంతఘనత యివ్వలేకపోతే దోషినని నిరూపిస్తున్నారు. బాగోగులు తెలియనపని పడక, ఎవరో గారి కల్పనలకోసం పరుగులెత్తటం నాకు చేతగాదు" అన్నాడు సతీశుడు.

అక్కడవున్న విద్యార్థిబృందంలో వయసు, చదువు దృష్టిలో భూపతే అందరికన్న మిన్న. అతనే మాట్లాడుతున్నాడు. సతీశునిమాటకు నవ్వి "సతీశ్ బాబూ! స్వామిగారిలాంటి మహానుభావులు మంచివిషయాన్నే చెబుతారు. వారి ఆశయంకూడా మంచిదే అయివుంటుందని విశ్వసించటం కష్టమేమీ కాదు" అన్నాడు.

"ఒప్పుకుంటాను కష్టమేమీ కాదని. కాని చూడండి ___ఎంట్రెన్సు పాసవటం కష్టమేమీ కాదు. అయినా పాసవటం అనేది ప్రత్యేకంగానే వుంటూనేవుంటుంది. మూడు నాలుగుసంవత్సరాలనుండి ప్రయత్నించినా నేను

ముప్పైఆరు విభిన్నవాదాలను గురించి ఈ తీక్ష్ణమైన బుద్ధిలో చర్చించలేము. దీనికన్న మీరు సాయంత్రం బాబుగారి కచేరీకి దయచేస్తే మంచిది. అక్కడ ప్రొద్దుపోయేవరకూ వాదవివాదాలు చేసుకుంటూ కూర్చోవచ్చు. అక్కడ ప్రాణధన నందనబాబూ, సదర్ ఆలాగోవింద్, నాగాముతులూ కూర్చుని వాదవివాదాలు చేసుకుంటూవుంటారు. నేను వారిపక్కగదిలోనే వుంటాను. వారి తర్జనభర్జన వింటూంటే నాచెవులు దిబ్బళ్ళేసుకుపోతున్నాయి. ఆప్రభావం శరీరంమీదకూడా పడుతూవుంది. ఇలా శరీరాన్ని ఆయాసపెట్టి అకాల మరణానికి పాల్పడి కుక్కలు నక్కలకాహారం కావటం నాకు ఇష్టంలేదు. కనుక ఈవిషయం వదిలిపెట్టి ఇంకేమైనా చెప్పదలచుకుంటే చెప్పండి. లేకపోతే శెలవుయిప్పించండి నేను వెళ్ళిపోతాను" అన్నాడు.

సతీశుడు చేతులుజోడించి శెలవుతీసుకునేపద్ధతి చూచి అంతా పక్కున నవ్వారు. భూపతిబాబు అసలే మండిపడుతున్నాడు. దానిమీదట పీరనవ్వు అతనికి గాయంమీద కారంచల్లినట్టయింది. క్రోధంలో నాలుక స్వాధీనంతప్పి నోటికివచ్చినట్లు మాట్లాడాడు. "అయితే మీరు దేవుణ్ణికూడా ఒప్పుకోనట్టు కనపడుతుంది."

కోపంతో ఎర్రబడిన భూపతి ముఖంకేసి తీవ్రదృష్టితో చూచి, మళ్ళా ఉపేంద్రుని ముఖంకేసిచూసి సతీశుడు పకపక నవ్వాడు. ఈసారి భూపతిబాబు సంరక్షణలన్నీ నిశ్చితస్థానానికి చేరుకున్నాయి. "ఇక నాలాంటి కుక్కలు పదిపన్నెండయినా అతనిదగ్గిరకు రాలేవు." భూపతివంకచూచి "శబాష్ భూపతిబాబూ! శబాష్! దాగుడుమూత ఆటలో పరుగెత్తలేకపోతే 'తూ నా ఆట' అనడమే మంచిది" అన్నాడు.

ఈతీక్ష్ణ వ్యంగ్య బాణాఘాతంలో భూపతి మండిపడి లేచినుంచున్నా ఉపేంద్రుడు అతని చెయ్యిపట్టుకుని "కొంచెం ఆగు భూపతిబాబూ' దీన్నిక్కడే తేల్చేస్తాను. ఏంరాసతీశ్! 'తూ నాయాట,' 'నాబొడ్డు ఉల్లాయిలు' ఈమాటల అర్థమేమిటిరా? అసలు నీస్వభావం చూస్తేనే నువ్వు భగవంతుణ్ణి నమ్మవనికూడా సంశయం కలుగుతుంది" అన్నాడు.

సతీశుడు ఆశ్చర్యాన్నభినయిస్తూ "అదే! నేను భగవంతుణ్ణి నమ్మను? తప్పకుండా నమ్ముతాను. నాటకరిహార్సులు అయిపోయినతర్వాత అర్ధరాత్రివేళ

స్మశానంమీదుగా ఇంటికి రావలసివస్తుంది. ఎక్కడా ఒక్క పురుగుకూడా వుండదు. ఆ స్మశానంవెంట వస్తూంటే భయంతో హృదయంలో రక్తం గడ్డ కట్టుకుపోయేది. మీకు అదేం తెలుసు! నవ్వుతావేం బాబూ? భూతప్రేతాలను నమ్మినప్పుడు భగవంతుణ్ణి నమ్మకుండా వుండటం సంభవమేనా?" అన్నాడు.

అతనిమీద కోపంతో నున్న భూపతికూడా ఈ మాటకు నవ్వాడు. "భూతాలకి భయపడటమంటే అర్థం భగవంతుణ్ణి నమ్మటమనా సతీశ్ బాబూ! తమదృష్టిలో అవి రెండూ ఒక్కటే ననేగా?" అన్నాడు.

"అవును; పూర్తిగా ఒక్కటే. రెంటినీ దగ్గరగా వుంచితే ఏది దైవమో, ఏది దయ్యమో గుర్తించలేముకూడా. నేనొక్కణ్ణే కాదు, మీరూ అంతే, ఉపేంద్రబాబుకూడా, శాస్త్రకారులుకూడా అంతే. వారిద్దరిలో ఏ ఒక్కరినీ నమ్మనివారినిగురించి ఇంకా చెప్పేదేమున్నది? ఒకసారి నమ్మితేసరి పీడ వదిలించుకోవటం కష్టం! ఇక నమ్మినతర్వాత ప్రాణాలు మీదకొచ్చిపడుతుంది. దుఃఖంలో, సంకటంలో, విపత్తులో...అనేకవిధాలఆలోచించిచూచాను. వాదవివాదాలుకూడా చాలా విన్నాను. కాని పూర్వమున్న అంధకారమే ఇప్పుడూ వుంది. నిరాకార బ్రహ్మను నమ్మినా, కాళ్ళుచేతులున్న ముప్పైమూడుకోట్ల దేవతలను నమ్మినా, ఏమిచేసినా ఒకర్ని నమ్మగానే రెండవవారుకూడా వచ్చి కూర్చుంటారు. అంతా ఒక్క గొలుసులో గొళ్ళేలలాగ కనపడతారు. ఒక గొళ్ళాన్ని లాగగానే తక్కిన గొళ్ళేలుకూడా లాక్కువస్తాయి. స్వర్గనరకాలు వస్తాయి, ఇహపరాలు వస్తాయి, అమర ఆత్మకూడా వస్తుంది. ఇంకా నువ్వు సమాధులలో నున్న వుపదేవతలను ఏలా మోసగించగలవు? కాళికారేవులో ఏదేవతకైనా చాటుగా కాస్త పిండంవేసి వదిలించుకోగలవా? క్షణంలో లెక్కలేనన్ని దేవతలొచ్చి ముట్టడిస్తాయి. అలాంటప్పుడు దయ్యాలకు భయపడి, దైవాన్ని నమ్మకుండా వుండటం ఎక్కడైనా సంభవమేనా భూపతి బాబూ?" అన్నాడు సతీశుడు.

మాట్లాడుతున్నప్పుడు అతని ముఖలక్షణాలుచూచి అంతా విరగబడి నవ్వారు. కొంచెందూరంగా నుంచున్న, చిన్నపిల్లలు యిద్దరూ కూడా బిగ్గరగా నవ్వారు. ఆదివారపు వుదాసీనత మలినపు మధ్యాహ్నం ఈ నవ్వుతో మారుమోగింది.

వాగడితే "పనులు చెయ్యటానికి కాకపోతే మీరు నన్ను పెట్టుకున్నదిఎందుకు? చెప్పు ఇంటికివెళ్ళి భార్యలదగ్గర మెప్పుకు ఒట్టి ముదనష్టపు పనిగత్తెదొరికింది. రెండుపూటలూ కడుపునిండా కూడుకూడా పెట్టేది కాదు! అని తిట్టటానికా! అలా మాటలపాలయ్యేకంటే ఇలా కష్టపడటమే మంచిది" అని నవ్వుతూ తన పనిలోకి వెళ్ళిపోయింది. మెస్సులో సతీశుడొక్కడే ఆమెను పేరున పిలుస్తాడు. ఎప్పుడైనా ఆమెతో పరిహాసమాడుతున్నప్పుడు బుద్ధిపుడితే ఏదైనా బహుమతి కూడా యిస్తూవుంటాడు. ఆమెకుకూడా సతీశుడంటే అతి మక్కువ. అందు కనే మెస్సుపనులలో ఎంత తీరికలేకపోయినప్పటికీ నవ్వుతూ ఒకకన్నూ, ఒక చెవి అతనిమీద యుంచుకునియుంటుంది. మెస్సువారందరికీ ఈ సంగతి తెలుసు. కొందరు ఎగతాళికూడా చేస్తూవుండేవారు. సావిత్రి సమాధాన మేమీ యిచ్చేదికాదు, నవ్వుకుంటూ పనిచేసుకుపోయేది.

"ఆఁ మెలకువ వచ్చింది" అంటూ సతీశుడు దిండుకిందనుంచి ఒక రూపాయితీసి ఆమెముందు విసిరేశాడు. సావిత్రి రూపాయతీసుకుని, "ప్రొద్దున్నే ఏం తీసుకురావాలి?" అన్నది.

"మిఠాయి! కాని నాకు కాదు. దాచుకుని రాత్రికి ఇంటికివెళ్ళేప్పుడు మీవారికి కొనుక్కువెళ్ళు" అన్నాడు సతీశుడు.

సావిత్రి కోపంతో రూపాయి సతీశుని పక్కమీదికి విసిరివేసి "దాచుకోండి, మీరూపాయి మీరు! మావారు మిఠాయికేమీ మొహంవాచిపోలేదు" అన్నది.

సతీశుడు రూపాయి మళ్ళా ఆమెముందుకు విసిరివేసి ప్రతిమాలుతూ "నాతోడు సావిత్రీ! ఈరూపాయి నువ్వు నాకు మళ్ళా తిరిగియివ్వ నవసరం లేదు. నువ్వుతీసుకో. నిజంగా మీవారికి మిఠాయికని యిచ్చాను" అన్నాడు.

సావిత్రి మొహం చిట్లించుకుని_ "ఆడవాళ్ళలాగ మీరు ఇలా ఒట్లు వేసుకోటం అంతమంచిదికాదు. నావారూ, గీరూ ఎవరూలేరు. మావారయినా ఇంకెవరైనా అంతా మీరే_మీరు..."అన్నది.

"అయితే రూపాయి యిటు తే! నిజంచెప్పు సావిత్రీ! నేను కాక మీవారు ఇంకెవరూలేరూ! వుంటేచెప్పు_ నేను వాణ్ణి ముప్పతిప్పలుపెట్టి మూడుచెరువులు నీళ్ళు తాగిస్తాను" అన్నాడు సతీశుడు నవ్వుతూ.

"మావారిమీద మీకు పగా ఏమిటి ముప్పతిప్పలు పెట్టటానికి?" అన్నది సావిత్రి నవ్వి.

"నేనే అతన్ని ముప్పతిప్పలు పెడతానో, అతనే నన్ను ముప్పతిప్పలు పెడతాడో? కాని నేను అతనికి ఈనాడు మిఠాయిలు కొనిపెడుతున్నాను" అన్నాడు సతీశుడు.

సావిత్రి మొహంతిప్పుకుని నవ్వు ఆపుకున్నది. "నౌకర్లతో ఇలా మాట్లాడుతూవుంటే నెత్తినయెక్కి కూర్చుంటారు. భయము, భక్తీ ఏమీవుండదు. మళ్ళీ యజమానిమాట వినరు. మాట్లాడేది కొంచెం ఆలోచించి మాట్లాడాలి. లేకపోతే లోకులు నిందిస్తారు" గంభీరంగా అని గుడ్డపాయితీసుకుని ఇంట్లోంచి బైటకు వెళ్ళిపోయింది. కాని మళ్ళీ వెంటనే తిరిగివచ్చి "ఈపూట యేమి చెయ్యమంటారుబాబూ!" అన్నది. భోజనపదార్థాలను నిర్ణయించటంలో అతనికి నేర్పువున్నదని సావిత్రికి బాగా తెలుసు. అడిగుకుని భోజనాలు ప్రొద్దున్నే పని పనివదకువచ్చి- అతని అజ్ఞాప్రకారం స్వయంగా వంటవాని దగ్గరవుండి పనులన్నీ చేయిస్తూ వుంటుంది. ఇంతలో నౌకరు నిప్పుతీసుకువచ్చి యివ్వబోయాడు. సతీశుడు మళ్ళీ పక్కమీద వత్తిగిలి "నీయిష్టమొచ్చిందిచెయ్యి" అన్నాడు.

"ఇప్పుడు మీకుకోపంకూడా ఎక్కువైనట్లువుంది. ఏమాట అన్నా కోపమే?" అన్నది సావిత్రి.

సతీశుడు మొహం గోడవైపుకు తిప్పుకుని పొగవదులుతూ "మనిషికి కోపంకూడా చేతకాకపోతేఎలా? ఇవ్వాళ నేను అసలు భోజనమేచెయ్యను" అన్నాడు.

"ఎక్కడో విందుతగిలినట్టువుంది. ఏమైనా కానీ సతీశ్ బాబూ! మీకు ఇదేచెపుతున్నాను- ఇవ్వాళ స్కూలుకు వెళ్ళకతప్పదు" అన్నదిసావిత్రి.

ఈ కాసేపట్లోనే-తప్పనిసరిగా స్కూలుకువెళ్ళేపని మళ్ళీ భారమనిపించసాగింది. అతడు అనేక కారణాలుచూపించి, స్కూలు ఎగ్గొట్టటానికి ప్రయత్నిస్తున్నది సావిత్రి ధ్యానంతో చూస్తూనేవుంది. ఇవ్వాళ సతీశుడు పక్క వదలకపోవడం చూడగానే విషయమంతా గ్రహించింది.

సతీశుడు ఆత్రపడుతూ లేచికూర్చుని- కప్పించుకున్న క్రోధస్వరంతో "ఇదే చెబుతున్నాను—ఈ శుభకార్యారంభంలోనే గల్లంతుచేసి విఘ్నం కలిగించకు" అన్నాడు.

“నావంతే వున్నాను. ఎంట్రన్సు పాసయ్యేప్పటికి ఇరవై రెండేళ్లు వెళ్లిపోయినాయి. ఇక ఈ డాక్టరీ పాసయ్యేప్పటికి అరవైయేళ్లు నిండేట్టు కనపడుతున్నది.”

సతీషు కోపంతో “అనవసరంగా అబద్ధం ఆడమాకు సావిత్రీ! నేను ఎంట్రన్సుకూడా పాసవలేదు.” అన్నాడు.

సావిత్రి నవ్వి “సరే, అదీ లేదూ?” అన్నది.

సతీషు తలతిప్పుకొని “లేదు. పాసవటానికి ఆ చుప్పనాతి మాష్టరు నన్ను పరీక్షకుకూడా వెళ్ళనిస్తేగా, ఇంకా నేనేం చేస్తాను?” అన్నాడు.

ఈ మాట విని సావిత్రి నోట్లో గుడ్డపెట్టుకుని నవ్వసాగింది. “అయితే దీనికికూడా ఆ దేగతి పడుతుందా?” అన్నది మళ్ళీ.

“దేనికి?”

“డాక్టరు పరీక్షకి?”

కొంచెంసేపు మెదలకుండా వుండి సతీషు “అయితే సావిత్రీ! లోకులు గాడిదల్లాగ కష్టపడి పరీక్షలు పాసయి ఏపాటికి చేసేదేమిటి?” అన్నాడు.

సావిత్రి నవ్వు ఆపుకుని “వాళ్లు గాడిదల్లాంటివారు గాని గాడిదలు కాదు. అసలు గాడిదలు పరీక్షలు ఎన్నటికీ పాసవలేరు” అన్నది.

సతీషు వెంటనే బైటికి తొంగిచూచాడు... ఎవరూ లేరు. తర్వాత శాంతించి కూర్చుని “ఎవరైనా వింటే ఏమనుకుంటారు. నా ముఖమెదట నన్ను గాడిదవంటున్నావా? నీ ఈ స్వభావం మంచిది కాదు సావిత్రీ!” అన్నాడు కొంచెం గంభీరంగా.

కాలమహిమవల్ల ఇవ్వాళ సావిత్రి ఒక మెస్సు పనిగత్తె. అందుకే ఆమె నవ్వు గొంతుకని సహించి ‘సరె’ అని మెల్లగా బైటికి వెళ్ళిపోయింది.

సతీషుడు అలసిపోయినట్టు మళ్ళీ ఒకసారి మంచం మీద వత్తిగిలాడు. పగలల్లా పనిలేకుండా వుండాలన్న అతని సంకల్పం చాలభాగం సావిత్రి మాటతో ఎగిరిపోయింది. మునిష్వతో వెళ్ళినసావిత్రి— సెలవు పెట్టాలన్న అతని వుత్సాహాన్నికూడా నులిపివేసింది. ఇవ్వాళ ఇంట్లో కూర్చునడంవల్ల ఏమీ లాభంలేదని అతను మనసులో అనుకున్నా ఆటవిడుపు ననుభవించాలన్న లాలసనుకూడా పూర్తిగా వదలలేకపోయాడు. అలసిన శరీరంతో వుదాసీన హృద

జ్వరంలో పక్కమీద పడివున్నాను. నీ పుణ్యానికి స్నానానికి మళ్ళీ తెలివి వచ్చింది. కాని సతీశుడుమాత్రం లేవలేదు. తొందరేమున్నది? ఇవ్వాళ నేను ఇంటిదగ్గరే వుంటానుగా" అన్నాడు.

సావిత్రి ఇంట్లోకివచ్చి—"ఊహూఁ అదేమీ కుదరదు. మీరు స్కూలుకు వెళ్ళాలి. వెళ్ళి స్నానం చేసి భోంచెయ్యండి" అన్నది.

"నామీద పెత్తనగత్తెవయ్యావా ఏమిటి, ఇలా అప్పుడే పెడుతున్నావు? ఇవ్వాళ నేను 'పాదమేకం నగచ్ఛామి'" అన్నాడు సతీశుడు.

సావిత్రి చిరునవ్వునవ్వి "వెళ్ళకపోతే మానిలే, స్నానంచేసి భోజనమైనా చెయ్యండి. మీయీ సోమరితనంవల్ల నౌకర్లుకూడా విసుక్కుంటున్నారు, చూట్టంలేదూ?" అన్నది.

"తొమ్మిది కాకముందే తిండికి తాట్లాడేవాళ్లు ఒక నౌకర్లేనా? ఈ మెస్సును వదిలిపెట్టకపోతే నా ప్రాణాలువుండేట్టు లేవు" అన్నాడు సతీశుడు.

సావిత్రి నవ్వి "అయితే నేనూ మానవలసి వస్తుంది" అన్నది.

అనటానికి అనివేసింది, కాని వెంటనే తనమాటను అణచుకొని "మీరు ఇక్కడ వున్నంతవరకూ మెస్సు నియమాలను పాటించక తప్పదు. స్కూలుకు కూడా వెళ్ళాలి. లేవండి, ఆలస్యమవుతూవుంది" అని అంగవస్త్రము, సతీశుని ధోవతీ తీసుకుని స్నానాలగదిలో పెట్టిరావటానికి తొందరగా బైటికి వెళ్ళిపోయింది.

సతీశుడు నిత్యం నియమంగా సంధ్యావందనం చేస్తావుంటాడు. ఇవ్వాళ స్నానంచేసి వచ్చి పూజా వేదికమీద కూర్చుని ఆలస్యం చేయసాగాడు. సావిత్రి రెండు మూడుసార్లు వెళ్ళిచూచింది. కాని ఎంతసేపటికీ కదలకపోయేసరికి తలుపుదగ్గర నుంచుని కేకేసి "ఇంతసేపు ఏమిచేస్తున్నారు? వడ్డించిన అన్నం చల్లారికూడా పోతూవుంది. స్కూలుకు వెళ్ళకపోతే మానిలే. దయచేసి రెండు మెతుకులన్నా తినండి, నా ప్రాణాలు తెరిపిన పడతాయి" అన్నది.

సతీశుడు ఐదు నిమిషాలు మెదలకుండావున్నాడు. తర్వాత లేచి "పూజా సమయంలో గల్లంతు చేస్తే ఏమవుతుందో తెలుసా?" అన్నాడు.

"గంగాజలమూ, పంచపాత్రా ముందుపెట్టుకొని బూటకం మాడుతూంటే ఏమవుతుందో తెలుసా?" అన్నది సావిత్రి.

సతీశుడు మొహం చిట్లించి "నేను బూటకాలాడుతున్నానా? ఎప్పటికీ కాదు" అన్నాడు.

సావిత్రి ఏదో చెప్పబోయి మొదలకుండా దిగమింగింది. "ఏమో అదీ మీకే తెలుసు, కాని రోజూమాత్రం ఇంత ఆలస్యమయ్యేది కాదు. సరే రండి, అన్నం వడ్డించివుంది" అని వెళ్ళిపోయింది.

సుఖపదమైన చలికాలపు మధ్యాహ్నపు టెండ. మెస్సంతా జనశూన్యంగా, ప్రశాంతంగావుంది. మెస్సులో వుండేవారంతా తరచు వుద్యోగాలు చేసేవారు. అంతా ఆఫీసులకు వెళ్ళిపోయారు. వంటమనిషి ఎక్కడికో వెళ్ళాడు. బిహారీ సామాను కొనుక్కురావటానికని వెళ్ళాడు. సావిత్రి అలికిడికూడా తగలలేదు. సతీశుడు మొదట కొంచెంసేపు మంచంమీద పండుకొని పగటి నిద్రకోసం ప్రయత్నించాడు. మళ్ళా లేచికూర్చుని ఏదో ఆలోచించసాగాడు. తలవైపు కిటికీ తలుపుతీసి, ఎదుట మిద్దెవైపుచూచి మళ్ళా వెంటనే వేశాడు. మిద్దెపక్క వరండాలో సావిత్రి తల ఆరబోసుకు కూర్చుని, తలవంచుకొని ఏదో పుస్తకం చదువుకుంటూ వుంది. కిటికీతలుపు తీసిన చప్పుడువిని ఆమె వెనక్కి తిరిగి చూచింది. పైట సర్దుకొని లేచినుంచుని మళ్ళా చూసేప్పటికి కిటికీతలుపు వేసివుంది. లోపలికివెళ్ళి "నన్ను పిల్చారా బాబుగారూ?" అన్నది.

"పిలవలేదు" అన్నాడు సతీశుడు.

"మంచినీళ్ళు తీసుకురానా......తమలపాకులు?"

తలఊగించి "తీసుకురా" అన్నాడు.

సావిత్రి మంచినీళ్ళు తీసుకువచ్చి మంచందగ్గర పెట్టింది. కిటికీతలుపులూ వాకిటితలుపులూ అన్నీ తీసి వెళ్ళి గడపమీద కూర్చొని "వెళ్ళి సిగరెట్లు తీసుకు రానా?" అన్నది.

"బిహారి ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు సతీశుడు.

"బజారుకు వెళ్ళాడు" అని సావిత్రి బైటికి వెళ్ళిపోయింది. కొంచెం సేపట్లో సిగరెట్లు తీసుకువచ్చి యిచ్చి వాకిటికి ఎదురుగా కూర్చొని నవ్వుతూ "మీరు ఇవ్వాళ అనవసరంగా ఇంట్లో కూర్చున్నారు" అన్నది.

"అవును నాతత్వమే ఒకవిధంగా ఏకాంతం. అందుచేత అప్పుడప్పుడూ అలావుండకపోతే ఆరోగ్యం చెడుతూ ఉంటుంది. దాన్ని కాపాడుకోకుండా

చదివి నాకు డాక్టరు కావాలనికూడా లేదు. కొద్దిగొప్ప నేర్చుకున్న తర్వాత ఇంటికివెళ్ళి ఒక ధర్మ ఆస్పత్రి పెడతాను. చికిత్సలేక లోకంలో ఎంతోమంది దరిద్రులు, అనాధలు కలరా మహామారి కాహుతి అవుతున్నారు. వారికి చికిత్స చేయడమే నాయుద్దేశ్యం." అన్నాడు సతీశుడు.

"ధర్మంగా చేసే చికిత్సకు వైద్యం బాగా నేర్చుకునే అవసరం లేదన్న మాట! మంచిడాక్టరు ధనవంతులకేనా ఏమిటి? పేదవారికి అవసరంలేదూ? కాని మీరు ఇక్కడినుంచి ఎలావెళ్ళగలరు? మీరు లేకపోతే విపినబాబు చాల ఇబ్బంది పడిపోతాడు" అన్నది సావిత్రి.

విపినబాబు పేరువిని, సతీశుడు చాల సిగ్గుపడ్డాడు. "వారెందుకు ఇబ్బంది పడిపోతారు? నాలాంటివారు అతనికి అనేకమంది స్నేహితులున్నారు. ఇప్పుడు అదీగాక నేను అక్కడికి వెళ్ళడంకూడాలేదు" అన్నాడు.

"వెళ్ళకపోతే విపినబాబుగారి ఆవిడకు సంగీతం చెప్పే దెవరు?" సావిత్రి ఆశ్చర్యంతో అడిగింది.

సతీశుడు కోపంతో మొహం చిట్లించుకొని "ఆమెకు సంగీతం నేను నేర్పుతున్నానా?" అన్నాడు.

"నాకేం తెలుసుబాబూ! లోకులు అలాగే అనుకుంటూ వుంటారు" అన్నది సావిత్రి.

"ఎవరూ అనుకోరు. ఇవన్నీ నువ్వు కల్పించిన బూటకాలు."

"మిమ్మల్లను విపినబాబుగారి సహచరు డంటారు. అదికూడా నేను కల్పించిన బూటకమేనా?"

ఈమాట విని సతీశుడు మండిపడ్డాడు. దానికీ కారణమున్నది, విపినునితో మిత్రత్వమున్నదని లోకులకు తెలిస్తే,—అందరి దృష్టిలోనూ తను నీచంగా చూడబడతానని అతనికి తెలుసు. కలకత్తా నివాసి విపినుని, వినోదవిలాసాలలో ప్రవాసి సతీశుని స్థాన- లోకులదృష్టిలో క్రిందకు దిగజారిపోతుంది. సతీశుని ఈ సంశయాత్మకత సావిత్రి తీవ్రాఘాతంతో ఒక్కసారి భీకర రూపం ధరించింది. కళ్ళెర్రజేసి "నన్ను అతని సహచరు డన్నది ఎవరు? నేను కూడా తెలుసుకుంటాను అతనిపేరు చెప్పు!" అని గర్జించాడు.

సావిత్రి లోలోన నవ్వుకుని "ఎవరి పేరని చెప్పను బాబూ! రాఘవ బాబుగారి పరుపు ఎండలో వేసి ఇప్పుడే వస్తాను" అన్నది.

"పరుపు అటువుంచి, ముందు పేరు చెప్పు!"

సావిత్రి నవ్వి. "కుముదిని" అన్నది.

సతీశుడు ఆశ్చర్యపడి "ఆమె నిన్ను ఎలా ఎరుగున్నది?" అన్నాడు.

"ఆమె నన్ను పనిలోకి రమ్మని కబురంపింది."

"నిన్నా? ఇది అసంభవం! అయితే నువ్వేమన్నావు?"

"ఇంకేమాటా చెప్పలేదు. అదే ఆలోచిస్తున్నాను. జీతమెక్కువ, పని తక్కువ. అందుకని ఆశ కలుగుతూ వుంది."

సతీశుడు మండిపడ్డాడు. "తెలిసింది. ఇదంతా విపినుని పన్నాగము. అతను తరచుగా నీ పేరు తలుస్తూవుంటాడు" అన్నాడు.

సావిత్రి నవ్వు ఆపుకొని "తలుస్తూవుండవచ్చు అతనికి నామీద మనస్సుందేమో!" అన్నది.

సతీశుడు సావిత్రి ముఖంకేసి కళ్ళప్పగించుకు చూచి "సరే, మనస్సైనందుకు ఫలితం అనుభవిస్తాడు. పందగూపాయలు జరిమానా యిచ్చుకున్న తర్వాత మళ్ళా ఈ నాటికి ఎవరిమీదా కొండా ఎత్తలేదు. మళ్ళా ఇప్పుడు కొంచెం ముట్టజెప్పుకునేట్టు కనబడుతున్నాడు. సరే నువ్వువెళ్ళు" అన్నాడు.

సావిత్రి రాఘవబాబు పరుపు ఎండలో వేసి వెంటనే తిరిగివచ్చి కిటికీ సందులోంచి చూచింది—సతీశుడు గుస్సులు పేసుకొని పెట్టెలోంచి గుప్పెడు నోట్లుతీసి జేబులో వేసుకుంటున్నాడు. సావిత్రి దర్వాజామీద చేతులువేసి వాకిటికి అడ్డంగానుంచుని "ఎక్కడికి వెళుతున్నారు?" అన్నది.

"పనివున్నది, వెళ్ళనియ్యి."

"ఆ పనేమిటో నాచెవినికూడా వేదురూ!"

సతీశుడు క్రుద్ధుడై "తప్పుకో వెళ్ళాలి" అన్నాడు.

సావిత్రి తప్పుకోలేదు. నవ్వుతూ "భగవంతుడు మీకు ఏగుణమూకొరత చెయ్యలేదు. ఇంతకుముందు జరిమానాకూడా వేశారే?" అన్నది.

సతీశుడు మొహం చిట్లించుకొని మాటాడలేదు.

"ఇది చాల అన్యాయం! నేను యెక్కడైనా పనిచెయ్యటం చెయ్యకపోవటం నాఇష్టం. మధ్య మీరుకల్పించుకొని ఎవరితోనో పోట్లాడుతానంటా రెందుకు?" అన్నది సావిత్రి.

"పోట్లాడడం, పోట్లాడకపోవడం—అది నాయిష్టం. అపటానికి మధ్య నువ్వెవరు?" అన్నాడు సతీశుడు.

సావిత్రి చేతులుజోడించి "కొంచెం విశ్రమించండి, నేనువచ్చినతర్వాత వెళుదురుగాని" అన్నది.

సతీశుడు తిరిగివచ్చి మంచంమీద కూర్చోగానే సావిత్రి బైటకువెళ్ళి టక్కున గొళ్ళెంపెట్టింది. స్థిమితపడేసంతవరకు గొళ్ళెంతియ్యను కిందకు వెళ్తున్నాను—అని కిటికీకేసిచూస్తూ నిజంగానే కిందకుదిగివెళ్ళిపోయింది. మరో ఉపాయంలేక సతీశుడు కొంచెంసేపటివరకు మెదలకుండా కూర్చుని కోటు విప్పి కిందపారేసి మంచంమీదకెళ్ళి వెల్లకిలా పడుకున్నాడు.

అతనికి ప్రయాగలో మొదట విపినుతో పరిచయంకలిగింది. కలకత్తా వచ్చినతర్వాత ఈపరిచయం స్నేహంగా పరిణమించింది. అతను ఇక్కడికి తరచుగా వస్తూపోతూవుండేవాడు. అతను ఎందుకు వస్తున్నాడో సతీశునికికూడా తెలుసు. ఇవ్వాళ సావిత్రి అన్నమాటతో అతనిసంశయం స్థిరమైపోయింది. సతీశుని మిత్రుడనీ, పెద్దమనిషి అనీ విపినునికి ఇక్కడ విశేషగౌరవం వున్నది. సతీశుడు ఇంటివద్ద లేనప్పుడుకూడా అతని గౌరవమర్యాదలకేమీ లోటు వుండేదికాదు. సతీశుడు స్వయంగా ఈబాధ్యత సావిత్రికి అప్పగించాడు. ఆ ఆదర-సత్కారాలను విపినబాబు తృప్తిగా పొందుతున్న సంగతి సతీశునికి కూడా తెలుసు. తన వుదారస్వభావమంతా విపినుని నీచప్రవృత్తి గాఢమైన కృతఘ్నతారూపంలో ఇవ్వాళ అతని హృదయాన్ని భేదించింది. మర్యాదలు, ఆహ్వానాలూ, స్నేహాలూ అన్నీ అతనికి కాలకూటవిషం అయిపోయాయి. మెదలకుండా పడివున్నా, అతని అంతర్వేదన బోనులోనున్న క్రూరజంతువు లాగ, మాటిమాటికీ అతని లోలోన గంతులేయసాగింది.

గంటసేపటికి సావిత్రి తిరిగివచ్చి కిటికీబైటనుంచి మెల్లగా "స్థిమితంకలిగిందా బాబూ!" అన్నది. సతీశుడు సమాధానమేమీ ఇవ్వలేదు. తలుపుతీసి సావిత్రి ఇంట్లోకివచ్చినుంచుని "ఇదేం అన్యాయం చెప్పండి!" అన్నది.

సతీశుడు అటువైపు చూస్తుంటానే "ఏం అన్యాయం?" అన్నాడు. "తాము అభివృద్ధికి రావాలని ప్రతివాడికీ వుంటుంది. నాకు ఎక్కడో ఏదో మంచిపనిదొరికితే దాన్ని మీరు చెడగొడతారెందుకు?" అన్నది సావిత్రి. "నేనెందుకు చెడగొడతాను? నీఇష్టమైతే వెళ్ళకుండా నేను ఆపితేమాత్రం ఆగుతావా?" అన్నాడు సతీశుడు వుదాసీనభావంతో.

"అయితే, మా కొత్త యజమానిగారిని తన్నుతాను, నరుక్తానంటూ పైలుదేరుతారెందుకు?" అన్నది సావిత్రి.

"ఒకవేళ ఎవరైనా నీవస్తువును ఎత్తుకుపోతుంటే నువ్వేమి చేస్తావు చెప్పు సావిత్రీ?" అన్నాడు సతీశుడు తేరిచూస్తూని.

"నేను మీవస్తువునా ఏమిటి?" అన్నది. సావిత్రి పెదవులమీద చిరునవ్వు రేఖలు పరుగులెత్తాయి.

సతీశుడు సిగ్గుపడి "ఛా! నా వుద్దేశం అదికాదు. కానీ........." అన్నాడు.

"ఇక కాని.....గీని ఏమీలేదు. నేను వెళ్ళకుండాలేను" అన్నది సావిత్రి. కంగారుపడివున్న సతీశుని చొక్కాతీసి జేబులోంచి నోటు తీసుకున్నది. నోటు పెట్టెలో పెట్టి తాళంవేసి తాళపుచెవి తనకొంగుకు తగిలిస్తూ "దీన్ని నాదగ్గర వుంచుకుంటాను. డబ్బు అవసరమైతే తీసుకుందురుగాని" అన్నది. "దొంగిలిస్తే?" అన్నాడు సతీశుడు. సావిత్రి చిరునవ్వునవ్వి పయటచెంగుకు కట్టిన తాళపుచెవులగుత్తి భుజానవేసుకుంటూ "నాదొంగతనం మీకేం కష్టం కలిగించదు" అన్నది.

సతీశుడు ఒకక్షణంసేపువరకు సావిత్రి ముఖంకేసి చూస్తూ వున్నాడు. ఆక్షణంసేపటి చూపుతోనే అతని అంతర్యంలో ఎలాంటి చిత్రం అంకితమైందో ఏమో ఒకసారి వులికిపడి "సావిత్రి, మీ వూరు ఏది?" అన్నాడు.

"బెంగాలులో!"

"ఇంతకన్న ఎక్కువ చెప్పకూడదా?"

"చెప్పను"

"ఊరు చెప్పకపోతే మాని కులం చెబుతావా?"

సావిత్రి నవ్వి "తెలుసుకుని ఏమిచేస్తారు? నేను వండిన అన్నం మీరు తినరుగా?"

సతీశుడు కొంచెం సేపు ఆలోచించి — "సంభవం కాదు. అయినా గట్టిగా కాదనికూడా అనలేను" అన్నాడు. సావిత్రి తన విశాలోజ్జ్వల నేత్రద్వయంతో సతీశుని ముఖంకేసి చూస్తూ, నిమిషంసేపున్న తర్వాత పక్కున నవ్వింది. పిల్లలాగ తలఊగిస్తూ కంఠస్వరంలో అగాధనీయమైన స్నేహము, ప్రేమునింపి "కాదనలేరూ—ఎందుకని?—కొంచెం చెబుదురూ" అన్నది. హఠాత్తుగా సతీశుని నెత్తిమీద భూతం ఎక్కికూర్చుంది. హృదయంలోని నరకం పొంగులెత్తింది. అతను వెంటనే గాఢస్వరంతో — "ఎందుకనో తెలియదు సావిత్రీ! కాని నీచేత్తో వంటచేస్తేమాత్రం 'నేను తినను' అని అనడం కష్టం" అన్నాడు.

"కష్టమా? సరే, ఇంకెప్పుడైనా సమయం దొరికినప్పుడు చూస్తాను. ఆఁ అన్నట్టు రాఖాలబాబుగారింట్లో ఎవరో వచ్చినట్లు వినబడుతోంది." అంటూ ఆమె గదిలోంచి బైటకు వెళ్ళిపోయింది.

"ఒకమాట వినిపో సావిత్రీ!" అని సతీశుడు హఠాత్తుగా ముందుకు వంగి, చెయిజాపి ఆమె పయుటచెంగు పట్టుకున్నాడు. సావిత్రి కళ్ళల్లో మెరుపులు కురిపిస్తూ "రామ! రామ! ఇదేమిటి?" నేను ఇప్పుడే వస్తాను అంటూ పయుటచెంగు వదిలించుకొని మాయమైంది.

తలవని తలంపుగా ఒక అద్భుతకాండలా జరిగింది. సావిత్రి భయపడి అకస్మాత్తుగా ఆ పారిపోవడమూ, అణచుకున్న గొంతుతో 'వస్తున్నాను' అనడమూ, కళ్ళల్లో ఆ మెరుపులు కురిపించడమూ అన్నీ ఏకమై వజ్రాగ్నిలాగ సతీశుని దుర్బుద్ధినంతటినీ క్షణంలో మాడ్చి మసిచేసివేసినాయి! సిగ్గుతో అతని శరీరమంతా బరిశ పోట్లు తిన్న సర్పంలాగ మెలికలు తిరిగిపోసాగింది. అతను ఈ జీవితంలో ఇంకెప్పుడు సావిత్రి ముఖం చూడలేననుకున్నాడు. ఏ పనిమీదనయినా ఆమె మళ్ళా వస్తుందనే భయంతో, ఆ నిముషానే పైపంచ భుజాన వేసుకుని సుడిగాలిలా బయటపడ్డాడు. మూడు నాలుగు మెట్లు మిగిలి వుండగా సతీశునికి మళ్ళీ సావిత్రి పిలుపు వినిపించింది. ఆమె వంటింట్లోంచి పరుగెత్తుకువచ్చి—"భోజనంచేసి వెళ్ళు బాబూ! లేకపోతే మీరు తిరిగి వచ్చేప్పటికి ఆలస్యమౌతుంది, అంతా ఆరుమూడైపోతుంది" అని బిగ్గరగా పిలుస్తూ వుంది. కాని సతీశుడు వినీవిననట్టు, రొప్పుతూ రొజుతూ బైటికి వెళ్ళిపోయాడు.

[illegible] మెల్లగా "ఏమిటో అనుకోవద్దు సావిత్రీ!" అన్నాడు. సావిత్రి విస్మయస్వరంతో "అనుకో వద్దం ఏమిటి?" అన్నది.

సతీశుడు తలవంచుకొని మెదలకుండా వూరుకున్నాడు. సావిత్రి చిరునవ్వు నవ్వి "పలకరించకూడా లేరే. మీతో పాటు కోర్టుకెళ్ళటానికి నాకు అంత తీరిక లేదు. ఇవ్వాళ ఏమి చెయ్యమంటారో చెప్పండి?" అన్నది.

"నాకు తెలియదు. నీయిష్టం"

"సరే" అని సావిత్రి ఇంకేం ప్రశ్న వెయ్యకుండా వెళ్ళిపోయింది.

రెండుగంటలయిన తర్వాత మళ్ళీ వచ్చి "ఏమిటి విశేషాలు చెప్పండి. ఇవ్వాళకూడా 'పద మేకం నగచ్ఛామి' చెయ్యాలని వుందా?" అన్నది.

సతీశుడు మాట్లాడలేదు.

"తొమ్మిది గంటలైనసంగతి ఏమైనా అంటున్నదా?" అన్నది మళ్ళీ సావిత్రి.

ప్రొద్దెక్కిందన్న మాటకు సతీశుడు ఆతురత చూపించకుండానే స్వాభావికంగా "కానీ — నాకు ఇప్పుడు బాగుండటంలేదు" అన్నాడు.

సావిత్రి శుష్కస్వరంతో "బాగుండనిదిఏమిటి?—బడికి వెళ్ళటమా?" అన్నది.

సతీశుడు లోలోన విసుక్కుంటూ ఏమీ సమాధానమివ్వలేదు. అతని మొహంచూచి సావిత్రి గ్రహించింది. కొంచెంసేపు మెదలకుండా వుండి— స్వరాన్ని కొంచెం నెమ్మదిచేసి "సరే, బడికివెళ్ళటం బాగుండటంలేదు. కాని ఇప్పుడుఆడవాళ్ళపయటలు పట్టుకులాగటం బాగుంటున్నదా? వెళ్ళండిసన్యాలుకి, అనవసరంగా ఇంట్లోకూర్చుని ఆగంచెయ్యక" అన్నది. ఆమె తిరస్కారంలో, అంతరంగిక ప్రేమ, శుభాకాంక్షతప్ప మరేంలేకపోయినా, మాట్లాడే విలక్షణ విధానం సతీశుని హృదయాన్నంతటినీ జ్వాలలెత్తించింది. క్రోధంతో అతని కళ్ళెర్రబడ్డాయి. "ఇష్టమొచ్చినట్టు మాట్లాడతావు. అనుసుయిస్తే కుక్కలే గాదు నెత్తిమీద ఎక్కేది, మనిషికికూడా అంతే" అన్నాడు.

సావిత్రి క్షణంసేపు మెదలకుండావుండి మరింత కోమలస్వరంతో "అవును బాబూ! అంతటివిషయమే. లేకపోతే మీకుకూడా ఇంతఎందుకు చెప్పవలసివస్తుంది. ఇది పెద్దమనుష్యులు వుండేచోటు, గోపికలతో రాచక్రీడ

...డో బృందావనం కాదు?" అని ఆమె చివ్వున బైటికి వెళ్ళిపోయింది. అత్యం తాశ్చర్యంతో నరేశుడు స్తబ్ధుడైపోయాడు. సావిత్రి తన్ను ఈవిధంగా గాయ పరుస్తుందని అతనెన్నడూ అనుకోలేదు. కొంతసేపు అలాగే కూర్చుని చివ్వున లేచి, స్నానభోజనాదులనుండి నివృత్తుడై, బడికని వంకతో బైటికి వెళ్ళి పోయాడు. ఆరోజంతా అవమానంతో క్షోభపడుతున్న అతని వ్యధితహృదయం అతని ప్రవృత్తిని శాసించుతూ వున్నది. తను తలవనితలంపుగా, "...నాలో చిత్రం గా చేసిన ఘనకార్యంయొక్క వుద్దేశము వెతికిపట్టుకోను తపిస్తూ ఆ ఘట్ట మొక్కటే అతని కళ్ళలో ప్రతిబింబిస్తూవున్నది. అతను ఆమె పయిటచెంగు ఎందుకుపట్టుకున్నాడు? ఆమెతో చెప్పేదియేమిటి? సావిత్రి ఆవిధంగా పారి పోకుండావుంటే ఏమిచెప్పేవాడు? ఏమిచేసేవాడు? కటువైన ఈప్రశ్నలతో నిరంతరమూ అతని అంతర్యామి సావిత్రితోపాటుగా అతన్ని కఠినంగా బాధ పెటసాగింది. ఈవిధంగా అతను తన శస్త్రాలతోనే తను గాయపడి సాయం త్రానికి గంగానది వడ్డుకు చేరుకుని నిర్జీవిలా రాతిమీద కూర్చున్నాడు.

నిన్న హఠాత్తుగా సావిత్రి ఏకట హృదయ దౌర్బల్యం బైటపడిన తర్వాత అతను అధైర్యపడి సిగ్గుతో పారిపోయిన దానిలోకూడా కొంత మాధుర్యమున్నది. పరోక్షంలోవుంటే దానిని ఎవరో ఆస్వాదించారుకూడా. కాని ఆనాటి సావిత్రి వ్యంగ్యాగ్నితో ఆరసంయొక్క అంతిమ బిందువుకూడా శుష్కించిపోయింది. అభిమానం హఠాత్తుగా శుష్కించి అతనిహృదయంలో గడ్డకట్టుకుపోయింది. ఆరోజున అతని ఆత్మగౌరవం కేవలం తలలొగ్గింది, కాని యీనాడు దానిగొంతే తెగిపోయింది.

ఇంతకాలంనుండీ ఈ స్త్రీతో చేసిన పరిహాసాల ప్రతిఫలం ఏదుగా పరిణ మిస్తుందేమోనన్న దుఃఖం, అతని హృదయాన్ని అన్నిటికంటె ఎక్కువగా బాధించసాగింది. నిజంగా నిన్న హాస్యానికి అతని పరిహాసంలో వినోదంతప్ప మరోభావంలేదు. ఆరోజు మధ్యాహ్నం, ఒంటరిగా వున్నప్పుడు చేసిన దుష్కృత్యం తర్వాత ఇక ఆమాట నోటతీసుకురా తగకుండాపోయింది. ఇంతకు ముందు తనలో ఈతృష్ణ లేదన్నమాట సావిత్రి ఎన్నటికీ నమ్మదు. అతని మన సులో ఆవేదన వుంటుంది. కాని అతని మనసులో ఎలాంటి దుర్బుద్ధిలేదన్న సత్యాన్ని తెలియజేసే సావకాశం ఎప్పుడు కలుగుతుంది? సత్ప్రవర్తకుడు కాదన్నందువల్ల అతనికెక్కువ చింతలేదుగాని, మోసగాడన్న అపవాదును

అతికాలాన్ని సహించగలడా? సహజంగా తను దొంగైతే దొంగలాగ కన్నంవేసే పనిముట్లతో ఎందుకు పట్టుపడలేదు? అనుకున్నాడు మనసులో. అతడు జడలు, కమండలము ధరించిన కపటసన్యాసి త్రిశూలంతో కన్నంవేస్తూ పట్టుపడ్డాడని లోలోన నవ్వుకుంటుంది సావిత్రి. ఈ లేనిపోని అపవాదు జ్వాలలాగ అతన్ని వ్యధపెట్టసాగింది. ఈ ఆలోచనలతో ఎంతప్రొద్దు పోయిందో కూడా అతనికి తెలియకపోయింది. పోటుతగ్గి పోటునీరు కాళ్ళకిందకు ఎప్పుడువచ్చింది, కలకత్తా వీధుల్లోని గ్యాసులైట్లు ఎప్పుడు వెలిగిందీ, నెత్తిన ఆకాశం నల్లబడి నక్షత్రాలు ఎప్పుడు వచ్చిందీ ఏమీ అతనికి అంతులేదు. శీతాకాలపు గంగాపవనాలు అతనికి చలి కలిగించేప్పటికీ, అవతలివడ్డున గుడి గంటలు పన్నెండు కొట్టేప్పటికి సతీశుడు త్రుళ్ళిపడిలేచి నుంచుని ఇంటివైపుకు సాగాడు. కొంతసేపు, తను ఊహించుకున్న సంశయాలను మర్చిపోయాడు. కాని ఇల్లు దాపుకు వస్తున్నకొద్దీ అతనిమనసు చిన్నదైపోసాగింది. సందు చివరకు వచ్చేప్పటికి అడుగుపైన అడుగు వెయ్యలేక పోయాడు. మెల్లగా ఏదోవిధంగా మెస్సవాకిటి దగ్గరకు చేరుకుని మెదలకుండా నుంచున్నాడు. లోపల నిశ్శబ్దంగావుంది. ఎవరూ మేలుకొని వున్నట్టులేదు. ఇంతప్రొద్దుపోయేవరకు సావిత్రి ఇంటికి వెళ్ళకుండా వుండదన్నసంగతి తెలిసివున్నా, తలుపుకొట్టటానికి గాని పిలవటానికిగానీ, అతనికి ధైర్యం లేకపోయింది. మళ్ళా ఆమెవచ్చి తలుపుతీస్తుందేమోనని గుండె దడదడ లాడసాగింది. సరిగ్గా ఆసమయానికే ఎవరో తలుపుతీశారు. క్షణంసేపటివరకు సతీశుడు మాట్లాడలేక పోయాడు—"ఎవరు—బిహారీ?" అన్నాడు మళ్ళా.

"అవును బాబుగారూ!"

"అంతా భోంచేశారా?"

"అందరూ భోంచేశారు?"

"సావిత్రి వెళ్ళిపోయిందా?"

"అవునుబాబూ! నన్ను కూర్చోమనిచెప్పి ఇప్పుడే వెళ్ళింది."

ఈమాటవిని సతీశునికి ప్రాణాలు లేచివచ్చినట్లయింది. నవ్వుమొహంతో తలుపువెయ్యమనిచెప్పి పైకి వెళ్ళిపోయాడు. బిహారీ తలుపువేసివచ్చి, "మీ భోజనం బాబుగారు..." అన్నాడు.

"నేను భోంచేసివచ్చాను"

"మంచినీళ్ళు టేబులుమీద పెట్టాను" అన్నాడు బిహారి.

"సరే, నువ్వువెళ్ళి పండుకో" బిహారి వెళ్ళిపోయాడు. సతీశుడు పక్కమీద పండుకున్నాడు. వెంటనే నిద్రపట్టింది.

ఈఘటన జరిగిన తర్వాత సావిత్రి మనసుకూడా సంతోషంగా లేదు. సతీశునికి ఇంతకటువుగా సమాధానమివ్వటం బాగాలేదన్న పశ్చాత్తాపంతో ఆమె మధ్యాహ్నంవరకు వ్యథపడింది. సగలెప్పుడైనా ఒంటరిగా వున్నప్పుడు వెళ్ళి క్షమాపణకోరుకుందా మనుకుంది. ఆ ఆశతోనే ఎదురుచూస్తూ కూర్చున్నది. ఆమె ఆశ సందేహంగా పరిణమించింది. సతీశుడు విపినుని దగ్గరకుతప్ప మరో చోటికి వెళ్ళడని ఆమెకుతెలుసు ప్రొద్దుపోతూవుంది. కాని సతీశుడు అంతులేడు. విపినునిదగ్గరకు కాక అతను ఇంకెక్కడికైనా వెళ్ళగలడన్న భావం ఆమె మనసుకు కలగలేదు. సంశయం దృఢమై నమ్మకంగా పరిణమించేటప్పటికి క్రమంగా సావిత్రికి అతన్ని ఎదురుచూస్తూ కూర్చోటం కష్టమనిపించింది. అలాంటి మనిషిని క్షమాపణకోరుకోటానికి ఎదురుచూస్తూ కూర్చోటం యథార్థంగా ఆమెకు అసహ్యమనిపించింది! బిహారిని కూర్చోమనిచెప్పి చాల ప్రొద్దుపోయిన తర్వాత సావిత్రి ఇంటికివెళ్ళి పక్కమీద పండుకుంది. కాని కంటికి కునుకుపట్టలేదు. వళ్ళంతా ఏదో విధమైన ఆరాటంతో ఎప్పుడు తెల్లవారుతుందా అని కొట్టుకులాడుతూవుంది. గదిలో టైంపీసు గంటతర్వాత గంటకొడుతూవుంది. సావిత్రి తెల్లవార్లూ వాటిమోతవింటూ కూర్చుంది. మసకవుండగానే పక్కవదలి మొహం కడుక్కొని బైటకువచ్చింది. దారిలో మర్వాడీ స్త్రీలు భజనచేస్తూ గుంపులు గుంపులుగా గంగాస్నానానికి వెళ్ళుతున్నారు. వారివంక చూచి సావిత్రి 'వారు కుశలంగావుండేట్టుచెయ్యి గంగామతల్లీ!' అనుకున్నది మనసులో. వెంటనే ఆమె అధరాలు కంపించినై. వేడికన్నీటితో కళ్ళు రెండూ నిండినై. ఈ కల్పిత సందేహంతో మనసును ముంచుకొని మాటిమాటికి సతీశుని క్షేమాన్నాకాంక్షిస్తూ త్వరగా నడవసాగింది. "వారి ఇష్టమొచ్చినట్టు చేసుకున్నా, క్షేమంగా వుండుగాక!" అని మనసులో అనుకోసాగింది. మెస్సువాకిటిదగ్గరకువచ్చి పిల్చినతర్వాత బిహారి తలుపుతీస్తూనే "సతీశబాబు రాత్రి ఎక్కడో భోంచేసి చాల ప్రొద్దుపోయిన తర్వాత వచ్చాడు" అనిచెప్పాడు. ఈ కబురు అన్నిటికంటె ముందు చెప్పాలన్నమాట బిహారికి జ్ఞాపకమున్నది.

సావిత్రి పైకివెళుతూ హఠాత్తుగా ఆగి మొహం చిట్లించుకొని "అయితే భోజనం చెయ్యలేదన్నమాటేగా" అన్నది.

"వారిభోజనం మాత్రం పెట్టి అలాగేవుంది."

"ఊఁ" అని సావిత్రి పైకివెళ్లిపోయింది. భయంపోగానే ఆమె చింతాగ్రస్త హృదయం మళ్లా ఈర్ష్యతో మండిపోయింది. మర్నాడు కొంచెం ప్రొద్దెక్కిన తర్వాత సతీశునికి మెలకువరాగానే సావిత్రి జ్ఞాపకమొచ్చింది. సరిగ్గా ఆ క్షణానే సావిత్రికూడా అతని ఎదుటకువచ్చి నుంచున్నది. ఆమె మొహంమీద దుఃఖం, క్షోభ, వుదాసీన మేఘాలు కమ్మినట్లున్నది. సతీశుడు ఆమె మొహం వంక ఒక్కసారిమాత్రం చూచి తల వంచుకున్నాడు. కొంచెంసేపు వున్న తర్వాత "ఏం చెయ్యమంటారో అడగటానికి వచ్చాను" అన్నది సావిత్రి.

సతీశుడు ఆమెవంక చూడకుండానే "రోజూ ఏమిచేస్తున్నావో అదే చెయ్యి" అన్నాడు. "సరే" అని సావిత్రి వెళ్ళబోయి మళ్లా ఆగింది. "ఏం బాబూ! చదువు సంధ్యలు లాగానే ఇప్పుడు తిండితిప్పలుమీద కూడా ఇష్టం తప్పిందా?" అన్నది.

"నేను తినివచ్చాను" అన్నాడు సతీశుడు మెల్లగా. భయంతో అబద్ధం. అదేకాదుగాని 'ఎక్కడ' అన్న ప్రశ్న సావిత్రి వెయ్యలేదు. కొంచెంసేపు మాట్లాడకుండావుండి "రెండురోజులనుండి మీరు అలా పొంచి పొంచి తిరుగుతున్నారెందుకు? ఎవరి భయంతో? కొంచెం చెబుదురూ! నావల్ల మీకేమైనా కష్టం కలుగుతూవుంటే వెంటనే సెలవుయిప్పించండి" అన్నది.

సతీశుడు తలెత్తి "నువ్వు మాకేం చెరుపు చేశావని? అదీగాక నిన్ను పంపటానికీ పంపకపోవటానికి నాపెత్తనమేముంది? మెస్సు నా ఒక్కడిదా!" అన్నాడు.

"ఒక్కడిదే అయితే పంపివేసేవారేనా? సరే, అయితే నాఅంతట నేనే వెళ్ళిపోతానులే" అన్నది సావిత్రి. సతీశుడు మాట్లాడలేదు. అతను మెదలకుండా వుండటం చూచి, సావిత్రి లోలోపల మండిపడి "నేనువెళ్ళిపోయినతర్వాతయినా మీరు సంతోషంగా వుంటారా? మీ కాళ్ళమీద పడతాను సతీశబాబూ! అవునో కాదో ఏదో ఒకమాట చెప్పండి" అన్నది.

ఈసారికూడా సతీశుడు ఏమీ మాట్లాడలేదు. ఇక్కడ సావిత్రికొక విశేషస్థాన

"పాటకచేరీ అతను ఎక్కడో ఏర్పాటుచేసేది నాకుతెలుసు. అటువంటి చోటుకు వెళ్లటమే మహాపాపం" అన్నాడు సతీశుడు.

"అయితే అటువంటి చోటికి వెళ్లమాకండి"

"సరే వెళ్ళను. కాని అతను మాటలతో వదిలిపెట్టేటట్టులేదు. అందుకని నీకు ముందుగా చెబుతున్నాను, ఎవరైనావస్తే—నేను ఇంటివద్దలేను, రాత్రికికూడా రానని చెప్పు తెలిసిందా?" అన్నాడు సతీశుడు వుత్తేజంతో.

"తెలిసింది" అన్నది సావిత్రి.

సతీశుడు ఒక అపసరికి గవాక్షాన్ని విస్తరించి నిశ్చింతగా నిట్టూర్పు విడిచి క్షణంసేపు మెదలకుండా వూరుకున్నాడు. తర్వాత "చలిగాలివస్తూంది. కొంచెం కిటికీ తలుపులు వేసిరా సావిత్రీ" అన్నాడు. సావిత్రి గదిలోకివచ్చి కిటికీ తలుపులు వేస్తూవుంది. సతీశుడు ధ్యానంతో ఆ మొవంక చూచాడు. చూస్తూ చూస్తూనే కృతజ్ఞతతో అతనిహృదయం నిండిపోయింది.

"అయితే సావిత్రీ! నిన్ను హీనజాతి స్త్రీవనుకుంటావు ఎందుకు?" అన్నాడు ఆప్యాయంగా.

సావిత్రి తిరిగి నుంచుని "వున్నమాట ఎందుకుఅనుకోగూడదు?" అన్నది.

"ఆదెప్పుడూ నిజం కాదు. నువ్వు—గంగానది సమక్షాన చెప్పినా నే నమ్మను" అన్నాడు సతీశుడు.

సావిత్రి చిరునవ్వునవ్వి "ఎందుకు నమ్మరు?" అన్నది.

"అదినాకు తెలియదు. నిజంకానందువల్లనేమో! నీస్వభావం హీనజాతులలాంటిది కాదు. మాటతీరు, ముఖరేఖలుకూడా కావు. అయితే, నువ్వుఇంత స్నానసంధ్యలు ఎక్కడనేర్చుకున్నావు?"

సావిత్రి మూగంగాకూర్చుని నవ్వుతూ "ఎంత? కొంచెం చెబుతురూ?" అన్నది.

సతీశుడు దానిని వ్యాఖ్యానం చెయ్యడానికి తయారై తెరచినపుస్తకం ఒక పక్కను పెట్టాడు. కాని ఎందుచేతో మళ్ళీఆగిపోయి చెవులు నిక్కపొడుచుకొని ఏదోవింటున్నాడు. దగ్గరలో అడుగులచప్పుడు వినిపించింది. క్షణంసేపటికి అతని గదికి దగ్గరగా తాగుబోతు కంఠంతో గంభీరంగా 'సతీస్ బాబా' అన్న పిలుపువచ్చింది.

తిన్న తీసుకువెళ్ళటానికి పిసినారి దగ్గరనుండి బంటులువచ్చారని తెలుసుకున్నాడు సతీశుడు, వెనకా ముందూ ఏమీఆలోచించకుండా చప్పున దీపం ఆర్పేసి నిండా ముసుగుపెట్టుకొని పండుకున్నాడు. కొంచెందూరంగా కూర్చుని వున్న సావిత్రి వ్యాకులపడి "అదేం, మీరు ఈ చేసేదేమిటి?" అన్నది.

మరుక్షణం రెండు ఆకారాలు వాకిట్లోకివచ్చి నిలబడ్డాయి. "ఇదేసతీశ్ బాబుగది" అన్నాడొకడు.

"బాబుగారు గదిలోనే వున్నారని చెప్పాడుగా నౌకరు" అన్నాడు రెండవ వ్యక్తి.

మొదటివ్యక్తి విసుక్కొని "అయితేగదిచీకటిగా వుందే? పెద్దమనుష్యులైనా ఈసాయంకాలం చీకటిలో గదిలో కూర్చునివుంటారా? నువ్వుకూడా..." అన్నాడు.

రెండవవ్యక్తి సమాధానంగా అతని చెవిలో ఏదోచెప్పి, జేబులో నిప్పుల పెట్టె తమిడితీసుకుని—గీస్తున్నాడు.

మంచంమీద సతీశుని శరీరమంతా గజగజకొట్టుకుపోయింది. పక్కంతా ముంజేమట్టు పట్టినై, సావిత్రి సిగ్గుతో—శిలలా అయిపోయింది,

నిప్పులపుల్ల వెలిగింది "అరే, ఈ కూర్చున్న దెవరు?"

మొదటివ్యక్తి గదిలోకివచ్చి మరోనిప్పులపుల్ల గీస్తున్నాడు. సావిత్రి లేచి నుంచున్నది.

రెండవవ్యక్తి హాసంతో "సతీశబాబు ఎక్కడవున్నాడు?"

సావిత్రి మెదలకుండా మంచంకేసి చూపించి, బైటికి వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిపోగానే ఇద్దరూ విరగపడి నవ్వసాగారు. ఆ నవ్వుధ్వని లోనిఅంతరార్థం, సావిత్రి చెవులబడి బాధించసాగింది. ముసుగులోపల సతీశుడు మృత్యువును ఆహ్వానించసాగాడు.

వారు ముసుగుతీసి దూరంగాపారేసి సతీశబాబునుపట్టి బలవంతంగా తీసికెళ్ళారు.

వారి వికటహాస్య ధ్వని ఇంటిబైటకుపోయి వాయుమండలంలో లీనమయేంతవరకు—నెత్తిన పిడుగుపడినట్టు తల గోడ కానించి చీకట్లో ఒకమూల నుంచున్నది సావిత్రి.

కాని ఈ సంగతి హిందువుల్లో ఎవరికీ తెలియదు. వంటమనిషి అప్పుడే గంజాయి దమ్ము ముగించి—అదిముక్తిదాయకమని వేదాలు ఎలా ఘోషించిందీ బిహారీకి చెబుతున్నాడు. రాఘవబాబు గదిలో నిమ్మళంగా చదరంగం దగ్గిర కూర్చుని దంతపుపావులు మానవుల మాట ఆలకిస్తాయా లేదా అని పరీక్షిస్తున్నాడు.

రోడ్డుమీదకువచ్చి ముగ్గురూ ఒకబండిలో కూర్చున్నారు. వాళ్ళ నవ్వూ—ఆసహ్యమనిపించి సతీశుడు "మీరు మెదలకుండా కూర్చుంటే కూర్చోండి, లేకపోతే నేను దిగివెళ్ళిపోతాను" అన్నాడు తీవ్రస్వరంతో.

అతని మాటవిని ఒకడు "సరే" అని వికటస్వరంతో పక పక నవ్వాడు. రెండవవాడు మొదటివానితో "హారుష్యోరా!" అని అతనుకూడా విరగబడి నవ్వాడు. ఈతాగుబోతులకు చెప్పటం వ్యర్థమనుకుని సతీశుడు పెదవులుమీద క్రోధంతో కిటికీలోంచి మొహం బైటికిపెట్టి బాటవంక చూస్తూ కూర్చున్నాడు.

వీధికేసి వరండాలో సావిత్రి మెదలకుండా కూర్చుని వుంది. సాయంత్రం తలవని తలంపుగా ఆసిగ్గుమాలిన పనికి ఆమెమనసు ఇంకా బాధపడుతూనేవుంది. బిహారివచ్చి నుంచుని "అంతా భోజనాలు చేశారు. వంటమనిషి నిన్నుపిలుస్తున్నాడు" అన్నాడు.

సావిత్రి తలయెత్తి ఖిన్నవదనముతో "నేనుఇవాళ్ళ భోజనం చెయ్యను బిహారీ" అన్నది. బిహారిసావిత్రిని వాత్సల్యంగాచూస్తూ వుంటాడు. విచారపడి "ఎందుకుతినవు? వంట్లో బాగాలేదా?" అన్నాడు.

"వంట్లో బాగానేవుంది కాని తినబుద్ధికావటంలేదు. వెళ్ళిమీరు భోజనం చెయ్యండి."

"అయితేపద నిన్ను పంపించివస్తాను" అన్నాడు బిహారి.

"సరే, పద. కాని బిహారీ ఒకమాట—సతీశ్‌బాబు వచ్చేవరకు నువ్వు మేలుకొని వుండగలవా?" అన్నది సావిత్రి.

బిహారి కొంచెంవులికిపడి "నేనా? ఇవాళకూడా నాయనా, పూరికే నవులుతూవుంది" అన్నాడు.

"అయితే ఏంచెయ్యమంటావు బిహారి?"

బిహారి కొంచెం ఆలోచించి "ఇవాళ వంటమనిషిని పిలిచిచెబితే..." అన్నాడు.

"వద్దులే. పాపం ముసలివాణ్ణి చలిలో బాధపెట్టట మెందుకు" అన్నది సావిత్రి.

కొంచెం సేపుగుంజాటనపడి "పోనీ నేనే వుంటానులే పద నిన్ను పంపించి వస్తాను" అన్నాడు బిహారీ ఇష్టంలేకపోయినా.

సావిత్రి లేచి ఒకటిరెండు అడుగులు వేసి ఆగి "బిహారీ పోనీ నువ్వు వెళ్ళి భోంచెయ్యి, తర్వాత వెళతాలే" అన్నది.

బిహారీ వెళ్ళిపోయిన తర్వాత – సావిత్రి తిరిగివచ్చి మళ్ళా అక్కడే కూర్చుని మెదలకుండా అంధకారంలో ఆకాశం కేసి చూడసాగింది. ఇవ్వాళ సతీశుని విషయంలో ఆమెకు చాలా సందేహం కలిగింది. అతను తాగుబోతుల చేతులో పడటం కళ్ళారచూచింది. అందుకని ఆమెకు ఇంటికివెళ్ళటానికి మనసొప్పలేదు.

సతీశుని దుష్టచేష్టలవల్ల ఇంత అవమానము, అపవాదుకలతో అభాసుపాలై, మనసులో ఇవ్వాళ వుదయానే ఈ నౌకరీ తప్పకుండా వదిలిపెడదామనుకున్న సావిత్రి, మళ్ళా అతను దుర్గతిపాలౌతాడేమోనని పశ్చాత్తాపపడసాగింది: సతీశుడు చేసినపనులన్నీ జ్ఞాపకమున్నా భవిష్యత్తులో అతనికివచ్చే విపత్తులకు ఎదారీ చూపించకుండా ఆమె ఇంటికి వెళ్ళటానికి సంసిద్ధపడలేకపోయింది. బిహారీ భోంచేసి వచ్చినతర్వాత "బిహారీ నువ్వు వెళ్ళిపడుకో, నేను ఇక్కడే వుంటానులే అన్నది.

బిహారీ ఆశ్చర్యంతో "ఇంటికివెళ్ళవా?" అన్నాడు.

"బాబుగారిని తిరిగి రానీ' నువ్వు నన్ను ఇంటికి పంపించిరాగలవా?"

"ఎందుకు పంపించలేను, తప్పకుండా పంపిస్తాను."

'అయితే, నేను కూర్చునివుంటాను. నువ్వు వెళ్ళిపడుకో."

బిహారీ సంతోషంతో వెళ్ళిపోయాడు, సావిత్రి ఒకదుప్పటి కప్పుకు కూర్చుంది. ఆ తాగుబోతులు ఈ చూచిపోయినసంగతి నలుగురికీ ముందూ వాగుతూ తిరుగుతారు, లోకులు ఈ దృశ్యాన్ని మరో భావంతో చూస్తారనటంలో అనుమానంలేదు. విపినుని సంగతి ఆమెకు తెలును. ఈసంగతి తప్పకుండా అతని

చెవిని పడుతుంది. అతను ఇక్కడికి వస్తూపోతూ వుండటంలో ఇక్కడవాళ్ళకు కూడా తెలియకుండా వుండదు. తర్వాత ఏముఖం పెట్టుకుని సతీశుడు ఇక్కడ ఒక్కక్షణం వుండగలుగుతాడు! ఈ అపవాదును అతను ఎలాసహిస్తాడు? దురదృష్టవశాత్తు జరిగిందేదో జరిగిపోయింది. తనవిషయంలో ఆమె ఇంతవరకేఆలోచించి ఆగిపోయింది. కాని సతీశుని విషయంలో ఆలోచించటానికి ఆమెమనసు ఏమీ పనిచెయ్యలేదు.

ఎంత ప్రొద్దుపోయినా సతీశుడు అంతులేదు. పొరుగింటి గడియారం టంగ్_టంగ్ మనిరెండు కొట్టింది. మిద్దెమీదనుండివస్తున్న చలిగాలి విసురుతో పాటు నిద్రపడదోసుకువస్తూంది. కళ్ళు మూతలుపడుతున్నాయి. అయినా ఆమె వాకిటిదగ్గర కూర్పాట్లుపడుతూ కూర్చున్నది......ఇంతలో ఏదోబండిచప్పుడు విని త్రుళ్ళిపడిలేచింది. బండి వాకిటిదగ్గరే ఆగినట్టువున్నది, సావిత్రిమెదలకుండా కిందకు దిగివెళ్ళి జాగ్రత్తగా వాకిటిదగ్గరనుంచున్నది. ఇంకెవరైనా నేమోనన్న భయంతో వెంటనే తలుపుతియ్యటానికి ధైర్యంలేకపోయింది. ఎంతసేపున్నా ఎవరోతలుపుతట్టలేదు. వచ్చిన బండికూడా తిరిగివెళ్ళిపోయింది. సావిత్రికొంచెం అనుమానంతో వెంటనే తలుపుతీసింది. సతీశుడు వాకిటి నానుకుని కూర్చోటమేమిటి__పడివున్నాడు! మొహంనల్లబడివున్నది. కళ్ళుమూసుకుపోయినాయి. అతనిగుడ్డలబురద, నొసటన రక్తంచారికలు గ్యాసులైటవెలుగున కనపడగానే సావిత్రి బావురుమన్నది. వెంటనే దగ్గరకువెళ్ళి రెండుచేతులతో సతీశునిమొహం పైకెత్తి "పైకివెళ్దాంపద బాబూ!"అన్నది.

సతీశుడు తలకాయతిప్పుతూ "రాను. మాంచిమజాలో వున్నాను" అన్నాడు.

సావిత్రి కళ్ళుతుడుచుకుని "ఎక్కడైనా దెబ్బతగిలిందా?"అన్నది.

"లేదు మజాలోవున్నాను. నన్నువదిలిపెట్టు"

"ఇదిదారి, ఇంట్లోకిపద"

సతీశుడు మళ్ళీతలకాయతిప్పి "రాను! మజాలోవున్నాను"అన్నాడు.

సావిత్రి కొంచెంకఠినస్వరంతో "వినబడటంలేదా? లేచిఇంట్లోకిపదరా" అన్నది. ఈ అదలింపుతో సతీశుడు__ఎర్రటికళ్ళతో కొంచెంసేపు సావిత్రి మొహంకేసి చూచి చేతులుజాపి "పద"అన్నాడు. ఆమె భుజాన్నాధారం చేసి సతీశుడు చాలకష్టంతో లేచినుంచుని. చీకట్లో తూలుతూ__పైగదిలోకి

వెక్కిపడుతున్నాడు. "నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను సావిత్రీ!" అన్నాడు తడబడుతున్న స్వరంతో.

"సరే, ఇక నిద్రపొండి" అన్నది సావిత్రి.

సతీశుడు వెంటనే లేచికూర్చుని "ఏమిటి? నిద్రపోనా? ఎప్పటికీ పోను" అన్నాడు.

సావిత్రి మళ్ళీ బెదిరించుతూ "మళ్ళీ ఆదేమాట!" అన్నది.

సతీశుడు పండుకొన్నాడు. కొంచెంసేపు మెదలకుండావూరుకొని "కాని నీ ఋణం..." అన్నాడు.

"సరే" అని సావిత్రి లేచివెళ్ళి లాంతరుదగ్గరకు తీసుకువచ్చి గాయాన్ని చూచి "ఎక్కడపడ్డారు?" అన్నది.

సతీశుడు తల కాయతిప్పి "పడలేదు" అన్నాడు.

సావిత్రి రుద్ధకంఠంతో "ఇంకెప్పుడైనా తాగినట్టువుంటే మీపాదాల ముందు తలబద్దలగొట్టుకు చస్తాను" అన్నది.

"ఇంకెప్పుడూ తాగను" అన్నాడు సతీశుడు.

"నాచేతిలో చెయ్యేసి ఒట్టు వేసుకోండి" అని సావిత్రి తనకుడిచెయ్యి చాపింది.

సతీశుడు తనరెండుచేతులతో ఆమె కుడిచేతినిపట్టుకొని "ఇదిగో ఒట్టు వేసుకుంటున్నాను. ఇంకెప్పుడూ తాగను అన్నాడు.

సావిత్రి చెయ్యితీసుకొని "జ్ఞాపకముంటుందా?" అన్నది.

"లేకపోతే నీవు జ్ఞాపకంచేద్దువుగానిలే"

"సరే, ఇక నేను వెళుతున్నాను. మీరునిద్రపొండి" అని సావిత్రి మెల్లగా తలుపువేసి బైటకువచ్చి నుంచున్నది. ఎదురుగా ఆకాశంలో ధ్రువనక్షత్రం మినుకు మినుకుమంటూవుంది. దానికేసి సావిత్రి రెండుచేతులు జోడించి "నువ్వు సాక్ష్యముండు దైవమా!" అన్నది ఏడుస్తూ.

చీకటి పల్చబడిపోతూవుంది. దారిలో ఎడ్లబళ్ళ చప్పుడు, పల్లెమిల్లు కూతలు వినిపిస్తున్నాయి. సావిత్రి వెంటనే కిందకుదిగివెళ్ళి ఇంటింట్లో ఒక మూల ముప్పటికప్పుకుని పడుకున్నది. వెంటనే__ఆమె నిద్రాకులితనేత్రాలు మూతలు పడ్డాయి.

౪

పదిగంటలైంది. దివాకరుడు స్నానసంధ్యావందనములు ముగించుకొని వంటింటి వాకిట్లో నుంచుని "త్వరగా అన్నం వడ్డించవమ్మా, ఇప్పటికే చాలా ఆలస్య మైంది" అన్నాడు.

ఎదురుగా సామానుగది వున్నది. అతని మాటవిని అతని పెత్తల్లి కూతురు మహేశ్వరి ఇవతలకువచ్చి "నేను నీకోసమే ఎదురుచూస్తున్నాను దివం! ఒకసారి పైకివెళ్ళి దేవుడిపూజచేసిరా బాబూ! అంతా సిద్ధంచేసివచ్చాను, ఆలస్య మేమీకాలేదులే, పో" అన్నది.

మహేశ్వరి ఆ ఇంటికి పెద్దాడపడుచు, పినతల్లి కూతురు. వైధవ్యం ప్రాప్తించి నాలుగేళ్ళయింది. అప్పటినుంచే తల్లిదండ్రి ఇంటివద్దే వుంటూవుంది. దివాకరుడు సంకోచించిపోయి క్షణంసేపు మౌనంగావుండి "కాదులే అక్కా! పూజ దగ్గర కూర్చుంటే ఇవ్వాళకూడా కాలేజీ ఫస్టు పీరియడు చెడిపోతుంది" అన్నాడు.

మహేశ్వరినవ్వి— "అగో, నీ ఫస్టు పిరియడు చెడిపోతుందని, పూజ చెయ్యకుండా వుండమంటావా?" అన్నది.

"పూజారి ఎక్కడకు వెళ్ళాడు? ఇవ్వాళ ఆయనికి ఏమొచ్చిందీ?" అన్నాడు దివాకరుడు.

"ఆయన బాబుగారితో చదరంగం ఆడుతున్నాడు. ఎప్పటికి లేస్తారో ఏమో?" అన్నది మహేశ్వరి.

"అయితే రెండో అన్నతో చెప్పు అక్కా? ఇవ్వాళ వాడికిఆఫీసుకూడా లేదు."

"నిన్నటినుంచి ధీరేంద్రుని వంట్లో బాగాలేదు ఇవ్వాళ అతను స్నానం చెయ్యకూడదు, పూజ ఎలా చేస్తాడు?"

"అయితే చిన్న అన్నతో చెప్పు, ఆయన ఆఫీసుకు పన్నెండుగంటలకు గాని వెళ్ళడు, ఇంకా చాలా టైముంది."

మహేశ్వరి విసుక్కుని "నీవెంతచెప్పినా నాకు అర్థం కావటంలేదు దివం. ఉపేంద్రుడు రాత్రినాటకంచూసివచ్చాడు, ఇంకా నిద్రనుండి లేవనేలేదు, ఇంత ప్రొద్దెక్కినా మొహంకడగలేదు. కాఫీతాగలేదు. రాత్రంతా మేలుకొనివున్నాడే

అతనివంట్లో ఏమి బాగుంటుంది. వాడెప్పుడైనా పూజచేశాడా ఇవ్వాళ చెయ్యటానికి? అన్నది.

ఒకవైపున వంటమనిషి పళ్ళెంలో అన్నంవడ్డించి కేకపెడుతున్నాడు "రోజూ ఏదో ఒక అడ్డంకుతో నా ఫస్టు పీరియడు చెడిపోతూనేవుంది. ఇంకా పరీక్షకు వెళ్ళేదెలా?" అన్నాడు దివాకరుడు,

మహేశ్వరికి క్రోధం పెరిగిపోతూంది "పరీక్షయినా మానుదుగాని దేవుడికి పూజమాత్రం మానటానికి వీలులేదు. నీతో వితండవాదానికి నాకు తీరిక లేదు, ఇంకా చాలాపనులున్నాయి" అన్నది.

వంటమనిషి మళ్ళాపిలిచి "వచ్చికూర్చోండి దివంబాబూ! అన్నం వడ్డించాను" అన్నాడు.

మహేశ్వరి వంటవాణ్ణి కసురుకుని "నీకేంబుద్ధిలేదనుకుంటా! నేను ఒకపక్కన పూజచెయ్యటానికి పంపుతున్నాను. నువ్వేమో భోజనానికిరమ్మని కేక పెడుతున్నావు. పళ్ళెం తీసుకెళ్ళు, పూజచేసి వచ్చినతర్వాత పెడుదువుగాని" అనిఆమెసామాను గదిలోకివెళ్ళింది. దివాకరుడు కొంచెం తబ్బిబ్బుతో నుంచుని తర్వాత మెల్లగా పైకివెళ్ళాడు. అక్కడ పూజాసామాగ్రంతా సిద్ధంచేసివుంది. ఇంట్లో చలువరాతి ప్రతిమ ప్రతిష్ఠించియున్నది. దానికోసం ఒక పూజారిని ఏర్పాటు చేశారు. అతను వుండేదికూడా ఈ ఇంట్లోనే. శివప్రసాదుబాబులాగానె అతనికికూడా చదరంగమంటే అతిమక్కువ. శివప్రసాదుబాబు ఉద్యోగంలోంచి పింఛను పుచ్చుకుని, కొంతకాలంనుండి బీహారులో ఇంటిదగ్గరే వుంటున్నాడు. ప్రొద్దున్నే కాఫీతాగగానే పూజారికి పిలుపువస్తుంది. "భానూ పూజారినికొంచెం పిలువు, ఒక్క ఆటైనాసాగుతుంది" అంటాడు. తర్వాత ఒకటిరెండుఆటలతో కాలం గడిచిపోతుంది—పూజారికి పూజచెయ్యటానికి తీరికవుండదు. అందుకని మహేశ్వరిముందుగా జ్ఞాపకంచెయ్యటానికి మనిషిని పంపేది. కాని అతను "అయిపోవచ్చింది, వస్తున్నాను—ఈ ఒక్కఆటే" ఇలాఅంటూ కాలం గడిపేవాడు. దీనివల్ల పూజవేళ మించిపోతూవుందని ఎవరికీ అంతుపట్టేదికాదు. ప్రస్తుతం తండ్రివంట్లో బాగుండటంలేదనీ, ఇలా ఆటలోపడిపోతేనైనా అతని మనసు కొంచెంతేలిగ్గా వుంటుందనీ మహేశ్వరి పూజారిని పిలిచేదికాదు. నిత్యం దివాకరునిచేతే పూజచేయించేది.

దివాకరునికి పొద్దున్నే కాఫీ తాగేఅలవాటుగానీ, అవకాశంగానీ వుండేది కాదు. నిద్రలేవగానే నౌకరుతోపాటు అతనుబజారుకువెళ్ళాలి. ఇవ్వాళ బజారునుండి తిరిగివచ్చి నిత్యకృత్యాలు తీర్చుకుని భోజనానికి పోబోతున్నాడు.

దివాకరుడు పూజచెయ్యటానికివెళ్ళి ఆసనంమీదకూర్చుని'పరాయి ఇంటి వద్దవుంచేసుకు' మిడే అనుకోసాగాడు. అతనికివూహ వచ్చినదగ్గరనుంచీ ఈ పరాయి ఇంట్లోనేవుంటూ, కష్టాలుసహించటం అలవాటైపోయినా, ఎన్ని దుఃఖాలకైనా నాశంకానిమనుష్యునిలోని వస్తువేదో భవిష్యత్ ఔన్నత్యానికి ఆశ రేకెత్తించి, ఇవ్వాళ అతనిహృదయంలోంచి బైటికివచ్చి తలెత్తి నిలబడింది. క్రోధంతో అతనివళ్ళు మండుకుపోతూంది. అతనువిగ్రహాన్ని పీఠంనుంచి,తపుక్కున ఇత్తడిపళ్లెంలో పెట్టాడు. మంత్రంలేకుండానే నీళ్లుపోసి, తడిమూర్తినే మళ్ళా పీఠంమీద వుంచాడు. పుష్పాలు,అర్ఘ్యంఅర్పించటం, గంటవాయించటం మొదలైన పనులు అలవాటుచొప్పున అతనిచెయ్యి చేసుకుపోయింది. కాని విద్వేషాగ్నిలోపడి అతనిజిహ్వ ఒక్కమంత్రంకూడా ఉచ్చరించలేకపోయింది.

ఈవిధంగా పూజానాటకం ముగించి లేచినతర్వాత ఇవ్వాళపూజ సరిగా జరగలేదు, మళ్ళా కూర్చోనా అనితటపటాయింపు పడ్డాడు. కాని ఫస్టు పిరియడు అయిపోతుందేమోనని వెంటనేజ్ఞాపక మొచ్చింది—ఎటూచూడకుండానే కిందకు దిగివచ్చి—తిన్నగా బైటికి వెళుతున్నాడు. మహేశ్వరిసామాను గది లోంచి చూచి భోంచేశావటరా?" అన్నది.

"లేదు, ఇకటైం లేదు."

"అయితే కాలేజీనుంచి పెందలాడేరా." వంటమనిషినిపిలిచి "దివాకరుని భోజనం జాగ్రత్తగా మూతవేసివుంచు"అన్నది మహేశ్వరి.

దివాకరుడు సమాధానమియ్యకుండానే వెళ్ళిపోయాడు. బైటగదిలోకి వచ్చి—బట్టలు కట్టుకుంటూవుండగా అతనికళ్ళల్లో నీళ్లుతిరిగినాయి.

ఎదురుగా కచేరీలో ఇంకా చదరంగంఆట సాగుతూనేవుంది. హఠాత్తుగా తలుపుతట్టిన చప్పుడు విని దివాకరుడు వెనక్కితిరిగి చూచాడు—దాసీది నుంచునివుంది. అతను వెంటనేచొక్కాచెంగుతో కన్నీళ్లుతుడుచుకుని"ఏమిటి?" అన్నాడు."చిన్నఅమ్మగారు పిలుస్తున్నారు" అన్నదిదాసీది.

"వస్తున్నాను, నువ్వుపద"

దానిని వెళ్ళిపోయినతర్వాత దివాకరుడు టైంపీసు వంకచూచాడు. కొంచెంసేపు తచ్చట్లాడి పుస్తకాలు టేబులమీదపెట్టి, చొక్కాతో మళ్ళా ఒకసారి కళ్లుబాగా తుడుచుకుని లోపలికివెళ్ళాడు.

దివాకరుని పిలువనంపి సురబాల తనగది ముందునుంచుని ఎదురుచూస్తూ వుంది. దివాకరుడు వచ్చి "ఏమిటి వదినా?"అన్నాడు,

సురబాల పయటసరుకుని"లోపలికిరా"అని చేతితో చూపించింది—పీట వేసివుంది. ఒకపళ్ళెంలో నాలుగైదు రసగుల్లాలు,ఒకగిన్నెలో పాలువున్నాయి. "ఇవితిని కాలేజీకివెళ్ళు"అన్నది.

దివాకరుడు మెదలకుండా కూర్చున్నాడు.

దగ్గరగా మంచంమీద పుష్పేంద్రనాథుడు ఇంకా నిద్రిస్త్యతో పడుకుని వున్నాడు. దివాకరుడు తినివెళ్ళగానే [illegible]భార్యనుపిలిచి "ఏమిటిచేస్తున్నావు? అన్నాడు.

సురబాల ఎంగిలిపళ్ళెం తీస్తువుంది. తృళ్ళిపడి "మీరుమేలుకునే వున్నారా?" అన్నది.

"రెండుగంటలనుండి మేలుకునేవున్నాను. పదకొండింటిదాకా నిద్రపోతారా ఏమిటి?

సురబాలనవ్వి "మీరునిద్రపోతారు? లేకపోతే ఎవరైనా ఇంతసేపటి నుండి మెలుకువతో పడుకొని వుండగలరా ఏమిటి?"అన్నది.

"అందరూ వుండలేరు, కాని నేనువుండగలను. దానికి కారణంవుంది. ప్రపంచంలో నిద్రతో సమానమైన సుఖమైన వస్తువుమరొకటిలేదు. దివాకరుడు .........."అన్నాడు ఉపేంద్రుడు.

"అతను భోంచెయ్యకుండా కాలేజీకి వెళుతున్నాడు. అందుకని పిలిచాను"

"కారణం?"

"పాపం హృదయం చదవటానికి వీలుండదు—బజారుకు వెళ్ళినా, [illegible] పూజ చెయ్యటంతో సరిపోతుంది. ఒక్కొక్క రోజైన పది కొట్టదు, పన్నెండుగంటలౌతుంది. ఇంకా అతనుబడికివెళ్లేదిఎప్పుడు చదివేదిఎప్పుడు చెప్పండి?"అన్నది సురబాల.

"విషయమేమిటో సరిగా బోధపడలేదు. పూజారిలేవటంలేదా ఏమిటి?"

"లేవకేం! మామగారితో చదరంగం ఆడుతూవుంటాడు. అతనికేప్పే ముంది? బాబుగారు పిలిస్తేవెళ్తాడు?" అన్నది సురబాల.

"అయితే మొదట నౌకరువెంట కొన్నాళ్ళు బజారుకువెళ్ళేవాడుగా!" అన్నాడు వుపేంద్రుడు.

"వెళ్ళేవాడే, ఇప్పుడు వెళ్ళటంలేదు" అన్నది సురబాల. "సరే" అని ఉపేంద్రుడు మళ్ళీపక్కమీదికి వత్తిగిలాడు. సురబాలకొంచెం భయంతో "మళ్ళీపడుకుంటారా ఏమిటి?" అన్నది.

ఉపేంద్రుడు ఐదునిమిషాలపాటు మెదలకుండా పడుకొనివుండి— తర్వాతలేచి బైటికి వెళ్ళిపోయాడు.

ఇవ్వాళ పూజసరిగా జరగలేదు, అనుకుంటూ ఉదాసీనహృదయంతో కాలేజికి వెళుతున్నాడు దివాకరుడు. ఇంట్లోజరిగిన ఘటనకంటేఇవ్వాళ దేవునికి సరిగా పూజచెయ్యలేదన్న చింతే అతన్ని ఎక్కువగా బాధించసాగింది. ఎన్ని రోజులు ఎన్ని ప్రతిబంధకాలువచ్చినా, ఈభగవత్పూజను అతడెన్నడూ నిరాదరణచెయ్యలేదు.

ఈ పవిత్రకార్యాన్నుండి అతడెప్పుడూ తప్పుకుపోలేదు. పోవటానికెప్పుడూ ప్రయత్నించలేదుకూడా. ఎప్పుడూఆ ప్రమేయమే తీసుకరాలేదు. అందుకని ఈసంగతి తలుచుకుని విచారపడసాగాడు. భగవంతుడు సర్వాంతర్యామికదా, ఒకచోటకాకపోతే ఒకచోటైనా తృప్తిచెందియుండడా— అని మనస్సుకు నచ్చచెప్పుకున్నాడు. ఎంతనచ్చచెప్పుకున్నా గృహదైవానికి సరిగా పూజ జరపనందుకు తప్పకుండా క్రోధం చెందివుంటాడనే సంశయం అతని మనసు నొదల్లేదు.

కాలేజికివెళ్ళి ప్రొఫెసరుగారికి సుస్తీగా వుండటంవల్ల ఫస్టుపీరియడు సెలవని విని చాల సంతోషించాడు. పరీక్షలు దగ్గరకొస్తు[illegible] కోసం విద్యార్థులు కాలేజిక్లర్కులను వేధిస్తున్నారు. ఈ[illegible] కొందరు ఆఫీసు రూముకేసి వెళ్ళుతూండేప్పటికి దివాకరుడుకూడా బైల్దేరాడు. కాని ఆఫీసుముందుకురాగానే— ఇవ్వాళ దేవునికిపూజ సరిగా జరగలేదన్న సంగతి జ్ఞాపకమొచ్చి ఆగిపోయాడు.

"ఆగావేం?" ఒకవిద్యార్థి అడిగాడు.

"ఇవ్వాళ రానులే" దివాకరుడు క్లుప్తంగాసమాధానమిచ్చాడు.

"ఎందుకని? పద ఇవ్వాళేచూచివద్దాం"

"రానులే" అనిఅతను తిరిగివెళ్ళిపోయాడు. తక్కువౌతుందని అనుమానమున్నా అట్టెండెన్సుగురించి శ్రద్ధవహించటానికి ఇవ్వాళ అతనికిధైర్యం లేకపోయింది.

తిండికోసం అతను ఇంటికి తిరిగివెళ్ళే తొందరేమీలేదు. అనేక కారణాల వల్ల ఇవ్వాళ అతనికి ఆకలిగాకూడా లేదు. కాలేజి వదిలిపెట్టినతర్వాత బైట కొచ్చి చూశాడు: అతని సహాధ్యాయి ఒకతను ఎవరితోనో, దేనిమీదో వాదిస్తున్నాడు. దివాకరుడు తలవంచుకుని తిన్నగా గంగానదికేసి బైలుదేరాడు. పడిపోయిన రేవుమెట్లు శిథిలమైన అస్థిపంజరంలా పడివున్నాయి. ఒకరోజున వీటికి కాయమున్నది, రూపమున్నది, ప్రాణమున్నది. ఇప్పుడువాటిని ఇటుకముక్కల గుట్టలంటున్నారు. ఎప్పుడు ఎవరుకట్టించారో, ఎవరు వచ్చికూర్చునేవారో, ఎవరుస్నానంచేసివెళ్ళేవారో, కూడాఏమీ ఆనవాలు లేకుండాపోయింది. గంగానది ఆరేవుమీదనుండి సముద్రంకేసి అవిరామగతితో ప్రవహిస్తూ వుంది. గట్లమీద గోధుమపైరులుతలలెత్తి ఎండవేడిమినీ, గంగాపవనాలనూ సేవిస్తున్నాయి. దివాకరుడు వాటిమధ్యనుండి రేవుదగ్గరకువచ్చి నుంచున్నాడు. చెప్పులువిడిచి రాతిగుట్టమీద ఒక పక్కగా పెట్టాడు. చొక్కావిప్పి పుస్తకాలదొత్తి కిందవుంచాడు. తర్వాతనదిలోదిగి కాళ్ళుచేతులు కడుక్కొని, శిరసున గంగాజలంచల్లుకుని క్షుధితదైవాన్ని తలుచుకున్నాడు. ఆద్యంతం మంత్రాలన్నీ జాగ్రతగా చదివిఅంజలిసర్పించి, నమస్కారంచేసి లేచినుంచున్న తర్వాత అతనిహృదయభారం కొంచెంతగ్గినట్లయింది, మళ్ళాచొక్కా తొడుక్కొని, పుస్తకాలు చేత పట్టుకుని బైలుదేరాడు. ఇంకాపొద్దువున్నది. రేవుకు నీళ్ళకై వచ్చిన తరుణులు ఇంకా కబుర్లలోనే మునిగివున్నారు.

౨

సురబాల తండ్రికంట్రాక్టువ్యాపారంలో చాలడబ్బుగడించి. ప్రస్తుతం బక్సర్ లో, ఇంటిదగ్గరే వుంటున్నాడు, అతనికి ఇద్దరు కుమార్తెలు. పెద్దది సురబాల. చిన్నది శశి. ఇంకా శశికి పెళ్ళికాలేదు. తండ్రిదగ్గరే వుంటోంది.

పుట్టింటివద్ద సురబాలను 'పసురాజు' అని పిలుస్తుంటారు. అది ఆమె తాత పెట్టిన ముద్దుపేరు. ఆశ్రమాంతాలలోని కుక్కలు పిల్లులు మొదలుగాగల జీవజంతువు లన్నీ ఆమె ఆశ్రమంలో వుంటే, ఆమె దయాదాక్షిణ్యాలమీద బ్రతికేవి. ఆమె ఎప్పుడూ ఏదీ, నిర్వాశ్రయంగా చెయ్యలేదు, ఇప్పుడవి శశిపోషణక్రింద ఆనందంగా బ్రతుకుతున్నాయి. సురబాల పేరుగుట్టు మహేశ్వరికి తెలుసు. ఇక్కడ కూడా బాగా వాడుకయైపోయింది. పెద్దవాడుకుపంగా 'పసూ' అంటారు. నౌకర్లలో కొందరు 'పసుఅమ్మగారు' అనీ, కొందరు 'చిన్నమ్మగారు' అనీ పిలుస్తూవుంటారు.

ఇంట్లో పనిపాటలన్నీ ముగించుకొని రాత్రికి పడకటింట్లోకి వచ్చింది సురబాల. "శశికి ఏదైనా సంబంధంవుంటే చూడమని మీ నాన్నగారు వుత్తరం రాసారు. అయితే, శశి నీకంటె ఎంతచిన్నదో తెలుసా పసూ?" అన్నాడు ఉపేంద్రుడు.

"ఏమిమాటలండీ! ఆమాత్రం తెలియదూ? నా తర్వాతమా అమ్మకు ఒక మగపిల్లవాడుపుట్టి ఏడాదిలోపలే పోయాడు. వాడితర్వాత కడుపున పడిన బిడ్డ శశి. నాకంటే అయిదారేళ్ళు చిన్న" అన్నది సురబాల.

"అయితే ఈ లెక్కప్రకారం ఆమెకు పదమూడేండ్లు వుంటాయన్న మాట!"

"వుంటాయి నాదారిది కాబట్టి ఇంతవరకు పెళ్ళికాకపోయినా ఆదే మనిపించలేదు. నాలాంటివల్లుగలదైతే పెద్దచిక్కువచ్చేది."

"చిక్కేమున్నది. మీ నాన్నదగ్గర డబ్బుకేమైనా కొదవా ఏమిటి? డబ్బుంటేచాలు కొండమీది కోతినితీసుకురావచ్చు, నాలాగ వల్లోపడేవాళ్ళకి ప్రపంచంలో తక్కువా?" ఉపేంద్రుడు నవ్వుతూ.

"అయితే, మీరు మా నాన్నగారిడబ్బుచూచి వల్లోపడ్డారా?" అన్నది సురబాల.

"అబద్ధంఎలాఆడను, ప్రతిష్ఠకూడా__నీమొదటచెప్పకపోవటం__లోనేవుంది."

"కాని. ఆమాట శుద్ధఅబద్ధం"

"ఎందుకనీ?"

"ఎందుకని ఏమిటి? అబద్ధానికికూడా ఏమైనా ఆధారాలుంటుందా? నాన్నగారిడబ్బుచూచి రాలేదంటారుగాని, నాన్నగారిదగ్గరడబ్బున్నా లేక

పోయినా రాతలుంటే రాకతప్పదు. నే నే యింట్లో జన్మిస్తే ఆ యింటికి రావలసివచ్చేది. తెలిసిందా?"

"ఆఁ కొంతవరకు, మరి నేను సత్పురుషాత్ముల యింటపుడితే—?" అన్నాడు ఉపేంద్రుడు గంభీరంగా.

సురబాల పకపక నవ్వి "ఏమిమాటలండీ! బ్రాహ్మణ ఆడపడుచునెక్కడైనా శూద్రులయింట పుడుతుందా? ఆ తెలివి తేటలతో నేనా ప్లీడరీ చేసేది?" అన్నది.

ఉపేంద్రుడు సస్మిత గాంభీర్యంతో "నువ్వన్నమాట నిజమే, ఈ తెలివి తేటలతో చేయబట్టే నా ప్లీడరీ ఇంతలక్షణంగా వుంది అన్నాడు.

సురబాల తనుఅన్న మాటకు తనే నొచ్చుకొని—వినయంగా "ఎందుకు సాగదు, యిప్పుడు సుబ్బరంగానే సాగుతుంది. కొంతకాలంపాటుమందంగావుంటుంది. అదీగాక మీకు ప్లీడరీ సరిగా సాగితేం సాగకపోతేం?" అని నవ్వుతూ "పన్నెండుగంటలనుండి అయిదింటివరకు నాయింట హాజరై వుండండి. నెలకు అయిదువందల రూపాయల భృతినిప్పిస్తాను. ఎలాగూ మా నాన్న రెండు వందలయాభైరూపాయలు పంపుతున్నారు. మరో రెండువందల యాభై అడిగి తెప్పించుకుంటాను" అన్నది.

"ఉద్యోగాన్ని స్వీకరిస్తే నేను చేసేపనేమిటి? పన్నెండుదగ్గరనుండి అయిదింటివరకు నీయెదురుగా నుంచోవాలా?" అన్నాడు ఉపేంద్రుడు.

"కాకపోతే ఏమిటి! నుంచుని నుంచుని అలసిపోయినతర్వాత కూర్చోటానికి అనుమతిదొరుకుతుంది" అన్నది సురబాల.

"కూర్చుని కూర్చుని అలసిపోయినతర్వాత పండుకోటానికి దొరకదు?"

"లేదు, లేదు. పండుకోటానికి వీలులేదు. కూర్చుని అలసిపోయితర్వాత మళ్లీ నుంచోవాలి. అధికారి ముందుభయభక్తులు లేకుండా మెలగకపోతే, ఫయిను కూడాపడుతుంది" అన్నది సురబాల చిరునవ్వుతో.

"ఫయిను యిచ్చుకోలేకపోతే?"

"ఖైదుపడుతుంది. నాలుగింటి తర్వాతకూడా కదలకూడదు తెలిసిందా!"

ఉపేంద్రుడు తలవూగించి "తెలిసింది. అధికారిది కొంచెం కఠినస్వభావంగా కనపడుతూవుంది. వుద్యోగం వుంటేనే చాలు!" అన్నాడు.

వ్యాపించింది. సరే రెండుమూడుసార్లు చావుబతుకులమీద ఎలాగైతే బతికింది. ఒక సారి నయమైన తర్వాత కాలుకొంచెం వుబ్బరించి బరువుచేసింది. డాక్టరు ఆపరేషనుచేసి ప్రాణాలు దక్కించాడు కాని, కాలుమాత్రం సరిగా నయంచెయ్యలేకపోయాడు. అప్పటినుండీ కాలుకొంచెం పట్టేస్తూ నడుస్తుంది. పెరిగినకొద్దీ ఆ కాస్త అవుపించకుండా పోతుందని చెప్పాడు డాక్టరు. కాని ఆ నమ్మకంతో చేసుకునేదెవరు? తగినవాడికి తగినపిల్లే దొరుకుతుంది. తెలిసివుండి బుద్ధిపూర్వకంగా ఎవరూ శశిలాంటి పిల్లను చేసుకోటానికిష్టపడలేదు. ఒకవేళ డబ్బుఆశచేత ఇష్టపడినవాడు తగినవాడు కాడనీ చెప్పవచ్చు."

ఈ మాటలు చాల ధ్యానంతో విన్న తర్వాత ఉపేంద్రుడు—"నేను శశిని చాలసార్లు చూచాను, కాని ఎప్పుడూ పట్టేస్తూ నడిచినట్లు కనపడలేదే!" అన్నాడు.

సురబాల మృదువుగానవ్వి "మగవాళ్ళకు ఏమీ కనపడదు. కాని ఆడవాళ్ళ కన్నుకప్పటం కష్టం! నిమిషంలో లోటులన్నీ గ్రహిస్తారు" అన్నది.

"కాని ఆమెను ఆడవాళ్ళకిచ్చి చెయ్యాముగా! ఆడవాళ్లు చూస్తారని భయపడటానికి?" అన్నాడు ఉపేంద్రుడు.

"అదేమన్నమాట! కప్పిపుచ్చి గుడ్డిపిల్లనూ, కుంటిపిల్లనూకూడా వివాహం చెయ్యవచ్చు! కాని ఆతర్వాత...?"

ఉపేంద్రుడు మెదలకుండా ఏదో ఆలోచిస్తున్నాడు.

"కిందటి దుర్గాపూజలప్పుడు మా బక్సర్‌లో సరిగ్గా అలాంటి ఘటనే జరిగింది. పెళ్ళిముందు ఈచర్చలన్నీ ఎందుకు, తర్వాత అల్లుడికి చెప్పకూడదా అనుకున్నారు అత్తామేనత్తాను" అన్నది సురబాల.

"అంతేగా!"

"అంతేనా? అత్తా ఆడబిడ్డల విషయం ఆలోచించకుండా కేవలం అల్లుణ్ణి లక్ష్యంపెట్టుకోవటం చాలదంటాను నేను. శశిని చేసుకున్నవాడు ఆమెను తప్పకుండా ప్రేమిస్తాడు. కాని కాస్తలోటుకే అత్తా ఆడబిడ్డలమనస్సు నొచ్చుకునేట్టు చేస్తే—ఆమె జీవితంలో ఎప్పుడూ సుఖంగా కాపురం చెయ్యలేదు."

ఉపేంద్రుడు కొంచెంసేపు మెదలకుండావుండి "అయితే, శశిని అత్తలు, ఆడబిడ్డలూ లేని కుటుంబంలో యివ్వాలని వుందానీకు?" అన్నాడు.

సురబాల సిగ్గుపడుతూ "అయ్యోరామ! నేనుమాత్రం ఎలా అనుకుంటాను! అది ఎంత అశుభం!" అన్నది.

ఉపేంద్రుడు విసుక్కుని "అయితే, ఇంకా నువ్వు అనుకునేది ఏమిటి? ఆ తల్లి, ఆడబిడ్డలువుండి బుద్ధిపూర్వకంగా కుంటిపిల్లను చేసుకుని ప్రేమిస్తే బాగా నేవుంటుంది! కాని అంతమూర్ఖులు ఎవరుంటారు చెప్పు, తమబిడ్డలకు కుంటివాళ్ళనీ, గుడ్డివాళ్ళనీ కట్టటానికి? అన్నాడు.

సురబాల కొంచెంసేపు మెదలకుండావుండి—"అయితే సంబంధం కుదిరేవుందంటున్నారు మీరు?" అన్నది.

"అవును కుదిరేవుంది."

"ఈవిషయం అతనితో చెప్పరూ?"

"చెప్పకపోయినా పరవాలేదు."

"చివరికి గందరగోళమైతే?"అన్నది సురబాల వుత్కంఠతతో.

"గందరగోళం ఏమీ కాదు. దివాకరుడు మీచెల్లెలి లోటు—పాటును ఏమీ లెక్క చెయ్యడు. నీకూ అక్కకూకూడా ఏమీ పరవాలేదనుకుంటాను."

ఈమాటవిని సురబాలసంభ్రమించిపోయింది. కొంచెంసేపు మెదలకుండా వుండి"అతనికా?" అన్నది ఆశ్చర్యంతో.

"అవును"

"కాని నాన్నగారు వప్పుకోరు."

"ఎందుకని?"

"అతనికి ఆస్తి పాస్తులు లేవు. ఇల్లూవాకిలీ లేదు. వెనకదిక్కు లేదు.

"నేనుంటే అన్నీ వున్నట్లే" అన్నాడు ఉపేంద్రుడు కులాసంగా.

"అయినా నాన్నగారు ఒప్పుకోరు."

"ముందునీకు ఇష్టంలేనట్లువుంది. అసలురహస్య మదే నేమో!"

సురబాలమాట్లాడలేదు.

ఉపేంద్రుడు కొంచెంసేపు మెదలకుండావుండి"సరే, చాలప్రొద్దు పోయింది, ఇకపండుకో"అన్నాడు.

ఆరాత్రి సురబాలకు చాలప్రొద్దుపోయేవరకునిద్రపట్టలేదు. హఠాత్తుగా భర్త నిశ్చింతగా నిద్రపోతున్నాడన్న భావం ఆమెహృదయంలో కలుగగానే కళ్ళు రెండూ వేడికన్నీటితో నిండుకొచ్చాయి. భర్త హృదయంను ఆమెకు

ఇసుమంతైనా అనుమానంలేదు. కాని ఏడెనిమిదేళ్ళనుండి కాపురంచేస్తున్నా ఆపురుషునిలోతు—పాతులు ఎందుకు తెలుసుకోలేకపోయానా అని చింతించ సాగింది. తనభర్తకు ఏమాటకు కోపంవస్తుందో, ఏమాటకు రాదో కూడా తెలియదు. కాని ఆఖరికి వారిని అర్థం చేసుకునేశక్తి ఏనాడైనా వావున్నా, ప్రస్తుతంమాత్రం కుష్కించి పోయిందని గ్రహించింది. వారుచేసేపనులు చంచలచిత్తులు చేసేపని లాంటివి కావని తెలుసుకున్నది. ఈభావం హృదయంలో కలిగినప్పుడు కిస యాగా "భగవంతుడా! ఇంతభాగ్యంయిచ్చిన, వారికి దానినసరించినడిచేబుద్ధి యెందుకుయివ్వలేదు!" అనిప్రార్థించుకునేది. ఇవ్వాళకూడా మనసులో ఎంత ఆలోచించినా కారణమేమీ దొరక్క పోయేప్పటికి నిరాశపడసాగింది. చెల్లెలి విషయంలో అక్కకు ఈఅనుమానాలు ఎందుకు వుండకూడదో ఆమెకు అర్థం కాలేదు.

బైట దీర్ఘమైన శీతలరాత్రివ్యాపించివుంది. దానినిసమానమైన ముక్కలు చెయ్యటానికాయన్నట్లు దూరంగా సర్కారు కచేరీ గడియారం టింగు టుంగు మని గంటకొడుతూవుంది.

మర్నాడు రెండుఝాములకు మహేశ్వరి భోజనందగ్గర కూర్చొని వుండగా ఉపేంద్రనాధుడువచ్చి చెంతకూర్చున్నాడు. మహేశ్వరి తమ్ముడి రాకచూచి "ఉపేంద్రునికి ఒకపీటతీసుకొచ్చివెయ్యి చిన్నదానా!" అన్నది.

"పీటయెందుకుగాని నిన్ను ఒకవిషయంఅడగటానికివచ్చాను. అక్కా!" అన్నాడు ఉపేంద్రుడు.

మహేశ్వరి అతని మొహంవంక చూస్తూవుండిపోయింది.

"శశికి సంబంధం కుదర్చమంటూ మొన్న మామగారు వుత్తరంరాశారు. వారింటిసంగతులు నీకుతెలిసినట్లు ఇంకెవరికి తెలియవనుకుంటాను, శశి అవిటిదని వింటాను. ఏమిటి?" అన్నాడు వుపేంద్రుడు.

మహేశ్వరి భర్తవంట్లో జబ్బుఏర్పడినతర్వాత, చివరి నాలుగైదేళ్ళు బక్సర్‌లోనే ప్రాక్టీసుచేస్తూ సురబాల తండ్రిఇంట్లోనే అద్దెకువుంటూ వుండే వాడు, ఆకుటుంబాలు రెండూ కలసిమెలసి వుంటూవుండేవి. క్రమంగా వారి

అన్యోన్యత అభివృద్ధిచెందింది. సుశీల సంబంధం కుదిర్చిందికూడా మహేశ్వరే కొంచెంసేపు తమ్ముడి మొహంవంక చూచి "పని ఏమన్నది?" అన్నది.

"రెండు కాలు ఒకటిఅవుతు అంటూవుంది."

మహేశ్వరి కొంచెంనవ్వి "అవుడేమీకాదు. కానిచిన్నప్పుడేదో జబ్బులో కాలువుబ్బరించేటప్పటికి ఆపరేషను చేయించారు, అందుకని ఆ కాలు కొంచెంపట్టేస్తూవుంటుంది. చాలకాలమైంది. ఈపాటికి నయమవకుండా వుంటుందా?,, అన్నది,

"అయితే, ఇంకేం లోటులేవుగా?"

"లేవు"

"మామగారిదగ్గర డబ్బువుందనివింటాను. నీకుఏమైనా తెలుసాఅక్కా?"

"నేనూ అట్లాగే అనుకుంటాను"

ఉపేంద్రనాథుడు మరికొంచెం దగ్గరగాజరిగి "నిన్ను ఒకసలహా అడుగుతాను అక్కా! ముందు—ఈ అప్పచెల్లెలిద్దరే మామగారి ఆస్తికి వారసులు. అట్లాంటప్పుడు-అటువంటి సదవకాశాన్ని జారవిడవవచ్చా?" అన్నాడు.

మహేశ్వరినవ్వి "ఆసంగతి నిజమే! కానిదానికివుపాయం?"అన్నది.

ఉపేంద్రుడుకూడానవ్వి "నవ్వులాటకాదుఅక్కా! పనును ఎత్తిపొడవడానికి అంటున్నమాటలు కూడాకాదు. నేనుదివంసంగతి ఆలోచిస్తున్నాను." అన్నాడు.

ఈమాటవినగానే మహేశ్వరి మొహం ఒక్కసారి తెల్లబోయింది. ఉపాకిరుడు ఆమెకు కంట్లోముల్లులాగ కనపడతాడు. మహేశ్వరి మొహంలో కలిగినభావపరివర్తన చూచికూడా "నీవుద్దేశమేమిటిచెప్పు?" అన్నాడు. వుపేంద్రుడు.

మహేశ్వరి అన్నంలో పప్పుకలుపుకుంటూ తలవంచుకు ఆలోచించుతూ కూర్చుంది. కొంచెంసేపటికి తలెత్తిమొహంమీదికి నవ్వుతెచ్చిపెట్టుకుని "మంచి దేగా!" అన్నది.

"ఊరికే మంచిదంటే కుదరదు. నువ్వుతలపెట్టుకుంటేగాని ఈపని సానుకూలంకాదు అక్కా! పనుపెళ్ళిచేసిందికూడానువ్వే. ఆమెతినలాగ అందరూ అదృష్టవంతులవ్వాలంటుంది. నువ్వు పట్టింది బంగారమవుతుందని నాకు బాగా నమ్మకముంది" అన్నాడు ఉపేంద్రుడు.

మహేశ్వరి విచారపడటంతో "కాని శశిలోవున్న లోటు?" అన్నది.

"అందుకనేగా నిన్ను సాయంచెయ్యమనేది. నీపుణ్యప్రతాపంతో లోటు పాట్లన్నీ ఎగిరిపోతాయి" అన్నాడు ఉపేంద్రుడు.

ఉపేంద్రుని మాటలకు మహేశ్వరి మనసు మెత్తబడుతూవుంది. "కాని దివాకరుని స్వభావం నాకేంఅర్థం కాదు ఉపేంద్ర! అయినవాడైనా పరాయి వాడిలాగ వుంటాడు. అందుకనే ఈకాస్తసంతోషానికీ చివరికి ఏదైనా గందర గోళం తీసుకొచ్చి పెట్టడుగదా అని సందేహంగా వుంది. అయినాదివాకరుడు ఈ పెళ్ళికివప్పుకుంటాడా?" అన్నది.

"వప్పుకోపోటానికి కారణం? ఈ ప్రపంచంలో చేతులమీద బతకటం తప్ప మరోఆధారం లేనప్పుడు యిటువంటి సదవకాశాన్ని జారవిడవటం పిచ్చి తనమే కాదు, పాపంకూడాను."

మహేశ్వరినవ్వుతూ "ఉపేంద్ర! ఇది ప్లీడరీ కాదు. క్లయింటుల డబ్బు మీద దృష్టివుంచుకుని ఎలాబడితే అలామాట్లాడటానికి? నచ్చటం, నచ్చకపోవట మనేది ఒకటి వుంటుందిగా?" అన్నది.

"వుండనీ, ఆవిషయమే ప్రధానంగా తీసుకుని తిరిగేవాళ్ళను గురించి నే నాలోచించటంలేదు. మనకునచ్చటం, నచ్చకపోవటంతో ఏమిసంబంధం? శశిలాంటిపిల్ల నచ్చనివాడికి పెళ్ళికావటమేకష్టం?" అన్నాడు ఉపేంద్రుడు.

ఉపేంద్రుని వ్యగ్రత మహేశ్వరికి కుతూహలమనిపించింది. "ఇవ్వాళ కాలేజీకి వెళ్ళనట్టున్నది. ఒకసారిపిల్చి అడిగిచూడు—వాడివుద్దేశ మేమిటో?" అన్నది.

"అరే, ఎవరా?అక్కడ? అక్క పిలుస్తూవుందని దివంతో చెప్పు"

దివాకరుడు వచ్చి రావటంలోనే "దివం! నీపెళ్ళిఖాయమైంది. నీపరీక్షలైపోగానే మంచిరోజుచూచి లగ్నంపెట్టుకుంటాం. అక్కా! పౌరోహితుణ్ణి పిలిపించి పంచాంగంచూపించు నాన్నగారికి చెప్పు. శశి సంబంధంమాటవిని చాలా సంతోషిస్తారు. అలా తెల్లమొహంవేసుకు చూస్తావేమిటి? నీచిన్నవదిన గారి చెల్లెలు శశిని ఎప్పుడైనా చూచావా? చూచేఅవసరంకూడా లేదు— ఇప్పుడేఅంటున్నాను—అటువంటిపిల్ల నచ్చనివాడికి పెళ్ళికావటమే కష్టమని. అయితే ఒక్కసంగతి—చిన్నతనంలో ఆమెకుడికాలిమీద ఏదోలేస్తేఆపరేషను

చేయించాయి. అందుకని కొంచెం పట్టించుకుంటూంటుంది. ఇటువంటి చిన్న చిన్న లోటుపాట్లు మనవాడైన దివాకరుడే పట్టించుకుంటే, పొరుగువాళ్ళెందుకువూరుకుంటారంటూంది అక్క. అదీగాక ఇటువంటి చిన్న చిన్న లోటుపాట్లను లక్ష్యం చెయ్యటం ఉన్నత నాగరికుల లక్షణం కాదు. నీచత్వం. ప్రపంచంలో పూర్తిగా నిర్దోషంగానూ, నిష్కళంకంగానూ వున్న వస్తువేదీ వుండదు. అటువంటి వస్తువు కోసం ఆశించి కూర్చోటం పిచ్చితనం. మనదివం బాగా గ్రహింపుకలవాడు అక్కా! నిజం — శశి పెళ్ళిసంగతి విని సుశీల వుప్పొంగిపోతుంది. నీకైతం వేష్టపటంలేదూ దివం? సరే, ఇకనువ్వు వెళ్ళు. నేను మామగారికి ఒక వుత్తరం రాసి పడేస్తాను" అని ఉపేంద్రుడు అక్క మొహంవంక చూచి నవ్వుతూ వెళ్ళిపోయాడు.

మహేశ్వరి తలవంచుకుని భోజనం చేస్తూవుంది. దివాకరుడు మౌనం వహించి కూచున్నాడు. చాల సేపటివరకు ఏ ప్రసంగమూ రాలేదు. కొంచెం సేపటికి దివాకరుడు "ఈసంగతేమిటి అక్కా?" అన్నాడు.

మహేశ్వరి తలవంచుకొని భోజనం చేస్తూనే—"అంతా విన్నావుగా!" అన్నది.

"ఇంత తొందరేమున్నది?"

"శశికీ పెళ్ళీడువచ్చింది. ముందునాటికి మంచిలగ్నాలుకూడా లేవట."

తర్వాత దివాకరునికి ఏమి మాట్లాడటానికీ తోచలేదు. కాని యిప్పుడు ఉపేంద్రుడు వుత్తరం రాస్తూవుంటాడు. కొంచెం సేపున్నతర్వాత ఏనాకరో దాన్ని తీసుకుని పోస్టాఫీసుకు పరుగెత్తుతాడని అతనికివెంటనే జ్ఞాపకమొచ్చింది. జీవితపర్యంతం పెళ్ళిచేసుకోవద్దన్న తనసంకల్పం ఒక్కసారి ఆకస్మికంగా కాల ప్రవాహంలో కొట్టుకుపోతుందా? అని తలమెత్తోగానే అతనిహృదయం ఆరాట పడింది. ఉపేంద్రుని గదికేసి వెళ్ళాడు. గదిలోకి వెళ్ళగానే సుశీల బీరువా చాటుకు వెళ్ళి తనవిచారవదనాన్ని కప్పిపెట్టుకుంది. ఉపేంద్రుడు [illegible] కాగితం తీసుకుని టేబులుదగ్గర కూర్చునివున్నాడు. "ఏమిటి?" అ[illegible]

దివాకరుడు తను చెప్పవచ్చిన విషయాన్నిగురించి బాగా ఆలోచించుకోటానికికూడా అవకాశంచిక్కలేదు. ఒకవైపునబీరువా చాటునుండి పయట చెంగుకూడా కనపడుతూవుంది. మెదలకుండా నుంచున్నాడు.

'ఏమిటి దివం?" అన్నాడు ఉపేంద్రుడు.

దివాకరుడు ఏమీమాట్లాడలేదు. ఓరవాకేసి చూశాడు. ఉపేంద్రుడు ఈ సైగను చూచికూడా చూడనట్లు నటించి "దివం, నీ చెప్పేదేమిటో త్వరగా చెప్పు?" అన్నాడు.

దివాకరుడు దగ్గరకువచ్చి "ఇంతతొందరేమున్నది?" అన్నాడు మృదువుగా.

"తొందరేముంది? ఏమీలేదు. ఇంకా కాలేజీకెళ్ళ వ్యవధివుంది. నీపరీక్షలైన తర్వాతే..." అన్నాడు ఉపేంద్రుడు.

"అయితే, ఉత్తరం ఇప్పుడే రాసేఅవసరమేముంది? తర్వాత రాయకూడదూ?"

"రాయవచ్చు. ముందు నాకదిచెప్పు—తర్వాత రాస్తే కలిగేలాభమేటో?"

"ఏమైనా కొంచెం ఆలోచించిచేయటంమంచిది—" అన్నాడు దివాకరుడు మెల్లగా.

"ఇంకా దీనిలో ఆలోచించేదేమున్నది! పెళ్ళినిగురించి నువ్వు ఆలోచిస్తూవుండు. నీపరీక్షనుగురించి నేనాలోచిస్తూవుంటాను!" అన్నాడు ఉపేంద్రుడు.

"కాని ఇంతబాధ్యత నెత్తిమీద వేసుకునేముందు..."

"బుద్ధిమంతుడిలాగ ఏమైనాచెప్పటం అవసరమనుకుంటావా—ఆ కుర్చీ మీద కూర్చుని ఏమి ఆలోచించుకోవాలనుకుంటున్నావో చెప్పు"

దివాకరుడికి సమాధానమేమీ తోచలేదు.

"ఇటు చూడు దివం! ఏవస్తువును గురించయినా పూర్తిగా తెలుసుకోవటం మానవశక్తికి అతీతమైనసంగతి. ఎంతజ్ఞానంకలవాడికైనా చివరికి ముక్తి కలిగించేది భగవంతుడే. అరగంటలో ఎన్నిసంగతులైనా ఆలోచించవచ్చు. కొంతకాలం ఆగటమెందుకు?"

దివాకరుడుతలెత్తి "అందరూ అంతతొందరగాఆలోచించుకోగలరా?" అన్నాడు.

"ఆలోచించుకోగలరు? కాని, తలాతోకాలేని ఆలోచనలకు అంతు వుండదు. కొంతకాలం కాదు, కొన్నిసంవత్సరాలు ఆలోచించినా దానికి దరీ దాపూ వుండదు. ఎవరెన్ని ఆలోచించుకున్నా—నిర్వహించగలమా లేదా అన్నసమస్యను గురించేగా! కాని శశిని చేసుకున్నతర్వాత నువ్వు దాన్నిగురించి

వేరే ఆలోచించే అవసరముండదు. ఇక రెండవది. నచ్చిందా, నచ్చలేదా అన్న విషయం. అదేనా నువ్వు ఆలోచించుకోవాలనేది?"

శశి సౌందర్య చర్చ వచ్చేటప్పటికి దివాకరుడు చాల సిగ్గుపడ్డాడు "కాదు! అదేమీ కాదు" అన్నాడు.

"అయితే మంచిదే! లోకులు దానిని అర్థంలేని ప్రశ్నయని పోనివ్వరు. ముందుగానే అందం విషయం తీసుకువస్తారు. దానిశల్యపరీక్ష చేయటమే ముఖ్య కర్తవ్యంగా భావిస్తారు. కాని యథార్థం అది కాదు. గగన కుసుమంకోసం ఎంత విలపించినా ప్రాప్తించటం దుర్లభం. దానికోసం పరుగులెత్తి వచ్చిన వస్తువు కూడా చెయిజారిపోయిన తర్వాత నిరాశజెందుతారు. అందుకని ఏమీ ఆలోచించకుండా, భగవంతునిమీద భారంవేసి స్వీకరించటం మంచిది. నాలుగురోజులలో నాశనమయ్యే విలువలేని వస్తువునుగురించి ఇంతఆలోచించటం అనవసరం [illegible]. పదిహేనణాల వైపు ధ్యానముంచకుండా, ఒక్కణాకోసం ఇంత పట్టుపట్టి పెద్దవాళ్లని ఎదిరించవద్దు. నీ భవిష్యత్తు సులక్షణంగా వుంటుందని ఆశీర్వదిస్తున్నాను. కాని మానవుడికి బాహ్య సౌందర్యమే సర్వమూ కాదన్న సంగతి మాత్రం జ్ఞాపకముంచుకో. కేవలం సౌందర్య పరీక్షే వివాహోద్దేశము కూడా కాదు."

దివాకరుడు తలవంచుకుని మెదలకుండా వింటున్నాడు. ఉపేంద్రుడు కొంచెంసేపు మెదలకుండా వూరుకుని "ఇక, నువ్వువెళ్ళు" అన్నాడు.

"నామనసొప్పటంలేదు! క్షమించు అన్నయ్యా! ఆమె కలిగిన కుటుంబంలో పుట్టినపిల్ల" అన్నాడు దివాకరుడు వంచినతలనెత్తకుండానే.

హఠాత్తుగా ఈసమాధానంవిని ఉపేంద్రుడు కొంచెంసేపు మాట్లాడలేకపోయాడు. మితభాషి దివాకరుని మాటలోని పట్టుదలను గ్రహించాడు. అతను తలపెట్టిన పని ఏదీ సానుకూలం కాకుండా వుండలేదు. చేతిలో కలం కాగితం ఒక పక్కన పెట్టి "మనస్సొప్పకపోతే పోయిందిలే. కలిగిన కుటుంబంలో పుట్టినపిల్ల చేసిన నేరమేమిటో చెప్పు?" అన్నాడు.

"ఏమీ లేదు. కాని నాకునీదరికం [illegible] పకమొస్తూవుంది."

"అంటే, కలిగిన కుటుంబంలో పిల్ల నిన్ను గౌరవంగా చూడదని నీఅభిప్రాయం! అసలు నువ్వు స్త్రీల గౌరవమర్యాదలందు ఎంతఆశపెట్టుకు కూర్చున్నావో చెప్పు? ఆ ఒకవేళ నువ్వు పెళ్ళిచేసుకోనని పంతంపడితే అదితర్వాత

సంగతి. సౌశీల్యాన్ని నిరూపించటానికోసం ఇలా అసంబద్ధంగా స్త్రీలమీద నేరాలు ఆరోపించటం మంచిది కాదు. మన పురాణాలలోనూ, చరిత్రలలోనూ చూడలేదూ! సీతా, సావిత్రి మొదలైన రాజకన్యలందరూ భర్తలగౌరవమర్యాదలకు ఏమైనా లోటుగానిచ్చారా? వారిలో సుగుణాలేమైనా తక్కువా? నీవు కలిగిన కుటుంబాలలోని పిల్లలమీద ఆరోపించిన నేరం నాకుసమంజసంగా కనపడటంలేదు. వివాహానికి సరైన కారణంకూడా కాదు."

చాటునున్న సుగబాలకూడా ఈ మాటలన్నీ చాలా ధ్యానంతో వింటోంది. ఉపేంద్రుడు బీరువాచాటునుండి కనపడుతున్న ఆమె పయ్యెదచెంగు చూచి "ఇక్కడకూడా ఒక కలిగిన కుటుంబంలోంచి వచ్చినపిల్లవుంది. శశికి నీసం_ ఆమెలోసగం రూపగుణాలతో వచ్చినా_ తన భాగ్యమనుకుంటాడుభర్త" అన్నాడు. కొంచెంసేపు మౌనంగావుండి "మనసొప్పటంలేదంటావు! నీకు మనసొప్పేదిమట్టుకు ఏముంటుంది? చిన్నప్పుడు బడికి పోవటానికికూడా మనసొప్పేది కాదు. కొందరికి ధర్మకార్యాలంటే ఇష్టముండదు. కొందరికి మాత్రం దేశమంటే ఏవగింపు! మనం ఈ ఇష్టాఇష్టాలకు దాసులైతే అనుకున్నది సాధించలేం" అన్నాడు మళ్ళీ.

బీరువాచాటునుండి గాజులచప్పుడు వినిపించేప్పటికి దివాకరుడు ఉలిక్కి పడి లేచినుంచున్నాడు. కొంచెంసేపు ఏదో ఆలోచిస్తూ నుంచున్నాడు. తర్వాత సుగబాల దగ్గరకువెళ్ళి "నీకు యిష్టమైతే_అన్నయ్యతో వుత్తరం రాయ మని చెబుతాను వదినా" అన్నాడు.

ఆమె పయ్యెటచెంగుతో కళ్లు తుడుచుకుని "వారు అబద్ధమాడేవారు కాదు. నీ వివాహమైతే నేను చాల సంతోషిస్తాను" అన్నది.

దివాకరుడు వుపేంద్రుని మొహంకేసి చూచాడు. కిటికీలోంచి ఎండ పొడవచ్చి అతనిమొహంమీద పడుతూవుంది. ఆ మొహంమీద ఆతురతగానీ, చింత గానీ ఏమీలేక నిర్మలంగావుంది.

"మీకు ఎలా న్యాయమనితోస్తే అలా చెయ్యండి. నాకు టైం అయి పోతూవుంది. వెళుతున్నాను" అని మెల్లగా బైటికివెళ్ళిపోయాడు. అతను వెళ్ళి పోయిన తర్వాత సుగబాలవచ్చి కుర్చీలో కూలబడింది. కన్నీళ్ళు కళ్ళతో భర్త మొహంకేసిచూస్తూ "నేను తప్పుచేశాను. నన్నుకూడా క్షమించండి. శశి వివాహం మీ యిష్టమొచ్చినట్లు చెయ్యండి. దివాన్ని క్షమించినట్లు నన్నూ

"క్షమించండి" అన్నది. [illegible] పుస్తకం రాయటం ప్రారంభించింది. "సారీ" అన్నాడు తలెత్తి.

ప్రస్తుతం దివాకరునికి ఎప్పుడూ తన వివాహాన్ని గురించే ఆలోచనయి పోయింది. శశి ఎలావుంటుందో, ఏమి చేస్తూవుంటుందో, ఏమి ఆలోచిస్తూ వుంటుందో, ఏమి చదువుతూవుంటుందో, చేసుకున్న తర్వాత ఎలా వ్యవహరిస్తుందో ఇవే అతని ఆలోచనా విషయాలు. రాత్రింబవళ్లు ఈ ఆలోచనతో అతనికి చదువేమీ సాగటంలేదు. ఆలోచన రెక్కలైన అతని మనసుకూడా చంచలంగా గగనకుసుమాలతో మాలలల్లుకుంటూ తిరుగుతూంది.

పరీక్షలభయం కొరడాలు పెట్టికొట్టి అతని మనసును ఎన్నిసార్లు చదువులో నిమగ్నం చేసుకున్నా ఎగురుతిరిగి గాలి కల్పనలతో కాలయాపన చేయసాగింది. విద్రోహానికి పూనుకున్న అతని మనసు ఎంత ప్రయత్నించినా దారికి రాకపోయేప్పటికి కాలం వ్యర్థంగా గడచిపోతోందే అని పశ్చాత్తాప పడసాగాడు. ఇది ఎంత విచిత్రమైన [illegible]? దేనివల్ల తాను ఈవిధంగా పిచ్చివాడయ్యాడు? వెతకగానే దానికి కారణంకూడా అతని మనసుకు తట్టింది. ఆ కారణాన్నికూడా విమర్శిస్తూ 'నాకేం ఇష్టంలేదు. అందంటేనే నాకు చాల అసహ్యం. కాని పెద్దవాళ్ళ గౌరవం కాపాడటానికి నోరు మూసుకుని వూరుకోవాలి. అని ఆగ్రహంతో గబగబా చదువసాగాడు. ఇవ్వాళ అతనిమనసును అదుపులో పెట్టటం మరీ కష్టతరమై పోయింది. అది ఎంతసేపూ పుస్తకం అవతల పెట్టి మళ్లీ [illegible] పెట్టివచ్చిన నాటకాన్ని పూర్తిచెయ్యటానికీ, సగం అల్లి వచ్చిన గగనకుసుమాలను మళ్లా గుచ్చటానికీ పశ్చాత్తాప పడసాగింది. ఇంత వరకూ—కల్పనా వసంతసమా అతని దేవతన్న మూర్తిని స్పృశించివాయి. అప్పుడుకూడా ఎంత మాధుర్యముంది! రోజూ కనపడుతున్న ప్రకృతే ఇవాళ్ళ అతని కళ్ళకు సరి నూతన శోభతో కనపడసాగింది. ఎంత అనంతశోభ! దినకరుని వైపుకు తిరిగి కళ్ళుమూసుకున్నా — తత్తరపాటు వచ్చి రెప్పలమీద గిలిగింతలు పెట్టినట్టు—పుస్తకంముందు పెట్టుకుని పాఠాలు చదవాలని ఎంతపట్టుదలతో వున్నా—అనంత మాధుర్యానుభూతి ఏదో అతనిహృదయాన్ని స్పృశించసాగింది.

కంఠస్వరం మందగించింది. దృష్టి క్షీణించింది. తలపని తలంపుగా అతను ఒక్కసారి ఈ కొత్త కల్పనలలో మగ్నమైపోయాడు. అతనికళ్ళల్లో వేలకొలదీ దివిటీల వెలుగులు మెలుగాడుతున్నాయి. చెవులలో మంగళ వాయిద్యాలధ్వనులు మారుమోగుతున్నాయి, మనసులో వివాహ సమారోహణ దృశ్యం ప్రత్యక్షమౌతూవుంది. ఆ సమారోహణంలో—వివాహ వేదికమీద తనే—పెండ్లికొడుకై, కూర్చున్నట్టు చూచి కంపించిపోయాడు. ఇదివరకు జరిగినఘటనలన్నీ అతని కళ్ళముందు ఒక్కొక్కటే తెరమీది బొమ్మల్లాగ రాసాగినై. అతని మనసు మహాస్వప్నసముద్రంలో మునిగి తేలుతూవుంది. స్థిమితంగా ఏమీ నిశ్చయించలేక నిస్తబ్ధభావంతో కూర్చున్నాడు. గోడమీద కిరసనాయిలు దీపం జ్యోతిలాగ వెలుగుతూవుంది. గూట్లోగడియారం టిక్కు టిక్కు మంటూ అతన్ని జాగృత పర్చటానికి వ్యర్థ ప్రయత్నాలు చేస్తూవుంది. ఈవ్యథతో అతను చాలసేపటివరకు మెదలకుండా నిస్తబ్ధతతో నిరాశగాకూర్చున్నాడు. తర్వాత కొంచెం సేపటికి చైతన్యంకలగగానే—వుత్తేజంతో "ఇప్పుడు నేను చేయగలిగిందేమిటి? నేను లోకులలాగానే—పశుపక్షులతో సంసారం చెయ్యాలి. దానిలో విశేషమేముంది? సుఖమేముంటుంది? వుపేన్ అన్న నాస్వాతంత్ర్యాన్నంతా మట్టిపాలుచేసాడు. అటువంటి జీవితాన్ని వూరికే నేపోనిస్తానా!" అని గొణుక్కుంటూ వుపేంద్రునికి వ్యతిరేకంగా విద్రోహం చెయ్యాలనుకున్నాడు. కాని నోటమాటరాలేదు. ఆలోచనావాహిని ఒక్కసారి ఆగిపోయింది. అతనికి వెంటనే సురబాల జ్ఞాపకమొచ్చింది. దండకారణ్యంలో—రావణుని రథం మీదనున్న సౌందర్యరాసి సీతాదేవినిచూచి రథాన్నే మింగాలని వచ్చినజటాయువు తన సంకల్పాన్నివదిలి మృత్యుముఖాన్నపడ్డట్టు—అతను సురబాల సుందరవదనం, ఆశీర్వాదానికి ఆసించి ఉపేంద్రునిముందు తలవంచాల్సివచ్చింది. అతనిలోని విప్లవభావం—దిగజారిపోయింది. చాల ప్రొద్దుపొయ్యేవరకు ఈ సంగతే ఆలోచిస్తూ కూర్చున్నాడు. కాని ఏ వుపాయమూ దొరక్కపొయ్యేప్పటికి, తనకల్పనాస్వాతంత్ర్య సమస్యను వదలి, ఒక నిట్టూర్పువిడిచి కళ్ళు నులువుకుంటూ లేచినుంచుని 'ఇవ్వాళికు ఈ చదివించిచాలు' అని పుస్తకం అవతలపెట్టి వత్తితగ్గించి పండుకున్నాడు. అతని స్వతంత్రజీవిత సమస్య ఎంత చిక్కులో పడిపోయింది! మాటిమాటికీ సురబాలమొహం. ఆశీర్వాదం జ్ఞాపకం రాసాగినై. ఇంతకుముందు అనేకసార్లు అతను ఆమె మొహంచూచాడు, ఆమె

కంఠస్వరం విన్నాడు. కాని ఎందుచేతో ఇవ్వాళ ఒక కొత్తగా కనిపించ సాగింది. భర్తయందు ఆమెకుగల భక్తివిశ్వాసాలు, దైవాదేశంలాగ, ఆమె మతినీ, జీవితగతినీ పంచిదారికి తీసుకువచ్చాయని అతను గ్రహించాడు. తన ఇల్లాలుకూడా ఇలా లక్ష్మిలావుంటుంది, ఇంత భక్తివిశ్వాసాలు కలిగివుంటుంది. ఇలాగేమాట్లాడుతుందని అతనికి ఆశకలిగింది. అయితే మాట్లాడుతున్నప్పుడు సురబాల అధరాలు ఎందుకు కంపించాయి? కళ్ళల్లో నీరు ఎందుకుతిరిగింది? మొహంమీద కాంతి ఎందుకు పసుపులెత్తింది? ఆలోచించినకొద్దీ అతనికి ఈ విషయాలన్నీ స్పష్టపడసాగినై. ఇంతకుముందు అతను ఈవిషయాలే ఇంగ్లీషు - సంస్కృత కావ్యాలలో వర్ణించ వలసివచ్చేది. చాలవరకు అస్పష్టంగా వుండేవి. అర్థమయ్యేవికావు. ఆసంగతులన్నీ ఇప్పుడు ఒక్కొక్కటే జ్ఞాపకం రాసాగినై. దానిలోని కల్పనామాధుర్యం అతన్ని మోహింపజేసింది. ఈ విధంగాఅతను తన స్వతంత్ర జీవిత సమస్యనువదలి కావ్యాలలో నాయిక, నాయకుల దుఃఖసుఖాలలో నిమగ్నమై ఆలోచిస్తూ నిద్రపోయాడు.

## ౮

మర్నాడు సతీశుడు పక్కనుండి లేచేటప్పటికిపదిగంటల పొద్దెక్కింది. గదితలుపు యింకా వేసేవుంది. పొద్దుపొడుపు ఎండకి కిటికీలూ, తలుపులూ కాలిపోతున్నాయి. ఇది సతీశునికి అంతుపట్టకపోయినా, అతని శరీరోష్ణత చెబుతూనేవుంది. పక్కంతా చెమటతో తడిసిపోయింది. ఆరాటంతో సతీశుడు లేచి కూర్చుని కిటికీ తలుపు తీసేప్పటికి మహాదేవుని తృతీయ నేత్రంలా తప్త కిరణాలు అతని దేహంమీద కొచ్చిపడ్డాయి.

పొద్దెక్కిపోయిందనే ఆతురతతో సతీశుడు "బిహారీ! బిహారీ!" అని కేకలెయ్యసాగాడు. బిహారిపరుగెత్తుకువచ్చి "ఏమిటిబాబూ?" అన్నాడు. "త్వరగాపోయి ఒక గ్లాసెడు మంచినీళ్ళు తీసుకురా!" అన్నాడు సతీశుడు.

"సిగరెట్టువద్దా?"
"వద్దు. మంచినీళ్ళు తీసుకురా?"
"స్నానం చెయ్యరూ?"
"ఇప్పుడు కాదులే, నువ్వు ముందుమంచినీళ్ళుతీసుకురా."

బిహారీ ఈ సారికూడా కదలకుండా "సంధ్యావందనం......?" అన్నాడు. సంధ్యావందనమనేప్పటికి సతీశుడు మండిపడి— "నీకా సంగతులన్నీ ఎందుకు? వెళ్ళిమంచినీళ్ళు తీసుకురా" అన్నాడు. ఈ విదిలింపుతో బిహారీ మెదలకుండా మంచినీళ్ళు తీసుకురావటానికి వెళ్ళాడు. సావిత్రి వంటింట్లో పోకచెక్కలు కత్తిరించుతూవుంది. బిహారినిచూచి నవ్వుతూ "ఏమిటి? బాబుగారు సిగరెట్టు తీసుకురమ్మంటున్నారా?" అన్నది.

బిహారి మొహం చిట్లించుకుని "కాదు, మంచినీళ్ళు తీసుకురమ్మన్నారు" అన్నాడు.

"ఒకస్నానంలేదు, సంధ్యలేదు, మంచినీళ్ళు ఎందుకు?"

"నాకేం తెలుసు తీసుకురమ్మని సెలవిచ్చారు. తీసుకు వెళుతున్నాను" అన్నాడు బిహారి విసుక్కుంటూ.

సావిత్రి వక్కలకత్తెర అక్కడపడేసి లేచినుంచుని "ఇటుతే నేతీసుక వెళతాను ఈ లోగా నువ్వుకొంచెం ఐస్ కొనుక్కురా" అన్నది.

బిహారీ డబ్బులు తీసుకుని ఐస్ కొనుక్కురావటానికి వెళ్ళాడు.

సావిత్రి పైకివెళ్ళి "మీరుస్నానం చేసిరండి. ఇంతలో నేను సంధ్యావందన సామగ్రులు అమర్చి వుంచుతాను" అన్నది.

సతీశుడు లోపల్లోపల విసుక్కుని "బిహారి ఎక్కడికి వెళ్ళాడు?" అన్నాడు.

సావిత్రి నవ్వుకొని "ఐస్ తీసుకురావటానికి వెళ్ళాడు. అపరాధం చేసిన తర్వాత శిక్షఅనుభవించక తప్పదుబాబూ! ప్రాయశ్చిత్తం జరుగుతూ వుంది. మీరు ఏనాడైనా సంధ్యవార్చకుండా మంచినీళ్లు త్రాగారా, ఇవ్వాళ గల్లంతు చేస్తున్నారు? త్వరగా వెళ్ళండి. ఆలస్యంచెయ్యక" అన్నది.

ఇకసావిత్రిని ఎదిరించినందువల్ల లాభంలేదనుకుని సతీశుడులేచి అంగవస్త్రం భుజాన వేసుకుని స్నానానికి వెళ్ళాడు భోజనమైన తర్వాత పండుకోబోతూండగా సావిత్రివచ్చింది. సతీశుడు ఆమెను చూడనట్టు గోడవైపుకు మొహంపెట్టుకు పండుకున్నాడు. సావిత్రి లోలోన నవ్వుకుంటూ "మీకు రాత్రివిషయమేమైన జ్ఞాపకముందా అని అడగటానికి వచ్చాను" అన్నది.

సతీశుడు మాటాడలేదు.

"అయితే, లేచినతర్వాత [illegible] ఒకసారి పిలవండి, జ్ఞాపకం చేస్తాను" అని తలుపువేసి వెళ్ళిపోయింది.

సతీశునికి నిన్నరాత్రి ఏయింటినుండి ఎప్పుడువచ్చాడో, ఎలావచ్చిందీ, ఎవరి వెంట వచ్చిందీ, వచ్చి ఏమిచేసిందీ ఈసంగతులన్నీ జ్ఞాపకంలేవు. జ్ఞాపకంచేసుకోటానికి అతనికి యిష్టంలేక కాదు. ఒకవిధమైన అభిమానం అతని మనసును ఆవైపుకు మరలనివ్వలేదు. గతసాయంకాలపు ఘటన అతనింతవరకు మరచిపోలేక పోయాడు. అదే ఇంతవరకు అతనిహృదయంలో అస్పష్టస్వప్నంలా, మసకమబ్బులలో శుక్రతారలా మెరుస్తూవుంది. కాని అంతకంటేకూడా గొప్పనిగ్రహాలు మబ్బులమాటున దాగివున్నాయని సావిత్రికిఎక్కువెట్టి చూపినతర్వాత అంధకారంలో_ కొలనులా, అతనుకంటికనుకు మాయమైపోయింది. నిన్నసాయంత్రం మరో వుపాయంతోచక వెంటనే దీపంపురాదాకు. కాని దానిపర్యవసానమేమౌతుందో, లోకులు దాన్ని ఎలాఅర్థంచేసుకుంటారో గ్రహించలేదు. అయినాతనమనసులో దురుద్దేశ మేమీలేదు గాఅనుకుని సంతృప్తిపడ్డాడు. తనుచేసిన నేరమేమీలేదన్న ధైర్యమే ఇంతసేపటినుంచీ అతనివ్యాకుల చిత్తానికి ఆశ్రయమిస్తూవచ్చింది. కాని సావిత్రి ఇప్పుడనిపోయిన మాటతో గాఢాంధకారంలో దారికనబడక దారిలో ప్రవేశించటానికి కూడా అతనికి ధైర్యంచాలకపోయింది. ఆరాటాంతో లేచికూర్చుని జీవితంలో మళ్ళా ఇంకెప్పుడూ త్రాగనను ప్రతిజ్ఞతో ప్రాయశ్చిత్తం చేసుకున్నాడు. కిటికీ తలుపుతీసి "బిహారీ!" అని పిలిచాడు.

బిహారి రాఘవబాబు పరుపు ఎండలో వేస్తున్నాడు. సతీశునికేక విని పరుగెత్తుకువచ్చాడు. "సావిత్రిని గ్లాసుతో మంచినీళ్లు తీసుకురమ్మనిచెప్పి, నువ్వెళ్ళి నీ పనిమాచుకో" అన్నాడు.

"ఆమె పూజచేసుకుంటూవుంది. వెళ్ళి నేను తీసుకురానా?" అన్నాడు బిహారి.

"పూజా!" సతీశుడు ఆశ్చర్యంతోఅడిగాడు.

"అవును ఆమెరోజూచేస్తుంది. ఏకాదశిరోజున వుపవాసం కూడా వుంటుంది.ఇంతవరకు రాత్రిపూట భోజనంచేసిఎరుగదు. నీచుపమాత్రంకూడా దగ్గరకురానివ్వదు. ఎలాగైనా కులంగల కుటుంబంలో పుట్టినబిడ్డగా......"

సతీశుడు ఆశ్చర్యంతో _ "కులంగల కుటుంబంలో పుట్టిందా?" అన్నాడు,

"అవునుబాబూ! కులంగల కుటుంబంలోబిడ్డే!" అని బిహారి మంచినీళ్లు తీసుకురావటానికి వెళ్ళబోతూండేప్పటికి సతీశుడు పిలిచి "సావిత్రి రాత్రిపూట భోజనం చెయ్యదుకదామరి ఏమితినివుంటుంది?" అని అడిగాడు.

"ఏం తింటుంది! మిగిలితే ఫలహారంతింటుంది. లేకపోతే మంచినీళ్ళు తాగి పడుకుంటుంది."

"ఈసంగతి మెస్సులో ఇంకెవరికైనా తెలుసా?"

"వంటమనిషికి నాకూతప్ప ఇంకెవరికీ తెలియదు. ఎవరితోనూ చెప్ప వద్దన్నది."

"సరే, వెళ్లి మంచినీళ్ళు తీసుకురా" అన్నాడు సతీశుడు. బిహారి ఒకటి రెండడుగులు సాగివెళ్లిన తర్వాత సతీశుడు మళ్ళీ పిలిచాడు. బిహారి తిరిగివచ్చి "ఏమిటిబాబూ?" అన్నాడు.

"ఆమె కులంగల కుటుంబంలోని బిడ్డని నీ కెలా తెలుసు?"

"ఎలా తెలుసేమిటిబాబూ! నాకు బాగా తెలుసు. ఆమె మంచి కులంలో పుట్టినబిడ్డ కాలం అలావచ్చి..."

బిహారి వెళ్లిపోయినతర్వాత సతీశుడు మళ్లీ మంచమీద ఒడ్డిగిలాడు. సావిత్రిని సామాన్య దాసీలలో చేర్చటానికి అతనికి మనస్కరించలేదు. నిమ్న జాతి స్త్రీ అని ఒప్పుకోటానికి అతని హృదయం బాధపడేది. కాని ఎందుకని? ఆ సంగతి సతీశునికి నేటివరకు తెలియదు. ఇవ్వాళ బిహారివల్ల కలిగిన కొద్ది పరిచయానికే _ అతని హృదయం విస్మయానందాలతో వుప్పొంగిపోయింది. బిహారి మాటలు పదహారణాల యదార్థమని నమ్మటానికి అట్టేసమయం పట్టలేదు.

ఎంతసేపున్నా మంచినీళ్లకెళ్లిన బిహారి అంతులేదు. సతీశుని గొంతెండి పోతూవుంది. పిలవటానికి లేచికూర్చునేప్పటికి, గ్లాసుతో మంచినీళ్లు తీసుకు వస్తున్న సావిత్రి కనపడింది. ఇవ్వాళ ఆమె అతని దృష్టికి_ మరోవిధంగా కనప డింది. దానితో అతనిహృదయం శ్రద్ధాభక్తులతో నిండిపోయింది. ఆమె చేతిలో గ్లాసుతీసుకుని నీళ్లన్నీ గిటగిట త్రాగేసి గ్లాసు కిందపెట్టాడు. ఇదివరకు మాట్లా డటానికి వెనుకాడిన మాటలు కూడా అతని నాలుకమీద కొచ్చాయి. "ఇవ్వాళ నీతో చాలా సంగతులు మాట్లాడాలి సావిత్రీ!" అన్నాడు.

సావిత్రి మెదలకుండా అతని మొహంవంక చూస్తూ నుంచుంది.

"ముందుసంగతి__నన్ను క్షమించాలి" అన్నాడు సతీశుడు.

"ఏండో సంగతి_?" అన్నది సావిత్రి శాంతస్వరంతో.
"నేను నిన్న రాత్రి ఎప్పుడు _ ఎలావచ్చానో చెప్పాలి?"
"రాత్రి మూడు ఘూములకు బండిమీద వచ్చారు."
"తర్వాత ?"
"వాకిట్లో పడి నిద్రపోతున్నారు."
"నిద్రపోయానా ? ఎవరులేపి తీసుకొచ్చారు?"
"నేనే."
"ఇంకెవ రెవరున్నారు ? ఇంత జడపదార్థాన్ని నువ్వు ఒక్కదానివే పైకి ఎలా తీసుకురాగలిగావు ?" అన్నాడు ఆతురతతో.
సావిత్రి నవ్వి "భయపడ నవుసరంలేదు. మెస్సులో ఇంకెవరికీ తెలియదులే" అన్నది.
సతీశుడు ఒకనిట్టూర్పువిడచి "అబ్బ! ప్రాణాలు కుదుటపడ్డాయి. నీ ముందేమీ చెడుగా ప్రవర్తించలేదుగదా !" అన్నాడు.
"లేదు."
సతీశుడు చాలా సంతోషంతో, "ఆఁ అయితే ఇందాక లేచిన తర్వాత ఒకసారి పిలవమన్నావు ఎందుకు ?" అన్నాడు.
"ఆఁ ఇంకెప్పుడూ త్రాగనని మీరు పట్టు వేసుకున్నారు"
"నేను పట్టువేసుకున్నా నా ?___అలాంటి దుర్బుద్ధి నా కెలాపుట్టింది ?"
"నే నడగబట్టి పుట్టింది కామోసు"
"ఆఁ నాకు ఇప్పుడు జ్ఞాపక మొచ్చింది సావిత్రీ ! నీచేతిలో చెయ్యేసి పట్టువేసుకున్నాను కదూ ?" అన్నాడు సతీశుడు వినయంగా.

సావిత్రి మాట్లాడలేదు.
"ఇంకెప్పుడూ తాగను. అయితే, సావిత్రీ నీకు నిన్న సాయంకాలం సంగతి జ్ఞాపకముందా ?" అన్నాడు సతీశుడు మళ్లా.
ఈసారి సావిత్రికి నవ్వొచ్చింది. "జ్ఞాపకముంది" అన్నది తలతిప్పుతూ.
"ఒకవేళ లోకులు యీ సంగతివింటే _ ఏం చేస్తాం ?"
సావిత్రి ఒక్కసారి గంభీరురాలై "మీరు ఈ మెస్సు వదలి మరో మెస్సులోకన్నా వెళ్లండి, లేకపోతే ఇంటికన్నా వెళ్లండి" అన్నది.
"మరి నువ్వు ?" సతీశుడు ఆమె మొహంకేసిచూస్తూ అన్నాడు.

సావిత్రి ఏమీ ఆతురత లేకుండా సహజంగా, శాంతభావంతో "మీరు నా కోసం విచారించవద్దు. ఈ మనస్సులో వుంచితే సరేసరి, లేకపోతే, ఇంకెక్కడైనా పని చూచుకోగలను. రెక్కల కష్టంచేస్తే పని ఎక్కడపడితే అక్కడే దొరుకుతుంది. చెప్పేది ఇంకేమైనావున్నదా?" అన్నది.

సతీశునికి ఒక్కసారి ఆశాశిఖరంమీదనుండి కిందకు దొర్లినట్లయింది. సావిత్రిని మనస్సులో వుంచినా లేకపోయినా ఒకటేనట! ఆమె తన ఒక్కడి మీదే, తన మనస్సుమీదే ఆధారపడలేదు. ఎక్కడ రెక్కలకష్టం చేస్తే అక్కడే పట్టెడుకూడు దొరుకుతుందట — సావిత్రి ఈ మాటన్నతర్వాత ఇంకేం అడగటానికీ అతనికి నోరాడలేదు. ఎన్నో సంగతులు అడగాలని పిల్చాడు... సావిత్రి గాని సతీశుని వెళ్ళిపోయింది. సతీశుడు మెదలకుండా చూస్తున్నాడు.

'ఓ మానవహృదయమా! నువ్వు దేనితో ఏర్పడుతావో, దేనితో నాశనమవుతావో ఎవరికీ అంతు తెలియదు. నువ్వు – చిన్న దెబ్బకేతన్నుకులాడతావు, ప్రాణం పోతూవున్నాకూడా నవ్వుతూ సహిస్తావని వూహించలేము. ఈ హృదయాన్ని పెట్టుకునేగా మానవుడు ఇంత గర్వపడేది! నిరాకారమైన నిన్ను తనదని ఎలాచెప్పేది! నిన్ను నమ్ముకుని సుఖసౌఖ్యాలు నిర్ణయించేదెలా?'

సావిత్రి వెళ్ళిపోయినతర్వాతకూడా సతీశుడు చాలాసేపటివరకు అలా కూర్చుని వుండిపోయాడు. అతని మనసు సరిగాలేదు. దుఃఖంతో, ఆవేశంతో, కాదు ఒక నిష్ఫలమైన క్రోధంతో జ్వాల లెత్తుతూవుంది. ప్రేమించిన వ్యక్తిని ఏవగించుకుంటే సహించవచ్చును. కాని ప్రేమించానని నమ్మించి చివరికి ఇలా నిరాశపెడితే సహించటం కష్టం. మొదటిదానివల్ల బాధఒకటే కలుగుతుంది. రెండవదానివల్ల బాధా కలుగుతుంది, అవమానమూ కలుగుతుంది. ఆ బాధకు ప్రతీకారంలేదు. ఈ అవమానానికి ఫిర్యాదుకూడాలేదు. అయితేచేసేదేమున్నది?

సావిత్రి చేసుకున్న నిశ్చిత కర్తవ్య నిర్ధారణతో ఆమె మానసిక చిత్రమొక్కటే కాక, సతీశుని హృదయ చిత్రంకూడా బైటపడింది. ఆ చిత్రాలకు ఎదురుగా నుంచుని అతను సావిత్రిని ప్రేమించటంలేదనీ అనుకుంటూ వుండేవాడు. కాని కథ అడ్డంతిరిగిందని అతను ఇవ్వాళే తెలుసుకున్నాడు. — అంటే అతను సావిత్రిని ప్రేమిస్తున్నాడు గాని, సావిత్రి అతన్ని ప్రేమించడంలేదు.

ఈ విషయాన్నంతటినీ స్మరిస్తూ అతను నిద్రలో తలపోస్తున్నాడు. తనహృదయం చేసిన ఈ నీచకార్యంమీదకూడా ఏవగింపు కలిగింది.

ఇక ఈ మెస్సులో ఒక్కనిమిషం వుండటం కష్టమనుకున్నాడు. ఇక్కడ వుండటమా, వుండకపోవటమా అన్నవిషయంలో ఆమె పూర్తిగా మౌనం వహించింది. ఆవేదనాభారంతో హృదయం ఉత్తేజితమై ఆమె సాన్నిహిత్యాన్ని ఇంకెక్కువ పెరగనివ్వాలని ప్రతిజ్ఞ చేసుకున్నాడు.

పొద్దు తిరుగబోతూవుంది. గదిలో కూర్చునివున్న సతీశునికి ఈ అంతే లేదు. మెస్సులో వుండేవారు ఆఫీసునుండి తిరిగివస్తున్న చప్పుడు విని త్రుళ్ళిపడి లేచి కిటికీలోంచి బైటికి తొంగిచూచాడు. వెంటనే చొక్కా వేసుకుని బైటకు వచ్చాడు. ఇప్పుడు సావిత్రిలేచి మొహం కడుక్కుంటూ వస్తుంది. భోజనానికి లేవమని హఠంచేస్తుంది ఇవాళ్టి అతనికి ఆకలిగా లేదు. ఆకలిగా లేదంటే సావిత్రి ఎలాగూ వూరుకోదు. బతిమాలుతుంది, బలవంతపెడుతుంది, చివరికి విచారంతో వెళ్ళిపోతుంది ఇటువంటి ప్రేమాడంబరాలను అతను తనజీవితంలో ఇవ్వాళే మొదటగా ఏవగింపుతో చూడగా తలచాడు.

బైటకువచ్చి బజారువెంట వెళుతున్నాడు. వెనకనుండి పరిచితకంఠంతో "చిన్నబాబుగారూ!" అన్న పిలుపు వినిపించింది.

సతీశుడు వెనక్కి తిరిగిచూచి "ఎవరు? మోక్షదా?" అన్నాడు.

మోక్షదా కొంతకాలం సతీశునింట పనిగత్తెగా వుంది. సెలవు తీసుకుని కలకత్తావచ్చి మళ్ళావెళ్ళలేదు. "నేనే బాబూ! నాకు ఒక వుత్తరం వచ్చింది. చదివి వినిపిస్తారేమోనని పిల్చాను" అన్నది.

సతీశుడు నవ్వి "ఇంతమహాపట్టణంలో నీకు వుత్తరం చదివి పెట్టేవాళ్ళెవరూ దొరకలేదు! ఏది వుత్తరం? అన్నాడు.

ఇంటిదగ్గరవుంది బాబూ! ఏమేమి రాశారో...ఎరుగనివాళ్ళచేత చదివించటానికి ఇష్టంలేకపోయింది. మా ఇంట్లో ఒకచదువుకున్న పిల్లవుంది కాని రెణ్ణాళ్ళనుండి అదీ కనపడటంలేదు.—"

"మీ ఇల్లు ఏ తదూరంలో వుంది?" అని అడిగాడు సతీశుడు.

"ఇదే, ఇక్కడే – ఆ గొందిలో మీరు ఎక్కడ వుంటున్నారో చెప్పండి– రేపు తీసుకొచ్చి చదివించుకుంటాను" అన్నది మోక్షదా.

సతీశుడు 'సరే' అని నడుస్తూ తనుఎక్కడ వుండేదీ, ఎటురావలసిందీ అంతాచెప్పాడు. కొంతదూరం వెళ్లినతర్వాత మోక్షదా ఒకచోట హఠాత్తుగా ఆగి "ఇక్కడే బాబు మాయిల్లు, ఒక్కసారి దయచేస్తే..." అన్నది.

ఇవ్వాళ అతనికి మెస్సుకు పెందలాడే వెళ్లటానికి బుద్ధిపుట్టటంలేదు. పొద్దుపోయేవరకు ఏదోవిధంగా గడిపి, సావిత్రి ఇంటికివెళ్లిపోయిన తర్వాత వెళదామనుకుని బైలుదేరాడు.

సతీశుడు ఒకనిమిషంసేపు నుంచుని ఆలోచించి "సరేపద" అన్నాడు.

రెండు మూడు సందులుదాటి ఇద్దరూ ఒక ఇంటిముందుకు వచ్చారు. మోక్షదా ఆగి "కొంచెం నుంచోండిబాబు !" అని లోపలకు వెళ్లింది. కొంచెం సేపటికి ఒకదీపం చేతపట్టుకువచ్చి, సతీశునికి దారిచూపిస్తూ తనవెంట పైకి తీసుకువెళ్లింది. పైన గదిలో దీపం వెలుగుతూవుంది. ఆగది చూపించి "వినయంగా మీ రాగదిలో కూర్చుని వుండండి, నేనువెళ్లి తాంబూలం తీసుకువస్తాను" అని వెళ్లిపోయింది. సతీశుడు గదిలోకివెళ్లి, గది పొందికా, అందమూ, చూచి ముగ్ధుడయ్యాడు. ఒకవైపున బల్లమీద ఇత్తడిసామానులు తళతళ మెరుస్తున్నాయి. దాని పక్కగా దణ్ణెంమీద పొందికగా గుడ్డలు వేసివున్నాయి. దర్వాజా పైగూట్లో—ఎనిమిది అంకెమీదవున్న చిన్నముల్లుతో ఒక చిన్న టైంపీసు టిక్ టిక్ మంటూవుంది. మల్లెపూలలా మంచంమీదవేసివున్న పక్క మీదకూర్చుని గదిలో ఇంకేమేమి సామానువుందో పరికించసాగాడు. అన్నిటి కంటే ముందుగా చక్కగా సర్దియున్న చిన్నపుస్తకాల బీరువామీద పడింది అతనిదృష్టి. లేచివెళ్లి దానిలోంచి ఒక పుస్తకంతీసి పేజీతిప్పాడు. దానిమీద 'భువనచంద్రముఖోపాధ్యాయ' అని వ్రాసివుంది. ఆ పుస్తకం యధాస్థానంలోపెట్టి ఇంకా రెండుమూడు పుస్తకాలు తీశాడు. వాటిమీద ఆ పేరేవుంది. మళ్లా మంచమీదకొచ్చి కూర్చున్నాడు.

ఇంతలో మోక్షదా తాంబూలం తీసుకువచ్చింది. సతీశుడు ఆమె చేతులోంచి తాంబూలం తీసుకుని "ఈగది చాల పొందికగా వుంది. వదిలి పెట్టి వెళ్లబుద్ధి కావటంలేదు" అన్నాడు.

మోక్షదా చిరునవ్వునవ్వి "తొందరేమున్నది. కూర్చోండి. ఇది నా గది కాదు బాబు ;ఇంకో అమ్మాయిది" అన్నది.

"ఆమె ఎక్కడికి వెళ్లింది ?"

"ఆమె ఎక్కడో మెస్సులో పనిచేస్తూవుంటుంది. చాల ప్రొద్దుపోయి గాని ఇంటికిరాదు. అందుకని తాళం నా చేతి కిచ్చిపోతుంది" అన్నదిమోక్షదా.

"అయితే, భువనబాబు ఎప్పుడు వస్తాడు.

"భువనబాబు ఎవరు ?" మోక్షదా ఆశ్చర్యంతో అడిగింది.

"భువనచంద్ర ముఖోపాధ్యాయ; నువ్వెరగవూ ?"

మోక్షదా మొహం చిట్లించుకుని "ఇంకెందుకు వస్తాడు ?" అన్నది. విరక్తగా.

"చనిపోయాడా ?"

"పోలేదు. పోయినా బాగుండేది. బ్రాహ్మణులు, భగవత్తుల్యులు వారి మీద ద్వేషం పెట్టుకుని కోపభాజనం కావటమెందుకని వూరుకున్నానుగాని, లేకపోతే ఈ సారి కనపడినప్పుడు మొహాన కళ్లాపి చల్లుదును" అన్నది మోక్షదా సగర్వంగా.

"భక్తితో అంతపని చేస్తే పరవాలేదుకాని, కోపంతో బ్రాహ్మణ్ణి అంత పని చెయ్యకు. అసలు అతను ఎవరు.?" అన్నాడు సతీశుడు నవ్వుతూ.

మోక్షదా మండిపడి, "బ్రాహ్మడు కాదు, మాడిపోయినవాడు ! పాపం ఈ పిల్లను ఎందునూ కాని దాన్ని చేసిపోయాడు. ఇదేనా మానవుడు చేసేపని ?" అన్నది.

"అతను ఎవరేమిటి ? ఏమిచేశాడు ?" అన్నాడు సతీశుడు చాలవుత్సుకతతో.

"అతన్ని మీరు ఎరుగరులెండి, తెలుసుకుని మాత్రం ఏమిచేస్తారు ?" బైటనుండి సమాధానం వచ్చింది.

సతీశుడు త్రుళ్లిపడ్డాడు.

మోక్షదా వెనక్కి తిరిగిచూచి—"వచ్చి ఎంతసేపయింది సావిత్రీ ?" అన్నది.

సావిత్రి గదిలో ప్రవేశిస్తూ "ఇప్పుడే వస్తున్నాను పిన్నీ ! నీకు ఈ దొరగారు ఎక్కడ దొరికారు ?" అన్నది.

"మా చిన్నబాబుగారు వీరే సావిత్రీ ! ఇంటిదగ్గరనుండి వుత్తరం వచ్చింది, చదివిద్దామని తీసుకువచ్చాను ?"

"అయితే నీగదివుండగా నా గదిలోకి తీసుకువచ్చావెందుకు ?"

మోక్షదా ఖిన్నురాలై "అలా కోపగించుకుంటా వెందుకే సావిత్రీ! నా గది పెద్దమనుష్యులు కూర్చోటానికి ఏమైనా తగివుందా? మర్యాదగలవారు, కలిగిన మారాజులు వస్తే సంతోషించాలా, ఇలా కోపగించుకోవాలా?" అన్నది.

సావిత్రి నవ్వుతూ "కోపమేముంది పిన్నీ? ఏమీలేదు. అయితే, బాబుగారికి నోరు ఏమీ తీపిచెయ్యవూ? ఏమి కావాలి బ్రాహ్మణ దేవతా?" అన్నది.

సతీశుడు చాలా సిగ్గుతో తలవంచుకు కూర్చున్నాడు. తలతిప్పుతూ "ఏమీ అవసరంలేదు." అన్నాడు.

సావిత్రి మాటలుచూచి మోక్షదా ఆశ్చర్యంతో "ఏమి మాటలే అవి సావిత్రీ! పెద్దమనుష్యులతో ఇట్లాగేనా మాట్లాడేది?" అన్నది.

సావిత్రి ప్రయత్నపూర్వకంగా నవ్వుఆపుకుని "నేనేమి అమర్యాదగా మాట్లాడాను పిన్నీ! పోనీ ఇక అలా మాట్లాడనులే. ఇప్పుడైనా వెళ్ళి దుకాణంనుంచి ఏమైనా తీసుకురా. ఇంతలో నేను తక్కిన పనులన్నీ సిద్ధం చేస్తాను" అన్నది.

మోక్షదా నోట్లో ఏదో గొణుకుంటూ వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళిన తర్వాత "నిన్న సాయంత్రంనుండి తిండితిప్పలు లేకుండ ఎక్కడ తిరుగుతున్నారు? లేవండి, స్నానంచేసి కొద్దిగా భోంచేద్దురుగాని" అన్నది,

సతీశుడు తలకాయ తిప్పుతూ "నాకు ఆకలిగాలేదు." అన్నాడు.

"లేకపోయినా సరే తినక తప్పదు. ఒకటి: మీకు ఆకలిగా లేదంటే నమ్మను, ఇక రెండవది..."

"నువ్వు ప్రతిదానికీ పట్టుపట్టి కూర్చుంటావు రెండోవాళ్ళమాట చొరనియ్యవు" అన్నాడు సతీశుడు గంభీరంగా.

సావిత్రి అతని మొహంవంకచూచి చిరునవ్వుతో "ఇంకా జాగారమెందుకు? త్వరగా లేచి పదండి" అన్నది.

సతీశుడు మరింత గంభీరుడై "జాగారమేమీలేదు—ఇందాక రెండవది అన్నావేమిటి? అది చెప్పనంతవరకు కదలను" అన్నాడు.

సతీశుని పట్టుచూచి సావిత్రి లోలోన నవ్వుకుంది. కొంచెంసేపు మెదలకుండావుండి "ఇవ్వాళ మీరు ఇక్కడకు రావటం నా అదృష్టం. మీ పాదధూళితో మా యిల్లు పావనమైంది. ఇవ్వాళ నేను పుట్టినరోజు ఏమీ తిన

కుండా ఎలా వెళ్ళనిస్తాను !" అని కొంచెంసేపు ఆగి, "భగవంతుడు నా అదృష్టం కొద్దీ మిమ్మల్ని మా అతిథిగా పంపించారు. ఏమైనా ఎంగిలి చెయ్యక తప్పదు. దక్షిణకూడా స్వీకరించాలి. ఇవ్వాళ కొంచెం మీ కులగోత్రాన్ని మర్చిపోవాలి" అన్నది చిరునవ్వుతో.

సతీశుడు ఒక నిట్టూర్పు విడచి "నిజంగా ఇవ్వాళ నువ్వుపుట్టిన రోజా సావిత్రీ !" అన్నాడు.

"అవును బాబూ !"

"అయితే ఇవ్వాళ బజారు మిఠాయి, చదిపూరీలు ఎట్లాతింటాను? అదిగాక ఏనాడైనా తిన్నానా ?"

సావిత్రికి ఈసంగతి తెలుసు. కొంచెంసిగ్గుపడి "పొద్దుచాలా పోయింది" అన్నది.

"పోతేమాత్రం ఏం? ఇవ్వాళ నాకు మనస్సుకుతిరిగి వెళ్ళినతర్వాత కసురు కొనేవారు, విసురుకునేవారుకూడా ఎవరూలేరు. నువ్వు ఏమైనాచెప్పు సావిత్రీ ! ఇవ్వాళ నేను బజారు వస్తువులు మాత్రం నోట్లో పెట్టను."

"అయితే నేనేలొంగిపోయానులే" అనిసావిత్రి లేచి వెళ్ళిపోయింది.

ఆమె వెళ్ళిపోయిన తర్వాత మెల్లగా పక్కమీదికి పడిగిలాడు. అతనికి ఈ గదినీ, ఈ హంసతూలికా తల్పాన్ని వదిలిపెట్టి వెళ్ళటానికి బుద్ధిపుట్టటం లేదు. కాని ఒక వైపున ఆత్మాభిమానం పట్టుకుబాధిస్తూవుంది. మరోవుపాయం తోచ లేదు. దిండుమీద తలపెట్టుకు పండుకుని కిటికీకేసి చూస్తున్నాడు. సావిత్రివెళ్ళేటప్పుడు బైట గొళ్ళెంపెట్టి వెళ్ళింది గ్రహించాడు. అదీగాక ఇవ్వాళ సంభాషణలో తరచుగా "నువ్వు" ప్రయోగించిందని కూడ తెలుసుకున్నాడు. ఏకాంతంలోనున్న అతని మనసులో ఈ కొత్తవిశేషాలు రెండూ—గాండీవాలై—మాయమంత్రాలు చేయసాగినై. ఇవ్వాళ మధ్యాహ్నమే అతని హృదయం లోంచి ప్రవాహంలో కొట్టుకుపోయిన ప్రేమసలిలమంతా మళ్ళీవచ్చి వేగతో సాగింది. ఆత్మాభిమానం అతని మనసుయొక్క నీచవృత్తిని వేలెత్తి చూపించి వ్యధపెట్టింది.... ఈ ఆలోచనలతో అతను కన్నుమూశాడు కొంచెం కునుకు పట్టింది. ఇంతలో హఠాత్తుగా తలుపుతీసిన చప్పుడై కన్ను తెరచి చూచాడు. సావిత్రివెనక మోక్షదా వుత్తరం చేత పట్టుకొస్తోంది. వుత్తరం సతీశుని చేతికిచ్చి, "చూడుబాబూ అమ్మగారు ఏమని రాశారో ?" అన్నది మోక్షదా.

సతీశుడు—వుత్తరం చూచి ఆవలింపుతూ "ఇంకా రెణ్ణెళ్ళకి గాని రావట" అన్నాడు.

"ఇంకేమీ సంగతులు లేవూ?"

సతీశుడు వుత్తరం మోక్షదా చేతికి తిరిగిస్తూ "విశేషాలేమీ లేవు" అన్నాడు.

"నా జీతం సంగతి........"

"ఏమీ లేదు"

జీతం సంగతి లేదనేటప్పటికి మోక్షదా రుసరుసలాడుతూ "ఆ సంగతే ఎందుకు రాస్తారు, అనవసరమైన సోదంతా రాస్తారుగాని?" అని సతీశుని చేతిలోంచి వుత్తరం తీసుకుని "సావిత్రీ దీనికి రేపు జవాబు రాయాలి. ఆ బాబు గారికి ఫోంచేయ్యి చెప్పేది ఎప్పుడో? పొద్దు పోవటం లేదూ!" అన్నది.

"బ్రాహ్మ[illegible] ఇంగ్లీషు [illegible] దానికే ఫోంచేస్తాడా ఏమిటి?" అన్నది సావిత్రి.

మోక్షదా అసలే రుసరుసలాడుతూవుంది. మరింత మండిపడి— "నీ తెలివి తెల్లార! వీరేమైనా పురోహితులా, పూజారులా సంధ్య వార్చటానికి?" అన్నది.

సతీశుడు నవ్వి "మర్చిపోయావా ఏమిటి మోక్షదా! నేను మా యింటి దగ్గర కూడా నిత్యం సంధ్యావందనం చేస్తూవుండేవాణ్ణి కదూ!" అన్నాడు.

మోక్షదా కొంచెం సిగ్గుపడి "అవును అవును! నా మరుపు మండిపోను" సావిత్రి వంక చూసి "చూడు అమ్మా! లే ఆలస్యం చెయ్యక" అని వెళ్ళిపోయింది.

ఒక గంట సేపటి తర్వాత......సతీశుడు వంటరిగా కూర్చుని భోంచేస్తున్నాడు. గదిలో ఎవరూ లేరు. మోక్షదా వసారాలోంచి యిది చూచి మండి పడుతూ వంటింట్లోకి వెళ్ళింది. సావిత్రి మెదలకుండా కూర్చుని వుంది.

"ఏమే సావిత్రీ! ఇవ్వాళ నీ తెలివి తేటలన్నీ ఏమైనాయే? ఏ ముష్టి వాడికో పెట్టినట్టు పళ్ళెంలో కాస్త కూడేసి నువ్వు ఇక్కడికి వచ్చి కూర్చున్నావు?" అన్నది మోక్షదా.

సావిత్రి ఏవో ఆలోచించుకుంటూవుంది. తుళ్ళిపడి "ఏమైనా అవసరమైతే వారే పిలుస్తారు" అన్నది.

"నీది యింతవయసైనా పాడుబుద్ధి కాకపోతే ఇలా ఎందుకుంటావు? ఇలా పరాయింట చాకిరీ చేసుకుని పొట్టబోసుకునే అవసరమెందుకు వస్తుంది? నువ్వే నలుగురు నౌకర్లను పెట్టుకుని షికారుగా వుండేదానివి"

సావిత్రి నవ్వి "రెక్కలకష్టం చేసుకుని పొట్టపోసుకుంటే ఏం తప్పు పిన్నీ! ఇదేమయినా చెయ్యగూడని పనా ఏమిటి?" అన్నది.

"ఆఁ తప్పేకుండాను. నా వయసులో కాకపోయినా, నీ వయసులో ఇది చెయ్యగూడని పనే!"

"అక్కడ బాబుగారికి భోజనం పెట్టి ఇక్కడకూర్చున్నావుగాని వెళ్ళి కన్నూ చూస్కో. అదృష్టం కలగటానికి ఎంతో సేపు పట్టదు" అన్నది మోక్షదా.

సావిత్రి వెళ్ళబోతూ ఈ మాట విని స్తంభించిపోయి—"ఆ వాగుడు ఏమిటి? వారు వింటారు!" అన్నది.

"వినరులే, ముందు నువ్వు వెళ్ళు. ఇదిగో ఇంకొక సంగతి—భగవంతుడు నీకు కళ్ళిచ్చింది మూసుకుని వుండటానికి కాదు—కొంచెం తెరుచుకొని వుండు—ముందుగానే, బంగారు గొలుసు, వుంగరాల మీదికి దృష్టి పోనివ్వక మనిషి తత్త్వం గ్రహించు" అన్నది మోక్షదా కొంచెం లాలింపుతో.

"సరే" అని సావిత్రి నవ్వుతూ రెండడుగులు వేసేటప్పటికి మోక్షదా మళ్ళీపిల్చి "ఇటురా సావిత్రీ! ఈ మాట వినిపో" అన్నది.

సావిత్రి వెనక్కు తిరిగివచ్చి "ఏమిటీ?" అన్నది,

"ఒక కంచి చీర తీసియిస్తాను, కట్టుకువెళ్ళు"

సావిత్రి నవ్వు అపుకుని "నువ్వు తీసి వుంచు. నేను ఇప్పుడే వస్తాను." అని వెళ్ళిపోయింది.

సతీశుని భోజనమైపోయింది.

సావిత్రి గదిలోకివచ్చి "కూర్పాట్లు పడుతూ భోంచేస్తున్నారేమిటి?"

సతీశుడు తలెత్తి "లేదు" అన్నాడు.

"కాని నిద్ర అమ్మనాయ కళ్ళమీదకివచ్చి కూర్చుంటున్నది."

నిన్న రాత్రి తెల్లవార్లూ నిద్రలేకపోవటంవల్ల — నిజంగా అతనికి నిద్ర పడదోసుకు వస్తోంది. దీన్ని దాచుకుంటూ "ఆఁ నిద్ర వస్తూనే వుంది" అన్నాడు.

"ఇంకో పూరీ వేసుకోండి" అన్నది సావిత్రి.

సతీశుడు గాబరాతో "పప్పు, పద్దు, పాలు, ఏమీ అవసరంలేదు. ఇక తినలేను" అన్నాడు,

బైట చప్పుడువిని మోక్షదా వచ్చి నుంచున్నదని తెలుసుకుంది సావిత్రి. ఆమెకు వినిపించేట్టు "నాకొక మంచి కంచిచీర కొనిపెట్టరు బాబూ!" అన్నది.

ఆమె ఏనాడూ ఏమీ అడిగి ఎరుగదు. ఈమాట విని సతీశుడు చాల ఆశ్చర్యపడ్డాడు. మోక్షదా వచ్చి చాటున నుంచున్న సంగతి అతనికి తెలియదు. ఆమె మొహంకేసి చూచి "నిజంగా నా?" అన్నాడు.

"నిజం కాక అబద్దమా ఏమిటి?"

"కట్టుకునేది ఎప్పుడు?"

"భగవంతుడు కట్టుకునే అవకాశం ఇవ్వాళ కలిగించకపోతే, ఇంకేనాడు కలిగించడూ? అదేమీ అడ్డంకు కాదు. నేను చాకిరీచేసుకు బ్రతుకుతున్నానని మాసిన్నికి నామీద చాలకోపంగావుంది. అందుకని చాకిరీ చెయ్యకుండా కాలు మీద కాలువేసుకుని తినే అవకాశం ఎప్పుడు కలుగుతుందా అని ఆలోచిస్తున్నాను."

"మంచిదేగా!"

"అది చాలదు. ఒక దాసీదాన్నికూడా పెట్టుకోవాలి. లేకే..." అని మాట ముగియకముందే నోట్లో గుడ్డపెట్టుకుని నవ్వు ఆపుకోవలసి వచ్చింది.

మోక్షదా తెలివితక్కువదేమీ కాదు. తక్షణమే సంగతంతా గ్రహించి లోపలకువచ్చి, "బాబుగారు సావిత్రిని ఎరిగినట్టున్నారు." మళ్ళీ సావిత్రి వంక చూచి "ఈ ముసలిదానితో ఈ వేళాకోళమేమిటే! ముందుగా చెబితే నీ బంగారమేమి వూడిపోయేది! ఏమైనా చాలా సంతోషమైన విషయం" అని మెల్లగా బైటికి వెళ్ళిపోయింది.

భోజనమైన తర్వాత సతీశుడు మళ్ళీ మంచంమీదకొచ్చి కూర్చున్నాడు. సావిత్రి తాంబూలం తీసుకువచ్చియిచ్చి, నవ్వుకుంటూవెళ్ళి ఎదురుగా పీటమీద కూర్చుంది.

సతీశుడు హృదయంలో తలవనితలంపుగా ఒక్కసారి తుపాన్ చెలరేగింది. రక్తమంతా పరుగులెత్తుతూ వుంది. శరీరం రోమాంచితమైంది. సిగరెట్టుపీల్చటానికికూడా శక్తిలేకపోయింది. కొంచెంసేపున్న తర్వాత, సావిత్రి హఠాత్తుగా "చాలా ప్రొద్దుపోయింది, ఇక యింటికివెళ్ళరూ?" అన్నది తలఎత్తి.

"వెళ్ళిక ఎక్కడ వుంటాను?" అన్నాడు సతీశుడు నిస్పృహస్వరంతో.

"ఇక్కడ వుండకూడదూ? వెళ్ళిచేసేది మాత్రం ఏముంది? పిన్ని ఇంకా మేలుకొనే వుంటుంది, నేనువెళ్ళి ఆ మొగదిలో పడుకుంటాను. మీరు ఇక్కడ పడుకోవచ్చు" అని సావిత్రి సతీశుని మొహంకేసి చూడసాగింది.

సతీశుడు ఒక క్షణంసేపు మెదలకుండా కూర్చుని "కాదు, వెళతానులే" అన్నాడు.

"వెళుదురుగానిలే కొంచెంసేపు కూర్చోండి" అని సావిత్రి తలుపు వారాకులవేసివచ్చి ఎదురుగా కూర్చుని "ఒక వేళ ఈసంగతి మెస్సులో తెలిస్తే—?" అన్నది.

"ఎలా తెలుస్తుంది?"

"నేను చెబితే—?"

"ఏమని చెబుతావు? అసలు ఏమైనావుంటేగా చెప్పటానికి!"

సావిత్రి చిరునవ్వుతో "ఏమీలేదూ? నిజంగానా?" అన్నది.

సతీశుడు మాట్లాడలేదు.

సావిత్రి మృదుస్వరంతో — "చెప్పేది ఏమీ లేకపోతే సరే, మెదలకుండా ఇంటికి వెళ్ళిపో. ఇంకా ఆ దుర్బుద్ధి కనుక లోపలపెట్టుకు వున్నావంటే అంతా పట్టపగలు చేస్తాను. తెలుసా!" అన్నది.

సతీశునికి ఈ మాటలేమీ అర్థంకాలేదు. కొంచెంసేపు మెదలకుండా వుండి—"చేస్తే నాకు కలిగే నష్టమేముంది? మెస్సులో నాకు విరోధు లెవరూ లేరు" అన్నాడు.

"ఆ సంగతి నాకూ తెలుసు. కాని ఈ బాధ్యత సహజంగా మాపిన్ని తీసుకుంటూ వుంటుంది. ఆమె నాలుకను కట్టువేసే దెలా?"

మోక్షదా పేరువిని లోపల్లోపల కొంచెం భయపడ్డాడు. కొంచెంసేపు వుండి "నాలుగు రూపాయలు చేతులోపెడితే సరి" అన్నాడు.

"నాలుగు రూపాయలు చేతులో పెడితే సరిపోతుందా? అనవసరంగా డబ్బు వ్యయం చెయ్యటమేగాని, దాని నాలుకను కట్టివెయ్యటంకష్టం. ఆమెను డబ్బుతో వశంచేసుకోగలవు, కాని నన్ను—?"

"ప్రేమతో—" సతీశుడు ఒక్కసారి ఆవేశాడు.

సావిత్రి నవ్వుఆపుకొని—"మీరు నాలుగోవారు—" అన్నది.

"అంతే?"

"అంటే, ఇంతకుముందు మరి ముగ్గురు మహాశయులు కూడా నాకు యీవస్తువే _ బహూకరిద్దామనుకున్నారు."

"నువ్వు తీసుకోలేదా ?"

"లేదు. ఆ మౌనం పోగుచేసుకు దాచుకోటానికి నాదగ్గర చోటులేదు."

సతీశుడు మౌనంగా కూర్చున్నాడు. అతనికి మధ్యాహ్నం జరిగిన సంగతులన్నీ జ్ఞాపకమొచ్చాయి. దానితో పాటు _ అతని హృదయంలో ప్రేమసంగుల ఆటుపోటులు కూడా ప్రారంభమైనాయి. అతను సావిత్రి మాటలు _ వేళాకోళమని గ్రహించలేదు, హఠాత్తుగా___"వాళ్ళు వట్టి వెర్రి బాగులవాళ్ళు. ఏమీ కష్టం లేకుండా మడతపెట్టి పెట్టెలో పెట్టుకునే వస్తువును యిస్తామనవలసింది. నేను వాళ్ళకన్న తక్కువ వాణ్ణేమీ కాదు. మీ దృష్టిలో ప్రేమ చాలనిందనీయమైనది, ఘృణితమైనదిగా కనపడు తుందని మరచిపోయాను. ఈ వయస్సులో ఇంత మూర్ఖత్వం వుండకూడదు. సరే, వెళ్తున్నాను" అన్నాడు.

ఈ మాటలు సావిత్రి హృదయంలో శూలంలా గుచ్చుకున్నాయి.

"మీకు" అని సతీశుడు ఆమె వ్యంగ్యోక్తిలో అర్థాన్నో___సావిత్రి గ్రహించలేకపోలేదు. పరిహాసం పోట్లాటలోకి మారటంచూచి ఆమె మెదల కుండా వూరుకుంది. కానిసతీశుడు _ వూరుకోలేదు. "నేలలో పడినచేప కొట్టు కుంటూవుంటే వడ్డునుండి తమాషా చూచినట్టు___నాహృదయాన్ని నేలలో వేసి___తన్నుకు లాడుతూవుంటే తమాషా చూస్తున్నావా ?" అన్నాడు.

సావిత్రి ఈ సారి సహించలేక పోయింది. చివ్వునలేచి నుంచుని "నువ్వు నేలలోపడినా తప్పుకు పోతావు. ఇంకా తన్నుకుంటూవుంటే తమాషా ఏమి చూస్తాను ?" అన్నది.

సతీశుడు ఎగతాళిగా "అలాగా !" అన్నాడు. "కాకపోతే ?" అని అతని మొహంకేసి మిరమిరచూచి___"చరిత్రహీనుడా ? భోగందాని ప్రేమ చూపించి నాముందు ప్రేమ డంబాలు కొడుతున్నావా ? నాయింట్లో కూర్చుని నన్ను అవమానపర్చక వెంటనే ఇక్కడినుంచి పో___" అన్నది.

ఈ మాటకు సతీశుడు ఎత్తి పొడుపుగా "చరిత్రహీనుడు ? సావిత్రీ ! మీతల్లి దండ్రులు నీ పేరు చాలాబాగా ఆలోచించి పెట్టారు" అన్నాడు.

సావిత్రి హృదయం ఉద్రేకంతో మండిపోతూ వుంది. "వెళ్ళిపో" అని అరిచింది.

సతీశుడు, క్రోధావమానాలతో ఆమెవంక కన్నెత్తి చూడకుండానే "కాని, వెళ్ళబోయేముందు, పయట చెంగుతో మళ్ళా ఒకసారి పాదాలు తుడవవూ? లేకపోతే_ఇంకెక్కడైనా వంక వుంటే చూడు__!" అన్నాడు.

తలవని తలంపుగా ఒకరి ముఖంకేసి ఒకరు చూచుకున్నారు.

సావిత్రి కొంచెం దగ్గరకువచ్చి__"నువ్వు కసాయికంటె కఠినుడవు. వెళ్ళు. ఇక్కడనుంచి వెళ్ళిపో. లేకపోతే నీపాదాలముందు తలబద్దలుగొట్టుకు చస్తాను__" అన్నది బిగ్గరగా.

తీవ్రమవుతూవున్న సావిత్రి కంఠస్వరంచూచి సతీశుడు భయపడి మెదలకుండా వరండాలోకివచ్చి ఆగిపోయాడు. అంతా చీకటిమయంగావుంది. దారి కనపడటంలేదు. జేబులో చెయ్యిపెట్టి చూచాడు. నిప్పుపెట్టెలేదు. ఏమీ తోచక అయిదునిమిషాలు కదలకుండా నుంచుని, మళ్ళా సావిత్రి గదివైపుకు బయలుదేరాడు. వాకిట్లోకివచ్చి చూచాడు. సావిత్రి చాపమీద పడివుంది. "సావిత్రీ" అని మెల్లగా పిలిచాడు. పలకలేదు. మళ్ళాపిల్చాడు. పలకలేదు. మొహం దగ్గరకువెళ్ళి వంగిచూశాడు. కళ్ళుమూసుకున్నాయి. కొంచెం అనుమానంతో నొసటమీదచెయ్యేసి చూచి, స్మృతితప్పి పడిపోయిందని గ్రహించాడు. కొంచెంభయంతో చైతన్యశూన్యమైన సావిత్రి శరీరాన్ని మెల్లగా మంచంమీద పండుకోబెట్టి, గుడ్డతడిపి మొహమంతా తుడిచాడు. విసనకర్రతో విసిరాడు. రెండు మూడు నిమిషాలకు సావిత్రి కళ్ళుతెరచి తొలిగిపోయిన పయట సర్దుకుని వత్తిగిలుతో "ఇంకానువ్వు వెళ్ళలేదూ?" అన్నది.

సతీశుడు విసనకర్రతో విసురుతున్నాడు.

సావిత్రి మంచంమీదనుంచిలేచి, దీపంతీసుకు వరండాలోకివచ్చి "దారి చూపిస్తాను. దిగి వెళ్ళిపో" అని దీపంపట్టుకుని వాకిటిపక్కగా నుంచున్నది.

సతీశుడు బైటికివచ్చి, తలఎత్తి ఏదోచెప్పబోతుండేప్పటికి, "చాలు. ఇంకేంచెప్పనవసరంలేదు. నీ శరీరాన్ని ఇదివరకే మలినపర్చావు. అది ఏనాడైనా మాసిపోయేదేగా! కాని ఒక అస్పృశ్యురాలైన కులటను ప్రేమించి భగవంతు

ఇచ్చిన ఆతిథ్యాన్నికూడా మరిచిపోయావు, రేపే మెస్సును వదిలిపెట్టి నువ్వొన్నా వెళ్ళు లేకపోతే నేనన్నా వెళతాను" అని సావిత్రి సమాధానానికి ఎదురుచూడకుండానే టక్కున — తలుపు వేసుకుంది.



సతీశుని హృదయం హైరానపడుతూవుంది. సావిత్రి అతన్ని ఎందుకు ఆకర్షిస్తూవుందో దగ్గరకు వెళ్ళినతర్వాత నిర్దయగా ఇలా గాయపర్చి ఎందుకు దూరంగా తొలగిపోతూవుందో, రాత్రి తెల్లవార్లూ ఆలోచించినా అతనికి అర్థం కాలేదు. నిన్నటిరాత్రి మాటలు ఇంతవరకు అతనిహృదయాన్ని చీల్చివేస్తున్నాయి. ఆ ఆరాటంతో ప్రొద్దున్నే లేచివెళ్ళి ఇల్లు కుదుర్చుకువచ్చి సామానంతా మూట కట్టసాగాడు. ఇదిచూచి మెస్సువారందరికీ ఆశ్చర్యమేసింది. ఆఖరికి బిహారీ కూడా ఆశ్చర్యంతో "ఇంటికి వెళతారా బాబుగారూ?" అని అడిగాడు మెల్లగా,

సతీశుడు ఐదురూపాయలనోటు చేతతీసుకుని "ఇంటికివెళ్ళటంలేదు బిహారీ! స్కూలుకు దగ్గరగా ఒక ఇల్లుదొరికింది, అక్కడికి వెళుతున్నాను" అన్నాడు.

బిహారి ఒక నిమిషంసేపు వుండి—"సావిత్రి ఇంకారాలేదు" అన్నాడు.

సతీశుడు తల ఎత్తకుండానే "రాలేదా? సరే, సామాను సర్దివుంచు నేను ఇంతలో రాఘవబాబుగారి దగ్గరకువెళ్ళి లెక్కలు చూచుకువస్తాను" అని తిన్నగా అతనిగదిలోకె పోయాడు. అతనువెళ్ళగానే అందరూ గుట్టుచప్పుడుగా వుండటం చూచి, తన్నుగురించే ఏదో చర్చజరుగుతూవుందనుకున్నాడు సతీశుడు. రాఘవబాబు నవ్వుమొహంతో "ఇవ్వాళ హఠాత్తుగా ప్రయాణం కట్టారెక్కడికి?" అన్నాడు.

సతీశుడు చేతిలో నోటు టేబులుమీద పెడుతూ, "హఠాత్తుగానే వచ్చాను, హఠాత్తుగానే వెళుతున్నాను. లెక్కచూచి, [illegible]యాఐదురూపాయలు చాలకపోతే కబురంపించండి. తక్కింది పంపిస్తాను" అన్నాడు.

"ఎక్కడికి కబురంపించమంటావు?" అని అడిగాడు రాఘవబాబు.

సతీశుడు మండిపడి దగ్గరకువచ్చి "మీరు ఆనేమాటలు ఏమిటి?" అన్నాడు.

"మామూలుమాటలే మీకు అర్థం కావటంలేదూ? మీరుచేసే పనులూ, మీనడతా మాకు తెలియకపోలేదు సతీశ్ బాబూ! పెండలాడే దయచేస్తున్నారు, మంచిది. ఇంతకాలంనుండి పాముకు పాలుపోసి పెంచిన ప్రతిఫలం ఇదంతా!" అన్నాడు రాఘవబాబు ఈర్ష్యతో.

సతీశుడు రాఘవబాబు చెయ్యిపట్టుకొని "మీరు మాట్లాడేమాటలన్నీ ఏమిటి?"

రాఘవబాబు విదిలించి చెయ్యిలాక్కొని "తెలియునట్లు నటించక త్వరగా పోయి చెయ్యి." అన్నాడు.

ఇంతలో బిహారీ వచ్చి "వారి మాటలకేంగాని పోనియ్యి బాబూ! వారు ఎందుకు మంటగావున్నారో నాకు తెలుసు. తర్వాత చెబుతాలే. ముందు సామాను సర్దుకుందాం పదండి" అన్నాడు. రాఘవబాబు వుద్రేకంతో మండిపడుతూ వెళ్ళిపోయాడు. సతీశుడు మంచంమీద కూర్చుని "అసలు సంగతి ఏమిటి?" అన్నాడు.

"నేనుకూడా మీ వెంట వస్తాను బాబూ! ఇక్కడ వుండను" అన్నాడు బిహారీ.

సతీశుడు ఆశ్చర్యంతో "నా వెంటా? వస్తే ఇక్కడ పనులు ఎవరు చేస్తారు?" అన్నాడు. బిహారి తొణుకూ బెణుకూ లేకుండా, "ఏమో నాకు తెలియదు బాబూ! నేనుకూడా మీవెంట వస్తాను. మీకు నౌకరు లేకుండా ఎలా జరుగుతుందీ?" అన్నాడు,

అసలుసంగతి సతీశుడు ఇప్పుడు తెలుసుకున్నాడు. కొంచెంసేపు మెదలకుండావుండి "బిహారీ! నువ్వు ఈసంగతి మొదటే చెబితే?" అన్నాడు.

బిహారి మాట్లాడలేదు. మెదలకుండా సామానంతా మూటకట్టి నెత్తిన ఎత్తుకు బైలుదేరాడు.

కారేయింట్లోకి వచ్చి, సతీశుడు తను ఇలా ఎందుకు వచ్చాడా? ప్రతివాడూ తన్ను ఎందుకు అవమానం చేస్తుంటే? తన శక్తిని అవగింజంతయినా తగ్గకపోయినా ఎందుకు సహించి వూరుకుంటున్నాడా? అని ఆలోచించసాగాడు. అతనికి తన హృదయదౌర్బల్యంమీద అసహ్యం కలిగింది.

బదులు తీర్చుకునే సామర్థ్యం ఈనాడు అతనిలో ఏమైంది? రాఘవబాబు అనిపోయిన మాటలు ఆ రాత్రి ఘటననే సంకేతిస్తున్నాయి. విపినుని బంటులు గదిలోంచి బైటికి లాగి తన్నేలా తీసుకు వెళ్లిందీ, చీకటిలో మెట్లమీద ఎలా పడివున్నదీ, శబ్దార్థాలంకారాలతో నవ్వుకుంటూ చర్చించుకొని వుంటారని తెలుసుకోగానే అతని హృదయం కంపించిపోయింది. వాళ్లందరిముందూ రాఘవుడు తన్నవమానపర్చి పంపాడు. ఈ మాట విని సావిత్రి ఏమనుకుంటుంది? ఏమీ అనుకోదు. మెదలకుండా నిస్పృహతో విని ఊరుకుంటుంది. సమాధానమేమీ యివ్వదు.

ఇంతలో బిహారీ వచ్చి "స్నానం వేళయింది లేవండి" అన్నాడు. ఇవ్వాళ అతని కంఠంలో విశేషాదరమొచ్చే ధ్వని ఏదో కనపడుతూవుంది.

సతీశుడు వెంటనే లేచి నుంచుని అంగవస్త్రం పైన వేసుకుని స్నానానికి వెళ్లిపోయాడు.

హృదయం తుత్తునియలై పోతున్నప్పుడుకూడా ప్రపంచంలోని ఏ చిన్న పనినీ వుపేక్షించలేము. అతను స్కూలుకని పుస్తకాలు పట్టుకుని బైలుదేరాడు కాని క్లాసుకి వెళ్లలేదు. బైటే అటూ ఇటూ తిరిగి వచ్చేప్పటికి ఒక్కసారి అతని హృదయమంతా నిరాశతో నిండిపోయింది. సామాను చక్కగా పొందికగా సర్దటానికి బిహారీ అనేక ప్రయత్నాలు చేశాడు. కాని అదిచూడగానే బిహారీకి ఇది ప్రథమ ప్రయత్నమని సతీశుడు గ్రహించాడు. అతని అంతర్యంలో బాధ కలిగింది. బిహారీ షర్బత్ చేసుకువచ్చాడు. తాంబూలం సిగరెట్టు తీసుకొచ్చి యిచ్చాడు. అలవాటులేని ఈ వృద్ధునిపనులు చూచి సతీశునికి నవ్వుకుబదులు ఏడుపు వచ్చింది. రాత్రి పక్కమీద పడుకొని అయిందేమిటో అయిపోయింది. ఇంకా ఆ ప్రమేయమే మనసులోకి రానివ్వగూడదనుకున్నాడు. అతను కలకత్తా చదువుకోసమై వచ్చాడు. దానికోసమే వుంటున్నాడు. వుండలేకపోతే తిరిగివెళతాడు. ఇంత అవమానం చేసినా ఎంతసేపూ అతని మనసు ఆమె ధ్యాసలోనే వుంటోంది. బిహారీ ఇదంతా తెలిసివున్నాకూడా సానుభూతి చూపించటానికి ధైర్యం చాలక తలవంచుకుని మెదలకుండా మండిగంమీద కూర్చున్నాడు. కొంచెంసేపుండి "దీపం పెద్దచెయ్యనా బాబూ?" అన్నాడు.

"పెద్దచెయ్యి, అయితే నువ్వు ఎక్కడ పడుకుంటావు?"

"ఇక్కడే, వాకిటిదగ్గర చాపేసుకున్నాను."

"ఈ ఇంట్లో నౌకర్లు పండుకోటానికి వేరే స్థలమేమీ లేదూ?"

"కిందవుంది బాబూ! కాని రాత్రిపూట మీకేమైనా అవసరమైతే?"

"ఏమీ అవసరముండదులే. కిందకు వెళ్లి పడుక్కో, నాకిట్లో మంచులో ఏం పడుకుంటావు?"

"మంచు ఎక్కడ బాబూగారూ!" అని బిహారీ ముసుకుపెట్టుకుని పడుకున్నాడు.

కొంచెంసేపుండి "ఎంత పొద్దుపోయింది బిహారీ!" అన్నాడు సతీశుడు.

"అట్టే పొద్దుపోలేదు. పదిగంటలు కొట్టివుంటాయి."

సతీశుడు మళ్లా కొంచెంసేపు మెదలకుండా వూరుకుని, "అయితే బిహారీ! నీకు సావిత్రియిల్లు తెలుసా?" అన్నాడు.

బిహారీ దిగ్గునలేచికూర్చుని "ఎందుకు తెలియదు! ఎన్నిసార్లు ఆమెను ఇంటికి తీసుకువెళ్లి పంపించివచ్చాను!"

సతీశుడు తర్వాత ఇంకేం అడగలేకపోయాడు. "ఒకసారివెళ్లి చూచిరానా బాబూ?" అన్నాడు బిహారీ.

సతీశుడు ఆతురతతో "నువ్వు ఎక్కడికి పోతావు. చాలా దూరం వుంది" అన్నాడు.

"లేదుబాబూ! ఎంతదూరం!"

సతీశుడు మాట్లాడలేదు. ఏదో ఆలోచిస్తున్నాడు.

"సెలవిస్తే చూచి ఒకగంటసేపట్లో తిరిగివస్తాను బాబూ! ప్రొద్దున కూడా మెస్సులో పనికి రాలేదు. లేవలేదేమో!" అన్నాడు బిహారీ.

"వదులే" అన్నాడు సతీశుడు.

బిహారీ మనస్సులో చాలా వ్యాకులపడ్డాడు. రోజులాగ ఇవ్వాళ అతనికి మాట్లాడే సామర్థ్యం తగినంత వున్నాకూడా, మాట్లాటానికి అవకాశం లేకపోయింది. కొంచెంసేపుండి "కొత్తచోట నిద్ర పట్టనట్టువుంది. లేచి సిగరెట్టు తీసుకురానా బాబూ!" అన్నాడు.

సతీశుడు ఏదో ధ్యాసలోవుండి ఈమాట వినలేదు. ఏదైనా సమాధానం వస్తుందని తలెత్తి చూస్తున్న బిహారీ విసికి నిండా ముసుకు పెట్టుకుని పండుకున్నాడు.

మర్నాడు సతీశుడు స్కూలుకు వెళ్ళిపోయాడు. బిహారీ పని పాటలన్నీ ముగించుకుని, ఇల్లు కొంతవరకు మనిషికి అప్పగించి, పదిహేను రోజుల జీతం వసూలు చేసుకోవాలనే వంకతో పాత మెస్సుకు బయలుదేరివెళ్ళాడు. అక్కడ రాఘవ బాబు ఆఫీసుకు వెళ్ళిపోయాడని విని వంటింటి ముందుకొచ్చి "నమస్కారం పంతులుగారూ!" అన్నాడు. బిగ్గరగా.

వంటబ్రాహ్మడు గంజాయి చిలుముగొట్టం చేతపట్టుకుని, దర్వాజా నానుకుని కళ్ళుమూసుకొని ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు. తృళ్ళిపడి లేచి "నమస్కారం! బిహారీ! రా రా! కూర్చో!" అన్నాడు.

బిహారి దగ్గరకువచ్చి కూర్చున్నాడు. బ్రాహ్మడు అంగవస్త్రం మూట విప్పి కొంచెం గంజాయి బిహారీ చేతులో వేస్తూ "ఏమిటి సంగతులు? అక్కడ వంట ఎవరు చేస్తున్నారు.?" అన్నాడు.

బిహారి లేచి రెండు మూడు నీటిబొట్లు అరచేతులో వేసుకువచ్చి "ఒక దక్షిణాది బ్రాహ్మడు దొరికాడు. ఒట్టిపశువు!" అన్నాడు.

బ్రాహ్మడి కులాసాపడి తలకాయ ఫూగిస్తూ "బ్రహ్మదేవుడు వీళ్ళకి తోకలు ఎందుకు పెట్టలేదో, అదే ఆశ్చర్యం! ఇక్కడికికూడా నిన్న ఒక అడ వియనిషిని తీసుకువచ్చారు. వాడి తెలివితేటలను గురించి నీకేంచెప్పను బిహారీ! వాడి సత్తా కనుక్కుందామని చేతిలో కాస్త గంజాయివేసి నలపరా అన్నా. చెబితే నమ్మవుగాని బిహారీ! ఎందుకూ పనికిరాకుండా చేశాడనుకో. కాని మీకు అక్కడ అంత కష్టముండదనుకుంటాను. సావిత్రి చాల తెలివైనపిల్ల. ఎంత మూర్ఖునికైనా రెండురోజులలో పనిపాటలన్నీ నేర్పుతుంది," అన్నాడు.

అతనుకూడా పనిపాటలన్నీ ఆమెదగ్గర నేర్చుకునే ఇంత నిపుణుడయ్యాడు. వెంటనే — "వండటం, దింపటం, వడ్డించడంతో ప్రాణాలు పోతాయి. ఈ బాబుల్ని సంతృప్తిపరచటం సామాన్యమైన పనిగాదు ఎవరుబడితే వాళ్ళు చేస్తామంటూ బెలుదేరటానికి! నేను ఇక ఇక్కడ వీళ్ళతో యాగలేను బిహారీ! సావిత్రికి నేనుచెప్పానని చెప్పు. ఆమె నాసంగతి చెప్పగానే 'వెంటనేవెళ్ళి ఆ బ్రాహ్మణ దేవతను తీసుకురా బిహారీ! నెలకు రెండురూపాయలు ఎక్కువైతే మాత్రమేం' అంటుంది. నేనువస్తానంటే సతీశ్ బాబుకూడా కాదనడు. నేను వారిస్వభావం బాగా ఎరుగుదును. అన్నిటికంటే గొప్పవిషయం

"బ్రాహ్మణస్య బ్రాహ్మణో గతిః' నాకు రెండు రూపాయలు ఎక్కువిస్తే వారికి తక్కువయ్యేది ఏమీలేదు" అన్నాడు.

బిహారి అతనిమాటలు విన్నతర్వాత "సావిత్రి, అక్కడలేదు పంతులుగారూ!" అన్నాడు.

బ్రాహ్మడికి ఈమాటయందు నమ్మకంలేక నవ్వి "నేను చెప్పానని చెప్పకు. ఆఖరికి ఏమౌతుందో చూదాం" అన్నాడు.

బిహారి తలవంచుకుని గంజాయి నలుపుతున్నవాడల్లా తల పైకెత్తి "నిజంగా పంతులుగారూ! సావిత్రి అక్కడలేదు" అన్నాడు గంభీరంగా.

ఇంత గంభీరంగా అన్నమాటలు బ్రాహ్మణుడు నమ్మక తప్పలేదు. ఆశ్చర్యంతో "ఇక్కడికికూడా రావటంలేదు. ఇంకా మరి ఇరవైనాలుగు గంటలూ రాఘవబాబు సతీశునిగురించి అలా అంటూ తిరుగుతాడెందుకు? నువ్వు ఒకసారి ఆమెయింటికివెళ్ళి చూచిరా" అన్నాడు.

బిహారికి ఆ బ్రాహ్మడియందు అతి శ్రద్ధాభక్తులు. గంజాయి పొడుము అతని చేతిలోవేసి "అయితే సతీశ్ బాబు ఇక్కడనుండి వెళ్ళిపోయింది ఎందుకని అనుకుంటున్నారు వారు? స్కూలుకు దూరమైపోయిందనా? కాని అసలు మర్మం ఇంకా వేరే ఏదో వుందనుకుంటున్నాను నేను" అన్నాడు.

బ్రాహ్మణుడు చిలుము వెలిగించుతూ "అవును ఏదో కుంభకోణమున్నట్టుంది" అన్నాడు. తర్వాత బిహారి రెండు గంజాయి దమ్ములులాగి సావిత్రి ఇంటికి బైలుదేరాడు, సావిత్రికి జబ్బుచేసిందేమోనన్న సందేహంతో.

సావిత్రి ఇంటికివెళ్ళాడు. తలుపుతీసేవుంది. తిన్నగా లోపలకువెళ్ళి చూచి స్తంభించిపోయాడు! విపినుడు తప్పతాగి నిషాతో బల్లమీద పడివున్నాడు. సావిత్రి దగ్గరనే కిందకూర్చొనివుంది. బిహారిని చూడగానే ఆమె మొహం ఒక్కసారి వెలవెలపోయింది కాని వెంటనే తమాయించుకుని బైటకువచ్చి "రా బిహారీ" అని అతన్ని వంటయింటి వసారాలోకి తీసుకువెళ్ళి చాపవేసి కూర్చోబెట్టింది. తనుదగ్గరగా బల్లమీదకూర్చుని అంతా బాగున్నారా బిహారీ!" అన్నది. బిహారి తలతిప్పి అంతా బాగున్నారని చెప్పాడు. తర్వాత సావిత్రికి ఇంకేం మాట్లాడటానికి తోచలేదు. కొంచెంసేపున్న తర్వాత బిహారి హఠాత్తుగా లేచినుంచుని "ఇక వెళతాను, చాలా పనివుంది" అన్నాడు.

సావిత్రి శుష్కస్వరంతో "ఇప్పుడిప్పుడే వెళ్ళి ఏమిచేస్తావు, కూర్చో" అన్నది.

"కాదు వెళతాను" అని బిహారి సాగివెళుతున్నాడు. సావిత్రి అతని వెనకనే వాకిటివరకు వచ్చి "మెస్సువారందరికీ – నామీద చాలకోపం వచ్చిందనుకుంటాను బిహారీ!" అన్నది.

బిహారీ నడుస్తూనే "నాకేం తెలుసు? ఇప్పుడు అక్కడ వుండటంలేదు" అన్నాడు.

"వుండటం లేదూ? మెస్సు తీసేశారా ఏమిటి?" అన్నది సావిత్రి వ్యగ్రభావంతో.

"తీసెయ్యలేదు. సతీశ్‌బాబు ఒక్కడే మెస్సు వదిలిపెట్టి మరోచోటికి వెళ్ళిపోయాడు. నేనుకూడా వారితోపాటు వెళ్ళాను" అన్నాడు బిహారి.

"అయితే, సతీశ్‌బాబు అక్కడనుంచి ఎందుకు వెళ్ళిపోయాడు బిహారీ?"

"చాలా గందరగోళం వుంది" అని బిహారి వెళ్ళిపోతూండేప్పటికి సావిత్రి అతని పాదాలు రెండూ పట్టుకుని "కొంచెంసేపు కూర్చో బిహారీ!" అన్నది వినయంగా.

బిహారి తలతిప్పుతూ "నాకు చాలా పనివున్నది" అన్నాడు.

"అయితే మళ్ళా రేపు ఒకసారి వచ్చివెళతావ్?"

"రాను–" అన్నాడు బిహారి కఠినంగా.

ఒకక్షణంసేపు అతని మొహంకేసిచూచి సావిత్రి అతనిపాదాలు వదిలిపెట్టింది. హృదయంలోంచి దుఃఖం పొర్లుకొచ్చింది. అయినా గంభీరంగా "సరే, వెళ్ళిపో, వెళ్ళి ఇక్కడ సంగతులన్నీ వారికి చెప్పుతావుగదూ!" అన్నది.

ఈమాట బిహారి మనసుకు చివుక్కుమనిపించింది "వారు నీసంగతులు ఏమీ వినదలచుకోలేదు." అన్నాడు.

"వినదలచుకోలేదా?"

"లేదు"

"సరే, ఎప్పుడైనా వినదలచుకుంటే చెప్పు" అన్నది సావిత్రి శుష్కస్వరంతో.

"నాది మీఆడవాళ్ళలాంటి రాతిగుండె కాదు. నాకు దయా దాక్షిణ్యాలు వున్నాయి. అతనితో చెప్పటానికి నాకేంపని ?" అని గబగబ బైటకు వచ్చాడు.

సావిత్రి నిస్తబ్ధతతో అక్కడే చతికిల పడిపోయింది.

ఇవ్వాళ ప్రొద్దున్నే సావిత్రి పూజచేసి రావటానికి కాళీకారేవుకు వెళ్ళింది. ఈలోగా విపినుడు త్రాగి తూలుతూ ఎక్కడినుంచో ఇద్దరు స్నేహితులను వెంబడివేసుకు వచ్చి రెండు రూపాయలు మోక్షదా చేతిలో పెట్టి సావిత్రి గదితాళం తీసుకుని లోపల ప్రవేశించాడు. అంతా తప్ప త్రాగి నిషాలో పడి వున్నారు. సావిత్రికి ఈ సంగతులేమీ తెలియవు. రెండుఝాములైన తర్వాత ఇంటికివచ్చి చూచింది. ఆఇంట్లో అద్దెకువుంటున్న ఆడవాళ్ళిద్దరూ కూడా తప్ప తాగి నిషాలో తెగతిట్టుకుంటున్నారు. మోక్షదా వసారాలో కింద వెల్లికిలా పండుకొని వికృతస్వరముతో పాటలు పాడుతూవుంది. ఇల్లంతా కోడిగుడ్లూ చేపల ముళ్ళతోనిండి అడుగుపెట్టటానికి వీలులేకుండావుంది. మోక్షదా సావిత్రిని చూడగానే చెదరిపోయినట్టు సర్దుకుని పరుగెత్తుకువచ్చి కౌగలించుకొని కూనరాగంతో "ఇటువంటి మంచి మారాజులుండగా, ఇంకా నౌకరీ చేసుకోటం ఎందుకు అమ్మాయ్ ? నేనేదో బీదముండని..." అన్నది.

ఆమె నోటివెంట సారాయికంపు కొడుతోంది. ఏవగింపుతో సావిత్రి ఆమెను దూరంగా నెట్టి "నువ్వుకూడా తాగుతావేమే ? ఈనిషా ఏమిటే ?" అన్నది.

మోక్షదా కిందపడి దొర్లుతూ "నిషా ? ఆఁ నిషాయే ! ఈపిల్లలో ఎవరి నడుగుతావో అడుగు. మోక్షదా తాగుతుందా లేదా అని. ఏమి చెబుతారో? బాగా తాగుతుందంటారు. నేనుకూడా రాత్రింపగళ్ళు సారాయిలో మునిగి తేలిన రోజులున్నాయే ! నిన్నగాక మొన్నటిపిల్లవు నీకేం తెలుసు !" అన్నది అరుస్తూ.

ఆమె అరుపులు పెడబొబ్బలతో రెచ్చిపోవటంచూచి నెమ్మది పరచాలని వుద్దేశంతో "నువ్వు ఎప్పుడూ తాగేదానివి కాదుగాపిన్నీ. నీకు ఇవ్వాళ ఈ బుద్ధి ఎందుకు పుట్టింది. ?" అన్నది సావిత్రి వినయంగా.

మోక్షదా క్రుద్ధురాలై "ఏమిటి? నేను తాగనూ? ఎవరన్నారు తాగనని? ఆలెక్కకొస్తే నాతో ఎవరైనా తాగగలరా? ఎంతతాగినా నాకు

తాగినట్లు వుంటుందనుకున్నావా? కాస్త కూలనుకూడా తూలను. నేను పూరికే దేవురించుకు తాగాననుకున్నావా? ఇంకా వెళ్ళి బాబుగారినడుగు. ఇవిగో రెండు రూపాయలు, చేతులో పెడితేగాని గ్లాసు ముట్టుకోలేను" అని సగర్వంగా పయట చెంగుమూట చూపించింది.

సావిత్రి ఆశ్చర్యంతో "బాబుగారు వచ్చారా ఏమిటి?" అన్నది.

"రాకపోతే ఈ పని ఎవరుచేస్తారు? వారు తాగమనగానే త్రాగా ననుకున్నావా? నాకు సిగ్గూ అభిమానాలు న్నాయి!" అన్నది సగర్వంగా.

ఆమె మాటలువిని దూరంగా నుంచుని తిట్టుకుంటున్న స్త్రీలు ఇద్దరూ కూడా దగ్గరకువచ్చి "మాకేనా సిగ్గూ, అభిమానాలు లేంది! మేము మాత్రం దేవురించుకు తాగామా..." అన్నారు.

వాళ్ళమాట పూర్తి కాకముందే "మా సావిత్రికేం, మహారాజులున్నారు. ఆమె చేతిలో రెండునోట్లు పెడితేగాని గ్లాసు ముట్టదు" అన్నది.

ఈ మాటలు విని సావిత్రి క్రోధాభిమానాలతో "ఆట్టే వాగక నోరు మూసుకో" అన్నది.

"నోరు ఎందుకు మూసుకుంటాను. అసలసింగంతా కుండ బద్దలుకొట్టి నట్టు అనేస్తాను." అన్నది మోక్షదా.

ఈసారి బింకం అందుకొని "కుండ బద్దలుకొట్టినట్టు అనటం నీకేకాదు మాకూ చేతనవును. రెండురూపాయలు చేతిలో పెట్టేప్పటికి గ్లాసు చేతపట్టుకు న్నావు. ఇంకాయిస్తే..." అన్నది.

మోక్షదా మండిపడి "చిన్ననోటికి పెద్దమాట!......" ఇంకేదో అన బోయేప్పటికి సావిత్రి ఆమెను తీసుకుపోయి గదిలోపెట్టి గొళ్ళెం వేసింది. లోపలనుండి నోటికివచ్చిన తిట్లన్నీ పల్లించసాగింది.

సావిత్రి మళ్ళీ తిరిగివచ్చి "మీరుకూడా వెళ్ళిపొండి బిమా! తప్పంతా నాది" అని బతిమాలి పంపివేసింది.

సావిత్రికి క్రోధం, క్షోభలతో ఆత్మహత్య చేసుకోవాలనిపించింది. సతీశుడు సిగ్గులేకుండా పట్టపగలు ఇలా తాగి తందనా లాడతాడని ఆమె ఎప్పుడూ వూహించనుకూడా లేదు. వుక్రోషంతో ఆమెహృదయం జ్వాల లెత్తుతూవుంది. రెండురోజులకు పూర్వం నానా మాటలుపడి, అవమానంతో

వెళ్ళిపోయినవాడు ఆత్మగౌరవాన్నంతా చంపుకుని, సిగ్గువిడచి వచ్చి హద్దులు తప్పి ఇంత నీచంగా ప్రవర్తిస్తాడని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. ఏమీ తోచక సావిత్రి శిలలాగ నిలబడిపోయింది. గదిపైపుకు వెళ్ళటానికి కాళ్ళాడలేదు. ఆరోజున చేతిలో చెయ్యివేసి ఇంకెప్పుడూ త్రాగనని ఒట్టువేసుకున్నవాడు, తప్ప తాగి నిషాలో వున్నవాని ముఖం ఎలా చూడనా అని ఆలోచించ సాగింది.

ఇంతలో ఇంటి యజమానురాలి పిలుపు వినిపించింది. ప్రయాగలో వెంట్రుకలు తీయించుకువచ్చిన తర్వాత ఆమె ఆచారాలకు అంతువుండటం లేదు. ఆమె ఎక్కడినుంచో వచ్చి బొమికలు, చేపముళ్ళతో ఇల్లంతా విరజిమ్మి వుండటం చూచి మండిపడుతూ "నిన్ను మంచిదానవనుకున్నాను. ఈ అనాచారమంతా ఏమిటే సావిత్రీ?" అన్నది.

"నేను ప్రొద్దుటినుండి ఇంటిదగ్గరలేను" సంక్షిప్తంగా సమాధాన మిచ్చింది సావిత్రి.

"ఇప్పుడున్నావుగా! ఈ బొమికలు, ఈ ముళ్ళలో కాలుపెట్టటానికి సందులేకుండా, ఈ అనాచారమంతా ఏమిటి? ఇదంతా ఎవరు బాగుచేస్తారు? నాయింట్లో ఇవేమీ సాగవు" అని గోడపక్కనుండి అంగలు వేసుకుంటూ పోయింది. సావిత్రి ఇల్లంతా బాగుచేసి స్నానంచేసి తడిగుడ్డలతో వచ్చింది. చీరకోసం గదిలోకి వెళ్ళక తప్పలేదు. వాకిట్లోకి వెళ్ళి తప్పతాగి పడివున్న విపినబాబును చూచిన తర్వాత స్తంభించిపోయింది. శరీరమంతా కంపించింది. తల తిరిగింది. తల వాకిటికానించి నిర్జీవిలాగ చతికిల బడిపోయింది.

కొంచెంసేపటికి తిప్పతగ్గినా తలెత్తలేకపోయింది. ఇంతకుముందు ఆమె దుఃఖతో, క్షోభతో ఇంత సిగ్గులేనివాడయ్యాడు, నీతిమాలినవాడయ్యాడని నిందించిన సతీశుడుగాడు. ఇతను మహోవ్యక్తి. ఇది కళ్ళారా చూచినా కూడా ఆమె హృదయభారం తగ్గలేదు. ఆమె కళ్ళల్లో నీరు తిరిగినై.

ఇంత దుఃఖంలో సతీశుని ఎప్పుడు క్షమించిందో, అతన్ని చూడాలనీ మాట్లాడాలనీ, తృష్ణ ఎప్పుడు కలిగిందో, సేవ చెయ్యాలని సుఖపెట్టాలని కోర్కె ఎప్పుడు కలిగిందో బహుశా ఆమె అంతరాత్మకుకూడా తెలిసివుండదు.

## ౧౦

సతీశునికి రాత్రింబగళ్ళు ఆలోచనలలో విశ్రాంతికూడా వుండటం లేదని అతని మనసుకు కూడా తెలుసు. ఈ ఆలోచనలతో కాయంలాంటి అతని శరీరంకూడా కృశించసాగింది. ఒకనాడు బిహారీని పిలచి "మళ్ళా ఒకసారి మూటా ముల్లె కట్టవలసివచ్చేట్టున్నది. ఇవ్వాళ సాయంత్రం బండికి ఇంటికి వెళదామనుకుంటున్నా" అన్నాడు.

"మీవూరు వెళతారా? లేకపోతే పడమటకా?" అన్నాడు బిహారి.

"పడమటికే వెళ్ళాలని వుంది" అని సతీశుడు కావలసిన వస్తువులు తీసుకు రమ్మని అతనిచేతికి డబ్బు యిచ్చి బడికి వెళ్ళిపోయాడు.

ఈమాట వినేప్పటికి బిహారీ సంతోషానికి అంతులేదు. అతనిది కూడా పడమట మేదినీపూరు జిల్లాలో ఏదో పల్లెటూరు, ఇవ్వాళ వెళ్ళేది కూడా ఆ ప్రాంతాలకే. చాల వుత్సాహంతో మూటాముల్లే కడుతున్నాడు. ఇంతలో వంటబ్రాహ్మడు వచ్చి భోజనానికి పిలచాడు. బిహారి నవ్వుతూ—"నా భోజనం మూతపెట్టి వుంచి నువ్వువెళ్ళి భోంచెయ్యి పంతులూ! ఇప్పుడు నాకు చావటానికికూడా తీరిక లేదు" అన్నాడు.

పనిపాటలన్నీ ముగించుకుని అతను బజారుకు బయలుదేరి వెళ్ళాడు. ఇవ్వాళ అతను పాఠమెన్సులో పంతులునుకూడా కలుసుకురావాలి. సావిత్రితో సంబంధం ఆరోజుతోనే వదలిపెట్టాడు.

ఇవ్వాళ ప్రొద్దుటినుంచీ సతీశునికి తలనొప్పిగావుంది పన్నెండు గంటలకు అతను మంటల జ్వరంతో స్కూలునుంచి వచ్చి పండుకున్నాడు. బిహారి పదిగంటలకే సామానంతా సర్ది బజారుకు వెళ్ళాడు. చుట్టుపట్ల స్ఫోటకం వుందని విని భయపడ్డాడు. మర్నాడు జ్వరం ఎక్కువైంది. వళ్ళంతా నొప్పులుగా వున్నాయి. సతీశుడు చింతావదనంతో "జ్వరం తొందరగా తగ్గేట్టులేదు. నువ్వొక్కడివే వుండగలవా బిహారీ!" అన్నాడు.

బిహారీ కళ్ళల్లో నీళ్ళు తిరిగినై "భయమేమీలేదుబాబూ! రెణ్ణాళ్ళలో తగ్గిపోదూ?" అని ధైర్యం చెప్పాడు,

సతీశుడు ఒక్కక్షణంసేపు మెదలకుండా వుండి "సావిత్రికీసంగతి తెలిస్తే వస్తుంది. డాక్టరునుకూడా పిలువవలసి వచ్చేట్టున్నది" అన్నాడు.

బిహారికి ఈసంగతి సావిత్రికి తెలియజేయటం యిష్టంలేదు కాని అతను ఆ భావాన్ని కప్పిపెట్టుకుని "సరే, సావిత్రికోసం వెళ్ళివస్తానులే" అన్నాడు వినయంగా.

సతీశుడు సావిత్రికోసం ఎదురుచూస్తున్నాడు. కొంచెంసేపటికి, జ్వరం, వంటినొప్పులుకూడా తగ్గాయి. రెండుగంటలకి బిహారి తిరిగివచ్చి "ఆమె ఇంటి దగ్గరలేదు బాబూ!" అన్నాడు.

"ఇంటిదగ్గర లేకపోతే మెస్సులోవుందేమో చూచి రాకపోయావా?"

"ఇప్పుడు ఆమె అక్కడ పని మానుకుంది బాబూ! రెండురోజుల నుంచి ఇంటికికూడా రావటంలేదట. ఎక్కడికి వెళ్ళిందోకూడా తెలియదట" అన్నాడు.

"మోక్షదాకు కూడా తెలియదా?"

"లేదు. ఆమెకుకూడా ఏమీ చెప్పలేదట."

సతీశుడు మాట్లాడలేదు. బిహారి కళ్ళు తుడుచుకుంటూ బైటికివచ్చి నుంచున్నాడు. సావిత్రి చరిత్ర అంతా అతను మోక్షదా ద్వారా విన్నాడు. కాని సతీశునిముందు బైటపెట్టి చెప్పలేకపోయాడు.

మర్నాడు డాక్టరువచ్చి మందు యిచ్చిపోయాడు. అతను వెళ్ళి పోయిన తర్వాత సతీశుడు మందు కిటికీలోంచి బైటికి పారెయ్యటం చూచి, కంటనీరు పెట్టుకొని సావిత్రికోసం బెలుదేరాడు బిహారి. మోక్షదా పాట చేస్తోంది. "ఇవ్వాళ కూడా రాలేదా?" అడిగాడు బిహారి.

రాలేదు నాయనా! నీకు ఎన్నిసార్లు చెప్పాను, అది ఇక ఇక్కడికి రాదని! కష్టాలొచ్చినప్పుడు పిన్ని జ్ఞాపకమొచ్చిందిగాని, ఇప్పుడెందుకు వస్తుంది దాని అదృష్టం పండింది." అన్నది మోక్షదా.

బిహారి తిరిగివెళ్ళి "సావిత్రి ఇవ్వాళకూడా ఇంటికి రాలేదట" అని చెప్పాడు సతీశునికి.

రెండురోజులలో సతీశుని జ్వరం తగ్గింది. బిహారిని పిలిచి "ఇవ్వాళే బెలుదేరి వెళదాం" అన్నాడు. ఆసాయంత్రం బండికే కలకత్తానుండి ఇంటికి ప్రయాణమై వెళ్ళిపోయాడు.

## ౧౧

సతీశుని శుష్కవదనంకేసి చూచి "నువ్వు డాక్టరీ చదువుతున్నట్టు నీ మొహమే చెబుతున్నది" అన్నాడు వుపేంద్రుడు

సతీశుడు నవ్వుతూ "ఇక నా వల్ల కాదు బాబూ." అన్నాడు.

"ఏమి కాదు నీవల్ల?" వుపేంద్రుడు ఆశ్చర్యంతో అడిగాడు.

సతీశుడు సిగ్గుపడుతూ "ఈ డాక్టరీ చదువు నా వల్ల కాదు" అన్నాడు.

వుపేంద్రుడు స్నిగ్ధదృష్టితో క్షణంసేపు దృఢమైన సతీశుని శరీరంకేసి చూసి "మంచిపని చేశావు. లేకపోతే పల్లెటూళ్ళకు వెళ్ళి ఈ తెలిసీ తెలియని వైద్యంతో ఎంతమంది ప్రాణాలు తీసేవాడివో? భగవంతుడు ఆ పాపం తగల కుండా నిన్ను రక్షించాడు" అన్నాడు.

నెలరోజుల తర్వాతసంగతి. ఒకనాడు ప్రొద్దున్నే సతీశుని పిలచి "కలకత్తా వెళదాం వస్తావా సతీశ్?" అన్నాడు వుపేంద్రుడు.

సతీశుడు చేతులు జోడించి "నమస్కారం చేస్తాను. ఆమాట అనవద్దు అన్నయ్యా!" అన్నాడు. సతీశుడు పైకి గంభీరంగా అన్నా, అతని కంఠ స్వరం ఆంతర్యంలోని ఆ వ్యథను మాత్రం దాచలేకపోయింది. తెచ్చిపెట్టుకున్న అతని నవ్వు ఆవేదన రూపంలో పరిణమించింది. వుపేంద్రుడు అతని మొహం కేసి ఆశ్చర్యంతో చూడసాగాడు. సతీశుడు అక్కడ ఏదో కుంభకోణం చేసి వచ్చాడని అనుమానం కలిగింది. "సరే రావద్దులే. నీఆరోగ్యంకూడా బాగున్నట్టు లేదు" అన్నాడు.

వుపేంద్రుని మనసులో భావాన్ని గ్రహించి "ఎప్పుడు వెళతారు?" అన్నాడు.

ఇవ్వాళే"

"ఇవ్వాళేనా? అయితే నేనూ వస్తాను" అని సతీశుడు ఇంటికి వెళ్ళి పోయాడు. ఇంటికివెళ్ళగానే "బిహారీ మళ్ళా ఒకసారి పెట్టెబిగించు, కలకత్తా వెళ్ళాలి" అన్నాడు.

"ఎప్పుడు బాబూ?" బిహారి కొంచెం విచారంతో అడిగాడు.

సతీశుడు నవ్వి "ఎప్పుడేమిటి? ఇవ్వాళ రాత్రిబండికి" అన్నాడు.

"సరే" అని బిహారి ఒకనిట్టూర్పు విడచివెళ్ళి పోయాడు.

సతీశుడు అతని మొహంకేసిచూచి ఇక్కడకు వచ్చిన తర్వాత పనిపాటలు తక్కువ, సుఖపడిపోయాడు. మళ్ళా అక్కడికి వెళ్ళితే బండచాకిరి చెయ్యాబడుతుందని అయిష్టంగా వుందనుకున్నాడు మనసులో. 'నువ్వు వృద్ధుని హృదయాన్ని బాగా అర్థంచేసుకోలేక పోయావ్ సతీశ్' అన్నది అతని అంతరాత్మ.

అక్కడికి వచ్చిన తర్వాత సతీశుడు ఒకరోజున మాటల సందర్భంలో "సావిత్రి ఇప్పటికివచ్చి వుంటుంది. అప్పుడు ఎక్కడికి వెళ్ళిందో నీకు తెలుసా?" అన్నాడు బిహారితో.

"తెలియదు బాబూ!"

చెప్పదలచుకుంటె అతనికి ఈవిషయం తెలియకపోలేదు. కాని ఒకరోజున సావిత్రి ఎదుట తన సుగతనాన్ని గురించి సగర్వంగా చెప్పుకున్న అతను ఈవిషయం బైట పెట్టలేక పోయాడు.

కూతవేసి రైలు బైలుదేరిన తర్వాత వుపేంద్రనాధుడు బెడ్డుపరచి పండుకొని నిద్రపోయాడు. కాని సతీశుడు కిటికీలోంచి బైటికిచూస్తూ కూర్చున్నాడు.

ఎక్స్‌ప్రెస్ ప్రతిస్టేషనులోనూ ఆగదు. వాయువుతో పందెంవేసి పరుగెత్తుతూవుంది. దాని వేగాన్ని అంచనా వెయ్యటానికి కామాను పక్కనున్న చెట్లూ చేమలూ వెనక్కి పరుగెత్తుకుపోతున్నాయి. దూరంగా, దిగంతంలో చెట్లు, పొదలు, చీకటి వక్రరేఖలా గీచివుంచాయి. వాటిక్రిందనుండి ప్రవహిస్తున్న సెలయేళ్ళు వెన్నలవెలుగులో పుట్టలోకిపోతున్న నాగుపాములా మెరుస్తున్నాయి. ఇదిచూచి సతీశుని కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. ఈదారిన అతను ఎన్నోసార్లు ప్రయాణంచేశాడు. ఈ నిస్తబ్దశాంతి ప్రకృతిని ఇలా మసక వెన్నెలలో ప్లావితమవటంకూడా అనేకసార్లుచూచాడు. కాని ఏరోజూనా అది ఈ విధంగా అతని హృదయంలో నాటుకుపోలేదు. పెట్టె అంతా నిశ్శబ్దంగా వుంది. కళ్ళు ముసుకొని పండుకున్నాడు. నిద్రపట్టలేదు. పెట్టెలోంచి మురళితీసి వాయించడం మొదలు పెట్టాడు.

ఉపేంద్రుడు మెదలకుండా నిద్రపోతున్నాడు. భగవంతుడు సతీశునికి పాడటానికి గొంతూ, వాయించటానికి చేతులూ యిచ్చాడు. ఈవిషయంలో అతను కృపణత వహించలేదు. ఇంతవరకు సతీశుడు సంపూర్తిగా నేర్చుకున్న

విద్య ఈ ఒక్కటే. పక్కమీద కూర్చుని వాయిస్తున్నాడు. కాని అతని పాండిత్యాన్ని పరికించేదెవరు? ఆకాశంలో చంద్రుడు దానికి ముగ్ధుడై కామానువెంట పరుగెత్తుకువస్తున్నాడు. నేలమీద నిద్రపోతున్న వెన్నెలకు మెలకువ వచ్చింది. బండివేగం మందగించింది. స్టేషను దగ్గరకు వచ్చిందని గ్రహించి అతని మురళి తీసి పెట్టెలో పెట్టాడు.

ఉపేంద్రుడు లేచి కూర్చుని అభినందిస్తూ "నేనెప్పుడైనా నేర్చుకోదలచు కుంటే తప్పకుండా మురళి నేర్చుకుంటాను. ఆరోజున నువ్వు సితార్ వాయిం చటంచూచి, డబ్బు తగలేసి నేనుకూడా ఒక సితారు కొన్నాను" అన్నాడు.

సతీశుడు నవ్వి "ఇంటికివెళ్ళిన తర్వాత డబ్బు తగలేసి మురళి కూడా కొనేవ్! మీరు మురళి వాయించటం మొదలుపెడితే చుట్టుపక్కలవాళ్ళు కాపరాలు పీక్కుపోతారు." అన్నాడు. ఉపేంద్రుడు దానికేమీ నొచ్చుకో కుండా "సరే, నేర్చుకుంటే మీయింటిదగ్గరకొచ్చే నేర్చుకుంటాను" అన్నాడు. ఇద్దరూ పకపక నవ్వుకున్నారు.

మర్నాడు రెండుగంటలకు స్టేషను దగ్గరకు వస్తుందనగా—"నువ్వు ఎక్కడకు వెళతావ్ సతీశ్?" అన్నాడు ఉపేంద్రుడు.

సతీశుడు ఆశ్చర్యంతో "ఇదేమిటి? రమ్మని తీసుకువచ్చి ఎక్కడికి వెళతావని అడుగుతారు?" అన్నాడు.

అప్పటి సంభాషణ అంతటితోనే ఆగిపోయింది.

స్టేషనులో దిగగానే సూటులోనున్న ఒక బెంగాలీబాబు వచ్చి, ఉపేంద్రునికి షేక్‌హేండ్ యిచ్చాడు. అతను ఉపేంద్రనాథుని మిత్రుడు బారిష్టర్ జ్యోతిషరాయ్. ఉపేంద్రుని తీసుకువెళ్ళటానికి స్టేష నుకు వచ్చాడు. బైట నుంచునివున్న బండిమీద ముగ్గురూ ఎక్కారు. బిహారి బండివాడిపక్కన కూర్చున్నాడు. కొంచెం సేపటికి బండి ఒక విశాల భవనం ముందుకొచ్చి ఆగింది.

* * *

ఇంకెక్కువ ప్రొద్దులేదు. సాయంకాలం కావస్తోంది. సతీశుడు, ఉపేం ద్రుడు ఒక గొంది మలుపుకువచ్చి నిలబడ్డారు.

"తప్పకుండా ఈ గొందే అయివుంటుంది" అన్నాడు ఉపేంద్రుడు

సతీశుడు అనుమానంతో "ఈ గొందిలో నాలెవ్వరికీ వుండరు. ఇది నరకానికి దారిలాగ కనపడుతూవుంది" అన్నాడు.

వుపేంద్రుడు నవ్వుతూ "అయితే నువ్వు ఇక్కడే వుంచో నేను వెళ్ళి చూచివస్తాను" అన్నాడు.

సతీశుడు మొదట అడుగులేగులబోయి మళ్ళా వుపేంద్రుని వెనక నడుస్తూ 'నాలాంటి బ్రహ్మచారికూడా ఇలాంటి చోటికి రావటానికి సాహసించలేడు మీరు నిర్భయంగా వెళ్తున్నారు" అన్నాడు.

ఉపేంద్రుడు నవ్వి "బ్రహ్మచారులకు సంసారులకంటే ఎక్కువ ధైర్య ముంటుంగా!" అన్నాడు.

సతీశుడు దీనికేమీ సమాధానం చెప్పకుండా అడుగులో అడుగువేసి నడుస్తున్నాడు. కంద గొంది అంతా మురుగుతో దుర్వాసన కొడుతూ వుంది. కాళ్ళు జారుతూ వున్నాయి. సతీశుడు వుపేంద్రుని చొక్కా చెంగు పట్టు కొని "ఈ చేసే పనేమిటి? అనవసరంగా ప్రాణాలెందుకు పోగొడతావు?" అన్నాడు.

"ఇప్పుడు నాకు బాగా గుర్తువచ్చింది. ఇక్కడే, ఆ కనపడేయిల్లు దాటిన తర్వాత పదమూడోయిల్లు. ఎనిమిదేళ్ళక్రితం ఒకసారి మాత్రం వచ్చాను. అందుకని మొదట తికమకపడ్డాను. ఇప్పుడు గుర్తువచ్చింది ఇదే దారి" అన్నాడు వుపేంద్రుడు.

సతీశుడు ఈమాట నమ్మలేదు. "దారే! కాని ఇప్పుడు వెళ్ళలేం. ఇంటికి తిరిగి వెళదాంపద" అన్నాడు విసుగుతో.

వుపేంద్రుడు మాట్లాడకుండా సతీశుని చెయ్యిపట్టుకుని లాక్కెళ్ళి ఒక యింటిముందు ఆగాడు. "నీ జేబులో నిప్పు పెట్టెవుంటే వెలిగించిచూడు ఎన్నో నెంబరు ఇల్లో!" అన్నాడు.

సతీశుడు నిప్పులపుల్ల గీచిచూచి "ఆఁ ఇదే! తలుపుమీద తారుతో పదమూడు వేసివుంది. పదమూడువున్నా, పద్నాలుగున్నా మీకు ఇక్కడేమి పని?" అన్నాడు.

వుపేంద్రుడు దానికేమీ సమాధానమివ్వకుండా తలుపుకొట్టి "హారన్. హారన్!" అని కేకవెయ్యసాగాడు. అంతా అంధకారమయంగావుంది.

ఎక్కడా చడీ చప్పుడు లేదు. సతీశునిగుండె దడదడ లాడుతూవుంది. వుపేంద్రుడు మళ్ళా కేక వెయ్యసాగాడు.

కొంతసేపటికి పై కిటికీనుండి స్త్రీకంఠంతో "ఎవరు?" అన్న పలుకు వినిపించింది.

"హారన్ బాబుగారు బాగున్నారా? కొంచెం తలుపుతీయండి" అన్నాడు వుపేంద్రుడు.

"వస్తున్నాను నుంచోండి"

తలుపు తెరచిన శబ్దంతోపాటు చిన్న వెలుగు ఒకటివచ్చి వాకిట్లో పడింది. వుపేంద్రుడు వాకిట్లో కాలు పెట్టి చూడగానే స్తంభించిపోయాడు. తలుపుతీసిన స్త్రీ దీపంపట్టుకుని ఒకపక్కగా నుంచునివుంది. తల నున్నగా దువ్వుకొనివుంది. అందమైన మొహంమీద చందనపు తిలకం దీపంవెలుగున మెరుస్తూవుంది. ఆమె చంచల నేత్రాలలో జీవజ్యోతులు పరుగులెత్తుతున్నాయి. పెదవుల మీద స్మితరేఖలు నాట్యమాడుతున్నాయి. సతీశుడు మెల్లగా వుపేంద్రుని వీపు తట్టాడు. వుపేంద్రుడు తృళ్ళిపడి "హారన్ బాబుగారు ఏమిచేస్తున్నారు?" అన్నాడు.

"పైన పండుకొనివున్నారు. కదలలేకుండా వున్నారు. వారితల్లికూడా ఏడెనిమిదిరోజులనుంచి లేవటంలేదు. ఏజబ్బూలేకుండా తిరుగుతున్నదాన్ని నేనొక్కదాన్నే! తమరేనా వుపేంద్రబాబుగారు! ప్రొద్దుకూకిపోయింది. రేపు వస్తారేమోననుకున్నాం. వంటింట్లోవుంటే కింద కేకే వినపడదు. పైకివెళదాం పదండి?" అని దీపం చూపెడుతూ "చూచి జాగ్రత్తగా నడవండి మెట్లరాళ్ళు చాలా కదలిపోయినాయి" అని [illegible] మెట్లకేసి చూస్తూ [illegible] వుంది.

శిథిలమైపోతున్న రెండంతస్తుల భవనం. పై అంతస్తులో ఆరు గదులున్నాయి. వాటిలో రెండు [illegible] పోయినాయి. ఒకటి వ్రాగుతూవుంది. తక్కిన మూడింటిలో [illegible] న్నారు [illegible] వెళ్ళగానే [illegible] గా [illegible] ఇంటికివచ్చి [illegible] నొచ్చుకున్నాడు. గదిలో [illegible] పాతపరుపులో నూనె [illegible] చెల్లాచెదరౌతూ [illegible] తున్నాయి. మనుషుల [illegible], వెలుగు [illegible] ఎక్కడెక్కడ [illegible] నాయి. గచ్చునిండా పగిలిపోయినబల్లలూ, విరిగిపోయిన కుర్చీలు, ఖాళీసీసాలు

చెల్లాచెదురుగా వున్నాయి. ఒక బల్లమీద చిరిగిపోయిన పాతపరుపూ దిండ్లూ వున్నాయి. పక్కనే చాపపరచివుంది. ఇది అతిథులకు విడిదిస్థలం.

స్త్రీ దీపం దీసుడు మీదపెట్టి "కొంచెంఆగండి. నేను చెబుతాను" అని ఆమె బైటకువెళ్ళగానే సతీశుడు ఒక్కసారి ఎగిరిదూకి చెప్పుల కాళ్ళతోనే ఆ బల్లమీద నుంచున్నాడు.

ఉపేంద్రుడు అనుమానంతో "అరే! అరే! ఇదేమిటిరా?" అన్నాడు.

సతీశుడు తడబడుతూ "ప్రాణం దక్కించుకోనా, శిష్టాచారం చూడనా అరె బాబూ! కనపడటంలేదూ, వెలుగురాగానే పాములూ, తేళ్ళు మొదలైన జీవరాసులన్నీ పరుగులెత్తుతున్నదీ?" అన్నాడు.

అక్కడవున్న పరిస్థితి, సతీశుని మాటలూ విని వుపేంద్రుడుకూడా భయంతో ఒక్కసారి ఎగిరి బల్లమీద కూర్చున్నాడు.

ఆబల్ల ఇదరు మనుషులు నిలబడటానికికూడా చోటు లేకపోవటంవల్ల పడతామని భయంతో ఒకరినొకరు వాటేసుకున్నారు. ఇంతలో ఆ స్త్రీ వచ్చి వాకిట్లోనుంచుని పకపక నవ్వింది. వీరెందుకు యిలా భయపడుతున్నదీ ఆమె గ్రహించి "మామగారు కూర్చునే కచేరీగదిని ఇలా అవమానపర్చకండి" అన్నది.

వుపేంద్రుడు సిగ్గుపడి వెంటనే బల్లమీదనుంచి దిగి "వీడు భయ పెట్టాడు..." అన్నాడు సతీశునిమీదకోపంతో.

కాని సతీశుడు బల్లమీదనుండి దిగకుండానే వినయంగా "నేను వూరికే అనుమానంతో భయపెట్టలేదు. నావిద్య చాణుక్య శ్లోకాలు వల్లించటం వరకే నైనా ఆత్మసంరక్షణ సర్వప్రథమ కర్తవ్యమని, ముఖ్యమైన ధర్మమనిమాత్రం గ్రహించాను" ఆ స్త్రీవైపుచూచి "అయితే మీరేచెప్పండి ఆత్మరక్షణకోసం సురక్షితమైన స్థలం చూచుకోటం వుచితమూకాదా? మీమామగారి కచేరీని అవమానపర్చటానికి నాకెక్కడి ధైర్యముంది? అతిథులకు సన్మానంచేసే ఆశ్రిత జనుల స్వేచ్ఛావిహారంకోసం తక్కినచోటంతా వదలి ఈ కాస్తచోటులోనే నుంచున్నాను" అన్నాడు.

"ఏమీ పరవాలేదు" అని సతీశుని మొహంకేసిచూచి కిలకిలా నవ్వింది. "మీరు నిర్భయంగా రాజదర్శనానికి రావచ్చు. ప్రజలు అంత అత్యాచారులు కారు" అన్నది.

ఈచిన్న పరిహాసం— ఈ అపరిచిత స్త్రీతో చనువు ఏర్పడే అవకాశం కలిగించింది. ముగ్గురూ నవ్వుకుంటూ బైటికివచ్చారు. ఈపేదయిల్లాలు ఈచిన్న పరిహాసానికేమీ బాధపడలేదనీ, దానిలో సరసత గ్రహించిందనీ ఆమె స్మిత వదనాన్నిబట్టి తెలుసుకున్నాడు సతీశుడు. వుపేంద్రుడు ఆమెమొహంకేసి చూచి "మీప్రజలు మీమీదుంటే అతనిమీదేమీ అత్యాచారానికి పూనుకోను కుంటాను. ఇక కిందకుదిగి వచ్చినా ఏమీపరవాలేదుగా?" అన్నాడు.

మరొకగదిలోకివచ్చి చూడగానే వుపేంద్రుడు, సతీశుడూ ఇద్దరూ ఒక్కసారి స్తంభించిపోయారు. కులాసాలోనున్న కుర్రవాడిని మాష్టరు లెంప కాయకొట్టినప్పుడు వాడిమొహంలో కలిగేమార్పే వీరిద్దరిలోనూ కనపడింది.

అలాగేచూస్తూ వుండిపోయి కొంచెంసేపటికి వుపేంద్రుడు మంచం దగ్గరకువెళ్ళి "హారన్‌బాబూ!" అన్నాడు.

హారన్ మెల్లిగా మంచాన్ని అంటుకువున్నాడు. కంపితస్వరంతో "రా బాబూ! రా! లేచి కూర్చోలేకుండా వున్నాను. నిన్నుచాల కష్టపెట్టాను" అని చెప్పసాగాడు.

వుపేంద్రుడు అతని మంచంమీద ఒక పక్కగా కూర్చున్నాడు. అతని కళ్ళల్లో నీరు తిరిగింది. హృదయాన్నికూడా కంపింపజేసే నిట్టూర్పు ఒకటి గొంతువరకువచ్చి ఆగిపోయింది. ఇకతర్వాత మాట్లాడించటానికి నోరాడలేదు. పళ్ళుబిగువున హృదయంలోంచి పొంగుకొస్తున్న దుఃఖాన్ని అపుకుని కూర్చు న్నాడు. సతీశుడు దగ్గరగా ఒక పెట్టెమీద కూర్చున్నాడు.

మురికితో మలినమైయున్న మంచం. మంచంతలవైపున మినుకు మినుకు మంటున్న క్షీణజ్యోతి. మంచంమీద మృత్యాసన్నమైయున్న హారన్. సూర్య రశ్మికీ గాలికి మొహంమాచిన ఈగది నలువైపులా అంధకార బంధురంగావుంది. రాత్రింబగళ్లు బంధించబడియున్న చలనంలేని మలినపువవనం ముక్కులు బద్దలు గొట్టివేస్తూవుంది. యమదూతలువచ్చి గుమ్మంవద్ద నుంచున్నారా అనిపిస్తూవుంది. ఈదృశ్యంచూచి సతీశుడు కంపించసాగాడు. ఒక్క పెడబొబ్బపెట్టి బైటికి పారిపోతే అతని ప్రాణంకూడా దక్కదనిపించింది. ఈగదిలో మనుషులు వుండేదెలా? దగ్గరగా ఇల్లాలు నుంచునివుంది. ఆమె మొహంకేసిచూడగానే సతీశునికళ్ళకు ఆమోహినీరూపం, ఆ కిలకిలనవ్వు, ఆమే ప్రేతలోకపు పిశాచిని లా కనిపించింది. కంపించిపోయాడు. భర్త చావు బతుకులమీదవుంటే నవ్వుతూ

వేలుతూ మాట్లాడుతుంటెందుకు? తలగువృత్తుంటుందేం? బొట్టుకూడ పెట్టు కుంటుంది, అని ఆలోచించసాగాడు. కొంతసేపు అతని హృదయంలో ఈ స్త్రీ జాతి అంతటిమీదా ఈర్ష్య కలిగింది.

"కిరణ్, వుపేంద్రనాధుడు వచ్చాడని అమ్మకు తెలుసా?" అన్నాడు హారన్ అలసటతో.

భార్యదగ్గరకువచ్చి "నిద్రపోతూవుంది. నిద్రలో ఎప్పుడూ లేపవద్దని చెప్పాడు డాక్టరు" అన్నది.

హారన్ కోపంతో అరుస్తూ "కూలబడ్డాడులే డాక్టరు. నువ్వువెళ్ళి అమ్మతో చెప్పు" అన్నాడు.

వుపేంద్రుడు దగ్గరేనుంచుని వింటున్నాడు. కొంచెం వినుగుతో "ఇప్పుడు లేపటమెందుకు హారన్ బాబు? రేపుప్రొద్దున చెప్పకూడదూ?" అన్నాడు.

చాలకాలంనుండి జబ్బుతో వుండటంవల్ల హారన్ కి మతిపోయిందను కున్నాడు వుపేంద్రుడు. ఆ నిరపరాధ సేవాపరాయిణిని అనవసరంగా కసురు కున్నాడే అని బాధపడుతూ సానుభూతి చూపాలనే తలంపుతో ఆమె మొహం కేసిచూచాడు. కాని నీడలలోనున్న ఆమె మొహం కనపడలేదు. కొంచెం సేపు అలాగే నిలబడివుండి చివ్వున ఇంట్లోంచి బైటికివెళ్ళిపోయింది. వుపేం ద్రుడు వుదాసీనతతో కూర్చునివున్నాడు. హారన్ బాబు రొప్పుతూ పండు కున్నాడు. సతీశుడు ఈగృహం కేసిచూచి భీతిపడుతున్నాడు. కొంచెంసేపున్న తర్వాత హారన్ బాబు వుపేంద్రుని వీపుతట్టి ఏడెనిమిదేళ్ళకు మళ్ళా ఇప్పుడు కలుసుకున్నాం! ఎప్పుడూ ఈవైపుకు రాలేదూ?" అన్నాడు క్షీణస్వరంతో.

ఈ ఏడెనిమిదేళ్ళలో వుపేంద్రుడు కలకత్తాకు చాలాసార్లు వచ్చాడు. ఆ సత్యాన్ని దాచాలనే తలంపుతో మరోప్రసంగం తీసుకువచ్చి "ఏం జబ్బు హారన్ బాబూ?" అన్నాడు.

"ఏమనిచెప్పను. దగ్గు, సాలి. ఇంకా వాటినిగురించి ఎందుకులే కాలం దగ్గరకు వచ్చిందిగా" అన్నాడు హారన్.

పెట్టెమీద కూర్చునివున్న సతీశుడు తలకాయ వంచుకున్నాడు.

"మొదటే నీసంగతి జ్ఞాపకమొచ్చినట్లయితే ఇంతవరకు వచ్చేదికాదు." కొంచెంసేపు మెదలకుండావుండి "సరే, అయిపోయిందేమో అయిపోయింది,

ఇప్పుడెందుకు ఆ సంగతులన్నీను? ఆఁ వుపేంద్ర్! నువ్వు ప్లీడరివి కనుక ఒక పని చెయ్యి. నా పేర రెండువేల రూపాయలకు జీవితభీమా, ఇల్లూ వుంది. ఇవన్నీ నీ అధీనంలో వుండేట్లు వ్రాయించు. అప్పు వుంటే నీదగ్గరే వుంటుంది." అన్నాడు హారన్ మళ్ళా.

"మరి మీభార్య?" అన్నాడు వుపేంద్రుడు.

"నాభార్యా కిరణ్! అవును ఆమే వున్నది. తలిదండ్రులు కూడాలేరు. సరే, ఆమెనుకూడా కనిపెట్టుకువుండు" అన్నాడు హారన్.

వుపేంద్రుడు ధ్యానంతో అతని మొహంకేసిచూస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు.

సతీశుడు జేబులోంచి గడియారంతీసి చూచి "పదిగంటలైంది. వారు అక్కడ మనకోసం ఆతురత పడుతూవుంటారు" అన్నాడు లేచినుంచుని.

హారన్ అతనివంక చూచి "ఈయనెవరు వుపేంద్ర్?" అన్నాడు.

"మా స్నేహితుడు. నావెంట వచ్చాడు. సరే, వెళుతున్నాను. రేపు ప్రొద్దున మళ్ళా వస్తాను"

"రేపు వద్దుగాని, కాగితం రాయించి ఎల్లుండి రా. అయితే ఎక్కడ ఆగావు?"

"ఒక స్నేహితుని ఇంటివద్ద"

వారు వెళ్ళబోతూ వుండేప్పటికి "కిరణ్ దీపం!" అని కేకేశాడు హారన్.

అవసరంలేదు బాబూ! సతీశునివద్ద నిప్పులపెట్టె వుంది. ఆమె పనిమీద వుండివుంటుంది." అన్నాడు వుపేంద్రుడు మధ్యలోనే ఆపి.

తర్వాత ఉపేంద్రునికి హారన్ ఏమి చెప్పాడో ఎవరికీ తెలియదు. తలుపు తెరవగానే బైట కాటు చీకటి చూచి సతీశుడు కొంచెం వెనక్కి తగ్గాడు.

"ఏమిటి సతీశ్?" వుపేంద్రుడు అడిగాడు.

"ఏమీలేదు నువ్వు ముందుపద" అని వుపేంద్రుని చెయ్యి పట్టుకున్నాడు. ఇద్దరూ బైటవసారాలోకి వచ్చారు. చీకటిరాత్రి. మబ్బు బాగా పట్టివుంది. చుట్టుపట్లవున్న ఎత్తయిన మేడలు చీకటిని ఇరుకు గొందుల్లోకి, వసారాల్లోకి పంపినాయి. ఇద్దరూ మెట్లదగ్గరకు రాగానే క్రింద సన్నని వెలుగు కనపడింది. కిరణ్మయి దీపం పట్టుకుని కూర్చునివుంది వీరిని చూడగానే

లేచినుంచుని "దీపం చూపిస్తాను, కొంచెం ఆగండి. మీకోసమే నేనిక్కడ ఎదురుచూస్తూ కూర్చున్నాను" అన్నది.

తనకోసం ఎదురుచూస్తూ చీకట్లో కూర్చున్న ఇల్లాలి భవిష్యత్తు తలచుకోగానే వుపేంద్రుని కళ్ళల్లో నీరు తిరిగినై.

కింద తలుపు ఇంకా తీసేవుంది. సతీశుడు మెట్లుదిగి సరాసరి గొందిలోకెళ్ళి నుంచున్నాడు.

"మీరు మా కేమౌతారు వుపేంద్రబాబుగారూ?" కిరణ్మయి వెనక నుండి అడిగింది.

ఈ ప్రశ్నకు ఏం సమాధాన మివ్వటానికీ వుపేంద్రునికి తోచలేదు. "మీరు మావారికి బంధుగులా ఏమిటి? నేను కాపరానికివచ్చి ఇంతకాలమైంది. ఎప్పుడూ మిమ్మల్నిగురించి వారూ చెప్పలేదు. అత్తగారూ చెప్పలేదు. మొన్న ఉత్తరం రాసిన రోజునమాత్రం విన్నాను. అందుకని అడుగుతున్నాను" అన్నది మళ్ళీ.

"త్వరగా రా వుపేంద్రబాబూ!" బైటనుండి సతీశుడు పిలుస్తున్నాడు.

"బంధువులమేమీ కాదు. ప్రాణస్నేహితులం మా నాన్నగారు సప ఖీలీలో వుంటూవుండేప్పుడు హరన్ బాబుగారి తండ్రికూడా అక్కడ గవర్నమెంటు స్కూలులో మాష్టరుగా వుంటూవుండేవారు. నాకు ఇంటిదగ్గర ప్రయవేటుకూడా చెబుతూవుండేవారు. మేమిద్దరమూ చాలాకాలం ఒకచోటే కలసి చదువుకున్నాం" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి నవ్వి "ఉహూఁ! అదా సంగతి! అందుకనేనా రాతకోతలు! అయితే వుపేంద్రబాబూ! అంతా మీపేరే రాసివేస్తామన్నారా?" అన్నది.

ఎంతసేపువున్నా వుపేంద్రుడు రాకపోయేప్పటికి సతీశుడు మళ్ళా వాకిటిదగ్గరకు తిరిగివచ్చి "అవును అలాగే నిశ్చయించుకున్నారు" అన్నాడు.

కిరణ్మయి సతీశునికేసిచూచి "సరే, మీరుకూడా వున్నారా? అయితే మంచిదే. ఇంతకాలంనుంచీ కొద్దోగొప్పో వుంటేనే కడుపు నిండేది కాదు. ఇక అడుక్కు తినడం తప్ప మరోదారిలేదు. సరే, అలాగే కానీయండి, అంతా మీరే రాయించుకోండి" అన్నది.

వుపేంద్రుడు స్తంభించిపోయాడు.

"వారి ఆస్తిని వారి యిష్టం వచ్చినవారికి రాసిస్తూంటే కాదంటానికి మధ్య మీకేం అధికారముంది? సతీశుడు సమాధానమిచ్చాడు.

కిరణ్మయి మండిపడి "నాకు అధికారముంది. జబ్బుతో వారి బుద్ధికి మతిచెడింది. ఆ స్థితిలో రాయించుకోటానికి మీా రెవరు?" అన్నది.

సతీశుడు ఏమీ వెరువులేకుండా "కాని హారన్‌బాబుకు ఇంకా మతి వుంది. నా అంతరాత్మే దానికి సాక్ష్యం" అన్నాడు.

కిరణ్మయి మరింత మండి "ఏమి సాక్ష్యం బాబూ! ఏమి చెబుతూ వుంది! ఇలా అనటం స్వభావికమైపోయింది లోకులకు" మళ్ళీ వుపేంద్రుని వంక చూచి "మీారు నన్ను అడుక్కు తినకుండా చెయ్యాలని నమ్మకం ఏమిటి? అన్యాయం చెయ్యరని ఎలా?" అన్నది.

ఇంత పెద్ద అఘాతం తగిలేప్పటికి వుపేంద్రుడు మాట్లాడలేక పోయాడు.

కాని సతీశుడు మృదుస్వరంతో "వదినా! ఈ సంగతుల్ని మీకు ఇప్పుడు చెప్పే అవసరంకూడా లేదు" అన్నాడు.

కిరణ్మయి స్తంభించిపోయింది. ఈ వ్యంగ్యార్థరీతి సంభోధన ఆమెకు ఆశ్చర్యం గొలిపించింది. కొంచెంసేపు మెదలకుండావుండి "అవసరం ఎందుకు లేదూ?" అన్నది.

"లేదు, మీా అధికారాన్ని మీారు పోగొట్టుకోబట్టే హారన్‌బాబు ఈ పనికి తలపెట్టాడు. ఈ అర్ధరాత్రివేళ జగడాన్ని ఇంకెక్కువ పెంచకండి. కొంచెం ఆలోచించుకు చూడండి" అన్నాడు సతీశుడు.

కార్బాలిక్ వాసన తగిలేప్పటికి పడగవిప్పి కాటువేయ వచ్చిన పాము, ప్రాణం దక్కించుకోటానికి పారిపోయినట్లు, ఈ లీలా కుశల నిరుపమ వనిత కొంచెం వెనక్కి తగ్గింది. కొంచెం వినయంగా "నన్నుగురించి ఏమిచెప్పారో కొంచెం చెబుదురు నేనుకూడా వింటాను" అన్నది.

ఉపేంద్రుడు ఇక సహించలేకపోయాడు. కొంచెం వినయంగా "మీారు సతీశుని పిచ్చివాగుడును లక్ష్యపెట్టి అనవసరంగా గాబరా పడటా లెందుకు? భర్తసొత్తు భార్యకు కాకుండా చెయ్యగల అధికారం ఎవరికీ లేదు. మీాకెందుకు మీారు నిశ్చింతంగా వుండండి. హారన్ ఏమీ తెలివితక్కువవాడు

కాదు. వారేది చేసినా మిమ్మల్ని ఆలోచించే చేస్తారు? మీయిష్టంలేకుండా ఏమీ కాదు. చాల పొద్దుపోయింది తలుపువేసుకోండి. పద సతీశ్ వెళదాం" అని సతీశుని చెయ్యి పట్టుకుని బైలుదేరాడు. సతీశుడు చిరునవ్వుతో "నమస్కారం వదినా! మళ్ళా రేపో ఎల్లుండో వస్తాం" అన్నాడు.

## ౧౨

ఇద్దరూ ఆ చీకటిగొంది దాటి బజారులోకివచ్చి బండి మాట్లాడుకుని ఎక్కి మెదలకుండా కూర్చున్నారు. మాట్లాడాలనే తలంపు ఎవరి మనసులోనూ లేదు. మంచిగాని, చెడుగాని తనవిషయంలో కల్పించుకోటం న్యాయంకాదు. వెళ్ళబోయే ముందు వూరికే హారన్ బాబును మళ్ళా ఒకసారి చూచి వెళతాను. ఎనిమిదేళ్ళనుండీ లేనిబాధ్యతలు ఇప్పుడెందుకు? అని అతని మనసులోని బాధను గొంగళి పురుగుని నలిపివేసినట్లు నలిపివేసి నిశ్చింతగా బండిలో కూర్చున్నాడు. సతీశుని వంక చూచాడు. అతను బజారుపక్కనున్న భవంతులకేసి చూస్తున్నాడు. "ఒక సిగరెట్టు ఇటుతే సతీశ్! చాలా చలిగా వుంది" అన్నాడు ఉపేంద్రుడు.

సతీశుడు జేబులోంచి సిగరెట్టు, నిప్పులపెట్టె తీసియిచ్చి మళ్ళా అలాగే చూస్తున్నాడు.

ఉపేంద్రుడు సిగరెట్టు వెలిగించి పొగ వదులుతూ, "లోపలి అంధకారం పొగలాగానే ఎగిరిపోతుంది" అన్నాడు.

సతీశుడు మాట్లాడకుండా అలాగే కూర్చున్నాడు.

బండి గతుకుళ్ళతో ఇళ్ళూ, బజార్లూ దాటిపోతూవున్నాయి. సిగరెట్ కాలి మసైపోయింది. దాని పొగ శూన్యంలో లీనమైపోయింది. ఇద్దరూ బండిలో అలాగే మౌనంగా కూర్చున్నారు. సతీశుడు తప్పకుండా ఈ సంగతులే ఆలోచిస్తూవుంటాడు. ఏదైనా ఒక నిశ్చయానికికూడా వచ్చివుంటాడు. లేకపోతే అతను ఇంతసేపు మౌనంగా కూర్చోగలిగే జీవికాడు అనుకున్నాడు ఉపేంద్రుడు. అతనికి మొదటినుండి చివరివరకు సంగతులన్నీ జ్ఞాపకమొచ్చాయి. వణకిపోయాడు. పాపం అతని సంసారం ఇటువంటి దీనస్థితిలో

వుంది అనుకున్నాడు. అతను అక్కడ చూచినదానికీ విన్నదానికీ ప్రతిదానికీ కారణం లేకుండా వుండదని నిశ్చయించుకున్నాడు. కాని సతీశుడు పాపమా అబలతో నడుం కట్టుకు పోట్లాడినదానికేమీ కారణం కనపడలేదు. సతీశుడు గొప్ప చదువుసంధ్యలు చదువుకోకపోయినా బొత్తిగా తెలియనివాడేమీ కాదు. సరస్వతీదేవి అతన్ని మోసం చేసినా చాణుక్యుడు మాత్రం నిరాదరణ చెయ్యలేదు. ఈవిషయం తెలియకపోతే వుపేంద్రబాబు హారన్‌బాబు గారింటివద్ద చేసిన గల్లంతునుగురించి అట్టే ఆలోచించేవాడు కాదు. ఈ కాసే పట్లోనే వుపేంద్రబాబు అనేక కల్పనలు చేసుకున్నాడు. మరణశయ్యమీద వున్న మిత్రునివద్ద కూర్చుని ఈ అనాథ సుందరినీ ఆజన్మపర్యంతమూ పెట్టి పోషిద్దామనుకున్నాడు. ఎక్కడైనా తీర్థస్థానంలో ఒక కుటీరం వేద్దాం. దాని చుట్టూ లతలూ, చెట్లూ, శిష్టజనులు వుంటారు. ఈ స్త్రీ శ్రద్ధగా గోపూజ చేసుకుంటూ, అతిథి అభ్యాగతుల నాదరిస్తూ వ్రతాలు, వుపవాసాలతో ఆ కుటీరంలో సుఖంగా శాంతజీవనం చేస్తారు అని మనసులో ఒక మధుర కల్పనా చిత్రాన్ని చిత్రించుకున్నాడు, కాని ఇప్పుడు కిరణ్మయి ఆరోపించిన మిథ్యాభియోగం, తప్తనిశ్వాసాలూ, ఒక్కసారి ఆ కల్పనా చిత్రాన్ని భగ్గు మనిపించాయి. ఉపేంద్రుడు మౌనంగా వుండలేకపోయాడు. "ఏమిటి ఆలోచిస్తున్నావ్ సతీశ్?" అన్నాడు.

సతీశుడు వుపేంద్రునివంక చూచి "ఏమిఆలోచిస్తున్నానో తెలుసా వుపేంద్రబాబూ! చిన్నప్పుడు ఒక నవలచదివాను. ఇప్పుడా కథ జ్ఞాపక మొస్తోంది" అన్నాడు.

"ఏమిటానవల?"

"దానిపేరు గుర్తులేదు. రచయితపేరుకూడా జ్ఞాపకంలేదు. ఎవరో ప్రఖ్యాత రచయిత అనుకుంటాను. దానిలో ఒక ఘట్టం చాల అద్భుతమైన ఘట్టం., చాల విచిత్రమైంది కూడాను."

వినట్లానికి కుతూహలంతో వుపేంద్రబాబు అతని ముఖంకేసి చూడ సాగాడు.

"ఉపేంద్రబాబూ! మీరు ఎప్పుడూ ఇంగ్లీషుపుస్తకాలు తప్ప మన పుస్తకాలకేసి కన్నెత్తయినా చూడరుగదా! కాని దేశభాషల్లోకూడా

మంచివిజ్ఞానంగల పుస్తకాలున్నాయని తెలుసుకో" అని ఒక నిట్టూర్పువిడిచి మెదలకుండా కూర్చున్నాడు సతీశుడు.

"అయితే ముందుదానిలోని కథ చెప్పు, తర్వాత చూద్దాం విన్న తర్వాత ఎంతజ్ఞానం కలుగుతుందో?"

సతీశుడు నవ్వుతూ "మీకు ఏమీకోపం రాదుకదా!" అన్నాడు.

"రాదులే. చెప్పు"

"చాల చక్కని కథ ఒకరాజు నౌకాయానం చేస్తూవుంటాడు. ఒకనాటి సాయంకాలం మేఘాలు భయంకరంగా కమ్ముకు వచ్చాయి. గాలికూడా ప్రారంభమైంది. రాజు భయంతో నావను ఒడ్డుకు తోయించుకువచ్చాడు. వర్షం బాగావచ్చేలాగా వుంది. దగ్గరలో ఒక మినుకు మినుకు మంటున్న వెలుగు కనిపించింది. రాజు నావ దిగి అక్కడికి వెళతాడు. అది ఒక పాడుబడ్డ యిల్లు. ఒకగదిలో మరణాసన్నమైన వ్యక్తి మంచంమీద పడివుంటాడు. అతని నూత్న వధువు కిందపడి విలపిస్తూ వుంటుంది. ఆరాత్రి ఆమెకు ఒకస్వప్నం వస్తుంది. అయితే వుపేంద్రబాబూ మీకు స్వప్నాలయందు నమ్మకముందా?" అన్నాడు.

"లేదు, తర్వాత ?" అన్నాడు సతీశుడు కుల్లపంగా.

"తర్వాత ఆవ్యక్తి ఆ రాత్రే చనిపోతాడు. రాజు ఆ తరుణిని ఇంటికి తీసుకువచ్చి బలవంతంగా పెళ్ళాడుతాడు. దేశమంతా అతనిమీద నిందలవర్షం కురిపిస్తుంది. ఈ దుఃఖంతో అతని మొదటిభార్య విషంతాగి ఆత్మహత్య చేసుకుంటుంది." అన్నాడు సతీశుడు.

వుపేంద్రుడు ఈకథచూచి 'విషవృక్షం' లోని కథని గ్రహించాడు. మరొప్పుడయితే సతీశుని జ్ఞాపకశక్తిచూచి ఫక్కుమని నవ్వేవాడే కాని ఈసమయంలో అతనికి నవ్వురాలేదు. దానిలోని కథావస్తువు అతని హృదయాన్ని బాణంలాగ భేదించింది. ఇది సతీశుని జ్ఞాపకశక్తికాదు. అనుమాన మనుకున్నాడు. అనుమానమేమిటి ? దేనికోసం అతను 'విషవృక్షం' లోని కొమ్మలు ఆకులు త్రుంచి కొంత తనకల్పనలు చేర్చినదీ తెలుసుకుని సిగ్గుపడ్డాడు

వెలవెలపోయిన వుపేంద్రుని మొహం చీకట్లో సతీశునికి కనపడలేదు. నిప్పుమీద వుప్పువేసినట్లు "దీన్ని రంధ్రాన్వేషణ చెయ్యవద్దు బాబూ" అన్నాడు.

ఉపేంద్రుడు కొంచెంసేపు మాట్లాడకుండావుండి "అది అలావుంచి, ముందు ఈవిషయంలో నీసలహా యేమిటో చెప్పు ?" అన్నాడు.

సతీశుడునవ్వి "నేను మీకు సలహా యివ్వటంలేదు ఉపేంద్రబాబూ! కాళ్ళుపట్టుకుని ప్రార్థించుకుంటున్నాను. ఇక మీరు అక్కడికి వెళ్ళవద్దు. వారు నాకు మంచివారుగా తోచటంలేదు" అన్నాడు.

"ఎవరు ?"

"కోపగించుకోకు బాబూ! బహువచనం కేవలం శిష్టాచారంకోసం వుపయోగించాను. హారన్‌బాబును గురించి నాకేం సందేహంలేదు. వారికి బాగోగులతో సంబంధమేమీలేదు. వారితల్లిని కంటితోకూడా చూడలేదు. నాలక్ష్యం ఆ మూడవవ్యక్తినిగురించే..." అన్నాడు సతీశుడు.

"మూడవవ్యక్తిచేసిన అపరాధ మేమిటి ? అయితే సతీశ్! మీ ఆస్తి నంతటినీ మీనాన్న ఎవరికైనా పరాయివాడికి రాసియిస్తూవుంటే నువ్వు చూస్తూ వూరుకుంటావా ?"

"వారలా ఎప్పటికీ చెయ్యరు ఉపేంద్రబాబూ! వారు నన్ను బుద్ధివంతుడననీ, గుణవంతుడననీ అనుకోకపోయినా, కనీసం వారికి కొడుకునుగా! వారెప్పుడూ అలా చెయ్యరు. భర్త చావుబ్రతుకులమీద వుంటే నున్నగాతలదువ్వుకొని, కళ్ళకు కాటుకదిద్దుకుని, మొహానబొట్టుతో, నీటుగా గోటుగా ఎవరు తిరుగ కలుగుతారు చెప్పండి! నేను మితిమీరి మాట్లాతున్నానేమో క్షమించండి. మీరు ఒక్కసారి బాగా ఆలోచించి చూస్తే అది హారన్‌బాబు మతిమరపూ కాదు, నా అనుమానమూ కాదు. అది వారి దీర్ఘజీవితంలోని చింతల ఫలితమని మీకే తెలిసి వస్తుంది."

ఉపేంద్రుడు మాట్లాడలేదు. హారన్‌బాబు ఎప్పుడుఏ మాటకు సంకోచపడ్డాడా అని ఆలోచించసాగాడు. "ఉపేంద్రబాబు! హారన్‌బాబు ఆస్తిపాస్తులన్నీ మీకు రాసియిస్తానన్నపుడు భార్యమాటే మర్చిపోయాడనుకోవద్దు. సంకోచంతో చెప్పలేకపోయివుంటాడు. ఈలోగా మీరు అందించకుండా వుంటే వారే స్వయంగా మీకా సంగతి చెప్పేవారని నా నమ్మకం" అన్నాడు సతీశుడు.

ఉపేంద్రుడు లోపల చాల కోపంతో వున్నప్పటికీ అణచుకుని అతని మాటలన్నీ మెదలకుండా వింటున్నాడు. కాని పరస్త్రీ విషయంలో సతీశుని

ఈ అనుమానాలూ, అపోహాలు విని ఇక సహించలేకపోయాడు. "సతీశ్ ! నువ్వింత దిగజారిపోతావని నేనెప్పుడూ అనుకోలేదు నీకు ఏవిషయం ఎలా అర్థం చేసుకోవాలోకూడా తెలియదనుకుంటాను" అన్నాడు కఠినస్వరంతో.

సతీశుడు నవ్వి "ఎలా దిగజారిపోయాను ? చెడును చెడ్డనీ, మంచిని మంచనీ అంటున్నానా ?" అన్నాడు.

"మంచో, చెడ్డో, దానినిగురించి విమర్శించటానికి నీకేం అధికారముంది ?" అన్నాడు.

"అసలు అధికారమంటే ఏమిటి ? అది విదేశీయుల ఆచారం. మనకు అదేమీలేదు. అర్థంలేనిది. మనసంఘంలో అధికారము, అనధికారమునుగురించి ఇంత సూక్ష్మంగా ఆలోచించరు. దొంగతనం చేసి జైలుకు వెళ్ళిన దొంగకూడా 'నువ్వుదొంగవు' అంటే వూరుకోడు."

"అది తర్వాత విషయం చేసిన దొంగతనం రుజూ అయిన తర్వాతేగా దొంగ అనేది, జైలుకు వెళ్ళేదీని. కాని దీనిలో నీకు రుజూ ఏమి దొరికింది ?"

"రుజూ దొరక్కపోయినాకూడా చాలమందికి న్యాయాధికారికృపవల్ల జైలుముఖం చూడవలసి వస్తుంది. మనం వూహించని సంగతి అతను గ్రహిస్తాడు. కాని ఒక్కొక్కప్పుడు మనకు నీరులాగ నిర్మలంగా కనపడుతున్న వస్తువుకూడా అతనికి అగోచరంగా వుంటుంది. నేను కోతలు కోస్తున్నాననుకోవద్దు. చాలమంది ఇంత మహాజగత్తును కళ్ళముందు పెట్టుకుని భగవంతుడు వున్నాడా లేడా అని సందేహపడుతూ వుంటారు. నే నీమాటలంటూవుంటే నీకు కోపం రావటంకూడా సహజమే. ఎందుచేతంటే నువ్వువుండేది మంచివారి సహచర్యంలోనే, మాట్లాడేది మంచివారితోనే. అదీగాక స్వయంగా మంచివాడివికూడాను చూసేది మంచివారినే. కాని నాలాగ మంచీ – చెడూ, రెండూ చూచినట్లయితే మీరే గ్రహించేవారు. నేనింతగా చెప్పే అవసరము వుండేదికాదు."

వుపేంద్రుడు కొంచెంసేపు మాట్లాడకుండావుండి "నీలాగ నేను ప్రతి వస్తువును అంతసూక్ష్మంగా చూచేఅవసరంకూడాలేదు. సరే, ఈ ప్రసంగాన్ని ఇంతటితో ముగించు, బండిగేటులోపలికి వచ్చింది. కాని ఒకమాట జ్ఞాపకం పెట్టుకో సతీశ్ ! పచ్చిదాని విలువ పండినతర్వాతిగాని తెలియదు" అన్నాడు.

మర్నాడు వుపేంద్రుడు నిద్రనుండి లేచేప్పటికి చాల ప్రొద్దెక్కింది. తప్తకిరణాలు కిటికీలోంచివచ్చి అతని మొహంమీద పడేప్పటికి దిగ్గునలేచి కూర్చుని నలువైపులా చూచాడు. సతీశుడు కనపడలేదు. వాకిట్లో నుంచుని వున్న నౌకర్ని పిలిచి "సతీశ్ ఎక్కడికి వెళ్ళాడు ?" అని అడిగాడు. నౌకరు దగ్గరకువచ్చి "తోటలో కుస్తీపడుతున్నాడు బాబూ ! కాఫీ తయారైంది. బాబుగారు మీ కోసం ఎదురుచూస్తున్నారు" అన్నాడు.

ఉపేంద్రుడు వెంటనే కిందకు దిగివెళ్ళాడు. జ్యోతిష్, అతని చెల్లెలు సరోజినీ అతనికోసం ఎదురుచూస్తూ కూర్చున్నారు. ఉపేంద్రుని చూడగానే ఆమె నవ్వుతూ "రాత్రి ఎంతపొద్దుపోయి వచ్చారు బాబూ! హృదయంలేని మిత్రుడెవరైనా దారిలో కనపడి తీసుకువెళ్లాడేమో ననుకున్నాం నేనూ అన్నయ్యాను" అన్నది.

"మిమ్ముల్ని చాల బాధపెట్టాను. ఏదో అవసరమైన పనిమీద పదకొండింటివరకు వుండవలసి వచ్చింది" అన్నాడు సతీశుడు.

"అది మాకూ తెలుసు. పనిలేకుండా వీధుల్లో తిరుగుతున్నాడనుకోలేదు. అయితే సతీశ్ బాబు ఎక్కడ ?,, అన్నాడు జ్యోతిష్.

"తోటలో కుస్తీపడుతున్నాడని చెప్పాడు నౌకరు" అన్నాడు వుపేంద్రుడు. అతన్ని పిలుచుకు రమ్మని నౌకర్ని పంపారు.

నౌకరు వెళ్ళినతర్వాత జోతిష్ వుపేంద్రుని మొహంవంక చూచి "కుస్తీ ఎవరితో ? అక్కడ ఇంకెవరైనా వున్నారా ? అన్నాడు.

"తెలియదు. కసరత్తు చేస్తున్నాడేమో, చిన్నప్పటినుండి అతనికి కసరత్తు చేసే అలవాటుంది" అన్నాడు వుపేంద్రుడు.

నిన్న సాయంత్రం సరోజిని మ్యూజియమ్ దగ్గరనుండి వచ్చేప్పటికి వుపేంద్రుడు సతీశుడూ పథరియా బజారుకు వెళ్లారు. ఆమె సతీశుని చూడలేదు. "సతీశ్ ఎవరు వుపేంద్రబాబూ ! నేను చూడలేదు" అన్నది.

"మా స్నేహితుడు, వయసులో చిన్నవాడైనా...అదే వస్తున్నాడు" అన్నాడు వుపేంద్రుడు.

సతీశుడు దగ్గరకు వచ్చాడు. అతని శరీరంచూచి అంతా ముగ్ధులైపోయారు. సరోజిని ఒక క్షణంసేపటివరకు అతనివంక ఒకే ధ్యానంతోచూచి దృష్టి మరల్చుకుంది.

"మీరు కుస్తీపడుతున్నారని చెప్పాడే నౌకరు? ఏమైనాకాని సతీశ్ బాబూ! మీ శరీరంచూచి మాకు ఈర్ష్యకలుగుతూవుంది. నాలాంటి బక్కప్రాణాలు నాలుగుకలసినా మీకు సరిరారు" అన్నాడు జ్యోతిష్.

సతీశుడు చిరునవ్వునవ్వి "పరీక్ష, పత్రం లేకుండానే ఇంతపెద్ద సర్టిఫికెట్లా! అయినా శారీరకశక్తికి విలువేమివుంటుంది! నాకు ఇంకేశక్తీ లేదుగా!" అన్నాడు.

చివరిమాటలో కొంచెం విచారంకూడా కనపడింది. ఆర్థిక దుస్థితిలో వున్నాడేమో ననుకున్నది సరోజిని. కాని జ్యోతిష్‌బాబు వుపేంద్రునిద్వారా సంగతి సందర్భాలన్నీ విన్నాడు. కాఫీకప్పులు నిండాయి. సతీశుడు గోడమీదవున్న చిత్రంకేసి చూస్తున్నాడు.

"వచ్చి కాఫీ తీసుకోండి సతీశ్‌బాబుగారూ!" అన్నాడు జ్యోతిష్.

సతీశుడు దగ్గరకువచ్చి చిరునవ్వుతో "మీరు కానీయండి. నేను స్నానం చేయుందే ఏమీతీసుకోను" అన్నాడు.

"అరే! నాకీసంగతి తెలియదే. అయితే త్వరగా చేసిరండి. ఎవర్రా అక్కడ...?" అన్నాడు జ్యోతిష్ ఆతురతతో.

"మీరుగాబరా పడనవసరంలేదు. నావేళకు నేను ఎలగూ స్నానం చేస్తాను. అదిగాక నాకుపొద్దున ఏమీ తీసుకునే అలవాటుకూడాలేదు. ఆ భోజనంలో మాత్రం ఇతరులకంటె కొంచెం ఎక్కువ తీసుకుంటాను. ఏమైనా కాని జ్యోతిష్‌బాబు, ఈ కాఫీలు, టీలు తీసుకుని ఆకలి చంపుకోవటం నాకు ఇష్టంలేదు. మీరు తీసుకుంటూ వుండండి, నేనింతలోనే హార్మోనియమ్‌మీద రెండుకీర్తనలు వాయిస్తాను" అన్నాడు సతీశుడు.

పాడుతాననగానే సరోజిని వుత్సాహంతో "ఆఁ తప్పకుండా పాడండి?" అని సిగ్గుతో మళ్లా అడిగింది. ఆమె మాటలు ఆమెకే అసంగత మనిపించాయి. జ్యోతిష్ నవ్వుతూ "మా అమ్మాయికి సంగీతం వుంటేచాలు ఇంకేం అవసరంలేదు. కాదులే, సతీశ్‌బాబు కొంచెం......" అన్నాడు.

ఉపేంద్రుడు సతీశునిమీద లోపల్లోపల విసుక్కుంటున్నాడు. "కాదు లెండి. అతను స్నానం చెయ్యకుండా ఏమీతీసుకోడు. మనం వాడిని బలవంతం పెట్టటం ఇటు కాఫీ చల్లారిపోవడం నాకు యిష్టంలేదు. సతీశ్! నీ సంగీతం

కాస్త కట్టిపెట్టి స్నానంచేసిరా. చాలాపనులున్నాయి" అని కాఫీ కప్పు నోటి కందించాడు.

జ్యోతీష్‌కి సతీశునిమాట నచ్చింది. మనసులో సంతోషించాడు.

సతీశుడు మొదలకుండా ఒక కుర్చీలోకూర్చొని కూర్చున్నాడు. అతనికి పాడాలని వుత్సాహం తగ్గిపోయింది. సరోజిని నిరాశతో కాఫీ కప్పులో పోయసాగింది.

"ఎక్కడికి వెళ్ళినా నాకు పీడిమూలాన విశ్రాంతే దొరకదు. ఎప్పుడూ ఏదో ఒక గొడవ తీసుకువచ్చి పెడతాడు. ఇంకానయం మురళి వాయించుతా ననలేదు" అన్నాడు వుపేంద్రుడు కాఫీ తాగుతూ.

సాయంత్రం "పొద్దున మీరు పాట వినిపించకుండా చాలా అన్యాయం చేశారు" అన్నది సరోజిని వుపేంద్రనాథునితో.

"సతీశుడు రానీ. ఈపూట ఆకొరతకూడా తీరిపోతుంది" అన్నాడు వుపేంద్రుడు.

"అవును ఈపూట చలిలో ఎక్కడికి వెళ్ళటానికీ బుద్ధిపుట్టటంలేదు. ఇలాగైనా కాలం గడుస్తుంది. అయితే సతీశబాబు ఎక్కడికి వెళ్ళారు? కొంపతీసి ఎక్కడికీ వైద్యం చెయ్యటానికి వెళ్ళలేదుగదా!" అన్నాడు జ్యోతిష్.

"స్నేహితుల్ని కలుసురావటానికి వెళ్ళినట్టున్నది"

సరోజిని ఆశ్చర్యంతో "సతీశ్ బాబు డాక్టరా ఏమిటి?" అన్నది.

వుపేంద్రుడు నవ్వుతూ "అవును" అన్నాడు.

కేవలం స్కూలులో చదివినంతమాత్రాన చాలదు వుపేంద్ర్! కొంత కాలం ఏ డాక్టరుదగ్గరైనా ప్రాక్టీసు చెయ్యాలి. లేకపోతే వీరు లోకుల ప్రాణాలు తీస్తారు. నేను ఒక మంచి డాక్టరును చూపిస్తాను. అయినా ఇద్దరికీ లతకలుస్తుందో లేదో..." అన్నాడు జ్యోతిష్.

"అతను తెలివిగలవాడయితే తప్పకుండా కలిసిపోతాడు. లేకపోతే తలకాయలు బద్దలు కొట్టుకునేంతవరకు వస్తుంది" అన్నాడు వుపేంద్రుడు.

"కాదు ఆయన చాల తెలివిగలవాడు" అన్నాడు జ్యోతిష్.

"అయితే మంచిదే. అతిన్ని అర్థంచేసుకుని, అతనిలోని గుణ దోషా లన్నిటినీ గ్రహించి అతనిహృదయాన్ని వశపర్చుకున్నవానికి వాడు ప్రాణాలు

కూడా యిస్తాను. కానీ ముందు వాడి హృదయాన్ని వశంచేసుకోవడమే చాల కష్టం. దుష్టుడు, దుర్మార్గుడూ ఏమీ కాదు. చాలా సుస్వభావం కల వాడు. అతని భోళాతనమే లోకులకు పనికిరాదు. నేను అతన్ని చిన్నప్పటి నుండీ ఎరుగుదున్నాను. కాని ఎప్పుడూ లోపల ఒకటి పెట్టుకుని బైటకు ఒకటి మాట్లాడి ఎరుగడు. అందుకనే అతనంటే నాకింత ప్రేమ."

జ్యోతిష్ నవ్వుతూ "అందుకనేనా అతన్ని వెంటబెట్టుకుని నలుగురిలోకి వెళ్ళితే పిల్లిని చంకపెట్టుకుని పెళ్ళికివెళ్ళినట్టే అన్నారు" అన్నాడు.

ఇంతలో సతీశబాబు రావటంచూచి "అదుగో సతీశబాబు వస్తు న్నాడు" అన్నది వుత్సాహంతో సరోజిని.

సతీశుడు మొదలకుండా అందరికేసి ఒకదృష్టి ప్రసారించి నవ్వుతో "నావిషయమే చెప్పుకుంటున్నట్టున్నారు. నన్ను బైట తలెత్తి తిరుగకుండా చేస్తావనుకుంటూ వుపేంద్రబాబు" అని కుర్చీలాక్కొని కూర్చోబోతూండేప్పటికి వుపేంద్రుడు హార్మోనియం చూపించి "ఇక్కడేల కూర్చుంటావు. కొంచెం అక్కడికివెళ్ళి కూర్చో. ఇప్పుడే సరోజిని పొద్దున పాడకుండాచేశానని నామీద నేరం వేస్తూవుంది" అన్నాడు.

సతీశుడు హార్మోనియంవద్దకూర్చొని "ఇది మురళివాయించేవేళ వుపేంద్రబాబూ" అన్నాడు.

ఆరాత్రి సరోజిని పడుకుంటూ ఒక నిట్టూర్పువిడుస్తూ "వారు మాకు ఏమైనా బంధుగులు కాకూడదూ? సంగీతం వారిదగ్గరే నేర్చుకుంటాను" అను కొని తను నేర్చుకునే సంగీతం మాష్టరును మాన్పించి సతీశుని దగ్గర నేర్చుకో టానికి అనేక వుపాయాలు ఆలోచిస్తూ నిద్రపోయింది.

## ౧౩

ఉపేంద్రుడు, సతీశుడు వెళ్ళిపోయినతర్వాత కిరణ్మయి తలుపు వేసుకొని చాలసేపు అక్కడే నుంచున్నది. ఆమె కళ్ళు రెండూ నిప్పులా మండిపోతు న్నాయి. హృదయం ఆరాటంలో కొట్టుకుంటూవుంది. ఏవరిహృదయమైనా చీల్చితేనైనా శాంతి కలుగుతుందేమో ననుకున్నది. దీపం ఆర్పి "ఈ కొంపకి నిప్పంటించి నాదారిన నేను పోతాను. ఈ ముసలిది లోపల మాడి చస్తుంది.

ఇక నాతో పోట్లాడేవారు, సణిగేవారూ ఎవరూ వుండరు." అని వెర్రిదానిలా అరిచింది, ఆ చలిగాలిలో కూడా ఆమె చెక్కిళ్ల మీద చెమటపోసింది. చేత్తో తుడుచుకొని 'అడగటానికి ఎందుకు వెళ్లాను. గొడవపెట్టి నా కాళ్లమీద నేను వేసుకున్నట్టు ఇదంతా ఆ ముసలిముండ చేసినపని. కొడుకుతో చెప్పి ఈ పన్నాగం పన్నించింది' అనుకున్నది.

సతీశుడు అనిపోయిన మాటలు ఇంతవరకు ఆమె హృదయంలో శూలాల్లాగా ఛేదించసాగినై. వీరిద్దరూ ఏదో పని వున్నప్పటిలో సందేహం లేదు అనుకున్నది. ఏమి విన్నది నిశ్చయించలేక ఆమె హృదయం మంతా ఆరాటపడ సాగింది. ఉపేంద్రబాబు చాలసుంచి రాడు, అతను వచ్చినతర్వాత అంతా చక్కపరుస్తాడు. ఇంకే కష్టాలు వుండవు' అని చెప్పారు తల్లి కొడుకు లిద్దరూను. తను ఎందుకు నమ్మింది? ఎందుకు వుత్తరం రాసింది! ఆ చీకట్లో చిత్తడి నేలమీద ఒక మూలనుంచొని ___ దుర్భాగులని దుష్టులని ఎన్ని తిట్టినా ఆమెకు సంతృప్తి కలుగలేదు. క్రోధవిద్వేషాలతో నిండిన ఆమె హృదయం మరణాసన్నమై మంచంమీద వున్న వ్యక్తి మృత్యువు నాకాంక్షించ సాగింది. "యమదూతలు ఇప్పుడే వచ్చి..." అనేప్పటికి ఆమె గొంతు వణికిపోయింది. తనన్న మాటలు తన హృదయాన్నే వ్యథపెట్టాయి ఆ భీకర సజీవ నిశా సమయాన ఎదురుగా కనపడుతున్న మిద్దెకేసి చూసింది. మిద్దెమీద ఆకులులేని రావిమొక్క కొమ్మలు యమరాజు బాహువుల్లాగ కనపడినాయి. భయంతో కంపించి గబగబా ఆ తగదిలోకివచ్చి తలుపువేసుకుని దుప్పటి ముసుకు పెట్టుకు పడుకుంది.

అత్తకు ఇవాళ కొంచెం స్వస్తత చిక్కింది. ఆకలి దహించుకు పోతోంది. నిద్రపట్టటంలేదు. ఎప్పుడు తెలవారుతుందా అని ఎదురు చూస్తూ వుంది, త్రుళ్ళిపడి "ఎవరు? కిరణ్! ఇప్పుడు వచ్చావెందుకు? హారన్ బాగా వున్నాడా?" అన్నది.

కిరణ్ ముసుకు తియ్యకుండానే "బాగానే వున్నారేమో తెలియదు" అన్నది.

"తెలియదేమిటే? వెళ్ళి చూడలేదూ?" అన్నది దుగ్ధకంఠంతో.

ఆమె ఏడుపుస్వరం చూచి "బాగానే వున్నారు. ఎందుకనో భయంగా వుంది" అన్నది కిరణ్మయి.

అత్త కొంచెం భయంతో మంచంమీదనుండి లేచి "అయితే నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు, వాణ్ణి ఒంటరిగా వదలిపెట్టి?" అన్నది.

కిరణ్మయి అత్తపెట చెంగుపట్టుకొని "నాగుండె చెదరిపోయింది. ఏమిటో నలగా..." అన్నది.

అత్తకు పూర్తిగా వినటానికికూడా ధైర్యంలేకపోయింది. పయటచెంగు లాక్కొని రోగంతో పడివున్న కొడుకును చూడటానికి వెళ్ళింది. కిరణ్మయి మళ్లీ ముసుగుపెట్టుకు నిద్రపోయింది.

మర్నాడు ప్రొద్దున్నే కిరణ్మయి వంటింట్లో కూరలు తరుగుతూవుంది. దాసీదివచ్చి "డాక్టరుగారు వచ్చారు అమ్మగారూ! అని చెప్పింది.

కిరణ్మయి వంచినతల ఎత్తకుండానే "వెళ్ళి, అత్తగారికి ఇవ్వాళ వంట్లో బాగానే వుందని చెప్పు" అన్నది.

దాసీది ఆశ్చర్యంతో కొంచెంసేపు ఆమె మొహంకేసి చూచి "వారు గదిలో కూర్చొనివున్నారు" అన్నది. ఆమె దీనికేమీ ఆతురత కనపర్చ కుండానే స్వాభావికంగా "ఎవరికీ జబ్బులేదు, ఎవరూ వారి దగ్గరమందు తీసుకునేవారు లేరు. ఇంకా ఎందుకు వస్తున్నారో తెలియటంలేదు. నీకెందుకు నీ పని చూచుకో, కూర్చొని కూర్చొని వారే వెళ్ళిపోతారులే" అన్నది. ఈ డాక్టరుమందు పని చెయ్యదన్న సంగతి దాసీకి తెలియకపోలేదు. దీనిలో కొత్త ఏమీలేదు. కాని 'ఎందుకు వస్తున్నారో?' అన్న ప్రశ్న ఆమెకు కొత్తగా తోచింది. నిన్న సాయంత్రం ఇంటికి వెళ్ళిన తర్వాత డాక్టరు ఇంటికి కూడా రానవసరంలేని మార్పు ఏమి కలిగిందా అని ఆలోచించ సాగింది. కొంచెంసేపు మెదలకుండా నుంచుని "కూరగాయలు నేను తరుగుతానులే, నువ్వు ఒకసారి వెళ్ళి చెప్పి రాకూడదు?" అన్నది.

కిరణ్మయి ఒక్కసారి కసురుకొని "నీకెందుకు నువ్వువెళ్ళి నీపని చూచుకో. ఇంకా వండిపెడతాననలేదు నయం" అన్నది. ఈ విదిలింపుతో దాసీది మొహం మునమునలాడించుకుంటూ బైటికివచ్చి "అమ్మగారు పని మీదవున్నారు. మీరు వెళ్ళిపొండి" అన్నది.

డాక్టరు బేగ్ దగ్గర పెట్టుకొని ఎదురుచూస్తూ కూర్చున్నాడు. ఈమాట విని చకితుడై "పనిలేంది ఎవరికి, నాకూవుంది" అన్నాడు.

"వుంటే, మిమ్మల్ని కూర్చోమన్నది ఎవరు?" అన్నది దాసీ.

డాక్టరు కొంచెం సిగ్గుపడి "చాలా అవసరమైన పని వుంది, వెళ్లాలి అని మళ్లా ఒకసారి వెళ్ళి చెప్పిరా" అన్నాడు వినయంగా.

"నేను చాలా చెప్పాను డాక్టరుగారూ! ఇక చెప్పలేను ఇవ్వాళకి వెళ్ళిపొండి" అన్నది దాసీ.

ఈ అవమానమూ, నిర్లక్ష్యమూ చూచి డాక్టరుకి మొదట చాలా కష్టం కలిగింది. కాని మళ్లా ఏమైనా దుర్ఘటన జరిగిందేమోనని విచార పడ్డాడు. కొంచెంసేపు అలాగే కూర్చొని లేచి హేండ్ బేగ్ పట్టుకు బైలుదేరబోయే ప్పటికి ఎదురుగా వాకిట్లో కిరణ్మయి కనపడింది. డాక్టరు "తప్పుకో, వెళ్ళాలి. రోగులు ఎదురు చూస్తువుంటారు. ఇవ్వాళ అత్తగారికి కులాసాగా వుందా?" అన్నాడు.

"కులాసాగానే వుంది" అని కిరణ్మయి ఒకపక్కకు తప్పుకుంది.

కాని డాక్టరు వెళ్ళకుండా అలాగే నుంచొని వున్నాడు. పలకరించ టానికికూడా ఏమీ వంక దొరకలేదు. ఇదిచూచి కిరణ్మయి నవ్వుతూ "వెళ్లరేం?" అన్నది.

డాక్టరు మొహం చిట్లించుకుని "వెళ్ళక ఇక్కడ కూర్చుంటా ననుకున్నావా?" అన్నాడు.

"నేను అలా అనుకునేంత పిచ్చిదాన్ని కాదు. మీకోసం ఎంతమంది రోగులు ఎదురుచూస్తూవుంటారో చెప్పండి?" అని మొహం చాటుకు తిప్పుకుని నవ్వసాగింది.

డాక్టరుకి క్రోధంతో ఆమె చెంపమీద ఒక చిన్న దెబ్బవేసి నోరు మూయించాలనిపించింది. కాని వెనకాడి "వెళ్ళిపో" అన్నాడు.

"నే నెక్కడికి వెడతాను? ఇల్లు నాది నే నిక్కడే వుంటాను. వెళ్ళిపోయేది మీరు."

సరే, వెళ్ళుతున్నానని డాక్టరు బైలుదేరేప్పటికి కిరణ్మయి వెళ్ళి వాకిటికి అడ్డంగా చేతులుపెట్టి నుంచొని "వెళుతున్నావుగాని, ఇదే అంతిమరాక అని తెలుసుకో" అన్నది.

ఆమె ముఖమూ కంఠస్వరమూ, చూచి డాక్టరుకి మనసులో కొంచెం విచారం కలిగింది. "ఆఁ అవును అంతిమరాకే" అన్నాడు పైకి.

'నిజంగా ఆరంభిస్తారాకే తీరావచ్చునుగా. అంతా విని పో సంగతి సందర్భాలన్నీ చెబుతాను" అని కిరణ్మయి డాక్టరు చేతిలో బేగ్ తీసుకొని బల్లమీద పెట్టి "నాకు చేతిలో పనివుంది క్లుప్తంగా చెబుతాను విను" అన్నది.

ఇంతలో దాసీది వచ్చి ఎవరో ఇద్దరు బాబులు వస్తున్నారని చెప్పింది. కింద చెప్పుల చప్పుడుకూడా విని కిరణ్మయి ఆతురతతో జవాబైన లేకుండా దాసీదాన్ని తోసుకొని ఒక్కసారి వంటింట్లోకి పరుగెత్తుకుపోయింది. డాక్టరూ, దాసీ ఆశ్చర్యంతో ఒకరి మొఖాలు ఒకరు చూచుకున్నారు.

కొంచెం సేపటికి చెప్పుల చప్పుడు దగ్గరకు వచ్చింది. వచ్చిన వ్యక్తులిద్దరూ డాక్టరుకి అపరిచితులుగా కనపడ్డారు. కాని కోటుజేబులోంచి తల బైటికిపెట్టి తొంగిచూస్తున్న స్టెతస్కోపు అతన్ని వారికి పరిచయం చేసింది. వుపేంద్రుడు డాక్టరు మొహం వాడిపోయి వుండటం చూచి ప్రమాదస్థితిలో ఏమైనా వున్నదేమో అని అనుమానంతో "ఎలావుంది డాక్టరుగారూ?" అన్నాడు.

డాక్టరు మాట్లాడలేదు. అతని మొహం మరింత వెలవెల పోయింది. వుపేంద్రుడు మరింత అనుమానంతో "హారన్ బాబుకు ఎలావుంది డాక్టరుగారూ!" అన్నాడు.

డాక్టరు మాట్లాడకుండా వెర్రిచూపులు చూస్తూ నుంచున్నాడు.

"ఇంకా నుంచున్నారెందుకు? వెళ్ళరాదు డాక్టరుగారూ!" అన్నది దాసీ.

డాక్టరు బేగ్ తీసుకొని మెదలకుండా ఇద్దరి మధ్యనుంచి దూసుకు పోయాడు. దాసీది మాయమైంది. వుపేంద్రుడూ, సతీశుడు ఒకరి మొహాలు ఒకరు చూచుకుంటూ నిలబడిపోయారు.

"అయితే, ఈడాక్టరు ఇలా ఎందుకు పోయాడో నాకు అర్థం కావటం లేదు" అన్నాడు వుపేంద్రుడు.

"అవును—దొంగలాగ దూసుకుపోయాడు" అన్నాడు సతీశుడు.

"ఎవరూ కనపడడం లేదు. హారన్ బాబుకు ఎలావుందో?"

"పద, వెళ్ళి చూదాం"

"ఇంట్లోకివెళ్ళటానికి నాకుభీతిగావుంది. అనిష్టమేమైనా జరిగిందేమో!"

"జరిగితే ఇలా నిశ్శబ్దంగా ఎందుకు వుంటుంది?"

ఇంతలో వంటింట్లోంచి కిరణ్మయి కనపడింది. కళ్లు తుడుచుకుంటూ వస్తోంది. రాత్రిదీపం వెలుగులో స్పష్టంగా కనపడని సౌందర్యం ఆమెలో ఇప్పుడే స్పష్టంగా కనపడింది. చిత్రాలలో కూడ అటువంటిరూపం వుండి వుండదు.

"రేపు వస్తారేమో ననుకున్నాను" సతీశునివైపు చూచి నవ్వుతూ చిన్నబాబుగారు కూడా వచ్చారా!" అన్నది. సతీశుడు మాట్లాడలేదు.

"హారన్ బాబుగారికి ఎలావుంది?" వుపేంద్రుడు అడిగాడు.

"అలాగే వుంది. పదండి లోపలికి."

హారన్ తల్లి కొడుకు మంచందగ్గర కూర్చొని వుంది. వుపేంద్రుని చూడగానే గావురు మన్నది.

హారన్ క్షీణస్వరంతో "వూరుకో అమ్మా" అన్నాడు.

వుపేంద్రుడు దుఃఖంతో ఒక పక్కని చతికిలపడ్డాడు. సతీశుడు మొహంమీదికి గాంభీర్యం తెచ్చుకోటానికి ప్రయత్నించి కొయ్యపెట్టిమీది కెళ్ళి కూర్చున్నాడు. కిరణ్మయి కొంచెం సేపు నిలబడిచూచి—కళ్లలో నిప్పులు కురిపిస్తూ పోయింది.

## ౧౪

త్రలవని తలంపుగా సతీశుడు మళ్లా డాక్టరీ చదవాలని నిశ్చయించుకున్నాడు. మర్నాడు సాయంత్రం ఎవరితోనూ చెప్పకుండా బిహారిని తీసుకు వెళ్ళి ఇదివరకు తను వదలిపెట్టి వచ్చిన ఇంట్లో ప్రవేశించాడు. "మనం రేపే బైలుదేరి వద్దాం" అన్నాడు బిహారితో. బిహారి సరే నన్నాడు. కొంచెం సేపుండి సతీశుడు "మనం చేసిన పని మంచిదికాదు. ఆమె నాకెంతో సేవ చేసింది. మెస్సునౌకరీకూడా పోయింది. అంతు తెలుసుకోకుండా వుండటం భావ్యంగాదు. బిహారీ!" అన్నాడు.

బిహారి సతీశుడు ఎవరి నుద్దేశించి మాట్లాడుతున్నదీ గ్రహించి మెదలకుండా వూరుకున్నాడు

"ఆఖరికి ముష్టివాడు కష్టాల్లోవున్నా ఆదరించటం మానవధర్మం బిహారీ! ఆమె తప్పకుండా ఏదో ఆపదల్లో వుండి వుంటుంది. ఒకసారి వెళ్ళి చూచిరా" అన్నాడు సతీశుడు. బిహారి మెదలకుండా అతనివెనుక నడును

న్నాడు. ఆమె నీముందు ఏమీ చెప్పదు. నాముందు మాత్రం ఏమీదాచదు' అన్నాడు సతీశుడు మళ్లా. ఇంతలో ఇద్దరూ సావిత్రి ఇంటి గొంది మలుపుకు వచ్చారు. సతీశుడు ఆగి "నేను ఇక్కడ నుంచుంటాను. నువ్వు వెళ్ళి త్వరగా చూచిరా" అన్నాడు.

బిహారి సావిత్రి ఇంటికి వెళ్లాడు. సతీశుడు బజారులో పచారు చేస్తూ నుంచున్నాడు, పది నిమిషాలైన తర్వాత బిహారి తిరిగివచ్చి ఆమె ఇంటిదగ్గర లేదు'' అన్నాడు.

''ఎప్పుడు వస్తుంది?'' సతీశుడు వ్యత్సుకతతో అడిగాడు.

"వెళ్లి రెణ్ణెల్లయిందట, ఎక్కడికి వెళ్ళిందో, ఎప్పుడువస్తుందో?''

''ఆమె సామానది?''

"ఇంట్లోనే వుంది. వదలిపెట్టలేనంత విలువగల సామానుమాత్రం ఏముంది ?"

సతీశుడు కోపంతో "ఆమె స్థితికి ఆసామాను చాలు! నువ్వు ఒట్టి తెలివితక్కువ దద్దమ్మవు. దారిలో ఎవరు చెబితేనో వినివచ్చి వుంటావు. ఆమె అంతులేకుండా ఎక్కడికి పోతుంది? అంతులేకుండాపోతే నేను వూరు కుంటానా? ఇప్పుడే స్టేషనుకు వెళ్ళి రిపోర్టు చేస్తాను" అన్నాడు.

బిహారి మాట్లాడలేదు.

"మోక్షదా ఏమన్నది. ఆమె తెలియదంటే నేను నమ్మను. ఆమెకు తప్పకుండా తెలిసి వుంటుంది. నేను వెళ్ళి కనుక్కు వస్తాను వుండు" అన్నాడు సతీశుడు.

బిహారి విసుగుతో "మీరు వెళ్ళనవసరం లేదు బాబుగారూ?'' అన్నాడు.

"ఎందుకు అవసరం లేదు! తప్పకుండా ఆమె అంతు కనుక్కు తీరతాను.

"ఆమె ఎవరితోనూ చెప్పా చెయ్యకుండా వెళ్లిపోయింది బాబుగారూ! ఎక్కడికి వెళ్లిందో ఎవరికి అంతు?" అన్నాడు బిహారి.

సతీశుడు కసురుకుని "మళ్లా అదేమాట! ఎక్కడికి వెళుతుంది. ఈ భూమిని తెగించుకు పోతుందా?" అని లేచాడు.

ఈసారి బిహారి కొంచెం భయపడి "చెప్పివెళ్ళలేదు. కాని ఆమె ఎక్కడ వున్నదీ నాకు తెలుసు? ఈ పట్నంలోనే వుంది" అన్నాడు,

"ఎక్కడ?... దేభ్యం—గ ఇందాకటినుంచి చెప్పవేం. ఎక్కడవుందో చెప్పు?"

బిహారి కొంచెంసేపు మెదలకుండా వుండి "అంతా తెలుసు బాబు గారు. చెబితే మీ మనసుకు కష్టంగా వుంటుం దేమోనని చెప్పలేదు"

సతీశుడు కొంచెం ఆతురతతో "ఏమి జరిగిందేమిటి?" అన్నాడు.

బిహారి మెదలకుండా నుంచున్నాడు. ఆతురతతో అతని మొహంవంక చూస్తున్న సతీశుడు కొంచెం సేపుండి "నీ పాదాలు పట్టుకుంటాను త్వరగా చెప్పు బిహారీ!" అన్నాడు.

బిహారి అతని కాళ్ళమీదపడి ఏడుస్తూ "నన్నిం కెక్కువ నరకకూపం లోకి తొయ్యకండి బాబూ! కొంచెం చాటుకుపదండి చెబుతాను" అని ఒక కీనీడకువెళ్ళి నుంచున్నాడు. సతీశుడు దగ్గరకు వెళ్ళి "ఏమిటి" అన్నాడు.

బిహారి గొంతు తడిచేసుకుని "సావిత్రి మీవద్ద వుందనుకుంటూవుంది మోక్షదా! కాని అసలు ఆవిడ ఎక్కడ వుందీ నాకు తెలుసు" అన్నాడు.

"నువ్వు తెలుసుకుంటావని నాకూ తెలుసు. అయితే ఎక్కడవుంది?" అన్నాడు సతీశుడు ఆతురతతో.

"కొంచెం శాంతించండి బాబుగారూ!" అని బిహారి గొంతు మళ్ళా తడిచేసుకుని "నాకు గట్టి నమ్మకం కలిగింది......"అన్నాడు.

"నమ్మకం కలిగింది ఏమిటి?"

"ఆమె విపినబాబుగారి దగ్గర......"అని ఆగిపోయాడు బిహారి.

"ఎక్కడ? విపినబాబుగారి దగ్గరా?" అని సతీశుడు అక్కడ చతికిల బడబోయాడు.

"అవును బాబూ! అతని దగ్గరే ..అక్కడ కూర్చోవద్దు. మళ్ళా స్నానం చెయ్యవలసి వస్తుంది. అడ్డమైనవాళ్ళూ..."

సతీశుడు అతని చివరిమాట వినీవిననట్టుగా గోడనానుకు నుంచుని శుష్కకంఠంతో "అయితే ఆమె నాదగ్గర వుందని ఎలా అనుకుంది మోక్షదా?" అన్నాడు.

"ఆరోజున—సావిత్రి విపినబాబును అవమానపర్చి పంపిన రోజున-తను సతీశ్ బాబుగారి వద్ద తప్ప ఇంకెక్కడా వుండనని వాగింది. అదిమోక్షదా కూడా విన్నది"

సతీశుడు కొంచెం స్మితపడి "ఆమె విపినబాబువద్ద వున్నదని నీకెలా తెలుసు?" అన్నాడు.

బిహారి మాట్లాడలేదు.

"చెప్పు" అన్నాడు సతీశు.

బిహారి మెదలకుండా నుంచున్నాడు. అతనికి తన వుపసత్యాన్ని గురించి సగర్వంగా చెప్పుకొన్న ప్రతిజ్ఞ కూడా జ్ఞాపకమొచ్చింది. ఆఖరికి గుటకలు మింగుతూ "నేను నాకళ్లారచూచాను" అన్నాడు. సతీశుడు మెదలకుండా వింటున్నాడు. మనం పాతమెస్సునుండి వచ్చిన మర్నాడు_నేను సావిత్రి ఇంటికి వెళ్లాను అక్కడ విపినబాబు సావిత్రిగదిలో పండుకొని ఉండగా చూచాను" అన్నాడు బిహారి.

సతీశుడు ఒక్కసారి కసురుకొని "శుద్ధఅబద్ధం "అది ఎప్పటికీ కాదు" అన్నాడు బిగ్గరగా.

బిహారి తృళ్లిపడి "లేదు బాబుగారు ! నిజంచెబుతున్నాను" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు అతని మొహంకేసి తీవ్రదృష్టితో చూచి "అప్పుడు సావిత్రి ఏమిచేస్తూవుంది?" అన్నాడు.

"ఆగదిలోనే వుంది బాబు! నన్ను చూడగానే తృళ్ళిపడి వంటింట్లో కూర్చొబెట్టి పనిలోకి రావటం లేదని బాబుగారికి కోపం వచ్చిందా? మీరు మెస్సులోంచి ఎందుకు వెళ్ళిపోయారు ఈ సంగతులన్నీ అడిగింది బాబూ!"

"తర్వాత"

"నేను ఇక అక్కడ వుండలేక వచ్చేశాను. ఆరోజునే అతనివెంట వెళ్ళిపోయింది.

"ఇంత కాలంనుండి ఎందుకు చెప్పలేదు? "

బిహారి మాట్లాడ లేదు.

"నీ కళ్లారా చూచావా? ఎవరైనా చెబితే విన్నావా_" అని అడిగాడు సతీశుడు మళ్లా.

"లేదు బాబుగారూ! నేను కళ్లారా చూచాను."

“కళ్లారా చూచానని నాపాదాలంటి చెప్పు. ఇదిగో బ్రాహ్మడి పాదాలంటుకున్నానని జ్ఞాపకం పెట్టుకో.”

బిహారీ వెంటనే వంగి సతీశుని పాదాలంటి “నాకళ్లారా చూచాను బాబూ!” అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు మెదలకుండా వుండి “సరే పద, ఇవ్వాళ రాత్రి నేను భవానీపురం వెళుతున్నాను, రానని వుపేంద్ర బాబుగారితో చెప్పు” అన్నాడు.

బిహారీ నవ్వలేదు, ఏడవసాగాడు.

ఇది చూచి సతీశుడు ఆశ్చర్యంతో “ఏడుస్తావెందుకు?” అన్నాడు.

బిహారీ కళ్లు తుడుచుకుంటూ “నేను మీ బిడ్డలాంటివాణ్ణి బాబూ! నేను కూడా మీ వెంటవస్తాను. నావల్ల ఏమీ బాధవుండదు” అన్నాడు.

“ఎందుకు?”

“ముసలివాణ్ణయితే మాత్రమేం బాబూ! కర్ర చేతికిస్తే ఇప్పటికీ కూడా నలుగురికి జవాబు చెప్పగలను. అవసరమొస్తే...”

అయితే.

“నేను తగూకు వెళ్లుతున్నాననా ఏమిటి?” అన్నాడు సతీశ్ శాంత భావంతో.

“అయితే, నేను తిరిగి వెళ్లిపోనా?” అన్నాడు బిహారీ

“వెళ్లిపో” అని సతీశుడు వెళ్లిపోయాడు. బిహారీ అక్కడే కొంచెం సేపు నుంచుని మెదలకుండా కళ్లు తుడుచుకుంటూ బైలుదేరి వెళ్ళాడు.

సతీశుడు నిర్జన మైదానంలో ఒక చెట్టుకిందకు వచ్చి నుంచున్నాడు. అక్కడి నిశ్శబ్దత అతని మనసుకు కొంత శాంతి నిచ్చింది. అక్కడే కూర్చుని అతని హృదయంమీద వున్న భారాన్ని ఎలా తొలగించాలా అని ఆలోచించ సాగాడు. ఈ ప్రశ్న అర్థంలేని ప్రలాపంలాగ అతని చెవుల్లో గింగురుమన సాగింది. ఏమీ చెయ్యలేమని చివరికి సమాధానం వచ్చింది.

‘సావిత్రి అలాంటి పని ఎందుకు చేసింది?’ అడిగాడు.

‘ఆమెమీద నేరం ఆరోపించటానికి ఆమె చేసిందేమున్నది?’ సమాధానం వచ్చింది.

'ఆమెచేసినపని నమ్మకద్రోహం కాదా!'

'ముందు ఈసంగతిచెప్పు—ఆమె నమ్మించింది మాత్రం ఎప్పుడు నమ్మక ద్రోహం చెయ్యటానికి!" సమాధానం వచ్చింది.

సతీశుడు మళ్ళా మాట్లాడలేక పోయాడు. నిజంగా ఆమె ఎప్పుడూ అతన్ని ఆశపెట్టి మోసగించలేదు. ఇంకా పైగా అతని హితవుగోరి – అనేక విధాల మేలుచేసింది. సోదరికంటె మిన్నగా ప్రేమతో చూచింది. అతనికి ఆరాత్రి సంగతిజ్ఞాపకి మొచ్చింది. రోగియందు వైద్యునికి దయాదాక్షిణ్యా లున్నప్పటికీ తన కఠినకర్మను వదలనట్లు — సావిత్రి అతన్ని హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నప్పటికీ కఠినురాలై వెళ్ళగొట్టింది. అలా ఎవరు చెయ్యగలరు? వజ్రాయుధానికి హృదయాన్ని అడ్డముపెట్టి తుత్తునియలు కాకుండా ఎవ్వరు చెయ్యగలరు? సతీశుని కళ్ళల్లో నీరు తిరిగినై. ఈప్రశ్నలూ సమాధానాలలో తనెక్కడో తప్పకుండా పొరపడి వుంటాననే సంశయం మాత్రం అతన్ని వదలకుండా వుంది.

'అయితే నే నామెమీద ప్రేమద్పృష్టులు వేశానా?' అని మళ్ళా అతని ప్రశ్న.

'వేశావు! బంద అని తెలిసి వుండికూడా ఎందుకు దిగబడ్డావు వూబిలో?' సమాధానం వచ్చింది.

'ఆసంగతి తెలియదు. కమలాన్ని తెచ్చుకోటానికివెళితే బురద కాదూ?' అని ప్రశ్న వేశాడు.

'అవన్నీ పూర్వకాలపుసంగతులు. ఇప్పు డాశీలాలేమీ పనికిరావు. కమలాన్ని చేతపట్టుకుని ఇంటికి మరలివచ్చేప్పుడు బాడిలికూడా వదలించుకొని వస్తాడు – మానవుడు. అయితే నీకు కమలమనేది ఏది, బాడి అవటానికి?'

'ఇంటికి వెళ్ళకుండావుంటే ?'

'రామ ! రామ ! అటువంటి మాటలు నోటివెంటరానియ్యకు' సమా ధానం వచ్చింది.

తర్వాత అతడు నిస్సబ్దతతో నక్షత్రాలతో నిండియున్న నీలాకాశం కేసి చూస్తూ కూర్చున్నాడు. కాని హఠాత్తుగా 'నాకు ఆమెయందు ఆశ లేదు. ఆమెకూడా నన్ను ఏనాడూ, ఏమీ యాచించి ఎరుగదు. ఏలోపంవల్ల ఆమె ఈ పనిచేసింది? ధనలోభంవల్లా? ఏమీ అర్థంకావడం లేదు.

విపినునిలాంటి అనాచారుణ్ణి, త్రాగుబోతును సావిత్రి మనసార ప్రేమిస్తోందని వప్పుకోటానికి అతని హృదయం అంగీకరించ లేదు.

గంగానది మీదనుండి వచ్చే శీతపవనాలు సతీశునికి కొంచెం చలి కలిగించాయి. పైనున్న చదరు కప్పుకొని కళ్ళుమూసుకు బెంచీమీద పండుకున్నాడు. కన్ను మూయగానే సావిత్రి వుజ్వల వదనం అతని ముందు మెలగ సాగింది. ఆమె మొహంమీద పతితలక్షణా లెక్కడా కనపడటం లేదే, వివేకంతో, కాంతిగా స్నేహస్నిగ్ధమై దీపించుతూ వుందిగానీ? పరిపూర్ణ యౌవన భారంతోనున్న ఆ వదనమూ, ఆ స్మితరేఖలూ, ఆ చంచలదృష్టులూ, ఆ మందహాసమూ గంభీరమై పోయినాయి. వాటినన్నిటినీ ఒక్కసారిగా అతనెప్పుడూ చూడలేదు. ఆమె అంటించిన నిప్పు రగిలి, మండి జ్వాల లెత్తింది. ఆ జ్వాలలనుండి పారిపోయి ప్రాణాలు దక్కించుకోనే దెలా? ప్రాణం దక్కించుకుని మాత్రం ఏమి చేస్తాడు? అతని కళ్ళవెంట నీరు ధారలుగా ప్రవహించ సాగినై. అతనా కన్నీరును ఆపుకో దలచుకోలేదు. చేయెత్తి తుడుచుకోటానికి కూడా అతనికి యిష్టం లేకపోయింది. కన్నీళ్ళలో ఇంత తియ్యదనమూ, ఇంత సరసతా వుంటుందని ఇవ్వాళే అతను మొదటిసారిగా తెలుసుకుని శాంతించాడు. తన జీవితంలో ఇంత సుఖం ఆస్వాదించే అవకాశం కలిగి నందుకు చేతులు రెండూ జోడించి సజలనేత్రాలతో నక్షత్రభూషితమై, దిగంతవ్యాపితమైన ఆకాశంకేసి చూస్తూ మాటిమాటికీ నమస్కరించసాగాడు.

ఏది ఎలావున్నా భగవంతుడు ఒకడు వున్నాడనీ, ఎవరూ అతని కన్ను కప్పలేరనీ, చిన్నలకూ, పెద్దలకూ, అందరికీ ఒకనాడు అతని ముందు సమాధానం చెప్పక తప్పదనీ సతీశునికి పూర్తినమ్మక ముంది. లేచి కూర్చుని, కన్నీళ్ళు తుడుచుకొని 'భగవంతుడా! నువ్వు ఎవరిచేత ఏమి నాటక మాడిస్తావో కూడా ఎవరికీ తెలియదుగదా! నీకృపవల్లే ఇవ్వాళ సావిత్రి దాతా, నేను యాచకుడనయ్యాను. మంచో, చెడ్డో దానిని పరిష్కరించే బాధ్యత ఎవరి మీదనైనా పెడుదువుగాని ఈ యాచకుని మీద మాత్రం పెట్టకు. ఈ హృదయంలోని విద్వేషాన్ని దూరం చెయ్యి. ఎక్కడో కనుమరుగున వున్న వ్యక్తియందు నేను కృతఘ్నుడ కాజాలను' అని ప్రార్థించుకో సాగాడు.

సతీశుడు మళ్ళా బెంచీమీద పడిగిలాడు. గుడిగంట రెండు కొట్టింది. అలసిపోయిన అతని నేత్రాలు మూతలు పడ్డాయి. కునికిపాట్లు పడుతూ

'ఆమె చేసినపని నమ్మకద్రోహం కాదా!'

'ముందు ఈసంగతి చెప్పు—ఆమె నమ్మించింది మాత్రం ఎప్పుడు నమ్మక ద్రోహం చెయ్యటానికి!" సమాధానం వచ్చింది.

సతీశుడు మళ్ళా మాట్లాడలేక పోయాడు. నిజంగా ఆమె ఎప్పుడూ అతన్ని ఆశపెట్టి మోసగించలేదు. ఇంకా పైగా అతని హితవుగోరి _ అనేక విధాల మేలుచేసింది. సోదరికంటె మిన్నగా ప్రేమతో చూచింది. అతనికి ఆరాత్రి సంగతిజ్ఞాపకమొచ్చింది. రోగియందు వైద్యునికి దయాదాక్షిణ్యాలున్నప్పటికీ తన కఠినకర్మను వదలనట్టు — సావిత్రి అతన్ని హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నప్పటికీ కఠినురాలై వెళ్ళగొట్టింది. అలా ఎవరు చెయ్యగలరు? వజ్రాయుధానికి హృదయాన్ని అడ్డముపెట్టి ఋత్తునియులు కాకుండా ఎవ్వరు చెయ్యగలరు? సతీశుని కళ్ళల్లో నీరు తిరిగినై. ఈప్రశ్నలూ సమాధానాలలో తనెక్కడో తప్పకుండా పొరపడి వుంటాడన్న సంశయం మాత్రం అతన్ని వదలకుండా వుంది.

'అయితే నే నామెమీద ప్రేమదృష్టులు వేశానా?' అని మళ్ళా అతని ప్రశ్న.

'వేశావు! బంద అని తెలిసి వుండికూడా ఎందుకు దిగబడ్డావు వూబిలో?' సమాధానం వచ్చింది.

'ఆసంగతి తెలియదు. కమలాన్ని తెచ్చుకోటానికివెళితే బురద కాదూ?' అని ప్రశ్న వేశాడు.

'అవన్నీ పూర్వకాలపుసంగతులు. ఇప్పు డాశీలాలేమీ పనికిరావు. కమలాన్ని చేతపట్టుకుని ఇంటికి మరలివచ్చేప్పుడు బాడిలికూడా వదలించుకొని వస్తాడు _ మానవుడు. అయితే నీకు కమలమనేది ఏది, బాడి అవటానికి?'

'ఇంటికి వెళ్ళకుండావుంటే ?'

'రామ! రామ! అటువంటి మాటలు నోటివెంటరానియ్యకు' సమాధానం వచ్చింది.

తర్వాత అతడు నిస్తబ్ధతతో నక్షత్రాలతో నిండియున్న నీలాకాశం కేసి చూస్తూ కూర్చున్నాడు. కాని హఠాత్తుగా 'నాకు ఆమెయందు ఆశ లేదు. ఆమెకూడా నన్ను ఏనాడూ, ఏమీ యాచించి ఎరుగదు. ఏలోపంవల్ల ఆమె ఈ పనిచేసింది? ధనలోభంవల్లా? ఏమీ అర్థంకావడం లేదు.

విపినునిలాంటి అనాచారుణ్ణి, త్రాగుబోతును సావిత్రి మనసార ప్రేమిస్తోందని వప్పుకోటానికి అతని హృదయం అంగీకరించ లేదు.

గంగానది మీదనుండి వచ్చే శీతపవనాలు సతీశునికి కొంచెం చలి కలిగించాయి. పైనున్న చద్దరు కప్పుకొని కళ్ళుమూసుకు బెంచీమీద పండుకున్నాడు. కన్ను మూయగానే సావిత్రి వుజ్జ్వల వదనం అతని ముందు మెలగ సాగింది. ఆమె మొహంమీద పతితలక్షణా లెక్కడా కనపడటం లేదే, వివేకంతో, శాంతిగా స్నేహస్నిగ్ధమై దీప్తించుతూ వుందిగానీ? పరిపూర్ణ యౌవ్వన భారంతోనున్న ఆ వదనమూ, ఆ స్మితరేఖలూ, ఆ చంచలదృష్టులూ, ఆ మందహాసమూ గంభీరమై పోయినాయి. వాటినన్నిటినీ ఒక్కసారిగా అత నెప్పుడూ చూడలేదు. ఆమె అంటించిన నిప్పు రగిలి, మండి జ్వాల లెత్తింది. ఆ జ్వాలలనుండి పారిపోయి ప్రాణాలు దక్కించుకొనే దెలా? ప్రాణం దక్కించుకుని మాత్రం ఏమి చేస్తాడు? అతని కళ్ళవెంట నీరు ధారలుగా ప్రవహించ సాగినై. అతనా కన్నీరును ఆపుకో దలచుకోలేదు. చేయెత్తి తుడుచుకోటానికి కూడా అతనికి యిష్టం లేకపోయింది. కన్నీళ్ళలో ఇంత తియ్యదనమూ, ఇంత సరసతా వుంటుందని ఇవ్వాళే అతను మొదటిసారిగా తెలుసుకుని శాంతించాడు. తన జీవితంలో ఇంత సుఖం ఆస్వాదించే అవకాశం కలిగి నందుకు చేతులు రెండూ జోడించి సజలనేత్రాలతో నక్షత్రభూషితమై, దిగంతవ్యాపితమైన ఆకాశంకేసి చూస్తూ మాటిమాటికీ నమస్కరించసాగాడు.

ఏది ఎలావున్నా భగవంతుడు ఒకడు వున్నాడనీ, ఎవరూ అతని కన్ను కప్పలేరనీ, చిన్నలకూ, పెద్దలకూ, అందరికీ ఒకనాడు అతని ముందు సమాధానం చెప్పక తప్పదనీ సతీశునికి పూర్తినమ్మక ముంది. లేచి కూర్చుని, కన్నీళ్ళు తుడుచుకొని 'భగవంతుడా! నువ్వు ఎవరిచేత ఏమి నాటక మాడిస్తావో కూడా ఎవరికీ తెలియదుగదా! నీకృపవల్లే ఇవ్వాళ సావిత్రి దాతా, నేను యాచకుడనయ్యాను. మంచో, చెడ్డో దానిని పరిష్కరించే బాధ్యత ఎవరి మీదనైనా పెడుదువుగాని ఈ యాచకుని మీద మాత్రం పెట్టకు. ఈ హృదయంలోని విద్వేషాన్ని దూరం చెయ్యి. ఎక్కడో కనుమరుగున వున్న వ్యక్తియందు నేను కృతజ్ఞుడ కావాలను' అని ప్రార్థించుకో సాగాడు.

సతీశుడు మళ్ళా బెంచీమీద పడిగిలాడు. గుడిగంట రెండు కొట్టింది. అలసిపోయిన అతని నేత్రాలు మూతలు పడ్డాయి. కునికిపాట్లు పడుతూ

ఎప్పటికీ కాదు. నిన్ను గురించి నాకేమీ చింతలేదు. ఎక్కడవున్నా కేవలం సుఖంగా మాత్రం వుండమని వేడుకుంటున్నాను' అనుకుని నిద్రపోయాడు.

* * * *

సాయంత్రమైంది. బాలిష్టరుగారింట్లో సరోజినీ, జ్యోతిష్, వుపేంద్రుడూ మరొక యువకుడూ కూర్చొని యున్నారు. దృఢకాయుడైన ఆ నూతన యువకుని పేరు శశాంకమోహన్. విదేశాలలో చదువుకు వచ్చాడు. అందుచేత అతని వేషంలోకూడా ఆ ప్రభావం బాగా కనపడుతూవుంది. కొంతకాలంనుండి సరోజినియందు వ్యామోహంతో వున్నాడు. తనకోర్కె సర్వవిధాలా సాఫల్యం కావాలని శాయశక్తులా ప్రయత్నిస్తున్నాడు. ఎంత వరకు నెగ్గుతాడో బ్రహ్మకే తెలుసు. సతీశునిగురించి చెప్పవచ్చింది. వుపేంద్రుడు—అతని అసాధారణ శారీరకశక్తినీ, ధైర్యసాహసాలనూ పరిచయం చేసి—అతని అద్భుత సంగీత ప్రావీణ్యతను గురించి వ్యాఖ్యానం ప్రారంభించాడు. దగ్గరగా సోఫామీద కూర్చొనివున్న సరోజిని చాల తన్మయత్వముతో ఇదంతా వింటోంది. ఇంతలో బిహారీవచ్చి సతీశుడు భవానీపురం వెళ్ళాడని చెప్పాడు.

వుపేంద్రుడు కొంచెం ఆశ్చర్యంతో "అక్కడ ఎవరున్నారు?" అన్నాడు.

"తెలియదు" క్లుప్తంగా అని బిహారీ వెళ్ళిపోయాడు. ఇంతసేపటినుండీ అతనికోసం ఎదురుచూస్తూవున్న వారందరికీ నిరాశకలిగింది. ఇంతసేపటినుంచీ గడ్డంమీద చేతేసుకుని తన్మయత్వంతో కూర్చున్న సరోజిని చకితురాలై "అయితే ఇప్పుడేంచేద్దాం?" అన్నది. ఒకదీర్ఘమైన నిట్టూర్పువిడచి.

జ్యోతిష్ చెల్లెలి మొహంకేసిచూచి లోలోన నవ్వుకున్నాడు.

శశాంకమోహనునికిమాత్రం నిరాశ కలుగలేదు చుక్కాని సరోజిని చేతికివ్వాలని తీర్మానించాడు. సంగీతమంటే అతను చెవికోసుకుంటాడు. ఈ తీర్మానమునందు సరోజిని అయిష్టత కనబరచగానే "మగవారిని పాడమనటం న్యాయంకాదు. స్వాభావికంగానే వారిగొంతు మొరటుగానూ, కటువుగానూ వుంటుంది. అందుచేతవారు ఎంతవిద్యనేర్చినా, ఎన్నిప్రయత్నాలు చేసినా స్త్రీలకంఠంలోనున్న లాలిత్యం, మాధుర్యం వారికంఠంలో వుండదుఅన్నాడు.

ఈ విషయాన్ని ఎవరూ కాదనలేక పోయారు. కాని సరోజిని మాత్రం మెదలకుండా వూరుకోలేక పోయింది. "పురుషుల కంఠంలో మాధుర్యం లేక పోయినా మోటుగా ఉండటం నాకేం కాదుగా! పియానో హార్మోనియం ధ్వనులు కటువుగా వున్నా లోకులేమీ కాదనటం లేదే?" అన్నది.

శశాంక మోహనునికి దీనికి సమాధానమేమీ కనపడలేదు. అయినా ఏదో అనుకోబోతుండేప్పటికి సరోజిని హఠాత్తుగా లేచి నుంచుని "అయితే అమ్మతో చెప్పివస్తాను. ఆమె నాకోసం పళ్లెంలో అన్నం పెట్టుకుని కూర్చుంటుంది." అన్నది.

"ఇంకా నీతిండి తిప్పలు అమ్మ సాకవలసిందేనా ఏమిటి?" అన్నాడు వుపేంద్రుడు ఆశ్చర్యంతో.

ఉపేంద్రుని మాటలలో ఆంతరంగిక ప్రేమ తప్ప ఇంకేమీ లేదు. అన్న సంగతి సరోజినికి కూడా తెలుసు, నవ్వుతూ "అదే. అమ్మతో చెప్పివస్తాను" అని తుర్రున లోపటికి పోయింది.

ఆమె వెళ్ళిపోగానే శశాంక మోహన్ వుపేంద్రునివంక చూచి "మీ మిత్రుడు పూర్తిగా సనాతనుడనుకుంటాను" అన్నాడు.

ఉపేంద్రనాథుడు చిరునవ్వు నవ్వి — "అవును! సనాతనుడే. పూజా పునస్కారాలుకూడ చేస్తాడు అన్నాడు.

సతీశుడు చాటుచాటుగా తాగుతూవుంటాడని వారెవరికీ తెలియదు. బహుశా వారీవిషయం స్వప్నంలోకూడా వూహించి వుండరు.

"వారు ఏమిచేస్తూవుంటారు?" అడిగాడు శశాంక మోహనుడు.

"ఏమీలేదు. ఏనాడైనా ఏదైనా చేస్తాడనికూడా ఎవరికి ఆశలేదు." అన్నాడు వుపేంద్రుడు.

ఈ మాటతో శశాంక మోహనుని హృదయంలోంచి ఒక భారం తొలగి పోయినట్లయింది. ఒక్కనవ్వునవ్వి "అలాగా!" అన్నాడు.

జ్యోతిష్ ఇంతవరకు మెదలకుండా వింటున్నాడు. "అయితే వుపేంద్ర! నాకు తెలియక అడుగుతాను. శాస్త్రీయ శక్తికి విలువలేదూ? అదిగాక అతని సంగీతాన్ని చూచి నేను ఒక్కసారి ముగ్ధుణ్ణయిపోయాను. అతని సంగీత విద్యా పాండిత్యానికి తగిన గౌరవ మర్యాదలు యివ్వకపోవటం చాల విచారింపతగ్గ విషయం. ఆలోటు మనదే కాని అతనిది కాదు" అన్నాడు.

"స్వారాజ్యసామ్రాజ్యాలతో సంబంధంలేని మనబోటి యువకులుకూడా వీటి యందు శ్రద్ధవహించకపోతే ప్రపంచం బొత్తిగా రసహీనమైపోతుంది. మీ స్నేహితుణ్ణి చూస్తే నాకు చాల జాలి కలుగుతుంది. అయితే అతని తండ్రిగారు బాగా ఆస్తి పాస్తులున్న వాడేనా?"

ఇంతలో సరోజిని వచ్చి మెదలకుండా అన్న కుర్చీవెనుక నుంచుని "ఎవరికి అన్నయ్యా?" అన్నది.

"సతీశుని తండ్రికి"

"సరిగా చెప్పలేనుగాని, సంవత్సరానికి షుమారు రెండులక్షల ఆదాయం వస్తుందని వినికిడి" అన్నాడు ఉపేంద్రుడు.

జ్యోతిష్ ఉలిక్కిపడి "రెండు లక్షలా! పెద్దజమీందారులాగా వున్నాడే!" అన్నాడు.

"అవును జమీందారీకూడా వున్నది. తర్వాత చాలసంపాయించాడు."

జ్యోతిష్ ఒక దీర్ఘమైన నిట్టూర్పువిడచి—"సౌభాగ్య దేవత ప్రేమ పుత్రు డన్నమాట. ఆరోగ్యం, ఐశ్వర్యం, రూపం, యౌవ్వనం శక్తి అన్నీ వున్నాయి. ఏం కొనువ?" అన్నాడు.

ఉపేంద్రుడు నవ్వుతూ "దానితోపాటు ఒక దుర్గుణంకూడా వున్నది. లేనిపోని విపత్తుల నన్నిటిని నెత్తిన తెచ్చిపెట్టుకుంటాడు. అందుకని నాకు కొంచెం భయంగా వుంటుంది, ఎప్పుడు ఏం జరుగుతుందో నని. అతకు తప్పితే నువ్వు చెప్పినవన్నీ యదార్థమే" అన్నాడు.

"నెత్తిమీదకు తెచ్చిపెట్టుకుంటూ వుండటంలో మీ వుద్దేశం?"

"మీరు సందేహపడ నవసరం లేదు. అటువంటివి ఇదివరకు ఎన్నో తెచ్చిపెట్టుకున్నాడు. అతనిలో క్రోధమున్నంతగా ప్రాణాలమీద ఆశలేదు. ఈ కలియుగంలోకూడా సత్యయుగంలో — ప్రవర్తించినట్టు ప్రవర్తించ బోతాడు. కోపంవస్తే ఇది మంచి, ఇది చెడ్డా అనికూడా తెలియదు. అటు వంటివాడు లోకంలో చివరవరకు ఎలా నిర్వహించ గలడా యని నాకు సందేహంగా వుంటుంది. సహాసం గొప్పదేయైనప్పటికి ఒక్కొక్కప్పుడు ప్రతిదానికి సాయం చెయ్యాలన్న లోభాన్ని అణచుకోవటంకూడా అవసరం. ఈ సంగతులేవి అతనికి అర్థంకావు. అతను పూర్వజన్మ పాశ్చాత్యదేశా

లలో "నాయిట్" యై పుట్టి —— ఇప్పుడు బెంగాలులో అవతరించాడా అనిపిస్తూ వుంటుంది.

జ్యోతిష్ కొంచెం సేపు మెదలకుండా వుండి "ఏ దుర్గుణమున్నా అతనియందు శ్రద్ధ కలుగుతుంది" అన్నాడు.

"కలుగదు కూడాను. ప్రపంచంలోని చాలవస్తువులను చూచీ చూడ నట్టుగా వుండవలసి వస్తుంది. ఇంతవరకు అతనా విషయం నేర్చుకోలేదు. ఇక ముందు నేర్చుకుంటాడని నమ్మకం కూడా లేదు. నేర్చుకోకపోతే అత నొక్కడికే గాక, మిత్రులకూ, కుటుంబానికీ కూడా కొంచెం ప్రమాదమే" అన్నాడు వుపేంద్రుడు!

"అయితే, స్నేహితుడవై యుండి నువ్వెందుకు చెప్పకూడదు?" అన్నాడు జ్యోతిష్.

వుపేంద్రుడు నవ్వి "అవును! మిత్రుణ్నే! ముఖ్య మిత్రుణ్ణి! కాని అటు వంటి వుపదేశభారం నామీద లేదు" అన్నాడు.

మెదలకుండా కూర్చొని వింటున్న సరోజిని మొహం తిప్పుకుని లోలోన నవ్వుకుంది.

ఉపేంద్రనాథుడు విసుగుతో "సతీశుని చర్చ ఇంతటితో ముగించి లేద్దాం. చాలా పని వుంది. రెండు మూడు వుత్తరాలు రాయాలి" అన్నాడు.

జ్యోతిష్‌కూడా కోర్టు కాగితాలు చూచుకోవాలి. ఇంకెక్కువసేపు కూర్చునే అవకాశం లేదు. కాని ముందుగా సరోజిని లేచి నుంచుని వుపేంద్ర నాథునితో ఏదో చెప్పాలనుకున్నది. కాని చెప్పలేక అన్యమనస్కయై మెదల కుండా వెళ్ళిపోయింది. వుపేంద్రనాథునికి ఈసంగతు లేమీ తెలియవు.

## ౧౫

సూక్ష్మబుద్ధిగల కిరణ్మయి భర్త మంచం మీద వుండగా కలిగిన పరిచయంకొద్దీ వుపేంద్రుని బాగా అర్థం చేసుకుంది. దానితో అంతకు ముందున్న అతను స్వార్థపరుడనే సంశయం నివారణ మగుటయేగాక, అతని యందు ఒకవిధమైన శ్రద్ధాభావం నిండిన తటాకంలాగ ఆమె హృదయంలో ఏర్పడిపోయింది ఆమె అటువంటి మనిషిని ఎప్పుడూ చూచియెరుగదు. అలాంటి వ్యక్తితో పరిచయం కలుగుతుందని కూడా ఆమె నెప్పుడూ వూహించ

లేదు. అందువల్ల ఈ కొద్దిపరిచయంలోనే ఆమె భవిష్యత్ జీవితాన్నంతటినీ ఆతనిమీద పెట్టి, పరులమీద ఆధారపడి వున్నందువల్ల ఏం కష్టాలు సంఘటిస్తాయోనని ప్రాణాలు బిగబట్టుకొని వున్న ఆమె తెప్పరిల్లుకొని ఒక అపూర్వ జ్యోతిని చూడ గలిగింది.

ఉపేంద్రుడు వుదయంనుండి సాయంత్రంవరకు మృత్యుముఖమునవున్న మిత్రుని సేవాశుశ్రూషలలోనే మగ్నమైయున్నాడు. ఈ సేవకు విలువలేదు. కారణం హారన్ జీవించే ఆశ పూర్తిగా పోయింది. కాని ఈసేవ కిరణ్మయి హృదయాన్ని మాత్రం ఆ ఎముకల గూడుయందు ఆసక్తి కలిగించేటట్లు చేసింది. ఆ మరణాసన్నుడైన భర్తయందు ఆమె ముగ్ధురాలై పోయింది. తలవని తలంపుగా భార్యలో కలిగిన యీమార్పును హారన్‌బాబు కూడా గ్రహించాడు. బాల్యంలో కిరణ్మయి పరాయి యింటి పంచను పెరిగింది. బాల్యంలోనే పరాయివానికి భార్యయై వచ్చింది. అత్త అఘోరమయి ఆమెను ఎప్పుడూ ప్రేమించిన పాపాన పోలేదు. అవకాశ మున్నంత వరకు బాధలు పెడుతూ వుండేది. భర్త ప్రేమనుకూడా ఆమె పొందలేదు. భర్త పగలల్లా బళ్లో పిల్లలతో వాగి, రాత్రి ఇంటిపద్ద చదువుకుంటూ వుండేవాడు. భార్యకుకూడా చదువు చెబుతూ వుండేవాడు. విద్యను ఆర్జించాలనే ఆకాంక్ష వారిద్దరిమధ్య గురు శిష్యుల కఠోరసంబంధాన్ని బిగించి సతీ పతుల మధుర సంబంధాన్ని తలెత్తకుండా చేసింది. ఈ విధంగా ఆ సౌందర్యరాశి బాల్యోదయాన్ని గడపి యౌవ్వనమధ్యాహ్నానికి వచ్చింది. కాని అప్పుడు కూడా ఆమె శృంగార ప్రపంచం నుంచి ప్రవాసినై ప్రగాఢ ప్రేమ ప్రణయాలకు వంచితురాలై సర్వశ్రేష్టమైన స్త్రీ ధర్మాన్ని కూడా వదలుకోటానికి సంసిద్ధురాలైంది. అఘోరమయికి యిదంతా తెలుసు. కాని బిడ్డ మరణశయ్యమీద పడియున్నాడు. దుఃఖదినాలు దాపుకు వస్తున్నాయి. అందుచేత ఆమె కోడలి విపరీత ప్రవర్తనయందు మూకీభావం వహించి వూరుకుంది. డాక్టరు ఏ ఆశతో డబ్బూ యీగానీ లేకుండా హారన్‌కి చికిత్స చేసేదీ, ఏ ఆశతో సగం యింటి ఖర్చులుకూడా భరించేదీ ఆమెకు తెలియక పోలేదు. కాని ముందు కొడుకుకు చికిత్సఅవసరం. దాని ముందు ఈవిషయాల నన్నిటినీ ఇంత శ్రద్ధతో చూచే అవకాశం లేకపోయింది ఆమెకు. వుపేంద్రుడు కూడా కోడలివలలో పడిపోతున్నాడని ఆమెకు అనుమానం కలిగింది. వుపేంద్రుడు

ధారావాహినిగా డబ్బు పెట్టటం, అతని నిరంతర సేవాశుశ్రూషలూ చూచి వుపేంద్రుని మనస్సు బాల్యస్నేహపు టద్దులనుదాటి మరో వక్రమార్గం పట్టిందని ఆమె గ్రహించింది. దీనివల్ల ఆమెకు కలిగే నష్టం కూడా ఏమీలేదు. కాని నిన్నటినుండి వుపేంద్రుడు ఎందుకు రాలేదా అని ఆలోచిస్తూ గదివాకిట్లో ఒక మైల దుప్పటి కప్పుకుని పండుకున్నది అఘోరమయి.

శీతకాలపు సూర్యుడు అప్పటికింకా అస్తమించలేదు. అప్పుడే ఈ ఇంట్లో చీకటిచాయలు ఆవరించాయి. మామూలు రోజుల్లోకూడా సూర్యోదయం సూర్యాస్తమయాలలో ఈ యింటివారికి ఎక్కువ పరిచయ ముండేది కాదు. కాని ఇప్పుడు—ఈ దుఃఖదినాల్లో దానితో సంబంధమే పూర్తిగా తొలగి పోయినది.

"దీపం పెట్టి ఒక్కసారి ఇక్కడికిరా అమ్మా మాట్లాడాలి" అన్నది అఘోరమయి.

కిరణ్మయి ఏదో పనిలో వుంది "నీకు పక్కవేస్తున్నాను. ఇంకా పొద్దుగూకలేదు అత్తా!" అన్నది.

"ఏమిటి? నా పక్కేస్తున్నావా? పండుకో బోయేప్పుడు నేనే వేసుకునే దాన్నిగా! వెళ్ళి దీపంపెట్టి విశ్రాంతి తీసుకో. రాత్రిం పగళ్లు చాకిరితో సగమైపోయావు. కొంచెం శ్రద్ధతీసుకోవాలి. అని ఒక దీర్ఘమైన నిట్టూర్పువిడిచి మెదలకుండా కూర్చున్నది అఘోరమయి. కొంచెం సేపయిన తర్వాత కిరణ్మయి పనిపాటలు ముగించుకొని అత్త దగ్గరకు వచ్చి కూర్చో బోయేప్పటికి "ముందు దీపం వెలిగించి..."అన్నది.

కోడలు కొంచెం విసుగుతో "అంత ఆతురత ఎందుకు? ఇంకా చాలా పొద్దు వున్నది" అన్నది.

"వుంటే వుందిలే మెట్లదగ్గర చీకటిగావుంది. దీపంవెలిగించి పెట్టిరా! బహుశా వుపేంద్రుడు వస్తాడేమో. నిన్నకూడా రాలేదు. ఇంతవరకు పాచి ముఖంకూడా కడగలేదల్లేవుంది అమ్మా! తల దువ్వుకోలేదు. మాసినచీర మాసినట్టుగానే వుంది. ఇప్పటిదాకా ఏమి చేస్తున్నావు?" అన్నది అఘోరమయి.

ఆమె కంఠంలో ఎప్పుడూలేని మమతా మమకారాలు చూచి కిరణ్మయి నవ్వుతూ "అవును. కొన్నాళ్ళనుండి సరిగా వేళకు మొహమూ కడగటం లేదు. చీరా మార్చటంలేదు. ఇంకా వంటపనే కాలేదు..."అన్నది.

అత్త విసుక్కుని "ఆపనులన్నీ తర్వాత చూచుకోవచ్చునులే. ముందు నామాట విని..." అన్నది.

కోడలు లేచి నుంచుని "వెళ్ళి దీపం వెలిగించుకు వస్తాను. మళ్లా వచ్చి కూర్చుంటానులే" అన్నది.

అఘోరమయి కోపంతో "అనవసరంగా ఇప్పుడు నాదగ్గర కూర్చోట మెందుకు? రోజు రోజుకీ నువ్వు ఇలా అయిపోతున్న దెందుకో నాకు అర్థం కావటంలేదు" అన్నది.

ఆమె లాలింపులు తిరస్కార రూపంలోకి పరిణమించగానే ఆ మాటలు కఠినములై కిరణ్మయి హృదయాన్ని నొచ్చుకునేట్లు చేసినై. "మీ మూలానే నేనిలా అయ్యాను అత్తా! నువ్వనే పెడర్థపు మాటలు చెవులకు కటువుగా వుండటం అటుంచి సరిగా అర్థంకూడా కావు. నీ మనసులో వుంది సరిగా విప్పి ఎందుకు చెప్పవు?" అని క్రోధంతో సమాధానానికి ఎదురు చూడ కుండానే గబగబా వెళ్ళిపోయింది కిరణ్మయి. ఆమె ఇలా క్రోధంతో మండిపడుతూ వెళ్ళటానికి కారణం ఈ ఇంట్లో అందరికీ తెలుసు, అఘోర మయికికూడా తెలుసు.

కిరణ్మయి దీపం వెలిగించి వచ్చేటప్పటికి అత్త కన్నీరు కారుస్తూవుంది. ఇది చూచి కిరణ్మయి కొయ్యలాగ నిలబడిపోయి "తులసిమాల తీసుకురానా అత్తా!" అన్నది.

అఘోరమయి దుప్పటితో కళ్ళు తుడుచుకొని నిండుగొంతుతో "తీసుకు రా" అన్నది.

కిరణ్మయి తులసిమాల తీసుకొనివెళ్ళి యివ్వబోయేప్పటికి అఘోర మయి ఆమె చెయ్యిపట్టుకుని చెంత కూర్చోబెట్టుకుని తలనిమురుతూ చాలసేపటి వరకు మౌనంగా కూర్చొని కన్నీరు కార్చసాగింది. కిరణ్మయి తొణక బెణక కుండా కూర్చుని ఈ ప్రేమాభినయాన్ని తిలకించసాగింది.

అఘోరమయి కొంతసేపున్న తర్వాత మళ్లా కన్నీళ్ళు తుడుచుకొని "దుఃఖతాపంతో నేను పిచ్చిదాననై పోయాను. మతిపోయింది. నా ప్రతి చిన్న మాటకు నువ్విలా కోపగించుకుంటే ఎలా అమ్మా!" అన్నది.

"దుఃఖతాపాలు నీకే కాదు నాకూ ఉన్నాయి. నేనూ మానవజన్మ మెత్తానన్న సంగతి మర్చిపోతున్నావు. లేకపోతే ఎన్ని అన్నా ఎందుకు కోపం వస్తుంది?" అన్నది కిరణ్మయి స్థిరభావంతో.

అఘోరమయి కళ్ళుతుడుచుకుంటూ "అంతమాత్రం నాకు తెలుసు అమ్మా! నాఅండ అంతా కూలిపోయింది. నాకు నువ్వొక్కదానివే గుడ్డివాని లాంతరులాగ వున్నావు. కొడుకువైనా, కూతురువైనా నీవే. నా సర్వస్వం, నా ఆధారం నీవే. నీ మొహం చూచి హారన్ యందు గల దుఃఖం దిగమింగు తాను, నిన్ను చూచుకునే గుండె రాయి చేసుకు వుండగలనా?" అని పయట చెంగు మొహాన పెట్టుకుని మళ్లా ఏడ్వసాగింది. కాని కిరణ్మయి ఈయుక్తిని మరచిపోలేదు. ఆమె లోలోన మండిపడి పైటికి తొణక బెణకకుండా "నువ్విప్పుడే ఈ విషయాలన్నీ ఆలోచించుకు కూర్చున్నావు. దానికి నీవేమీ చింతపడ నవసరంలేదు. ఇప్పుడప్పుడే ఆసంగతులన్నీ ఎందుకు ? నిజంగానే— చెడుగడియలు వస్తే గుండె రాయి చేసుకోటానికి కూడా తీరిక దొరకదూ? ఇప్పటినుంచి అలా అనుకోటం శుభమేనా?" అన్నది.

కోడలిమాటల్లో వ్యంగ్యాన్ని గ్రహించలేకపోయింది అఘోరమయి! "ఆ ఘడియలు ఇంకెంతో దూరానలేవు అమ్మా! దాపుకేవచ్చాయి! ఆరోజున వుపేంద్రనాధుడు తీసుకువచ్చిన డాక్టరు కూడా కొంచెం నిరాశగానే మాట్లాడిపోయాడు. ఈ ఆపదసమయంలో వుపేంద్రుడే గనుక రాకపోయి నట్లయితే మన మెంత దుర్దశలో వుండేవాళ్ళమో?" అన్నది.

కోడలు మెదలకుండా వింటూవుండటం చూచి ఆమె మరింత వుత్సాహంతో "వాణ్ణి నేను చిన్నప్పణ్ణుంచి ఎరుగుదును. నౌఖాలిలో హారనూ, ఉపేంద్రుడూ అన్న దమ్ములులాగ వుంటూవుండేవారు. అప్పటినుంచీ నన్ను పిన్నీ అని పిలుస్తూ వుండేవాడు. తండ్రిలాగ వాడూ చాలా వుదార స్వభా వము కలవాడు. ఆరోజున నేను ఏడవటంచూచి—పిన్నీ నన్ను హారన్ తమ్ముణ్ణ నుకో అంతకంటే నీకు ఎక్కువగా చెప్పేదిలేదు—అన్నాడు. "నాయనా! నన్ను ఏపుణ్యతీర్థానికో తీసికెళ్లివదిలిపెట్టు. బ్రతికినంతకాలం గంగామతల్లి పంచనే

ఆమె కంఠంలో ఎప్పుడూ లేని మమతా మమకారాలు చూచి కిరణ్మయి నవ్వుతూ "అవును. కొన్నాళ్ళనుండి సరిగా వేళకు మొహమూ కడగటం లేదు. చీరా మార్చటంలేదు. ఇంకా వంటపనే కాలేదు..." అన్నది.

అత్త విసుక్కుని "ఆపనులన్నీ తర్వాత చూచుకోవచ్చునులే. ముందు నామాట విని..." అన్నది.

కోడలు లేచి నుంచుని "వెళ్ళి దీపం వెలిగించుకు వస్తాను. మళ్లా వచ్చి కూర్చుంటానులే" అన్నది.

అఘోరమయి కోపంతో "అనవసరంగా ఇప్పుడు నాదగ్గర కూర్చోట మెందుకు? రోజు రోజుకీ నువ్వు ఇలా అయిపోతున్న దెందుకో నాకు అర్థం కావటంలేదు" అన్నది.

ఆమె లాలింపులు తిరస్కార రూపంలోకి పరిణమించగానే ఆ మాటలు కఠినములై కిరణ్మయి హృదయాన్ని నొచ్చుకునేట్లు చేసినై. "మీ మూలానే నేనిలా అయ్యాను అత్తా! నువ్వనే పెడర్థపు మాటలు చెవులకు కటువుగా వుండటం అటుంచి సరిగా అర్థంకూడా కావు. నీ మనసులో వుంది సరిగా విప్పి ఎందుకు చెప్పవు?" అని క్రోధంతో సమాధానానికి ఎదురు చూడ కుండానే గబగబా వెళ్ళిపోయింది కిరణ్మయి. ఆమె ఇలా క్రోధంతో మండిపడుతూ వెళ్ళటానికి కారణం ఈ ఇంట్లో అందరికీ తెలుసు, అఘోర మయికికూడా తెలుసు.

కిరణ్మయి దీపం వెలిగించి వచ్చేటప్పటికి అత్త కన్నీరు కారుస్తూవుంది. ఇది చూచి కిరణ్మయి కొయ్యలాగ నిలబడిపోయి "తులసిమాల తీసుకురానా అత్తా!" అన్నది.

అఘోరమయి దుప్పటితో కళ్ళు తుడుచుకొని నిండుగొంతుతో "తీసుకు రా" అన్నది.

కిరణ్మయి తులసిమాల తీసుకొనివెళ్ళి యివ్వబోయేప్పటికి అఘోర మయి ఆమె చెయ్యిపట్టుకుని చెంత కూర్చోబెట్టుకుని తలనిమురుతూ చాలసేపటి వరకు మౌనంగా కూర్చొని కన్నీరు కార్చసాగింది. కిరణ్మయి తొణక బెణక కుండా కూర్చుని ఈ ప్రేమాభినయాన్ని తిలకించసాగింది.

అఘోరమయి కొంతసేపున్న తర్వాత మళ్ళా కన్నీళ్ళు తుడుచుకొని "దుఃఖతాపంతో నేను పిచ్చిదాననై పోయాను. మతిపోయింది. నా ప్రతి చిన్నమాటకు నువ్విలా కోపగించుకుంటే ఎలా అమ్మా!" అన్నది.

"దుఃఖతాపాలు నీకే కాదు నాకూ ఉన్నాయి. నేనూ మానవజన్మ మెత్తానన్న సంగతి మర్చిపోతున్నావు. లేకపోతే ఎన్ని అన్నా ఎందుకు కోపం వస్తుంది?" అన్నది కిరణ్మయి స్థిరభావంతో.

అఘోరమయి కళ్ళు తుడుచుకుంటూ "అంతమాత్రం నాకు తెలుసు అమ్మా! నాఅండ అంతా కూలిపోయింది. నాకు నువ్వొక్కదానివే గుడ్డివాని లాంతరులాగ వున్నావు. కొడుకువైనా, కూతురువైనా నీవే. నా సర్వస్వం, నా ఆధారం నీవే. నీ మొహం చూచి హారన్ యందు గల దుఃఖం దిగమింగు తాను, నిన్ను చూచుకునే గుండె రాయి చేసుకు వుండగలనా?" అని పయట చెంగు మొహాన పెట్టుకుని మళ్ళా ఏడ్వసాగింది. కాని కిరణ్మయి ఈయుక్తిని మరచిపోలేదు. ఆమె లోలోన మండిపడి బైటికి తొణక బెణకకుండా "నువ్వప్పుడే ఈ విషయాలన్నీ ఆలోచించుకు కూర్చున్నావు. దానికి నీవేమీ చింతపడ నవసరంలేదు. ఇప్పుడప్పుడే అసంగతులన్నీ ఎందుకు? నిజంగా నే___ చెడుగడియలు వస్తే గుండె రాయి చేసుకోటానికి కూడా తీరిక దొరకదూ? ఇప్పటినుంచి అలా అనుకోటం శుభమేనా?" అన్నది.

కోడలిమాటల్లో వ్యంగ్యాన్ని గ్రహించలేకపోయింది అఘోరమయి! "ఆ ఘడియలు ఇంకెంతో దూరానలేవు అమ్మా! దాపుకేవచ్చాయి! ఆరోజున వుపేంద్రనాధుడు తీసుకువచ్చిన డాక్టరు కూడా కొంచెం నిరాశగానే మాట్లాడిపోయాడు. ఈ ఆపదసమయంలో వుపేంద్రుడే గనుక రాకపోయి నట్లయితే మన మెంత దుర్దశలో వుండేవాళ్ళమో?" అన్నది.

కోడలు మెదలకుండా వింటూవుండటం చూచి ఆమె మరింత వుత్సాహంతో "వాణ్ణి నేను చిన్నప్పట్నుంచి ఎరుగుదును. నాఖాళీలో హారనూ, ఉపేంద్రుడూ అన్న దమ్ములులాగ వుంటూవుండేవారు. అప్పటినుంచీ నన్ను పిన్నీ అని పిలుస్తూ వుండేవాడు. తండ్రిలాగ వాడూ చాలా వుదార స్వభావము కలవాడు. ఆరోజున నేను ఏడవటంచూచి_పిన్నీ నన్ను హారన్ తమ్ముణ్ణనుకో అంతకంటే నీకు ఎక్కువగా చెప్పేదిలేదు_అన్నాడు. "నాయనా! నన్ను ఏపుణ్యతీర్థానికో తీసికెళ్ళివదిలిపెట్టు. బ్రతికినంతకాలం గంగామతల్లి పంచనే

వుంచి_హారన్ చేతకు చేర్తాను. అనిచెపుతూ...!" ఇంకెక్కువ చెప్పలేక వ్యాకుల పాటుతో ఏడ్వసాగింది. కాని కోడలుమాత్రం మెదలకుండా అలాగే కూర్చొని వుండిపోయింది. ఆమె కొంచెంసేపు ఏడ్చి హృదయభారాన్ని తగ్గించుకొని చివరికి కళ్ళు తుడుచుకుంటూ వుపేంద్రుడురాకపోతే ఏమయ్యేవాళ్ళమో... ఎప్పుడూ ఈ సంగతే తలపుకువస్తుంది అమ్మా! కింద ఎవరన్నా పిలుస్తు న్నారా" అన్నది గంభీరంగా.

"పనిమనిషికింద అంట్లు తోముతూ వుంది. ఎవరైనావస్తే తలుపు తీస్తుం దిలే" అన్నది కోడలు. "కాదు అమ్మా నువ్వు వెళ్ళు పనిలోవుంటే అది ఎవరి మాటా వినుపించుకోనుకూడా వినుపించుకోదు" అన్నది అత్తవినుక్కుంటూ.

కిరణ్మయి ఆతురత పైకి కనపర్చకుండానే "నాకూ పనివుంది అత్తా వంటచెయ్యాలి..." అన్నది.

అఘోరమయి ఒక్కసారి మండిపడి "వంట ఎక్కడికిపోదు! నీకేమీ తెలియదు. అతనులేనిదే..." అన్నది.

కిరణ్మయి లేచినుంచుని "నాకు తెలుసుకునే అవసరమేమీలేదు. అందరూ కాదన్నప్పుడే మనకు జరిగిపోతే, వుపేంద్రబాబు రాకపోయినంత మాత్రాన జరగందేమీలేదు." అని ఆమె వంటింటివైపుకు వెళ్ళింది.

అఘోరమయి క్రోధంతో ఏమీ మాట్లాడలేక కోడలు కనపడుతు న్నంతసేపూ నిప్పులు కురిపిస్తూ కూర్చుంది. తర్వాత కోపంతో పనిమనిషికోసం కేకలుపెట్టసాగింది. ఆమెజాడ కూడాలేదు. ఆమె చలికి జడిసి ప్రొద్దుగుంకక ముందే త్వరత్వరగా అంట్లు తోముతూ వుంది. అఘోరమయి క్రోధస్వరము ఆమెకు వినిపించలేదు. అఘోరమయి మండిపడుతూ లేచి నుంచుని గదిలో దీపం చేతపట్టుకుని వసారాలోకి వచ్చి "చెవుల్లో సీసం కరగించి పోశారా ఏమే! వుపేంద్రబాబు బైటనుంచుని గంట సేపటినుంచి అరుస్తూవుంటే విన పడటంలేదూ!" అన్నది బిగ్గరగా.

ఈ కేక, వుపేంద్రునిపేరు విని పనిమనిషి పడుతూలేస్తూ పరుగెత్తుకు వెళ్ళి తలుపుతీసింది. ఎవరూలేరు. బైటకువచ్చి చీకట్లో నలువైపులా తేరిపార జూచింది. ఎవరూవచ్చిన జాడలేకపోయేటప్పటికి తిరిగి వెళ్ళి_ "ఎవరూలేరు అమ్మగారూ!" అన్నది.

అఘోరమయి చేతో దీపం పట్టుకొని ఆతురతతో ఎదురు చూస్తూ వుంది. పనిమనిషి మాటమీద నమ్మకంలేక "లేకపోవటమేమిటే నాచెవులతో అతనికేక వింటేను. ఒకసారి గొందిలోకివెళ్ళి చూడకపోయావు?" అన్నది.

"చూచాను అమ్మగారూ! ఎవరూ కనపడలేదు." అన్నది పనిమనిషి.

నమ్మతగ్గమాటకాదు. వుపేంద్రుడు నిన్నకూడా రాలేదు. ఇవ్వాళ కూడా రాడా? అంగుచేత అఘోరమయి గుంజాటనపడి "వెళ్ళిమళ్లా ఒకసారిబాగా చూచిరా ఎవరైనా వున్నారో లేరో?" అన్నది.

పైట చీకటిమయంగావున్నా గొందిలోనికి వెళ్లటానికి కొంచెం భయంగావుంది. విసుక్కొని "మీరు కూడా అలామాట్లాడతారేం అమ్మగారూ! వారు దాగుడుమూత లాడుతున్నారా ఏమిటి చీకటిగదిలోకివెళ్లి వెతుక్కురావటానికి?" అని తన పనిమీద పోయింది.

అఘోరమయికి గదిలోకివెళ్ళి మంచంమీద పడివున్న కొడుకును పలకరించటానికికూడా అంత వుత్సాహం లేకపోయింది. ఆమె మనసున ఎంతసేపూ వుపేంద్రుడు నిన్నా రాలేదు, ఇవ్వాళా రాలేదనే విషయమే బాధిస్తూవుంది. సంభవాసంభవములైన అనేక కారణాలను వెతుక్కుంటూ కూర్చుంది. కాని అతను కలకత్తా నివాసి కాదనీ, అతని ఇల్లూవాకిలీ పిల్లాజెల్లా మరోచోట వున్నారనీ, ఇంటికి వెళ్ళిపోయి వుంటాడన్న సంగతి ఆమెకు ఒక్కసారి కూడా జ్ఞాపకం రాలేదు. ఇలా ఆలోచిస్తూవుండగా తలవని తలంపుగా కోపము వచ్చిందేమో ననుకుంది. ఆమె అంతర్యం సంశయంతో నిండిపోయింది. కోడలి ప్రవర్తనకు ఈ సంశయాన్ని జోడించి "అదే_ అదే అయివుంటుంది. ఆమె ఇప్పుడు......"అనుకుంటూ లేచి వంటయింటికేసి వెళ్ళింది.

కిరణ్మయి మండుతున్న పొయ్యికేసి మెదలకుండా చూస్తూ కూర్చుంది. మండుతున్న కట్టెల వెలుగునీడలు ఆమెమొహంమీద పడుతున్నాయి. నెత్తిమీద ముసుగు లేదు. తలకూడా దువ్వుకోలేదు. రేగినజుట్టును అలాగే ముడివేసుకుంది. పయటచెంగు జారిపోయింది.

అఘోరమయి మెదలకుండా వాకిటికి ఎదురుగా నుంచునివుంది. నేడు ఆమెకళ్ళముందు కనపడుతున్న వస్తువును పూర్తిగా హృదయంలో కప్పిపెట్టివుంచుకోటానికి ఆమెకు శక్తిలేకపోయింది. అశాంతవదనంమీద వెలుగు నీడలు విచిత్ర తరంగాలలాగ దీపించుతూవున్నాయి. అదే ఆమె సంపూర్ణజ్ఞానానికి

బాహ్యారూపం. ఈ మొహం దోషపూరితమైందా కాదా అని చెప్పలేము. ఎవరైనా నిష్కలంకం, నిర్దోషం అన్నంతమాత్రాన ఆమె మొహానికి వర్ణన కాదు. ఆ మొహం చాల అందమైనది, అన్నా సంతుష్టి కలుగదు, అది ఆశ్చర్యప్రతిరూపము. దానిని ఇంతకుముందెప్పుడూ చూడలేదు. అపూర్వము! చాలసేపు చూచిన తర్వాత ఒక నిట్టూర్పువిడిచి "ఆహా! ఇది మానవవదనమేనా!" అనుకొన్నది లోలోన.

అత్త అలికిడివిని కోడలు త్రుళ్ళిపడి చూచింది. అత్త నిలబడివుంది. మెల్లగా పైటసర్దుకుని "నువ్వు ఇక్కడికి వచ్చావు ఎందుకు అత్తా?" అన్నది.

కంఠస్వరం విని ఆమె మరింత ఆశ్చర్యచకితురాలైపోయింది. తన కోడలి నోటినుండి అటువంటి శాంత, కరుణస్వరం ఆమె ఎప్పుడూ వినలేదు. "నీవొక్కదానివే వంటచేస్తున్నావు ఒకసారి చూచిపోదామని వచ్చాను అమ్మా!" అన్నది వెంటనే.

కోడలు ఆమెకు ఒక పీటవేసి మెదలకుండా పొయ్యివంక చూస్తూ కూర్చుంది. ఆమె మనసులో మరోపీకులాట తలఎత్తింది. సువాసన పవన సాయంతో బైటికివచ్చి, పవనపువిసరుతోనే ఎగిరికూడాపోయినట్లు కిరణ్మయి మనోభావం కూడా అత్త ఆగమనంతో క్షణంసేపట్లో బైటికివచ్చి కపటప్రేమనే సుడిగాలిలో ఎగిరిపోయింది. దీనిలో యదార్థంలేదు. వంచన అనటంలో సందేహమేమీలేదు. అనవసరమైన సంభాషణ పెంచుకుని తగూపెట్టుకోటం ఆమెకుయిష్టంలేదు. దీనితో ఆమె విసిగిపోయింది.

కొంచెంసేపు మెదలకుండావుండి "పనిమనిషిని ఇక్కడికి పంపనా?" అన్నది అఘోరమయి.

కిరణ్మయి తన అంతర్యంలో చెలరేగిన విద్రోహాన్నణచుకొని "ఎందుకత్తా! రోజూ ఒక్కదాన్నే వుండటంలేదు. నాకేంభయంలేదు. అక్కడ వారు ఒంటరిగానున్నారు. ఎవరైనా వారి దగ్గరకువెళ్ళి కూర్చుంటే బాగుంటుంది" అన్నది శాంతంగా.

రోగంతో పడివున్న కొడుకు చప్పరాగానే అఘోమయి మనసులో నొచ్చుకొని "అవునమ్మా నే వెళుతున్నాను, నువ్వుకూడా త్వరగా పని ముగించుకునిరా" అన్నది.

ఈ మధ్యలో వుపేంద్రుడు కలకత్తానుండి ఇంటికి వెళ్ళిపోయాడు. సతీశుడు ఒకరోజున హారన్‌ను చూట్టానికి వుపేంద్రునివెంట వచ్చాడు. కాని మళ్ళారాలేదు. అతను తన ఆవేదనతోనే ప్రత్యేకంగా ఆరాట పడుతున్నాడు. వుపేంద్రుడుకూడా అతని మనసులో ఈ ఇంటికిరావటానికి అయిష్టతాభావం చూచి మళ్ళా ఎప్పుడూ రమ్మని పిలువలేదు. అతడొక్కడే మందూమాకులు ఇంకా ఇతర ఏర్పాట్లూ చేసివచ్చాడు. చివరికి కలకత్తానుండి ఇంటికివెళ్లేరోజున "అవకాశం చూచుకొనివెళ్ళి అప్పుడప్పుడూ హారన్ బాబునుచూచి స్థితిగతులన్ని రాస్తూవుండ" మని చెప్పాడు. సతీశుకు ఇవ్వాళ స్కూలునుండి రాగానే వుపేంద్రుని వుత్తరం అందింది. "నీ చదువు సులక్షణంగా సాగుతూవుందని తలుస్తాను. కాని నేను వచ్చినతర్వాత హారన్ బాబుగారి సంగతులేమీ తెలియలేదు. చాల విచారంగా వుంది. విశేషాలేమీ లేకపోబట్టే రాయలేదనుకుంటున్నాను. ఇకనైనా వైద్యమది ఎలాసాగుతున్నదీ వెంటనే తెలుపగోరాను." అని రాశాడు.

సతీశుని వీపుమీద కొరడాదెబ్బ వచ్చిపడినట్లుంది. అతను ఒక్కనాడు కూడా వెళ్ళి హారన్ స్థితిగతులు తెలుసుకోలేదు. ఈ మధ్యకాలంలో అక్కడ ఏమిజరిగిందోకూడా అంతులేదు. తన అశ్రద్ధకు తనే నొచ్చుకొన్నాడు. గబగబా కిందికిదిగివెళ్ళాడు. బిహారి కాఫీ చేతబట్టుకొని ఎదురుపడ్డాడు. సతీశుని విసురుకి అతనిచేతిలో కాఫీ కప్పు సాసరూ జారి కిందపడ్డా వెనక్కి తిరిగి చూడకుండా బైటికివచ్చి ఒక బండిలోయెక్కి త్వరగా పోనియ్యమన్నాడు. గొంది మరచిపోయానేమోనని ఆతురత పడ్డాడు. కాని బండి పోయినకొద్దీ స్మృతిచిహ్నాలులా జ్ఞాపక మొచ్చాయి. బండి దిగి గొందిలోకి ప్రవేశించేప్పటికి కొంచెం ప్రొద్దు వున్నది. త్వరత్వరగా మురుగుకాల్వలు దాటి ఆ ఇంటి ముందుకు చేరుకున్నాడు. తలుపు తీసేవుంది, అతనికోసమే ఎదురుచూస్తున్నారా అన్నట్లు వాకిట్లో ఎవరో నిలబడి వున్నారు. అతని హృదయం కంపించింది. సరాసరి లోపలికి వెళ్ళటానికి ధైర్యం చాలకపోయింది.

తలుపు చాటున నుంచునివున్న కిరణ్మయి చిరునవ్వు మొహంతో లోపలికి రా చిన్నబాబూ! అలా నిలబడిపోయావేం?" అన్నది ఆదరంగా.

మళ్లా ఆ మరది వరసే! సిగ్గుతో సతీశుని మొహము ఎర్రబడిపోయింది. కాని తమాయించుకొని వినయంగా "మీరు నన్నింత వరకు క్షమించనట్టు న్నది" అన్నాడు.

"లేదు! నీకు క్షమాపణకూడా అవుసరం లేదు. అడగా పెట్టకుండా బలవంతంగా నీమెళ్లో క్షమాహారము వేస్తానా ఏమిటి? దీనివల్ల నీకు అప్రదిష్ట కలగటానికి నువ్వంత తేలిక వ్యక్తివికూడా కాదుగా, నేనంత సునాయాసంగా నిన్ను అప్రదిష్ట పాలుచెయ్యటానికి!" అన్నది.

ఈమధుర పరిహాసంలో ఒకవిధమైన దుఃఖచ్ఛాయలుకూడా వున్నాయి. సతీశుడు వెంటనే లొంగిపోయాడు "నాకు విలువేమీ లేదు వదినా! నన్ను క్షమించు ఏఅప్రదిష్టా కలుగదు" అన్నాడు అతివినయంతో.

కిరణ్మయి చిరునవ్వునవ్వి "క్షమాపణతోనే రూపులేకుండాపోయే విషయాలు చాలా వున్నాయి మరదీ! ఇన్నాళ్లో నిన్ను క్షమించిన తర్వాత మళ్ళా 'సతీశ్ బాబూ!' అని పిలవవలసివస్తే? అటువంటి క్షమాపణ నీకెప్పుడూ దొరుకదు. నిన్ను బంధించి వుంచే గొలుసు నువ్వే స్వయంగా నాచేతికిచ్చావు. తియ్యని మాటలు చెప్పి దానిని వదలించుకోటానికి మావదిన అంత తెలివి తక్కువది మాత్రం కాదని తెలుసుకో" ఆమె వయ్యారంగా తలవూగించింది. సతీశుడు తృప్తిపడ్డాడు. గొలుసులతో బంధించినా నన్నమాట అతనికి వెగటుగా తోచింది. 'నిజంగా ఈ యువతి గొలుసుల్తో బంధించుతుందేమో జాగ్రత్త!' అన్నది అతని అంతరాత్మ. సతీశుడు నిజంగా స్వీయరక్షణకోసం తన శక్తుల నన్నిటినీ కేంద్రీకరించి సిద్ధంగా వున్నాడు. కాని ఈ ఇంట్లో అడుగు పెట్టగానే అతని దృష్టి కర్తవ్య విముఖురాలై సిగ్గుతో తల వొంచుకుంది. కాని హఠాత్తుగా ఈ గాయం తగిలేప్పటికి ఈ సందేహం ఎక్కువై పోయింది. అతని వేదన చూచి కిరణ్మయి ఆశ్చర్యంతో "ఏమి జరిగింది? నీ మొహం ఇలా వాడిపోయిందేం ఇంకా భోజనం చెయ్యలేదా ఏమిటి? పైకిరా, కొంచెం కాఫీ తీసుకుందువుగాని" అన్నది.

సతీశుడు ఎదురు మాట్లాడకుండానే విందు నారగించటానికి వుద్యుక్తుడయ్యాడు. ఈ నవ్వు కేవలం పరిహాసం మాత్రం కాదనుకుంటూ ఈ రహస్యమయనారి వెంట నడిచివెళ్ళాడు.

పైకి వెళ్ళి అటూఇటూ చూచి "ఇవ్వాళ అత్తగారు దాసీదాన్ని తీసుకుని కాళీపూజచేసి రావటానికి వెళ్ళింది. వంటింట్లో కూర్చుని నువ్వు పూరీలు వేల్చు, నేను చేస్తాను. చేతనవునా?" అని ఆమె ప్రశ్నించి నవ్వింది. "చేత నవునట్టున్నది, నీ మోహమే చెబుతూ వుంది, రా" అన్నది.

సతీశుడు హృదయంలో చెలరేగుతున్న తర్క వితర్కాలను కొంచెం సేపు కట్టిపెట్టి "వంటనా, నాకు పూరీలు వండటం చేతనవునో కాదో, నా మొహంమీద రాసివుందా ఏమిటి?" అన్నాడు.

"నిస్సందేహంగా! కాని ఆ రాతను చదవటానికి తెలివి వుండాలి. ఆ రాత్రి నా మొహాన ఏమైనా రాసివుందా ఏమిటి—నువ్వు సునాయాసంగా చదువ గలిగావు?" అన్నది కిరణ్మయి.

సతీశుడు మళ్ళా తలవంచుకున్నాడు. వంటింట్లోకి వెళ్ళిన తర్వాత ఈ విధమైన హాసపరిహాసాలు జరిగాయి. ఇద్దరూ వంటలో మగ్నమైపోయారు. ఈ సంఘర్షణ తాపం కొంచెం చల్లబడిపోయింది. "మీ సంగతులు చాలా వుపేంద్రబాబుగారిద్వారా విన్నాను. అయితే వారిక్కడ లేరా ఏమిటి? ఇంటికి వెళ్ళారా?" అన్నది కిరణ్మయి. సతీశుడు 'అవును' అన్న తర్వాత "వారిక్కడ లేరని నేననుకున్నాను. కాని అత్తకు మాత్రం నమ్మకం లేదు. తొందరగా వెళ్ళవలసి వచ్చిందనుకుంటాను," అన్నది కిరణ్మయి.

సతీశునికి వివరాలు సరిగ్గా తెలియవు. అతనికి అసలేమీ తెలియదు. మీ మూలానే మా యిద్దరిమధ్యా నాన వివాదాలు జరిగినాయని చెప్పటానికి కూడా అతనికి యిష్టంలేదు. అందుకని వుపేంద్రుడు చెప్పా చెయ్యకుండా వెళ్ళిన కారణంకూడా అతనికి తెలియదు. అందుచేత అతను మెదలకుండా వూరుకున్నాడు. కాని కిరణ్మయి ఆ ప్రసంగాన్ని అంతటితో సమసిపోనివ్వలేదు.

"వుపేంద్రబాబు చేసినపని మంచిది కాదు చిన్నబాబూ! చెప్పి వెళ్ళినట్టయితే వారికి కలిగే నష్టమేముంది. అత్తా ఇంత హైరానపడి చచ్చేది కాదు. ఆమెకు నేను లక్షసార్లుచెప్పాను: వుపేంద్రబాబుగారు ఎల్లప్పుడూ ఇక్కడ ఎందుకు వుంటారు. వారికి ఇల్లూ వాకిలీ పిల్లాపెల్లా వున్నారు. పనిపాటలు వుండివుంటాయి. పరాయిచోట్ల ఎంత కాలముని వుంటారని_కాని అత్తకు నామాట మీద నమ్మకం వుంటేగా! అత్తే కాదు పెద్దతనం వచ్చిన తర్వాత ప్రతివారూ ఇంతే తమ సొంతతప్ప ఇంకేమీ వారికి నచ్చదు." అన్నది కిరణ్మయి.

సతీశుడు దీనికి సరైన సమాధానం చెప్పకుండానే "ఉపేంద్రబాబు ఇన్ని రోజులు ఇక్కడ వుండటమే చాలా ఆశ్చర్యం. ఎక్కడికి వెళ్ళినా అతనికి ఎక్కువకాలం వుండే అలవాటులేదు. పెండ్లయినతర్వాత ఒక్క రాత్రి కూడా ఎక్కడా మొదట వుండలేదు. ఏపని వచ్చినా మామందు వుండేవాడు ఇప్పుడు అవి అన్నీ వదిలిపెట్టాడు ఇల్లు కదలటం లేదు. వీలులేకగానీ లేక పోతే కోర్టుకూడా మానివేసేవాడేమో!' అన్నాడు.

కిరణ్మయి అడ్డు తగిలి "లే చిన్నబాబూ! పీటవేసి అన్నం వడ్డిస్తాను. భోంచేస్తూ మాట్లాడుకోవచ్చు?" అని పీటవేసి పళ్ళెంలో అన్నం వడ్డించి దగ్గరగా కూర్చొని అత్యంత ఆతురతతో "ఇంకా ఏమిటి?" అన్నది.

సతీశుడు ఒక ముద్ద నోట్లో పెట్టుకుని "ఆఁ ఒక వింతసంగతి చెబుతా వినండి. మా ఉపేంద్రబాబు సంబంధాలు కుదర్చటంలో మంచిదిట. అతను చేసిన పెళ్ళిళ్ళకి అంతులేదు. మా స్నేహితుడొకనికి పెండ్లి ఏర్పాట్లన్నీ చేసి లగ్నంనాటి రాత్రికి అంతులేకుండా పోయాడు. ఇంట్లో వారికి వంట్లో బాగుండలేదని వంకపెట్టి అతను ఇంట్లోనుంచి కదలకపోయాడు. మేమంతా కలసి ఎంత బలవంత పెట్టామనుకున్నావు వదినా! అంతా వ్యర్థమైంది. రాతి విగ్రహమైనా కదిలేదిగాని ఉపేంద్రుడు కదలలేదు. చివరికి భార్య 'నావంట్లో బాగానే వుంది, మీరు వెళ్ళండి' అన్నా 'నీ బాగోగులు ఆలోచించే బాధ్యత నామీద వున్నది. నీకెందుకు నువ్వూరుకో' అన్నాడు.

కిరణ్మయి మెదలకుండా వింటూ కూర్చుంది. ఆమె గత జీవితస్మృతి ఆమె హృదయాంతరాళంలో చేరి ఎంత వ్యథపెడుతూవుందో సతీశుని కేమి ఎరుక? ఏమాట ఎక్కడ గాయపర్చుతుందో అతని కేమి అంతు? అతని సొదలో అతనువున్నాడు. చాటున ఉపేంద్రుని ఎవరు ఏమన్నది, ఎవరు ఎలా ఎగతాళిచేసింది, అందరి ప్రయత్నాలు ఎలా విఫలమైందీ, అందరి కోర్కెలూ ఎలా నిష్ఫలమైందీ మొదలైన సంగతులన్నీ చెబుతున్నాడు. కాని అతని మాటలు వినేది ఎవరు? కిరణ్మయి అప్పుడు అగాధకు చాల దూరంగా వెళ్ళి పోయింది.

హఠాత్తుగా చెయ్యిఆపి మాటల ధోరణినికూడా ఆపి "నువ్వు వింటు న్నావా ఏదైనా ఆలోచిస్తున్నావా?" అన్నాడు.

కిరణ్మయి తృప్తిపడి నవ్వుతూ "ఆఁ ఆఁ వింటున్నాను. కాని రోగంలో నున్నవారికి సేవ చెయ్యటంతప్పేమీ కాదని నావుద్దేశం. న్యాయంకూడాను" అన్నది.

"సేవ చెయ్యటం న్యాయమే. కాని దానికికూడా అతి పనికిరాదు. అత్తగారు పోయినప్పుడు వారం రోజులవరకు ఆమె దగ్గరనుంచి కదలలేదు. ఇంట్లో ఇంత మంది వుండగా తిండీ తిప్పలు మానేసి అతనే వుండే అవసరమేమొచ్చింది. చెప్పండి?" అన్నాడు సతీశుడు ఆవేశంతో.

కిరణ్మయి కొంతసేపు మెదలకుండా అతని మొకంకేసి చూసి "అయితే చిన్నబాబూ! వుపేంద్రబాబు భార్యను బాగా ప్రేమిస్తాడా?" అన్నది.

"హద్దుమించి!" అన్నాడు సతీశుడు.

కిరణ్మయి మళ్ళీ కొంచెంసేపు మెదలకుండా వూరకొని "ఎలా వుంటుంది? అందంగా వుంటుందా?" అన్నది.

"ఆఁ చాలా అందంగా వుంటుంది. కిరణ్మయి చిరునవ్వు నవ్వి "నాలాగా?" అన్నది.

సతీశుడు తల వంచుకున్నాడు. కొంచెంసేపు ఆలోచించుకున్న తర్వాత తల ఎత్తి "నిజంగా మీకీసంగతి తెలుసుకోవాలని వుందా?" అన్నాడు.

"లేకపోతే ఏమిటి?"

"ఇటు చూడు__నా మాటలకు విలువేమీ లేదు. విలువనేది వుంటే- ఈ పృధివిలో నీలాంటి అందకత్తెను భగవంతుడు ఇంకెక్కడా సృష్టించలేదని నావుద్దేశం."

కిరణ్మయి ఏదో సమాధానం చెప్పబోతూ అత్త కేకవిని లేచి వెళ్ళింది. అత్త కాళీకాలయం నుండి తిరిగి వచ్చింది.

సతీశుడు చేయికడుక్కొని బైటికి వచ్చేటప్పటికి అఘోరమయి ఎదురుగా తమ్ముడు కాదు అమ్మా! అత నెక్కడ?" అన్నది

"ఇంటికి వెళ్ళిపోయారట" అన్నది కిరణ్మయి.

అఘోరమయి 'సరే' అని చందనశోభిత వదనాన్ని మలినం చేసుకొని_ విచారంతో కొడుకు గదిలోనికి వెళ్ళిపోయింది.

"ఇక నేను వెళ్ళనా వదినా?" అన్నాడు సతీశుడు.

కిరణ్మయి పరధ్యానంలో "మంచిది" అన్నది.

సతీశుడు రెండవసారి సాగి తిరిగివచ్చి "ఉపేంద్రబాబుగారి దగ్గర నుండి ఉత్తరం వచ్చింది. హారన్ బాబుగారికి చికిత్స బాగా జరుగుతున్నదో లేదో వ్రాయమన్నాడు." అన్నాడు.

"ప్రస్తుత మేమీ జరగటం లేదు. ఇదివరకు వచ్చుచున్న డాక్టరు చేత చికిత్స చేయించటానికి యిష్టం లేకపోయింది. మళ్లా ఫలానివారి దగ్గర తీసుకోమని చెప్పకుండానే వారు వెళ్ళిపోయారు." అన్నది కిరణ్మయి.

"ఇదేమిటి వదినా! ఒక్కసారి మందూ మాకులూ వదిలిపెట్టి వూరు కున్నావా? ఇదేం పని? ఇదేమి లోకము?" అన్నాడు సతీశుడు ఆశ్చర్యంతో.

"మరో ఏర్పాటు ఏమీ చెయ్యకుండానే వెళ్ళిపోయారు. ఆఁ సతీశుడు ఇక్కడే వున్నారు. అతనే ఏర్పాటన్నీ చేస్తాడని చెప్పినట్లు జ్ఞాపకం కాని నీవుకూడ ఇటు తిరిగి చూడలేదు నేనొక్కదాన్నే ఏమిచేసేది ?"

సతీశుడు కొంచెంసేపు మొదలకుండా కూర్చుని "రేపు ప్రొద్దున్నే వస్తాను" అని గబగబా బైటికి వెళ్ళిపోయాడు.

సతీశుడు వెళ్ళిపోయిన తర్వాత కిరణ్మయి భర్త గదితలుపుతీసి చూసింది. అతను దిండుమీద తలపెట్టుకుపడుకొని తల్లితో మెల్లగా మాట్లాడుతున్నాడు. ఇవ్వాళ సాయంత్రం కూడా అతనికి జ్వరం రాలేదని తెలుసుకొని తిరిగివచ్చి బైట చీకట్లో మెదలకుండా కూర్చుంది. ఇవ్వాళ సతీశుని నోటివెంట 'ఉపేంద్రుని పతిన చరిత్ర'నువిని ఆమె హృదయం వుప్పొంగి పోయింది. రసస్నిగ్ధమైంది.

౧౯

ఆ రాత్రి సతీశుడు వెళ్ళిపోయిన తర్వాత కిరణ్మయి చాలసేపటి వరకు ఆ చీకటి వరండాలో మౌనంగా కూర్చుని చివరకి లేచి వంటింట్లోకి వెళ్ళి వేసరు పొయ్యిమీద పెట్టి హృదయావేగాన్నణచుకుని కూర్చుంది

ఇవ్వాళ సతీశుడు ఉపేంద్రుడు, సురబాల మొదలైన స్త్రీ, పురుషులను తీసుకుని వచ్చి ఒక మహోన్నత అస్పష్ట అభినయ మాడిపోయిన దృశ్యాన్ని స్పష్టంగా చూడాలనే లాలసతో గదిలో ఏకాంతంగా కూర్చుని వుంది కిరణ్మయి.

కాని ఆమె శాంతంగా, నిమిత్తంతో ఆ దృశ్యాలను స్పష్టంగా చూడ లేకపోయింది. వాటినుండి కన్ను మరల్చ లేకపోయింది. ప్రత్యక్షంగా ఆనందానుభూతి పొందలేక పోయింది. ఇది తన దుఃఖిత హృదయానికి అనధికార ప్రయత్నమని వూహించ సాగింది. అందుచేత దొంగలాగ చాటున దాగివుండటమే ఆమె మేలను కున్నది.

సింగసలంమీదికి వచ్చి పోయేవారి అడుగుల చప్పుడు ఆమె హృదయాన్ని నొక్కి వేసినట్లయింది. ఆమె కళ్ళు రెండూ మండిపోసాగెనె. ఆమె వేడి చూపులు ఎక్కడదేన్ని కాల్చి మసిచేస్తాయోనన్న భయంతో కామాను ఆమె దృష్టుల్ని మూడుతున్న పొయ్యినుండి మరల్చలేదు.

ఇవ్వాళ ఆమె ఏమైనాసరే తనచి త్తవృత్తుల్ని విచ్ఛిన్నం కానీయకుండా శాంతంగా వుంచటానికి శాయశక్తులా ప్రయత్నిస్తూవుంది. ఇంతలో చెప్పుల చప్పుడువిని త్రుళ్ళిపడి తలెత్తి చూచింది. వాకిట బైట డాక్టరు అనంగ మోహనుడునిలబడి వున్నాడు.

కిరణ్మయి పయట సర్దుకునిలేచి నుంచున్నది. ఇది చూచి డాక్టరు మొహం చిట్లించు కున్నాడు.

ఇంతకుముందు ఎన్నిసార్లు ఈ డాక్టరు ఇక్కడికి వచ్చినుంచున్నాడు. ఆమె కరకమలాలతో చేసిన ఖాద్యాలను భుజించాలని ఎన్నిసార్లు ప్రలోభ పడ్డాడు! పూర్వపు పరిహాసాలు మళ్ళీ ప్రారంభ మౌతా యేమోనని ఎదురు చూస్తూ నుంచున్నది. కాని ఇవ్వాళ డాక్టరు పరిహాస ప్రసంగాలేవీ తీసుకు రాలేదు. కొంచెంసేపువుండి "పనిమీద ఎక్కడికో వెళ్ళవలసి వచ్చింది. ఈ పది పదిహేను రోజులూ హారన్‌బాబుకోసం చాల విచారపడ్డాను. కాని నేను విచారపడే అవసర మేమి లేదనుకుంటాను." అన్నాడు గంభీరంగా.

కిరణ్మయి తల కాయ వూగించి "లేదు. వారుకులాసాగానే వున్నారు." అన్నది.

"మీకు నా అవసరం లేకపోయినా నా అవసరంమాత్రం ఇంకా తీరలేదు. అందుకనే ఇంత దూరం రావలసి వచ్చింది."

కిరణ్మయి వంచినతల ఎత్తకుండానే "మంచిదే అత్త ఇంకా మేలుకునే వుంది. వెళ్ళి చెప్పండి నాతో చెప్పటం అనవసరం" అన్నది.

డాక్టరు మొహం గంపెడు చేసుకొని "నేను ఇప్పుడు ఆమె దగ్గరనుంచే వస్తున్నాను. ఇంత నిర్లక్ష్యంగా పంపటం మర్యాదగా వుండదు." అన్నాడు.

కిరణ్మయి మాట్లాడలేదు.

"ఇప్పటికి అయిదారు నెలలనుండి మందు మాకులకు అయినఖర్చు నీవు భరిస్తావో, మీ అత్త యిచ్చుకుంటుందో? కాని వూరికే వెళ్ళమంటే డాక్టరు ఎలా వెళతాడు కిరణ్" అన్నాడు డాక్టరు వ్యంగ్యంగా.

ఇవ్వాళ డాక్టరు చిన్న పేరెట్టి పిలవటం కిరణ్మయి చెవులకు కటువుగా తోచింది. ఆమె భయంతో వణికి పోయింది. ఆ మసకలో కూడా డాక్టరుకు యిది స్పష్టంగా కనిపించింది.

కిరణ్మయి మృదుస్వరంతో "మీకేమి కావాల టారు. పైకమా?" అన్నది.

డాక్టరు నవ్వులాటగా మార్చి— "'మీరెందుకు కిరణ్! ఇక్కడ ఇంకెవరూ లేరు. 'నువ్వు' అన్నా ఏమి ఫరవాలేదు. నేనింతకాలం వరకూ ఏ కోర్కెతో వచ్చానో నీకు తెలియదూ?" అన్నాడు.

కిరణ్మయి శరీరమంతా ఒక్కసారి గగుర్పొడిచింది. "పైకం అవసరం లేదనటం కష్టం. నీదగ్గర కూడా పైకం కొంత ఏమీ లేకపోతే పైకమిచ్చే పంపించు. నేను అన్నివిధాలా చెయికడుక్కోదలచుకోలేదు ఇన్నాళ్ళకి నువ్వు నామనస్సులోని కోర్కెను గ్రహించినందుకు సంతోషం. ఇవ్వాళ నిన్ను ఇంకెక్కువ యాతన పెట్టదలచుకోలేదు. కాని రేపు ఒకసారి రావచ్చునా? అని అడిగాడు డాక్టరు మళ్ళా.

డాక్టరు హృదయంలో ఏ అగ్ని రగులుతూ వుందో కిరణ్మయికి బాగా తెలుసు. అయినా ఆమె శాంతంగా స్థిమితంగా "వద్దు మీరు కొంచెం ఆగండి నేను ఇప్పుడే తీసుకువచ్చి యిస్తాను" అని చివ్వున తలుపు తీసుకొని వెళ్ళిపోయింది.

ఇది చూచి డాక్టరు భయపడ్డాడు. కిరణ్‌ను అతనెరుగున్నాడు. ఆమె ఎక్కడనుంచి ఏమి తీసుకు రావటానికి వెళ్ళిందో తెలియదు. ఈ రాత్రివేళ ఏమి రగడ తీసుకువచ్చి పెడుతుందో నన్నభయం అతన్ని వ్యధపెట్టసాగింది. ఆమె గాయపడి వెళ్ళింది. తిరిగి వచ్చి మళ్ళా ఆగాయానికి బదులుతీర్చుకోకుండా వుండదు. అనుకొని అనంగ మోహనుడు స్థబ్ధుడై నిలబడి పోయాడు.

కిరణ్మయి తిరిగి వచ్చేటప్పటికి ఆలస్య మేమీ కాలేదు. మెదలకుండా తలవంచుకుని పయిటచెంగు నున్న నగలమూట విప్పి డాక్టరు ముందువేసి "తీసుకోండి, మీ ఫీజు ఎంతఅయిందో, ఏ మందుకు ఎంత పట్టిందో ఇన్ని రోజుల తర్వాత లెక్కవేయటం అనవసరం. నాకంత తీరికా లేదు. మీకు ధైర్యమూ లేదు_ మా దగ్గర వున్నది. అంతా మీ ముందే పెట్టాను. అది తీసుకుని ఇక మా ప్రాణాన్ని తేలిక పర్చండి" అన్నది కిరణ్మయి. డాక్టరు మొహం తెల్లబోయి మెదలకుండా నుంచున్నాడు. "ఇంకా ఆలస్యం చేస్తా రెందుకు? నాదగ్గర ఇంకేమీ లేదంటే నమ్మండి. వున్నదంతా తీసుకువచ్చాను. ప్రొద్దు పోతోంది, ఇక మీరు దయచేయండి" అన్నది కిరణ్.

అనంగమోహనుడు భయపడుతూ "నాకు నీ నగ లవసరం లేదు. నాకు నగదు కావాలి. అదికూడా..." అన్నాడు.

"నగలు కూడా పైకి మేనన్న సంగతి తెలుసుకు నేంత వయసు వచ్చింది మీకు. అనవసర మైన వంకలు పెట్టి ఆలస్యం చెయ్యకండి?" అన్నది కిరణ్మయి క్రోధంతో.

అనంగమోహనుడు ఒక్కసారి తలకాయ తిప్పి "నేను నీ నగలు ఎన్నటికీ తీసుకోలేను." అన్నాడు.

కిరణ్మయి దగ్గరే కూర్చుని వుంది. చివ్వున లేచి నుంచిని "ఎందుకని తీసుకోరు? ఎవరియందు దయతలచి? ఇచ్చిన దానిని తిరిగి తీసుకోటం అసంభవం" అని కొంచెంసేపు మెదలకుండా వుండి "మీరు తీసుకోకపోతే వీటన్నిటినీ బీదా బిక్కికి పంచిపెడతాను. ఇంట్లో పెట్టుకుని నాపతికి అశుభం కోరను" అని కాలితో నగలను కొంచెం దూరంగా త్రోసి "తీసుకుని వెళ్ళండి త్వరగా అన్నది మళ్లా.

చివరిమాట చాలా కటువుగా అన్నది. అనంగమోహనుడు ఇష్టం లేక పోయినా చేతో నగలు తీసుకున్నాడు. కిరణ్మయి కొంచెంసేపు వాటికేసి చూచి ఏవగింపుతో "వీటిని తీసుకు వెళ్ళండి అవి నా కళ్ళముందు వున్నంత వరకు నాకు నిద్ర పట్టదు" అన్నది. మెల్లగా డాక్టరు నగలు తీసుకునివెళ్ళబోతూండేప్పటికి కిరణ్మయి కొంచెం అధైర్యంతో "చాలా ప్రొద్దుపోయింది" అన్నది.

"వెళుతున్నాను. కాని నువ్వు చాల పొరపాటు చేశావు. ఈ నగలు నా సొత్తేమీ కాదు. అన్నీ నీవి. నేను తీసుకోకపోతే బీదాబిక్కికి పంచిపెట్టట మెందుకు ? నన్ను క్షమించు కిరణ్ !" అన్నాడు డాక్టరు.

కిరణ్మయి విసుగుచెందింది. "మళ్ళా నా పేరెత్తుతారు ! ఈ నగలన్నీ నావైన సంగతి నిజమే. వీటిమీద నాకు మమతవున్నంతవరకు మీ సహాయం తీసుకోవలసి వచ్చింది. ఇప్పుడు నాకు వాటిమీద మోజు లేదు. సరే, చాలా ప్రొద్దుపోయింది డాక్టరుగారూ !" అన్నది.

డాక్టరు తన విజిటింగు కార్డొకటి తీసియిచ్చి "మా యింటిచిరునామా ......" అన్నాడు.

"ఇటు తేండి అని కిరణ్మయి చెయిజాపి తీసుకొని మండుతున్న పొయ్యిలో వేసి "నాకు దీని అవసరమేమీ లేదు. ఇప్పుడిప్పుడే గా మీరు నన్ను క్షమాపణ కోరింది. మిమ్మల్ని పూర్తిగా క్షమించాలనే మీరుణాన్నీ, మీ సంబంధాన్నీ నిశ్శేషం చేశాను. ఏనాడూ ఏ కారణం చేతయినా, మీ విషయాలు నా మనసులోకి రావద్దని ఆశీర్వదించి పొండి" అని ఆమె, సమాధానానికీ ఎదురు చూడకుండానే తలుపు టక్కున వేసి వంటింట్లోకివచ్చి కూర్చుంది.

డాక్టరు చెప్పుల చప్పుడు గాలిలో లీనమై పోయిన తర్వాత ఒక నిట్టూర్పు విడచి చూచింది. పొయ్యి ఆరిపోయింది. వూది మళ్ళా మండించి మెదలకుండా కూర్చుంది.

ఆలోచనలతో ఆమె శరీరం కొయ్యబారిపోయినా లేవలేక పోయింది బైట అంధకారంలో అప్పుడుకూడా ఒక భయంకర భూతం ఆమెకోసం చేతులు జాపుకు కూర్చున్నట్టు తోచింది. కొట్టుకొంటున్న హృదయాన్ని రెండు చేతులతో అణచివుంచింది. అంతిమ అధ్యాయాన్ని ఇవ్వాళ కాకపోతే రేపైనా పూర్తి చెయ్యక తప్పదని ఆమెకు బాగా తెలుసు. ఈ బంధాన్నుండి తన్ను విడిపించుకోడానికి సాహసమూ, శక్తి ఎంత వెతికినా తనలో కనిపించ లేదు. ఇలా జీవితంలో ఎన్ని దివసాలు గడచిపోయాయి__ రాత్రింపగళ్లు సహించి వూరుకుంది. కాని ఏమీ చెయ్యలేక పోయింది! ఇంత మహాకార్యం ఇంత సులభంగా ఎలా అవుతుందా అని మెదలకుండా ఆలోచించ సాగింది.

కావాలని పిల్చి తెచ్చుకుని పెంచి పెద్దదాన్ని చేసిన పాపం ఇవ్వాళ వూరికే పొమ్మంటే పోతుందా? అలా ఎందుకు జరిగింది?

హఠాత్తుగా తలుపు తీసిన చప్పుడు విని త్రుళ్ళిపడి తలెత్తి చూచింది కిరణ్మయి. "పొయ్యి ఆరిపోతే చూడలేదు అమ్మగారూ! చాలా పొద్దు కూడా పోయింది" అన్నది పనిమనిషి.

కిరణ్మయి చిన్నగలేచి ఆమె దగ్గరకు వెళ్ళి "డాక్టరు వెళ్ళిపోయాడండీ?" అన్నది.

దీపంవత్తి పెద్దదిచేసి "వెళ్ళి రెండు గంటలైంది. అమ్మగారూ! మీకు కూడా చెపుతున్నాను ..." అని ఆమె కిరణ్మయికేసి చూచి మళ్ళీ మాట్లాడలేక పోయింది. ఆమె నాలుక ఒక్కసారి ఆగిపోయింది. పొయ్యి వెనకనోసి నగలులేని కిరణ్మయి శరీరంకేసిచూచి దీపం గూట్లోపెట్టి దగ్గరకు వచ్చి నిల్చుని "ఇదేమిటి అమ్మగారూ?" అన్నది.

## ౧౮

దివాకరుడు రాత్రంతా చాలాచింతతో గడిపాడు. నిన్న వుదయం అతను చాటు చాటుగా తను బి. ఏ. తప్పిన సంగతీ, సాయంత్రం నరేంద్రుడు తన వివాహం విషయం చాల సంతోషముతో చెప్పటమూ విని అతనికి మృత్యువును కౌగిలించు కొందా మనిపించింది. పుత్రశోకంలో నున్న తల్లి దుఃఖంతో సొమ్మసిల్లి పండుకొని దుఃఖంతోనే లేచినట్లు ఇవ్వాళ అతని హృదయములో అగాధదుఃఖవ్యథతో పండుకొని లేచాడు. కళ్ళు నలుపుకు చూచాడు. తూర్పువైపు కిటికీ అద్దాలమీద ఎండపొడ పసుపుగా వుంది. అతను రోజూ వుదయానే లేచి దినకరుని నమస్కరించేవాడు. ఇవ్వాళ ఆమాటే మరచి పోయాడు. సత్రంలోని అపరిచిత అతిథిలాగ వానికేసి వుదాసీనతతో

చూస్తూ పడుకున్నాడు. నిర్మలమైన అద్దాలలోంచి నీలాకాశం కనపడుతూ వుంది. ఈ మహాసృష్టిలో ఏమూలైనా తనకు కొంచెమైనా స్థానముందా లేదా అన్న ప్రశ్న చెలరేగింది అతని హృదయంలో. తర్వాత ఆలోచనా ప్రపంచంలో మునిగి కనుచూపు మేరకు పరికించాడు. కాని ఎక్కడా తనకు స్థానమున్నట్లు తోచలేదు. ఇంత మహావిశ్వాన్ని సృష్టించిన సృష్టికర్త తన కెక్కడా సూదిమొనంత స్థానంకూడా లేకుండా చేసాడు. అతనికి తల్లిలేదు, తండ్రిలేదు, ఇల్లులేదు, వాకిలిలేదు, బహుశా జన్మభూమికూడా లేదేమో. అతనికి 'నా' అనుకునేవారు ఎవరూలేరు. ఈ చిన్న గదితోపాటు అతను అనేక బంధనాలలో చిక్కుకొని వున్నాడు. అతనికి వూహ కలిగిన దగ్గర నుండీ ఈ చిన్నగదే తల్లి అంకంలాగ అతనికి ఆశ్రయమిచ్చింది. కాని ఇది కూడా అతని స్వంతంకాదు. మామగారి యిల్లు. ఈ ఆశ్రయం తన తల్లిది కాదు, సవతి తల్లిది.

ఈ విధంగా దుఃఖచింత మరింత జటిలమై పోతూండేప్పటికి నృపేంద్రుని కంఠస్వరం విని అతను సంబాళించుకుని దిగ్గునలేచి కూర్చుని కిటికీలోంచి తొంగిచూచాడు. నృపేంద్రుడు నౌకరుకు ఏదో చెప్పి తలవంచుకుని తిన్నగా వెళ్ళిపోయాడు.

అభ్యాసం చొప్పున ఇవ్వాళకూడా అతనికి పెందలాడే మెలకువ వచ్చింది. కాని రాత్రంతా అతనికినిద్రపట్టలేదు. దుఃస్వప్నభూతాలు రాత్రంతా అతని వల్లు వూనాంచేసి ఇప్పుడే వదిలి పెట్టినాయి. అవి విడచిపోయిన నిట్టూర్పులగాలి కళ్లుమూసికొని పడుకొనివున్న అతనికి స్పర్శ తగులుతూనే వుంది. తప్పిన సంగతి మళ్ళీ తలపుకు వచ్చింది. ఎంతో కష్టపడిచదివాడు. కాని అంతా వృథాయైంది. ఈకబురు ఇవ్వాళ అంతావింటారు. పొగ చిన్న సొరంగంలోంచి వచ్చి ఇల్లంతా వ్యాపించినట్లు ఈ కాస్త నిష్ఫలతా ద్వారం గుండావచ్చి - నిరాశా మేఘాలు అతని మనసును ఒక్కసారి ఆవరించాయి.

ఎనిమిదిగంటలౌతుంది. అతను దిగ్గునలేచి కూర్చుని "ఏమైనా సరే, అన్నయ్యకు కోపంరానీ, వదిన దుఃఖపడనీ నేను వివాహం చేసుకోను. ఇల్లాలు తనంతట తానే నా యింటికి వస్తుంది. లేకపోతే రాదు. వచ్చిన తర్వాత నేను గౌరవపూర్వకంగా గౌరవిస్తాను. కాని అమర్యాద పాలు చెయ్యను. ఈ సంకల్పాన్నుండి నన్నెవరూ కాదనలేరు" అన్నాడు.

దివాకరుడు మెల్లగా సురబాల గదిముందుకు వెళ్ళి "వదినా" అని పిలిచాడు.

లోపలినుండి కోమలస్వరంతో "లోపలికి రా" అన్న సమాధానం వచ్చింది.

దివాకరుడు లోపలికి వెళ్ళాడు. సురబాల తలవంచుకొని బీరువా లోంచి సామానుతీసి పెట్టెలో పెడుతూవుంది. "అన్నయ్య వూరుకు వెళతారా ఏమిటి?" అని అడిగాడు.

సురబాల తలవంచుకొనే "లేదు. కలకత్తా వెళతాను" అన్నది.

తర్వాత దివాకరునికి ఏం ప్రశ్న వెయ్యాలో తోచలేదు. శూన్యగృహం లోంచి ఇంతదూరం లాక్కొచ్చిన శక్తి సమయ మొచ్చేప్పటికి అదృశ్యమై పోయింది. ఏ విధంగా సంభాషణ ప్రారంభిద్దామా అని అతను మెదలకుండా ఆలోచించసాగాడు.

ఇంతలో వసారాలో చెప్పుల చప్పుడు వినిపించింది. నరేంద్రుడు పరదా తొలగించి లోపల అడుగుపెట్టాడు. దివాకరుడు సిగ్గుతో పారిపోయి జారుకోటానికి ప్రయత్నిస్తూండేప్పటికి నరేంద్రుడు 'ఆగు' అని నిమ్మళంగా మంచంమీద కూర్చుని, కోటూ, చొక్కా విప్పుతూ, "ఏంరా తప్పావు ? రోజూ రాత్రి ఒంటిగంటదాకా మేలుకొని వుండి ఏమి చేసేవాడివి ?" అన్నాడు.

దానికి సమాధానమేముంది? దివాకరుడు తలవంచుకుని నుంచున్నాడు.

"నువ్వు ఇక్కడవుండి ఏమీ చెయ్యలేవుగాని, కలకత్తా వెళ్ళి చదువు" అని కొంచెంసేపున్న తర్వాత చిరునవ్వుతో "వదినదగ్గర ఏమి విన్నవించుకోటానికి వచ్చావు? పెళ్ళిచేసుకోనని చెప్పటానికే వచ్చావు కాదు?" అన్నాడు.

ఈ మాట విని దివాకరునికి మనసు కొంచెం కుదుటపడింది. అతని దుఃఖమంతా ఒక్కసారి వదిలిపోయింది. నవ్వుమొహంతో తలెత్తిచూశాడు.

వుపేంద్రుని పెదవులమీద చిరునవ్వువున్నా దానిలోని అంతరార్థాన్ని ఎవరూ తెలుసుకోలేక పోయారు. చివరికి 'సరే' ఇకనైనా మనసు దగ్గర పెట్టుకు చదువు. వచ్చే మార్గశిరమాసంవరకు నీకు శెలవు. ఇంకా చాలా కాల ముంది." భార్య వంకచూచి, హారన్‌బాబు స్థితేమీ బాగుండలేదని సతీశునివద్దనుండి తంతివచ్చింది. ఇప్పుడే "పదకొండుగంటల బండికి వెళతాను. కొంచెం థర్మామీటరు ఇటుతే. జ్వరం తగ్గిందో లేదో చూస్తాను.— అరే! ఇంతపెట్టె వెంట మోసుకెళ్ళి ఏమి చెయ్యను? ఒక చిన్నపెట్టె వుంటే యివ్వు" అన్నాడు.

సురబాల గుడ్డలు ట్రంకులో సర్దుతూవుంది. మృదుస్వరముతో "నేను కూడా వెంటవస్తాను. చిన్నపెట్టెలో మన యిద్దరి బట్టలూ పట్టువు" అన్నది.

వుపేంద్రుడు చకితుడై "నువ్వుకూడా వస్తావా? పిచ్చేమైనా ఎత్తిందా ఏమిటి?" అన్నాడు.

సురబాల తనపని చేసుకుంటూనే "లేదు" అని దివాకరునికేసి తిరిగి "తొందరగా స్నానంచేసి భోంచేసిరా దివం! నా వెంటవద్దువుగాని" అన్నది.

దివాకరుడు ఆశ్చర్యంతో వుపేంద్రునివంక చూచాడు. అతను నవ్వుతూ "నీకుకూడా పిచ్చిఎత్తినదా ఏమిటి? హారన్‌బాబు చాల ప్రమాదావస్థలో వున్నాడు. ఒక విధంగా అతనికి కాలం దాపురించింది. నేను అతనికి అంత్య

క్రియలు చెయ్యటానికి వెళుతున్నాను. మీరు అలాంటి సమయాలలో వచ్చి ఏమిచేస్తారు? వెళ్ళు నువ్వు నీపని చూచుకో" అన్నాడు.

సురబాల ఒకసారి తలెత్తి దివాకరునివంక చూచి శాంతంగా దృఢ స్వరంతో "నువ్వుకూడా సిద్ధం కా! మీ అన్నయ్యకు మూడు రోజులనుండీ జ్వరం వస్తూవుంది. ఇక తాళలేను. నేనుకూడా వెంబడి వెళతాను. నీవు కూడా రావాలి. వెళ్ళు, ఆలస్యం చెయ్యకు" అన్నది.

వుపేంద్రుడు చాల ఆశ్చర్యపడ్డాడు. సురబాల దివాకరునితో గాని, ఇంట్లో ఇంకెవరితో గాని ఈ విధంగా మాట్లాడటం ఇంతకుముందు అతను ఎప్పుడూ చూడలేదు. తను స్వయంగా చూడకపోతే ఒక యువకుణ్ణి పసిపిల్లవాడిలా ఇలా అధికారం చలాయించగలుగుతుందని నమ్మేవాడుకూడా కాదు. అతను కొంచెం విసుక్కొని "అటువంటి ఆపదలో మీరుకూడా వచ్చి వారిని బాధపెట్టటం యెందుకు? వద్దు, మీరు రావద్దు" అన్నాడు. అతని చివరిమాటలో కొంచెం కాఠిన్యత తొణికిసలాడుతూవుంది.

సురబాల లేచి నుంచుని భర్తకేసిచూసి "మీరు ప్రతివారిముందూ ప్రతి విషయంలోనూ నామీద ఇంత కోపగించుకుంటూ ఉంటారెందుకు? వంట్లో అస్వస్థతతో మీరు బైలుదేరితే నేనూ బైలుదేరాను. తొమ్మిది గంటలైంది. వెళ్లు దివాకర్" అన్నది దృఢంగా.

దివాకరుని ఎదుట వుపేంద్రుడు సురబాల వన్న మాటకు అతను చాల సిగ్గుపడి "కోపగించుకోవట మెందుకు? నీమీద ఏమీ కోపగించుకోను. నాన్నగారు వింటే ఏమంటారో నువ్వే చెప్పు. వెళ్ళి భోంచెయ్యి దివాకర్" అన్నాడు.

"బాబుగారు నేను వెంట రావటానికి వప్పుకున్నారు" అన్నది సురబాల.

"ఈ మధ్యలో వారిదగ్గరకూడా అనుజ్ఞ తీసుకున్నావ్?"

"తీసుకున్నాను. వెళ్ళుతున్నాను. మీకు పాలుతీసుకువస్తాను" అని సురబాల బైటికి వెళ్ళిపోయింది. ఉపేంద్రుడు పైపంచె దండెమీద విసిరివేసి మంచంమీద వెల్లికిలపడ్డాడు. సురబాల వెంటవస్తుంది. భర్త అస్వస్థస్థితిలో వదిలిపెట్టి వుండదు. దీనిలో సంశయమేమీ లేదు. దివాకరుడు తయారు కావటానికి మెల్లగా బైటికి వెళ్ళిపోయాడు.

సురబాల హఠంచేసి ఒక కొత్త సమస్య తీసుకువచ్చి పెట్టింది అని ఆలోచించసాగాడు ఉపేంద్రుడు.. కలకత్తా వెళ్ళిన తర్వాత ఆమెకు చేసే వసతు లెక్కడ? బస ఎక్కడ? హారన్‌బాబుగారి ఇంటివద్ద వీలులేదు. అక్కడ స్థలాభావ మొక్కటే కాదు ప్రశ్న. కిరణ్మయి భర్త జీవన్మరణావస్థలో వున్నాడు. సురబాల తన భర్త ఇంత కష్టపడుతూగా వుండటం కళ్ళారా చూచి సహించలేదు. ఇష్టానిష్టాలు తెలుసుకోకుండా, మర్యాదామర్యాదలను లెక్కచెయ్యకుండాకూడా భర్త ఆరోగ్యరక్షణకోసం కంకణం కట్టుకు కూర్చుంటుంది. ఈ విషయం తలపుకు రాగానే అతనికి స్ఫురించింది. మిత్రుడు జ్యోతిష్‌రాయి ఇంటివద్ద జరిగినా గందరగోళంగానే వుంటుంది. సురబాల స్వచ్ఛమైన హిందువు. ఈ వయసులోనే ఆమె నియమంగా నిత్యం జపతపాలుచేస్తూ వుంటుంది. ఆ ఇంట్లో ఆచారాలుచూచి నీళ్ళుకూడా ముట్టదు. అంత పెద్దకుటుంబంలో తల్లి ఒక్కతే సదాచారపరాయణ అయినంతమాత్రాన లాభమేమిటి? అదీగాక అక్కడ సరోజినికూడా వున్నది. ఆమె ఎప్పుడూ సురబాలను అంటిపెట్టుకునే వుంటుంది. వారింట్లో నేనుంటూ వారినే అచంట అచంట అంటూ వుంటే బాగుండదు. ఇక సతీశుడు వున్నాడు. అతను వేరే ఇల్లుతీసుకుని ఒంటరిగానే వుంటున్నాడని విన్నాడు ఉపేంద్రుడు. చోటుకూడా మంచిదే. విశేషం, అతనూ జపతపాలయందు ఆసక్తి వున్నవాడే. ఈ ఇద్దరి మరదులతో వుంటే సురబాలకు సంతోషంగా కూడా వుంటుంది. ఉపేంద్రుడు తక్షణమే—మేము రైలుకేరి వస్తున్నామని సతీశునికి తంతి యిచ్చాడు.

తంతి మామకుని సతీశుడు స్టేషనుకు వెళ్ళాడు.

నిజంగా సతీశుని శరీరాన్ని, ఆత్మనీ విధాత పెద్ద పెద్ద పదార్థాలతో తయారుచేశాడు. అందుచేత చావు బతుకులలో వున్న హారన్ కుటుంబభార మంతా వహించినప్పుడు సావిత్రీ విపినుల గాథనుకూడా విని సహించగలిగాడు.

ఈ గాథ బిహారీకి, అవినాండీకి గుణతుల్యమైన వంటపంతులికీ తెలుసు. పంతులు సావిత్రిని నీచంగా చూస్తున్నాడనుకున్నాడు బిహారి. అందుచేత చిన్న మధ్యాహ్నంకూడా "ఏమండీ పంతులుగారు! చివరికి ఆ పిల్ల అలా చేసిందేమండీ! ఆవిడ మా బాబుగారిని అర్థం చేసుకోలేదు. లేకపోతే కన దాన్ని వదిలేసి గాజులెంకుల్ని ఎందుకు మూటకట్టుకుంది? ఆఖరికి విపిన బాబు వెంట పోయింది" అన్నాడు.

పంతులు కొంచెం ఫ్రాంకుగా "నిహాయా సన్యాసులలో 'మునీనాంచ మతిభ్రమః' అని వ్రాశారు. లేకపోతే సావిత్రిలాంటి తెలివిగలపిల్ల ఇంత పొరపాటు ఎందుకు చేస్తుంది? నే నిదే చెబుతున్నాను — ఆవిడ ఇవ్వాళ కాకపోతే రేపైనా పశ్చాత్తాపపడి తీరుతుంది చూడు. సావిత్రి అసలు కుటిల స్వభావం కలదేమీ కాదు. ఆమె నాదగ్గర పెద్దమనుషుల దగ్గర మాట్లాడే రీతి నీతులుకూడా నేర్చుకుంది. పడుచుతనంలో వుంది. సతీశబాబు కంటికి నచ్చింది కూడాను. వుంటే చివరికి బాగానే వుండేది. కాని ఆవిడ నాసలహా కూడా తీసుకోలేదు. లోకులంతా ఆపద లొచ్చినప్పుడు నాదగ్గరకు పరు గెత్తుకు వస్తారెందుకు? ఆరోజున రాముడి తల్లి..." అన్నాడు.

రాముడి తల్లి ఎవరు, ఆమె వంటపంతుల్ని ఏ సందర్భంలో సలహా తీసుకోటానికి వచ్చింది — తెలుసుకోవాలన్న కుతూహలం బిహారికి లేదు. అందుచేత మధ్యలోనే అడ్డుతగిలి "ఎన్నైనా చెప్పు పంతులుగారూ! ఆసాములుంటే మా బాబుగారిలాంటి ఆసాములుండాలి. కలకత్తాలో నేను చాలా మంది పెద్దమనుషులను చూశాను. కాని అటువంటిమాట, అటువంటి గుండె

నిబ్బరం ఎవరిలోనూ చూడలేదు. అన్నమాట ప్రాణంపోయినా తప్పుతాడా? ఆ రోజున నేను 'పోతే పోనియ్యి బాబూ' అన్నాను. మళ్ళీ ఆమె పేరెత్తా డనుకున్నావా? మొదట ఆమెఅంటే ఎంతోప్రీతిగా వుంటూ వుండేవా డనుకున్నావు పంతులూ!" అన్నాడు.

పంతులు తలకాయ వూగించి "నే నీమాట మొదటే చెప్పాను. అందు కనే ఇన్ని ఖూనీలు జరిగేదీ, జైళ్ళలో మగ్గేదీని. ఒక్కసారి కంటికి వచ్చిన తర్వాత... తెలిసిందా బిహారీ?" అన్నాడు.

బిహారి కంపించి పోయాడు. అతని మొహం వెల్లబడి పోయింది. కొంచెం భయంతో "లేదు, లేదు. మా బాబుగారు అటువంటి మనిషి కాదు పంతులూ? ఆమె ఎక్కడ వున్నదీ ఏమైనా అంటున్నారా? ఈ మధ్య ఏమైనా..." అన్నాడు.

పంతులు పకపక నవ్వి "నువ్వెక్కాండా ఎటువంటి మాట్లాడవురా బిహారీ! ఆమె విపినబాబు ఇంటికి చాకిరీ చెయ్యటానికి వెళ్ళిందనుకున్నావా కనపడటానికి. ఆమె స్వయంగా ఎంతోమంది దాసీలను పెట్టుకునివుంటుంది. నమ్మకం లేకపోతే వెళ్ళి ఒకసారి చూచిరా" అన్నాడు.

బిహారికి ఒక్కసారి శిరోభారం తగ్గినట్లయింది. చిరునవ్వుతో "నేనూ అదే అనుకుంటున్నాను. అయినా ఒకసారి పంతులుగారిని అడిగిచూద్దాం, వారేమంటారో ననుకున్నాను. ఈ జీవితంలో ఎప్పుడూ కష్టపడకుండా రాణియై పల్లకీ లెక్కి వూరేగుతుండాలని ఆశీర్వదించు పంతులూ!" అని అతను పంతులుకు నమస్కరించి అక్కడనుంచి వెళ్ళిపోయాడు.

ఈసారి కలకత్తావచ్చిన దగ్గరనుంచీ దైవవశాత్తు ఇద్దరూ ఎక్కడ కలుసుకుంటారో నన్న వ్యాకులతతో సతీశుడు బైటకు ఎక్కడికి వెళ్ళినా ఆతురతతో ఎదురుచూస్తూ వుండేవాడు బిహారి. సతీశుడు ఒట్టి కోపిష్టి అని పాతనౌకర్లు చెప్పారు. సావిత్రి చేసినపని ఖూనీలుచేసుకునే

స్థితికి తెస్తుందని అతనికి తెలియకపోలేదు. కాని సావిత్రి దాసదాసీలతో మోటార్లమీద తిరుగుతుందని అతను ఎప్పుడూ వూహించనుకూడా లేదు. ఇవ్వాళ పంతులుమాటలు విన్నతర్వాత నిశ్చింతగా, నిర్భయంగా వున్నాడు. సావిత్రిమీద అతనికి చాలాకోపం వచ్చింది. నిజంగా సావిత్రి రాణివేషంతో ఏ బండిమీదైనా వస్తుందేమోనని కుతూహలపడసాగాడు. బిహారి సావిత్రిని చాల గౌరవంగా చూస్తూవుండేవాడు. అసలు ఆమె ఎవరు, రాణి ఎలా అవుతుంది అనే అనవసరప్రశ్నలన్నిటికీ అతని హృదయంలో స్థానం లేకపోయింది. సావిత్రియందు అతనికి ఒకవిధమైన శ్రద్ధాభక్తులున్నాయి. దిక్కులేనిది, నానాగానే చాకిరీ చేసుకుంటుం దనుకొని మొదలనుండా వూరుకునేవాడు. అందుచేత ఆగోజుఘుష్టం కళ్ళారా చూచి బిహారి చాల దుఃఖపడ్డాడు. కోపంకూడా కలిగింది. కాని ఇవ్వాళ సావిత్రి తన యజమానికి కంటకమై లేదని విన్నతర్వాత 'సావిత్రి సుఖంగా వుండుగాక, రాణి యగుగాక!' యని హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు.

## ౧౮

హారన్ జీవనమరణ సంగ్రామము క్రమంగా ఒక కరుణరసపూర్వ గాథగా పరిణమించింది. మృత్యువు ఆకలిగొన్న పాములాగ అతన్ని బాక్కుని పొట్టన పెట్టుకోవాలని చూస్తోంది. కాని అతను తొలకరి కప్పలాగ ముందుకాళ్లు బైటపెట్టి శాయశక్తులా ఆత్మరక్షణకోసం పెనగులాడుతున్నాడు. అశేషదుఃఖాల ననుభవించిన అసువులు ఎప్పుడూ అతని తనువును విడచిపోవా అనిపిస్తోంది.

ఈ ఆపద సమయంలో సతీశుడు ఆమెకు సాయం చెయ్యటానికి వచ్చాడు. కాని కిరణ్మయి పతిసేవాపరాయణత్వము చూచి స్తంభించిపోయాడు. అతను స్వయంగా చాలా చూశాడు. స్త్రీకి పతే సర్వస్వమని కూడా తెలుసు. అంతా తెలిసివుండి, పర్యవసానశూన్యమని గ్రహించికూడా ఎవరైనా ఈ విధంగా ప్రాణాలొడ్డి పతిసేవాశుశ్రూషలు చేస్తారని అతను వూహించనుకూడా లేదు. ఏమి మహాసేవ! ప్రతిరోజూ రాత్రి తెల్లవార్లూ భర్త మంచంవద్ద కూర్చునివున్నా, పగలల్లా వెముకలు విరిగే చాకిరీ

చేస్తూవున్నా ఆమె మొహంమీద దుఃఖచిహ్నాలేమీ కనపడేవికాదు. ఆమె మొహం చూచి ఇంత మహావిపత్తు ఆమె నెత్తిన విరుచుకు పడిందని చెప్పటమే కష్టం!

నిజంగా సతీశుడు తన ఈ వదినను సోదరభావంతో చూస్తున్నాడు. అలాంటి ఆమె నిశ్చింతపతిసేవ చూచి 'ఎలాగైనా సరే భర్త జీవిస్తాడని వదినకు ఆశవుంది' అని విచారపడుతూ వుండేవాడు. కాని చివరకు ఆమె ఆశాపూరిత హృదయానికి తగిలే గాయాన్ని గురించి వూహించుకుని పరితాప పడేవాడు. ఈ తథ్యాన్ని కిరణ్మయికి ఎలా తెలియజేయటమా అని గుంజాటన పడుతూ వుండేవాడు కూడా.

సతీశుడు తాను మహాబుద్ధిమంతుడ ననీ, లోకచరిత్రకు ఆదర్శపురుషుణ్ణవుతాననీ అభిమానపడుతూ వుండేవాడు. కాని సావిత్రి చేసిపోయిన ఈ పనిలో అతని అభిమానానికి పెద్ద దెబ్బతగిలింది. సావిత్రి తన్ను విడచి విపినుని వద్దకు వెళ్ళిపోయినప్పుడే తను తెలివిగలవాడను కాదనీ, లోకచరిత్రకు ఆదర్శభూతుడనుకూడా కాదనీ గ్రహించాడు. ఈ విషయాన్ని ఎవరి ఇష్టమొచ్చినట్లు వారు విమర్శించినా, బడాయిలు కొట్టుకున్నా, ఇక అతను ఆ ప్రమేయమే ఎత్తడు. ఇక దాన్ని తలచుకోవటం సిగ్గుచేటు. ఈ బుద్ధిని ఆధారం చేసుకొనే అతను ఈ వదిన విషయంలో అనేక సంగతులు ఆలోచించాడు. ఉపేంద్రబాబుకు కూడా బోధించుదా మనుకున్నాడు.

ఇవ్వాళ ప్రొద్దున్నే సతీశుడు హారన్‌బాబుగా రింటికి వచ్చి చూచేప్పటికి కిరణ్మయి ఎప్పటిలాగానే శాంతోజ్వలవదనంతో ఇంటిపనులు చక్కబెట్టుకుంటూ వుంది. రెండు మూడు రోజులనుంచి అత్తి మళ్ళా లేవటంలేదు. రాత్రి జ్వరం కొంచెం ఎక్కువైంది. కిరణ్మయి మొహంచూచి ఏ విషయమైనా వూహించటం కష్టం. అందుచేత సతీశునికి మంచి చెడ్డలన్నీ రోజూ అడగాల్సి వస్తోంది. కాని ఇవ్వాళ కదిలించగానే కిరణ్మయి పనిపాటలన్నీ వదిలివచ్చి కొంచెంసేపు అతని మొహంకేసి పరికించి "ఇక ఆలస్యం అమృతం విషం. ఉపేంద్రబాబుగారిని వెంటనే బైలుదేరి రమ్మని రాయి" అన్నది.

సతీశుడు భయపడి "ఎందుకు వదినా?" అన్నాడు.

కిరణ్మయి వదనంమీద శరత్ మేఘాలలాగ ఒక చిన్న తెలిమబ్బు ఆవరించింది. ఈ మొహంతో ఎక్కువ పరిచయం లేనివారికి ఆ మసకమబ్బు కనపడదు. ఆమె ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడచి "అవసానకాలం దగ్గరకు వచ్చివేస్తున్నది. ఒక తంతి యివ్వు" అన్నది.

సతీశుడు కొంచెంసేపు మెదలకుండా చూస్తూ వూరుకున్నాడు. "నేనూ అలాగే అనుకున్నాను వదినా! నీకు అధైర్యం కలుగుతుందేమోనని అనలేక పోయాను" అన్నాడు.

"అవును. అధైర్యపడే పరిస్థితే! వారికి నిన్న రాత్రినుండి ఆయాసం కొంచెం ఎక్కువైంది. ఇంతవరకు తగ్గే లక్షణమేమీ కనపడటంలేదు. కనుకనే వారికి తంతి నివ్వమని చెప్పాను" అన్నది కిరణ్మయి సహజంగా.

సతీశునికి ఈసంగతి తెలియదు. ఆశ్చర్యపడి "ఆసంగతి నాకు తెలియనే తెలియదు. నువ్వు చెప్పనుకూడా లేదు" అన్నాడు.

"చెప్పలేదు, కాని, శ్వాసలక్షణాలు రెండోవాళ్ళకి తెలియకుండా రోజు రోజుకీ ఎక్కువై పోతున్నాయి. అయినా ఇవ్వాళే ఇది కొత్త విపత్తేమీ కాదు. ఆపదలమీద ఆపదలు వచ్చి పడుతూనే వున్నాయి. నిన్నటి నుండి అత్తగారి రోగంకూడా ఎక్కువౌతూ వుంది. ఇప్పుడే చూచివచ్చాను. జ్వరం బాగా వుంది. మధ్య మధ్య ఏవేవో పిచ్చిమాటలుకూడా అంటూ వుంది" అని కిరణ్మయి చిరునవ్వు నవ్వింది. కాని ఆచిరునవ్వులో సంతోషం మాత్రం లేదు. దాన్ని చూచి ఏడుపు వస్తుంది.

సతీశుని కళ్ళల్లో నీళ్లు తిరిగినై. అతను దుఃఖకంఠంతో మెల్లగా "ఉపేంద్రబాబు వచ్చిన తర్వాతనే..." అన్నాడు.

"ఇంకొకమాట వింటావు?" అన్నది కిరణ్మయి.

సతీశుడు మెదలకుండా చూస్తూ వూరుకున్నాడు.

సతీశుడు వుపేంద్రునికి తంతినిచ్చి తిరిగి వచ్చేటప్పటికి పదిగంటలైంది. మెల్లగా వంటింట్లోకి వెళ్ళాడు. కిరణ్మయి – అత్తకు సగ్గుబియ్యం కాస్తూ వుంది. ఆమె సతీశుని వంకచూచి 'కూర్చో' అని తలవంచుకున్నది. ఆమె

గొంతు కొంచెం ఎండివుంది. సతీశుడు ధ్యానంతో చూచాడు. కళ్ళల్లో నీరు లేదుగాని చెక్కిళ్ళవెంట కన్నీటి చారికలు వున్నాయి. అతను దగ్గరగా చాపమీద కూర్చున్నాడు. ఇవ్వాళ కిరణ్మయికి పీట వెయ్యాలనే ఆలోచనే లేకపోయింది. అతను ఎక్కడ కూర్చున్నాడో ఏమిచేశాడో కూడా ఆమె చూడలేదు. ఇంతవరకు ఏ చిన్న విషయంలోనూకూడా ఆమె పొరపడినట్లు సతీశుడు చూచివుండలేదు. అతను ఇన్నిరోజులనుండి వస్తూ పోతూవున్నాడు. ఇంత స్నేహబాంధవ్య మేర్పడిపోయింది. కాని ఒక్కరోజునకూడా అతనికి వదిన చేసే – గౌరవమర్యాదలలో లోటుగాని, తేలికతనంగాని కనపడలేదు. అందుచేత ఈకించిత్ నిర్లక్ష్యమే అతని కళ్ళల్లో నేలెట్టిపొడిచి వదినె మనస్సు ఏదో మహాభారంతో అణగివుందని చూపెట్టింది.

చాలసేపటివరకు ఇద్దరూ మౌనంగా కూర్చున్నారు. ఇంతసేపటినుండీ లోపల ఇదే ఆలోచించుకుంటున్నట్టు కిరణ్మయి ఒక్కసారి తనలో తాను నవ్వుకొని "అయితే, యమరాజు ఖాతా అవర్జాలన్నీ తీరిపోయిన తర్వాత నేను ముష్టెత్తుకొని పొట్టపోసుకుంటే మంచిదా, నౌకరీ చేసుకు బతికితే మంచిదా?" అన్నది. సతీశుడు దాని అంతరార్థం గ్రహించి "ఉపేంద్ర బాబుగారి నడుగు. వారే దానికి సమాధాన మిస్తారు" అన్నాడు.

"దయతలచి పట్టెడుకూడు పెట్టగలరని అడగనవసరం లేకుండానే తెలుసు. కాని ఇతరులమీద ఆధారపడి ఉండటంకూడా యాచించటమేగా" అన్నది కిరణ్మయి.

సతీశుడు వాదించాలని కుతూహలమున్నా – ఏమి అనటానికి తోచక మెదలకుండా వూరుకున్నాడు.

కిరణ్మయి అతని ఆంతర్యంలోని విషయాన్ని గ్రహించి చిరునవ్వుతో "నూటికి నా అనేమాటలు కటువుగా వుంటా యని నాకు తెలుసు. కాని యథార్థం అది" అని కొంచెంసేపు మెదలకుండా వుండి "నేను మీ అన్నయ్యను అర్థంచేసుకోలే దనుకోవద్దు. నేను వారిని బాగా అర్థం చేసుకున్నాను. అనాథలకు ఆశ్రయమివ్వటం వారికి తెలుసు. ఆశ్రయమివ్వట మొక్కటే కాదు, ఆశ్రయించటం కూడా! యాచించకుండా ఎవరికీ యివ్వగా నేను చూడలేదు. జీవితపర్యంతం ఎవరిమీదో ఆధారపడి వుండటం

సుఖకరం కాదని నే ననుకుంటున్నాను. " అన్నది.

కాని ఈసారికూడా సతీశునికి ఏమీ సమాధానం తోచలేదు. మెదల కుండా వింటూ వూరుకున్నాడు. కాని కిరణ్మయి కొంచెం ఆవేశపడి సమాధానానికి ఎదురు చూడకుండానే " ఈ లోకంతో వ్యవహరించటం ఇవ్వాళ నాకు కొత్త కాకపోయినా తీర్చుకోవలసిన ఋణాలు ఇంకా చాలావున్నాయి. జీవితావసానకాలంలో ఎన్నో లోపా లుండవచ్చు, దోషా లుండవచ్చు, అనుమానాలు కలుగవచ్చు—అలాంటి స్థితిలో వారేమనుకొని యిస్తారు, నే నేమొహం పెట్టుకొని చెయిచాపుతాను? అప్పుడు మళ్ళీ నాదారినే నడవ వలసి వస్తుంది " అన్నది.

ఇంత సేపటినుండి సతీశుడు వ్యధతో శ్రద్ధగా సందేహాస్పదమైన ఆమె మాటలను వింటున్నాడు. కాని చివరిమాటతో అతను ఆశ్చర్యచకితుడై " నువ్వు అనే మాట లేమిటి వదినా! పొరపాట్లనేవి ప్రతివారి జీవితం లోనూ సంఘటిల్లేవే. అయినా నువ్వు అలాంటి పొరపాట్లు మాత్రం ఎందుకు చేస్తావు! ' అన్నాడు.

కిరణ్మయి సతీశుని ఆశ్చర్యాన్ని చూచి నవ్వుతూ " ఏమిటి మరదీ! నేను మాత్రం మనుష్యజన్మ మెత్తలేదూ? " అన్నది కోమలకంఠంతో.

నవ్వు చూచి సతీశుడు తన తప్పు గ్రహించాడు. క్షణికావేశంతో అతని మనసు అపార్థాల్లోకి పరుగెత్తింది. సిగ్గుతో తలవంచుకొని " నన్ను క్షమించు వదినా. నేను తెలివితక్కువవాణ్ణే కాకుండా దుర్మార్గుణ్ణికూడా! " అన్నాడు.

కిరణ్మయి మెదలకుండా ఒక చిరునవ్వు నవ్వింది.

సతీశుని అనుతప్త అపరాధహృదయం ఒక్కసారి ఆవేశపడి " వుపేంద్రు డొక్కడే సర్వస్వమా? నేనేమీ కాదూ? నేను నిన్ను అతని ఆశ్రయించ నివ్వను " అన్నాడు.

కిరణ్మయి నవ్వి " మీ అన్నయినా నువ్వయినా ఒకటేగా! నిన్నాశ్ర యించుకున్నా యాచించుకు తినవలసిందేగా? " అన్నది.

" అలా ఎప్పటికీ కాదు. కారణం, నేను నీకు మరదిని. కాని ఉపేంద్ర

బాబు నీభర్తకు స్నేహితుడు. అవసరమైతే నావదిన పోషణభారము నేనే వహిస్తాను" అన్నాడు సతీశుడు.

"నేను నీ యిష్టానుసారంగా నడుచుకోలేకపోతే?"

"అయినా పరవాలేదు"

"తప్పేమైనా చేస్తే"

"వదినా మరదులలో పొట్లాట లెందుకువస్తాయి?"

"ఈ జీవితంలో ఏరోజునైనా పొరపాటు జరిగితే, నాయీ చిన్న మరది క్షమిస్తాడా?" అన్నది కిరణ్మయి మళ్ళీ.

సతీశుడు కొంచెంసేపు తలపైకెత్తి చూచి వ్యథితస్వరంతో "నీ పొరపాట్లేమిటో నాకు అర్థం కావటంలేదు. చిన్నమరదికి ఏవిషయమైనా తెలియకపోతే తెలియజెప్పటం నీవిధి. అయినా నువ్వు వూహించరాని అపరాధం మట్టుకు ఏమిచేస్తావు. చేసినా నేను నీ చిన్నమరదినన్న సంగతిమాత్రం మరచిపోను" అన్నాడు. అప్పుడే అతనికి సావిత్రి జ్ఞాపకమొచ్చింది. "ఈ చిన్నమరది అహంకారాన్ని మన్నించు వదినా! కాని ఈ జీవితంలో నే క్షమించిన అపరాధాన్ని క్షమించటానికి భగవంతుడికికూడా గుండెలదరిపోతాయి" కిరణ్మయి కళ్ళవెంట నీళ్ళురావటంచూచి సతీశుడు కూర్చొని "ఇటు చూడు వదినా, నామాటవిను. ఇవ్వాళ నేను ఆవాళ ఈర్ష్యావేశంతో నిన్ను వదినా అని పిలచిన నాటిలాంటి సతీశుణ్ణి కాదు" అంటూ వుండగానే అతని మొహం ఒక్కసారి ప్రదీప్తమై పోయింది. ఒక్కసారి తల విదిలించి "నే నిప్పుడు ఆ సతీశుణ్ణి కాదు వదినా. అతణ్ణే అయితే నిన్నెన్నటికీ అర్థం చేసుకునేవాణ్ణికాదు. అతను నిన్ను ఆదరించటం, గౌరవించటం నేర్చుకోలేదు. అందుకనే భగవంతుణ్ణి రాతివిగ్రహమని పరిహసించాడు. కాని అతను పాపభారంతో తనంతట తానే కూలిపోయాడు. ఇప్పుడతను లేడు" అని ఆంతర్యంలో మునుగుతూ తేలుతూ ఏదో వెతకసాగాడు.

కిరణ్మయి తదేకధ్యానంతో అతనికేసి చూస్తూవుంది. తర్వాత ఆమె మరింత కోమలస్వరంతో "నన్నెలా అర్థంచేసుకున్నావు బాబూ?" అన్నది.

సతీశుడు తలవంచుకొని "అది పెద్దలముందు చెప్పతగ్గ విషయంకాదు" అన్నాడు.

"చెప్ప తగిందికాదు? అలాంటి సంగతేమున్నదేమిటి?" సంశయంతోనూ భయంతోనూ కిరణ్మయి మొహం ఒక్కసారి వెలవెలపోయింది. "ఏమిటి అంటావు?" అన్నది మళ్ళీ.

"ఎందుకు వదినా?"

"మొహం సరిగ్గా త్రిప్పు, చూస్తాను"

సతీశుడు కొంచెంసేపటివరకు మొదలకుండానుండీ మొహంపైకెత్తాడు. కిరణ్మయి రెప్పవాల్చకుండా కొంచెంసేపు అతని మొహంకేసిచూసి "నువ్వు హృదయంలో ఏదో పెద్దవ్యథతో ఇక్కడికి వస్తూపోతూన్నట్లు నేను చాలా రోజులనుండీ చూస్తున్నాను. కాని అడగటానికి అధికారంలేక అడగలేదు. కాని ఇవ్వాళ నా చిన్న మరదివయ్యావు. కారణమేమిటో చెప్పు" అన్నది మళ్ళీ.

సతీశుడు తలవంచుకొని "అది చాలా సిగ్గుమాలిన సంగతి వదినా!" అన్నాడు.

"సిగ్గుమాలిన సంగతికానీ, ఈ దుఃఖంలో నాకు కూడా భాగం తీసుకోవాలి. నేను నిన్నొంటరిగా వ్యథపడనిస్తానా?" అన్నది కిరణ్మయి.

తర్వాత కిరణ్మయి మొదటినుండీ ఈ దుఃఖగాథంతా విని చివరకు "అలాంటి పని ఎందుకు చేసావు?" అన్నది.

సతీశుడు మాట్లాడలేదు.

"ఆవిడ ఎవరేమిటి?" కిరణ్మయి అడిగింది.

సతీశుడు తలవంచుకొని కుంఠితస్వరంతో "ఒక అభాగ్యురాలు" అన్నాడు.

కిరణ్మయి ఒక దీర్ఘమైన నిట్టూర్పువిడచి "ఇప్పుడు ఆవిడ ఎక్కడున్నది?" అన్నది.

"తెలియదు"

"వెతుకలేదూ?"

"వెతికే అవసర మేమున్నది? కులాసాగా వుందని మాత్రం విన్నాను" అన్నాడు సతీశుడు మృదువుగా.

"కులాసాగానే వుందా? ఛీ! ఛీ! అలాంటి మోసంలో ఎందుకు పడిపోయావు?" అన్నది కిరణ్మయి.

ఈసారి సతీశుడు మళ్ళీ మొహాం పైకెత్తాడు. "నే నేమీ మోసంలో పడలేదు వదినా! ఆమే మోసపడి పోయింది. నేను ప్రేమిం నాను. ఆమె ప్రేమించలేక పోయింది" జవాబు చెప్పాడు.

"తర్వాత!" కిరణ్మయి అడిగింది.

"మొదట ఆమె తన మనసుకే నచ్చజెప్పలేక పోయింది. చెప్పగలిగిన తర్వాత వెళ్ళిపోయింది." అన్నాడు సతీశుడు.

"చెప్పా చెయ్యకుండా పోయిందా?"

సతీశుడు తలకాయ వూగించి "అదేమీ లేదు. వెళ్ళేముందు ఒక అస్పృశ్య కులటను ప్రేమించి భగవంతు డిచ్చిన హృదయాన్ని మలినపర్చ వద్దని జాగ్రత్తపరచి పోయింది" అన్నాడు.

కిరణ్మయి తమాయించుకు కూర్చొని "ఏమని పోయింది?" అన్నది.

సతీశుడు సావిత్రి అన్న ఆమాటను మళ్ళీ చెప్పాడు.

కిరణ్మయి కొంచెం సేపటివరకు మెదలకుండా వూరుకొని "మళ్లా ఎప్పుడైనా వస్తే నాకు చూపించుతావా?" అన్నది.

సతీశుడు విపినుని సంగతి జ్ఞాపకం తెచ్చుకొని "ఇకరాదు వదినా!" అన్నాడు.

కిరణ్మయి పెదవులమీద చిరునవ్వు కనిపించింది. "కాదు, మళ్లా వస్తుంది" అన్నది.

"ఎప్పుడు వస్తుంది? ఎందుకు వస్తుంది? రాకపోవటమే మంచిది."

కిరణ్మయి తలకాయ తిప్పి "ఎప్పుడు వస్తుందో చెప్పలేను. కాని ఆపదల్లో చిక్కుకొని, దుఃఖాలలో నున్న రోజున మాత్రం తప్పకుండా వస్తుంది. దాని పర్యవసానం సఫలమే అవుతుంది. ఆమె ఎక్కడవున్నా, ఏమి చేసినా నీకంటె మిన్నగా నీమేలు కోరుతూ వుంటుందన్న సంగతి

మాత్రం ఎప్పటికీ మరచిపోవద్దు" అన్నది.

ఆరోజున ఇంకా ప్రొద్దు కుంకలేదు. కిరణ్మయి మరణాసన్నమైన పతి మంచం ద్వారనుంచి బైటికివచ్చి నుంచున్నది. సతీశుడు వాకిటిప్రక్క తలుపు నానుకుని కదలకుండా కూర్చున్నాడు. కొంచెం కునుకుకూడా పట్టింది. కిరణ్మయి ఆశ్చర్యపడి "ఇంకా కూర్చున్నావెందుకు, మరిదీ? ఇంటికి ఎందుకు వెళ్ళలేదు?" అన్నది.

సతీశుడు త్రుళ్ళిపడి లేచినుంచుని "వెళ్ళలేదు వదినా" అన్నాడు.

"ఇంతసేపటివరకు ఎక్కడున్నావు?"

"వీధులవెంట తిరుగుతున్నాను, ఇవ్వాళ ఇంటికి వెళ్ళను."

"ఎందుకని? భోజనం చెయ్యవు? పడుకోవు? ఇవ్వాళ భయపడవలసినదేదీ లేదు. ఇంటికి వెళ్ళుబాబూ!" అన్నది కిరణ్మయి.

సతీశుడు తలను తిప్పి "భయపడినా భయపడకపోయినా ఇవ్వాళ నిన్నొక్కదాన్నే వదిలిపెట్టి వెళ్ళను. అదీగాక నేను హోటల్‌లో టిఫిన్ తీసుకవచ్చానుకూడా!" అన్నాడు.

"అలా వీలుకాదు. హోటల్ కాఫీనీళ్ళతో నీకడుపు నిండదని నాకు తెలుసు. నేను మళ్ళీ వంటచెయ్యవలసి వస్తుంది. చెయ్యటానికి చేస్తాను. కాని నువ్వు కొంతకాలంనుండి వేళకు సరిగా తిండీతినక కొన్నాళ్లనుంచి చెయ్యక నీ కాయాన్ని చాలా ప్రయాసపెట్టావు. నిన్న మొన్న సరిగా నిద్ర కూడా పోలేదు. ఇవ్వాళ రాత్రి ఇక్కడవుంటే ఎలాగూ జబ్బుచేస్తుంది. కాని నేను అలా జరగనియ్యను" అన్నది కిరణ్మయి.

సతీశుడు మండి "నేను రెండురోజులనుండీ కడుపునిండా తినకపోయినందువల్లా, నిద్ర పోనందువల్లా జబ్బుచేస్తుంది, కాని నువ్వు నెలరోజులనుండీ సరిగా తిండీ తిప్పలు తినకుండా వెట్టిచాకిరీ చేస్తూంటే జబ్బు చెయ్యదూ? నువ్వు నెలరోజులు వుండగాలేంది నేను రెండురోజులు వుండలేనా?" అన్నాడు.

"అంటే నెలరోజులవరకూ తిండీ తిప్పలూ లేకుండా నువ్వుకూడా నిలబడగలవన్న మాట" అన్నది కిరణ్మయి.

"నేను ఆమాట అనటంలేదు కాని ..." అన్నాడు సతీశుడు

కిరణ్మయి నవ్వి "నాసీ—గీసీ ఏమీ లేదుగాని, నేను ఆడదాన్ని. ఆడదాని కెక్కడైనా జబ్బు చేస్తుందా? ఆడదానికి చావులేదు. తిండీ తిప్పలూ తినకుండా ఆడది ఎక్కడైనా చచ్చినట్టు విన్నావా?" అన్నది.

సతీశుడు కోపంతో "ఆసంగతి వినలేదు గాని ఆడది చిరకాలజీవియై భూమి మీదకు వస్తుందని మాత్రం విన్నాను" అన్నాడు.

"యథార్థం! ప్రాణం వుంటేగా పోటానికి? ఆడదానికి భగవంతుడు అసలు ప్రాణమే పోయలేదు. మెడకు వురిపోసి పదేళ్ళ వేలాడగట్టినా ఆడది చావదనుకుంటాను" అన్నది కిరణ్మయి.

సతీశుడు క్రుద్ధుడై "అవేమీ నేను వినదలుచుకోలేదు. వింటే పాపం కూడాను" అన్నాడు.

"యథార్థం వింటే పాపమని నీతో ఎవరు చెప్పారు? అయితే మరదీ! ఇంతిగా నీవు స్త్రీలపక్షాన మాట్లాడుతావు ఎందుకని?" అన్నది కిరణ్మయి గంభీరంగా.

సతీశునికి నిజంగా కోపం వచ్చింది. "నీవు స్త్రీలను అడ్డం పెట్టుకొని నన్ను ఎత్తిపొడుస్తున్నావు ఎందుకో అర్థం కావటం లేదు వదినా! కాని ఇవ్వాళ నేను నిన్ను వద్దంటున్నాను. నీనోటితో నిన్ను పరిహసించుకున్నా సరే నేను సహించలేను. నాకు చాలా బాధ కలుగుతుంది. వెళుతున్నాను" అన్నాడు శుష్కస్వరంతో.

"విను!"

సతీశుడు వెనక్కి తిరిగి నుంచుని "ఏమిటి?" అన్నాడు.

"నిజంగా కోప మొచ్చిందా?"

"కోపం వస్తుంది వదినా! ప్రపంచంలో నేను దైవంకంటె మిన్నగా ఇద్దరు వ్యక్తులయందు భక్తిశ్రద్ధలు కలిగి వుంటాను. నీయందు, వుపేంద్రబాబునందు. ఒకరిని చూడగానే రెండవవారు జ్ఞాపక మొస్తారు. ఇద్దరినీ ఒకే విధంగా చూస్తాను. ఎగతాళి వేళాకోళాలేమీ సహించను. వెళుతున్నాను. బహుశా భోంచేసి వస్తాను" అని సతీశుడు కిందకు దిగి వెళ్ళిపోయాడు.

కిరణ్మయి కళ్లు మూసుకొని గడప నానుకొని శిలావిగ్రహంలాగా నిల బడి పోయింది. 'నిన్నూ, వసంద్రద్రష్టాలుగా విఘ్నంగానే చూస్తాను' అన్న మాటలే ఆమె చెవుల్లో ప్రతిధ్వనించసాగినై.

## ౧౯

సతీశుడు సారసాంగనకాడ ఎప్పుడూ ఎరుగనంత తమకోటితో సావిత్రిని తలచి ఎరుగడు. అంతచేత కిరణ్మయి సావిత్రి సంగతి చెప్పిన తరువాత అతని శరీరమంతా తాట అమృతప్రవాహాలు ప్రవహించుతున్నవి. సతీశుడు కిరణ్మయిని దేవీతుల్యముగ భావించుతున్నాడు. ఆమె మాటలయందు అమిత శ్రద్ధా విశ్వాసాలుంచుకున్నాడు. ఆపదల్లో చిక్కుకున్నప్పుడు మరొకళ్లవస్తుందని ఆమె అన్నప్పటినుండి సతీశుని హృదయం ఆ సుఖఘడియలకోసం ఎదురుచూస్తూ హాహాకారాలు సలుపుతూవుంది. ఆ ఘడియలు ఎలా వుంటాయి, ఎలాంటి ఆపదలలో కనబడుతుంది, ఎలా దయ తలుస్తుంది, అని ఆలోచించుకుంటూ ఎనిమిదిగంటల రాత్రికి ఇంటికి చేరుకున్నాడు. ఇంట్లో అతని దృష్టి కనపడిన వస్తువునల్లా ఆకర్షించసాగింది. బట్టలు విప్పుతూ దణ్ణెం కేసి చూచాడు. గుడ్డలన్నీ చక్కగా సర్దివున్నాయి. మంచంమీద సాయంత్రం వేసుకునేదుస్తులు పెట్టివున్నాయి. కూర్చుంటూ చూశాడు. ఇవ్వాళ కుర్చీ మీద మైలగుడ్డలగుట్ట లేదు. రెండువారాలనుండి చాకలి రావటంలేదు. అందుకని మైలగుడ్డలు కుర్చీమీద కుప్పలు కుప్పలుగా పడివుండేవి. కూర్చోబోయేప్పుడు సతీశుడు వాటిని కిందకు తోసేసేవాడు. అతనులేచి వెళ్ళిపోయిన తర్వాత బిహారి వాటిని మళ్ళీ యథాస్థానంలో వుంచేవాడు. వారంరోజుల నుండి యజమానికి, నౌకరునకూ ఇదే పనైపోయింది. అకస్మాత్తుగా ఇవ్వాళ మైలగుడ్డలు ఎక్కడికెళ్ళిపోయినాయి. పరుపుమీద దుప్పటీ, దిండు, గలీబూ మురికితో నల్లగా వుండేవి. ఇవ్వాళ అన్నీ పరిశుభ్రంగా వున్నాయి. దోమ తెర అస్తవ్యస్తంగా వుండేది. ఇవ్వాళ సరైనస్థితికి వచ్చింది. లాంతరు మసితో వుండేది. ఇవ్వాళ దానిలోకూడా ఏమీ దోషమున్నట్టులేదు. చక్కగా వెలుగుతూవుంది. ఈ పరిశుభ్రతా సర్దుబాటుచూచి సతీశుడు చాలా సంతృప్తిపడ్డాడు. ఎవరిచేతి స్పర్శతో ఈ మార్పు కలిగింది? వృద్ధ

బిహారీవల్లా కాదు. "బిహారీ!" అని పిలిచాడు.

బిహారి చాటున నుంచుని వున్నాడు. ఎదుటకు వచ్చి "ఏమిటి బాబూ?" అన్నాడు.

"ఇవన్నీ సర్దింది నువ్వేనా?" సతీశు డడిగాడు.

బిహారి ఏమీ జవాబు చెప్పలేదు. "చేతనై వుండికూడా ఎప్పుడూ ఇల్లూ వాకిలీ పొందికా పొదుపూ లేకుండా ఎక్కడివి అక్కడే పడేసి వుంచుతా వెందుకని? ఇవ్వాళ చాలా బాగుంది?" అన్నాడు సతీశుడు.

బిహారి తలవంచుకొని వినయంగా "తమ కొక తంతి వచ్చింది బాబుగారూ! అన్నాడు.

"ఏది?" అని సతీశుడు అటూ ఇటూ చూడగానే బల్లమీద పెట్టి వున్న పచ్చటి కవరు కనపడింది. చించి చూచాడు — వుపేంద్రబాబు 9 గంటల బండికి హవడా వస్తానని వ్రాశాడు. ఇప్పుడే ఎనిమిది గంటలైంది. ఆతురపాటుతో "బిహారీ! తొందరగా వెళ్ళి ఒక బండి తీసుకురా, వుపేంద్రబాబుగారు వస్తున్నారు" అన్నాడు.

బిహారి ఐదు నిమిషాలలో బండి తీసుకొని వచ్చి తలుపుచాటున నుంచుని "బాబుగారిని ఇంటికి తీసుకువస్తారుగా?" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు ఆలోచించి "ఈ రాత్రికి రాను" అన్నాడు. వుపేంద్రబాబు సగాసరి హారన్ బాబుగారింటికే వెళతాడు. దానిలో సందేహమేమీ లేదు. పత్నీసహితంగా వస్తున్నానని తంతిలో వున్నది. ... రెండు మూడు వేడి వేడి పూరీలు నోట్లోకి పోయినాయి. బిహారి చాటునుండి "ఒక మనవి బాబుగారూ!" అన్నాడు.

సతీశుడు తలపైకెత్తి "ఏం మనవి?" అన్నాడు.

బిహారి "అవును బాబూ" అని వూరుకున్నాడు.

"అదేమిటి? ఏమైనా చెబుతావా?" అన్నాడు సతీశుడు.

బిహారి సంకోచపడుతూ "ముప్పై రూపాయ లిస్తే..." అన్నాడు.

సతీశుడు ఆశ్చర్యంతో "మొన్నేగా ముప్పైరూపాయ లిచ్చింది. ఇంటికి పంపించావా?" అన్నాడు.

"అందుకే తీసుకున్నాను బాబూ, కాని ఆ సొమ్ము వంటబ్రాహ్మడు ..." అన్నాడు బిహారి ఖిన్నస్వరంతో.

వంట బ్రాహ్మడి పేరు వినగానే సతీశుడు మండిపడి "ఆడబ్బు వంట బ్రాహ్మడికి యిచ్చావు. మరి ఈడబ్బు ఎవరికి దానం చేస్తావు?" అన్నాడు.

"దానం చెయ్యటానికి కాదు బాబూ! ఒక వ్యక్తి చాలా కష్టాల్లో పడి వున్నాడు..."

"అప్పు కావాలంటున్నాడా!"

"అతనికి అప్పు ఏమని యివ్వను బాబూ?"

సతీశుడు త్వరగా భోజనం ముగించి "నీ దగ్గర వుంటే యివ్వు బిహారీ! నేనంత ధనవంతుణ్ణి కాను గోయీ ఇలా డబ్బు తగలేసుకోటానికి; నే నివ్వలేను" అన్నాడు.

"ఇవ్వకపోతే వీలులేదు బాబుగారూ! తర్వాత నాజీతంలో కట్టుకున్నా సరే" అన్నాడు బిహారి హాకంతో.

ఈ మాటకు సతీశుడు గర్జించుతూ "జీతమా? ఇంతవరకు ఎంతిసైకం తీసుకున్నావో చెప్పు?" అన్నాడు.

"తీసుకున్న డబ్బుతో పిల్లలకు మూడుకుంటల భూమి, ఎద్దూ బండీ కొనిపెట్టాను. అదీగాక ఒక కొత్త లోగిలీకూడా కట్టించిపెట్టాను. కాని ఆడబ్బు జీతంలోది కాదుగా. జీతండబ్బు మీవద్దే వున్నది. ఇవ్వాళ దాని లోంచైనా సరే తీసి యివ్వండి బాబూ!" అన్నాడు బిహారి.

సతీశుడు నవ్వి "పిల్లలకు భూమి బుట్రా కొనిపెట్టి నాకు మహోపకారం చేశావు! పో, నావద్ద డబ్బులేదు" అని పైపంచ భుజాన వేసుకొని సతీశుడు స్నేహను కళ్ళటానికి బైటికి వెళ్ళిపోయాడు.

బిహారి ఇంట్లోకి వచ్చి "స్నానంచేసి ఈపూటకు కొద్దిగా ఎంగిలిపడు అమ్మా! రేపు ప్రొద్దున ఎలాగైనా సరే నీకు డబ్బు తీసుకొచ్చి యిస్తాను" అన్నాడు.

సావిత్రి ఒక గదిలో పయటచెంగు పరచుకొని పండుకొని వుంది. లేచి కూర్చుని "బాబుగారు డబ్బు యివ్వలేదు?" అన్నది.

పరాయివారి కష్టాలు పేరుజెప్పి ఏది అడిగినా యిస్తారు అమ్మా! మా బాబుగారి కష్టం తెలుసుకో. ఇప్పుడు ఇవ్వకుండా స్టేషనుకి వెళ్ళితేమాత్రమేం? రేపొద్దున తిరిగిరాగానే పిలిచి మరీ యిస్తాడు. నువ్వేమీ విచారపడవద్దు. ఇకనైనా లేచి ఎంగిలిపడు- ఇవ్వాళల్లా తిండీ తిప్పలూ లేకుండా పూరికే పడివున్నావు?" అన్నాడు బిహారి.

వాడిపోయిన ఆమె మొహంమీదికి చిరునవ్వుఛాయలు ఆవరించాయి. "ఈ రాత్రికి రాకపోవటం ఒక మేలే! రేపు పన్నెండుగంటలబండికి కాశీకి వెళతాను. బాగున్నదా బిహారీ!" అన్నది.

"బాగానే ఉన్నదమ్మా" అని బిహారి ఒక దీర్ఘనిశ్వాసం విడచి "నీకూ యజమానే, నాకూ యజమానే. ఇంటిదగ్గరనుంచి ముసలిది దుఃఖపడుతూ ఉత్తరం వ్రాసింది, చదివిపెట్టమని బాబుగారికి చూపించాను. బాబుగారు చదివి "నీకు ఇల్లూ వాకిలీ ఏమీ లేదూ బిహారీ" అన్నారు. "మాబోటి బీద బిక్కికి ఏముంటుంది బాబుగారూ" అన్నాను. వారింకేమీ అడగలేదు. నాలుగు రోజులున్న తరువాత ఆరువందలిచ్చి నన్ను ఇంటికి పంపినారు. భూమి పుట్రా బస్తీ ఎక్కా కొని ఇల్లు కట్టించాను. అన్నీ పిల్లలకు ఒప్పచెప్పి ఒక నెలరోజులలో బాబుగారివద్దకు తిరిగివచ్చాను. ముసలిది ఏడ్చి "నన్నుకూడ తీసుకెళ్ళండి, ఒకసారి నేనుకూడా వారి పాదదర్శనం చేసుకొంటాను" అన్నది. "వద్దు, ఋణం పెంచవద్దు, నీవువస్తే ఒక రెండు వందలు నీచేతిలోకూడా పెడతారు" అన్నాను. నీకు యజమానైయుండీ, జబ్బువచ్చి 50 రూపాయలు మందుమాకులకు ఖర్చయితే నిన్ను బాకీదారుగా చేసి, అప్పు తీర్చి మరీ వెళ్ళమన్నారా? నౌకరీ చేసుకోటానికి వెళ్ళి ఎన్నికష్టాలు పడ్డావమ్మా! మాకీ సంగతి తెలియనే తెలియదు. అందుకనే విపినబాబుపేరుతో నీమీద ఎన్నో అపవాదులు వేశాను, క్షమించమ్మా! లేకపోతే నా నాలుక పుచ్చి పురుగులుపడుతుంది" అన్నాడు బిహారి. విపిని పేరు విని సావిత్రి ఏవగింపుతో మెల్లగా "ఛీ ఛీ" అన్నది. కాని వెంటనే భావాన్ని మార్చుకొని నవ్వుతూ "స్నానం చేస్తాను, ఒక బట్ట ఇస్తావా బిహారీ?" అన్నది.

"బట్ట?" బిహారి ఉదాసీనుడై "నీవడిగితే ఒకటి కాదు పదిస్తాను,

ఏ చింతా లేదు. కాని శాస్త్రుడు కట్టుకున్న గుడ్డ నీకెలా ఇచ్చేదమ్మా, పద, జాలుగారి ఇస్త్రీపంచె తీసి ఇస్తారు" అన్నాడు.

బిహారీకి దేవద్విజులంటే అమితమైన భక్తి. అందుచేత ఎవరు చెప్పటము అనవసరమనుకొని సావిత్రి మెదలకుండా అతని వెంటే గదినుండి బైటకు వచ్చింది. సావిత్రి స్నానముచేసి సతీశుని మేలురకపు శాంతిపుర ధోవతి కట్టుకొని లోలోన కొంచెము నవ్వుకొన్నది. అతని యింట్లోనే అతని ధోవతి కట్టుకొని, అతని అనుజ్ఞతోనే సంధ్యావందనముచేసి పగల్లా పస్తున్న తర్వాత బిహారీ తెచ్చిన ఫలహారమిచ్చాయి అని తృప్తిపడింది.

ఆమెకు భోజనానంతరము ఆకు, వక్క వేసుకునే అభ్యాసమున్నది. కాని బజారులో కట్టిన వక్క తినదని బిహారీకి తెలుసు. అందుకని అతను బజారునుండి ఆకు, వక్కలు కొనుక్కొచ్చి ఒక పళ్ళెంలోపెట్టి సావిత్రి కివ్వ దానికి తెచ్చాడు. ఇది చూచి సావిత్రి నవ్వుతూ "నేను వస్తే మీరు మరచిపో లేదనుకుంటాను బిహారీ" అన్నది.

"నేనుకూడ మనిషినేగా అమ్మా! నిన్ను ఒక్కసారి చూస్తేసరి మళ్ళీ పన్యాసులుకూడ మరచిపోలేరు" అని బిహారి టేబిల్ మీద తాంబూలాలు పెట్టి వాకిలి దగ్గరపెట్టి, తాంబూలాలు వేసుకోమని చెప్పుకొని వంటింట్లోకి వెళ్ళాడు.

సావిత్రి కాంతితో వెలుగుతూ కూర్చుని తాంబూలాలు వేసుకుంటూ వున్నది. నెత్తిమీద ముసుగులేదు. తలవెంట్రుకలు భుజముమీదనుంచి క్రిందకు వ్రేలాడుతున్నాయి. జబ్బుపడి లేచిన స్త్రీ సుకుమారవదనముమీద వున్న స్వాభావికత, మాధుర్యం, కొంచెం గంభీర ముఖముమీద ఏదో విశాదపూరితమై వున్నది. ఆమె కొంచెము పరధ్యానంతో ఊరకగా వున్నది. సమీపిస్తున్న చెప్పుల ధ్వనికూడ ఆమె చెవినిపడలేదు. ఉపేంద్రుడు, సతీశుడు వచ్చి వాకిలి దగ్గర నుంచున్నారని వినగానే తల పైకెత్తిచూచి ఆత్మవిస్మృతురాలై పోయింది. జన్మ జన్మాంతరాలనుండి ఆర్జించుకున్న స్త్రీ సహజమైన అంధసంస్కారము ఆమెను ఒక్కసారి ఆవరించి అమితమైన సిగ్గు కలుగజేసింది. వెంటనే రెండు చేతులతో పైట సర్దుకున్నది.

సతీశుడు విమూఢబుద్ధినిలాగ "సావిత్రీ! నువ్వా!" అన్నాడు.

అప్పటికి సురబాల వెలుగులో బిహారి దివాకరుల వెంట పైకి ఎక్కి వచ్చింది. వుపేంద్రుడు వెనక్కి తిరిగి "ఆగు, అక్కడే ఆగు, తిరిగి రావద్దు సురబాలా!" అన్నాడు.

సురబాల చకితురాలై "ఎందుకనీ?" అన్నది.

వుపేంద్రుడు దీనికేమీ జవాబు చెప్పకుండానే "దివాకర్, మీ వదినను బండిమీద తిప్పి తీసుకువెళ్లు. నేనుకూడా వెళుతున్నాను" అని అతను మెల్లగా బైటికి వెళ్ళిపోయాడు.

# ౨౦

వుపేంద్రుని అనుమానమిప్పుడు విశ్వాసమై పోయింది. అతను అలసి వున్నా, ఆకలితో వున్నా, భార్యా సహితంగా వున్నా, అర్ధ రాత్రైనా అనుమానం కలిగేప్పటికి అక్కడ ఒక్క క్షణం వుండలేకపోయాడు. సతీశుని ఇంట్లోనున్న యువతి - సంగతి యింకెవరినీ అడగ నవసరం లేకుండానే సిగ్గాభిడియాలతో - మొహం దాచుకున్నది. అతను ఏవగింపుతో మరలి వచ్చాడు. అటు కన్నెత్తైనా చూడలేదు.

కాని యింతా జరిగిందేమిటి? కొంచెం సేపటికి సావిత్రి ఈ కాండంతా గ్రహించి కంపించిపోయింది. పదిమందిలోకూడా ఆమె తల వంచవలసిన అగత్యమేమీ లేదు. కాని అజ్ఞానంతో పెద్దపొరపాటు చేసింది. ఆమె ముసుగు దిగంతవ్యాపితమైన సిగ్గుతో ఆమె శరీరాన్నంతటినీ బంధించి పారేసింది. నిమిషం ముందు - ఆమె నెత్తిమీద లజ్జాపర్వతాలు విరుచుకు పడతాయని ఎవరాలోచించారు?

వూపిరాడక శ్వాస రానప్పుడు మానవుడు తల బైట పెట్టటానికి ప్రయత్నించినట్టు సావిత్రి నెత్తిమీద ముసుగు నొక్కసారి తొలగించి - తిన్నగా కూర్చుని "వారెవరు?" అన్నది.

సతీశుడు స్తబ్ధుడై వాకిటివద్ద నిలబడివున్నాడు. ఆ స్థితిలోనే "వుపేంద్రబాబూ, వదినా" అన్నాడు.

"ఆఁ వారా వృపేంద్రబాబుగారు, ఆమేనా వదిన? వారా!" సావిత్రి చివ్వున లేచినుంచుని "వారిని తిప్పి తీసుకురానా? ఛీ! ఛీ! నే నెవరినీ కాకపోతే యింటి నౌకరునుగా, తప్పుకో, తప్పుకో, తప్పుకో..." అన్నది బిగ్గరగా.

వృపేంద్రు డెవరో సావిత్రికి బాగా తెలుసు. మాటల సందర్భంలో సతీశునిద్వారా - అతన్ని గురించి అనేకసార్లు విన్నది.

సతీశునికి యిప్పుడు మత్తువదలినట్లయింది. అతను లేచి వెళ్ళి— చేతులు వాకిటికి అడ్డంగా జాపి నుంచుని "వద్దు" అన్నాడు.

సావిత్రి వ్యాకులపాటుతో చేతులు నెట్టుతూ "వద్దేమిటి? సర్వ నాశనం చెయ్యక తప్పుకో సతీశ్‌బాబూ! నా నిజస్వరూపాన్ని వారిని తెలుసుకోనీ" అన్నది.

సతీశుడు దారి యివ్వలేదు. కాని అతని పెదవులమీద సన్నని చిరు నవ్వురేఖలు కనపడ్డాయి. "ఓహో! నీ సర్వనాశనమా? లేదు. నీ వీ విష యంలో నిశ్చింతగా వుండు. అయితే నీ యధార్థ పరిచయ మేమిటో నాకు కొంచెం చెప్పు" అన్నాడు.

సావిత్రి వెంటనే సమాధాన మివ్వలేక చూస్తూ వూరుకుంది. ఇలాంటి నిరుత్తరదృష్టి సతీశుడు ఇంతకుముందుకూడా చూచాడు. కాని వాటిలోనూ దీనిలోనూ చాల వ్యత్యాసం కనిపించింది. ఇంత అఘాతం కలిగినప్పటికీ ఇవ్వాళ ఈదృష్టి నిప్పంటించలే దెందుకని? ఆశ్చర్యపూరితమైన ఈ స్నిగ్ధ కరుణ నేత్రద్వయం ఆ సావిత్రిదేనా?

కొంచెంసేపుండి సావిత్రి "నా పరిచయమా? ఇదివరకే చెప్పానుగా ఇంటినౌకరునని. దయవుంచు సతీశ్‌బాబూ! నేనువారిని తిప్పితీసుకువస్తాను. ఈచీకట్లో వారు బజార్లవెంట తిరగటం మంచిదా?" అన్నది వినయంగా.

సతీశుడు ఏమీ తోణక బెణకకుండా "వారి దుఃఖ సుఖాలు ఆలో చించుకునే బాధ్యత వారియందే వుంచు. ఈ ఇంటికి వచ్చేకన్నా బజార్లవెంట తిరగటమే మంచిది. వదినను నేను ఈ ఇంట్లోకి అడుగుపెట్టనివ్వను" అన్నాడు.

"ఎందుకనీ? నేను వచ్చాననా? నేను ముట్టుకుంటే ఈ పృథ్వి

కూడా అపవిత్రమై పోతుందా ఏమిటి సతీశ్‌బాబూ? ”

సతీశుడు ఒక క్షణంసేపు కదలకుండా వూరుకొని “ నువ్వు ఈ ఇంటికి వచ్చావెందుకు? ” అన్నాడు.

“ మీరు...........“

“ నేనా? నేనేమిటి...... ”

సావిత్రి ఎక్కువసేపు సతీశునికేసి చూడలేకపోయింది. తలవంచుకొని దుఃఖస్వరంతో ” మీరు నాకు పాతయజమానులని, ఈ లేమిలో యాచనకొచ్చాను ” అన్నది.

సతీశుడు విషపునవ్వు నవ్వి “ లేమిలో యాచనకొచ్చావా? నీకు యజమానులు చాలామంది వున్నారుగా సావిత్రీ! ఇన్నిరోజులనుండీ ఒక్కొక్కటిగా అందరి యిళ్ళూ గాలించి వచ్చినట్టుంది ” అన్నాడు.

పిడుగుదెబ్బలాగ ఈ నిష్ఠురాఘాతం ఆమె హృదయాన్ని తుత్తునియలు చేయసాగింది. కాని ఆమె తల పైకెత్తలేదు. నోరు కదల్పనూ లేదు. నాలుక పళ్ళసందున కరుచుకు నుంచుని వుంది.

“ విపినబాబు నిన్నెందుకు వెళ్ళగొట్టాడు? అతని మోజు కాస్తా అణగిపోయిందా ఏమిటి? ” అన్నాడు సతీశుడు.

సావిత్రి ఈసారికూడా సమాధాన మివ్వలేదు.

హఠాత్తుగా సతీశునికి బిహారి విన్నపము జ్ఞాపకమొచ్చింది. “యాచన ఏమిటి? ముప్పై రూపాయలేనా? ” అని అడిగాడు.

సావిత్రి వంచుకున్న తల యెత్తి...“అవును” అని సమాధాన మిచ్చింది.

“ సరే ” అని సతీశుడు వాకిటిదగ్గరకెళ్ళి నుంచుని క్షణంలో యిల్లు నలువైపులా తేరిపారజూచి ఆగిపోయాడు.

మొదట అతన్ని ఆనందపెట్టిన ఈ యింటి నూతనాలంకరణ యిప్పుడతన్ని పీకుతున్నట్లుగా తోచింది. చెంతనున్న పక్కకూడా ఆమె చేతితో వేసిందే. స్టీమరుకు వెళ్ళేముందు అతను దీనిమీద కొంచెంసేపు విశ్రమించాడు. ఈ సంగతి జ్ఞప్తికిరాగానే అతనివళ్ళంతా జెర్రులు పారిన ట్లనిపించింది. వెంటనే పెట్టెలోంచి గుప్పెడునోట్లు తీసి సావిత్రిముందు విసిరివేసి “వెళ్లు,

వెళ్లు, వీటిని తీసుకువెళ్ళు. మళ్ళా ఎప్పుడూ రావద్దు" అన్నాడు.

సావిత్రి మూడునోట్లు లెక్కపెట్టి తీసుకొని నుంచున్నది. ఇంత వరకు సతీశుడు కదలకుండా చూస్తూ వూరుకున్నాడు. సావిత్రి లేచి నుంచోగానే అతను సావిత్రితో ఏదో అనాలనుకున్నాడు. కాని అనాలో చితంగానే అతని నాలుక ఆగిపోయింది.

పాపం, ఈ సంగతి అతనికేమి తెలుసు! జ్యేష్ఠమాసము చివరిరోజుల లోని తీక్ష్ణపు ఎండలాగ అతని తప్తక్రోధము ఈ నిర్భాగ్యురాలిని మూకప్రుథివి లాగ మాడ్చివేస్తూవుంది. కాని దానితోపాటు ఆ శూన్యాకాశంలో దాని ప్రతి అణువు ఏకత్రమై కారు మేఘాలలాగ తయారౌతున్నాయి. ఈ మేఘాలు ఒకనాడు చాటుగా కదలకుండా ముట్టడిస్తాయని సతీశుడు వూహించను కూడాలేదు. అతని గొంతు, నేత్రద్వయం ఏదో అదృశ్య ఆక్రమణతో అణగి పోసాగినై. అతను ఎంతో ప్రయత్నంతో ఆ ముట్టడినుండి తప్పుకుని

[illegible]?" అని పిలచాడు.

"కథలూ - గాథలలో చదువుతూ వుండేవాణ్ణి - ఫలానమనిషి ఫలాన మనిషిని ఏవగించుకుంటున్నాడని; నాకు నమ్మక ముండేదికాదు. అది కేవలం క్రోధంలోని విషయ మనుకుంటూ వుండేవాణ్ణి. మనిషిని మనిషి ఎలా ఏవ గించుకుంటాడో నాకు అర్థమయ్యేదికాదు. మనుష్యుని మనిషి ఏవగించగల డని యివ్వాళ చూస్తున్నాను. నా జీవితాంతమువరకూ ఎప్పుడూ నిన్ను ముట్టనని ప్రమాణంచేసి చెబుతున్నాను సావిత్రీ!"

సావిత్రి మాట్లాడలేదు.

"అయితే సావిత్రీ! ఈ ప్రపంచంలో నీకు డబ్బుకంటె ప్రియమైన వస్తువు యింకేదైనా వుందా? వుంటే ఈ నోట్లను ఎప్పటికీ చేత పట్టగలిగే దానివికాదు. ఇవ్వాళ నావద్ద వున్నదంతా నీకిచ్చేస్తాను, ఒకసంగతి అడుగుతాను, నిజం చెబుతావూ?"

"అడగండి"

"అడుగుతాను" అని సతీశుడు ఆగిపోయాడు. సావిత్రి కొయ్య బొమ్మలాగ తలవంచుకొని ప్రతీక్షిస్తూవుంది.

"అడగటానికి సిగ్గేస్తావుంది కాని తెలుసుకోవాలని కుతూహలం కూడా వుంది. అయితే సావిత్రీ! నువ్వెప్పుడూ ఏనాడూ ఎవరినీ ప్రేమించలేదూ?" అన్నాడు సతీశుడు

సావిత్రి కొంచెంసేపు మెదలకుండా వుండి మృదుస్వరంతో స్పష్టంగా "యితరుల సంగతి తెలుసుకుంటే మీకేం వస్తుంది?" అన్నది.

సతీశుడు కొంచెం సంకోచపడి "సరే, యితరుల సంగతి అలావుంచి, నా విషయమేం తెలుసుకో దలచుకుంటే?" అన్నాడు.

"మీ విషయంకూడా తెలుసుకుని మాత్రం ఏం చేస్తారు?

"తన సంగతి తెలుసుకో గూడదూ?"

"మనిషికి తన్ను గురించిన సంగతులు ఎన్ని తెలుసు? రేపు జరగనున్న దేమిటో ఎంతమందికి తెలుసు?"

"అది నిజమేగాని, అందరూ తెలుసుకోనా లనుకుంటారుగా?"

సావిత్రి వాకిటికి దగ్గరగా జరిగి "ప్రపంచంలో మీకెన్ని తెలియని సంగతులు లేవు? ఈ సంగతి తెలియకపోయినా జరక్కపోదు" అన్నది.

"ఆఁ జరక్కపోదులే" అని సతీశుడు ఒక దీర్ఘనిశ్వాసం బలవంతాన ఆపుకున్నాడు.

కాని సావిత్రి దాని అలికిడి విని తల పైకెత్తింది. సతీశుడు సావిత్రి మొహం చూచి చకితుడై "జబ్బుపడ్డావా ఏమిటె సావిత్రీ!" అన్నాడు.

సావిత్రి మళ్ళా తలవంచుకొని "లేదు" అన్నది.

"చాల జబ్బుపడినట్టు కనపడుతున్నావు."

జవాబేమీ చెప్పకుండానే సావిత్రి బైలుదేరి బైటకు వచ్చింది. గది లోంచి దుఃఖకంఠంతో "సావిత్రీ! నన్నొక్కనాడుకూడా ప్రేమదృష్టితో చూడలేదూ?" అన్న శబ్దం వచ్చింది.

సావిత్రి మెదలకుండా స్తంభానికి నుంచున్నది. తల పైకెత్త లేదు.

లోపలి దుఃఖకంఠం ఈసారి బైటికివచ్చింది. "ఒక్కసారి చెప్పిపో సావిత్రీ. నే నింతకాలంనుండి నిద్రమత్తులో వుండే దుఃఖభారంతో గాలి

స్తున్నానా? నా అదృష్టంలో అన్నీ పొరపాట్లేనా? నా హృదయంలో నిండివున్న ఆ సారవ్యథకూడా పొరపాటేనా? మిథ్యేనా? మోసమేనా?"

సావిత్రి కొంచెంసేపు ఆలోచిస్తూ వుంటున్నది. తర్వాత తలపైకెత్తి "మీ రనే దేమిటి సతీశ్ బాబూ? నేను పెద్ద చిక్కుల్లోపడి బీహారిద్వారకు అప్పుకని వచ్చాను, కాని మీతో నిజంచెబుతున్నాను. ఇంత గొడవ అవుతుందని తెలిస్తే వచ్చేదాన్ని కాను" అన్నది.

సతీశుడు స్తబ్ధుడై పోయాడు. సావిత్రి కంఠస్వరంలో శాంతమూ, వినయమూ వున్నదిగాని మాధుర్యం కనపడలేదు. ఇంతకుముందు ఆమె ఈ కోమలకంఠంతో యజమానిని యాచించలేదు.

"మీరే ప్రమాణంచేసి చెప్పారు— నేనంటే మీకు ఏవగింపని. మరి నేనింకేంచెయ్యాను? మీరేచెప్పండి. సంతోషంగావుంటే ప్రేమించా వచ్చును, కోపంగావుంటే ఏవగించా వచ్చును. మీరుకూడా అలాగే చేస్తూవుంటారు. కాని మా కాళ్ళుచేతులకు సంకెళ్ళున్నాయి. నాకనే చేసుకుంటేగాని గడవదు. అందుకని ఏం చేస్తే ఐదేళ్ళు లోపలికిపోతానో చూడాల్సివస్తుంది. తీరా అడుగుపెట్టిన తర్వాత ఆబాటమీద పడక తప్పదు."

సతీశుని హృదయంలో పొంగులెత్తుతున్న వేడిరక్తంమీద సావిత్రి మాట ఒక్కొక్కటి మంచుగడ్డల్లాగ పడి పూర్తిగా బలహీనపర్చసాగింది. విహ్వలనేత్రాలతో ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు. సంగతులన్నీ అతను అవగాహన చేసుకున్నాడో లేదో సావిత్రి తెలుసుకోలేకపోయింది.

సావిత్రికి ఈ దృశ్యం చూడటం అసహ్యమనిపించింది. అందుకని దృష్టిని మరోవైపుకు తిప్పుకొని కొంచెం ఆగింది. తనమాటలే తనహృదయాన్ని శూలాల్లాగా ఛేదిస్తున్నా, దెబ్బతిని నేలకూలుతూన్న సైనికునిలాగా కడసారిగా సతీశుని లజ్జాస్పదనిష్ఫల ప్రణయంమీద ఖడ్గప్రహారం చేసినది. "ఏనాడైనా మిమ్మల్ని ప్రేమించానా లేదా అని అడుగుతున్నారు మీరు? కాని ఆ మెస్సులో మీరు అందరికంటే ఎక్కువగా డబ్బుయిస్తూ వుండేవారు. అలాగే అందరికంటె మిన్నగా మీపని చేయటానికి ప్రయత్నించేదాన్నా లేదా మీరే చెప్పండి? మీరిప్పుడు దీన్ని ఒప్పుకోక పోవచ్చును, లేదా మర్చిపోయి వుండవచ్చు - కాని ఇప్పుడుకూడా దానికి సాక్ష్యంగా

బిహారీ వున్నాడు. మమ్మల నెవరు పెట్టుకుంటే వారికే సేవాశుశ్రూషలు చేస్తూవుంటాము. ఇప్పుడు బేకామిగా వున్నాను. కావాలంటే రేపటినుంచే వచ్చి పనిచేస్తాను. మీరు స్థానమిస్తే మిమ్మల్ని అలాగే ప్రేమిస్తాను" అన్నది.

సతీశుని చెవులలో ఒకవిధమైన ధ్వని ప్రతిధ్వనించసాగింది. అతను ఒకసారి సంపూర్తిగా చూడాలని ప్రయత్నించాడు. కాని కళ్ళముందు చీకటి తెరలులాగ వ్యాపించినవి. సావిత్రి వాకిటివద్ద వెలుగులో నుంచుని వుంది. ఆమె శరీరమంతా బీభత్సంగా వికృతంగా కనిపించింది. అతని ఇంట్లో ప్రతిష్ఠించిన పరమపూజ్యప్రతిమను ఎవరో ముక్కలు ముక్కలు చేస్తున్నట్టు తోచింది. అతను - మోహాంతిప్పుకుని "వెళ్ళు" అన్నాడు.

సావిత్రి తలవంచి నమస్కరించి మెదలకుండా వెళ్ళిపోయింది. సతీశుడు ఇది చూడలేదు. అత్యంతకోమలమైన ఆమె అంతిమపాదధ్వని విన్నాడు.

కింద బిహారిగదిలో మినుకు మినుకు మంటూ దీపమొకటి వెలుగుతూ వుంది. అర్ధనిమీలితనేత్రాలతో సావిత్రి తడబడుతూన్న అడుగులతో ఆ గదిలోకి వెళ్ళి చెయిజాపి ఏదో పట్టుకోవాలనుకుంది గాని ఏమీదొరక్క స్మృతితప్పి తల్లకిందులుగా పడిపోయింది.

బిహారి వుపేంద్రునితో కొంతదూరంవెళ్ళి, జ్యోతిష్‌బాబుగారి ఇంటి దారి చూపించివచ్చి చీకట్లోనుంచుని సావిత్రి అన్న చివరిమాటలు వింటు న్నాడు. ఇవ్వాళ పగలల్లా అతను - ఆమెతో ఎంతోసేపు మాట్లాడాడు. ఒక హృదయంలేని గృహస్థుని ఇంటికి పనిచెయ్యటానికి వెళ్ళి - సావిత్రిపడిన కష్టాలు, జబ్బు పడినప్పుడు ఆమె పడిన యిబ్బందులూ, ఆమెస్థితిగతులూ విని బిహారి హృదయం తరుక్కుపోయింది. కాని ఇప్పుడు బాబుగారిముందు ఆడిన అబద్ధపు అంతరార్థ మేమిటో వృద్ధునికి అర్థంకాలేదు. సావిత్రి కిందకు దిగి వెళ్ళిపోయిన తర్వాత అతనుకూడా చీకట్లో బాబుగారు చూడకుండా కిందకు దిగివచ్చాడు. సావిత్రి కనపడలేదు. బజార్లోకి పరుగెత్తాడు. నలువైపులా తేరిపారజూచి ఎక్కడా కనపడక పోయేటప్పటికి మళ్ళా ఇంట్లోకి వచ్చి—తనగదిలో చూచి స్తంభించి నిలబడిపోయాడు. తర్వాత జాగ్రత్తగా

దగ్గరకువచ్చి దీపం వత్తి పెద్దదిచేసి సావిత్రి తలవైపుకువచ్చి కూర్చుని "ఇలా కిందపడి వున్నావేం అమ్మా సావిత్రీ!" అన్నాడు.

పలుకక పోయేప్పటికి మళ్ళా ప్రేమగా "నీ వంట్లో బాగాలేదు. ఇక్కడ చలివేస్తుంది. లేచి కూర్చో, చాప వేస్తాను" అన్నాడు.

సావిత్రి అలాగే పడివుంది.

బిహారి ఆశ్చర్యపడి పోయాడు. అతినికి సరిగా కనపడటంలేదు. దీపం మొహం దగ్గరకు తీసికెళ్ళి చూడగానే కంగారు పడిపోయాడు. "ఎంతపని ..వు సావిత్రీ!" అని అరచాడు. ఆమె కళ్ళు మూతలు పడివున్నాయి. మొహం నల్లబడి పోయింది. ఈ అరపుకుకూడా ఆమె లేవలేదు. శవంలాగ అలాగే పడివుంది.

సతీశుడు పైగదిలో శిలాప్రతిమలాగ ఇంకాఅలాగే కూర్చునివున్నాడు. ఈ అరపు విని త్రుళ్ళిపడ్డాడు. వంటవాడు పని వదిలిపెట్టి వంటింట్లోంచి పరుగెత్తుకు వచ్చాడు. బిహారి ఏడుస్తూ "నువ్వోసారి పరుగెత్తుకువెళ్ళి బాబుగారికి ఈ కబురు చెప్పు పంతులూ" అన్నాడు.

అతడు పరుగెత్తుకు వెళ్ళి "దాదీ చనిపోయింది బాబూ...!" అని సతీశునికి చెప్పాడు.

"ఏమిటి? చనిపోయిందా?"

"అవును బాబూ!"

సతీశుడు బిహారి గదిలోనికి వచ్చి ఆమె తలవైపున కూర్చుని దీపం మొహం దగ్గరపెట్టి చూడగానే—ఆమెకు మూర్ఛ వచ్చిందని గ్రహించాడు. దీపం అవతలపెట్టి "బిహారీ! అరవకు. మొహంమీదా కళ్ళమీదా నీళ్ళు చల్లు. ఒక విసనకర్ర తీసుకొచ్చి మెల్లగా విసరమని పంతులుతో చెప్పు" అన్నాడు.

ధైర్యం కలిగిన తర్వాత బిహారి నీళ్లు చల్లసాగాడు, పంతులు విసనకర్రతో విసరసాగాడు.

కొంతసేపటికి సావిత్రి ఆవలించి, కళ్ళు నలుపుకుంటూ పయట సర్దుకుని లేచి కూర్చున్నది.

"వేడిపాలు తీసుకురా పంతులూ? కొంచెం జాస్తిగా తీసుకురా.

వెంటనే తడిగుడ్డ విడిచివెయ్యమని చెప్పు బిహారీ?" అన్నాడు సతీశుడు.

పంతులు పాలు తీసుకురావటానికి వెళ్ళాడు. బిహారి సావిత్రిని తడి బట్టవిడచి పొడిబట్ట కట్టుకోమని చెప్పాడు.

కొంచెంసేపు మెదలకుండా వుండి "స్వస్థత చిక్కిన తర్వాత ఎక్కడికి వెళుతుందో అడిగి తెలుసుకుని బండి కట్టించి పంపించు. నడిచిమాత్రం వెళ్ళనివ్వవద్దు" అన్నాడు సతీశుడు మళ్ళీ.

సావిత్రి వళ్ళంతా వణికిపోయింది. కాని సంధ్యచీకట్లో అదెవరికీ కనపడలేదు. ఆమె దానిని ఎంతో కష్టంమీద సంబాళించుకున్నది.

"బాగా స్వస్థత చిక్కినట్లు లేకపోతే నాపక్కమీద పండుకోమను. నే నింకెక్కడికైనా వెళతాను" అన్నాడు కొంచెంసేపుండి సతీశుడు మళ్లీ.

సావిత్రి ఒక్కసారి కంపించి పోయింది.

సతీశుడు ఒక చిన్న తాళంచెవి బిహారి దగ్గరకు విసిరివేసి "ఇటు చూడు. తాళంచెవి ఆమెవద్దనే వుంచి వెళతాను. వెళ్లేప్పుడు ఆమెకు అవసరమైన పైకం తీసుకెళ్ళుతుంది" అన్నాడు. సావిత్రి అసలే జబ్బులోనున్నది. బలహీనంగాకూడా వున్నది. దానిమీదట సతీశునిమాటలు ఆమె హృత్పిండాన్ని మథించి విష అమృతాలతో గొంతువరకూ పూరితం చేశాయి. ఆమె మళ్ళీ ఒకసారి కంపించి నిర్జీవప్రతిమలాగ నిలబడిపోయింది. "నేను పథరియాఘట్టాకు వెళుతున్నాను బిహారీ! రేపు బహుశా ఆలస్యంగా వస్తానేమో" అని ఒక అడుగువేసి "ఏమీ సంకోచపడవద్దు. కావలసింది తీసుకు వెళ్ళు, నేను వెళుతున్నాను" అన్నాడు సతీశుడు.

సతీశుడు వెళ్ళిపోయాడు.

సావిత్రి ఒకసారి పైవంకచూచి కింద పడిపోయింది. గుండె లదిరేట్టు అలమటిస్తూ "ఈ పాపిష్ఠిరాలిమీద ఇంత దయతలచా వెందుకు? ఏవగించుతున్నానని ఇప్పుడేగా అన్నది? ఇదేనా ఏవగింపు? నేను పెట్టినదుఃఖాలు, ఆడిన అబద్ధాలూ నీ స్నేహాగ్నిలో పడి ఆహుతియై పోయినాయా? ఏమి చేస్తే నీ ఏవగింపు ప్రాప్తిస్తుందో ఎవరికి తెలుసు?" అనుకోసాగింది.

బిహారి ఈ విలాపంలోని అంతరార్థం గ్రహించలేక పోయాడు. కొంచెం దగ్గరకు వెళ్ళి ఓదార్పు స్వరంతో "నువ్వు బాబుగారితో అన్నీ

అబద్ధాలు చెప్పా వెందుకమ్మా? ఎక్కడికి వెళ్ళా పెట్టకుండా లేనిపోని నేరాలన్నీ నెత్తిన వేసుకుని నేరస్తురాల నంటూ ఎందుకు?" అన్నాడు.

"నా మాటలన్నీ ఒట్టి అబద్ధాలని ఆ పరమాత్మకి తెలుసు బిహారీ! చెబుతూంటే హృదయం బద్దలైనా పరవాలేదు. అబద్ధాలాడినా ఏమీ లాభం లేకపోయిందా బిహారీ! ఏమీ లాభం లేకపోయింది."

బిహారి దేబిలాగ ఆమె మొహంకేసి చూస్తూ "అబద్ధం ఇంకెందుకు పనికి వచ్చింది?" అన్నాడు.

సావిత్రి కళ్ళు నలుపుకు లేచి కూర్చుని అతని మొహంకేసి చూస్తూ "అబద్ధాలవల్ల ఏపనీ కాదని నీకు బాగా తెలుసా బిహారీ?" అన్నది.

బిహారి కొంచెంసేపు ఆలోచించి "ఎందుకు కావు? కోర్టులో అబద్ధాలాడందే సాగదు. అక్కడ అబద్ధాలకే జయం కలుగుతుంది" అన్నాడు.

సావిత్రి సమాధాన మేమీ చెప్పలేదు. చాలసేపు మౌనంగా కూర్చుని "నేను అబద్ధాన్ని ఎందుకు ఆశ్రయించానో నీకు కూడా ఒకనాడు తెలియ వచ్చు. వాటిని అలావుంచు బిహారీ! ముందు నేను రెండుమాటలు చెబుతా వింటావు?" అన్నది.

"ఎందుకు వినను? ఏమిమాటలు?"

"ఒకటి—నేను వెళ్ళిపోయిన తర్వాతకూడా బాబుగారితో ఎప్పుడూ నేను మొదటినుంచి చివరి వరకు చెప్పినవన్నీ అబద్ధాలని చెప్పవద్దు."

బిహారి మెదలకుండా వింటున్నాడు. "రెండవది—నా చిరునామా నీకు గాని పంపిస్తాను. ఎప్పుడైనా నా అవసరం కలిగితే వుత్తరం రాయి. నీతో చెప్పటానికి నాకు సంకోచ మేమీ లేదు బిహారీ! నేను మినహా లోకంలో ఇంకెవరూ వీరిని వశం చేసుకోలేరు. గడ్డురోజులలో నాకంటె మిన్నగా ఎవరూ వీరికి సేవకూడా చెయ్యలేరని నీకు తెలుసా?" అన్నది సావిత్రి.

బిహారి ఏడవసాగాడు. కళ్ళు తుడుచుకొని దుఃఖకంఠంతో "అంతా ఎరుగుదును అమ్మా!" అన్నాడు.

సావిత్రి లేచి నుంచుని "సరే వెళ్ళివస్తాను. వారిని నీచేతికే అప్పగించి పోతున్నాను. ఇటుచూడు బిహారీ - ఆ రెండుమాటలూ జ్ఞాపకముంచు

కుంటావు కదూ? ఈ దరిద్రముఖాం ఇంకెప్పుడూ నీ ఎదుట పడదులే"
అని సావిత్రి కళ్ళు తుడుచుకుంటూ ముందుకు సాగింది.

బజారులోనికి వచ్చిన తర్వాత బిహారి ఒకబాడుగబండి మాట్లాడి సావిత్రి నెక్కించి వంగి నమస్కారంచేసి కళ్ళు తుండుచుకుంటూ కంఠం సరిచేసుకొని "నా మనవికూడా ఒకటి వున్నదమ్మా! ఇవ్వాళ లాగానే అవసరమైనప్పుడు బిహారి బ్రతికివున్నాడని జ్ఞాపకముంచుకో" అన్నాడు.

"తప్పకుండా."

బండి కదిలింది. బిహారి దుఃఖకంఠంనుండి మాట బైటికి వెగిలిరాలేదు. అతను తలవంచుకొని మళ్ళీ ఒకసారి నమస్కరించి పైపంచ చెంగుతో కళ్ళుతుడుచుకుంటూ త్వరత్వరగా తిరిగి వెళ్ళిపోయాడు.

## ౨౧

"ఫ్థరియాఘట్టా వెళుతున్నాను" అని సతీశుడు రాత్రి పదకొండు గంటలకు ఇంటిలోంచి బైటికివచ్చి నుంచున్నాడు. కొంతదూరం నడచిన తర్వాత అతనికి ఒక వింతైన అలసట అనిపించింది. ఎక్కడైనా కూర్చుందామా, లేక పండుకుంటే అలసట తగ్గుతుందా అని ఆలోచించసాగాడు. అడుగు వేద్దామన్నా పడటంలేదు. వళ్ళంతా కొయ్యలాగ భారమనిపించింది. ఇవ్వాళ ఇలాంటి అలసట ఎక్కడినుంచి వచ్చిందో, ఎలా వచ్చిందో అతనికే అర్థం కాలేదు.

చాల రోజుల క్రిందట ఇలాంటిదే మరోరాత్రి సంగతి జ్ఞాపకమొచ్చింది. బిహారి సావిత్రి ఇంటిదగ్గరనుండి తిరిగివచ్చి 'ఆమె లేదు, విపినబాబువద్దకు వెళ్ళిపోయింది' అన్న కబురు చెప్పినపుడు అతను కొంచెం సేపు స్తంభించి పోయాడు. కాని వెంటనే అతని శరీరమంతా అభిమానాలతో చలించిపోయింది. ఆ దుర్గమ మైదానంలో, నక్షత్రభూషితనీలాకాశం కింద ఈ విధంగా కన్నీళ్ళతో చల్లబడక పోయినట్లయితే ఎక్కడవున్నా, ఎంత కాలంపట్టినా సావిత్రిని హతమార్చకుండా శాంతించేవాడుకాదు. ఇవ్వాళ

కూడా అలాంటి రాత్రిలోనే అతని ఇంట్లోంచి బైలుదేరాడు. కాని ఇవ్వాళ అలాంటి చలనం ఎందుకు కలగలేదు ?

సావిత్రి ఇవ్వాళ అతని ఇంట్లోనే వున్నది. అతని చేతుల్లోనే వున్నది. ఆమెను అందకుండా ఎవరూ లేరు. పూర్తిగా నిస్సహాయురాలు. ఇవ్వాళ ఇష్టమొచ్చినట్లు చేసేపని ఏమీ చేయలేకపోయాడు. అతని హృదయాగ్ని అంతా దానంతటదే చల్లారిపోయిందా ?

ఒక బండి ఖాళీగా వెళుతూవుంది. పిలచి "పథరియాఘట్టాకు వస్తావా?" అన్నాడు సతీశుడు.

"వస్తాను" అని జట్కావాడు బండి ఆపి రోడ్డుమీద లైటువెలుగులో సతీశుని మొహంకేసిచూచి తాగివున్నాడని గ్రహించాడు. "చాలా దూరముంది బాబూ! మూడు రూపాయలు బాడిగ అవుతుంది. జేబులో డబ్బువుందా?" అన్నాడు.

"వున్నది" అని సతీశుడు బండి ఎక్కి కళ్ళుమూసుకొని ఒకమూల కూర్చున్నాడు. అంతా తెలిసివుండికూడా బాడిగ మాట్లాడుకోటానికిగానీ, బండివాడడిగిన బాడిగకు ఆశ్చర్యపడటానికిగానీ అతనికి ఓపికలేకపోయింది.

ఇది మానసిక సంబంధమైన అలసట. ఇంత కాలంనుండి అతని హృదయంలో వ్రణంలాగ పెంచుకున్న ఆవేదననూ, కూర్చుంటే, లేస్తుంటే అతని హృదయాన్ని చీలుస్తున్న సంశయాలనూ, ఎడతెగకుండా ఒకదానిమీద ఒకటి వచ్చిపడి అతని హృదయాన్ని వేధిస్తున్న దుఃఖాలనూ, ఇవ్వాళ సావిత్రి స్వయంగా వచ్చి వాటినన్నీ చర్చించి - తన చేత్తో చాకు తీసుకొని ఆవ్రణాన్ని చిదిపి మలినమంతా బైటికి కొట్టిన తర్వాత అతనికి కొంచెం కునుకుపాట్లు వచ్చాయి.

కాని సతీశుడు నిద్రకూడా పోలేకపోయాడు. సావిత్రి అన్నమాట జ్ఞాపక మొచ్చింది. అది నిజమే. ఆమె హృదయం కట్టుబడివుంది. అది ఆమె వృత్తి - జీవనోపాధి. నాలాగ ఏవగించుకోటానికీ, ప్రేమతో కరగిపోటానికీ ఆమెకు అధికార మెక్కడిది? ఈ బాహ్యప్రపంచం భోజన వస్త్రాలు, ఆకలిదప్పులు, యిల్లు వాకిళ్లూ ఆదిగాగల మంచిచెడ్డలతో వారి ఎదుటనుంచుని కళ్ళెర్రజేసి తీవ్రదృష్టితో వారికేసి చూస్తూవుంటుంది. వాటిని ఈ స్త్రీలు

ఎలా స్వీకరించకుండా వుండగలరు? పొట్టపోసుకోటానికి వారేదో ఒకటి చెయ్యకతప్పదు. నా ప్రేమవాహినిలో సావిత్రి తన మనస్సు నెలా ముంచి వుంచుతుంది? నా విషయంలో ఆమె ఎరుగున్నదిమాత్ర మేమిటి? నా ప్రేమమీద ఆశపెట్టుకుని ఆమె ఏమని కూర్చుంటుంది? విపినునిస్థితి ఆమెకు తెలియనిదికాదు. ఆడవాళ్ళ బరువు-భారాలు వహించే అలవాటూ, యోగ్యతా రెండూ అతనిలో వున్న సంగతికూడా సావిత్రికి బాగా తెలుసు.

"బాటమీద అడుగు పెట్టినతర్వాత అది మంచిగానీ, చెడ్డగానీ దానిమీద నడచిపోవటం తప్ప మరో వుపాయంలేదు" అన్నది ఆమె.

నిజమే. నావద్దనుండి నాలుగుడబ్బులు ఎక్కువ వస్తున్నంతవరకు నన్నే మిన్నగా ప్రేమించేది. యిది మరచిపోయే సంగతికాదు, ఆమె దాచలేదుకూడా. దీనికి బిహారి సాక్ష్యమున్నాడు.

ఆమె మాటలన్నీ ఒక్కొక్కటే స్వచ్ఛమైన నీలమణిలాగ ప్రకాశించసాగినై. ఇంతకుముందు ఈ విషయంలో ఆమెవల్ల కలిగినపరిచయమే యదార్థమని అతని చెవులలో మారుమ్రోగసాగింది. అంతకుతప్ప సావిత్రి అడుగిడటానికి మరోమార్గంకూడా లేదు.

తర్వాత ఆమెకు సంబంధించిన విషయాలు ఎన్నో అతని బుర్రలో దొర్లసాగినై.

థియేటరులో ఒకమనిషి సీతాపహరణదృశ్యం నిజమనుకొని క్రోధంతో అరిచాడు. ఇది తలంపుకువచ్చినపుడు ఎంతమంది మందహాసాలు అతనికి జ్ఞప్తికి వస్తాయి. ఒకరోజున మేజిక్ చూట్టానికి వెళ్ళాడు. అక్కడి హిప్నొటైజు చేయబడిన మనిషి పంచదా రనుకుని ఇసుకతిన్నాడు. మిఠాయి అనుకొని కొయ్య నాకాడు. ఈ వింతచూచి ప్రజలు ఎంతకులాసా పడ్డారో జ్ఞప్తికి వచ్చింది. సిగ్గుతోనూ ఏవగింపుతోనూ అతనివళ్ళు పులకరించింది. అతను ఒకసారి తిన్నగా కూర్చుని నా దుర్దశనుగురించి సావిత్రి ఎంతనవ్వుకుంటూ విపినునితో చెబుతుందో ననుకున్నాడు.

ప్రణయకలహానంతరం ప్రేమికులు కొంతకాలంపాటు విడిగావుంటే - ప్రేమబంధం మరింత గాఢమౌతుందని విన్నాడు. సావిత్రి అందుకే వచ్చింది. దానిలో అతనికి సందేహమేమీ లేదు. ఇవ్వాళ ఆమె అతనిభుజంమీద పాదం

పెట్టి మరోమెట్టు విపినునికి చేరువగా చేరిందని అతనికి స్పష్టంగా కనపడ సాగింది.

జట్కావాడు పిలచి "ఏ నెంబరు యింటికి వెళతారు బాబూ?" అన్నాడు.

సతీశుడు కళ్ళు నలుపుకొని లేచికూర్చుని మళ్ళా పండుకున్నాడు "గంగవడ్డుకు తీసుకుపద" అన్నాడు.

జట్కావాడు బండి ఆపి కిందకుదిగి "మీరు నిషాలోవున్నారు. నా మాటవిని ఇంటికి వెళ్ళండి బాబూ!" అన్నాడు. సతీశుడు ఒక్కసారి వ్యగ్రుడై లేచికూర్చుని "నేను నిషాలోవున్నానా! సరే, ఇక్కడే సారా ఎక్కడ దొరుకుతుందో నీకు తెలుసా?" అన్నాడు.

జట్కావాడు మరి కొంతసేపు చూస్తూవూరుకొని "ఎక్కడికి వెళ తారు? ఇప్పుడే చెబుతున్నాను, బాడిగ కట్టింపవుతుంది-పన్నెండయింది" అన్నాడు తర్వాత.

సతీశుడు సెదలకుండా అతని చేతికి ఒకనోటు యిచ్చి మళ్ళా బండి లోకి వెళ్ళికూర్చున్నాడు. ఇటూ అటూ తిప్పి జట్కావాడు దిగి కొంత సేపటికి ఒకసీసా, మిగిలినడబ్బు సతీశుని చేతికిస్తూ "ఎక్కడికి పోనియ్య మంటారు బాబూ!" అన్నాడు.

"ఎక్కడికి వెళదాం? నువ్వే చెప్పు?" అన్నాడు సతీశుడు.

ఈసారి జట్కావాడు మరింత దగ్గరగా వచ్చి మెల్లగా "డబ్బంతా తగలెయ్యక ఇంటికి పద బాబూ!" అన్నాడు.

"పద" అని సతీశుడు వెంటనే వప్పుకుని సీసా వళ్ళో పెట్టుకుని బండిలో పండుకున్నాడు.

వారాంగనలు ఆకలి చూపులతో గుమ్మాలలో విటులకోసం ఇంకా ఎదురుచూస్తూ కూర్చున్నారు. బండి మలుపు తిరుగుతుండగా వారిలో ఒకరి మీద సతీశుని దృష్టి పడింది. దృష్టిపడగానే అతని నెత్తిన దెబ్బపడ్డట్టు శరీర మంతా కంపించి పోయింది. ఒక వ్యక్తినిచూచి మరొకవ్యక్తి రక్తనాళా లన్నీ ముడుచుకు పోతాయి, ఏవగింపుతో తల వంగిపోతుంది, ఎందుచేతో సతీశునికి అర్థంకాలేదు. ఇంతకుముందెప్పుడూ సతీశునికి ఈ అనుభవములేదు.

బండివాడు నిపుణతతో తెరచి తీసుకువచ్చిన సీసా బండిగతుకుడికి చింది సారాయివాసన అతని ముక్కుల్లో చొరబడి మరచిపోయిన కోర్కెలను లేపి క్రమంగా అతన్ని తనవైపుకు ఆకర్షించసాగింది. బండిలోకూర్చునే సీసా ఖాళీ చెయ్యాలని బుద్ధి పుట్టింది. కాని ఎవరో మనిషి ఈ విధంగానే బండిలో సారా తాగి చనిపోయాడని విన్నాడు. అందుకని భయం కలిగింది. గుర్రాన్ని అదిలించి బండిని ఇంటికి త్వరగా తోలమని చెప్పాడు. కాని ఏమీ లాభం లేకపోయింది. అలసిపోయిన గుర్రం కొరడాదెబ్బలు వీపుమీద పడేప్పటికి గునుకువేసి యజమానిని తృప్తి పరచేదేగాని బండి ముందుకు సాగేది కాదు.

ఎదురుగా మూడంతస్తుల మేడమీదనుండి మదోన్మత్తకంఠంతో అశ్లీల సంగీతం వినపడుతూవుంది. సతీశుని చెవిని పడగానే సావిత్రికికూడా సంగీతం వచ్చునా అన్న ప్రశ్న కలిగింది అతని మనసులో. అతను స్వయంగా ఈ విద్యలో ప్రవీణుడు. చాలమంది వేశ్యాంగనలు సంగీతమేమీ తెలియకుండానే అరుస్తూ వుంటారనీ, ఆ అరుపుమాచి అంతకంటే పశువులు ముగ్గు లౌతూ వుంటారనీ అతనికి బాగా తెలుసు! సావిత్రికూడా ఇలాగే ఆ త్రాగుబోతులను వినోదపర్చుతుందా? ఆమెకూడా సారా తాగుతుందా? తాగిన తర్వాత వీరిలాగానే పిచ్చి అరుపులు అరచి చివరికి కిందపడి దొర్లుతుందా? తెలివిగా వుంటుందా?

బండి అక్కడనుండి దూరంగా వెళ్ళిపోయింది. తాళం-లయలేని అవ్యక్త సంగీతంకూడా విలీనమై పోయింది. కాని సతీశుని చెవుల్లో అది అలాగే ప్రతిధ్వనిస్తూవుంది. దాని ప్రోద్బలంతో అతని హృదయంలో చెలరేగిన జ్వాలతో మండిపోతున్న తన శుభాకాంక్షిణిని గురించిన అంతులేని అసంభవ ప్రశ్నలను సంభవమనుకుని వాటన్నిటినీ ఒక్కచోట కూడబెట్టి తన వూహాసౌధాలను నిర్మించసాగాడు.

ఈ హృదయ విదారకమైన దుఃఖంలోకూడా తలవని తలంపుగా అతనికి ఒక్కసారి నవ్వు వచ్చింది. సావిత్రి అతనిచేత ఇక సారా ముట్టనని వట్టు వేయించుకుంది. ఇంతవరకు అతను దానిని చాల నిష్ఠతో పాలిస్తూవచ్చాడు. 'నేను సారా తాగకపోవటము తర్వాత సంగతి. కాదంటానికి ఆమె ఎవరు?

నేను ఆమె ఇంతగొప్పదని ఎలా వప్పుకుంటాను! ఎప్పుడైనా కనపడితే అడుగుతాను, ఆమె స్వయంగా చేసే దేమిటో!' అనుకున్నాడు మనసులో. తనింతకాలం ఒకవేశ్య అనుజ్ఞను పాలించినందుకు తనలో తాను నొచ్చుకున్నాడు.

ఈవిధంగా దారిపొడుగునా సావిత్రిని లోలోనతిట్టి, నీచాతినీచురాలను చేసి ఇంటిముందుకు వచ్చేప్పటికి రాత్రి ఒంటిగంటకు పైదాటింది. బండి దిగి అతను తలుపు తట్టాడు. వంటపంతులు వచ్చి తలుపు తీశాడు. తలుపు వెయ్యమనిచెప్పి సతీశుడు కొంతదూరం మెట్లు ఎక్కి నుంచున్నాడు. ఇంట్లో ఆమె లేదు? సావిత్రి కేవలము స్వార్థసిద్ధికోసము వచ్చిందని అతను ఊహించినప్పుడే ఆమె స్వార్థసిద్ధికూడ అయింది. ఈ రాత్రి ఈ ఇంట్లో ఎలాగా ఉండదనిగూడ నమ్మకము కలిగింది. అందుచేత దీనివిషయమైన ప్రశ్న అతని మనసులో ఇంతవరకేమీ రాలేదు. కాని అప్పుడే గదిలో అడుగుపెట్టబోయే ముందు, ఒక అనుమానము అతనిని బలవంతముగా పట్టుకొని ముందుకు వెళ్ళనీకుండా ఆపింది. వంటపంతులు తలుపువేసి పండుకోబోతున్నాడు. సతీశుడు అతనిని దగ్గరకు పిలచి "బిహారి ఎక్కడున్నాడు?" అని అడిగాడు. "గదిలో నిద్రపోతున్నాడు" అన్నాడు వంటపంతులు.

సతీశుడు కొంచెమాగి "అయితే ఆ అమ్మాయి వెళ్ళిందా" అన్నాడు.

సావిత్రి వెళ్ళేటప్పుడు చూడలేదు. అదీగాక పగల్లా ఇక్కడేవున్నది, అంతకుముందే స్మృతితప్పిపోయి అస్వస్థస్థితిలోవున్నది. ఈ చీకట్లో ఇల్లు వదలి ఎక్కడికివెళుతుందా అని వూహించాడుకూడ. ఈ వూహాబలం మీదే అతను తలకాయ వూగించి 'ఆమె వెళ్ళలేదని' చెప్పాడుకూడా. అతను ఎదుటకువచ్చి తలకాయతిప్పాడు. అందుచేత - సావిత్రి ఆగదిలో నిద్రపోతూవుంటుందని అనుకున్నాడు.

క్షణంలో భయంతో సతీశుని మొహం వెలవెలపోయింది. చేతులో సీసాను అతను తక్షణమే కిందపారేశాడు.

"ఇదేమిటి బాబుగారూ.........?" అన్నాడు వంటపంతులు. సతీశుడు - మెల్లగా అతన్ని వూరుకోమనిచెప్పి — మెదలకుండా మెట్లుదిగి బిహారి గదిలోనికివెళ్ళాడు. మెల్లగా అతన్ని తట్టి నిద్రనుండి లేపి "సావిత్రి

నాగదిలో నిద్రపోతూవుందా బిహారీ? " అన్నాడు.

బిహారి కొంచెంసేపు వెర్రిగాచూచి, చివ్వున లేచికూర్చుని "లేదు బాబూ! ఆమె అప్పుడే వెళ్ళిపోయింది" అన్నాడు

"వెళ్ళిపోయిందా? "

"అవును బాబూ! వెళ్ళిపోయింది."

సతీశుడు ఒక నిట్టూర్పు విడచి బిహారి మంచంమీద చతికిలపడ్డాడు. ఇది దుఃఖవార్తో, సంతోషవార్తోకూడా అతనికి అర్థంకాలేదు.

బిహారి కొంచెంసేపున్నతర్వాత వినయంగా "మీరు చెప్పినట్టుగానే బండికట్టించి పంపించాను. పదండి, గదిలో దీపం వెలిగించుతాను" అన్నాడు.

"వద్దులే, నువ్వువుండు, నేను వెలిగించుకుంటాను" అని ఒక దీర్ఘ నిట్టూర్పు విడచి సతీశుడు తనగదిలోకి వెళ్ళిపోయాడు.

మర్నాడు ప్రొద్దున నిద్రలేచేప్పటికి చాలాప్రొద్దెక్కింది.

అకస్మాత్తుగా వుప్పెనవచ్చి మానవనిర్మితమైన వస్తువులన్నింటినీ తారుమారు చేసినట్టు సావిత్రిరాక సతీశునిమనసులో పొందికపరచియున్న ఎన్నో సంగతులను చిందరవందర చేసింది. చెదరిపోయిన ఆ ఆలోచనలమధ్య అతను చాలాసేపటివరకు చేతనాశూన్యునిలాగ ఆలోచిస్తూ కూర్చున్నాడు. బిహారి సిగరెట్టుయిచ్చి మెదలకుండా బైటికివెళ్ళిపోతున్నాడు. సతీశుడు పిలచి "అయితే బిహారీ, నిన్న ఆమె ఇక్కడికి ఏవేళప్పుడు వచ్చింది? " అన్నాడు. సావిత్రి వచ్చినదగ్గరనుంచి వెళ్ళేవరకు జరిగిన సంగతులన్నీ తలచుకొని బిహారీ వ్యథితహృదయం లోలోన చాలా దుఃఖపడింది. అతను తలవంచుకుని "నిన్న రెండురుఝాములకు" అన్నాడు మెల్లగా.

"ఆమె ఈ ఇల్లు ఎలా కనుక్కుంది? "

"ఆసంగతి తెలియదు బాబూ! "

సతీశుడు అతనికేసి కండ్లెర్రజేసిచూచి "నిజంగా నువ్వు నన్ను పశువనుకున్నావా బిహారీ? నాకంతమాత్రం తెలియదూ? నిజంచెప్పు" అన్నాడు.

బిహారి కళ్ళుప్పులించుకొని యజమాని మొహంకేసిచూస్తూ ఏమీ మాట్లాడలేకపోయాడు.

"మాస్టారేమిటి ? నువ్వు విపినుని ఇంటికి వెళ్లటంలేదూ ? సావిత్రిని కలుసుకోటంలేదూ ? " అన్నాడు సతీశుడు.

"లేదు బాబూ!" అని బిహారి లోపటికి వెళ్ళిపోతుండేప్పటికి సతీశుడు నదరకొని "నుంచో, ఎక్కడికి పోతున్నావు ? నువ్వు ఆమెను ఇక్కడికి రమ్మనిరాయలేదూ ? " అన్నాడు.

బిహారి మెదలకుండా తలకాయ తిప్పేడు.

సతీశుడు దబాయించి "మళ్లా లేదంటావు!" అన్నాడు.

తలవంచుకుని నుంచున్నవాడల్లా త్రుళ్ళిపడి తల పైకెత్తాడు.

"లేకపోతే అనుష్ఠానాలు ఈ ఇల్లెలా నడుస్తుంది ? నువ్వు వెళ్ళి దాని దగ్గరే వుండు. నాకవసరంలేదు. నేను పంజరంలో పామును పెంచదలచలేదు. ఇవ్వాళే వెళ్ళిపో" అన్నాడు సతీశుడు గదుముకుంటూ.

బిహారి ఏమీ సమాధానం చెప్పలేదు. కాని అతని కళ్ళవెంట అశ్రుబిందువులు దొర్లసాగినై. నిజంగా తన నౌకరీ పోతుందని అతను ఒకపట్టున నమ్మలేకపోయాడు. సావిత్రి మూలకంగా బాబుగారు యింతకటువుగా ఎందుకు మాట్లాడారా అని ఆలోచించసాగాడు.

సతీశుడు కన్నీళ్ళు చూచి కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "రాత్రివూట ఆమె ఎక్కడికి వెళ్ళింది?' అన్నాడు.

బిహారి కళ్ళుతుడుచుకొని "అదీ తెలియదు. తన చిరునామా జాబులో వ్రాసి పంపుతానన్నది" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు మెదలకుండావుండి "ఆమె యిదివరకటికంటె చాల చిక్కిపోయినట్టువుంది ? జబ్బుచేసిందా ఏమిటి ?" అన్నాడు.

బిహారి తలకాయ తిప్పి "అవును" అన్నాడు.

"అందుకునే అక్కడనుంచి తొలగించినట్టున్నారు."

బిహారి తలకాయ వూగించి తన అంగీకారాన్ని తెల్పాడు.

సతీశుడు మరికొంచెంసేపు మెదలకుండావుండి "ఈసారి నీకు గట్టిగా చెబుతున్నాను. ఆమెను యిక మనయింటికి రానియ్యవద్దు. ఏవంకతోనైనా సరే నన్ను కలుసుకోనియ్యవద్దు. తాశాలెక్కడ వున్నాయి ? వెళ్ళేప్పుడు ఆమెకు ఎంతడబ్బు యిచ్చావు? " అన్నాడు.

బిహారి తాళాలు తీసుకొచ్చి యిచ్చి "డబ్బు యివ్వలేదు" అన్నాడు.

"ఇవ్వలేదూ! ఎందుకని? నీకుయివ్వమని చెప్పివెళ్ళేగా"

"ఆమె తీసుకోలేదు" అని బిహారి గదిలోంచి బైటికి వెళ్ళాడు. సతీశుడు మళ్ళీ అతనిని వెనక్కి పిలిచాడు. సావిత్రిలేదు. బిహారి ఆమెను ప్రేమిస్తాడు. ఆమె పక్షాన్ని సమర్థిస్తాడు, ఆమెకు సాయంచేయ నభిలషిస్తాడు. అందుచేత బిహారీని వ్యథపెట్టి తన మనఃక్షోభను వదిలించుకునే సదవకాశాన్ని సతీశుడు చేతునుండి జారవిడువ దలచలేదు. అతను ఎదుటకు రాగానే "తర్వాత మీ యిద్దరూ ఏమేమి సలహాలిచ్చుకున్నారు?" అన్నాడు.

బిహారి యిక సహించి వుండలేకపోయాడు. "సావిత్రి నావద్ద ఏమి సలహా తీసుకుంటుంది? మీరేమి శిక్ష విధించినా సరే — కాని వృద్ధుణ్ణి ఈ విధంగా మాడ్చి చంపుతా రెందుకు బాబూ?" అన్నాడు దుఃఖకంఠంతో.

అతని కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించసాగినై.

తలవని తలంపుగా సతీశుని కళ్ళల్లోకూడా నీరు తిరిగినై. "సరే నువ్వు వెళ్ళు" అని సతీశుడు అతన్ని పంపి మళ్ళీ పండుకొని సిగిరెట్టుపీల్చసాగాడు. బిహారి వెళ్ళిపోయాడు. కోపతీవ్రతతో సావిత్రిని అతను ఎంత కఠినంగా మాట్లాడినా, ఎన్ని అనరానిమాటలన్నా, రోగంతోనున్న ఆమె శుష్కవదనం జ్ఞప్తికిరాగానే లోలోన కుమిలి ఏడ్చాడు.

బిహారి చెప్పినమాటలనుబట్టి సరైన సంగతేమీ తెలియకపోయినా, సావిత్రి ఇంకెక్కడికైనా తప్పకుండా వెళ్ళివుంటుందని మాత్రం గ్రహించాడు. ఎక్కడికి వెళ్ళింది? రెండు సంవత్సరాలక్రితం నవనాట్యమండలి చింతామణి నాటకంలో బిల్వమంగలపాత్ర ధరించాడు. అకస్మాత్తుగా అతనికి పాతవిషయా లన్నీ జ్ఞప్తికివచ్చాయి. అంటే — "ఆవిడను మరచిపోవాలనుకుంటున్నా మరచిపోలే దెందుచేత?" నిజంగా ఇది ఎంత ఆశ్చర్యకరమైన సంగతి? దుష్టగ్రహంలాగ అతన్ని ఎడతెగకుండా వ్యథపెడుతున్నా ఇంతకు ముందే తన నోటితో — అతనితో తనకేమీ సంబంధ బాంధవ్యాలేమీ లేవని చెప్పి వప్పుకుపోయినా ఇవ్వాళ అతని హృదయం — ఆమెయందు ఏహ్యభావంతో నిండియున్నా, అతనిమనసు ఆ సావిత్రికోసం హాహాకారాలు సలుపుతూ అలమటిస్తోం దెందుకు? ఇది ఎంతచిత్రమైన సంగతి! ఇంత ఏహ్య

భావమూ, ఇంత విశ్వాసమూ వున్నవానియందు ఈ సద్భావమూ, ఈ శుభాకాంక్ష ఎందుకు? ఈ పరస్పరవిరుద్ధభావాలు రెండూ ఒక్కటిగా అతని మనసు ఎలా ఇమిడిపోయాయి? ఎంత ఆశ్చర్యకరమైన విషయము! అతని హృదయం ఇంతవరకు సావిత్రి నాది, నే మినహా ప్రపంచంలో ఆమె కింకెవరూ లేరు, ఏమీ లేదు అన్న దృఢవిశ్వాసంతోనే వున్నాడని ఆమె ఒక్కసారి తెలుసుకుంటే—బహుశా ఆశ్చర్యం కొంత తగ్గేదేమో! సతీశుడు సావిత్రిని అన్నమాటలు అతనిహృదయంలో నున్న విశ్వాసాన్ని కించిత్తయినా తగ్గించలేకపోయినై. సతీశుడు తనహృదయంలోని ఈభావాన్ని తెలుసుకున్నట్లయితే అతని ఆశ్చర్యానికి కారణమేమీ ఉండేది కాదు. అతని గుంజా

## ౨౨

రెండుగంటలైన తర్వాత సతీశుడు పథరియాఘాట్టుకేసి వెళ్ళడానికి బైలుదేరి 'అబ్బా! ఎంతచిక్కు వచ్చిపడింది! ఇక నా ప్రాణాలు దక్కవు. అనుకున్నాడు మనసులో. దారినే నడుస్తూ 'ఇవ్వాళ వుపేంద్రబాబుకు మొహం ఎలా చూపించను? నిప్పులాంటి వుపేంద్రుని గుణం అతని బంధువులంతా ఎరుగుదురు. అతనివద్ద ఈ అపరాధానికి క్షమాపణ అంటూవుండదు. ఆజన్మమిత్రత్వానికి ప్రతిఫలంగా ఈ విషయంలో వుపేంద్రునిసాయం దొరికే ఆశకూడాలేదు. ఈ సంగతి అతనికంటె ఇంకెవరికి తెలియదు!' అని ఆలోచించుకోసాగాడు.

కిరణ్మయిగారింటితెలుపు తీసివుంది. సతీశుడు వాకిట్లోకి వెళ్ళి మొదలకుండా నుంచున్నాడు. లోపలకు వెళ్ళేముందు మళ్ళీ ఒకసారి ఈ సంగతులన్నీ బాగా ఆలోచించుకున్నాడు.

వుపేంద్రబాబొక్కడే తనకు పరమమిత్రుడు, గురువు, ఆదర్శమూ ననుకున్నాడు. అంతకన్న ఎక్కువ తనకింకెవరున్నారు? ఇప్పుడు ఆ వుపేంద్రబాబు ముందు తలెత్తుకునుంచునే ఆశేమీలేదు. ఇవ్వాళ కనపడగానే అతని కఠోరదృష్టి బాల్యబంధుత్వాన్నీ, స్నేహాన్నీ, ప్రేమనీ భస్మంచేస్తుంది. ఎప్పటికీ క్షమించడు - అనుకున్నాడు.

అదొక్కటేనా ? ఈ ఇంటితలుపుకూడా బందవటం నిశ్చయం. మరి ఏమొహంపెట్టుకొని ఇక్కడికివస్తాడు ?

ఇంత క్షతి, తలవంపులకు కారణమై- ఇలా సర్వనాశనంచేసిన వ్యక్తి తన కేమౌతుంది ? తను బంధింపబడలేదు. నన్ను బంధించిపోయింది. తను దుఃఖ పడలేదు - నన్ను దుఃఖసాగరంలో ముంచిపోయింది. నిజంకాదనుకొన్న సంగ తులనుగూడా నేను అబద్ధమనుకుని వదలిపెట్టలేనూ ? ఎలాంటి విచిత్రపరిస్థితి ! ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడిచి 'సావిత్రిపెట్టిన ఈ దుఃఖానికి నాకేమీ చింత లేదు, కాని నిజాయితీ విషయాలలో ఇరికించి ఆమె నన్ను వియోగంలో వదలిపోయినందుకే దుఃఖం ' అనుకున్నాడు మనసులో.

ఇంతలో దాసీది చేయిసైగచేసి " అమ్మగారు మిమ్మల్ని పిలుస్తూ వుం"దని చెప్పింది.

సతీశుడు త్రుళ్ళిపడి " ఉపేంద్రబాబు వచ్చాడా? " అన్నాడు.

" ఆఁ నిన్న చాలా ప్రొద్దుపోయి వచ్చారు "

" అతని తమ్ముడూ, భార్యాకూడా వున్నారా? "

దాసీది తలకాయతిప్పి " ఎక్కడ ? లేరే. వారొక్కరే వచ్చారు. వచ్చినదగ్గరనుండి బాబుగారివద్ద కూర్చున్నారు " అన్నది.

" బాబుగారికి ఎలావుంది? "

దాసీది ఒకదీర్ఘమైన నిట్టూర్పువిడచి "ఇంకా ఎలావుందేమిటి బాబూ? చివరి ఘడియలు " అన్నది.

సతీశుడు కొంచెంసేపు మౌనంగా వుండి "అమ్మగారెక్కడవుంది?" అన్నాడు.

" ఇప్పుడే స్నానంచేసి వంటింట్లోకి వెళ్ళింది.

సతీశుడు మారు ప్రశ్న వేయకుండా మెల్లగా వంటింటికేసి వెళ్లాడు. కిరణ్మయి అతనికోసము ఎదురుచూస్తూన్నదా అన్నట్లు కూర్చున్నది. సతీశుడు వాకిట్లో అడుగు పెట్టగానే వ్యుత్సుకతతో " లోపలికిరాక అక్కడ నుంచు న్నావేం ? మొహం అలా వాడిపోయిందేం ? రాత్రి నిద్రపోనట్లువుంది " అన్నది.

నిలబడిపోయింది. తర్వాత వుపేంద్రుడు కనపడ్డాడు. గల్లంతు విని అతను రోగి వద్దనుండి లేచివచ్చి ఓరవాకిలిగా తలుపుతీసి నుంచుని వింటున్నాడు.

వుపేంద్రుడు ఈవిషయంలో తప్పకుండా ఏమైనా అడుగుతాడను కున్నది కిరణ్మయి. కాని అతను ఏమీ అడగలేదు. మెదలకుండా తలుపువేసి వెళ్లిపోయాడు.

కిరణ్మయి ఆశ్చర్యానికి అంతులేదు. ఇదేమిటి? సతీశుడు వుపేంద్ర బాబును ఈవిధంగా ఎందుకు అవమానం చేశాడు? ఆమె వంటింట్లోకి మరలి వచ్చి స్వప్నావస్థలో నున్నదానివలె పనిపాటలు చేసుకోసాగింది. కాని మనసులో ఒకవిధమైన తృప్తి, విస్మయము, అనేకరూపాలతో గిరగిరాలు తిరగ సాగినై. ఘడియలో తన నెత్తిన వచ్చిపడే విపత్తునుగూడా కొంచెంసేపు మర్చి పోయింది. సతీశుడు ఇక్కడనుండి నిన్న సాయంత్రమే వెళ్లాడు. ఈలోగా ఈ విధంగా వెర్రివాడిగా మాట్లాడేటంత ఘట్టమేమి జరిగిందా అని ఆలోచించ సాగింది.

కాని వుపేంద్రుడు ఈ సంగతులేమీ తెలుసుకోవాలని ప్రయత్నించ లేదు. అతని శుష్కవదనం మీద కొంచెం ఆశ్చర్యంమాత్రం కనబడింది. కాని అతని అంతర్యంలోని సంగతిమాత్రం ఆమె నిశ్చయించలేకపోవటం యథార్థం.

వుపేంద్రబాబు మెదలకుండా తిరిగివచ్చి రోగి శయ్యావద్ద యథాస్థా నంలో మళ్లా కూర్చున్నాడు. స్వాభావికంగానే అతను ధైర్యంకలవాడు వివేకీని. దానికితోడు గాంభీర్యంగూడా వుంది.

హారన్‌కి ఆయాసంఎక్కువైంది. లోపల ప్రాణముందో లేదో కూడా తెలుసుకోవడం కష్టతరంగా వుంది. నలువైపులా సాగిజూచేటప్పటికి అతనికి ఈ ఘట్టం చాలా భయంకర మనిపించింది. ఎవరిమనసులోనూ కించిత్తుకూడా ఆతురతగానీ, వ్యాకులతగానీ ఏమీ కనపడలేదు. ఇంతకుముందు అతను ఒకటి రెండు మృత్యుఘటనలను చూశాడు. కాని ఇక్కడిపరిస్థితులు వాటికంటె పూర్తిగా భిన్నంగా వున్నాయి. రోగికి తలవైపున ఒకనూనెప్రమిదె వెలు గుతూవుంది. తల్లి ఇంట్లో ఒకమూల చాపపరచుకుని ఇంకా నిద్రపోతూనే వుంది. కిరణ్మయిమాత్రం మేలుకొనివుంది. కాని ఆమె పనులలోగానీ, కంఠ స్వరంలోగానీ సంశయోద్వేగలక్షణా లేమీ కనపడకపోయేటప్పటికి ఆమెభర్త

కొడుకు కేసి చూచి ఏడవసాగింది. ఎవరూ ఆమెకు ధైర్యంచెప్పనూలేదు, ఓదార్చనూలేదు. తెలవనితెలవుగా కాఫీకప్పుమీద ఆమె దృష్టిపడింది. దుఃఖస్వరంతో "కాఫీ తాగలేదు నాయనా?" అన్నది.

"లేదు" అన్నాడు ఉపేంద్రుడు. అఘోరమయి అత్యంతవ్యాకుల పడింది. "తీసుకో నాయనా! రాత్రంతా మేలుకొనివున్నావు. నువ్వు జబ్బు పడితే మాగతేమికాను?" అన్నది.

ఉపేంద్రుడేమీ మాట్లాడలేదు. కొంచెంసేపు అఘోరమయి మొహాని కేసి విరక్తిగా చూచి మళ్ళా దృష్టి రోగిపైపుకు మరల్చాడు. ఈతీవ్రదృష్టి యొక్క అర్థం తెలుసుకోవటం అఘోరమయి పనిగాదు. ఆమె మరింత బలవంతపెట్టసాగింది. కాని ఆదృష్టిలోని అంతరార్థం తెలుసుకుంది కిరణ్మయి. చావుబతుకులమీద వున్న బిడ్డదగ్గర కూర్చుని పరాయిబిడ్డకోసం ఆతురత పడటం ఎంత అనుచితమైన సంగతో ఆమె తీవ్రబుద్ధికి తెలియకపోలేదు. అయినా ఉపేంద్రుడు ఈ మామూలు విషయంకోసం ఇలా పట్టుపట్టటానికి కారణ మేమిటో అర్థంకాలేదు.

ఈ బలవంతాలు పంతాలు ముగిసిన తర్వాత డాక్టరువచ్చాడు. డాక్టరు రెండుమూడు నిమిషాలు రోగిని పరీక్షించి లాభంలేదని చెప్పి వెళుతూ రాత్రి గడిచేలోగా ప్రాణి పోదని ఆసకూడా పెట్టిపోయాడు.

అప్పటికి పదిగంట లౌతుంది. కిరణ్మయి కొంచెం దగ్గరకువచ్చి "మీరు అక్కడివారినికూడా ఒకసారి చూచిరారూ?" అన్నది.

ఉపేంద్రుడు అలాగే కూర్చుని "అలాంటి అవసర మేమీలేదు. వారికి అంతా తెలుసు" అన్నాడు.

"అయినా ఒకసారి వెళ్ళిరండి. ఇప్పుడే భయంలేదుగా. ఈ లోగా కొంచెం విశ్రాంతి తీసుకుందురుగాని!" అన్నది కిరణ్మయి.

ఉపేంద్రుడేమీ సమాధాన మివ్వలేదు. కిరణ్మయి మృదువుగా, కాని దృఢస్వరంతో "కొంచెం ఆలోచించి చూడండి. స్నానసంధ్యలు లేకుండా ఆకలిదప్పులతో ఈ విధంగా ఎదురుగా కూర్చున్నా ఏమీ లాభంలేదు. బండి మీద వచ్చారు. నిన్న రాత్రంతా ఇక్కడ మేలుకొనే వున్నారు. దానిమీదట ఇవ్వాళ ఇలా కూర్చుని వున్నారంటే జబ్బుచేస్తుంది. సతీశ్ బాబుకూడా లేదు.

అదీగాక ఇప్పుడు మీరు చాల అలసిపట్టు వున్నారుకూడా. నేను ఇక్కడ కూర్చుని వుంటాను. మీరు కొంచెంసేపు విశ్రాంతి తీసుకురండి. నా మాట వినండి" అన్నది.

ఉపేంద్రుడు దృష్టి మరల్చాడు. ఇంతకుముందెప్పుడూ కిరణ్మయి అతని ముందు ఇన్ని మాటలు మాట్లాడి ఎరుగదు. ఆ గొంతులో కోపభావం కించిత్తు కూడా లేదు. కాని దానిలో దృఢత్వము, కోమలత్వం మాత్రముంది. కిరణ్మయి యొక్క ప్రేమపూరితమైన ఈ ప్రశ్నను సానురోధం ఉపేంద్రుని చెవులకు చాల ఇంపుగా వినిపించింది. ఇంతకుముందు ఒకనాటిరాత్రి విన్న కంఠస్వరం లోనూ, వీటికి ఆకాశ - పాతాళమంత భేదం కనిపించింది.

"ఇకనుంచి మీకు ఎలా గడుస్తుంది?" అన్నాడు ఉపేంద్రుడు ఆమె కేసి చూడకుండానే.

"ఆసంగతి ఎందుకు అడుగుతున్నారు? ఇవ్వాళ మా నెత్తిమీద విరుచుకు పడుతున్న దుఃఖపర్వతాలను ఎత్తేవారు ఎవరూ లేరూ? ఇంక ఆలస్యం చెయ్యక త్వరగా లేండి" అన్నది కిరణ్మయి.

యథార్థం చెప్పటానికి ఇదెంత శాంతియుతసన్నిధి! కొంచెంసేపు ఉపేంద్రుడు అంతా మరచిపోయి ఆశ్చర్యంతో కళ్లప్పగించుకొని కిరణ్మయి మొహం కేసి చూడసాగాడు. మొట్టమొదట ఆమె నొసటన స్త్రీమాంగళ్యానికి సర్వశ్రేష్ఠ ప్రమాణమైన కుంకుమబొట్టు కనిపించింది. ఈ జీవితాని కంతటికీ మంగళకరమైన వస్తువు ఇంకావుంది. కాస్తయినాకూడా మలినం కాలేదు. సౌభాగ్యగరిమతో సగర్వంగా ఇంకా ఆమె వున్నతస్థానంలోనే విరాజిల్లుతోవుంది. ఒక దీర్ఘనిశ్వాసంతో ఉపేంద్రుని వళ్ళంతా కంపించిపోయింది.

కిరణ్మయి ఇది చూచింది. చాలవరకు అతని మనోభావాన్ని కూడా గ్రహించింది. కాని తన హృదయంలోని దుగ్ధమాత్రం పైకి పెట్టలేదు. "లేవండి, వారికి కొద్దిగా పాలు తీసుకొచ్చి యిస్తాను" అన్నది.

ఉపేంద్రుడు కొంచెం జరిగి కూర్చుని "మందు?" అన్నాడు.

కిరణ్మయి మధ్యలోనే "అవసరంలేదు. ఇక మందు లివ్వ నవసరంలేదు. బలవంతాన మందులు తాగించి ఇప్పటికే చాల కష్టపెట్టాను. ఇక మందు ఇవ్వదలచుకోలేదు" అన్నది వ్యథితస్వరంతో.

వుపేంద్రుడు ఎదురుచెప్పలేదు. ఇక మందులవల్ల లాభంలేనిసంగతి అతనికీ తెలుసు. భర్తకు పాలుత్రాగించిన తర్వాత కిరణ్మయి మళ్ళీ ఒకసారి వుపేంద్రుని హెచ్చరించింది—వుపేంద్రుడు లేచినుంచుని 'స్నానం-భోజనం చేసి త్వరగానే వస్తానని' చెబుతూనే వాకిలికేసి సాగాడు. కిరణ్మయి అతను వెళ్ళటం చూచి "వచ్చేటప్పుడు సతీశ్ బాబుగారి యింటిద్వారానుంచివస్తారా?" అన్నది మృదుమధురస్వరంతో.

వుపేంద్రుడు వెనక్కి తిరిగి నుంచుని "ఎందుకు?" అన్నాడు.

"వారింటికి పంపటానికి ఎవ్వరూ లేరు. మీరే ఒకసారి..." అన్నది కిరణ్మయి.

ఈ ప్రస్తావన తనకే దెబ్బతీస్తుందని అతను గ్రహించాడు. అందుచేత అతను శుష్కస్వరంతో "అతనితో మీకు అవసరమైన పనులేమైనా వున్నాయా?" అన్నాడు.

ఈ గొంతునుబట్టి కిరణ్మయి అతని ఆశయం తెలుసుకుంది. కాని ఆమె దానినేమీ బయటపెట్టకుండానే "ఈ దుఃఖసమయంలో నాకు అందరూ అవసరమే. అదీగాక అతనివిధంగా మీమీద మండిపడి ఎందుకువెళ్ళిపోయాడో కూడా తెలుసుకోలేకపోయాను. అందుకని వారిని ఒకసారి పిలుచుకువస్తే మంచిదనుకుంటున్నాను" అన్నది.

వుపేంద్రుడు మనసులో మరింత క్రుద్ధుడై "దానికి మీరు చింతపడనవసరంలేదు. అతను నాకు స్నేహితుడు. అతనిబాగోగులు నేను తెలుసుకుంటాను. అయినా అవసరమైన పనేమైనా వుంటే అతనివద్దకు మనిషిని పంపగలను. స్వయంగా వెళ్ళటానికి నాకు తీరిక వుండదు" అన్నాడు.

"అదేమంచిది. మనిషినే పంపండి. అతను నాకూ మరదేగా; వస్తే బాగుంటుంది. మిత్రునితో పోట్లాడి మిత్రునితోనే చెప్పించుకుంటాడు. వదిన నెత్తిమీద ఇంత విపత్తువచ్చిపడితే వదిలిపెట్టివెళతాడా? అతను నన్ను ఎలాంటి స్థితిలో వదిలిపెట్టినా వదిననైయుండి నేను వదిలిపెట్టగలనా?" అన్నది కిరణ్మయి మెల్లగా.

"అదంతా అవసరంలేదు. నేను కబురంపుతానులే" అని వుపేంద్రుడు బైటికివెళ్ళాడు. ఎవరు ఎవరికి ఎంత దగ్గరబంధువులైతేమాత్రం దానినిగురించి

## 23

వుపేంద్రునికి స్త్రీల విషయంలో తన అభిప్రాయాన్ని మార్చుకునే సమయమొచ్చింది. కారణం ఇంతవరకు కలిగిన అనుభవాలవల్ల వుపేంద్రుని హృదయంలో స్త్రీలయందు ఒక కారుణ్యభావముండేది. అతను వారిని "అబల"లనుకుంటూ వుండేవాడు. అందుకనే వారియందు దయాభావంతో వుండేవాడు. కాని ఇవ్వాళ అతని అభిప్రాయాలకి పెద్దదెబ్బ తగిలింది. తన అభిప్రాయం యథార్థంకాదని అతను ఇవ్వాళ అంగీకరించవలసివచ్చింది. పురుషులను తలెత్తనీయకుండా చేసే స్త్రీలుకూడా వున్నారు. వారిముందు మగవారి పప్పులేమీ వుడకవు. తలవంచుకోవలసివస్తుంది. అలాంటి స్త్రీయే కిరణ్మయి కూడాను. ప్రథమంగా పరిచయమైన రాత్రి ఆమెనుగురించి వుపేంద్రుడు సతీశునియెదుట మరోవిధంగా చెప్పాడు. ప్రతిచిన్న విషయానికీ, వున్మత్తబుద్ధిని ఆశ్రయించుకొని జ్ఞానశూన్యురాలై విషం త్రాగో, గొంతుకు వురి పెట్టుకొనో బీభత్సకాండ జరుపగల వుగ్రస్వరూపిణి అనుకున్నాడు మనసులో. కాని ఇవ్వాళ అది యథార్థంకాదని తెలుసుకున్నాడు. మహావిపత్తుల్లో కూడా ఆమెగుండె నిబ్బరంచేసుకొని లేశమాత్రంకూడా అధైర్యపడకుండా మగవారికంటె మిన్నగా నిలబడగలదని గ్రహించాడు. కనుక సతీశుడు ఈ యింటికివచ్చి పోయేవిషయంలో వారి కర్తవ్యబుద్ధి ఏలాంటి వుపదేశమిచ్చినా కిరణ్మయి అతన్ని రమ్మన్న కబురు, ఇవ్వాళ స్వయంగా వెళ్ళో, మనిషిచేత కబురంపో తెలియజేయక తప్పదు.

దారివెంట ఆలోచించినకొద్దీ అతనిమనసు మరింత క్షుబ్ధమై పోసాగింది. కారణం-వుపేంద్రుడు సతీశుని బాగా ప్రేమిస్తాడు. అందుకనే ఇవ్వాళ అతనిమీద కోపానికికూడా హద్దులేకుండాపోయింది. అతను చేసిన నేరాన్ని మరెప్పుడైనా విచారించవచ్చు. కాని ఇవ్వాళ తన ఎదుట వచ్చి ఎంతకాలం నుండో తను ఏర్పరచుకొనియున్న అగ్రాసనాధిపత్యాన్ని అహంకారంతో కాలతన్నిపోయాడు. అతనీ విధంగా అవమానించటానికి కించిత్తుకూడా సంకోచపడలేదు. కిరణ్మయికూడా అతని ఈ వ్యవహారాన్ని చూచింది. అన్నిటికంటె ఎక్కువగా ఈ అవమానం అతని హృదయంలో బాధపెడుతూవుంది. సతీశుడు ఇవ్వాళ అతన్ని అనరాని మాటలు అని అవమానించిపోయాడు. వుపేంద్రుడు

వాటిని ప్రాణముండగా మరచిపోలేదు, ఎవరితోనూ చెప్పుకోనూలేదు. సహో గౌరవంగా చూచేవాడు, అందరికంటె ఎక్కువగా స్నేహభావంతో వుండే సతీశుడు ఇవ్వాళ గహ్వరకూపంలో పడి అతన్ని అనరాని మాటలన్నీ అన్నాడు. అతని పెద్దతనంకూడా చూడలేదు.

కొంతకాలం క్రిందట ఒక ఆంతరంగిక వుత్తరం ద్వారా వుపేంద్రునికి సతీశుని సంగతులు కొన్ని తెలిసినాయి. అది రాఖాల్ వ్రాసిన వుత్తరము. ఇద్దరూ సద్భావంతో వున్నప్పుడు సతీశుని నోటివెంట వుపేంద్రుని అలౌకిక గుణాలనుగురించి విన్నాడు అతను. సతీశుని నోటితో వుపేంద్రుని విద్యాబుద్ధులు, స్వచ్ఛమైన అతని చరిత్రని గురించిన ఖ్యాతి విననివారెవరూ లేరు. సతీశునికి, అన్ని సద్గ్రంథాలకంటె పెద్దగ్రంథం, వుపేంద్రుడు, అతని అనుపమ స్నేహమూను. అక్కడ కలిగిన గాయమంత హృదయగాంతిక వేసిన సతీశునికి మరొకటిలేని సంగతి ధూర్తరాఖాల్ బాగా గ్రహించాడు.

కాని అప్పుడు ఆ బాణం ప్రభావమేమీ కనపడలేదు. వుపేంద్రుడు వుత్తరం చదివి చించివేసి చిరునవ్వుతో వుత్తరం రాసినవాణ్ణి వుద్దేశించి "నీ వెవరవైనా, సతీశుని రహస్యాలు ఎన్ని తెలిసివున్నా, నేను నీ కంటేకూడా అతను యోగ్యుడంటాను" అన్నాడు. రెండురోజులున్న తర్వాత సతీశునితండ్రి అడిగితే "బాగానే వున్నాడు. గాని, ఎవరితోనో పోట్లాడి ఆ యిల్లువదలి మరోయింటికి వచ్చివుంటున్నాడు. వాడెవడో లేనిపోని అపవాదులన్నీ కల్పించి ఆకాశరామన్న వుత్తరం ఒకటి రాసాడు!" అన్నాడు.

వృద్ధుడు వ్యాకులచిత్తంతో "ఏమి అపవాదులు వుపేంద్ర్?" అన్నాడు. "ఆబాంకులన్నీ వినటం మీరు సమయం వ్యర్థం చెయ్యటం తప్ప మరేంలేదు? నేను సతీశుణ్ణి బాగా ఎరుగున్నాను. ఎవరికీ తలవంపులు వచ్చే పనేమీ చెయ్యడని నేను గట్టిగా చెప్పగలను. మీరేమీ చింతపడ నవసరం లేదు. నాకు అతనియందు ఆ నమ్మకంలేకపోతే ఇంతసేపు మెదలకుండా కూర్చునేవాణ్ణా?" అని సమాధాన మిచ్చాడు వుపేంద్రుడు.

సావిత్రిని తను కళ్ళార చూచినంతనే అతని దృఢవిశ్వాసంమీద ఒక్కసారి పిడుగు పడినట్లయింది. సతీశుని యింట్లో తీర్చి దిద్దుకు తీరిగ్గా కూర్చున్న ఏకైక తరుణి! ఆమెలో ఎంతగాఢమైన లజ్జ, దానికంటే మించి ఆ నేత్ర

ద్వారాలో వున్న ఆకృతివిశేషాలు స్పష్టంగా కనిపించుతూ వున్నాయి. దానిలో భ్రమా-భ్రాంతులేమీ లేవు. క్షణంసేపట్లో వుపేంద్రునికి రాఘుల్ వృత్తాంత మంతా జ్ఞప్తికివచ్చింది. కాని అడగటానికి గానీ, అనుమానించటానికిగానీ అవకాశమేమీ లేకపోయింది.

ఆ వృత్తాంతాన్ని నమ్మటానికి రాహుల్ కల్పించి రాసిందేమీ లేదు. దానిలో సావిత్రిపేరు వుటనేవుంది. వివరించటంలో అతను ఆమె ఎడమ బుగ్గమీద వున్న పుట్టుమచ్చనుకూడా మర్చిపోలేదు. సావిత్రి కంటపడగానే వుపేంద్రునికి ఆ మచ్చ కనపడింది.

సత్యాన్ని జాగ్రత్తపరుచుదామా వద్దా అనుకుంటూవుండగానే జట్కా బండి జ్యోతిష్కరాయుడుగారి ఇంటిముందుకు వచ్చి ఆగింది. వుపేంద్రుడు బండి దిగి వాకిట్లో అడుగు పెట్టగానే అతని దృష్టి పైఅంతస్తువైపుకు ఆకర్షించింది.

వుపేంద్రుడు కన్నెత్తి పైకిచూశాడు. అతను వూహించినదే అక్కడ ప్రత్యక్షమైంది. ఒక నిశ్చలప్రతిమ కిటికీవద్ద ఎదురుచూస్తూ నుంచున్నది. ఇంత దూరానికి బాగా కనపడటం అసంభవమైనా అతని మనోనేత్రాలు ఆమె పెదవులమీద చిరునవ్వురేఖలనూ, కనుకొలకులలోని అశ్రుబిందువులనూ కనుగొన్నాయి. ఇంతసేపటినుండీ వున్న వుపేంద్రుని చింతాజ్వాలలూ, అభిమానఅవమానాలూ, ప్రతీఘాతుకభావనా ఒక్కసారి - మాయమైపోయినై. సురబాల నిన్నరాత్రంతా, ఇవ్వాళ పగలూ ఎలా గడిపిందో నన్న చింత ఒక్కటేవుండిపోయింది. సాగితే ఆమె తన్ను - ఇంట్లోకికూడా పైటకు అడుగు పెట్టనివ్వదు. ఈ కొత్తచోటు, అర్ధరాత్రివేళ ఆ అస్వస్థభర్తను ఇంట్లోంచి వంటరిగా పోనిచ్చి - ఈ దీర్ఘకాలం ఎలాగడపిందా అని ఆలోచించుకొని అతనికి నవ్వువచ్చింది. కనుగొలకులయందు నీరూవచ్చాయి.

అతనిరాక సంగతి సరోజినికి తెలియగానే ఇంట్లోంచి వసారాలోనికి పరుగెత్తుకువచ్చింది. వుపేంద్రునిచూడగానే ఆమె కళ్ళల్లోనూ, పెదవులమీదా చిరునవ్వు చిందింది. వాకిట్లోకి వచ్చేరాకముందే "అక్కడ నుంచోక సరాసరి పైకి రండి" అన్నది.

వుపేంద్రుడు మొహాన్ని గంభీరంచేసి సరాసరి పైకిరావలసిన అవసర మేమిటో అడగాలనుకున్నాడు. కాని అతనికికూడా నవ్వువచ్చింది.

" అతను మా వెంట రాలేదు, ఇక్కడే వుంటున్నాడు."

ఇది విని సరోజిని ఆశ్చర్యపడింది. అప్పుడు వుపేంద్రుడు సరోజిని మొహంలో కలిగిన ఈపరివర్తనను చూడగల స్థితిలో లేడు.

సరోజిని తన సంకోచాన్ని అణచిపెట్టుకొని సహజభావంతో " ఇంత కాలంనుండీ దగ్గరవుండికూడా ఒక నాడు ఇటు తొంగిచూడలేదు !" అన్నది.

వుపేంద్రుడు పరధ్యానంతో ఏదో ఆలోచిస్తున్నాడు. "బహుశా మీసంగతి అతనికి జ్ఞాపకముండివుండదు" వినేవారి చెవులకు కలువుగా తోచింది. " అయితే దివాకరు దెక్కడ వున్నాడు ?? పడలేదు?" అన్నాడు.

" అన్నయ్యవెంట హైకోర్టుకు వెళ్లాడు. పదండి, మిమ్మల్ని లోపలకు తీసికెళ్ళి అప్పజెప్పివస్తాను " అని సరోజిని ఇంట్లోకి వెళ్ళింది.

కొంచెంసేపటికి సరోజిని ఇంట్లోంచివచ్చి బండెక్కి కూర్చుంది. బండి సతీశుని ఇంటివైపుకు సాగింది. బండి దూరుడు ఎక్కువైనకొద్దీ సరోజిని గుండె దడకూడా ఎక్కువ గాసాగింది.

బండి త్వరలోనే సతీశుని ఇంటి ముందుకు వచ్చి ఆగింది. జట్కావాడు వుత్తరం చేతపట్టుకొని దిగిపోయాడు. సరోజిని బండిలో ఒకమూల ఒదిగి ఒదిగి కూర్చుని చాలధ్యానంతో బండివాడు తలుపుతట్టటం విన్నది. కొంచెం సేపటికి తలుపుతీసిన శబ్దంకూడా వినవచ్చింది. అతను లోపలికి వెళ్ళివుంటాడని వూహించి - తర్వాత ఎవరిదో చిరపరిచితగంభీర కంఠస్వరం వినాలని ఆకాంక్షతో ఆతురతపడుతూవుంది. బండివానిద్వారా - బండి సంగతీ, బండిలో కూర్చునియున్న వారిని గురించీ తెలుసుకొని సతీశుడు స్వయంగా వచ్చి ఆహ్వానిస్తాడని వూహించింది. ఇంతకాలంనుండీ దగ్గర వుంటూకూడా ఈవిధంగా మరచిపోగలిగిన వ్యక్తికి ఈకబురువిని కాస్తకూడా తొణకడన్న సంగతి ఆమె అనుకోలేదు.

మళ్ళా వాకిటివద్ద జట్కావాడిమాట వినపడింది. వాకిటి తలుపులు వేయబడ్డాయికూడా. కొంచెంసేపట్లో జట్కావాడు వుత్తరం తిరిగి తీసుకు వచ్చి " బాబుగారు ఇంట్లో లేరు " అన్నాడు.

" ఇంట్లో లేరు " అన్న కబురు విని తాత్కాలికంగా సరోజిని హృదయం శాంతించింది. " వుత్తరం తిప్పి ఎందుకు తీసుకొచ్చావు? ఇచ్చిరా " అన్నది.

జమే. ఎవరు చనిపోయినా సరే సతీశుడు తన దృఢశరీరంతో అందరికంటే ముందుగా వచ్చేవాడు. అశుభ కార్యాలన్నీ వెరపు లేని ఏమీ లేకుండా చేసేవాడు. అందుకనే దుఃఖసమయాల్లో అందరూ అతనికోసమే ఎదురుచూస్తారు. అతనువచ్చిన తర్వాత—గుండె చెదిరినవారికికూడా ధైర్యమొస్తుంది. అతను కలకత్తానుండి వెళ్ళిపోయాడని వినగానే వుపేంద్రునికి ఏదారీ దొరకలేదు.

సురబాల పతి మొహంకేసిచూసి కారణాన్ని తెలుసుకుంది గాని, సతీశుని ప్రసంగమే ఎత్తలేదు. సరోజిని సతీశుని ఇంటివద్దనుండి తిరిగి వచ్చిన తర్వాత తన చూచివచ్చిన సంగతులన్నీ ఒకకథగా చెప్పింది. వాటిని విన్నతర్వాత సురబాలకు నిన్నటిరాత్రి జరిగిన ఘటనలలో అనుమానం కలిగింది. సతీశుడు తన భర్తకు ఎంత ఘనిష్ఠమిత్రుడో ఆమెకు తెలుసు. అందుకనే ఈవిషయాన్ని ఆమె నవ్వులాటకింద కట్టివేసింది.

సురబాలయొక్క లోకజ్ఞానంమీద వుపేంద్రునికేమీ నమ్మకంలేదు. అందుకనే అతను ఎంతక్లిష్టసమయాల్లోనైనా సరే ఆమెతో సంప్రదించడు. కాని ఇప్పుడు తనుచిక్కుకొనియున్నా ననుకొన్న విపత్తుతో అతను వ్యాకులపడి "వాడు నన్ను ఇలాంటి ఆపదలో విడచిపోతాడని కలలోనైనా అనుకోలేదు. ఒంటరిగా నేనిక్కొత్తచోట ఏమివుపాయం ఆలోచించేది!" అని అతను నిర్బోధశిశువులాగ భార్య మొహంకేసి చూడసాగాడు.

కాని ఎంత ఆశ్చర్యం! భర్తనెత్తిన యింత విపత్తు వచ్చిపడిందని విన్నాకూడా సురబాల వదనంమీద వుద్వేగలక్షణాలేమీ కనపడలేదు. ఆమె దగ్గరకువచ్చి చెయ్యిపట్టుకుని పతిని మళ్ళా మంచంమీద కూర్చోబెట్టి "ఇంత భయపడతారెందుకూ? ఇది కలకత్తా పట్టణం. ఇక్కడ ఒకరు లేకపోయినంత మాత్రాన ఎవరిపనీ ఆగిపోదు. కాఫీ తీసుకొచ్చాను. మొహం కడుక్కుని తీసుకోండి. దివాకరబాబును తీసుకొని నేనుకూడా వస్తాను" అన్నది మెల్లగా.

"నువ్వు వస్తావా?" అన్నాడు వుపేంద్రుడు.

సురబాల ఏమీ వెనుకాడకుండానే "ఆఁ వస్తాను. స్త్రీలు విపత్తులోనున్నప్పుడు—ఓదార్చటం స్త్రీల విధి" అని ఆమె అనుమతికోసం ఎదురు చూడకుండానే కాఫీకప్పు తీసుకొచ్చి దగ్గరపెట్టి దివాకరునికి ఈ కబురు

చెప్పటానికీ, స్వయంగా ప్రయాణం కావటానికి వెంటనే బైటికి వెళ్ళి పోయింది.

గృహస్థుల ఇళ్లల్లో దీపాలు పెట్టారు. సరిగా ఆ సమయానికే వారు పథరియాఘట్టాకు చేసుకున్నారు. తలుపు తీసేవుంది కాని కింద ఎవరూ లేరు. చలీ, చప్పుడూకూడా ఏమీలేదు. శిథిలమై చీకటిలోనున్న ఆ గృహము స్మశాన వాటికలాగావున్నది. ఇద్దరినీ జాగ్రత్తగా వెనుక రమ్మనిచెప్పి ఉపేంద్రుడు మొదలకుండా పైకెక్కి కొంచెంసేపు హరణ్ గదిముందు నుంచు న్నాడు. లోపలినుండి ఒక పెద్ద నిట్టూర్పు చెవినిపడింది. కంపితహస్తాలతో తలుపుతియ్యగానే మంచంకింద మినుకు మినుకుమంటున్న ప్రమిద వెలుగులో ఆపాదమస్తకం కప్పబడియున్న హరణ్ మృతశరీరం కనపడింది. నూత్న విధవ పాదాలవద్ద పడివుంది. తలెత్తిచూచి నిమిషంలో మెరపులాగ లేచి దుఃఖకంఠంతో "అన్నా!" అని ఉపేంద్రుని పాదాలవద్ద మూర్ఛతో పడి పోయింది. భర్తవెనుక నుంచునియున్న సురబాల నిశ్చేష్టయైయున్న భర్తను ఒకవైపున నుంచోబెట్టి కిరణ్మయి శిరస్సును తన వళ్లోకి తీసుకుంది.

## ౨౪

రక్తమాంసాదులతో ఏర్పడిన ఈ మానవదేహంలో ప్రతివస్తువుకీ ఒక హద్దు అంటూవుంది. మాతృప్రేమకూడా అపారమైనదేమీకాదు. దానికికూడా ఒక హద్దుఅంటూ వున్నది. రాత్రింబగళ్లు భారంమోస్తూ రక్తసంచలనం ఆగి మోయలేక పోయేప్పటికి కన్నతల్లికూడా బిడ్డనెత్తుకొని ఒక్కఅడుగుకూడా ముందుకువెయ్యలేదు. దీనికికారణం ప్రేమాభావమో లేక సామర్థ్యాభావమో నిర్ణయించే బాధ్యత అంతర్యామిచేతిలోవుంది. కానితల్లి చేతిలోలేదు. అందుకనే ఆరోజున హరణ్ మృతకళేబరాన్ని తల్లివడిలోంచి విడదీసి స్మశానవాటికకు తీసుకుపోయినప్పుడు అఘోరమయి హృదయాంతరాళంలోంచివచ్చిన నిట్టూర్పు ఆ అపారజనరాశి ఈ మరణవార్తను దొర్లించుకుపోయింది.

అఘోరమయి జ్వరతీవ్రతలో నున్నపుడే హరణ్ దేహం చాలించాడు. తర్వాత వారంరోజులు ఎలాగడిచిందో కూడా ఆమెకు తెలియదు.

"బాబుగారు కలకత్తాలోనే లేరట. వుదయం పదిగంటలబండికి ఇంటికి వెళ్ళిపోయారట" అన్నాడు జట్కావాడు.

ఇదివిని తలవనితలంపుగా ఆమెకు ఒకసారి సతీశునియిల్లు తనకళ్ళారా చూచివద్దామన్న కోర్కె ఎందుకు కలిగిందో ఆమెకుకూడా తెలియదు. తక్షణమే బండిదిగి, తలుపుతోయించి ఇంట్లో ప్రవేశించింది. వంటపంతులును వెంబడేసుకుని ఆమె ఇల్లంతా కలదిరిగిచూచింది. కిందకు దిగుతూ దణ్ణెంమీద వేసియున్న నీలిరంగుచీరమీద ఆమెకన్ను పడింది. సావిత్రి ఆశ్చర్యంతో 'అదిఎవరిది?' అని అడిగినపుడట "దాదీ అమ్మగారిది" అని చెప్పాడు వంటపంతులు. సాయంత్రం సావిత్రి వెళుతూ స్నానంచేసి విడిచీర ఆరేసిపోయింది. అదిఇంకా అక్కడేవుంది. సరోజిని ఆశ్చర్యంతో ఈదాదీ అమ్మగారిని గురించి అనేక ప్రశ్నలు వేసింది. వాటికి సమాధానంగా తెలిపిన సంగతులు విని ఆమె మరింత ఆశ్చర్యపడింది. పాపభూయిష్ఠమైన అసాధారణవిషయాలను గురించి బాగా తెలియకపోయినా మానవుడు తన బుద్ధిబలంతో వాటివిషయంలో ఒక నిశ్చితాభిప్రాయ మేర్పరచుకుంటాడు. ఈ బ్రాహ్మణదేవతకూడా వుపేంద్రుడు పత్నీసహితంగా రావటం, తక్షణమే తిరిగివెళ్ళిపోవటమూ, దానిమీదట ఇవ్వాళ వుదయం యజమాని తలవనితలంపుగా ఇంటికి వెళ్ళిపోవటం మొదలైన ఘటనలనుబట్టి దాదీ అమ్మగారివల్లే ఈ సంగతులన్నీ జరిగాయని గ్రహించాడు. విశేషంగా సతీశుని అస్వాభావికచింత, వుత్‌భ్రాంతభావమూ, ఎవరికంటికీ కనపడందికాదు. అందుకనే అతను సావిత్రి అస్వస్థతనుగురించి అడిగాడు. ఆమెను చూడటానికే తన యజమాని ఇలా వ్యగ్రతతో వ్యాకులపడివెళ్ళాడని కూడా చెప్పాడు. సరోజినికి వుపేంద్రుడు వారూ మొదట ఈఇంటికే వచ్చినట్టు, సామానుకూడా దింపి తక్షణమే సామాను ఎత్తించుకొని మళ్ళీ ఆబండిమీదే తిరిగి వెళ్ళిపోయిన సంగతికూడా తెలిసింది. వారిలో ఎవరూ సతీశుని పేరుకూడా ఎత్తలేదు. తర్వాత వుపేంద్రబాబు ఈ వుత్తరంరాశాడు. దీనినిబట్టి అతనికి తనఅన్న అకస్మాత్తుగా వెళ్ళిపోయిన కారణం తెలిసినట్టు కనపడదు. ఆ రమణినిగురించి జిజ్ఞాసతో అనేకప్రశ్నలడిగి ఆమె వయసు రూపగుణాలు తెలిసినతర్వాత ఆమె యథార్థాన్నతిక్రమించి చాలా పైకిపోయింది. ఆఖరికి సరోజిని బండిఎక్కి కూర్చున్నది. కాని ఆమెలో పియానో మరమ్మతు చేయించాలన్న కుతూహలం సడలిపోసాగింది. హృదయం ఏదో అజ్ఞాత

భారంతో క్రుంగిపోసాగింది. ఈ రహస్యమయి ఎవ్వరో? ఇక్కడికి ఎలా వచ్చిందో ఆమె తెలుసుకోలేకపోయింది. కాని అంతర్యంలో ఏదో రహస్యముందని మాత్రం గ్రహించింది.

సతీశ్ కిరణ్మయిలమీద వుపేంద్రునికి ఎంత క్రోధమున్నా ఎంతవిహ్వాభావమున్నా వాటికి ప్రాధాన్యత నిచ్చి కర్తవ్యవిముఖుడవటం అతని స్వభావానికి విరుద్ధం. అందుచేత సధరియాఘట్టు వెళ్ళాలని కోర్కెవున్నా అమితమైన అలసట అతన్ని ఇవ్వాళ వెళ్ళనియ్యలేదు. అవీగాకుండా సురబాల మాటను ఎదిరించిపోవటంకూడా కష్టతర మనిపించింది. ఆమెపతికి పంఖా తాడు చూపించి క్లుప్తంగా "మీవంట్లో బాగా లేదు. విశ్రాంతి తీసుకోకుండా వెళ్ళారంటే గొంతుకు వురిబెట్టుకుచస్తాను. పనులుంటే వున్నాలే" అన్నది. వుపేంద్రుడు ఎదురుచెప్పకుండానే - మెదలకుండా మంచంమీద పండుకొని చూస్తూచూస్తూ వుండగానే నిద్రపోయాడు.

ఒకగంట సేపటికి అతనికి మెలకువ వచ్చింది. అప్పటికి ప్రొద్దు చాలా తిరిగిపోయింది. ఆవలించుతూ లేచి కూర్చోగానే-ముక్కాలిపీటమీద నున్న వుత్తరము కనపడింది లేచి చూచాడు. అది అలాగే అంటించివుంది. కారణం ఏదైనాకాని అది సతీశునికి చేరలేదు. చప్పుడువిని సురబాల లోపలికి వచ్చి "సతీశ్ బాబు అక్కడలేడట. ఉదయం పదిగంటల బండికి యింటికి వెళ్లాడట" అన్నది.

ఈ మాట వినగానే వుపేంద్రుని మొహం వాడిపోయింది. ఈ కొత్త చోట హారణ్ అంత్యక్రియలన్నీ తనే స్వయంగా చేయవలసివస్తుంది. అబ్బా! ఎన్ని పనులు చేయాలి. ఎంత బీభత్సం, ఎంత కఠోరం! నలుగురినీ పిలుచుకు రావటం, సామానంతా సమకూర్చటం, నూతన వైధవ్యం పొందిన పత్నీ, తల్లి ఒడిలోంచి శవాన్ని తీసుకెళ్ళడం, హృదయవిదారకమైన శోకదృశ్యాల్ని తలచుకొని, అతని శరీరమంతా కొయ్యబారిపోయింది. అతను తన అంధవిశ్వాసంతో లోలోన సతీశునిమీద ఎంతో ఆశపెట్టుకొని వున్నాడు. కాని అంతా వ్యర్థమైంది.

ఈ పనులన్నీ వుపేంద్రుని స్వభావానికి పూర్తిగా విరుద్ధం. వీలైనంత వరకు అతను అలాంటి చిక్కుల్లో పడదలచలేదు. కాని సతీశునికి ఇవన్నీ సహ

వృపేంద్రుడు మంత్రముగ్ధునిలాగ "ఎందుకు వుండను వదినా? నీలాంటి వాండి బరువు బాధ్యతలన్నీ వహించటం చాలా అదృష్టమైన సంగతి" అన్నాడు. ఇంతకాలానికి ఇవ్వాళ వృపేంద్రుడు ఆమెను ఆత్మీయురాలుగా సంబోధించాడు. "దివాకరుడు నావెంటే వచ్చాడు. బహుశా ఇక్కడేమున్న వెళ్ళి పోతాడేమో. లేకపోతే ఇప్పుడే పిలిచి చెబుతాను" అన్నాడు మళ్ళీ.

ఈమాట విని కిరణ్మయి ఆశ్చర్యపడి పోయింది. ఈసారి ఆమె నోటి నుండి మాటరాలేదు. ఆనందప్రవాహం అకస్మాత్తుగా ఆమె హృదయాన్ని ముంచివేసినట్లయింది. అందుకని ఆమె క్షణంసేపు వృపేంద్రుని వైపునుండి మొహం తిప్పుకొని సంబాళించుకోటానికి ప్రయత్నించసాగింది. ఇంత ఆత్మీయతా? దానిలో కూడా ఎంత మాధుర్యమున్నది! దానికోసమే ఆమె ఒక యుగంనుండి తహతహలాడుతూవుంది. సతీశుడు వదినె అని పిలుస్తూవుంటాడు. దివాకరుడుగూడ అట్లానే పిలుస్తాడు. కాని దానిలోనూ, దీనితోనూ ఎంత భేదముంది?

అంతా ఒక్కసారి మాట్లాడకుండా ఆనేప్పటికి అఘోరమయి మనస్సులో అనుమానం కలిగింది. ఒకరు వప్పుకోనేప్పటికి ఒకరు మొహం తిప్పుకున్నారు. ఆమె ఇక ఆగలేక "నాయనా వృపేంద్రా! అంతా చేసినా నా ప్రయాణానికేమీ విఘ్నం కలుగదుగా. నువ్వు చెప్పమంటే వెళ్ళి మల్లికా గారి కోడలికి చెప్పివస్తాను" అన్నది.

వృపేంద్రుడు కిరణ్మయికేసి మళ్ళీ ఒకసారిచూసి "నా ఆటంకమేమీ లేదని చెప్పేశాగా పిన్ని. మీకోడలి అభిప్రాయం తెలుసుకోవటం మంచిది. ఆమెకూడా యిష్టపడితే నీ ప్రయాణానికింకేమీ అడ్డంకులు వుండవు" అన్నాడు.

"అయితే వెళ్ళనా నాయనా! వారితో ఇప్పుడే వెళ్ళి చెప్పివస్తాను. ఎప్పుడు బైలుదేరుతారో కూడా కనుక్కువస్తాను" అని అఘోరమయి వెంటనే దాసీదాన్ని పిలుచుకొని పొంగిపోతూ కిందకు దిగిపోయింది.

ఆమె ఈతొందరపాటుచూచి వృపేంద్రుడు మనసులో చాల సంతృప్తి పడ్డాడు. "బాగానేవుంది. కొంతకాలంపాటు ఆమె యాత్రలు చేసిరావటం చాలఅవసరం" అన్నాడు.

కిరణ్మయి కొంచెం పరధ్యానంతో వుంది. సమాధానం రాకపోయేప్పటికి "మీ అంగీకారం నిశ్చయమేగా?" అన్నాడు వుపేంద్రుడు మళ్లా.

వుపేంద్రుని కంఠస్వరంవిని ఆమె కొంచెం ఆశ్చర్యంతో అతని మొహాం కేసి చూస్తూవుండిపోయింది.

"ఎందుకు నిశ్చయంకాదు. ఇది ఎటువంటి అంధకూపమో మాకే తెలుసు. ఈ దుఃఖగుహ్యాన్నుండి బైటపడి కొన్నాళ్ళపాటు సుఖంగానైనా వుంటుంది. వెళ్ళనీయండి" అన్నది తలవనితలంపుగా.

ఈ మాటలు వుపేంద్రుని హృదయంలో దుఃఖం కలిగేట్టు చేశాయి. కొంచెంసేపు మౌనంగావుండి వ్యధితహృదయంతో "ఈ దుఃఖగుహ్యాన్నుండి, ఆమె ఒక్కతేకాదు, మీరుకూడ బైటపడితే మంచిది" అన్నాడు.

కిరణ్మయి అతనికేసి కాతరదృష్టితో చూచి "నా అనేవారువెవరున్నారు వారిదగ్గరకు వెళ్ళటానికి?" అన్నది.

"మీ కన్నవారెవరూ లేరూ?" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి చిరునవ్వునవ్వి "పుట్టిల్లు ఎక్కడో కూడా తెలియదు. మేనమామగారింటివద్ద పెరిగాను. ఈ ఎనిమిది పదిసంవత్సరాలనుండీ వారి అంతు కూడా లేదు. పదేళ్ళప్రాయంలో పెళ్ళయింది. అప్పుడే వచ్చాను ఈ ఇంటికి. బ్రతికివుండగా ఈఇంట్లోనుండి కదలనుకూడా లేను" అన్నది.

వుపేంద్రుడు చాల వ్యధపడ్డాడు. కొంచెంసేపు ఆలోచించి "అయితే పిన్నితోపాటు మీరుకూడా కాశీకి వెళ్ళగూడదూ? కాలమూ గడుస్తుంది, యాత్రచేసినట్టూ వుంటుంది" అన్నాడు. కాని కిరణ్మయి మొహభావంచూచి చకితుడైపోయాడు. ఇలాంటి సూచనచూచి ఆమె ఏమీ సంతోషం కనబర్చ లేదు. నిరుత్సాహంతో, మెదలకుండా చూస్తూ వూరుకుంది.

ఆమె యిల్లువదలి వెళ్ళదలచుకోటంలేదని వుపేంద్రుడు వెంటనే గ్రహించి "అయితే మీరు ఇల్లు వాకిలినిగురించి విచారపడుతున్నారా? ఏమీ విచారపడవద్దు. ఏమీ చెడిపోకుండా దాని బందోబస్తంతా నేను చేస్తాను" అన్నాడు.

ఏదోవిధంగా శ్రాద్ధకర్మలన్నీ అయినతర్వాత ఆమె వుపేంద్రని చేయి పట్టుకొని "నాయనా! మనపొరుగు మల్లిక్ వారి పెద్దకోడలు కాశీ, బృందావనం, ప్రయాగ యాత్ర చేసిరావటానికి వెళుతూవుంది. ఆమెవెంట నేను కూడా వెళ్ళిరాకూడదూ ?" అన్నది.

"ఎందుకువెళ్ళకూడదు పిన్నీ, స్వేచ్ఛగా వెళ్ళవచ్చు. కాని......" అని అతను కిరణ్మయి మొహంకేసి చూచాడు.

కిరణ్మయి తెలుసుకుని "నాకోసం ఏమీ విచారపడకన్నా. నేను పనిదానితోపాటు ఇక్కడేవుంటాను" అన్నది.

కాని వుపేంద్రుడు దానికి 'ఊఁ' అనకుండా వూరుకున్నాడు.

కిరణ్మయి కొంచెంసేపు అతనిమొహంకేసి చూసి "దివాకరబాబు కలకత్తాలోనే చదువుతాడుగదా, ఇక్కడవుంటే బాగుండదూ? ఎక్కడో పరాయింట్లో పెట్టేకన్న నాకళ్ళముందు వుంచితేనే బాగుంటుందిగా! తిండి తిప్పలకీ ఇబ్బందివుండదు. కలకత్తాలో వంటరిగావున్నందువల్ల కలిగే భయాలు కూడా వుండవు" అన్నది.

అఘోరమయి తన సంపూర్ణాంగీకారాన్ని తెల్పుతూ "అలాఅయితే ఇంకేం కావాలి? అపనే చెయ్యి వుపేంద్ర! అలాగేచెయ్యి. ఆపిల్లవాడికి కూడా ఏమీ ఇబ్బందివుండదు. ఈ హతభాగినికికూడా అండగావుంటాడు. ఎలాగైనా చెయ్యి. నను కాశీకి పంపించే ఏర్పాటు మాత్రంమాడు" అని తనకిలా చక్కనిదారి దొరికినందుకు వృద్ధ నిశ్చింతతో ఒక నిట్టూర్పువిడచింది. ఇవ్వాళ ఆమె పెదవులమీద స్మితరేఖలుకూడా కనిపించినాయి' కాని వుపేంద్రుడు కిరణ్మయి ధైర్యంచూచి స్తంభించిపోయాడు. ఆమెఎదుట తీసుకొచ్చి పెట్టిన సమస్యనుగురించి ఏమిచెయ్యాలో కూడా అతను ఆలోచించుకోలేకపోయాడు. ఏమైనా దివాకరుడు పసిపిల్లవాడు మాత్రం కాదు. నవయువకుడు. మరి యీ యువతి అతనితో ఈ నిర్జనగృహంలో ఒంటరిగా వుంటూ, పసిపిల్లవానిలా అతని లాలనపాలనచేస్తూ చూస్తూవుండటానికి సంకోచం లేకుండా బాధ్యతంతా నెత్తినవేసుకోవటంచూచి వుపేంద్రుని నోటివెంట మాటరాలేదు. ఈ రమణి ఎంత బుద్ధిమంతురాలోకూడా వుపేంద్రునికి బాగా తెలుసు. కిరణ్మయికి సామాజికవిధివిధానాలూ, మంచి చెడ్డలూ అన్నీ

తెలుసు. దానిలో సందేహమేమీలేదు. అయితే ఆమెకు అలాంటి సాహసం ఎందుకు కలిగింది? ఈ మాట ఎలా అనగలిగింది?

నిమిషంలో వుపేంద్రుడు సంశయోత్తేజితమైన తన పర్యవేక్షణాశక్తి నంతటినీ జాగ్రతపరచి సమైక్యతచేసి ఈ సౌందర్యరాశియొక్క అంతర్యాన్ని పరికించాలనుకున్నాడు. కాని లోపల ప్రవేశించటానికి అతనికి ఎక్కడా దారి దొరకలేదు. గట్టిగా ఒక్క చెంప పెట్టు పెట్టి వెనక్కి తిప్పింది.

కొంచెంసేపటివరకు ఒకరిమొహాలు ఒకరు చూచుకొంటూవున్నారు. అందుకనే వారిద్దరికీ ఒక నూతన పరిచయ మేర్పడింది. ఒక కొత్తఎరుక కలిగింది. అటువంటి శాంతి, స్వచ్ఛవైరాగ్యమూర్తిని తానెప్పుడూ చూడలేదను కున్నాడు వుపేంద్రుడు. ఆరాత్రి ఆమె వేషవిన్యాసాలచూచి ఆ క్షణమే వచ్చిన వుపేంద్రునికి, సతీశునికి కండ్లుమిరుమిట్లు గొలిపాయి. ఆమెసౌందర్య రాశి, అలంకార ప్రతిమ అనుకున్నారు ఇద్దరూ. మరి ఈనాడు అలంకార విహీనమైన ఆవైధవ్య వేషముచూచి ఆమెను ఏనాడూ చూడలేదనిపించింది. హఠాత్తుగా వచ్చిన నవనైతిన్యంలాగ అగ్నిపర్వతంలాగ పొంగులెత్తి పైకి లేస్తున్న ఆమెలోని అపారసౌందర్యగరిమను కళ్ళతో చూడవలసిందేగాని, చెయివేసి స్పృశించకూడదు. దానిని స్పృశించ తలపెట్టినవాడు మండిభస్మమై పోతాడు. ఈ అగ్నిశిఖలాంటి విధవ దివాకరుని దగ్గరకుతీసింది సంకోచభయా లతో కాకుండా యథార్థమైన అధికారగర్వంతోనే. దుస్సాహసంగానీ స్వార్థంగానీ ప్రైటపెట్టలేదు.

వుపేంద్రుడు అప్పుడేమీ అనలేకపోయినా ఈ విధవదృష్టికి దివాకరుడు ఒక పసిపిల్లవాడిలా కనపడుతున్నాడని మాత్రం గ్రహించాడు. ఆ రోజున సతీశుని మఱదిలాగ పంపమని బలవంతంచేసిన సంగతికూడా ఇవ్వాళే స్పష్ట మైంది. అతని పరితప్తహృదయం మెదలకుండా చేతులుజోడించి ఈమహా మాయిముందు తన తప్పిదాన్ని వప్పుకొని క్షమాపణ కోరుకుంది. ముగ్గురూ మౌనంగా కూర్చున్నారు. కిరణ్మయే ముందు కదిలించింది. వుపేంద్రుని మొహంకేసి కొంచెంసేపు దీనంగాచూచి "దివాకరుని నావద్ద నుంచలేరా?" అన్నది వినయస్వరంతో.

ఈసారి కిరణ్మయి మొహం తిప్పుకొని నవ్వింది. "ఆ రాత్రి నేనన్న వెర్రిమాటలను మనసులో పెట్టుకొని మీరిలా మాట్లాడుతున్నట్లువుంది." అన్నది ఆమె.

వుపేంద్రుడు సిగ్గుపడి "కాదు, అలాగేమీ కాదు. ఒకవేళ అన్నా దాన్ని వెర్రితనమని ఎందుకనాలి? అలాంటి పరిస్థితిలో గృహభద్రం ప్రతివారికీ వుండకతప్పదు" అన్నాడు వెంటనే.

కిరణ్మయి తన్ను నిందించుకుంటూ "ఒక్కసారిగా ఇంటిగృహభద్రమా?" అన్నది నవ్వి.

"ఎందుకు వుండదు? తన ఇల్లు, వాకిలి, ఆస్తిపాస్తుల మీద మమత ఎవరికివుండదు? భవిష్యత్ చింత ఎవరికుండదు? మీరంటున్న వెర్రిమాటలు ఎప్పటికీ అనవస్థ! దానిలో అసహజమేమీ లేదు" అన్నాడు వుపేంద్రుడు.

"లేకపోవటమే మంచిది. కాని నేను ఇప్పుడు దానిని వట్టి పిచ్చితనమంటాను. మీమీద కూడా అనుమానపడ్డాను. ఎంతెంతో ఎబ్బెట్టుగా మాట్లాడాను; తలపుకువచ్చినప్పుడు సిగ్గుతో చచ్చిపోతాను" అంటూవుండగానే ఆమె సహజసుందరవదనం కృతజ్ఞతతో కూడుకున్న సంతోషంతో నిండిపోయింది. దానిమీద వుపేంద్రుడేమీ మాట్లాడలేక కదలకుండా ఆమె కేసిచూస్తూ వుండిపోయాడు. కొంచెంసేపు మౌనంగావుండి "కాని అనుకుంటే ఇప్పుడేమైంది బాబూ? ఈఇల్లు నాదౌతుందని నేనెప్పుడూ వూహించలేను. వున్నా లేక పోయినా వారి తల చెట్టుక్రిందనుంచి ఎవరూ తొలగించలేరుగా! నాకు అదే చాలు" అన్నది మళ్ళా.

దీనికికూడా వుపేంద్రుడేమీ మాట్లాడలేదు. ఈ నూతనవిధవవైరాగ్యం చూసి అతనిహృదయం శ్రద్ధామాధుర్యంతో నిండిపోయింది.

"ఇల్లువాకిలి ఏమీ అడ్డంకులు కావు. కాని అత్తగారివెంట యాత్రచేసి వచ్చినంతమాత్రాన నాకు శాంతికలుగుతుందా? ఆప్రదేశాలంతటా జనం గుమిగూడి వుంటారని విన్నాను" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు తలకాయవూగించి తీర్థస్థానాల్లో జనం గుమిగూడే వుంటారు. మీకు ఇంకేంలేకపోతే తీర్థయాత్ర ఒకపనేగా" అన్నాడు.

మళ్ళీ కిరణ్మయి వుపేంద్రుని కేసిచూచి మొహం తిప్పుకొని నవ్వు తుంది. కాని ఏమీ మాట్లాడలేదు. ఆమె ఎందుకు నవ్విందో అర్థంకాక వుపేంద్రుడు ఏదో చెప్పబోతూ వుండేప్పటికి పక్కగదిలోంచి దివాకరుడు బైటికి వెళ్ళటం చూచి ఆశ్చర్యపడ్డాడు.

"నువ్వు ఇంత సేపటినుంచి ఈ గదిలోనే వున్నావా?"

"దివాకరబాబు నా పుస్తకాలు సర్దుతున్నాడు. నేను చెప్పటం మరచి పోయాను, క్షమించాలి" అన్నది కిరణ్మయి.

దివాకరుడు దగ్గరకువచ్చి నిట్టూర్పు విడచి "ఎన్ని పుస్తకాలు! అంత చిందరవందరగా పడివున్నాయేం వదినా! తెరచి చూస్తే వీటన్నిటినీ ఎంతో ప్రయాసతో చదివినట్టు కనపడుతూవుంది.

కిరణ్మయి అతని మాటలను సమర్థిస్తూ "నిజమే. చదివితే అలాగే చద వాలి" అన్నది.

దివాకరుడు సిగ్గుపడి "నాకు సంస్కృతం రాదు, అయినా ఒకసారి చదివి ప్రయత్నిస్తాను. ఇది కఠోపనిషత్తు" అన్నాడు.

"ఇన్ని పుస్తకాలుండగానే నీకు కఠోపనిషత్తే నచ్చిందా?" అన్నది కిరణ్మయి.

దివాకరుడు ప్రశ్న సరిగ్గా అర్థంచేసుకోలేక ఆమె మొహంకేసిచూస్తూ "ఇంతకంటే మంచిపుస్తకం లోకంలో ఇంకేముంది వదినా? దీన్ని చదవటం నాకు అనధికార ప్రయత్నం కావచ్చును. అర్థంచేసుకోలేను. అయినా శక్తి కొలదీ ప్రయత్నించటం విధిగా" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వుతో "నీవు అనుకున్నదేమీ కాదుబాబూ? ఈ విధంగా ప్రయత్నించితే దానికేమీ విలువుండదు. ఆ అక్కడ కొంతభాగం బాగుండవచ్చు. చేతిలో ఏమీ పనిలేకపోతే ఆత్మ-పరమాత్మకు సంబంధించిన విచిత్రమైన సంగతులు చదువుతూవుంటే కాలం గడచిపోతుంది. అంతే" అన్నది.

ఈ మందహాసం చూచి దివాకరుని మొహం ఒక్కసారి వెలవెల పోయింది." ఏమిటి అంటావు వదినా! ఉపనిషత్తులు వేదాలని వింటానే. దానిలో ప్రతి అక్షరమూ పరిపూర్ణసత్యంతో నిండివుంటుంది" అన్నాడు.

అతని ఆశ్చర్యాధిక్యతచూచి కిరణ్మయి మళ్ళీ నవ్వింది. "ఏ ధర్మ గ్రంథమూ సంపూర్ణసత్యం కానేరదు. వేదం కూడా ధర్మగ్రంథమే. అందుచేత దానిలోకూడ మిథ్యావాదానికేమీ తక్కువలేదు" అన్నది.

దివాకరుడు వెంటనే రెండుచెవులూ మూసుకొని "వేదం మిథ్యా! ఇంకేం అనకండి. విన్నా పాపం, వేదం మిథ్యఅంటే. లోకులు 'వేదవాక్యం' అన్నశబ్దాన్ని నిశ్చితసత్యార్థంగా పరిగణిస్తారు. వేదాలు మానవులువ్రాసినవా ఏమిటి, మిథ్యకావటానికి ?" అన్నాడు.

అతనిఆవేశం చూచి కిరణ్మయి పకపక నవ్వింది.

దివాకరుడు చెవులమీద చేతులుతీసి తన ఆవేశానికి సిగ్గుపడుతూ "నిజంగా అలా అన్నా, విన్నా పాపం వదినా! వేదాలు మిథ్యఅవుతాయా! ఇవి ఇతర ధర్మగ్రంథాలలాంటివా ఏమిటి, శివవాక్కు అని చెప్పి లోకులు రెండుమూడు శ్లోకాలు, ఐదారు పుక్కిటిపురాణాలూ చేర్చటానికి? వేదం అంటేనే సాక్షాత్ సత్యమని అర్థం!" అన్నాడు.

కిరణ్మయి పెదవులమీదకొచ్చిన నవ్వుఆపుకొని గంభీరంగా "నాకేం తెలుసు? ఎన్ని సంగతులు చెప్పాను. అయినా నువ్వుకూడా ఒప్పుకున్నావుగా ధర్మగ్రంథాలలోకూడా శివవాక్కులనిచెప్పి పుక్కిటిపురాణాలన్నీ ఇరికిస్తారని?" అన్నది.

దివాకరుడు ఆమెమాట ఒప్పుకున్నాడు. కొన్నిరోజులక్రిందట అతను ఏదో మాసపత్రికలో పురాణాలను గురించిన విమర్శ ఒకటి చదివాడు. అందుకనే "వేదాలను మిథ్య అనటం ఒట్టిఅన్యాయం. ఆ పురాణాల్లో పుక్కిటి పురాణాలు, మిథ్యాశ్లోకాలు వున్నాయని నమ్మకపోలేదు. కాని మిథ్య ఎక్కువకాలం నిలువజాలదు, రెండురోజులుంటే దానంతటదే బైటపడుతుంది" అన్నాడు.

"ఎలా బైటపడుతుంది?"

"అది నాకు సరిగా తెలియదు. కాని మిథ్యను సూక్ష్మవిమర్శచేస్తేనే ఏది మిథ్యో ఏదితథ్యమో పండితులకు తెలుస్తుంది. దానినిబట్టి మీరు వేదాలను సత్యంకాదనటం చాల అన్యాయం, అసంగతమూను" అన్నాడు దివాకరుడు.

సురేంద్రుడు ఇంతవరకు కిరణ్మయిచేసే ఈ పరిహాసాలవుద్దేశ మేమిటో వూహించలేక వారి వాదవివాదాలు వింటూ వూరుకున్నాడు. కిరణ్మయి అతనికేసి చూచి చిరునవ్వు ఆపుకుంది. మళ్ళీ దివాకరునితో గంభీరంగా "నాకేం తెలుసుబాబూ, ఒక ధర్మగ్రంథంలో చదివాడు. ఒక బ్రాహ్మణ యువకుడు ఎందుకో యముణ్ణి కలుసుకోటానికే వెళ్ళాడట. ఆ సమయంలో యముడు ఇంటివద్దలేడు. బహుశా అత్తవారింటికి వెళ్ళివుంటాడు. మూడు రోజులకు ఇంటికితిరిగివచ్చి బ్రాహ్మణయువకుడు పస్తువున్నాడనీ, ఏమీ తిన లేదనీ విన్నాడు. ఒకటి బ్రాహ్మణుడు, దానిమీదటు అతిథి. యముడు చాల దుఃఖపడ్డాడు. చివరికి వినయంతో నువ్వు మూడురోజులనుండి పస్తులున్నావు. దానికి బదులుగా మూడువరాలు కోరుకోమన్నాడు" అన్నది.

కథ పూర్తికాకముందే దివాకరుడు పకపకానవ్వి "ఇది ఎక్కడికథ వదినా?" అన్నాడు.

కిరణ్మయి శాంతగా "చదివినవిషయం చెబుతున్నాను. ఎప్పుడైనా అలాంటి ఘటన జరుగుతుందా? నీకు దీనియందు నమ్మకముందా?" అన్నది.

"ఎప్పటికీవుండదు, అంతా అసంభవం."

"అసంభవ మెందుకని? ధర్మశాస్త్రాలలో వున్న సంగతేగా"

"ఏ ధర్మశాస్త్రంలోనైనావుంటే ఎవరికల్పనో అయివుంటుంది."

"కల్పన అని ఎలా తెలుసుబాబూ?"

"ప్రతివాడికీ ఆలోచించుకునే శక్తి వుంటుంది వదినా! నాకు ఎక్కు వగా తెలియనిసంగతి నిజమేగాని ఇది కపోలకల్పన అనటంలో మాత్రం అనుమానంలేదు. అలా ఎప్పటికీ జరుగదు."

"ఆవిధంగానే అందరూ తన తెలివితేటలతో ఇది తథ్యమనీ, ఇది మిథ్య అనీ నిర్ణయించగలరు. అంతకు నిజానిజాలు తెలుసుకోటానికి మరో వుపాయం లేదు. కాని అందరికీ ఒకే అభిప్రాయముండదు. నువ్వు సత్యమనుకొన్న దానిని నేను అర్థం చేసుకోలేకపోతే నామీద నేరంమోపితే లాభంలేదు"అన్నది కిరణ్మయి.

"లాభంలేని సంగతి నిజమే." వెంటనే అందుకున్నాడు దివాకరుడు.

"అయితే చూడుబాబూ?! ఆవిషయంలో అభిప్రాయం కలిగినంత మాత్రాన నేరం మోపలేరు. హృదయానికీ, మనసుకీ, అతీతమైన వస్తువును గురించి ఎంతైనా అనైక్యత వుంటుంది. ఈవిషయంలో మనకు అభిప్రాయ భేదాలు లేవు. ఈఘటన మనబుద్ధికి అతీతమైనదని ఇద్దరమూ అనుకుంటున్నాం. ఇది పుక్కిటి పురాణమేనా బాబూ?! అన్నది కిరణ్మయి.

కిరణ్మయి అతన్ని ఎక్కడికి దింపుకుపోతుందో తెలుసుకోకుండానే దివాకరుడు "అవును" అన్నాడు.

కిరణ్మయి మళ్లానవ్వి "సరే, నా పుక్కిటిపురాణంలో శేషభాగం నీచేతుల్లో వున్న ఆపుస్తకంలోనే దొరుకుతుంది" అన్నది.

దివాకరుడు ఆశ్చర్యంతో "ఈ ఉపనిషత్తులోనా? అన్నాడు.

కిరణ్మయికూడా అలాగే కౌతుకస్వరంతో "ఆఁ దానిలోనే దొరుకుతుంది. ఎక్కువ వెతుకనవసరంలేదు. అది చూసిన తర్వాత దానిలో వున్నదంతా అసత్యం కాదనే అపోహవుండదు" అన్నది.

దివాకరుడు మాట్లాడలేదు. మొహం వాడిపోయింది. హతబుద్ధిలాగ చూస్తూ కూర్చున్నాడు.

కిరణ్మయి ఉపేంద్రుని మ్లానవదనంకేసి చూచి "మీ అభిప్రాయమేమిటి ఉపేంద్రబాబూ?" అన్నది.

ఉపేంద్రుడు చిరునవ్వునవ్వి వూరుకున్నాడు. మాట్లాడలేదు.

దివాకరుడు సంభాళించుకొని "ఇది రూపకం కూడా కావచ్చునా?" అన్నాడు.

"ఆఁ కావచ్చు. కాని రూపకం సత్యంకాదు. ఈ పుస్తకంలో మొదటినుండీ చివరివరకూ మిథ్యకాదనీ, తథ్యమూ కాదనీ, బుద్ధియొక్క తారతమ్యాలనుబట్టి ఆలోచించి చెప్పవచ్చును. నీబుద్ధి దానిని పదహారణాల యథార్థమనుకుంటే, నాబుద్ధి దానిని పదిహేనణాల అబద్ధమనుకోవచ్చు. దానిలో నేను చేసిన అన్యాయమేముంది?" అన్నది కిరణ్మయి.

దివాకరుడు చేతిలో పుస్తకంకేసి మెదలకుండా చూస్తూ వూరుకున్నాడు. కిరణ్మయి మాటలు అతనిహృదయాన్ని బాధపెట్టసాగినై. కొంచెం

సేపు మెదలకుండా వూరుకొని "నువ్వు మిథ్య అనుకున్నదానిలో ఏదైనా గూఢరహస్య ముండకూడదా వదినా? అందుకనే......" అన్నాడు.

"అందుకనే మిథ్యను సృష్టించింది? నీవూహించినది యథార్థము, సంభవమూ అని నేను వప్పుకుంటాను. అయినా వూహ వూహే. వుద్దేశము, రహస్యము ఏదైనా మార్గంమాత్రం మంచిదికాదు. మిథ్యాపోహాలో సత్య ప్రచారం జరగదన్న సంగతి ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకోవాలి. తమ తెలివి తేటలను బట్టి ప్రతివారూ తెలుసుకోగలరు. ఇవ్వాళ తెలుసుకోలేకపోతే రేపు తెలుసుకుంటారు. ఒకరు తెలుసుకోలేకపోతే ఇంకొకరు తెలుసుకుంటారు. ఎవరూ తెలుసుకోలేకపోయినా దానికి మిథ్యాభూమికను జోడించి రుచివంతకం చేయటం ఏమీ అన్యాయం కాదనుకుంటారు. బాబూ, మిథ్య సదా పాపమనుకుంటారుగదా, మిథ్యతో తథ్యాన్ని కలిపి చెప్పినంతపాపం ప్రపంచంలో ఇంకేముంటుంది"?

దివాకరుని వదనం వుదాసీన మైపోయింది.మౌనంగా వూరుకున్నాడు. కిరణ్మయి అతని మొహం చూచి అతని మనోభావాన్ని గ్రహించింది. "దీనిలో చింతపడవలసిన విషయమేమీలేదు. సత్యాన్నే అందరూ సదా సర్వావస్థల యందు స్వీకరించటానికి ప్రయత్నించాలి; దానివల్ల వేదాలు, ధర్మశాస్త్రాలు కూడా అబద్ధమైనా సరే. అవి సత్యంకంటె మించినవేమీ కాదు. సత్యం ముందర వాటికేమీ విలువవుండదు. హఠంతోగానీ, మమతతోగానీ, బహుకాల సంస్కారంతోగానీ కల్పించుకుని అసత్యాన్ని సత్యమనటం పౌరుషమేమీ కాదు" అన్నది కోమలస్వరంతో. కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "నేను అనుకున్నంత మాత్రాన అవి అసత్యాలైపోతాయనుకోవద్దు. సత్యమా, అసత్యమా అన్న సంగతి తెలుసుకుని గ్రహించటంగాని, త్యజించటంగానీ వుచితం. కల్పించుకుని వప్పుకున్నంతమాత్రాన ఏమీ లాభంలేదు. అందువల్ల దాని గౌరవమూ వుండదు, నీ గౌరవమూ వుండదు" అన్నది మళ్లా.

దివాకరుడు కొంచెంసేపున్న తర్వాత "అయితే వదినా, వూహాతీతమైన విషయాలను గురించి మననచేసి సత్యమో అసత్యమో మీరెలా నిశ్చయించగలరు?" అన్నాడు.

"ఎందుకు నిశ్చయించలేను ? వూహాతీతమైన విషయాన్ని బుద్ధిబాహ్య మనుకొని దూరంగా వుంచుతాను. మాటలలో దానిని అవ్యక్తం, అబోధ్య మంటాను. అవసరమొస్తే దానిని గురించి బోధించటానికిగాని, తెలుసుకో టానికిగాని ప్రయత్నించను. వారి విషయంకూడా నమ్మను. నువ్వు ఈ పుస్తకాలన్నీ చదువలేను. చదివితే సర్వత్ర ఇదే ప్రశాంత్నం, ఇదేపంతమని గుర్తి స్తావు. ఒకటి తనవైపు కులాగితే మరొకటి ఇంకొకవైపు కు లాగుతుంది. అది అబోధ్యమనిచెబుతారు. మళ్లా ఆ నోటితోనే తన కళ్లారా అంతా చూచి వచ్చా మని కూడా చెబుతారు. లభ్యంకాని దానిని పొందటానికి పేజీలకు పేజీలు నింపుతారు. ఎలా ? జీవితంలో ఎప్పుడూ ఎర్రరంగు చూడని వానికి ఎర్రరంగు ఫలానిదని నోటితో చెప్పటం ఎలా? చెప్పితే గ్రహించుకో లేనప్పుడు క్రోధ మొస్తుంది. తన్ను తాను కొడతానని బెదరిస్తారు. మాటల్లో మట్టుకు మహా ఘనంగా కనిపిస్తాయి. నిర్గుణం, నిరాకారం నిర్వికారం, ఇవన్నీ చెప్పుకొనే మాటలు. వాటికి అర్థమేమీ వుండదు. ఏదైనా అర్థమున్నా, ఈ మాటను అవి ష్కారం చేసేంవారే, వీనినిగురించి ఏమీ చింతపడవద్దు, చింతించినా లాభ ముండదు. వ్యర్థపరిశ్రమ, అన్నారు."

దివాకరుడు కొంచెంసేపు మెదలకుండా వూరుకొని తర్వాత మెల్లగా - "అయితే, నువ్వు ఆత్మను వప్పుకుంటావా వదినా?" అన్నాడు.

"లేదు"

"ఎందుకని?"

"మిథ్య కాబట్టి. అదీగాక సర్వం నాశమౌతుంది. అమూల్యమైన మన ఈ అహంకారంమాత్రం ఎప్పటికీ నాశం కాదనుకునేంత దుఃఖంలేదు నాలో. నా మరణానంతరంకూడా నా అహంభావము అలాగే వుండాలన్న కోర్కె కూడా లేదు నాలో."

"అయితే భగవంతుణ్ణి కూడా వప్పుకోవా?"

కిరణ్మయి నవ్వి "ఇంత భయంతో అడుగుతా వెందుకు బాబూ? దానిలో భయపడవలసిన విశేషమేమీలేదు. నేను వప్పుకోకుండా కూడా వుండలేను" అన్నది.

దివాకరునికి గాఢాంధకారంలో ఒక వెలుగురేఖ కనిపించినట్లయింది. "నువ్వు వారిని గురించి ఎలా చింతన చేస్తావు?" అన్నాడు.

"అజ్ఞేయమనుకున్న వానిని గురించి చింతనే చెయ్యలేము, చెయ్యను కూడా. వస్తుతః అచింత్యాన్ని గురించి చింతన ఎలా చెయ్యను? అందుకనే అసంభవాన్ని సంభవం చెయ్యటానికి నేనెప్పుడూ ప్రయత్నించను. ఏవస్తువునైనా పెంచి పెద్దదాన్ని చెయ్యగలం. ఇంకా పెంచి ఇంకా పెద్దదాన్ని చెయ్యగలం. కాని దాన్ని లాగిలాగి అనంతంచేయాలన్న పొరపాటు నావల్ల ఎప్పుడూ జరగనేలేదు" అన్నది కిరణ్మయి.

"అయితే దానిని గురించి వూహించనుకూడా లేదా?"

"వూహించగలం. కాని అల్పమనుకొని వూహించగలం. మానవుడికి గుణదోషాల నంటగట్టి చిన్నదైవంగా భావించి అశిక్షితులు శ్రద్ధాభక్తులతో కొలిచినట్లు వూహించగలం. లేకపోతే జ్ఞానాభిమానంతో పరమాత్మ అంటూ వూహించేవాళ్ళు తమ్ముతాము మోసపుచ్చుకుంటారు." తర్వాత వుపేంద్రుని మొహంకేసిచూచి చిరునవ్వుతో "మీరు మహా చతురులు. మేమిద్దరం వివాదపడి ఇప్పటికి బైటపడ్డాం. మీరు నోరు మెదల్చకుండా బెట్టుగా కూర్చున్నారు. మీకు సర్వస్వము తెలుసునని నేనెరుగుదును. కాని మీ మనసులో మాట ఎవరికీ తెలియనీరు" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు నవ్వి "లేదు వదినా? ఈవిషయంలో నేను బొత్తిగా అజ్ఞానిని. నేను మెదలకుండా మీచర్చలు వింటున్నాను" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వు నవ్వి "పరిహాస మాడుతున్నారు" అన్నది.

"లేదు వదినా, నిజం చెబుతున్నాను. ఇంత చిన్నవయస్సులోనే ఇంత విద్య నెప్పుడు గడించారా? ఎప్పుడు మననంచేసుకున్నారా? అని ఆలోచిస్తున్నాను"

ఈపొగడ్త విని కిరణ్మయి హృదయం ఒక్కసారి వుప్పొంగిపోయింది. కాని ఆమె దాన్ని కనపర్చకుండానే "లేదు, లేదు. అలా అనకండి. నేనూ వట్టి అజ్ఞానినే. ఏమీ తెలియదు. శాస్త్రాలలోని అతిశయోక్తులు చూస్తే నావళ్లు మండుకుపోతుంది. సంబాళించుకో లేను. నీకూ నాకూ తెలియదు అనిపించుతుంది. ఇంకా నీబలప్రకర్ష ఎందుకు? ఇదిచెయ్యి, అది చెయ్యమని అమలు చేస్తారెందుకు? ఈమిథ్యాడంబరం, ఈపటాటోపంఎందుకు? భగవంతుడు చేసేది అక్షరాలా ఆచరిస్తున్నామని దాంభికంగా కబుర్లు చెబుతారు. పడుకుంటూ

లేన్నా, తిండీ, తేపుతూ ప్రతినిమిషంలోనూ, ప్రతిపనిలోను వారు భగవంతుణ్ణి స్మరించుకొంటూ ధర్మం ప్రదర్శిస్తారు! అలా నవ్వు, ఇలా ఏడువు, అది అలాచెయ్యి, ఇది ఇలాచెయ్యి; ఇదంతా బలవంతం కాకపోతే ఇంకేమిటి? కాని వింత ఏమిటంటే ఏశాస్త్రకారుడూకూడా తన అనుశాసనాలకు కారణం చెప్పేఅవసరంగుర్తించలేదు. అలాచేస్తే గోహత్యాపాపం తగులుతుంది, ఇలాచేస్తే బ్రహ్మహత్యాపాతకం కలుగుతుంది. నువ్వు సర్వనాశన మౌతావు, నీ నాలుగు తరాలవరకు నరకంలో పడి వుండవలసిందే. ఎందుకు వెళతారు? నీతో చెప్పింది ఎవరు? స్మృతిపురాణాదు లన్నీ ఈవిధంగానే బలవంతంగా కట్టెర్రజేసాయి. నిజం చెబుతున్నాను. ఈ బలవంతం ఈ అధికృత అసహ్యం మనిపిస్తోంది" అన్నది.

వుపేంద్రు డేమీ మాట్లాడలేదు. కాని దివాకరుడు తన చివరిమాట అన్నాడు "మన మంచికోసమే వారు అలా నొక్కిచెప్పి వుంటారు."

కిరణ్మయి మండిపడింది. "అలాంటి మంచితనం ఏమి అవసరం బాబూ! వారే మనుష్యులైనట్టూ, తక్కిన దేశవాసులంతా పశువులైనట్టూ, వారిని దారికి తీసుకురావటానికి అవతరించినట్టు వున్నది. తన మంచి, తనబాగు ఎవరు కోరుకోరు? నచ్చజెపితే చాలు, సరిపోతుంది. ఇలాచేస్తే మంచీ, ఇలాచేస్తే చెడూ అని వారు చెప్పలేరూ? ఈ దారిని నడిస్తే మనకు మంచని వారు చెప్ప లేరూ? దానికోసం ఇలా కంట్లెర్ర జేయటం, ఇంత మిథ్యాడంబరం పన్నే అవసర మేముంది?" అని ఆమె వుగ్రురాలై పోయింది.

వుపేంద్రునికి ఒక్కసారి ఆ మొదటి రాత్రి సంగతి జ్ఞాపక మొచ్చింది. అదేమూర్తి! బోనులోనున్న ఆడసింహంలాగా అదే గర్జన! ఆఖరికి ఈమెకు కావలసిందేమిటి? ఎవరిమీద ఈమె కింత క్రోధం? శాస్త్రాలనుండీ, శాస్త్ర కారులనుండీ ఈమె ముక్తి పొంద దలచుకుందా?

ఆమెను నెమ్మది పరచాలనే వుద్దేశంతో వుపేంద్రుడు వినయంగా చిరునవ్వుతో "నీ సవాళ్లకు మేమిద్దరమూ జవాబు చెప్పలేనంత మాత్రాన, ఇంకెవరూ చెప్పలేరనుకో వద్దు. ఆవిడ ముందు మీరుకూడా తర్కంలో తల ఒగ్గవలసి వస్తుందని నే ననుకుంటున్నాను" అన్నాడు.

కిరణ్మయి తన వుత్తేజనను తెలుసుకొని లోలోన సిగ్గుపడింది. ఆమె కూడా చిరునవ్వుతో "ఆవిడ ఎవరు? చెబుదురూ!" అన్నది.

ఉపేంద్రుడు గంభీరంగా "మీరు పరిహాస మనుకోవద్దు. నిజం చెబుతున్నాను. ఆవిడను తర్కంలో ఓడించుతాననే ఆశ పెట్టుకోవద్దు. ఎక్కువగా ఆమెకు చదివే అవకాశంకూడా చిక్కలేదు. కాని తర్కనిపుణత ఆమెలో చాలవుంది. ఈవిషయాలంటే ఆమెకు చాలా యిష్టంకూడాను. అం మీరు ఆమెను ఓడించితే ఆప్పుడనుకుంటాను" అన్నాడు.

కిరణ్మయి ఉత్సాహంతో "ఓడించలేకపోయినా కొంత నేర్చుకుంటాను" అని చిరునవ్వునవ్వి "అసలు ఎవరేమిటి ఆమె? మాచెల్లెలు కాదు గదా?" అన్నది.

ఉపేంద్రుడు నవ్వి "అవును. ఆమే. నిజంగా ఆమెలో అద్భుతమైన ఆలోచనాశక్తియున్నది. ఆమె తర్కబుద్ధినిచూచి అప్పుడప్పుడూ నేనుకూడా నోరు మెదల్పలేను. ఏమి సమాధాన మివ్వటానికీ, ఏమి ప్రశ్న వెయ్యటానికీ కూడా తోచదు" అన్నాడు.

ఉపేంద్రుని నోట సురబాల ప్రశంస విని కిరణ్మయి ముఖదీప్తి నల్లబడి పోయింది. ఆమె ఈవిషయాన్ని ఇంకా పొడిగించాలనుకున్నది. కాని ఈర్ష్యాగ్ని ఆమె శరీరమంతటా ఆవరించి గొంతు పిసికినట్లు చేసింది. ఏమీ మాట్లాడలేక పోయింది.

కాని ఉపేంద్రుని ధ్యానం అటుపోలేదు. "ఈ విషయంలో ఆమెతో మీ కెప్పుడూ చర్చ జరుగనట్టున్నది" అన్నాడు.

కిరణ్మయి తలకాయ వూగించి "లేదు. ఆమె ఇక్కడ వున్నది రెండు రోజులేగా. అదీగాక సావకాశంగా మాట్లాడుకునే సమయంకూడాకాదు. పదండి, ఇవ్వాళ ఒకసారి మీతర్కవాగీశ్వరిని చూచివద్దాం" అన్నది.

ఉపేంద్రుడు నవ్వి "ఆమె తార్కికురాలేమీ కాదు వదినా! అసలు ఆమె ఈవిషయంలో తప్పితే ఇం కే విషయంలోనూ తర్కించలేదు. మీరు చెప్పినట్లల్లా వప్పుకుంటుంది. రెండు మూడు రోజు లున్నతర్వాత ఇంటికి వెళ్లిపోతుంది. కావాలంటే ఇక్కడికే తీసుకొస్తాను" అన్నాడు.

కిర్మణయి ఆతురతతో "వద్దుబాబూ! వద్దు. ఇక్కడికి రప్పించి నే నామెను కష్టపెట్ట దలచలేదు. ఇక్కడవున్న రెణ్ణాళ్లూ ఆమె పడిన కష్టాలు చాలు. ఆమెను ఇంకెక్కువ కష్టపెట్టదలచలేదు. అదే నా మహాభాగ్య

మనకోవచ్చును. నన్ను తీసుకెళ్లండి, నేనే వస్తాను. అయితే అలాంటి తార్కిక గురువును వుంచుకుని కూడా మీ అన్నదమ్ము లిద్దరూ నామాటలకు సమాధాన మెందుకు చెప్పలేక పోయారు?" అన్నది.

కిరణ్మయి ఈమాటలు మామూలు పరిహాసంతోనే అన్నది. కాని ఆమె అంతర్వేదనవల్ల చివర మాటలు కొంచెం కఠోర మనిపించినాయి వుపేంద్రునికి.

దివాకరుడు మెదలకుండా వూరుకున్నాడు. "లేదు వదినా. ఆమె యుక్తులన్నీ నేర్చుకోలేము. ఎన్ని సార్లు విన్నా వాటిని హృదయంలో వుంచుకోలేక పోయాను. భగవంతుణ్ణి నమ్మేవారు ఇది ఆగని ప్రసాదమే అంటారు. నిజం చెబుతున్నాను. వదినా! నాకు అనేకసార్లు ఈర్ష్య కలిగింది. దాని సహస్రభాగాలలో ఒకభాగం దక్కినా ధన్యుణ్ణయ్యేవాణ్ణి!" అన్నాడు వుపేంద్రుడు.

వుపేంద్రుడు ఏమి చెప్పి పోయాడో కిరణ్మయి సరిగ్గా తెలుసుకోలేక పోయినా ఆమె మొహం ఒక్కసారి నల్లబడి పోయింది. కాని వెంటనే తెలుసుకొని ఒక చిన్న చిరునవ్వు చాటున దాచుకోవా లనుకుంది. కాని ఎంత ప్రయత్నించినా ఆమె పెదవులమీద చిరునవ్వు రేఖ లగపడ లేదు.

ఆమె దిగ్గున లేచి నుంచుని "పదండి బాబూ! ఇవ్వాళే ఆమెను కలుసుకు వస్తాను. మీకు కూడా ఈర్ష్యకలిగించేంత తెలివితేటలు గల ఆవిడను నేను చూడలేకుండా వుండలేను" అన్నది.

ఆమె ఆగ్రహాధిక్యతచూచి వుపేంద్రుడు తన నవ్వును ఆపుకోలేక పోయాడు. కిరణ్మయి ఈర్ష్య లేకపోతే గంభీరంగా వుండేదేమో! కాని ఆవైపు ఆమెధ్యాసమే పోలేదు. "లేదు బాబూ! మీకు నమస్కారంచేస్తాను. తీసుకెళ్ళ" అన్నది.

వుపేంద్రుడు విసుగుతో చేతులురెండూ నెత్తినపెట్టుకొని "రామ, రామ! అటువంటిమాటలు నోటివెంట రానియ్యకు వదినా. మీరు వయసులో చిన్నయినా వరుసకు పెద్ద. సరే, పిన్నిని తిరిగి రానియ్యండి. మిమ్మల్ని ఇవ్వాళే తీసుకెళతాను" అన్నాడు.

---

# ౨౫

మధ్యాహ్నం ఝామలకు కిరణ్మయి జ్యోతిష్ బాబుగారింటికి చేరుకుంది. తెల్లని ముతకబట్ట కట్టుకుంది. వంటిమీద నగలేమీ లేవు. రేగిన వెంట్రుకలు మొహంమీద పడుతున్నాయి. వుదాసీనవదనంతో వుంది. ఆమె శరీరమంతటా అలౌకిక వైధవ్యసామ్రాజ్యం మూర్తీభవించియున్నది. మొహంవంక చూడగానే కళ్ళు పాదాలకేసి వంగిపోతున్నాయి. సరోజిని బైట వసారాలో బల్లమీద కూర్చుని పుస్తకం చదువుకుంటూవుంది. తల పైకెత్తగానే ఈ అమంగళరూపం జూచి ఒక్కసారి వ్యాకులపడింది. కిరణ్మయి నెప్పుడూ ఆమెకంటితో చూడలేదు. ఆమె పేరు మాత్రం విన్నది. సురబాల నోటి వెంట ఆమె సౌందర్యప్రశంస విన్నది. కాని ఆ సౌందర్యం ఇలావుంటుందని ఆమె ఎప్పుడూ వూహించి ఎరుగదు.

వుపేంద్రుడు ఆమెను పరిచయం చేశాడు. "మావదిన సరోజినీ!"

సరోజిని దగ్గరకువచ్చి నమస్కరించింది.

కిరణ్మయి ఆమె చేయిపట్టుకుని చిరునవ్వుతో "నీపేరు అందరూ చెబుతూవుండేవారు. ఇవ్వాళ కళ్లారా చూట్టానికి వచ్చాను అమ్మా!" అన్నది.

సరోజినికి ఏమి మాట్లాడటానికీ తోచలేదు. కొత్తమనుషులను కలుసుకోటం, మాట్లాడటం ఆమెకు చిన్నప్పటినుంచీ అలవాటే. అయినా ఆమె ఈ విధవస్త్రీముందు నోరు మెదల్పలేకపోయింది.

కిరణ్మయి ఒకసారి వుపేంద్రుని వైపు తిరిగి చూచి "ఇవ్వాళ ఎక్కువ సమయం లేదు తీరిగ్గానుంచోడానికి. పద బాబూ, ఒకసారి చెల్లెల్ని చూచి వస్తాను" అని ఆమె సరోజిని చెయ్యి పట్టుకొని సైగచేసింది.

రెండురోజుల పరిచయంతోనే - సురబాల విద్యాబుద్ధులను ఇంతగా పరీక్షించటం, వాదవివాదా లాడటం, మంచిదికాదని ఆమె వచ్చేటప్పుడు దారిలోనే నిశ్చయించుకున్నది. లోకు లేమంటారు? నా యీ వ్యవహారం చూచి అందరూ నవ్వుతారు. అందుకని ఈవిషయంలో ఏమీ చర్చించకుండానే తిరిగి వెళ్లడం మంచిదనిపించింది. కాని తిరిగి వెళ్లలేకపోయింది. ఎవరో ఆమెను బలవంతంగా ఆపినట్టు ఆగింది.

వుపేంద్రుడు ఇంత పొగడుకుంటూ గర్వపడుతున్న తన ప్రియపత్నిని కిరణ్మయి ఏమీ కాదనుకున్నది. ఆమె ఎంత తెలివిగలదైనా నేనొక్క మాటలో ఓడించివేస్తాను. అతనిముందే ఆమె విజ్ఞానాన్నంతా ధూళిలాగ ఎగర గొట్టివేస్తాను. ఆమె హృదయంలో ప్రతిహింసలాగ రగులుతూన్న ఈ కోర్కెను ఆమె ఎన్నివిధాల ప్రయత్నించినా అణచుకో లేకపోయింది. సతీశునివల్ల కలిగిన పరిచయంతో వుపేంద్రుడు తన ప్రశ్నలకు, తన యుక్తులకు సమాధానం చెప్పగలడని నమ్మింది ఆమె. కాని అతనేమీ చెప్పలేదు. చిరునవ్వు నవ్వి వూరుకున్నాడు. ఎందుకలా చేశాడు? సురబాల ముందుకు తీసి కెళ్ళి నన్నొక్కసారి హీనురాలిని చెయ్యటానికా? ఒకవేళ సురబాలకూడా ఏమీ సమాధానం చెప్పకుండా ఒక చిరునవ్వు నవ్వి వూరుకుంటే ఏమి చేస్తాను?"

ఇలా ఆలోచించుకొంటూ ఆమె సరోజిని వెనువెంట సురబాల గది లోనికి వచ్చింది. వీరంతా వస్తున్న సంగతి ఆమెకు తెలియదు. బల్లమీద కూర్చుని ఆమె మహాభారతంలోని భీష్ముని శరశయ్యాఘట్టం చదువుతూ కన్నీరు కార్చుతూ వుంది. కిరణ్మయిని చూడగానే తటాలున పుస్తకం మూసి కళ్లు తుడుచుకొని లేచి నుంచున్నది. ఆమె కిరణ్మయి చేతులు రెండూ పట్టుకొని ఆదరంతో "రా అక్కా!" తీసుకొచ్చి చాపమీద కూర్చోబెట్టి— "నేను రేపు మీయింటికి వద్దామనుకుంటున్నాను" అన్నది.

"అందుకని నేను ఇవ్వాళే వచ్చాను. అక్కా!" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు ఒక కుర్చీ దగ్గరకు లాక్కుకూర్చుని "ఏడుస్తున్నావా ఏమిటి? మహాభారతమేనా అది?" అన్నాడు.

సురబాల సిగ్గుపడి పయటచెంగుతో మళ్లా కళ్లు తుడుచుకోసాగింది.

"ఈ పాతపుస్తకాలమీద పడి కాలాన్నంతా ఎందుకు వ్యర్థపరుచు తున్నావో నాకు అర్థంకాకుండా వుంది. ఇంకా పైగా ఏడవటం, తుడుచు కోవటం........" ఇంకా మాట పూర్తికాకముందే సురబాల కళ్ళు తుడుచుకోటం వదిలిపెట్టి క్రోధంతో "ప్రతిసారీ ఈ మామాటలే ...?" అన్నది.

"ఏమున్నాయి. అంతా అసత్యపూరితమైంది, అంటున్నాను. ఇంకే మనటంలేదు" అన్నాడు వుపేంద్రుడు.

అలాంటిమాటలంటే కోపం రావటానికి ఆమెకు ఎక్కువసేపు పట్టదు. ఎర్రటి కళ్ళతో భర్తకేసి మిరిమిరిచూచి "మహాభారతం అసత్యమా? ఎప్పుడూ అటువంటి మాటలు నోటివెంట రానివ్వకు. ఇది పరిహాసం కాదు. అలాంటి మాటలు నోటివెంట వచ్చినా పాపమని తెలియదూ?" అన్నది.

"తెలుసు, ఏమీలేదని.' ఇంకా వీరినడుగు. వీరికూడా నమ్మకంలేదు" అన్నాడు వుపేంద్రుడు.

ఈసారి సురబాల కిరణ్మయి మొహంకేసి చూచి నవ్వి "విన్నావా అక్కా, నువ్వు మహాభారతాన్ని నమ్మవట. నీరు ఎలా మాట్లాడతారో చూడు. వీరికి కొంచెం నచ్చజెప్పాలి" అన్నది.

కిరణ్మయి మాట్లాడలేదు. దంపతులలోని ఈ వాగ్వివాదం ఆమెకు అర్థంకాలేదు. తన్ను గురించే ఈ నాటకం ఆడుతున్నారనిపించింది.

వుపేంద్రుడు సరోజినిని పిలిచి "అయితే, మహాభారతంలో కథను నీవు నిజమని నమ్ముతావా?" అన్నాడు.

సరోజిని వినయంగా "కొంతవరకు యథార్థమని నేనూ నమ్ముతాను. కాని మొదటినుంచి చివరివరకు యథార్థమంటే ఎవరూ వప్పుకోరు. నేనూ వప్పుకోను" అన్నది.

సురబాల మొదట మెదలకుండా వూరుకుంది. తర్వాత ఆమె ఈ మాటను పరిహాసంకింద తోసివెయ్యాలనుకుంది. కాని సరోజిని మరి రెండు మూడు మాటలనటం, వుపేంద్రుడు తాళంవెయ్యటం చూచి ఆమెకు ఆశ్చర్యం కలిగింది. చూస్తూ చూస్తూవుండగానే ముగ్గురిలో వాదవివాదాలు పెరిగిపోయినవి.

ఇంతవరకు కిరణ్మయి ఒక్కమాటకూడా మాట్లాడలేదు. ఈవాద వివాదాలలో పరిహాసం తప్ప మరేమైనా వుంటుందని ఆమె నమ్మలేకపోయింది. తను వాదవివాదాలు చేద్దామనుకొని వచ్చిన వ్యక్తి మహాభారతమంతా అఖండ సత్యమని నిర్ధారణ చెయ్యటానికి నడుంబిగించుకు కూర్చుంటే అలాంటి అచింత నీయ విషయాన్ని ఆమె ఎలా అంగీకరించుతుంది. ఇటు వాదవివాదాలు బాగా

సాగుతున్నాయి. అటు ఆమె మెదలకుండా సురబాలకేసి తీక్షణదృష్టితో చూస్తూవుంది. చూస్తూచూస్తూవుండగానే ఆమె సందేహరాశి ఆవిరిలాగ లీన మైపోయింది. సురబాల కంఠస్వరంలోనూ, చూపులోనూ, వదనంమీదా, ఒకవిధంగా శరీరమంతటినిబట్టి చూస్తే దానిలో కాపట్యం అనుమానం లేనట్టుకనపడింది ఆమెకు. ఇంత పెద్దగ్రంథం ఆమెదృష్టికి యథార్థం! ఇది నవ్వు కాదు, పరిహాసం కాదు. ఇది ప్రత్యక్ష జీవిత విశ్వాసం. తర్వాత కొంత సేపటివరకు ఎవరు ఏమి అంటున్నారో ఆమెకేమీ అంతుపట్టలేదు. ఆమె ఒక కొత్త ఆకర్షణ సురబాలలో చూడసాగింది.

కాని ఆమె ఈవిధంగా ఎంతసేపు వుండగలిగేదో చెప్పలేం. వుపేంద్రుడు, సరోజినీ ఒక్కసారి పకపక నవ్వేప్పటికి తమాయించుకు చూచింది. ఈ నవ్వుతో సురబాల తెల్లబోయింది. పాప మామె ఒక్కతే. అందుకనే ఆమె కిరణ్మయిని మధ్యవర్తిగా ఎన్నుకొని క్రోధస్వరంతో "అయితే అక్కా! ఇది ఎప్పుడైనా అసత్యమౌతుందా?" అన్నది.

వుపేంద్రుడు కిరణ్మయివంక చూచి నవ్వు ఆపుకొని "తర్క విషయ మేమిటంటే; భీష్ముడు శరశయ్యయందున్నపుడు అర్జునుడు బాణాలతో పృథివిని చీల్చి గంగాజలం తీసుకొచ్చిన సంగతి అబద్ధమంటుంది సరోజిని. అలా ఎక్కడైనా జరుగుతుందా వదినా?" అన్నాడు.

సురబాల భర్తమొహంకేసి తీవ్రదృష్టితో చూచి "తీసుకురాకపోతే చెబుతాను విను. భీష్మ పితామహుడు శరశయ్యమీద పరుండియుండి జల మడి గాడు. దుర్యోధనుడు సువర్ణకలశంతో తీసుకొచ్చి యివ్వబోయాడు. కాని అతను ముట్టుకోలేదు. ఇది అసత్యం కాదుగా? ఒకవేళ గంగాజలం రాకపోతే అతని దప్పి ఎలాతీరుతుంది?" అన్నది.

ఈమాట విని సరోజిని మెదలకుండా వుండలేక పోయింది. "ఎలాగ? వారి దప్పి తీరితే కలశం నీటితోనే అతను దుర్యోధనుడు కలశంతో తెచ్చిన నీటినే త్రాగాడు" అన్నది.

సురబాల మరింత వుత్తేజంతో క్రోధితురాలై "అయితే తాగలేదని ఎందుకు రాశారు! అతను కలశం నీటిని తాగితే అర్జునుడు ఇంత కష్టపడి బాణంతో పృథ్విని ఛేదించి గంగాజలం తీసుకొచ్చే అవుసరమేముంది? నువ్వు

చెప్పు అక్కా! ఇది అసత్యం ఎప్పటికీ కాదు" అని ఆమె కరుణానేత్రాలతో కిరణ్మయి కేసి మాచి సమాధానం కోసం బలవంత పెట్టింది. వెంటనే ఉపేంద్రుడు గది మారుమోగేట్టు నవ్వాడు. సరోజిని కూడా పకపక నవ్వింది.

"చెప్పు, వదినా చెప్పు. అర్జునుడు గంగాజలం తీసుకురాకపోతే దప్పెలా తీరిందో చెప్పు? దప్పి తీరిన తర్వాత గంగాజలం ఏల రాలేదు?" అని మళ్ళీ పకపక నవ్వాడు ఉపేంద్రుడు.

కాని ఆశ్చర్యం! కిరణ్మయి ఈనవ్వులో పాల్గొనలేకపోయింది. ఆమె ఆశ్చర్యంతో సురబాల మొహంకేసి చూస్తూ వుండిపోయింది. క్షణంసేపుండి ఆవేగంతో ఆమె నొక్కసారి కౌగిలించుకొని "అసత్యం కాదు అక్కా! దీనిలో కించిత్తు కూడా అసత్యంలేదు. గంగాజలం తీసుకొచ్చినమాట యథార్థం. నీవు చదివింది, గ్రహించింది అంతా సత్యమే. సత్యాన్ని అందరూ గుర్తించ లేదు. అందుకనే లోకులు నీమాటలు విని నవ్వుతారు" అంటూ అంటూ వుండ గానే ఆమె రెండు కళ్ళనిండా నీరు తిరిగాయి.

సరోజిని ఉపేంద్రుడు ఇద్దరూ ఆమె మొహంకేసి చూడసాగారు. కాని కిరణ్మయి వారివైపు ఒక్కసారికూడా చూడలేదు. ఆమెనలాగే కౌగి లించుకొని కళ్ళుతుడుచుకుంటూ "ఇవ్వాళ నీవుచేసినటువంటి మీమాంస ఏధర్మగ్రంథమూ, ఏ విద్వాంసుడుకూడా చేయలేదని ధర్మగ్రంథాలు చదివిన వారికి తెలుసు. వారుకూడా ఈవిధంగానే తన మనసులోనిమాట చెప్పవలసి వచ్చింది. ఈసంగతి తెలిసినవారెవరూ నీమాటవిని నవ్వలేరు" అని ఆమెను వదలి సరోజినికేసి చూస్తూ, "నా మాటలుచూచి నీకు ఆశ్చర్యమేస్తుందా సరోజా? ఆశ్చర్యపడవలసిన సంగతే" అని ఆమె చిరునవ్వు నవ్వుకుంది.

కాని అందరికంటే ఎక్కువ ఆశ్చర్యం కలిగింది ఉపేంద్రునికి. అతను కిరణ్మయిలో కలిగిన ఈ ఆకస్మిక భావపరివర్తనకు కారణం పూర్తిగా తెలు సుకోలేకపోయాడు. కొద్దిసేపటి ముందు సత్యాసత్యవిచక్షణ తెలివితేటలతో తప్ప మరేవిధముగానూ తెలుసుకోలేము. అలా తెలుసుకోలేని విషయం వప్పుకోనటంకూడా అనవసర మనుకున్న వ్యక్తి ఇప్పుడు తెలివితక్కువ సుర బాల మాటలకు ఎలా కరిగిపోయింది? ఆమెను కౌగిలించుకొని అన్నమాటలు మొహంఎదుట అన్నమాటలు కావు. అదీగాక తను అన్న మాటల వుద్దేశం

సురబాల తెలుసుకోలేదని కిరణ్మయికి బాగా తెలుసు. అయితే ఆమె కళ్ళల్లో ఇలా నీరు ఎందుకులిరిగింది? అని ఆలోచించుకొని వుపేంద్రుడు చాలా ఆశ్చర్యం పడ్డాడు. మరో విషయముంది. ఇలాంటి తీక్ష్ణబుద్ధిగల స్త్రీలు ఏస్థితిలోనుకూడా ఆవేశం కనపర్చరనీ, ఏదోవిధంగా కనపడితే వారినిగ్గుకు అంతం వుండదనీ వుపేంద్రునికి తెలుసును. తన వ్యవహారానికి ఆమె కించిత్తు కూడా సంకోచపడలేదన్న విషయం ఏమీ తెలియని సరోజిని కూడా గ్రహించింది.

సాయంత్రమైంది. కిరణ్మయి అందరివద్దా సెలవుతీసుకొని మెల్లగా బండీలోనికి వచ్చి కూర్చుంది.

దివాకరుడు ఇంట్లోలేడు. షికారుకు స్టేటికి వెళ్ళాడు. అందుచేత వుపేంద్రుడు లోపల వంటరిగా కూర్చోవలసి వస్తుంది. కాని కిరణ్మయికి అటుధ్యానం పోలేదు. బండీలో ఒకమూల స్తబ్ధురాలై కూర్చునివుంది.

కొంతసేపు గడచిపోయింది. ఈ విధంగా మెదలకుండా కూర్చోటం కూడా బాగుండలేదు. కిరణ్మయి ఏదో ఆలోచించుతూ వుంటుందని వుపేంద్రునికి గట్టిగా తెలుసు. కాని ఏమి ఆలోచించుతూ వుందో తెలుసుకోటానికి "చూస్తున్నావుగా వదినా! ఎంత తెలివిగల ఇల్లాలుతో కాపరం చెయ్యవలసి వస్తోందో? అసలే ఈ విషయంలో ఎవరిమాటా వినదు. దాని మీద మీరు నవ్వుతూ నవ్వుతూ ఇచ్చివచ్చిన సర్టిఫికెట్టుతో అసలే వినదు" అన్నాడు.

కిరణ్మయి దీని కేమీ సమాధానం చెప్పలేదు. వుపేంద్రుడు కొంచెం సేపు సమాధానం కోసం ఎదురుచూచి చిరునవ్వుతో "ఇంతేకాదు వదినా! ఎంత తెలివితక్కువ దనుకున్నా - ప్రాణముండగా ఎప్పుడూ అబద్ధమాడదు" అన్నాడు. కిరణ్మయి అలాగే మౌనంగా వూరుకుంది. "ఎందుకు అబద్ధమాడదో తెలుసా? ఒకటీ-ముప్పైమూడుకోట్ల దేవతలూ ఆమె నెప్పుడూ ముట్టడించివుంటారు. అదీగాక ఎప్పుడూ మాడని విషయాన్ని గురించి బుద్ధి నుపయోగించి ఆలోచించుకునే శక్తి ఆమెలో లేదు" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి దుగ్ధకంఠంతో క్లుప్తంగా "మంచిదేగా" అన్నది.

"నేనలా అనుకోను. గృహస్థాశ్రమంలో ఒకటి రెండు అబద్ధాలు ఆడవలసి వస్తుంది. ఎవరికి అపకారం, హానీలేని అబద్ధం ఒకటి ఆడితేమాత్రం

తప్పేమున్నది? అలాంటప్పుడు అబద్ధమాడినా తప్పు లేదంటాను నేను" అన్నాడు ఉపేంద్రుడు.

"మంచిదే, కాని ఈ సంగతి ఆమెకు నేర్పలేకపోయారా?"

"చదివింది ఎలా నేర్చుకుంటుంది? ఒక చిన్న అబద్ధంకోసం యుధిష్ఠిరునికి కలిగిన దుర్గతి మహాభారతంలో వ్రాసివుంది. దేవతాగణమంతా కళ్ళు తెరచుకొని చూస్తున్నట్లు ఎరుగుండికూడా ఆమె అబద్ధమాడగలదా? తక్షణమే ఆమెను నరకంలో ముంచరూ!" కొంచెం ఆగి "ఆమె రెప్పవాల్చి ఈశ్వర రూపాన్నికూడా స్పష్టంగా చూడగలదు. ఒక్కొక్కప్పుడు డాల్-కత్తులతోనూ, ఒక్కొక్కప్పుడు శంఖచక్రాలతోనూ, ఒక్కొక్కప్పుడు మురళి చేతపట్టుకుని ప్రత్యక్షంగా ఆమె ముందు నిలబడతారు. ఈ మాటలు వింటూంటే నావళ్లు పులకరించుతుంది. ఈ మాట ఇంకెవరైనా అంటే ఒట్టి గప్పాలనుకుని నవ్వులాటకింద కొట్టేసేవాణ్ణి. కాని ఆమె విషయంలో నేనలా చెయ్యలేను......" అంటూవుండగానే ప్రేమ, శ్రద్ధ, ఆదరాలలో కరగిపోయి ఉపేంద్రుని గొంతు నిండు కొచ్చింది. అతను క్షణంసేపుండి మళ్లా కుతూహల స్వరంతో "ఇదంతా చూస్తూంటే ఆమెను మనిషి అనేకంటే పశువంటే ఎక్కువ సమంజసంగా వుంటుంది. చిన్నప్పుడు ఆమెకు పశురాజా అని పేరు పెట్టినవారి తెలివితేటలకు సంతోషించాలి" అన్నాడు.

బండి మలుపు తిరిగేప్పుడు కన్నీటితో తడిసిన కిరణ్మయి మొహంచూచి ఉపేంద్రుడు త్రుళ్లిపడ్డాడు.

ఉపేంద్రుడు సిగ్గుతో తల వంచుకున్నాడు. ఆనందమాధుర్యంలో మగ్నమై ప్రేమతో ఎదురుగా కూర్చుని ఎవరితో పరిహాస మాడుతున్నాడో ఆమె ఏవ్యథతో కన్నీరు కార్చుతూవుందో తెలుసుకోలేక పోయాడు.

పథరియాఘట్టా ఇంటికి చేరుకునేప్పటికి రాత్రి రెండున్నర గంటలైంది. కిరణ్మయి దారిపొడుగునా నోరుమెదల్చలేదు. ఇంట్లోకివచ్చి కొంచెంసేపున్న తర్వాత, తలవని తలంపుగా ఆమె అత్యంత అనుతప్త కంఠంతో "నాబుద్ధి బుగ్గిగాను. అనవసరంగా తిరుగుతా సెందుకు? మీరు ఇంతవరకు గుక్కెడు నీళ్లుకూడా మింగలేదు. నాకు అటుధ్యాసమే పోలేదు. త్వరగా కాళ్లు చేతులు కడుక్కుని వంటింట్లోకిరండి. గబగబా నాలుగు పూరీలువేస్తాను"

అని "త్వరగా పొయ్యి రాజేసి మరీపో ఇంటికి. మాదాది మంచి తెల్లివైంది" అన్నది పనిగత్తెతో. అది తలుపువేసి ఇంటికి వెళ్లబోతూవుంది హుకుం జారీ అయ్యేసరికి ఆమె మళ్లా పైకి వెళ్లవలసి వచ్చింది. తలవాకిలి వేసి ఆమె త్వరత్వరగా పైకి వచ్చింది.

నాలుగుపూరీలు వేస్తాననటం విని వుపేంద్రుడు గాబరాపడి "ఏమీ అవసరంలేదు వదినా! ఇన్నాళ్ళ నువ్వు చాల అలసిపోయావు. నేను మళ్ళా వెళ్ళి తింటాను. నాకోసం నీవేమీ కష్టపడ నవసరంలేదు" అన్నాడు.

"ఎందుకని?"

"వద్దు వదినా. ఏమీ అవసరంలేదు."

కిరణ్మయి మొహం తిప్పుకొని చిరునవ్వుతో "నీకు కీర్తిదాహం మహా వుంది బాబూ! ఇంతకీర్తి నార్జించి ఎక్కడ దాస్తావు?" అన్నది.

ఆకస్మికంగా వచ్చిన ఈపొగడ్తవాక్యాలకు కారణం తెలుసుకోలేక వుపేంద్రుడు కొంచెం ఆశ్చర్యపడ్డాడు. "నిజం చెబుతున్నాను, నీ పరోప కారకీర్తికి స్వర్గ, మర్త్యలోకాలలో ఎక్కడా ఎదురులేకుండా నిస్వార్థంగా నిర్లిప్తంగా వుండాలి. నీవు మాకోసం చేసిన మేలుకి నాహృదయం చీల్చుకొని హృదయరక్తంతో నీపాదాలు కడిగినా నువ్వేమీ కాదనకూడదు. కాస్త ఫలహారం తయారుచేస్తాననేటప్పటికే తలతిప్పుతున్నావు. ఛీ! నువ్వు మమ్మల్ని ఇంత నీచు లనుకున్నావా? నువ్వు మమ్మల నే మనుకుంటున్నావు బాబూ? మేము మనుష్యులం కామా? మనుష్యులరక్తం మా శరీరాల్లో లేదా?" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు మరింత సిగ్గుపడి "నేను అలాంటి విషయమేమీ ఆలోచించుకు కాదనలేదు వదినా. నేను వూరికినే......" అన్నాడు.

"వూరికే ఏమిటిబాబూ? ఇంటికివెళ్ళే తొందరలో ఏమి అన్నావో కూడా అంతులేదూ?"

వుపేంద్రుడికి ప్రాణాల్లో ప్రాణాలొచ్చాయి. పరిహాసం మళ్ళా సరైన దారిలోనికి వచ్చింది. "అపవాదుకు నాకేగా వదినా. ఇది కాదనలేను. ఇప్పుడు అదేమీ కాదు. నేను వాస్తవంగా నువ్వు అలసిపోయా వనుకున్నాను" అన్నాడు చిరునవ్వుతో.

"అలసిపోయానా? అయివుండవచ్చు........." అని కిరణ్మయి మళ్ళా చిరునవ్వునవ్వింది. మళ్ళా అంతటిలోనే గంభీరురాలై "ఇవ్వాళ మాసతీశబాబు వున్నట్టయితేనా ఈవిషయమేమీ నానోటితో చెప్పవలసి వచ్చేదికాదు. నాసంగతులన్నీ వేయినోళ్ళ చెప్పేవాడు. లేదుబాబూ. అలసిపోయానని వంకపెట్టుకొని విశ్రాంతిగా కూర్చోలేను నేను. అదీగాక హిందూ గృహాలలో ఏ స్త్రీకీకూడా ఈఅపవాదు కూడదు. అయినా వారికిగాని, పరాయిమగవారెవరికైనా వేళకు తిండిపెట్టలేకపోతే దీని నెవరైనా ఎత్తిపొడిస్తే చితిమీదనున్న హిందూస్త్రీకూడా లేచికూర్చుంటుంది. తెలుసునా బాబూ!" అన్నది.

ఉపేంద్రుడుకూడా ఈసారి చిరునవ్వుతూ "తెలుసు వదినా! బాగా తెలుసు. పొరపాటు జరిగింది. క్షమించు. ఆకలికూడా అయింది. పద, ఏమి పెడతావో" అన్నాడు.

"రా" అని దారిచూపించి కిరణ్మయి వంటింటికేసి వెళ్ళింది అత్తగది ముందుకువెళ్ళి ఒకసారి తొంగిచూచింది. ఆమెఅంతులేకుండా నిద్రపోతూవుంది.

వంటింట్లోకి వెళ్ళి పీటవేసి సతీశుణ్ణి కూర్చోబెట్టినట్లే ఆమె ఇవ్వాళ ఉపేంద్రునికూడా కూర్చోబెట్టింది.

పనిమనిషి పొయ్యి రాజేసి ఇంకా అవసరమైన సామాను దగ్గరబెట్టి బైటికి వెళ్ళిపోయింది. కిరణ్మయి ఈ రూపంలోవచ్చిన తన క్రొత్త అతిథికేసి చూచి "అయితే కష్టపెట్టవలసివస్తుందని భోంచెయ్యకుండా వెళతానని ఇంకెవరి ముందైనా అంటే నువ్వెంతశిక్ష అనుభవించవలసివచ్చేదో తెలుసా బాబూ?"

"తెలుసు, కాని ఇక్కడ అలాంటి శిక్ష అనుభవించవలసిన భయమేమీ లేదుగా వదినా!" అన్నాడు ఉపేంద్రుడు.

పనిమనిషి పిండిపళ్ళెం పెట్టి వెళ్ళిపోయింది. కిరణ్మయి పళ్ళెం దగ్గరకు లాక్కొని తలకాయ వంచుకునే మృదువుగా "అలా ఎందుకనుకుంటున్నావు? అనుభవించాల్సి వుంటే అనుభవించక తప్పదు. ఎక్కడికి వెళ్ళితే ఏమి అనుభవించవలసి వుంటుందో ఎవరికీ తెలియదు. అదృష్టంలో రాసివుంది యెవరు తప్పిస్తారు బాబూ?" అన్నది.

వుపేంద్రుడు ఈమాటలోని మర్మం సరిగా తెలుసుకోలేక పోయాడు. "అదీ నిజమే వదినా!" అన్నాడు. కిరణ్మయికూడా మళ్లా ఏమీ మాట్లాడ లేదు. కన్నెత్తి ఒకసారి వుపేంద్రునికేసి చూచి పిండి కలుపు కుంటూ వుంది.

ఆమె తలవంచుకుని పిండి కలుపుకుంటూనే కొంచెంసే పున్న తర్వాత "అయితే, ఇవాళ ఇంత ఆడంబరం చేసి అక్కను చూపించటానికి తీసు కెళ్ళిన వుద్దేశమేమిటి? ఇప్పుడు కొంచెం బైటపెట్టి చెప్పు" అన్నది.

"ఆడంబరం నేనేమీ చెయ్యలేదు వదినా!"

"బహుశా చెప్పటంలో నేను పొరపడ్డానేమో. ఇదిగో సరిగా చెబు తున్నాగా - అలాంటి కపటచాతుర్యంతో నన్నెందుకు తీసుకెళ్ళారు?"

"దానిలో నేను చేసిన కపటచాతుర్య మేముంది?" అన్నాడు.

"ఇందే, ఆమె పట్టి మూర్ఖురాలని, వెర్రిదని ఎన్నిమాటలు కల్పిం చావు. ఈ అనవసర విషయాలను గురించి తర్కించుకుంటే ఏమి వస్తుంది? అలాంటి ఇల్లాలిని మూర్ఖురా లనుకుంటున్నా వంటే - ఈవిడ పరిచయంకూడా కొంత వరకు కలుగుతుందిగా. నువ్వు నన్ను చులకనగా మోసపుచ్చగల ననుకుంటున్నావా?" అన్నది కిరణ్మయి.

"లేదు, అలా అనుకోటం లేదు."

కిరణ్మయి తలపైకెత్తి చూచింది. వుపేంద్రుడు అనుకున్నంత క్లుప్తమైన సమాధానం యివ్వలేక పోయాడు. తలవని తలంపుగానే అతని గొంతులోంచి గంభీరమైన స్వరం వచ్చింది. కాని కిరణ్మయి ధ్యానం అటుపోయిందో లేదో తెలుసుకోలేక పోయాడు. ఆమె పరిహాసంగా "తర్వాత!"అన్నది.

వుపేంద్రునికి స్వయంగా తన స్వరంలోని గాంభీర్యం తెలుసుకుని సిగ్గు పడ్డాడు. కాని వెంటనే తమాయించుకొని నవ్వుతూ "నిన్ను మోసపుచ్చటం సామాన్యమైన సంగతా వదినా? అలా చేయకపోతే నేనెంత తెలివి తక్కువ దానితో కాపురం చేస్తున్నానో నీ కెలా తెలిసేది? ఇప్పుడు చూచి వచ్చావుగా?" అన్నాడు.

"చూచివచ్చినందువల్ల నాకేం లాభం కలిగింది?" అన్నది కిరణ్మయి.

"మీకు లేదు కాని నాకు వున్నది. ప్రతివారూ తన దుఃఖాన్ని ఇతరులతో చెప్పుకుని తేలికపడుతూ వుంటారు. ఇది మానవస్వభావం. మోసపుచ్చిగానీ, మరేవిధంగాగానీ కష్టపెట్టి వుంటే మీ దయ నభిలషించిగాని మరే స్వార్థకాంక్షతోనూ కాదు" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి కొంచెంసేపు కదలకుండా వూరుకుంది. తర్వాత తల వంచుకునే "ఇక వినలేను. అబద్ధపు బడాయిలు ఇక ఆపివెయ్యి. తెలివితక్కువదానిని తెలివితక్కువ దనుకుని తక్కువగా ప్రేమించుతూ వుంటే కొంచం సేపటి వరకు నీబడాయి గేయాలు వినగలిగేదాన్ని. దయకూడా కలిగేదేమో. సతీశబాబుద్వారా నేనంతా విన్నాను. మంచిదేగా, బాగా ప్రేమించు. ఇలా దండోరా వాయించుకుంటూ తిరిగితే మంచిదా? సిగ్గుకూడాలేదూ? అన్నది.

ఈమాట విని వుపేంద్రుడు స్తంభించిపోయాడు. అతను ఏమి అనాలో ఏమి ఆలోచించాలో కూడా నిశ్చయించ లేకపోయాడు. ఇదేమి పద్ధతి! ఈ కంఠస్వర మేమిటి! పరిహాసమని దీనిని ఏవిధంగానూ ఒప్పుకోటానికి వీలులేదు. మరి ఇదేమిటి? ఈర్ష్యా! ద్వేషమా? ఈ రాత్రివేళ ఈవిధవ ఏసందర్భ విశేషం నాముందు బైటపెట్టటానికి ప్రయత్నించింది?

ఎవరినోటివెంటా మాటరాలేదు. ఇద్దరూ తలలొంచుకు కూర్చున్నారు.

పనిగత్తె తలుపుబైటనుండి దగ్గి "ఇక వుండలేను అమ్మగారు! కొంచెం తలవాకిలి తలుపు వేసుకోండి, వెళుతున్నాను" అన్నది.

కిరణ్మయి తలపైకెత్తి "వెళుతున్నావా? సరే. కొంచెం కూర్చుని వుండుబాబూ. నేను తలవాకిలి తలుపు వేసివస్తాను" అని వెళ్లగానే గదిలో ఒంటరిగా కూర్చునివున్న వుపేంద్రునికి జీవితంలో ఎప్పుడూ కలగనంతటి సిగ్గూ, ఈర్ష్యా కలిగింది. అతని వుదారచరిత్ర సర్వదా స్ఫటికంలాగ స్వచ్ఛంగా ప్రవహిస్తూవుంది! ఎక్కడా అడ్డుతగలలేదు. ఎప్పుడూ అపవాద ఛాయలు కూడా ఆవరించలేదు. కాని ఇవ్వాళ ఈ ఏకాంతగృహంలో అతని నిర్మలత్వం కొలబడినట్లయింది.

---

# ౨౬

కిరణ్మయి తలుపువేసి వచ్చి మళ్ళా కూర్చున్నప్పుడు ఉపేంద్రుడు తలెత్తి ఆమెకేసి చూడలేకపోయాడు. కిరణ్మయికి ఈసంగతి తెలియక పోలేదు. కాని ఆమెకూడా మెదలకుండా తన పనిపాటలు చేసుకోసాగింది.

ఈవిధంగా పదినిమిషాలు గడచిపోయిన తర్వాత కిరణ్మయి మెల్లగా "అయితే బాబూ! ఎవరైనా చాటుగా మన మీవిధంగా వంటరిగా కూర్చుని వుండటంచూస్తే ఏమనుకుంటారు?" అని మొహం తిప్పుకుని నవ్వసాగింది.

ఈ నవ్వు ఉపేంద్రుడు కంటితో చూడకపోయినా గ్రహించాడు. "అయితే ఏంచెయ్యమంటావు వదినా? ఏవుపాయమూ తోచటంలేదు."

కిరణ్మయి నవ్వుతూ "ఏవుపాయం తోచటంలేదూ? సరే, నేను చెపుతాను. కాని ఒకవిషయం ముందుగానే చెబుతున్నాను. పూటలుచేసి నువ్వు తీసుకునేప్పటికి అరగంటకంటె ఎక్కువపట్టదు. అప్పటివరకు నువ్వు సంతోషంగా మాట్లాడు. ఈవిధంగా మొహం ముడుచుకొని కూర్చోకు" అన్నది.

ఉపేంద్రుడు పక పకనవ్వి "సరే, చెప్పు" అన్నాడు.

కిరణ్మయి మళ్ళీ మొహం తిప్పి నవ్వుకొని "రక్షించావు. వదిన గౌరవాన్ని కాపాడటానికి నవ్వావు. నిన్ను చూస్తూంటే నాకొకసంగతి తోస్తోంది. కాని విన్నతర్వాత పెడర్థంతీసి కోపగించుకోవుగదా!" అన్నది.

"లేదు, ఎందుకు కోపగించుకుంటాను?"

"ఏమి తెలుసుబాబూ! మంచిమంచి కావ్యగ్రంథాలలో చూచీ చూడగానే ప్రగాఢప్రేమ ఏర్పడుతుందని చదువుతాము. నువ్వు అది సంభవ మంటావా?"

రెప్పపాటులో ఉపేంద్రుని మొహం సిగ్గుతో ఎర్రబడిపోయింది. "నాకే కావ్యజ్ఞానమూ లేదు వదినా, అదంతా నాకు తెలియదు" అన్నాడు.

కిరణ్మయినవ్వి "ఏమిటి! అంటావు? ఇంతచదువు చదివి పరీక్షలుపాసయి సర్టిఫికెట్లు పొందావు. కావ్యాలను గురించి ఏమీ తెలియదూ? శకుంతలా, రోమియోజూలియట్ ఈరెండు పుస్తకాలూకూడా చదవలేదూ?" అన్నది.

"పుస్తకాలు చదివి పరీక్షలు పాసవటం ఒకఎత్తు, దానిలో వున్న మంచిచెడ్డలు గ్రహించటం ఒకఎత్తు. పుస్తకాలలోనున్నది నేను వల్లించి పరీక్షలో వ్రాసివచ్చాను. మీలాగ ఏ పరీక్షకుడూ కూడా ఇది సంభవమా; అసంభవమా అన్న ప్రశ్న వెయ్యలేదు. క్షమించు వదినా. ఈవిషయాన్ని గురించి మీతో నేను వాదించలేను" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి వ్యాకులపాటుతో ఒక నిట్టూర్పువిడచి "అందుకనే అడిగాను. విని కోపగించుకోరుగదా అని" అన్నది.

"లేదు, నేను కోపగించుకో లేదు."

"లేకపోవటమే మంచిది" అంటూ కిరణ్మయి మండుతున్న పొయ్యిమీద బూర్లెమూకుడు పెట్టింది.

ఒక్కపెట్టున కిరణ్మయి ఏడెనిమిది పూరీలు తీసి నిట్టూర్చుతూ "నేను తెలుసుకోవా లనుకున్న విషయాన్ని గురించి మీరేమీ చెప్పలేదు. సరే మరోవిషయం అడుగుతాను. లోకులు ప్రేమ గుడ్డిదంటూ రెందుచేత?" అన్నది.

"కళ్లున్న మనుష్యుడుకూడా వెళ్లలేనిదారిని అని తీసుకెళుతుందని కామాను" అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి వుత్సుకతతో "ఏమిటి, నిజంగా తీసుకెళుతుందా? ప్రేమ గుడ్డిదన్న సంగతి నిజమేనా?" అని అడిగింది.

"నిజమే, చాలమంది దాన్ని అలాగే అన్నారు. బహుశా అనుభవంతోనే అనివుంటారు" అన్నాడు వుపేంద్రుడు.

"నిజమే గాబోలు. గ్రుడ్డివాడు గోతిలోపడితే లోకులు వాణ్ణి లేవదీయటానికి పరుగులెత్తుతారు. వానికోసం దుఃఖపడతారు. చేతనైనంతవరకు వానికి సాయంచేయటానికి ప్రయత్నిస్తారు. కాని ప్రేమాంధుడు గోతిలో పడితే లేవదీయటాని కెవరూ పరుగులెత్తరు సరిగదా, కాళ్ళూచేతులూ విరగగొట్టి గోతిలోనే పాతిపెట్టటానికి చూస్తారు. మనుష్యుడు స్వయంగా చేసే సత్య ప్రచారానికి అవసరమైనప్పుడు మర్యాదకూడా కాపాడరు. నామాటలు వింటున్నావా బాబూ!" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు తలకాయ తిప్పి "ఆఁ వింటున్నాను" అన్నాడు.

"వింటున్నావు గనుకనే నిన్ను అడుగుతున్నాను. విన్నాకూడా చాలమంది ఇతరుల విషయం వచ్చినప్పుడు బలవంతాన మర్చిపోతారు. కళ్ళులేనివాడికి కళ్ళున్నవాడు శిక్ష విధించి ప్రయోజకుణ్ణనిపించుకుంటూ వుంటాడు. ఇతరులను గురించి సలహాలిచ్చేవారికి కళ్లు లేకపోతే తాముకూడా ఆ గోతిలోనే పడేసంగతి జ్ఞాపకముండదు."

వుపేంద్రుడు కొంచెం అప్రసన్నుడై ఆశ్చర్యంతో "అలా ఎప్పటికీ కాదు. కాని ఇప్పుడు నీకీసంగతులన్నీ ఎందుకో నాకర్థం కావటంలేదు. నిజమో, అబద్ధమో ఇక నీ జీవితానికి ఈ మీమాంసతో ఏమీ సంబంధం లేదు. ఏమీ సార్థకతలేదు. ఇప్పుడు నువ్వు ఈ నిజానిజాలనుదాటి బైటకు వెళ్ళిపోయావు" అన్నాడు.

కిరణ్మయి వుపేంద్రుని అప్రసన్నత చూచికూడా చిరునవ్వునవ్వి "గుడ్డివాడు ఆలోచించి గోతిలోపడడు. పడి ఆలోచించడు. నేను గోతిలోనూ పడలేదు, పడటానికి ఆ వైపుకూడా వెళ్ళలేదని నీకెలా తెలిసింది?" అన్నది.

"నువ్వు గుడ్డిదానివని ఎవరూ అనరు. నేను నీ నేత్రాలను స్పష్టంగా చూచాను వదినా!" అన్నాడు వుపేంద్రుడు.

"అదే కష్టం! లోకంలో రెండురకాలైన గుడ్డివాళ్ళుంటారు. కళ్ళు లేనివారిని గురించి వేరే ఆలోచించ నవసరంలేదు. వారు స్పష్టంగానే కనపడుతూ వుంటారు. కాని కళ్ళురెండు వున్నాకూడా స్పష్టంగా చూడలేని వాళ్ళని గురించే ఈ గందరగోళమంతాను. వారు తమ్ము తాము మోసగించుకుంటారు. ఇతరులను మోసగించుతారు" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు కొంచెం సిగ్గుపడి కదలకుండా కూర్చున్నాడు. అతని దగ్గరనుండి సమాధానం రాకపోయేటప్పటికి కిరణ్మయి ఒక్కసారి వుత్సుకురాలై "అయితే నువ్వు నాకళ్లనురెంటినీ ఎప్పుడు చూచావో అడగవచ్చునా?" అన్నది.

"నీపతి మరణానంతరం ఆరోజున నిన్ను జూచిన వారు ఇంకెప్పుడూ మర్చిపోలేరు. నిన్ను నువ్వు గుడ్డిదానివని ఎందు కనుకుంటున్నావో నీకే తెలుసు. కాని నేను మట్టుకు అది యథార్థంకాదని అనుకుంటున్నాను. ఆరోజు నీ కళ్ళల్లో కనపడిన జ్యోతిని జ్ఞాపకం చేసుకొంటే ఎంత గాఢాంధకారం

నీ చుట్టు ముట్టినాసరే నువ్వు దారితప్ప వనిపిస్తోంది. జీవనపర్యంతం నువ్వు సరియైన దారిని నడవగలవు" అన్నాడు ఉపేంద్రుడు.

కిరణ్మయి కొంచెంసేపు మెదలకుండా వుండి "ఇప్పుడు గ్రహించాను. ఆరోజున తెలివితప్పి వారి పాదాలమీద పడినప్పుడు చూచి మీకీఅభిప్రాయం కలిగియుంటుం"దని అన్నది.

ఉపేంద్రుడు తలవూగించి "అవును, అప్పుడే. నేనేమైనా పొరపడ్డానా వదినా" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వు నవ్వి సంకోచమేమీ లేకుండా సహజంగా "పొరపాటు కాకేమిటి? నేను భర్తను ప్రేమించేదాన్నే కాదు" అన్నది.

ఉపేంద్రుడు మెదలకుండా చూస్తూ వూరుకున్నాడు.

కిరణ్మయి మళ్ళా చెప్పసాగింది. "నిజంగా వారిని నేనెప్పుడూ ప్రేమించలేదు. నేనేకాదు, వారూ నన్ను ప్రేమించలేదు. ఆరోజు నాస్థితి కేవలం కల్పించుకున్న దనుకున్నావా బాబూ! ఆరోజున నిజంగా స్మృతి తప్పి పడిపోయాను" అని ఆమె ఉపేంద్రుని గంభీరవదనం చూచి కొంచెం ఆగింది. కాని వెంటనే సంబాళించుకొని "భయపడితే ఏమీ లాభంలేదు. ఇవ్వాళ నీతో సంగతులన్నీ చెప్పాలి" అన్నది.

"ఎందుకు లాభంలేదు? నేను వినదలచుకోకపోయినా నాతో చెప్పాలంటావు ఎందుకని?" ఎంతో కష్టంమీద అన్నాడు ఉపేంద్రుడు.

"నువ్వు నాకు గురుతుల్యుడవు కావటమే దానికి కారణం. నీముందు నేను సర్వం అంగీకరించనంతవరకు నా కేవిధమైన శాంతి కలుగదు" అన్నది కిరణ్మయి.

ఉపేంద్రుడు నిశ్చలంగా చూస్తూ వూరుకున్నాడు. కిరణ్మయి దృఢంగానూ మృదువుగానూ చెప్పసాగింది "నీవు నాలో చూచిన గాంభీర్యము నీకన్నుల పొరపాటు కాదు. యథార్థమే. కాని అది క్షణికం. నాపతిని నేనెప్పుడూ ప్రేమించలేదు. హృదయపూర్వకంగా ప్రేమించటానికి ప్రయత్నించాను, గాని వారు జీవించలేదు. నా ఆ ప్రయత్నంకూడా స్థిరంగా వుండకపోయింది. ఈ సంగతులన్నీ పుస్తకాలలో చదివి ఒకప్పుడు ఇదంతా అబద్ధమనుకుంటూ వుండేదాన్ని; ఒకప్పుడు కవికల్పన అనుకుంటూ వుండే

దాన్ని. మరొకప్పుడు ప్రేమించేశక్తి నాలో లేదేమో ననుకునేదాన్ని. ఆశక్తి నాలో వుందో లేదో ఇప్పుడుకూడా నాకు తెలియదు. కాని ప్రేమలాలస నాలో ఎంత ప్రబలంగావుందో నిన్ను చూడగానే మొదటసారిగా గ్రహించాను. అందుకనే నువ్వు నాగురువవు." కొంచెం ఆగి గొంతు సరిచేసుకొని "రెండు రోజులుండి నువ్వు వెళ్ళిపోతావు. మళ్ళా వచ్చినప్పుడు నామనఃస్థితి నా సంగతులన్నీ నీతో చెప్పగల స్థితిలో వుండకపోవచ్చు. అందుకని ఇవ్వాళే నాసంగతులన్నీ నీ చెవినివేసి నిశ్చింతగా వుంటాను" అన్నది.

వుపేంద్రుడు వ్యథితుడై "అనేక కారణాలవల్ల ఇవ్వాళ నీమనస్సు వుత్తేజ మైనట్లు కనపడుతూంది వదినా! అలాంటిస్థితిలో నీకు ఏమిచెప్పాలో ఏమి చెప్పగూడదోకూడా తెలియదు. కొన్ని సంగతులు చెప్పినందువల్ల తర్వాత నువ్వే సిగ్గుపడవలసివస్తుంది. నేను ఇంకెప్పుడైనా వచ్చి ఈ విషయాలన్నీ వింటాను. ఇవ్వాళకాదు" అన్నాడు.

"అందువల్లే నేనూ సంగతులన్నీ ఇవ్వాళే నీతో చెప్పదలచుకున్నది. తర్వాత చెప్పలేనేమో. సంకోచపడతానేమో. లోకంలోని మంచిచెడ్డల విచక్షణాబుద్ధి నోరుమూయిస్తుందేమో. అందుకని ఇవ్వాళే చెబుతాను. ఇవ్వాళ దాచిపెట్టుకొని, గుణించుకొని కల్పించుకొని చెప్పటం అసంభవం. నాది అలాచెప్పే స్వభావంకూడా కాదు. ఇదే చెప్పే అవకాశం. బహుశా దీనివల్ల రేపు సిగ్గుతో దహించుకు పోవచ్చు. అనుతాపంతో తల బద్దలుకొట్టుకోవాలని బుద్ధి పుట్టవచ్చు. బహుశా నువ్వు ఈజన్మలో మళ్ళా నా మొహం చూడకపోవచ్చు. అయినా చెబుతాను. కొంచెంసేపటివరకు నాయీదుర్బుద్ధి నిలాగేవుండనీయండి ఇలాగే వున్మాదమనసుతోనే వుండనీయండి. నేను అంతా మనసిచ్చి చెప్పగలుగుతాను" అన్నది కిరణ్మయి.

ఆమె మొహంకేసి చూచేటప్పటికి వుపేంద్రుని నిర్మల అంతఃకరణం ఏదో అజ్ఞాతభయంతో కంపించింది. కాని అడ్డు తగులుతూ "మానవమాత్రునిలో దాచుకోతగ్గ విషయాలు కొన్ని వుంటాయి వదినా! వాటిని ఎవరి ముందూ బైటపెట్టకూడదు. వాటిని బైటపెడితేనే ఎక్కువ హానికరం. దాని వల్ల నాకూ నీకేకాదు, ఇతరులకు కూడా అపకారం కలుగుతుంది" అన్నాడు.

కిరణ్మయి ఏమీ సమాధాన మివ్వలేదు. పూరీలు వేల్చటం పూర్తి అయింది. వాటన్నిటినీ ఒక పళ్లెంలో పెట్టి వుపేంద్రుని ముందు పెట్టి "నువ్వు తింటూవుండు బాబూ! నేను నాహృదయాన్ని బైట పెడతాను" అన్నది.

"చెప్పవద్దు వదినా!"

"నేను చేతులెంజోడించి మనవి చేసుకుంటున్నాను. ఇప్పుడు నాకు అడ్డు తగులవద్దు. అంతా విన్న తర్వాత ఇష్టమైతే అత్తతోపాటు నా బరువు భారాలన్నీ వహించు. ఇష్టం లేకపోతే నాదారిని నేపోతాను. నాభుక్తి మార్గం నేను జూచుకుంటాను. నేనెందరిని మోసపుచ్చినా నిన్ను మోస పుచ్చలేను" అన్నది కిరణ్మయి.

"అయితే చెప్పు" అని వుపేంద్రుడు పూరీ ముక్క నోట్లో వేసు కున్నాడు.

"నీతో చెప్పానుగా—నేను భర్తను ఎప్పుడూ ప్రేమించనూ లేదు, వారిచేత నేను ప్రేమించబడనూ లేదని. దానికి నాకే చింతాలేదు. ఇంట్లో అత్తా భర్తా ఇద్దరే వుండేవారు. వారిద్దరివీ భిన్నాభిప్రాయాలు. వారు ప్రాణాలొడ్డి నన్ను చదివించటానికి ప్రయత్నిస్తూ వుండేవారు. ఇక అత్త స్వార్థపరాయణ. ఆమె నాచేత చాకిరీ చేయించకోటంతోనే సంతోషించేది. ఈ విధంగా కాలం గడుపుతూ వుండేదాన్ని. గడిచిపోతూవుండేది కూడా. తలవని తలంపుగా ఒక్కసారి అన్నీ తారుమారైనాయి. పతి జబ్బు పడ్డారు. నేను వారివద్ద అనేక పుస్తకాలు చదివాను. కాని నాటకాలుగానీ, నవలలు గాని చదవలేదు. మేమిద్దరమూ చదివి చదివి నవ్వుకుంటూ వుండేవాళ్లము. ప్రేమ అనేది, నామమాత్రానికికూడా మా యింట్లోలేదు. జన్మాంధుడు, జన్మబధిరుడులాగా నా భర్త జన్మనీరసుడు. అప్పట్లో తెలుసుకోలేక పోయినా ప్రేమగానీ, ప్రేమ తృష్ణగానీ ఏస్త్రీకంటేకూడా నాకు తక్కువ లేదని తర్వాత తెలుసుకున్నాను............చాలా? ఇంతటితో సరిపెడితే చాలదు" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు వుదాసీనతతో, "ఎందుకనో భోజనం రుచించటం లేదు వదినా?" అన్నాడు.

కిరణ్మయి దీర్ఘమైన ఒక నిట్టూర్పు విడచి నిమిషంసేపు కదలకుండా ఏమి ఆలోచించి అన్నదో తెలియదు. "నాకు తెలుసు. ఇంకొంచెం సేపటికి పూరీలు, కూర నీనోటికి విషంగా వుంటాయని. కాని ఇంకొంచెం సేపు తిన కలవుగా." వుపేంద్రుడు మరింత ఖిన్నుడై పోయాడు. కిరణ్మయి అతని కేసి చూస్తూ "నువ్వు తినకపోతే నా యెడమచెయ్యి విరిగినదానికంటే ఎక్కువబాధ కలుగుతుందంటే నువ్వు నమ్మవు. నమ్ము, నమ్మకపో; ఇది యథార్థమని నాకు తెలుసు. నేను ఇంతటితో ఆగే వుపాయం మేమీ లేదు" అన్నది.

"అయితే, చెప్పు."

"చెబుతాను. భర్త జబ్బుపడేప్పటికి నా నగలు మినహా తక్కినవన్నీ అయిపోయినాయి. అప్పుడు క్రొత్తగా ప్యాసయివచ్చిన డాక్టరొకడు వచ్చాడు. అయితే నువ్వు అనంగడాక్టరును చూచావా?"

" ఆఁ " అన్నాడు వుపేంద్రుడు.

కిరణ్మయి విషపునవ్వు నవ్వి "నారాత కాలిపోను! ఒకవైపున భర్త మరణశయ్యమీద వున్నాడు, రెండో గదిలోనే నేను అతనితో ప్రేమపిపాస తీర్చుకోసాగాను!" అన్నది.

వుపేంద్రుడు కదలకుండా తలవంచుకు కూర్చున్నాడు. కిరణ్మయి ఇంకా చెప్పాలనుకున్నది. కాని ఎవరో ఆమె గొంతు పట్టుకున్నట్లు ఆగి పోయింది. కాని కొంచెం సేపటికి మహాప్రయత్నంతో శుష్కకంఠంతో "వినగానే వంగిపోయిందా నీతల? అయితే ఆ అనంగడాక్టరుని ఎరుగున్నావా ఎరిగుంటే అంత పిపాస హృదయంలో కూడుకోబట్టే అలా సంభవమైంది. ఏ పిపాసతో మానవుడు మురికినీళ్ళ విచక్షణలేకుండా దోసిలితో తీసి తాగు తాడో, అలాంటి పిపాసే, అలాంటి తృష్ణే, నాలోకూడా కలిగింది. తెలుస్తా బాబూ! ఆ నీరుత్రాగిన తరువాత తెలిసింది ఈసంగతి. తర్వాత హృదయా రాటంతో కొంతకాలం........." అంటూ వుండగానే ఆమె శరీరమంతా కంపించి పోయింది. కాని కొంచెంసేపటికి తమాయించుకొని "కాని దానిని తెల్సగక్కలేకపోయాను. అత్త నానోరు నొక్కింది. అప్పుడు అనంగుడు సగం కుటుంబభారం వహించాడు" అన్నది.

ఉపేంద్రుడు శిలాప్రతిమలాగ నిశ్చలంగా కూర్చున్నాడు. అతని మౌనవదనం కేసి ఒకసారి క్రీగంటితో చూచి "తర్వాత ఆసక్తి, ఘృణా, తృష్ణా వితృష్ణల అవిరామ సంఘర్షణలతో ఇంతవిషం పుట్టి రోజురోజుకీ వృద్ధి కాసాగింది. దేవదానవుల సంఘర్షణవల్లకూడా వాసుకి బహుశా అంతవిషం కక్కి వుండదు. ఆ విషంతో ఇల్లంతా నల్లబడిపోయింది" అన్నది కిరణ్మయి.

కొంచెం ఆగి "ఎంతకాలానికి ఎలా దీని అంతం జరుగుతుందో తెలియదు. ఎంతో ఆలోచించాను. ఎటూ దారి కనుపించలేదు. ఇంతలో అమృతంతో నీవెక్కడనుంచి వచ్చావో తెలియదు. ఆవిషజ్వాల ఏమైందో, ఆ విద్వేష వితృష్ణ ఎక్కడికి పోయిందో అనంగుణ్ణి పంపించటానికి నిమిషం కూడా పట్టలేదు. రెప్పపాటులో అన్నీ తుచ్ఛమనిపించాయి. నువ్వువచ్చే నాచెవిలో దీనికి దారి చెప్పిపోయావు. స్త్రీలకు నగలమీద ఎంత ప్రేమో తెలుసా? మహావిపత్తునుండి కాపాడిన నగలు నాశరీరంలో అవయవం లాంటివి. నగలన్నీ తీసి ఇప్పుడు నువ్వు కూర్చున్న చోటే అతనిమొహాన విసిరివేశాను. నాయందు అతనికి ఆసక్తియున్నా, ఇన్ని నగలు చేజిక్కేప్పటికి మళ్ళా మొహం చూపించడు. శాశ్వతమైన సెలవు తీసుకొని పోతాడన్న వుపదేశం నీవే యిచ్చావు!

"అబ్బా! ఎంతభయం, ఎంతచింతలో వున్నాను! ఆపదలు వచ్చినప్పుడు ఆనగలుకూడా నావద్ద వుండవు. కనుకనే నాచేతినుండి ముందుగానే పోయినాయి. మంచే జరిగింది. వాటిని నేను దక్కించుకోలేక పోయినందుకు కించిత్తుకూడా దుఃఖపడలేదు. చాల సంతోషించాను. ఆనాటిసాయంకాలం అతను తన పిపాసను ఆపుకోలేనప్పుడు మాత్రం నాకు నిజమైన సంతోషం కలిగింది. నా ఒంటి నగలన్నీ మూటకట్టుకొని దొంగలాగ మెదలకుండా నా యింటినుండి పోయాడు. ఇక బ్రతికాను, నా ప్రాణాలు దక్కాయి అనుకున్నాను."

ఒకరోజు ఉదయాన అనంగడాక్టరు అతనికీ సతీశునికీ మధ్యగా దొంగలాగ దూసుకుపోయిన సంగతి జ్ఞాపకమొచ్చింది వుపేంద్రునికి. కాని పైకి అనకుండా మెదలకుండా వూరుకున్నాడు.

"అతను వెళ్ళిపోయిన తర్వాతనే నువ్వు వచ్చావు. ఆనాటి నా వుగ్ర రూపం నీకు జ్ఞాపకముందా? ఆరాత్రి నేను కపటనాటకా లాడాను. చాటు చాటు గాలిమాటలన్నీ విన్నాను. క్రిందకు దిగివచ్చి మీతో నిగర్వంగా మాట్లాడాను. మీ హృదయాలను క్రోధంతో నిపి రకరకాలైన సందేహాలతో నా హృదయాన్ని రగుల్చుకొన్నాను. దానికి బదులుగా దక్కిన వస్తువుల రెంటినీ చూచి స్వర్గమూ, అమృతమూ ఒక్కసారిగా దొరికినాయూ అనుకున్నాను. శ్రీరామచంద్రుని స్పర్శవల్ల రాయి మానవి యైనట్లు నేను రాక్షసిని - నారి నయ్యాను. అహల్య రాయినుండి మానవియై ఏమి పొందిందో తెలియదుగాని, నాకు ప్రాప్తించినవానికి సాటి మరొకటిలేదు. నాకు మఱిదులు లేరు. సతీశుడు మారుటి మఱిదిగా దొరికాడు. తర్వాత నువ్వు దక్కావు! తలవంచుకుంటూ వెందుకు? మగవాడికి ఇంత సిగ్గు శోభించదు" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు తలపైకెత్తి "సిగ్గు కలిగించే విషయం స్త్రీ - పురుషుల కిద్దరికీ సమానమే వదినా. నేనీ సంగతులన్నీ వినదలచుకోలేదు. నువ్వు మానైనా వెయ్యి. లేకపోతే ఇక్కడనుంచి నేను వెళ్ళిపోతాను" అన్నాడు.

కిరణ్మయి నవ్వి "నిజంగా వెళతావా?" అన్నది.

"ఆఁ"

"నేను నిన్ను బలవంతంగా పట్టు కుంచితే! కాని ఇదే చెబుతున్నాను. ఈ బలపరీక్షలో నాకే లాభం కలుగుతుంది. హానేమీ వుండదు."

కిరణ్మయి ఈ మాట అన్నమీద వుపేంద్రుడు తలవంచుకు కూర్చున్నాడు. కిరణ్మయి మళ్ళీ నవ్వి "భయంవద్దు. భయపడకు బాబూ! నీకు ఇష్టం లేకపోతే బలవంతంగా మెడపట్టుకు కూర్చోపెడదామన్న వున్మత్తత నాకింకా కలుగలేదు. ఇష్టమైతే ఇప్పుడే వెళ్ళిపో, నేను కాదనను" అన్నది.

వుపేంద్రుడు అలాగే కదలకుండా తలవంచుకు కూర్చున్నాడు. తెలిమబ్బు పొత్తిళ్ళలో నెలవంక కంటికి కనపడకపోయినా దాని చుట్టూవున్న మసకవెన్నెలద్వారా దాని అస్తిత్వ మగుపడుతూవుంది. ఈ విధంగా వారిద్దరి పరస్పర సంబంధాలు అంతర్యంలో దాగివున్నప్పటికీ మాటల ధోరణిలో కొంత కొంత బైటపడింది. ఈ గుప్తప్రేమ ఇంకెక్కువసేపు దాగియుండదు.

గాలి వీచింది. వెంటనే మబ్బుతెరలు విడిపోయినాయి. నెలవంక స్పష్టంగా కనబడుతుందని విశ్వసించి వుపేంద్రుడు అక్కడి నుండి పారిపోవాలను కున్నాడు. కాని అతని ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. ఒక్క గాలి విసురుతో వాతావరణమంతా చక్కబడింది. ఆకాశం నిర్మలంగా కనపడసాగింది.

కిరణ్మయి మెల్లగా "సరే. నీయందు నాకున్న ప్రేమను బైటపెట్టాను. ఇక నీయిష్టమొచ్చినట్లు చేసుకో. నేనేమీ కాదనను. కాని నేను ఆత్మతృప్తిలో పడి నీతో ఇలా మాట్లాడుతున్నాననుకోవద్దు. నేను నిన్ను ఎరుగుదున్నాను. నేను ఈ చెప్పటం వ్యర్థమనీ, అసందర్భమనీ నాకు తెలుసు. రక్షకుడవై యుండి భక్షకునిపని చేయలేవని నాకు బాగా తెలుసు" అన్నది.

ఇంతసేపటినుండి వుపేంద్రుడు నోరు మెదల్పలేదు. చాలా వినయంగా "నాయందు ఇంత శ్రద్ధవుంటే మరి ఈ సంగతులన్నీ నాతో చెప్పటమెందుకు?" అన్నాడు.

"దీనికి రెండు కారణాలున్నాయి. మొదటిది- ఈ సంగతులన్నీ చెప్పకపోతే బహుశా నేను పిచ్చిదాన్నయేదాన్ని. రెండవది- చెప్పకుండా నీ ఆశ్రయం పొందడం అసంభవం. అలా చేసినట్లయితే నా పోషణ భారమంతా సురబాలే వహిస్తోందని అనుకునేదాన్ని. కాని ఇప్పుడు నీవు నా భారం వహిస్తే, నీవు ఇచ్చినదే తింటున్నాను, కట్టుకుంటున్నాను, పరాయివారిది కాదు. సరే, సురబాలకు నాయీ సంగతులు చెబితే?"

"వద్దు?"

"ఎందుకని? వింటే ఆమెకు కష్టంగా వుంటుందా?"

"కష్టమేముంటుందిగాని, ఆమె వట్టి మూర్ఖురాలు. కులస్త్రీ భర్తనొదలి పరపురుషుణ్ణి ప్రేమిస్తుందని వెయ్యిసార్లు చెప్పినా ఆమె వప్పుకోదు. ఒకొక్కప్పుడు చేత్తో నా నోరుమూసి 'ఈ సంగతులంటూవుంటే నోటిలో పుండుపుడుతుంది' అంటుంది. సరే. సెలవైతే ఇక వెళ్ళిపోతాను."

ఈ మాట కిరణ్మయి హృదయంలో తప్తశూలంలాగ గుచ్చుకున్నది. కాని ఆమె మనసులో భావాన్ని కప్పిపుచ్చుకొని "సెలవుయివ్వక తప్పేదేమున్నది! సెలవు యివ్వవలసే వస్తుంది. అయినా కొంచెంసేపు కూర్చో. నీమీద కలిగిన నా ప్రేమ విఘ్నమైంది. నేను కప్పిపుచ్చుదామనుకున్న

విషయంకూడా నీవు తెలుసుకోవటం అవసరం. ఈ విషయంలో నా గురు వెవరో తెలుసా? ఆ మూర్ఖులరాణి మా చెల్లెలు!" అన్నది.

ఉపేంద్రుని వదనంమీద ఆశ్చర్యరేఖలు పరుగులెత్తాయి. కిరణ్మయి యిదిచూచి "అవును, ఆమే. నీవు పశురాజు అని యెగతాళిచేసే సురబాలే నా గురువు. నీవు నేర్పినదికూడా ఆమె కప్పిపుచ్చాలనుకుంది. మీ యిద్దరూ నా గురుతుల్యులు, వందనీయులు" అన్నది.

ఉపేంద్రుడు ఏమీ మాట్లాడలేదు. కిరణ్మయి అన్నది "నీకు అనేకసార్లు చెప్పానుబాబూ, ఇవ్వాళ నా లజ్జాభిమానాలను నీ పాదాలముందు జలాంజలి వదిలాను. నేనీపని మంచిచెడ్డలు బాగా ఆలోచించుకునే చేశాను. నీ సురబాల సతీలలామనీ, నీ హృదయపవిత్రతనీ నాకు తెలుసు. ఆమె స్ఫటికమణిలాగ స్వచ్ఛమైనది, వజ్రంలాగ కఠోరమైనదీని. ఆమెమీద మచ్చ వెయ్యటానికి నాలాంటి ప్రేమికులకు శక్తికిమించినది. మానవస్వభావం ఎంత విచిత్రమైనదో చూడు బాబూ! ఎప్పుడూ తనశక్తి-సామర్థ్యాలకు బాహ్యమైన వస్తువును అన్నిటికంటె ఎక్కువగా పొందాలని లాలసపడుతూ వుంటుంది. భగవంతుణ్ణి ఎవరూ పొందలేరు. కనుకనే అందరూ అతనికోసం అనేకవిధాల తపిస్తూ వుంటారు. నామనసులోకూడ ఇదేసంగతి వున్నది. నువ్వు నాకింత అప్రాప్యం కాకపోతే నీమీద ఇంత ప్రేమవుండేదికాదు. కాని ఇప్పుడు ఆ సంగతిపోనీ."

కొంచెంసేపు మెదలకుండా వుండి కిరణ్మయి ఒక దీర్ఘమైన నిట్టూర్పు విడచి మళ్ళాఅన్నది. "ఏకలవ్యునికి ద్రోణాచార్యునిలాగ సురబాల నాగురువు. ఆమె నాకు గురువు ఎలాఅయిందోకూడా ఇవ్వాళే చెప్పాలనుకుంటున్నాను. ఇప్పుడు నువ్వు భోజనానికి కూర్చున్నచోటే ఒకనాడు సతీశుడుకూడా కూర్చున్నాడు. ఏదో సందర్భంలో నీ సంగతి వచ్చింది. ఇంకేముంది? నామరది సతీశుడు ఒక్కసారి మండిపడ్డాడు. నా మనసుకూడా అప్పుడు దరిదాపు అదే స్థితిలో వుంది. ప్రేమమధువునుగ్రోలి నిషాలో నేను వున్మాదినై పోయాను. కా కాళ్ళు చేతులు ఆడలేదు. కళ్ళెర్రబడ్డాయి. అప్పుడు సతీశుడు ఎన్ని వుదాహరణలతో-ఎన్ని దృష్టాంతరాలతో చెప్పాడు. నువ్వు సురబాలను ఎంతో ప్రేమిస్తూవుండేవాడివట. ఆమెకు జబ్బువస్తే రాత్రింబగళ్ళు నిద్రాహారాలు లేకుండా ఆమె మంచంవద్దే పడివుండేవాడివట. ఎప్పుడో ఆమె నీ

తలవైపున తెల్లవార్లూ విసురుతూ కూర్చున్నదట. ఇలాంటివే ఎన్నో సంగతులు చెప్పాడు. వాటిలో కొన్ని అబద్ధాలుండవచ్చు. అతను కల్పించి చెప్పివుండవచ్చు. కాని దానివల్ల మీ యిద్దరికీ కలిగిన అపకారమేమీ లేదు. మీ దంపతుల మధ్య ప్రవహిస్తున్న ప్రేమగంగలో మేమిద్దరమూ నిండా మునగాలనుకునేవాళ్ళము. తర్వాత చాల ప్రొద్దుపోయిన పిమ్మట సతీశుడు ఇంటికి వెళ్ళిపోయాడు కాని నేను ఇక్కడే కూర్చుని వుండిపోయాను. అలా ఎంతసేపు కూర్చున్నానో నాకే తెలియలేదు. బైటకువచ్చి చూచేటప్పటికి ఎదురుగా శుక్రతార కనిపించింది. హఠాత్తుగా నా మనసులో సురబాల మొహంకూడా రమ్యంగా, ఉజ్వలంగా, సరిగా అలాగేవుండటంవల్ల నాదృష్టి ఆమె వైపునుండి మరోవైపుకు మార్చటానికి వీలులేకుండా పోయింది. మనసులో "సురబాలా! నేనైతే ఇంతవరకు కంటితో నిన్ను చూడలేదు. కాని నువ్వెలాంటిదానివైనా నేటినుండి నువ్వు నాకు గురువువయ్యావు. నీనుండే నేను పతిప్రేమను గురించిన పాఠం నేర్చుకున్నాను. ప్రేమమాధుర్యం ఏమిటో నువ్వే నాకు రుచిచూపించావు. ఇప్పుడు నేను దానిని వదిలిపెట్టలేను. ప్రేమను నేను హృదయపూర్వకంగా వాంఛిస్తున్నాను. ప్రేమించక తప్పదు. కాని యితరులను ప్రేమించి దానిని వ్యర్థపరచట మెందుకు? నాపతి ఇంకా జీవించేయున్నాడు. నాకింకా వైధవ్యం ప్రాప్తించలేదుగా! ఇంకా ఇంత పొరపడుతున్నా నెందుకని? నీలాగనే ఇవ్వాళ్టినుంచి నేకూడా నాపతిని తప్ప ఇంకెవరినీ ప్రేమించను." ఈ విధంగా ఆలోచించుకుంటూ నా మనశ్శక్తులన్నిటినీ కేంద్రీకరించి "ప్రేమకు ప్రతిఫలం దొరుకుతుందనే ఆశ లేకపోయినప్పటికీ నువ్వు అతన్ని ప్రేమించితీరాలి" అన్నది. కాని నా అదృష్టం భిన్నమన్నది. వారు జీవించలేదు. నా మనోరథం అంకురించగానే శుష్కించిపోయిందికూడా. వారు పోయినరోజున మీకు కనపడిన నా రూపంలో కించిత్తుకూడా కపటంలేదు" అంటూ వుండేగానే ఆమెకు దుఃఖం పొర్లుకొచ్చింది. ఉపేంద్రుడు అది గమనించాడు గాని మాట్లాడలేదు. కిరణ్మయి కూడా కొంచెం సేపు మెదలకుండా వుండి "మూర్ఖుడికి, వైరివాడికీ తెలియదుగాని నీకెందుకు తెలియదు? ప్రపంచంలోని ప్రతి వస్తువుకీ ఒకప్రకృతి నియమం వున్నదనీ, ఆ నియమాన్ని వుల్లంఘించి దంపతులలో ఎవరూ తన చిరమధురశాశ్వతసుఖానికి చేరలేరని నీకెందుకు తెలియదు? వివాహ

మంత్రం కర్తవ్యపాలనబుద్ధి యివ్వగలదు. భక్తినివ్వగలదు. కాలుచున్న భర్త చితిమీద పంపగలదు. కాని ఆనందాన్నిచ్చే శక్తి కేవలం ఈ ప్రకృతి చేతిలో వున్నది. ఆనందం నియమపాలనలో వున్నది. నియమం పాటించిన వానికే ఆనందప్రదానం ప్రాప్తిస్తుంది. సమయంలో ఆనందముంది. కాని అప్పుడు మా దంపతుల మిద్దరమూ ఆ నియమాన్ని కాలదన్ని కించిత్తుకూడా ఆదరించలేదు. సమయం చేతినుండి జారిపోయిన తర్వాత పతి రోగగ్రస్తుడై క్రమంగా మృతప్రాయుడైన తర్వాత ఏ మొహం పెట్టుకొని వారిని ప్రేమించేది? అయినా నేను పూర్తిగా నిరాశ పొందలేదు. అప్పుడుకూడా నాకు ఒకదారివుంది. అది వారిసేవ. జీవితపర్యంతం పతిసేవచేసి వారిప్రేమకు పాత్రురాల నౌదామనుకున్నాను. కాని అంతటి అదృష్టం నాకు పట్టలేదు. ఆ అవకాశంకూడా నాకు చిక్కలేదు. నేను వారి సేవ చెయ్యలేకపోయాను. వారీ లోకాన్ని విడిచి పోయారు"

వుపేంద్రుడు ఆశ్చర్యంతో తలెత్తిచూచాడు. కిరణ్మయి కన్నీరు కాలువలు కట్టిస్తూవుంది. "నువ్వు పతికి చేసిన సేవ మరొకమనిషి చెయ్యలేదు వదినా? పతిసేవలో స్త్రీ కున్న కర్తవ్యంలో నీవేమీ లోపం చెయ్యలేదు" అన్నాడు.

"బహుశా రానియ్యలేదేమో! కాని మానవుడు చెయ్యలేనిది నేను మాత్రం ఎలా చెయ్యగలను? అలాంటి సేవ ప్రతిస్త్రీ చేస్తుందనేమీ కాదు. కాని నేను కర్తవ్యమనుకొని ఏమీ చెయ్యలేదు. తక్కిన మార్గాలన్నీ కట్టుబడినాయి. కాబట్టే, నా సేవద్వారా వారిని పొందాలని కాంక్షించాను. అందుచేత నా శక్తి వంచన లేకుండా చేశాను. ఒక్కసారి వారిని నా హృదయంలోనికి రప్పించుకొంటే ఎన్నిరోజులు బ్రతికినా, ఎక్కడ ఏస్థితిలో వున్నా, చక్కగా జీవితం గడపగలిగేదాన్ని. కాని నా యత్నాలన్నీ విఫలమయ్యాయి. వారిని పొందటానికి పాఠం ప్రారంభించాను. పొందలేకనే పోయాను. మొదటి రోజునే నువ్వు నా హృదయంలో నాటుకుపోయావు. అక్కడినుంచి మళ్లా ఎటూ కదలలేకపోయాను" అన్నది కిరణ్మయి.

వుపేంద్రుడు లేచి నుంచుని "చాల పొద్దుపోయింది వదినా, ఇక వెళతాను" అన్నాడు.

కిరణ్మయికూడా లేచినుంచుని, "పద, నిన్ను వాకిలివరకు పంపించి తలుపువేసి వస్తాను. మళ్ళీ, రేపు దర్శనమౌతుందా?" అన్నది.

"లేదు, రేపు నేను ఇంటికివెళతాను"

"అయితే మళ్ళీ దర్శనమెప్పుడు?"

"ఎప్పుడూ వుంటూనేవుంది"

"శుభం, దివాకరుని ఇక్కడకు పంపుతారుగదూ?"

"ఆఁ తప్పకుండా పంపుతాను. వాడి తలిదండ్రులుకూడా లేరు. ఇంత కాలంనుండీ నేనే సాకుతూవచ్చాను. ఇప్పుడు మీరు ఆభారం వహిస్తానంటే సంతోషంగా చేతికప్పగిస్తాను"

కిరణ్మయి కంటివెంట నీరు రాబోతూండేప్పటికి బలవంతాన ఆపుకొని "ఇన్ని సంగతులు వినికూడా ఇంత విశ్వాసభారం నామీద ఎందుకు పెడుతున్నారు? దివాకరుని నీవెంతగా ప్రేమిస్తావో నాకు తెలుసు" అన్నది.

వుపేంద్రుడు వాకిటిబైటికివచ్చి "అందుకనేగా మీకప్పగించింది. నేను హృదయపూర్వకముగా ప్రేమిస్తున్నవాడికి మీద్వారా ఎప్పటికీ అపకారం జరగదని నాకు గట్టినమ్మకముంది" అని అతను ముందుకు సాగాడు.

కిరణ్మయి మళ్లాపిలచి "బాబూ, ఇంకోమాట. సతీశుడు కలకత్తాలో లేడూ?" అన్నది.

వుపేంద్రుడు దూరాన్నుండే "లేడు" అని సమాధానమిచ్చాడు.

"అతను నాకు చెప్పకుండా వెళ్లాడంటే మనసుకి ఏదో పెద్ద కష్టం కలిగితేనే వెళ్లివుంటాడు. నువ్వు అతన్ని రావద్దని ఏమైనా అన్నావా ఏమిటి?" కిరణ్మయి మళ్లా అన్నది.

వుపేంద్రుడు దగ్గరకువచ్చి "రావద్దని అనాలనుకున్నాగాని, అనలేదు" అన్నాడు.

"అనా లనుకొని ఎందుకు అనలేదు?"

వుపేంద్రుడు మాట్లాడలేదు. జవాబు రాశపోయేప్పటికి కిరణ్మయి "అలాంటికోర్కె ఎందుకుకలిగిందో నేను తెలుసుకోగూడదా?" అన్నది.

"నేను పొరపడవచ్చు కూడా! ఏమైనా కానీయండి అతను ఎక్కడ వున్నాడో అంతు తెలుసుకుని మీఇంటికి రమ్మని వుత్తరం రాస్తాను. రాని కారణం అతన్నే అడిగి తెలుసుకుందురుగాని" అన్నాడు ఉపేంద్రుడు.

---

# ౨౮

స్టంధాల పరగణానుండి తిన్నగా వైద్యనాధకు వెళ్ళే రోడ్డుపక్కన వైద్యనాథ్‌కి రెండు కోసుల దూరంలో ఒక బంగళా వుంది. కలకత్తానుండి వచ్చి సతీశుడు ఈ యింట్లోనే వుంటున్నాడు. ఆత్మనిర్ణయంకోసం అతను ఈ నిర్జనస్థానంలో అజ్ఞాతవాసం చెయ్యటానికి వచ్చాడు. చుట్టుపట్ల దగ్గరలో పల్లెలు లేకపోవటం, ఎదురుగావున్న రోడ్డుకూడా జనసమ్మర్దం ఎక్కువగా లేకపోవటంచూచి సంతోషంతో "నాకిటువంటి చోటే కావాలి. ఇలాంటి నిర్జన ఏకాంతస్థానమే అవసరం" అనుకున్నాడు. అతను కలకత్తాలో మూటకట్టి నెత్తిన వేసుకువచ్చిన అపవాదుకలమూటలు ఇక్కడ వంటరిగా కూర్చుని ఒక్కొక్కటే విప్పిపారెయ్యదలచాడు. అతని ప్రధానాశయం మనసులో సావిత్రియందు ఏహ్యభావం ఏర్పరచుకోవటం. రెండవది పధరియా ఘట్టావదినను మరచిపోవటం. మూడవది ఉపేంద్రబాబుతో సంబంధ బాంధవ్యాలన్నీ తెగతెంపులు చేసుకోవటం. ఈతోటలో కూర్చుని అతను ఈక్లిష్ట కర్మలన్నీ తలపెట్టుకున్నాడు. వెంటవున్నది బిహారీ, ఈ ప్రాంతపువాడే వంటమనిషి. బిహారి, బాబుగారికి సేవాశుశ్రూషలు చేయగా మిగిలిన కాలంలో వంటపంతులుతో వాదవివాదాలు జరిపి అతన్ని దద్దమ్మను, మూర్ఖుణ్ణి చెయ్యటానికి తన శక్తిసామర్థ్యాలన్నిటినీ ఖర్చుచేస్తున్నాడు. ఇక వంటపంతులుపని వంటచేయటం, మిగిలినసమయములో బిహారీతో తగూలాడి అతనుబజారునుండి తెచ్చిన వస్తువులలో చేతినిండా దోచుకున్నాడని ధ్రువపర్చటం. ఈ విధంగా వారిలాగో ఒకలాగు కాలం గడుపుతున్నారు. కాని వారి యజమాని రాత్రింబగళ్లు తాత్విక చింతలో మునిగియుంటున్నాడు. ప్రపంచంలో కామినీ, కాంచనాలే అనర్థాలన్నిటికీ మూలకందం, వైరాగ్యమే పరమసాధనమైన వస్తువు. పక్షుల కుహుకుహునాదాలే వున్నతసంగీతం. గిరికాననాలే సౌందర్యానికి విశుద్ధాదర్శనం. వీటన్నిటినీ సంపూర్తిగా హృదయమందు వుంచుకొనటమే దాని ప్రస్తుతసాధనం. ఈసాధనలేకుండా మోక్షసిద్ధికి మరో వుపాయంలేదు. అందుకనే అతను వసారాలో ఒక విరిగిపోయినకుర్చీలో కూర్చుని ధ్యానంతో చెట్లమీద కూర్చున్న పక్షుల కిలకిలనాదాలు వింటూ వుంటాడు. ఎదురు చెట్లను ఎదుర్కొని 'ఝం' అంటూ పోతున్న పవనంలో

అతను దుర్లభరాగరాగిణీస్వరం వెతుకుతూ వుంటాడు. ఆకాశంలో తెలిమబ్బు తెరలనుచూచి వుబ్బితబ్బిబ్బైపోతాడు.

అతను మాంసాహారము మానేసి శాకాహారం తినటం మొదలుపెట్టాడు. ఎక్కడినుండో ఒక తెల్లటి గుర్రాయి తీసుకొచ్చి పగలల్లా దాన్ని పూజిస్తూ, సాయంకాలం ఆరతిస్తూ వుంటాడు.

ఇలా నూతన పద్ధతిలో జీవితంగడిపే అవకాశం అతనికెప్పుడూ కలుగలేదు. మొదట అతనికి పక్షుల కుహూకుహూనాదాలకంటె, సితారు ధ్వనే ఎక్కువ ఇంపుగా వుండేది. అతనెప్పుడూ గాలిలో రాగరాగిణులుంటాయని కలలు కనలేదు. తెలిమబ్బు లెప్పుడూ అతన్నిలా కదలింపలేదు. ఈ ప్రకృతి ఇంత శోభాయమానమైనదని తెలుసుకునే అవకాశం అతనికేనాడూ దొరకలేదు. పాటకచేరీలు, నాటక థియేటర్లు, క్రికెట్ ఆటలతోనే సతీశుని జీవితమంతా నడిచింది. తగవులూ తన్నులాటలలో చెవి జేసుకోవటం, సభా సమావేశాలలో సర్దటం, ఎవరింట్లోనైనా శీనుగ అలాగే పడివుంటే తీసికెళ్ళి తగలెయ్యటం, ఆపదల్లో ఎవరికైనా పదిరూపాయలు సర్దటం ఇవే అతని అవసరపనులు.

పక్షులకూతల్లో మాధుర్యమున్నదో లేదో, కోయిల పంచమస్వరంలో కూస్తోందో లేదో, నదీజలం కలకలధ్వనితో ఘోషిస్తున్నది ఏమిటో, కామినీ కాంచనాలు ప్రపంచంలో ఎన్ని అనర్థకాలకు కారణాలో—ఈ సంగతులేవీ అతని బుర్రలోనికి వచ్చేవికాదు. అతను తిన్ననిమనిషి. లోకవ్యవహారాలు తిన్నగానే జరపగలిగేవాడు. ప్రేమించితే ఏమీ ఆలోచించకుండానే ప్రేమించుతాడు. మధ్యలో ఏదైనా అవాంతరం వస్తే ఏంచెయ్యటానికీ తోచేదికాదు. ప్రపంచంలో ఇద్దరు వ్యక్తులను అతను అందరికంటె మిన్నగా ప్రేమించేవాడు. ఒకటి సావిత్రీ, రెండు వుపేంద్రబాబూ. సావిత్రి అతన్ని మోసగించి దురాచారీ, విశ్వాసఘాతుకుడైన విపినవెంట ఎక్కడికో వెళ్ళిపోయింది. వుపేంద్రబాబు కూడా చెప్పా చెయ్యకుండా అర్ధరాత్రికాడ అతన్ని వదిలిపెట్టిపోయాడు. నుంచోటానికికూడా అతనికి ఎక్కడా స్థానం లేనట్టయింది. కిరణ్మయి ఇల్లు వుంది. ఆ ఇంటి తలుపుకూడా బందవటంచూచి అతని అక్కడికెళ్ళటానికి ధైర్యంలేకపోయింది. అందుచేతే అతను ఈ నిర్జనస్థానానికివచ్చి, విశాలాకాశం

కింద పవనం, చెట్లూ చేమలూ, పశుపక్ష్యాదులతో బలవంతంగా ఒక అపరి చయ సంబంధ మేర్పరచుకొని వైరాగ్యసాధనలో లగ్నమవటానికి సిద్ధ మయ్యాడు. ఇంతవరకు ఆటపాటలలోనే గడిపినమనిషి, ఈ నూతన ప్రయత్నం చూచి బిహారి తరచుగా కంట తడిపెడుతూ వుండేవాడు.

అతనెప్పుడైనా "బంగాలీ బాబుల్లాగావుంది — ఇద్దరు ఇటు వస్తు న్నారుబాబూ!" అంటే సతీశుడు మాట పూర్తికాకముందే 'ఎక్కడ ఎక్కడ ?' అని పొంగిపోతూ లేచి, మళ్ళా వెంటనే 'పోనీ' అని మొహం వేలాడ వేసుకొని కుర్చీమీద కూలబడేవాడు. బిహారి "పిలవనా ? ఏమైనా మాట్లాడుతారా ?" అంటే, "అవసరమేముంది!" అనేవాడు, తర్వాత ఒక కుమ్మనవ్వునవ్వి, "ఇక నాకు అటువంటి సంభాషణ లనవసరం. నచ్చటంలేదు. నీకు తెలియదు బిహారీ! మనపక్షులు నాకు గీతాలు పాడుతున్నాయి. చెట్లు చేమలు మాట్లాడుతున్నాయి. పవనం ఝుంయిమంటూ నా చెవిలో ఎక్క డెక్కడిగాధలో చెబుతూవుంది. ఇక నేను అనవసరంగా లోకులతో వాగి కాలం వ్యర్థపుచ్చటమెందుకు ? నిజమడిగితే - నా యథార్థమిత్రులు వారే. తెలిసిందా" అనేవాడు. బిహారి మెదలకుండా వెళ్లిపోయేవాడు. కాని చాలా సేపటివరకు వ్యథతో నిండిన యజమాని కంఠస్వరం అతని చెవిలో మారు మ్రోగుతూ వుండేది.

బిహారిలో ఒక విశేషగుణమున్నది. మాట యిచ్చి తప్పుకోవటం అతనికి తెలియదు. చాలామంది పెద్దమనుషులు లోభా న్నణచుకోలేరు. కాని బిహారి అణచుకొని వుండగలడు. సావిత్రి ఆ రాత్రి ఏదో మాయపన్ని పోయిందని అతను మనసులో అనుకుంటూ వుండేవాడు. ఆమె సతీశుని క్షేమమే కోరు తుంది, అతన్నే ఎక్కువగా ప్రేమిస్తుంది. ఈ విషయంలో బిహారికేమీ సందేహంలేదు. తనుచెయ్యాని నేరాన్ని వప్పుకొని, ఏనాడూ చేయని పాప భారాన్ని చేతులారా నెత్తిన వేసుకొని, ఆమె యజమానిని ఇంత వ్యథ పెట్టి ఎందుకుపోయిందో, అతను ఎన్నిసార్లు ఎంతఆలోచించినా అర్థమయ్యేదికాదు. అయినా బిహారికి సావిత్రియందు అపార భక్తి విశ్వాసాలున్నాయి. అందు చేత అతను తన స్వబుద్ధితో ఏమీ నిర్ణయించలేక ఎంత దుఃఖం కలిగినా, ఎంతనష్టంవచ్చినా చివరికి శుభమే కలుగుతుందన్న ఆశతో నోరు మెదల్ప

వెళ్ళేటప్పటికి హఠాత్తుగా ఒకవైపున గల్లంతు వినిపించింది. విషయమేమిటో తెలుసుకుందామని సతీశుడు ఆవైపుకి వెళ్ళేటప్పటికి ఎదురుగా దారిలో ఒక టాంగా కనిపించింది. దానిచుట్టూ చేరి ఏడెనిమిదిమంది తెల్లోట్లు చరచుతూ కులాసా పడుతున్నారు. కొందరితలమీద టోపీలు, కొందరి తలలమీద తల గుడ్డలు వున్నాయి.

ఆ కులాసా ఏమిటో తెలుసుకుందామని సతీశుడు కొంచెం ముందుకు వెళ్ళి చూచాడు—బండిదగ్గర ఒక అమ్మాయి ముసుగువేసుకొని సిగ్గుతో క్రుంగిపోతూ శిలాప్రతిమలాగా నుంచునివుంది. వారు ఆమెను అనరాని మాటలన్నీ అంటున్నారు. మొదట సతీశుడు బహుశా వీరు ఈ స్త్రీని వెంటవేసుకొని సరదాగా వచ్చారు, గుర్రం పారిపోయేటప్పటికి పరిహాసమాడుతున్నారు, అనుకున్నాడు. ఈ గొడవలో పడకుండా తిరిగి వెళ్ళిపోవాలనిపించింది మనసులో. కాని ఇవ్వాళ ఎందుకనో అతను తన ఉత్సాహాన్ని ఆపుకో లేకపోయాడు. సరిగ్గా అప్పుడు ఆశ్చర్యపూరితమైన అతని దృష్టి ఆ స్త్రీ దుస్తులమీద పడింది. బెంగాలీ స్త్రీలలాగా ఆమె సాన్నీచీర కట్టుకున్నది. కాళ్ళకు చెప్పులుకూడా వున్నాయి. కాని లక్నో చెప్పులుకాదు· దొర సానులు ధరించే ఎత్తుమడమల చెప్పులు.

అకస్మాత్తుగా స్త్రీ బిగ్గరగా అరచి "నన్ను రక్షించండి బాబుగారూ!" అన్నది.

"రక్షించండి" అన్న శబ్దం మెరపులాగా అతని చెవినిపడింది. సతీశుడు ఆమె రక్షణకోసం ఆతురత పడ్డాడు. కామినీ, కాంచనం అనవా లన్నిటికీ మూలకందమన్నతత్వం కొంచెంసేపు మర్చిపోయాడు. సింహంలాగా ఒక్క అంగలో యువతివద్దకువచ్చి నుంచుని "ఏమిజరిగింది?" అన్నాడు.

ఇంతసేపటినుండీ యువతి ఒంటరిగా వుండటంమూలాన ఈ దుష్టులు ఎన్ని అశ్లీలపుమాటలన్నా విని సహించింది. ఇక సహకారం దొరికేటప్పటికి ఆమె కూర్చుని ఏడవసాగింది.

సతీశుడు ఆతురతతో "అసలుసంగతి ఏమిటి? ఏంజరిగింది" అన్నాడు.

"వీరు నన్ను చాలా అవమానం చేశారు?"

"అవమానం చేశారా? వీరెవరు?"

అప్పుడు సతీశుడు యువతితో, "లేవండి" అన్నాడు.

మెదలకుండా యువతి లేచి నుంచున్నది. "బండీ, బండివాడూ పోడు గాను! వర్షం రాబోతూన్నది. త్వరగారండి" అన్నాడు సతీశుడు. యువతి భయపడుతూ "నేను టౌనువంకకు నడువగలనా ?" అన్నది.

"టౌనుకుకాదు. మా యింటికి పదండి. ఈ తోటలోనే వుంది. వర్షం వస్తూవుంది. ఆలోచిస్తే లాభంలేదు. త్వరగా పదండి, లేకపోతే తడుస్తూ వుండండి, నేను వెళుతున్నాను" అన్నాడు సతీశుడు.

"పదండి. మీ వెంటరావటానికి ఆలోచనేముంది?" అన్నది యువతి.

తుపర పడుతూవుంది. గాలి తగ్గినా, ఇంకా పూర్తిగా తగ్గలేదు. ఇద్దరూ కొంచెంసేపు నడచి తోట గేటువద్దకు వచ్చారు. సతీశుడు తలవని తలంపుగా ఆగి "మా ఇంట్లో ఆడవాళ్ళెవరూ లేరు, నేనొంటరిగానే వుంటున్నాను" అన్నాడు.

"అయితే మీకు వంటా ? ఎవరుచేస్తారు? స్వయంగానే చేసుకుంటారా ?" అన్నది యువతి.

"లేదు నౌకర్లున్నారు. కాని ఆడువారుకాదు"

"కాకపోతే పోనీ. ఆగా రెందుకు? నడుస్తూ చెప్పండి".

సతీశుడు కుంఠితుడై "మా ఇంట్లో ఆడవారెవరూ లేరు. ఈ సంగతి సంగతి ముందుగా చెప్పితే మంచిదనే వుద్దేశంతో చెబుతున్నాను" అన్నాడు.

"మంచిదనుకుంటే అక్కడే ఎందుకు చెప్పలేదు ? ఇక నేను నుంచోలేను, కాళ్లుచేతులు వణుకుతున్నాయి. దాహంతో నాలుక పీక్కుపోతూ వుంది" అన్నది యువతి.

"అయితే రండి" అని సతీశుడు గత్యంతరంలేక చీకట్లో దారి చూపిస్తూ ముందుకుసాగాడు. ఈ దుర్మార్గుల చేతిలో పడి పాప మా యువతి ప్రాణాలకు ఎంతో కష్టం వచ్చిందనుకుంటూ సతీశుడు తన కటువ్యవహారానికి కొంచెం సిగ్గుపడ్డాడు. కొంచెంసేపయినతర్వాత "మీ మాట ఎక్కడో విన్నట్లున్నది" అన్నాడు మెల్లగా. యువతి ఏమీ మాట్లాడలేదు. కాని సతీశుడు చీకట్లో తన మొహాన్ని చూడలేదనిమాత్రం గ్రహించింది. వసారా

లోనికి వెళ్ళి సతీశుని కుర్చీమీద చతికిలపడి "వంటబిహారీ వున్నాడుగా?" అని "ఒక గ్లాసు మంచినీళ్ళు తీసుకురా బిహారీ!" అని బిగ్గరగా పిలిచింది.

బిహారి అటువైపు గదిలోనే వున్నాడు. పిలుపు విని మంచినీళ్లు తీసుకు వచ్చాడు. వసారాలో ఒక్క చిన్నదీపం వెలుగుతూవుంది. ఆ వెలుగులో బిహారి యువతిని చూడగానే గుర్తించాడు. "మీరు ఇక్కడికి ఎట్లా వచ్చారు అమ్మగారూ?" అన్నాడు ఆశ్చర్యంతో.

"పెద్దగాథ" అని ఆమె లేచి నుంచున్నది. బిహారి చేతిలో గ్లాసు తీసుకొని ఒక్క గుక్కలో నీళ్ళన్నీ తాగేసింది. గ్లాసు బిహారికి తిరిగి యిస్తూ "అన్నయ్యకు కబురుచెయ్యాలి బిహారీ! చిరునామాయిస్తే నువ్వు ఈ రాత్రి కాడ యిల్లు కనుక్కోగలవా?" అన్నది.

బిహారి తలకాయ తిప్పుతూ "వెళ్ళలేనమ్మా, నే నీ పట్నంలో ఎవరినీ ఎరుగను. ఇక రెండోది పెద్దతనం. ఈ గాలివానలో చీకట్లో నడువలేను" అన్నాడు.

"అయితే మరి యిప్పుడు ఏంచేద్దాం బిహారీ? గుర్రం తిరుగుతూ, తిమ్ముతూ ఇంటికి పోయిందంటే అన్నయ్య చాల గాభరాపడతాడు. ఏమీ భయంలేదనీ, నేను సురక్షితమైనచోటే వున్నాననీ వారికి కబురుచెయ్యాలి."

బిహారి ఆలోచించి "ఆఁ వంటపంతులు ఇక్కడివాడే. ఇక్కడి చోట్లన్నీ అత నెరుగున్నాడు. అతన్ని పిలుచుకువస్తాను" అని అతను వంటింటి వైపుకు వెళ్ళాడు.

"అన్నయ్యకు ఒక ఉత్తరం రాయి" అన్నాడు సతీశుడు.

"అదే అన్నిటికన్న ఉత్తమం" అన్నది యువతి.

"కొంచెం చెల్లెలు దొరసానికి ఇవ్వాళ కలిగిన అనుభవాన్ని కూడా రాయి. జ్యోతిష్‌బాబు చాల సంతోషిస్తాడు" అన్నాడు సతీశుడు.

ఎత్తిపొడుపు విని సరోజినికి కోపం వచ్చింది. దైవవశాత్తు ఆమె ఇవ్వాళ ఈవిధంగా రౌడీలచేతిలో పడింది. బాగా అవమానంకూడా పడవలసివచ్చింది. దానికే ఆమె చాల దుఃఖపడుతూవుంది. దానిమీద ఈ ఎత్తిపొడుపు? తను చేసినదానికి తనే పరితాపపడుతూవుంటే దానిమీద ఎవరైనా ఎత్తిపొడిస్తే సహించి వూరుకోవటం కష్టం. ఆమె చాలా కోపంతో "మీ చెల్లెలిని

నేనొంటరిగా పెద్ద ఆపదనుండి కాపాడాను. అని మీరే రాయరాదు? దానితో సంతృప్తిపడకపోతే రేపు పొద్దున్నే పట్నమంతా చాటింపు వేయించరాదు? నలుమూలలా వ్యాపించుతుంది. అన్నగార్యకుకూడా తెలుస్తుంది. చాల సంతోషిస్తాడు" అని నవ్వింది.

సతీశుడు ఆమె కోపానికి కారణం తెలుసుకున్నాడు. ఈ దొరసాని దగ్గిలంటే అతనికి అరికాలిమంట. ఇంగ్లీషువాళ్ళను అనుకరించటం కల్లు త్రాగటంకంటే, మాంసభక్షణకంటే పాపమని అతని మనసులో నాటుకుపోయింది. "ఇది ఆశ్చర్యపడవలసిన సంగతేమీ కాదు. మీ సంఘంలో ఇదంతా సహజమే" అన్నాడు.

"అయితే మాది పశువులసంఘమా ఏమిటి? మానవసంఘం కాదూ?" అన్నది సరోజిని.

"మీరు మనుష్యులెందుకుకాదు; బెంగాలులో మీరుతప్ప ఇంకెవరూ మనుష్యులులేరని మీ వుద్దేశం" అన్నాడు సతీశుడు.

"ఒక విధంగా ఈ సంగతి నిజంకూడాను. మాలో అలా అనుకుంటున్నారంటే నేను దాన్ని నేరంగా ఎంచను" అన్నది సరోజిని.

"అది నాకు తెలుసు. అందుకనే మీకు ఇంకెక్కువ శిక్ష పడాల్సింది. నేను అక్కడ నిన్ను గుర్తించినట్లయితే మొదలకుండా వచ్చేవాణ్ణి. పలకరించనుకూడా పలకరించేవాణ్ణికాదు" అన్నాడు సతీశుడు.

"ఏమిశిక్ష పడేది? అవమానమూ, అత్యాచారమా-ఇదేగా?" అన్నది సరోజిని.

"ఇదే?" అన్నాడు సతీశుడు.

"అయితే నాకు ఇప్పుడు తెలిసింది. అసహాయస్త్రీలను అవమానపరచటమే ఈ దేశవాసుల నియమమని ఎందుకు అన్నావో? ఇంకా మిగిలిన అవమానాన్ని ఇంటికి తీసుకొచ్చి స్వయంగా చెయ్యాలన్న వుద్దేశంతోనే ఈ మాట లంటున్నట్టు వుంది. ఎరుగున్న మనిషి నైపోయాను. అందుకని ఇబ్బంది వచ్చింది. ఈ కోపకారణం బహుశా ఇదేగా?" అన్నది సరోజిని.

వ్యంగ్యపూరితమైన సరోజిని మాటలువిని సతీశునికి కోపంవచ్చికూడా నవ్వాడు. "నిజంగా అందుకునే. నే అవమానం చెయ్యలేకనే నాకింత కోపం.

కాని బిహారి కదలలేదు. అతను సతీశుని మాటలను కొంచెంకూడా నమ్మలేదు. స్వాభావికాంగానే మామూలు మనుష్యులకంటే సతీశునికి ఆకలెక్కువ. తను నౌకరీకి వచ్చి ఇంతకాలమైంది. కాని సతీశుడు ఎప్పుడూ భోజనందగ్గర బద్ధకించి ఎరుగడు "అదేమిటిబాబూ ? ఆకలిగాలేదంటారు ?" అన్నాడు.

సతీశుడు విసుక్కుని "నీకున్న తెగులే యిది. ప్రతిమాటకీ 'లా'లు తీస్తూ కూర్చుంటావు. ఒకవైపున అంతా ఏర్పాటుచేస్తానని చెబుతున్నాను. కాని నువ్వు వినిపించుకోవు. వూరికే ప్రశ్నలమీద ప్రశ్నలు వేస్తూవుంటావు'' అన్నాడు.

బిహారి మెదలకుండా తిరిగి వెళ్ళబోతూండేసరికి సరోజిని పిలిచి "మామూలానే ఇవ్వాళ మీమీద ఈ కోపమంతాను. వంటఏర్పాట్లు ఏమీ చెయ్యలేదా ఏమిటి ?" అన్నది.

ఏర్పాట్లేమున్నాయి అమ్మా. అన్నీ అమర్చి వున్నాయి. కాని చేసేది ఎవరు ? వంటపంతులు ఎప్పటికి వస్తాడో తెలియదు'' అని బిహారి వెళ్ళిపోయాడు.

''ఎంతటి దొరసానినైనా బ్రాహ్మణపడుచేగా. ఆమెచేతి వంట తింటే ఎవరి కులగోత్రాలైనా పోతాయా ?'' అన్నది సరోజిని.

ఈ మాటకు సతీశుడు నవ్వి ''కులగోత్రాలు ! కులగోత్రాలు పోతాయో లేదో చెప్పలేనుగాని-దొరసానుల చేతివంట దిగుతుందా లేదా అనేదే ప్రశ్న'' అన్నాడు.

''అలాంటిదేమీ వుండదు. దొరసాని చేతివంట మీరు జన్మపర్యంతము మర్చిపోలేరు'' అని సరోజిని తన నవ్వుతోనూ, ఎసెన్సు వాసనతోనూ వసారా అంతా సుగంధమయంచేసి చివ్వునలేచి లోపలికి వెళ్ళిపోయింది. అయిదారు నిమిషాలతర్వాత ఆమె బైటకువచ్చింది. ఆమెకేసి చూచి సతీశుడు నిమిష మాత్రం ముగ్ధుడైపోయాడు.

కాళ్ళకు చెప్పులూ, మేజోళ్ళూలేవు. వంటిని సిల్కుచీర లేదు. సతీశుని ఎర్రంచు పంచెవుంది. చూడగానే సతీశుని కళ్ళు ఒక్కసారి చల్లబడి పోయినాయి. ''ఎంతబాగున్నది. సాక్షాత్తు లక్ష్మిలాగున్నావు!'' అనేశాడు.

ఈ మాటవిని సరోజిని శరీరమంతా ఆనందపూరితమైపోయింది. చెవుల ద్వారా ఇంత ఆనందం హృదయంలో ప్రవేశించటం జీవితంలో ఆమె ఎప్పుడూ ఎరుగదు. కాని సిగ్గుతో తల వంచుకొని "ఛత్!" అన్నది.

రెండు అక్షరాల శబ్దమేకాని తన నోటినుండి వచ్చిన ఈ రెండక్షరాలు ఆమె చెవులలో అమృతం కురిపించాయి. సతీశునికే కాదు. తన కంఠ స్వరంలో ఇంత మాధుర్యముంటుందని మొదటిసారిగా ఇవాళే ఆమె గ్రహించింది.

కాని సిగ్గును ఆమె ఘడియలోనే ఏదోవిధంగా అణచివేసింది. చదువు కున్న పిల్ల. కొత్తవాళ్ళతో నిస్సంకోచంగా మాట్లాడే అలవాటు ఆమెకు బాగా వుంది. సిగ్గును రానిస్తే నెత్తినెక్కి కూర్చుంటుందని ఆమెకు తెలుసు. అందుకే బలవంతాన తల ఎత్తి నవ్వుతూ "సరే, పాలు త్రాగు తొందరగా చేస్తునుగాని కొంచెంచల్లబడిపోయాయ్యా జాగ్రత్త ఎక్కడవుందో చూపించండి" అని ఆమె లోపలికి వెళ్ళిపోయింది.



# ౨౮

భోజనాలైన పిమ్మట ఇద్దరూ వసారాలో కుర్చీలమీద ఎదురు బదురుగా కూర్చున్నారు. ఈమధ్యలో 'నువ్వు', 'మీరు' సంగ్రామం ముగిసి 'నువ్వు' సింహాసన మధిష్ఠించింది.

"మనిద్దరిలో ఎవరికీ ఒక సంగతి తోచలేదు. మా ఇల్లు కనుక్కోలేకపోతే ఒక బండి తీసుకురమ్మని పంతులుతో చెప్పటం మర్చిపోయాం. బండి రాకపోతే ఏమిచేద్దాం సతీశ్ బాబూ ?" అన్నది సరోజిని.

"ఇంత పొద్దుపోయినతర్వాత ఇంతదూరం ఏ బండివాడు వస్తాడు. ఈ రాత్రికి నువ్వు ఇక్కడైనా వుండాలి, లేకపోతే నడచైనాపోవాలి. అంతకు తప్ప మరోమార్గంలేదు" అన్నాడు సతీశుడు.

"నడిచి వెళ్లగలను, కాని నీ వెంటతప్ప యింకెవరివెంటా వెళ్ళను."

"అంటే నా వెంటవస్తే ఏ విపత్తు రాదనేనా ?"

"ఎందుకురాదు ? కాని దాని భారమంతా నీమీదే వుంటుంది. దానికి తగిన సంజాయిషీ చెప్పవలసింది నువ్వే. నేను కాదు."

సతీశుడు చకితుడై "నేను సంజాయిషీ చెప్పవలసివస్తుందా ? నాకేం అవసరం?" అన్నాడు.

"ఇంకెవరిముందూ చెప్పకపోయినా నా ముందు చెప్పవలసి వస్తుంది" అని సరోజిని ఒక్కసారి మౌనం వహించింది.

సతీశుడు మళ్ళా దానికి ప్రతివాదన చెయ్యలేదు. కాని ఈ క్షణికమౌనం లోంచి ఒక లజ్జాపవనం విసిరిందని గట్టిగా గ్రహించాడు. ఆ విసురు అకస్మాత్తుగా సరోజినిని తల్లక్రిందులు చేసింది.

"వచ్చేది ఎవరు?" అని ఆమె కుర్చీమీదనుంచి లేచి నుంచున్నది. కొంచెంసేపటివరకు వసారా స్తంభాన్నానుకొని చీకట్లో తోటకేసి చూస్తూ నుంచున్నది.

కొంచెంసేపుండి ఆమె తనలో తానే మృదుకంఠంతో "ఎవరూ లేరు" అని మళ్ళావచ్చి పక్కకు కూర్చుంది. అప్పుడుకూడా సతీశుడు ఏమీ మాట్లాడలేదు.

"ఏదో అన్నారుగాని నేను వినలేదు. స్వయంగా వారు రాలేదు. నా చేత ఒక వుత్తరం పంపించారు" అన్నది సరోజిని.

"తర్వాత ?" సతీశు డడిగాడు.

"నేను వెళితే నువ్వు లేవనీ వృదయంబండికే వెళ్ళావనీ చెప్పారు. ఇక తర్వాత వంటపంతుల్ని తలుపుతీయించి ఇల్లంతా కలతిరిగి చూచాను. బైట వసారాలో ఒక చీర ఎండబెట్టి వుంది. అడిగితే ఎవరో అమ్మాయిదనీ, ఆమెకు జబ్బుచేస్తే నువ్వు తీసుకొని పడమటకు వెళ్లావనీ చెప్పాడు. ఆమె ఎవరు ? ఇక్కడ కనపడటంలేదే?" అన్నది సరోజిని.

సతీశుని ముఖం వుదాసీనమైపోయింది. కొంచెంసేపు మెదలకుండా వుండి "నేను ఆమెను తీసుకొని పడమటికి వెళ్ళానని చెప్పాడు ఆ వంట వాడు ? అబద్ధాలకోరు వెధవ. వుపేంద్రబాబు దీనిని నమ్మాడా?" అన్నాడు.

సతీశుని ముఖంచూచి కంఠస్వరం విని సరోజిని ఆశ్చర్యపడింది. "వుపేంద్రబాబు అప్పుడులేడు. వుంటే ఎందుకు నమ్ముడు? అయితే, సతీశ్ బాబూ! ఆమె నీ కేమౌతుంది?" అన్నది.

"నా కేమౌతుంది? ఏమీకాదు. మా పాత మెస్సులో పనిచేసే మనిషి. వెధవముండ రోగంతో చస్తూ యాచనకు వచ్చింది. దాన్ని తీసుకొని నేను పడమటికి వచ్చానా ? గాడిద, ఆ మాట నా ముందన్నట్టయితే........." అన్నాడు సతీశుడు కోపంగా.

సరోజిని ఆశ్చర్యానికి అంతులేదు. కొంచెంసేపు మెదలకుండా వుండి సతీశుని ముఖంకేసిచూచి వినయంగా "పనిమనిషా! అయితే తమరు ఇలా మండిపడతా రెందుకు ?" అన్నది. ఆమె అన్న 'తమరు' సంబోధన సతీశుని చెవులకు కటువుగా తోచింది. కాని దానివల్ల అతని కోప మేమీ తగ్గలేదు. "లేనిపోని అపవాదుకలువేస్తే ఎవడికి కోపంరాదు?" అన్నాడు.

"ఆ రాత్రి ఆమె మూర్ఛవచ్చి పడిపోయిందా?"

"పడిపోయింది. దానికేముంది ? ఆమె మూర్ఛిల్లి పడిపోవటంలో నా అపరాధ మేమున్నది?" అన్నాడు సతీశుడు.

సరోజిని మెదలకుండా కూర్చుంది. ఆమె హృదయంలో వుదయిస్తున్న ఆనందచంద్రుని కారుమేఘాలు ఎక్కడనుంచి వచ్చి కమ్మాయో తెలియదు.

ఆరాత్రి వృషేంద్రుడు భార్యతో అతని యింటికివచ్చి వెంటనే ఎందుకు తిరిగి వెళ్ళిపోయాడో అడగాలనుకున్నది. కాని అడగలేకపోయింది. దీనిలో ఏదో రహస్యముందని మాత్రం మనసులో అనుకున్నది. కాని దానిని వృషేంద్రుడూ బైటపెట్టలేదు, సతీశుడూ చెప్పడు.

కాని మౌనం ఇద్దరినీ పీడించసాగింది. మొదలపడదా ఉండలేక "సరే, తమరిని ఒకసంగతి అడగవచ్చునా?" అన్నది.

సతీశుడు కొంచెం కోపంతో "మళ్ళీ ఏమిటి?" అన్నాడు.

"మీరు ఇన్నిరోజులనుండీ దగ్గర వుంటూకూడా మా యింటికి ఎందుకు రాలేదు?"

సతీశునివద్ద దీనికి తగిన సమాధానం లేదు. "అనేక కారణాలవల్ల రాలేకపోయాను" అన్నాడు.

"కారణ మేమిటి? పనులా?"

"కాదు, పనులు వ్యవహారాలు నాకు నామమాత్రాలు. అవి నన్నెప్పుడూ ఎక్కడికి వెళ్ళటానికీ అడ్డుపెట్టలేదు."

"మరి ఇంకేమిటి?"

సతీశుడు కొంచెం నవ్వటానికి ప్రయత్నిస్తూ "నీతో నిజం చెబుతున్నాను. మీ సంగతి ఎప్పుడూ జ్ఞాపకం రాలేదని కాదు. మా సమాజం, మేము పొందిన శిక్షా - దీక్షలనుబట్టి మీలోనికి రావడం స్వాభావికంగా వేరవుగానే కనిపిస్తుంది. బహుశా అందుకనే రాలేక పోయివుంటాను" అన్నాడు.

"మీ శిక్షా, దీక్షలేమిటో నేను తెలుసుకోవచ్చునా? వృషేంద్రబాబు సమాజంతో ఆసమాజానికి పొత్తులేదనుకుంటాను ఎందుచేతనంటే వారికి మాతో కలిసిమెలసి వుండటానికి ఏ ఆటంకమూ లేదు?" అని సరోజిని కొంచెం నవ్వింది. ఆ మెస్సుస్త్రీ ప్రసంగం ఎత్తినతర్వాతనుండీ ఆమె హృదయంలో ఒకజ్వాల రగులుతూవుంది ఆ అనవసర ప్రసంగము విన్నతర్వాత ఆ ఈర్ష్యాగ్ని మరింత ఎక్కువైంది. సతీశునియందు ఆమెకు ఆంతర్యంలో ప్రేమ లేకపోతే ఈ గుట్టుమట్టులన్నీ బహుశా కప్పిపుచ్చివుంచేదేమో? అంతరంగిక ప్రణయ దృష్టిని అంత తేలికగా మోసపుచ్చలేకపోయింది. వివరంగా తెలుసుకోలేక పోయినా ఆమె హృదయం ఏదోవిధంగా అసలుసంగతిమాత్రం గ్రహించింది.

సతీశుడు వ్యాకులపడి, ఆశ్చర్యంతో సరోజినికేసి చూచాడు. ఆమెగొంతులో అణగియున్న కలహధ్వని సతీశుని చెవులలో ప్రవేశించి సావిత్రిని జ్ఞాపకం చేసింది. కాని ఈ మధ్యలో సరోజినికి తనమీద ప్రేమ కలుగుతుందని సతీశుడు కలలోకూడా అనుకోలేదు. అందుకనే ఈ ప్రశ్నపరంపరకు యథార్థకారణం తెలుసుకోలేకపోయాడు. ఇది ఉన్నత శిక్షణయొక్క స్పర్థాపూర్ణ వ్యవహార మనుకొని అతనుకూడ లోలోన మండిపడి "నృపేంద్రబాబు సమాజం బాగా చదువుకున్నది. సంస్కారంగలది. అందుకనే మీతో కలసిమెలసి వుండ గలుగుతున్నారు. గానీ నేను అసమర్థుడనై కలసిమెలసి వుండలేకపోయినంత మాత్రాన కారణం చెప్పవలసినంత బాధ్యుడనేమీ కాదు. ఏది ఏలాగైనా వుండనీయండి. ఈ ఆలోచనవల్ల ఏమీ లాభం లేదు" అన్నాడు.

అతని మాటవిని సరోజిని మెదలకుండా అతనికేసి చూస్తూ వుండి పోయింది. ఆమె అభిమానాన్ని సతీశుడు కటువుగా కాలరాచాడు. ఆమె హృదయంలో భావాలను అతను ఇలా అవమాన పరుస్తాడని ఆమె కలలో కూడా ఊహించలేదు. ఆమె వుదాసీనవదనంతో మెదలకుండా చూస్తూ వుండిపోయింది. నోటినుండి ఒక్క మాటకూడా రాలేదు. సతీశుడుకూడా మెదలకుండా మొహం నేలవేసుకొని కూర్చున్నాడు.

ఈ దుస్సహానీరవతను భిన్నపరుస్తూ దూరాన్నుండి బండి చప్పుడు వినబడింది. సరోజినిలేచి మళ్ళీ స్తంభందగ్గర కెళ్ళి నుంచుని మృదువుగా "అన్నయ్య వస్తున్నట్టు వుంది" అన్నది.

పది నిమిషాలలో బండివచ్చి వాకిట్లో నుంచుంది. జ్యోతిష్‌బాబు సతీశుని బిగ్గరగా పిలుస్తూ లాంతరుతో, మనుష్యులను వెంబడి తీసుకొని తోటలో ప్రవేశించాడు. రెండు నిమిషాలలో వసారాలోకి వచ్చి చాల ప్రేమతో చెల్లెల్ని కౌగిలించుకున్నాడు.

జ్యోతిష్‌బాబు ఆచారప్రకారంగా సతీశుని యోగక్షేమా లడిగి తెలుసుకొని, అతనికి అనేక ధన్యవాదా లర్పించి, కృతజ్ఞత చూపించి చెల్లెల్ని తీసుకొని వెళ్ళటానికి బైలుదేరాడు. "నేను మిమ్మల్ని ఒక్క సంగతి అడగటం మర్చిపోయాను. నృపేంద్రబాబుకు హరన్‌బాబు అనే స్నేహితు డున్నాడు. అతనికి ఎలావుందో తెలుసా?" అన్నాడు సతీశుడు సరోజినితో.

జ్యోతిష్ ఆశ్చర్యంతో "మీకు తెలియనా ఏమిటి? వారు దేహం చాలించారు" అని సమాధానం చెప్పాడు.

ఈ సంగతి విన్న తర్వాత సతీశుడు కొంచెం సేపు మౌనంగా నుంచొని "అతని తల్లీ భార్యా ఎక్కడవున్నారో తెలుసా" అన్నాడు మెల్లిగా.

"వారింటివద్దనే వుంటున్నారు. దివాకర్‌బాబు నాగపూర్‌లోనే సైన్సు కాలేజీలో చదువుతూ వారిని కనిపెట్టుకుని వుంటున్నాడని తెలిసింది" అన్నది సరోజిని.

"హారన్‌బాబు భార్య ఒకరోజున మన ఇంటికి వచ్చింది కదూ?" అలవని తలంపుగా జ్యోతిష్ చెల్లెల్ని అడిగాడు.

"అవును, చాలసేపువుంది. నాతో కబుర్లు చెప్పింది కూడా" అన్నది సరోజిని.

కిరణ్మయి తనను గురించి ఏమిచెప్పిందీ. భర్త - మృత్యువార్తని ఎలా స్వీకరించిందీ - మొదలైన సంగతులు తెలుసుకోవాలని సతీశుడు సరోజిని మొహంకేసి చూశాడు. తన్ను గురించి ఎన్ని ఆలోచనలు వున్నా [illegible] వుండదు. ఆ మసక వెలుగులో సరోజిని అతని మొహంలోని భావం గ్రహించలేకో, గ్రహించికూడా సతీశుని కుతూహలం తీర్చ ఇష్టపడక లేచి [illegible] కున్నదో, సాగమని, అన్న వీపు తట్టి "ఇక ఆలస్యం చెయ్యకు పద అన్నయ్యా" అన్నది మృదుస్వరంతో. "పద, అమ్మా!" అని సతీశునికి నమస్కారం చేసి "మరొక వందనశతము సతీశ్ బాబూ! రేపు ఎప్పుడైనా మా కుటీరాన్ని పవిత్రం చెయ్యండి" అన్నాడు జ్యోతిష్.

సతీశుడు ప్రతినమస్కారం చేసి అవ్యక్తస్వరంతో ఏమన్నాడో ఎవరికీ అర్థంకాలేదు. సరోజిని సతీశునికేసి చూచి సాధారణ నమస్కారం చేసి వెళ్ళిపోయింది.

అక్కడ నుంచునే సతీశుడు కన్నీరు కార్చసాగాడు. దీనికి సరైన కారణం అతను తెలుసుకోలేకపోయినా తన సావిత్రీ, తన వదినా, తన వుపేంద్రబాబూ అందరూ ఒక్కసారి బహుకాలంగా తన్ను దూరంగా వుంచారని ఏదో అనిర్దిష్ట అనుభూతి అతనికి చెప్పసాగింది. ఈ నిర్జనాంధకార కుటీరం తప్ప అతను వెళ్ళటానికిగాని నిలబడటానికిగాని ప్రపంచంలో మరో స్థానంలేదు.

# ౨౯

రెండేళ్లక్రితం, హరన్ మృత్యుసమయములో దివాకరుడు కలకత్తా వచ్చి రెండుమూడు రోజులుండి వెళ్ళిపోయాడు. ఈ సారి కిరణ్మయి అజమాయిషీలో వుండి కలకత్తాలో బి. ఏ. చదవటం నిశ్చయమైన తర్వాత అతను తనకని కొత్తగా కొన్న పెట్టెలో పుస్తకాలు, బట్టలు, ఇంకా అవసరమైన తదితర వస్తువులు పెట్టుకొని ఒక రోజు సాయంత్రం పథరియాఘట్టాకు హరన్‌బాబు ఇంటికివచ్చి చేరాడు.

కిరణ్మయి అతని తన చిన్నతమ్మునిలాగా ఆదరించి దగ్గరకుతీసింది.

వుపేంద్రుని ఇంటివద్ద సురబాలతప్ప దివాకరుని ప్రేమించేవారింకెవరూ లేరు. ఆ ప్రేమవలన దివాకరునికి ప్రాప్తించిన సుఖశాంతులవడ్డీ అసలు ఫాయిదాలతో సహా వసూలుచేసేది మహేశ్వరి తీవ్రదృష్టి. శనిలాగ ఎప్పుడూ అతని మొహాన నెత్తురు పీల్చుతూ వుండేది. కాని ఇక్కడ అటువంటి వేమీ లేవు. అలాంటి అనుమానంలేదు.

రాతిగుట్టమీద ఎండుతూ వాడుతూ వున్న మొక్కకు విశాల భూపరిధి దొరికినట్లు - దివాకరునికి కిరణ్మయి ఆశ్రయం దొరికింది.

విశాల కలకత్తా మహాపట్నంయొక్క విచిత్రవాతావరణాలలోపడి చూస్తూ చూస్తూవుండగానే-దివాకరుని సంకుచిత ఆశా సంకీర్ణ భవిష్యత్తు విశాలమైపోయింది. అతని మనసులో గొప్పతనం వచ్చింది. బి. ఏ. తప్పినతర్వాత అతని తెగిపోయిన విద్యాభ్యాసపు పాతతీగతో కొత్తతీగను అతుకుపెట్టటానికి ఇంకా ఆలస్యముంది. ఈ సదవకాశంలో అతను నిరంతరం సర్వత్ర గాలించి రసపరిచయం చేయసాగాడు.

థియేటరుచూస్తే అతనికి స్వప్నం చూచినట్లనిపించింది. పక్షుల చూచిచూచి ఆశ్చర్యంతో అతను నోరు మెదల్పలేకపోయాడు. ఎమ్యూజిమెంటు పార్కు చూచి మౌనంగా వుండిపోయాడు. శివపురి వ్యవసాయ శాఖను చూచి వ్యాసం రాశాడు. పెద్దపెద్ద భవంతులకేసి వెర్రిగా చూస్తూ వుండిపోయేవాడు. ఒకరోజున అలా చూస్తూ బండికింద పడబోయి పరిగెత్తి కాలు మెలగబడి ఇంటికి వచ్చాడు. చాల స్వల్పమైనదే దెబ్బ. కిరణ్మయి వెంటనే

పసుపు సున్నం పుడక కట్టి కాలుకు కడుతూగా, నవ్వుతూగా, దేనికి దపడ్డావు? గుఱ్ఱపుబండా, ఎద్దుబండా?" అన్నది.

సిగ్గుపడి "గుఱ్ఱపుబండి" అన్నాడు.

"ఇంకా నయ్యం! ఎద్దుబండికిందగాని, దున్నపోతుబండికిందగానీ, పడితే కుంటుకుంటూ కుంటుకుంటూ పోయి చార్జీ యివ్వాల్సివచ్చేది" అన్నది కిరణ్మయి.

దివాకరుడు చిన్నమొహంతో "అంత దెబ్బ తగలలేదు. రేపటి ప్రొద్దుటికి నయమౌతుంది" అన్నాడు.

"ఏమయినా వుంటుంది గాని, ఇక ఎక్కడకూ వెళ్ళకు. కలకత్తాకు పిల్లలను ఎత్తుకుపోయే దండు వచ్చిందని విన్నాను" అన్నది కిరణ్మయి.

ఈ విధంగా కాలం గడుస్తూవుంది. అప్పగారయి తీర్థయాత్రలు తిరిగి తిరిగి ఒకరోజున ఇంటికివచ్చింది. ఇంతకుముందు ఆమె ఒకటి రెండుసార్లు దివాకరుని చూచింది. కాని అప్పుడు ఆమె హృదయం పుత్రశోకంతో నిండి వుండటంచేత అతని మొహంకేసి చూడలేకపోయింది. ఇవ్వాళ ఇంకా గడ్డం మీసాలురాని సుందర యువకుని కేసి చూడగానే ఆమె హృదయం ప్రేమతో కరిగిపోయింది. "వరసకు నేను నీకు పిన్నినౌతాను. నన్ను పిన్నీ అని పిలువు [illegible]" అన్నది.

అతనికికూడా తల్లిదండ్రులు లేరని విని వృద్ధ కళ్ళనిండా నీళ్ళువచ్చాయి. పమిట చెంగుతో తుడుచుకొని "భగవంతుడు వాడిని తీసికెళ్ళి ఈ నిర్భాగ్యురాలిని ఇంకా ఈ లోకంలోనే వుంచాడు. నేను బతికినంతకాలం నువ్వు నన్ను వదలి ఇంకెక్కడికి వెళ్ళవద్దు బాబూ!" అని అతని తల నిమురుతూ వృద్ధ తన ప్రేమ కనుపర్చింది.

మెత్తని ఆమె మాటలు విని, ఆమె కళ్ళల్లో నీళ్ళుచూచి దివాకరుని కళ్ళల్లోకూడా నీళ్ళు తిరిగాయి. కాని వాటిని కప్పిపెట్టుకోడానికి అతను అక్కడనుండి మొహం చాటు చేశాడు. కొద్దిరోజులలోనే దివాకరునియందు ఆమె వాత్సల్యమూ, ప్రేమా, గారడీవాని వృక్షంలాగ ఆకులు కొమ్మలూ వేసి పెరగసాగింది. ప్రవాసంలోవున్న ఆ పుత్రహీనజనని హృదయపూర్వకంగా కొడుకులేని కొరత ఈ విధంగా తీర్చుకోసాగింది. కొంతకాలంక్రిందట ఆమె

కడుపున పుట్టిన బిడ్డ పోయినప్పుడు ఈ మాతృశోకమే ఆమె మాతృత్వాన్ని రక్షించి కొంతవరకు బతికించింది. ఇప్పుడు ఆ శోకం కావలసినదానికంటె ఎక్కువగా శాంతించింది. దీనివలన ఆమె మాతృహృదయం సింహాసనంమీద ఆమె దివాకరుని పెద్దసమారోహణతో అభిషిక్తుని చేసింది.

బిడ్డకు మొహంవాచిపోయిన ఈ వృద్ధతో కిరణ్మయిలాంటి తెలివిగల కర్తవ్యపరాయణురాలైన పదిన చెంత వుంటున్నది. దివాకరుని ఈ ఇంట్లో ఆదర సత్కారాలకు లోటులేదు.

ఇక్కడ దివాకరునికి — అకలికాకపోతే కారణం చెప్పవలసివస్తుంది. అస్వస్థతగావుంటే సమాధాన మివ్వవలసి వుంటుంది. ఈ నిగూఢప్రేమ సారస్యాన్ని తన ఇరవై ఏళ్ళ జీవితంలో అత నింతవరకు చవిచూడలేదు. జీవితంలో ఇంత మార్పు వచ్చిన మొదటి రోజులలో కొన్నికొన్ని విషయాలు ప్రతిబంధకంగా కనబడుతూవుండేవి. చిన్నతనంనుండి అలవాటైన బానిసత్వం ఒక పట్టున వదలిపోలేదు. అయినా అతని సంకుచితహృదయం యీ ఇద్దరి అపరిచిత ప్రేమతో కొంచెం విశాలమైంది. దుఃఖాన్ని సహించే అలవాటు చెట్టు బెరడులాగా అతనిలోనుంచి ఎప్పుడు పోయిందోకూడా తెలుసుకోలేక పోయాడు.

దివాకరుడు ఇక్కడ నేర్చుకోవలసిన సభ్యతలన్నీ నేర్చుకొన్నాడు. అతనికి బండ్లకింద పడతానన్న భయం పోయినతర్వాత సభలకూ సమావేశాలకు కూడా వెళ్ళటం మొదలుపెట్టాడు. కొద్దిరోజులలోనే ఒక మాసపత్రికకు ప్రముఖరచయిత యైనాడు. చిన్నతనమునుండి అతనికి సంగీత సాహిత్యాలయందు ప్రేమానురాగా లుండేవి. చిన్నచిన్న గేయాలుకూడా రాస్తూ వుండేవాడు. ఇప్పుడు దివాకర్ 'వంధ్యోపాధ్యాయ' అనే పేరుతో కథలు వ్రాస్తున్నాడు. కాలేజీ కుర్రవాళ్ళు కొందరు కలసి 'చంద్రోదయ' అను మాసపత్రిక పెట్టారు. దానికోసం దివాకరుడు వెర్రివాడిలాగ తిరుగుతూవుంటాడు.

ఇప్పుడతను ఇంట్లోంచి బైటకు ఎక్కువగా కదలటంలేదు. ఇతనికి చాలా పని వుంటోంది. కాగితం పెన్సలు తీసుకొని ఆ శిథిలగృహంలో పైకెళ్ళి కూర్చుంటే-ఆకలి దప్పులుకూడా జ్ఞాపకమొచ్చేవికావు. పెద్దగా కేకలు పెట్టిన తర్వాత కిందకు దిగివచ్చేవాడు. అతని మనోరాజ్యంలో కలిగిన ఈ కొత్త వుపద్రవాలనుచూచి అఘోరమయి భయంతో "తప్పు ఇంటిదిగాని

అతనిది కాదు. హారన్ కూడా ఈ పిచ్చితోనే ప్రాణాలు తీసుకున్నాడు. ఇతన్ని కూడా ఆ రోగమే పట్టుకున్నట్టు వుంది. ఇది మంచిది కాదు. పరాయి బిడ్డ. ఏమి తెలుసు......" అనేది.

కిరణ్మయి అత్తమాటలు విని నవ్వుతూ "భయపడకు అత్తా! చదువుసంధ్యలలో మగ్నమై యున్నందువల్ల అతని ఆయుస్సు తగ్గదు. ఇంకా వృద్ధి అవుతుంది" అన్నది.

తర్వాత కొంతకాలానికి చంద్రోదయపత్రికలో 'విషఖడ్గము' కథ వెలువడింది. చంద్రోదయ పత్రిక దానిని పరిచయం చేస్తూ, వంగభాషీయులకు గౌరవస్వరూపమైన దివాకరవంద్యోపాధ్యాయుడు వ్రాసిన ఈ కల్పికలో యథార్థమైన ఒక ప్రేమఘట్టం అంకితమై యున్నది అని వ్రాసింది.

తర్వాత యథార్థమైన ఆ ఘట్టంలో ఏమేమి వుందో, విమర్శకమహాశయుడు చదువుతూ చదువగా ఎలా కన్నీరు కార్చాడో, వ్రాస్తూ చివరికి ఇటువంటి కథలు ఇంకా చదవాలని కుతూహలంగా వుందని వ్రాశాడు.

ఈ ప్రశంస యథార్థమని నమ్మటానికి దివాకరునికి ఎక్కువ ఆలోచించవలసిన అవసరంలేక పోయింది. ఏ స్థితిలోనూ కూడా మానవ జీవితాశను, గగన కుసుమ కల్పనలను వదలి మానవుడు ప్రత్యేకంగా వుండలేనట్టు - ఇప్పుడు అతను ఆ స్థితిలోనే వున్నాడు. ఈ మధ్య అతను ఇద్దరు ముగ్గురి ప్రశంసతోనూ, మిత్ర బాంధవుల సాయంతోను సాహిత్యకిరీటాన్ని శిరసున ధరించి కూర్చున్నాడు. చంద్రోదయ సంపాదకుండు అతనికి పుస్తకాల బొత్తులను పంపాడు.

ఈ అపూర్వసాహిత్యకిరీటం శిరస్సున ధరించి దివాకరుడు ఒకరోజు ప్రొద్దున్నే గర్వోజ్జ్వల వదనంతో వంటింట్లోకి కిరణ్మయి దగ్గరకు వచ్చి-అతని చేతిలో ఆ చంద్రోదయ పత్రికే వున్నది-"పనిలో మునిగివున్నావా వదినా?" అన్నాడు.

కిరణ్మయి వంటచేస్తూవున్నది. "ఆఁ లేదు. వంట అయిపోవచ్చింది నీ చేతిలో ఆ పత్రికేమిటి?" అన్నది.

"ఒక మాసపత్రిక, చంద్రోదయ, కొత్తగా వచ్చింది. కాని చాలా బాగా వుంది".

కిరణ్మయికి చంద్రోదయ పత్రిక వున్నట్టే తెలియదు. "నిజంగానా? ఏదీ చూస్తాను?" అన్నది ఆతురతతో.

"ఇప్పుడే చూస్తావా ?"

"లేదు. నా మంచంమీద పెట్టి వెళ్ళు. పనైపోయినతర్వాత వచ్చి చూస్తాను"

పనిపాటలైనతర్వాత చంద్రోదయ తెరచి పుటలు తిరగవేసేటప్పటికి ఆమె దృష్టి అసలుచోటే పడింది. దివాకరుడు ముందుగదిలో వున్నాడు. అతనిదగ్గరకువెళ్ళి, "నీ విషఖడ్గం ఎక్కడవుందిబాబూ? విమర్శచూచాను. అసలు వస్తువు కనిపించదే" అన్నది.

దివాకరుడు సిగ్గుపడుతూ "ఓ ఆ కథా? దానిలో ఏమీలేదు. ఏమి చూస్తావు వదినా?" అన్నాడు.

కిరణ్మయి నవ్వి "నువ్వు ముందు చూపించు" అని తర్వాత తనే స్వయంగా ఆ చంద్రోదయ సంచిక వెతికి తీసికొని అక్కడే బల్లమీద కూర్చుని మొదలకుండా చదువసాగింది. దివాకరుడు ఆశానిరాశల వుత్తేజాన్ని అణచుకొని పుస్తకం ము దరపెట్టుకొని పుటలు తిరగవేస్తున్నాడు. అతని 'విషఖడ్గా'నికి నాయిక షోడశి, అసమానసుందరి. ధనిక జమీందారు కూతురైనప్పటికి దైవసంకల్పంవల్ల ఒక దరిద్రయువకునికి హృదయ మర్పించింది. జమీందారుకు ఈ సంగతి తెలిసేప్పటికి అతన్ని తనరాజ్యంనుండి వెళ్ళి పొమ్మని శాసించాడు. కాని ఈ సంగతి అతని కుమార్తె నగేంద్రనందినికి తెలియదు. ఒకనాటి వసంతసంధ్యలో మాలతీకుంజంకింద కూర్చుని చాలప్రేమతో మాల గ్రుచ్చుతూవుంది. ఒకవైపున రూపముగ్ధుడైన చంద్రుడు చెట్లచాటు నుండి తొంగిచూస్తూన్నాడు. కాని ఆకాశంమీదికి రావటానికి సాహసించలేక పోతున్నాడు. ప్రభాతకాల మనుకొని మధ్య మధ్య కోయిలకూస్తోంది. లోభి భ్రమర ఝుంకారంచేస్తూ నిద్రాలసతతోనున్న మాలతిని నిద్రలేపుతూ వున్నది. ఆ సమయాన అక్కడికి మెల్లగా వచ్చింది. ఎవరు! విజయేంద్రుడు కాదుగదా? అవును, అతనే. కాని ఈ వేషమేమిటి? కాషాయవస్త్రాలు, మొహాన విభూతిరేఖలు, మెడలో రుద్రాక్షమాల! నగేంద్రనందని చేతిలో మాల క్రిందపడిపోయింది. విజయేంద్రుడు దగ్గరకువచ్చి దుఃఖకంఠంతో "సెలవు నందా! వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

నగేంద్రనందిని నెత్తిమీద ఒక్కసారి పిడుగుపడినట్లు అయింది. హృదయంలో అగ్నిజ్వాలలు చెలరేగినట్లు అయింది. హృదయం ముక్కలు చెక్కలై పోయినట్లయింది. ఆమె కళ్ళకు వెన్నెల చీకటిగా కనిపించింది. చెవులకు కోయిలపలుకులు గుడ్లగూబకూతలుగా వినిపించాయి. ఇంకపతి ఒక్క నిలబడలేక మూర్ఛిల్లి క్రిందపడిపోయింది!

ఇంతవరకు చదివి కిరణ్మయి చప్పున తలెత్తి "నిజంగా ఇంతవరకు నువ్వెవరికైనా హృదయమిచ్చావా బాబూ?" అన్నది.

దివాకరుడు ఆశ్చర్యంతో "నేనా?" అన్నాడు.

"అవును. నువ్వే. నువ్వెవరినైనా రహస్యంగానైనా ప్రేమిస్తున్నావా?"

ఈ ఆకస్మిక అపవాదుకు అతను కించపడి మాట్లాడలేదు. కొంచెం సేపటికి తెప్పరిల్లి "నేనా! ఛా! దైవసాక్షిగా ఎప్పుడూ లేదు" అన్నాడు.

"లేదూ? నిజం చెప్పు బాబూ? ఎప్పుడూ నీ హృదయంలో అగ్నిజ్వాలలు చెలరేగలేదూ?"

"ఎప్పుడూ లేదు".

"చాలా ఆశ్చర్యమే! ఎవరైనా జ్వాలలతో బాధపడుతూ వుంటే నువ్వైనా చూడలేదూ?" అన్నది కిరణ్మయి.

"చూడను కూడా లేదు".

కిరణ్మయి మరింత ఆశ్చర్యపడి "నీ హృదయం ఏనాడూ వందముక్కలైనట్టు అనుకోలేదు? ఎవరినీ ఏనాడూ ప్రేమించలేదు? కన్న సంతును కూడా కంటితో చూచి ఎరుగవు? వజ్రాఘాతపు బాధ ఎలావుంటుందో కూడా నీకు తెలియదు? అయితే విరహం ఇంత భయంకరంగా వుంటుందని నీ వెలా గ్రహించావు?" అన్నది.

కిరణ్మయి తన్నెక్కడికో తీసుకుపోతోందని దివాకరుడు గ్రహించాడు. కళ్ళెర్రజేసి "లేకపోతే గ్రహించలేమా?" అన్నాడు.

"ఎలా గ్రహించగలరో నాకు తెలియదు, కాని వినో, ఇతరుల పుస్తకాలలోంచి దొంగిలించో వ్రాయవచ్చునంటే నేను వప్పుకుంటా" అన్నది కిరణ్మయి.

దివాకరునికి ఆవేశం కలిగింది. "అంటే, నేను దొంగతనం చేశాననేగా నీ వుద్దేశం?" అన్నాడు. కిరణ్మయి నవ్వి "వుద్దేశం అదే. దొంగిలించటంలో

సందేహంలేదు. అదికాక నీవు నీదొంగతనం తెలుసుకోనంత అంధుడవు. కోప గించుకోక బాబూ? అయితే నీకు ఈ జ్వాలలు వజ్రాఘాతాలు తప్ప ఇంకే సంపత్తీ దొరకలేదూ? ఈ సంపత్తితోనే నువ్వు జీవితం గడపగలవా? నవ లలు రాయటం అంత తేలికకాదు. నాయనా! సముద్రాన్ని లంఘించటానికి కూడా దేవతల ఆశీర్వాదం అవసరం. వూరికే రాదు'' అని ఆమె నవ్వసాగింది.

ఈ మాట విని దివాకరుడు స్తంభించిపోయాడు. ఇంతకాలం నుండి తియ్యతియ్యని మాటలు, మృదువైన నవ్వూ ప్రాప్తించినవి. కాని ఇప్పుడు ఆమె ఈ ఎత్తిపొడుపులనూ, పరిహాసానికీ ఏమి సమాధానం చెప్పాలో అత నికి అర్థంకాలేదు. కొంచెంసేపు మెదలకుండా వూరుకొని నిమ్మళంగా ''ఈ కథలు వ్రాసేవారంతా ప్రేమపిపాసులేనా? అందరూ వియోగదుఃఖాన్ని అనుభవించిన వారేనా? అలా అనుభవించాలనే ఆశతో కూర్చోటమంటే సాహిత్యచర్చే వదిలిపెట్టటమన్న మాట" అన్నాడు.

అతను ఇలా ఆవేశపడటంచూచి కిరణ్మయి నవ్వి "దీనిని సాహిత్యచర్చ అంటారా? కాదు, ఇది అనధికారచర్చ" అంటూనే ఆమె నవ్వు ఆపుకోలేక పోయింది. తర్వాత గంభీరురాలై "ఇప్పుడు నా మాట తెలుసుకోలేవు. ఏనాడూ తెలుసుకొనే అవకాశం రావద్దనికూడా ఆశీర్వదిస్తున్నాను ఇదిగో చూడు. వయసుకు నీకంటే నేను పెద్దదాన్ని. నా ఈ ఒక్క మాటమాత్రం విను. నీకు తెలియని సంగతులు యితరులకు చెప్పాలని వ్యర్థప్రయత్నాలు చెయ్యక!" అన్నది.

దివాకరుడు ఏమీ మాట్లాడలేదు.

కిరణ్మయి కొంచెసేపు మెదలకుండా వూరుకొని, మళ్ళీ గొంతు సరి చేసుకొని "ఇది కోపంతోగాని, అభిమానంతోగానీ, అన్న మాటకాదు బాబూ! ఇది చాల నిగూఢమైన విషయం. ఈ గూఢరహస్యాన్ని తెలుసుకో గల అధికారం ప్రపంచంలో ఏ కొద్దిమందికో వుంటుంది. ఈ గురుతరభారం వారిచేతులలోనే పెట్టి మనస్సును మరోపనిలో లగ్నంచేస్తే మంచీ చెరువూ ఏమీ వుండదు. మేడమీద మొహం వేలాడ వేసుకు కూర్చొని కల్పనలు చేసు కున్నందువల్ల లాభంలేదు. నీకు ఇదే స్పష్టంగా చెబుతున్నాను. నువ్వు రాగి రేకుమీద బంగారు పూతవేసి నీలాంటి వాజమ్మను మరపించగలవుగాని, పుటం

పెట్టిన బంగారపురంగును గుర్తించిన వానిని, ఈ దుఃఖబాధలలో జీవితమును గడిపినవానిని, ఎలా మరపించగలవు బాబూ?" అన్నది!

దివాకరుడు మెత్తపడి "అయితే కల్పన ఏమీ కాదా?" అన్నాడు.

"కల్పన ఏమీ కాదని నేననటంలేదు. కాని వట్టి కల్పనవల్ల ఏమీ కాదని నేనంటున్నాను. అది రూపాన్ని సృష్టించగలదు. కాని ప్రాణం పొయ్యలేదు. బరువు మోయగలుగుతుంది. కాని దారిచూపలేదు. నువ్వు ఆమార్గదర్శక జ్యోతిని కనుక్కోలేనంతవరకు, నీ జ్వాల నిన్నే మాడ్చుతుంది." అన్నది కిరణ్మయి.

ఆమె చివరమాటకు దివాకరుడు మళ్ళా మండిపడ్డాడు. అతని కోప మొహంవంక చూచి కిరణ్మయి మళ్ళీచిరునవ్వునవ్వి "కాని నీలాగా చంద్రోదయ సంపాదకునికి కన్నీరు ఆగిపోవటానికి కారణమేమిటా అని ఆలోచిస్తున్నాను. చివరికి నరేంద్రనందినికూడా విషం తాగి చనిపోలేదుగదా?" అన్నది.

కోపంలో దివాకరుడు ఏమీ సమాధానం చెప్పలేదు.

కిరణ్మయి కథ చివరిభాగం చూచి "ఎవరి శవాన్ని ఆ శ్మశానానికి తీసుకు వెళ్ళేది? ఎవరికోసం వేలకొలది ప్రజ గుండెలవిల ఏడుస్తున్నది? ఏ దుఃఖంలో మహాప్రతాపి జమీందారు వున్మత్తునిలాగ విలపిస్తున్నాడు?. ఆహా! ఇది ఎంత హృదయ విదారకదృశ్యం! విజయేంద్రుడు మెల్లగా ఆ వైపుకే సాగివెళ్ళాడు. కిరణ్మయి తర్వాత చదవలేకపోయింది. నవ్వి పత్రిక దివాకరునిమీద విసరివేసి "వేళయిపోయింది. పద, అన్నం వడ్డిస్తాను" అని నవ్వుతూ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

దివాకరుడు శిలావిగ్రహంలాగ అలాగే కూర్చుని వుండిపోయాడు.

---

# 30

అయిదారు రోజులకు ఒకనాటి మధ్యాహ్నం దివాకరుడు కిరణ్మయి గదిలోకి వెళ్ళి చూచాడు. ఆమె చాపమీదకూర్చుని చాల ధ్యానంలో వ్రాతమూల సంస్కృత రామాయణము చదువుతూవుంది. ఇదిచూచి అతనికి చాల ఆశ్చర్యంకలిగింది. కిరణ్మయి మామూలు సంసార స్త్రీలకంటే ఎక్కువ చదువుకున్నదని, బెంగాలీయేగాక హిందీ, ఇంగ్లీషుభాషలుకూడా వచ్చునని దివాకరునికి తెలుసు. కాని చేవ్రాతతో నున్న సంస్కృత పుస్తకంకూడా ధారాళంగా చదువగలదని అతను కలలోకూడా అనుకోలేదు. ఆశ్చర్యంతో కూడుకొన్న శ్రద్ధతో అతను అక్కడే కూర్చోబడ్డాడు.

కిరణ్మయి చేతిలో పేజీ సరిగా పెట్టి తలెత్తి "ఇన్వాళ సమయం కాని సమయంలో వచ్చావేంబాబూ?" అన్నది.

దివాకరుడు కొంచెం ఆగి "మీరు ఈపాటప్పుడు చదువుతూవుంటారని నాకు తెలియదు. నేననుకొన్నాను......"అన్నాడు.

"నేను నిద్రపోతూవుంటాను. ఒంటరిగాచూచి లేపుదా మనుకొని వచ్చావా ?"

దివాకరుడు సిగ్గుతో క్రుంగిపోయి "నీవు ఇలాంటి పరిహాసా లాడా వంటే ఇక్కడనుంచి పారిపోతాను తెలుసా ?" అన్నాడు.

కిరణ్మయి నవ్వి "పారిపోవటం నోటితో అన్నంత తేలిక కాదుబాబు!- పారిపోయి ఎక్కడికి వెళతావు? దారి నీకు తెలియదు. సరే కూర్చో. నిజంగా కోపంతోనే వెళ్ళుతావా? మా చిట్టిబాబు ఇంట్లో కూర్చుని, 'విమఖడ్గమో మరే పెద్ద ఖడ్గమో తయారుచేస్తున్నాడో' అనుకొని పిలవలేదు. లేకపోతే ఈ రెండు ఝాములవేళ రామాయణం చదవటం నాకుమాత్రం ఇష్టమా?" అన్నది.

రామాయణాన్ని నువ్వు యాధార్థమని ఒప్పుకుంటావా వదినా? అన్నాడు దివాకరుడు.

"ఒప్పుకుంటాను?

దివాకరుడు చాలా ఆశ్చర్యంతో "కాని చాలమంది ఒప్పుకోరు. యథార్థంగా దానిలో ఎన్ని కల్పిత విషయాలున్నా యథార్థమని ఒప్పుకోటానికి......" అన్నాడు!

కిరణ్మయి చిరునవ్వునవ్వి పుస్తకం చేతిపట్టుకొని "ఇదేనా మూల గ్రంథం. కల్పిత విషయాలు దీనిలో ఎన్ని వున్నాయో చూపించు" అన్నది.

దివాకరుడు తెల్లబోయి "నే నెలా చూపించగలను? నాకు సంస్కృతం రాదుగా" అన్నాడు.

"రాకపోబట్టేనా నీ వీ మాట ఇంత తేలిగ్గా అనగలిగింది. విద్య లేకపోతేనే అవిద్య హృదయంలో ప్రవేశిస్తుంది. దానికి తోడు మానవుడు స్వయంగా తెలుసుకోని విషయాన్ని గురించి పైకి కల్పించి ఇతరులకు చెప్పాలని ప్రయత్నం చేస్తాడు. ముఖ్యంగా తెలియని విషయాన్ని గురించే వ్యాఖ్యానం మొదలుపెడతాడు. నువ్వు అటువంటి చెడు అలవాటు వదిలి పెట్టు."

దివాకరుడు నోరెత్తి మాట్లాడలేకపోయాడు. అతను ఆ మాటలు అనటంలో విశేషోద్దేశ మేమీ లేదు. ధర్మగ్రంథాలయందు అశ్రద్ధా, అవిశ్వాసమూ చూపిస్తే వదిన సంతోషిస్తుందనుకున్నాడు.

కిరణ్మయి నవ్వి "ప్రస్తుతం ఏం రాస్తున్నావు బాబూ?" అన్నది.

"ఏమీ రాయటంలేదు ?"

కిరణ్మయి చాల ఆశ్చర్యపడి "ఏమీ వ్రాయటంలేదూ? ఎందుకని? వ్రాసింది వృథా పోలేదుగా? ఎందుకని వ్రాయటం వదిలిపెట్టావు?" అన్నది.

"నన్ను అలా చిన్నపుచ్చుతా వెందుకు వదినా! తర్వాత నేను చాలా ఆలోచించిచూశాను. నువ్వన్నదే నిజం. నా ఆ కథ దొంగిలించిందేమీ కాదుగాని, అనుసరణ అన్నదిమాత్రం యథార్థం. నిజంగా నాకు ప్రేమరహస్య మేమి తెలుసు? ఇంత గాథ రాసి పారేశాను. అందుకని ఇప్పుడేమీ రాయటంలేదు. వూరికే ఆలోచిస్తున్నాను" అన్నాడు దివాకరుడు.

"ఆలోచిస్తున్నావా? రాత్రింబవళ్ళు ఏమి ఆలోచిస్తున్నావో చెప్పు?"

దివాకరుడు దీనియందు ధ్యాన ముంచకుండానే "నవల వ్రాయాలన్న ప్రబలోత్సాహాన్ని కూడా ఆపుకోలేకుండా వున్నాను. ఇవ్వాళ అది ఆలోచించుకొనే, నేను నీదగ్గర ఏమైనా నేర్చుకొందామని వచ్చాను" అన్నాడు.

"నావద్ద ఏమి నేర్చుకుంటావుబాబూ? ప్రేమా?" అన్నది కిరణ్మయి.

దివాకరుడు సిగ్గును ఏదోవిధంగా కప్పిపుచ్చి గంభీరత తెచ్చుకోటానికి ప్రయత్నిస్తూ "అవసరమైతే అదికూడా నేర్చుకుంటాను" అన్నాడు.

కిరణ్మయికూడా మొహంమీదికి గంభీరత తెచ్చిపెట్టుకొని "కాని దానిలో ఒక చిక్కు వుంది. ప్రేమనుగురించి నా వద్ద నేర్చుకుంటే లోకు లేమంటారు?" అన్నది.

దివాకరుడు చివ్వున లేచి నుంచుని "అయితే నేను వెళ్ళిపోతున్నాను. నీకు ప్రతిమాటా పరిహాసంగానే వుంటు ది" అన్నాడు.

కిరణ్మయి చప్పున అతని చేయిపట్టుకొని చిరునవ్వుతో "అయితే నీకు అలా పారిపోకపోతే పరిహాసం పనికిరాదని, యథార్థంకావాలనీ సరిగా చెప్పరాదూ?" అన్నది.

దివాకరుడు చెయ్యి విదిలించి విడిపించుకొని గబగబా ఇంట్లోంచి బైటికి వెళ్ళిపోయాడు.

కిరణ్మయి మనసులో నవ్వుకొని పుస్తకం దొస్తరంలోకట్టి బల్లమీద పెట్టింది. తర్వాత మెల్లగా దివాకరుని గదిలోకి వెళ్ళింది.

దివాకరుడు మొహం గంపెడు చేసుకొని మెదలకుండా కిటికీలోంచి చూస్తూ కూర్చున్నాడు. కిరణ్మయి "కోపగించుకొని పారిపోయి వచ్చింది ఎందుకో చెప్పు?" అన్నది.

దివాకరుడు ఆమె వంక చూడకుండానే "ఈ నవ్వులు, పరిహాసాలూ నాకు బాగుండవు వదినా!" అన్నాడు.

కిరణ్మయి కొంచెంసేపు మెదలకుండా వుండి మృదుస్వరంతో "నువ్వు మరదివి కాబట్టి వరుసకి పరిహాసమాడతాను. అదికూడా లేకపోతే నా మనస్సుకు శాంతి ఎలా కలుగుతుందో నువ్వే చెప్పు?" అన్నది.

ఈ ప్రేమపూరితస్వరంతో దివాకరుని కోపం పల్లారుతూవుంది. ఆమె నన్ను చిన్నపుచ్చటానికి అనే మాటలుకావు, వరస కాబట్టి అంటుంది, అని ఇవ్వాళే మొదటిసారిగా గ్రహించాడు.

ఆ మాట అబద్ధంకూడా కాదు. భారతదేశంలో వదినా, మరదులమధ్య- ఒక్కని సరస- పరిహాసా లాడటం అలవాటు. దీని హద్దు ఎంత వరకోనని తెలుసుకునే వాళ్ళు చాల అరుదు. తెలుసుకోనే అవసరంకూడా కనబడదు వారికి. ఈ హాసపరిహాసాల అతివల్ల అంకురించిన విషబీజం మొలకలు పలకలు వేసి ఒక్కొక్కప్పుడు కుటుంబాలనే కూలుస్తా యన్న సంగతి ఎంతమంది ధ్యానమం దుంచుకుంటున్నారు?

దివాకరుడు మొహం తిప్పుకొని శుష్కస్వరంతో "నేను నేర్చుకోటానికివస్తే నువ్వు పరిహాసాలాడి నన్ను పారనోలేవరకు వదిలిపెట్టలేదు" అన్నాడు.

కిరణ్మయి మంచంమీద ఒక ప్రక్కకు కూర్చుని "ఏమి నేర్చుకోటానికి వచ్చావు?" అన్నది.

"నవల రాయాలని నాకు కుతూహలంగా వుందని నీతో చెప్పలేదూ? నువ్వు నవల రాయటం నేర్పుతా వనుకొని వచ్చాను. నువ్వు చెబుతూవుండు, నేను వ్రాస్తాను" అన్నాడు దివాకరుడు.

కిరణ్మయి నవ్వి "అయితే అది నా నవల అవుతుందిగా" అన్నది.

"అయితే ఏం? నాకుకూడా అలవాటు అవుతుందిగా! కేవలం తెలివి నంతమాత్రాన చాలదు. వ్రాయగల శక్తికూడా వుండాలా?"

"తప్పకుండా వుండాలి. కాని నువ్వు వ్రాసే దేమిటి చెప్పు?"

"అదే, నువ్వు చెప్పేది"

కిరణ్మయి మళ్ళీనవ్వి "దీనికోసం నువ్వు మరొకమనిషిని చూచుకో. నావల్లకాదు. నీటిలోవుండే చేపను మరు భూమిలో వుండే మానవుడు పిపాసతో ఎలా అలమటిస్తాడో చెప్పమంటే ఎలా చెబుతుందో నాకర్థం కావటం లేదు. అది నావిద్యాబుద్ధులకు అతీతమైనది. దానికి ఇంకెవరినైనా వెతుక్కో" అన్నది.

దివాకరుడు కొంతసేపు మెదలకుండా వుండి "మరుభూమి పిపాసతో నాకూ అనుభవంలేనిమాట నిజం. కాని నేను చేపనుకూడా కానుగా! నీలాగానే నేనుకూడా ఎండుగడ్డుమీదవున్న జీవినే, కాబట్టి పిపాస అంటే ఏమిటో బాగా తెలుసు. నువ్వు ఒక్కసారి కొంచెం చెప్పిచూడు, నేను గ్రహిస్తానో లేదో" అన్నాడు.

కిరణ్మయి ఏమీ మాట్లాడలేదు. చిరునవ్వునవ్వి చూస్తూ వూరుకుంది. దివాకరుడు కొంచెంసేపు మెదలకుండా వుండి "సరే, నువ్వు ఇంతసేపటినుండీ చదువుతున్న రామాయణం సంగతే అడుగుతున్నాను. సీత రూపజ్వాలలో రావణుడు సపరివారంగా నాశనమయ్యాడు. ఆ స్త్రీరూప మేమిటి? ఒక్క రావణుడే కాదు, అటువంటిరావణుల చరిత్రలు అనేకం కనపడతాయి. కవులు రూపపిపాస అంటూ వుంటారు. నువ్వుకూడా అలాంటి దృష్టాంతమే యిచ్చావు. నేను నీతో తర్కించుతున్నాననుకోవద్దు వదినా. నేను నీవద్ద నేర్చుకోవలసిన విషయాలు ఇంకెన్నో వున్నాయి. వాటిని చూస్తే మానవునికి పిపాస కలగంది రూపంచూస్తే ఎలాకలుగుతుంది?" అన్నాడు.

కిరణ్మయి తలెత్తి నవ్వుతూ "పిపాస కలుగుతుందా ఏమిటి బాబూ?" అన్నది.

ఈ పరిహాసానికి, ప్రశ్నకు యథార్థ ఆశయం గ్రహించలేక దివాకరుడు కొంచెంసేపు హతబుద్ధుడైపోయాడు. కాని మళ్ళా సంబాళించుకొని వెంటనే "తప్పకుండా కలుగుతుంది" అన్నాడు బిగ్గరగా.

అంత్యంలో అణగియున్న తన సాహసం రహస్యంగా లోపలినుండి మెల్లగా తలెత్తి బైటకు ఎప్పుడు వచ్చిందో అతనే తెలుసుకోలేకపోయాడు. "కలుగకపోతే ప్రపంచంలో పెద్దపెద్ద కవులు శకుంతలనాటకం వ్రాయగలిగేవారే కాదు, రోమియోజూలియట్ వెలువడేదే కాదు. అందుకనే అసలు స్త్రీరూపం ఎలాంటివస్తువో తెలుసుకోవాలనుకుంటున్నాను. ప్రేమ దానిని ఇంత ఘనిష్ఠంగా ఎందుకు అట్టిపెట్టుకు వుంటుందో?" అన్నాడు.

కిరణ్మయి గంభీరంగా "నువ్వు అంత అధోగతిలో లేవు" అన్నది.

దివాకరుడు వుదాసీనతతో "ప్రతి విషయమూ పరిహాసంకింద కట్టేశావంటే నేను ఇంకేమీ అడగను" అన్నాడు.

కిరణ్మయి మెదలకుండా వూరుకుంది. బి. ఏ. ఫేలైన ఈయువకుని తెలివితేటల గురించి ఆమెకు నమ్మకంలేదు. కేవలం ఫేలైన కారణంవల్లే కాదు. ప్యాసయినాకూడా పీరు పుస్తకాలు వల్లించి ప్యాసవుతారు. ఇంకేం చెయ్యలేరని ఆమెవిశ్వాసం. అవసరమైనప్పుడు వాదించగలరన్న నమ్మకంకూడా లేదు. "రూపం ప్రతిబింబం కాదన్న నీ నిశ్చితాభిప్రాయాన్ని దృఢంగా వుంచడం మంచిది కాదు. అయితే ఈ సంగతులన్నీ నువ్వు స్వయంగా ఆలోచించావా, ఇంకెవరైనా ఆలోచించుకున్నవి వినివచ్చి చెబుతున్నావా చెప్పు?" అన్నది.

దివాకరుడు కొంచెంసవ్వి "ఇవి నేను స్వయంగా ఆలోచించిన సంగతులే చెబుతున్నది. వదినా! భగవంతుడు నాకు చిన్నప్పటినుండీ అనేక సంగతులు ఆలోచించుకునే అవకాశ మిచ్చాడు" అన్నాడు.

కిరణ్మయి కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "అయినాకూడా నువ్వు ఈ అవకాశంతో రూపతత్వాన్ని తెలుసుకునే లాభం పొందలేక పోయావం? అన్నిటికన్న ఆశ్చర్యమేమిటంటే సతీశబాబుకూడా ఒక రోజున నన్నీ విషయమే అడిగాడు. మరోవ్యక్తికూడా అడిగాడు. ఇవ్వాళ మళ్లా నువ్వు అడుగుతున్నావు. నా రూపంచూచే మీ మనస్సులో ఈ ప్రశ్న చెలరేగటం లేదుగదా?" అన్నది.

దివాకరుడు ఒక్కసారి త్రుళ్ళిపడ్డాడు. సిగ్గుతో తల వంగిపోయింది. అతను తేరుకుంటూనే "నన్ను క్షమించు వదినా. నాకా సంగతులేవీ తెలియవు" అన్నాడు.

కిరణ్మయి నవ్వుతూ "ఒక్కసారీ, రెండుసార్లూ కాదు బాబూ! నిన్ను వెయ్యిసార్లు క్షమించాను" అని ఆమె మరికొంచెంసేపు మెదలకుండావుండి మనసులో సందిగ్ధాన్ని తోసిపుచ్చి మృదుస్వరముతో "ఇవ్వాళనువ్వు అడిగిన మాటలన్నిటికీ సరైన సమాధానాలివ్వా పోతే నామాటలన్నీ దంభాలనిపిస్తాయి. నామాటలన్నీ తేలికలై పోతాయి. తెలిసిందా?" అన్నది.

దివాకరుడు తలవూగించి "ఆఁ" అన్నాడు.

"నా ఈ రూపం మగవారికళ్లకేగాదు. నా కళ్లకే ఆశ్చర్యం కలిగిస్తూ వుంటుంది. అందుకని నేను దానినిగురించి చాలా ఆలోచించాను. నేను గ్రహించినది యథార్థమైనా కాకపోయినా, ఏమైనా నా యీ వుద్దేశాన్ని

నీలాంటి మరిదితో చెప్పటానికి సిగ్గెందుకు? నా స్వభావాన్ని చూచుకొని నేనేమనుకుంటానో తెలుసా? సంతానోత్పత్తికోసం విశేషోపయోగమైన లక్షణాలన్నిటి సమష్టి వికాసమే స్త్రీస్వభావం అనుకుంటాను! కావ్యాలలో నవలల్లో విశ్వసాహిత్య మంతటిలో ఈవర్ణనే కనిపిస్తూ వుంటుంది" అన్నది మళ్లీ కిరణ్మయి.

దివాకరుడు మెదలకుండా కిరణ్మయికేసి చూస్తున్నాడు. కిరణ్మయి అతని గంభీరవదనంమీద నూత్నయౌవనపు పొంగులనుచూచి సంకోచంతో ఒక్కసారి ఆగిపోయింది. కాని మళ్లీ వెంటనే తమాయించుకొని "నిజం చెబుతున్నాను విను బాబూ! అక్కడకు చేరుకున్న తర్వాతే స్వభావసౌందర్యానికి ఒద్దిక కనబడుతుంది. అందుకనే పడతుల బాల్యస్వభావము మనుష్యుని ముగ్ధుని చేయగలిగినాకూడా వ్యక్తుని చేయలేదు. సంతానం కలిగే తరుణం దాటిపోయినతర్వాత మళ్లీ అదేపరిస్థితి ఏర్పడుతుంది. బాగా ఆలోచించి చూడు. స్త్రీ కొక్కదానికే కాదు, పురుషునికూడా అదే స్థితి. సంతానోత్పత్తి కలిగించే శక్తి యున్నంతవరకే అతనిలో రూపముంటుంది. ఈ సంతానోత్పత్తిసౌభాగ్యానికే అతని రూపమూ, యౌవనమూను. అసలు బిడ్డల్ని కనాలన్నకోర్కె అతని ప్రేమ" అన్నది.

దివాకరుడు మెల్లగా "కాని......" అన్నాడు.

కిరణ్మయి అతన్ని ఆపి "దీనిలో సందేహించవలసినదేమీలేదు. ఈ చరాచర జగత్తుకేసి కన్నెత్తి ఎటుచూచినా ఈ విషయమే గోచరిస్తుంది. సృష్టితత్త్వంయొక్క మూలగాథను నువ్వూ నీసృష్టికర్తకే వదిలివెయ్యి. అతని కార్యంకేసి ఒక్కసారి కన్నెత్తిచూడు. ప్రతి పరమాణువూ నిత్యం తనొక కొత్తరూపంలోనికి మారటానికి తహతహలాడుతున్నట్టు కనపడుతుంది. ఏవిధంగా తనకు వికాసం కలుగుతుందా, ఎవరితో కలిస్తే, ఏమిచేస్తే మరింత శక్తివంత మౌతానా, వృద్ధి పొందుతానా అనే ఆరాటమే దాని అవిరామ వుద్యమానికి మూలం. బాహ్యప్రకృతిగాని అంతఃప్రకృతిగాని లోపలా బైటా నిత్యం పరివర్తన జెందుతూ వుంటుంది. అందుకని పురుషుడు స్త్రీలో అలాంటి దేదో చూచినప్పుడు - ఆమెను పొందాలన్న లాలసను అణుచుకోలేడు. తెలిసో తెలియకో అతను మరింత అందగాణ్ణనిపించు కుంటున్నప్పుడు ఆ లాలసను అసలే అణచుకోలేడు" అన్నది.

"అందుకనే గా ప్రతిచోటా హత్యలూ, ఖూనీలు జరిగేది" అన్నాడు దివాకరుడు మెల్లగా.

"అవును. అప్పుడప్పుడు అటువంటి దృశ్యాలుకూడా కనబడుతూ వుంటాయి. మానవునిలో లాలస నణచుకునే శక్తి, స్వార్థాన్ని త్యజించేశక్తి, సమాజాన్ని శాసించేశక్తి, ఆదిగాగలవి. ఎన్ని విరోధ శక్తులున్నా నలువైపులా ఒక్కసారి నిప్పు ముట్టించడు. ఈ సాంఘిక మానవుడే - ఏ శాసనాన్నీ లెక్క చెయ్యకుండా రూపాకర్షణే తన ప్రబలప్రవృత్తిగా వ్యవహరించిన రోజు లున్నాయి. అతని ప్రేమ...........దీనినే మంచిదుస్తులతో - తీర్చి దిద్దితే కథలలోని నిర్మలప్రేమయైపోతుంది" అన్నది కిరణ్మయి.

దివాకరుడు కొంచెంఆగి "పాశవిక ప్రవృత్తి ఎక్కడ, స్వర్గీయ ప్రేమా కర్షణ ఎక్కడ? పాశవిక ప్రవృత్తిలో వుండేవారికి నిర్మలపవిత్రప్రేమ మర్యాద లేమి తెలుసు? దేనితో దేనిని పోలుస్తున్నావు వదినా?" అన్నాడు.

"పోల్చటంలేదు బాబూ! రెండూ ఒక్కటేనని చెప్పబోతున్నాను. రైలును ముందుకు లాక్కు వెళ్లగలిగిన యంత్రమే వెనక్కికూడా తీసుకు రాగలదు. కానిమరొకటి చేయలేదు. అది మంచిగాని చెడ్డగాని ప్రేమించగలి గినవాడే ప్రేమించగలడు గాని మరొకడు ప్రేమించలేడు. నువ్వు గోవింద లాల్ విషయం చెప్పావు కదూ? భ్రమరాన్ని అపేక్షించిన అతని హృద యమే అతన్ని రోహిణివైపుకు వెఱ్ఱిగా ఆకర్షించింది. ఇలాంటి వెఱ్ఱి ప్రేమ హరలాల్ లాంటివ్యక్తికి కలగటం అసంభవం. అతను లోకమర్యాదలకు తన హృద యాన్ని కట్టివుంచాడు. కాని గోవిందలాల్ అలా కట్టుబడలేకపోయాడు. హర లాల్ గోవిందలాల్ కంటె మంచివాడు కాకపోయినప్పటికి అతను ఏవగింపుతో పరిత్యజించినదానినే మరొకరు కళ్ళకద్దుకొని స్వీకరించారు. దానిని స్వీకరించటం కొందరికి అనేక కారణాలవల్ల వ్యర్థము నిష్ఫల మనిపిస్తుంది. కాని దుఃఖం, చింత, లజ్జలే గాకుండా మహోపులాకాంక్ష ఒక వ్యక్తిని మరొక వ్యక్తివద్దకు లాక్కుపోలేదనికూడా ఎవరూ గట్టిగా చెప్పలేరు."

దివాకరుడు లోలోన కుమిలి "నీమాటలన్నీ నేను సరిగా అర్థంచేసు కోలేకపోయినా, పవిత్రప్రేమ స్వర్గీయం కాదన్నసంగతి నే నేవిధంగానూ ఒప్పుకోలేను వదినా" అన్నాడు వినయంగా.

"నువ్వు వప్పుకోటం వప్పుకోకపోవటం మీద ఏమీ ఆధారపడిలేదు. మనుష్యదేహమే నశ్వరమైనప్పుడు ఇంకా దుఃఖమెందుకు? మానవుడు పుట్టిన తర్వాత అతని దేహంలో సృష్టిసంబంధమయిశక్తి పోషించనంతవరకూ అతనిముందు ప్రేమ ద్వారము తెరచేవుంటుంది. ఆ ద్వారం ప్రవృత్తితోడనే కదలుతుంది. అంతకుముందు అతను తల్లిదండ్రులను, అక్కచెల్లెండ్రను, బంధుమిత్రులను ప్రేమిస్తాడు. అతని శరీరం వికాసం చెందనంతవరకు ఆ స్వర్గీయ జ్ఞానాధికారం కలుగనంతవరకూ నీ యీ స్వర్గీయ ఆకర్షణ అతన్ని కించిత్తుకూడా కదల్చలేదు. భూమికి ఆకర్షణ ఎప్పుడూ వుంటుంది. కాని ఆ ఆకర్షణవల్ల చెట్టుయొక్క పక్వమైనపళ్లే ఆత్మార్పణ చేసుకుంటాయిగాని పచ్చికాయలు చేసుకోవు. దాని గింజా గుజ్జు భూసారం వల్లే పక్వమౌతుందిగాని స్వర్గీయసారంతో కాదు. సొంపైన పువ్వులరూపం తగ్గి సుసుగంధాలతో తుమ్మెదల నాకర్షించి పండ్లుగా పరిణతిచెందాయి. అవే ఋతువు వచ్చేప్పటికి భూమిమీదపడి మొలకలెత్తుతాయి. ఇదే వాటి ప్రకృతి, ప్రవృత్తి, స్వర్గీయప్రేమాను! జగత్తు నంతటా అవిచ్ఛిన్నమైన సృష్టినాటకమే ఈ రూపనాటకము. దానిని స్వర్గీయమని అంగీకరించినందువల్ల కలిగే దుఃఖంగానీ, చింతగానీ ఏమీ లేదు బాబూ!" అన్నది కిరణ్మయి.

కిరణ్మయి కొంచెం ఆగి "చీకట్లో నువ్వు దయ్యాలభయంవల్ల కళ్ళు మూసుకొని శాంతిపొందుతూ వుంటే నేనేమీ కాదనను. కాని స్వర్గీయ ప్రేమను అనుభవించదలచినవాడు, "నేను ప్రవృత్తులకు అతీతుడనని అనలేడని గట్టిగా చెప్పగలను. ప్రేమ అంత తేలికైనవస్తువుకాదు బాబూ!" అన్నది.

"అయితే ప్రపంచంలో పవిత్రప్రేమ, కపటప్రేమ అని రెండు ఎందుకు వున్నాయి?" అన్నాడు దివాకరుడు.

కిరణ్మయి చిరునవ్వునవ్వి "నీవాదం సరిగ్గా సతీశుని వాదంలాగా వున్నది. ప్రపంచంలో ఈ రెండూవుండటం తప్పనిసరి. మనుష్యప్రవృత్తిలో ఏదీ వాదంగానీ యుక్తిగానీకాదు. అందుచేత రెండూ వుండటం సంభవమే. ఘృణతయనేది అసలు సుబుద్ధి అభావమే. అంటే ప్రేమించ తగని దానిని ప్రేమించితేనే చెడు అంటారు. తన అజాగ్రత్తవల్ల చెట్టుమీదనుండి కిందపడి కాళ్ళుచేతులు విరగగొట్టుకొని భూఆకర్షణవల్లే తను పడ్డానని దానిమీద నేరం

మోపితే ఎంత మూర్ఖత్వంగా వుంటుందో - ప్రేమను కఠినమన్నా, ఘృణీ భూతమన్నా అంతే మూర్ఖంగా వుంటుంది. ఈ విధంగా ప్రపంచంలో ఒకరినేరం ఒకరిమీద మోపటం అలవాటైపోయింది" అని కిరణ్మయి మెదల కుండా తనహృదయంలో ఏముందోనని పరికించుకోసాగింది తిరిగి వెంటనే "నీకు నేను మొదటే చెప్పాను — జీవంయొక్క ప్రతి అణువు, పరమాణువు, ప్రతిరక్తకణమూ వీలైనంత వుత్కృష్ట పరిమాణంలో అభివృద్ధి చెందాలన్న లాలసను అణచుకోలేవని అది జన్మించిన దేహంలో దానివికాసం ఒక నిర్ణీతసీమ కొచ్చిన తర్వాత యౌవనమంటారు. అప్పుడు అది రెండవదేహ సంఘర్షణతో సార్థకత చెందటానికి అణు, అణువులోను, నర నరములోనూ రేకెత్తించే విప్లవ తాండవ నృత్యాన్నే పండితులు నీతిశాస్త్రంలో పాశవికమనీ, ఘృణితమనీ అన్నారు. దాన్ని అర్థంచేసుకోలేక పండితులు దానిని ఘృణితమని సంతృప్తిపడ్డారు. బీభత్సమని సంతోషించారు. వారు చెప్పినట్లు ఇంత మహాకర్షణ ఎప్పటికీ నిందనీయంగానీ, ఘృణితంగానీ కానేరదని నేను గట్టిగా చెప్పగలను. ఇది సత్యం, యథార్థత్వం! ఏ ప్రేమా ఎప్పుడూకూడా ఘృణిత వస్తువు కానేరదు" అన్నది.

ఇది విన్న దివాకరుడు పూర్తిగా వ్యాకులపడ్డాడు. అతనిగుండె కొట్టుకోసాగింది. అలాంటి వుత్తప్త తీవ్ర కంఠస్వరం ఎప్పుడూ వినలేదు. అలాంటి వుత్కట తీవ్ర దృష్టి ఎప్పుడూ చూడలేదు! జడుస్తూ జడుస్తూ "వదినా!" అన్నాడు.

"ఏమిటి బాబూ?"

"నాబోటి నిర్బోధకులకు బోధించటానికి బహుశా నువ్వు అధైర్య పడుతున్నట్టు వుంది!"

"ఏమిటి అంటావు బాబూ! ఆ సంగతి నాకు బాగా తెలుసు."

దివాకరుడు కొంచెం చిరునవ్వు నవ్వటానికి ప్రయత్నించి "తెలిస్తే నోటినుంచి అలాంటి మాట లెందుకువస్తాయి? ఇప్పుడే నువ్వు ప్రేమించ తగని దానిని ప్రేమించితే కుటిలప్రేమ అంటారు అన్నావు. మళ్ళా దానిని అర్థంచేసుకోలేక పండితులు దాన్ని చెడు అని అన్నారంటున్నావు. దీనిలో నిజ మేది?" అన్నాడు.

"రెండూ నిజమే" చప్పున అన్నది కిరణ్మయి.

"గోవిందలాల్ విధవ రోహిణిని ప్రేమించటం చెడుపనికాదూ?"

"ప్రేమ ఏదైనా పనా ఏమిటి? దానికి న్యాయాన్యాయాలు వుండటానికి? భార్యని వదిలివెళ్ళటం తప్పకుండా చెడ్డపని అని చెప్పవచ్చు."

దివాకరుడు మళ్ళీ ఒకసారి వుత్తేజితుడై "వదలివెళ్ళటం నిజంగా చెడుపనే; కాని భార్య వుండగనే లోలోన మరో స్త్రీని ప్రేమించటం ఘోరాన్యాయంకాదా?" అన్నాడు.

అతని వుత్తేజనకు కిరణ్మయి నవ్వి "తన్ను అంత శక్తివంతుడ ననుకోగూడదు. అహంకారాన్ని కొంచెం తగ్గించుకొంటే మంచిది. మనిషి యిష్టమైతే ఏదిపడితే అది చేయగల డనుకుంటున్నావా? గోవిందలాల్ యిష్టమైతే రోహిణిని ప్రేమించనూవచ్చును, ప్రేమించకపోనూవచ్చును. ఇదేగా నీ ధోరణి?" అన్నది.

"కాదు, నా వుద్దేశం అదికాదు. కాని ఇష్టంతోపాటు ప్రయత్నం కూడా వుండాలి."

"అయితే, దానితోపాటు యోగ్యత అయోగ్యత అన్న సమస్యకూడా వుండాలిగా! కేవలం ప్రయత్నంతో పని జరుగదు. ఈ మిద్దెమీద కూర్చున్నపాటునే నీ తలమీద చెట్టు మొలుచుకువచ్చినా కూడా కాళిదాసులాగ "మేఘదూత" వ్రాయలేవు; మేఘాన్ని చూడగానే వర్షం వస్తుందన్న భావం కలుగుతుంది. చలివేస్తుందనే భయంతో వ్యాకులపడతావుగాని, విరహదుఃఖాన్ని గురించి ఆలోచించలేవు. ఎంత ప్రయత్నించినా ఆలోచించలేవు. ఈ భావం నీ నర నరములోనూ జీర్ణించుకుపోతుంది. దానినుండి విముక్తి పొందలేవు" అని కిరణ్మయి మెదలకుండా వూరుకుంది.

దివాకరుడుగూడా ఏమీ మాట్లాడలేదు. తలవంచుకు మెదలకుండా కూర్చున్నాడు. చాలాసేపటివరకు ఏ ప్రసంగమూ రాలేదు. నిర్జనగృహంలో పాత గడియారపు "టిక్కు-టిక్కు" ధ్వనిమాత్రం వినపడుతూవుంది.

చాలాసేపటివరకు మెదలకుండా వూరుకొని కిరణ్మయి ఒక్కసారి మృదువుగా నీతో ఇంకొకటి రెండు సంగతులు చెప్పదలచాను. ఆ రోజున నీ వివఖడ్గం చూచి ఏమనుకున్నానో నిజం చెపుతున్నాను. నీ హృదయంలో

ఏదో వుంది. నిజమైన ప్రేమికుడే కవి అనికూడా గ్రహించాను. ఈ వస్తువును నష్టపరచదలచకపోతే ఇతరులను అపరాధులను చెయ్యని సంతృప్తితో తనని తనే వంచన చేసుకోవలసివస్తుంది. కవి విమర్శకుడు కాదన్న సంగతి ఎప్పుడూ మర్చిపోలేను. నీతిశాస్త్రంతో నీ యభిప్రాయం అక్షరశః కలవకపోయినందు వల్ల సిగ్గుపడవలసిన అవసరమేమీ లేదు. మానవుడు ఇతరుల అశక్తతను, అపరాధాలను ఒక త్రాసుతోనే తూచి దండిస్తాడు. కాని అది ఎరువు త్రాసైతే లాభంలేదని నాకు తెలుసు. నువ్వు ప్రతిమాటకీ గోవిందలాల్ సంగతెత్తుతున్నావు. ఆ గోవిందలాలే ఎన్నో మహత్తరశక్తులతో పరాజయమంది తన సర్వస్వము త్యజించి వెళ్ళిపోయాడు. ఇది ప్రపంచంలో మంచి చెడ్డలు ఆలోచించేవారి దౌర్భాగ్యం కాదు, నీది. హత్యానేరానికి ఏ అభాగ్యుడికైనా వురి శిక్ష విధించిన జడ్జి విమర్శకుడు. కాని నేరస్తుని హృదయదౌర్బల్యాన్ని గ్రహించి తేలికశిక్ష విధించితే అప్పుడతను కవియైపోతాడు. ఈవిధంగానే ప్రపంచములో సమంజసరక్షణ జరుగుతూవుంది. ఈ విధంగా ప్రపంచంలో విభ్రాంతులు, అపరాధాలు, అసహ్యాకరం కానేరవు. కవి సృష్టించగలడేగాని రక్షించలేడు. స్వాభావికంగా అందమైనదానిని మరింత సొగసుగా చూపించటము అతని పని. అందంగా లేనిదానిని అందహీనుని చేతినుండి కాపాడటం కూడా అతని పనే" అన్నది.

దివాకరుడు కొంచెం ఆలోచించి "అంటే అన్యాయాన్ని క్షమించకూడదూ?" అన్నాడు.

"సరిగా తెలియదు. విధించుతూ వుండవచ్చు. చెడునందు ఘృణిత భావం కలిగించటంకూడా కవిపని అని విన్నాను. కాని మంచియందు అత్యంత లాలస కలుగజేయటం దానికంటె మంచిదికాదూ? ఈ ప్రపంచంలో పాపం పరిహారం కానంతవరకు, మనుష్యహృదయం రాయి కానంతవరకు, ఈభూమి మీద అన్యాయాలు, అక్రమాలు జరుగుతున్నంతవరకూ, దాన్ని క్షమించవలసే వస్తుంది. పాపాన్ని తొలగించే సామర్థ్యమూ, లేక క్షమించే యోగ్యతా లేకపోతే ఏమి సౌఖ్యము?" అన్నది కిరణ్మయి.

"సౌఖ్యమే సర్వస్వముకాదు. అసౌఖ్యంతోకూడా న్యాయాన్ని పాటించవలసి వస్తుంది. శుభమైనదే నిర్మలమైనది. సూర్యకాంతిలాగ స్వచ్ఛమైన దానికే వున్నతస్థాన మివ్వతగింది" అన్నాడు దివాకరుడు.

"పాప మనుష్యరక్తంలోనే మిళితమైయుంటే నువ్వన్నది నిజమే అవుతుంది. న్యాయం ఒక్కటే ప్రపంచంలో మరొకటి వుండలేదు. దయా మాయ, క్షమ మొదలైన చిత్తప్రవృత్తులు నామమాత్రానికికూడా ఎవరికీ తెలిసేవి కాదు. నువ్వు సూర్యకాంతిలోని తెల్లరంగుతో న్యాయాన్ని పోల్చుతున్నావు. కాని అన్ని రంగుల కలయికవల్లే తెల్లరంగు ఏర్పడుతుందని తెలుసా? ఈ ఉజ్వలకాంతి వక్రదర్పణంలో పడగానే రంగు రంగులుగా కనపడినట్లు, అన్యాయ, అధర్మ, పాపతాపాల వక్రమార్గంలో దయ, మాయ, క్షమ అన్నీ కూడా విచిత్రంగా వికృతరూపంతో కనిపిస్తాయి. అన్యాయాన్ని క్షమిస్తేనే అధర్మానికి సాయం దొరుకుతూ వుందని ఒప్పుకుంటాను. కాని అధర్మం క్షమా రూపం కాదని ఒప్పుకోకుండా వుండలేను. కబుర్లతో నా సంగతి నీకు నచ్చచెప్పలేను. కాని క్షమ ఏ ప్రేమనుంచి పుడుతుందో గ్రహించి ఎప్పుడైనా ప్రేమధర్మాన్ని గుర్తించిననాడే అన్యాయాన్నీ, అధర్మాన్నీ, అక్షమతనూ క్షమించి వూరుకోవటమే ధర్మానుశాసన మని తెలుసుకుంటాను. చాలా సేపైంది. ఇవ్వాళ నీకు ఆకలి దప్పులు వచ్చినట్టుంది" అని ఆతురతతో ఆమె గదిలోంచి బైటకు వెళ్ళిపోయింది.

సాయంత్రం దివాకరుడు భోంచేస్తూ మెల్లగా "ఇవ్వాళ మధ్యాహ్నం చాల చక్కగా గడచింది. నేను ఎన్నో సంగతులు నేర్చుకున్నాను" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వుతో "అన్ని సంగతులు నేర్చుకుంటే నువ్వు నన్ను గురువుగా భావించాలి" అన్నది.

దివాకరుడు వుత్తేజిత స్వరంతో "తప్పకుండా! తప్పకుండా! నువ్వు గురువని తప్పకుండా ఒప్పుకుంటాను. నిజం చెబుతున్నాను వదినా. ఈవిధంగా ఎప్పుడూ నీదగ్గరవుంటే నాకింకే అవసరం వుండదు" అన్నాడు.

"ఏమిటి అంటావు? ఇంతలోనే ఇంత ఆకర్షణా?"

దివాకరుని మనస్సు ఆమె వాగ్ధోరణిలో మగ్నమైపోయింది. మెత్తని మనస్సుతో "నిన్ను విడిచి ఒక్కరోజుకూడా ఎక్కడా వుండలేను వదినా!" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వుతో "అంతటితో వూరుకో. ఎవరైనా వింటే సమాధానాలు చెప్పలేం" అన్నది.

దివాకరుడు ఈ మాటకు త్రుళ్ళిపడి సిగ్గుతో తల వంచుకున్నాడు.

---

## 3౧

పక్క వేస్తూ వేస్తూ కిరణ్మయి అకస్మాత్తుగా ఒకపక్క చతికిలపడి దయాపూరిత స్వరంతో మమతగా "ఇది నీ నౌకరీయా, వ్యాపారమా? దీని సఫలతాసఫలతలు యజమాని దయాదాక్షిణ్యాలమీదగానీ, దుకాణం అమ్మకంమీదగానీ ఆధారపడి వుండటానికి? ఇది హృదయసంపత్తి. దీనిని విఫలంచేసే శక్తి మరెవరిలోనూ లేదు" అని కొంచెంసేపటివరకు కళ్ళుమూసుకు కూర్చుంది.

దివాకరుడు భక్తిపూరిత హృదయంతో ఆమె మొహంకేసి చూచి "అయితే వదినా, కళ్లుమూసుకున్నప్పుడు అంతర్యంలో నీ భర్త మొహాన్ని చూడగలుగుతున్నావా?" అన్నాడు మెల్లగా.

కిరణ్మయి కన్ను తెరచి కొంచెం చకితయై, "ఆఁ చూస్తాను. నిజమైన నా పతి సర్వదా నా యీ హృదయంలో వుంటాడు" అని ఆమె వేలితో తన హృదయాన్ని చూపెట్టింది.

దివాకరుడు విషయాన్ని సహజంగానే గ్రహించి వినయంగా "వారిని చూచినందువల్ల కలిగే లాభం? నువ్వు భగవంతుణ్ణి ఒప్పుకోవు. లోకపరలోకాలను అంగీకరించవు. మరి చనిపోయినతర్వాత వారివద్దకు ఎలా వెళతావు?" అన్నాడు.

"చనిపోయినతర్వాత నేనెవరివద్దకూ వెళ్ళవలసినదిలేదు" అన్నది కిరణ్మయి.

"ఎక్కడికీ ఎవరివద్దకూ వెళ్ళవూ? ఎప్పుడూ ఒంటరిగానే వుంటావా?" అని దివాకరుడు ఆమె మొహంకేసి చూచాడు. అతని ప్రశ్న విని కిరణ్మయికూడా కొంచెంసేపు నోరు మెదల్చలేకపోయింది. కాని వెంటనే పకపక నవ్వి "నువ్వు తరచు మా సంగతులు అడుగుతూవుంటావు ఎందుకు బాబూ?" అన్నది.

"తెలుసుకోవాలని నాకు కుతూహలంగా వుంటుంది వదినా!"

కిరణ్మయి ప్రక్క సరిచేద్దామనే వంకతో లేచినుంచుని "నేను ఒక వ్యక్తివద్ద వెళ్ళాలని కోర్కెవుంది కాని, చనిపోయినతర్వాతమాత్రం కాదు, చనిపోకముందే" అన్నది.

"కాని వారు చనిపోయారుగా! నువ్వు బ్రతికివుండగా వారిని యింకా ఎలా కలుసుకుంటావు?"

కిరణ్మయి చిరునవ్వునవ్వి "వారు నా కింకా జీవించేవున్నారు. ఇప్పటికే వెళ్ళిపోయివుండేదాన్ని, కాని........." అన్నది.

"కాని.........ఏమిటి వదినా?"

"వారు నన్ను కోరుతున్నారని ఒకసారైనా తెలిస్తే వెళ్ళివుందును."

దివాకరుడు మళ్ళా ఆశ్చర్యంతో "జీవించివున్నది యెవరు? ఎవరి సంగతి చెబుతున్నావు? వారు నిన్ను కోరుతున్నారో లేదో చెప్పేది ఎవరు? ఏమిటి సంగతి వదినా, చెప్పు!" అన్నాడు.

కిరణ్మయి మొహంమీద ఒక సన్నని మబ్బు కనుపించింది. కాని వెంటనే విడిపోయి వుజ్వలమైంది. కల్పిత క్రోధంతో "నువ్వు చాల యుక్తిపరుడవు. నీ నోటిమీదుగా ఏమీ చెప్పవు. నాతో సంగతులన్నీ చెప్పించుకుంటావు. పో, నేను వారిసంగతేమీ చెప్పను" అని మొహం తిప్పుకొని నవ్వుతో సాగింది. దివాకరునికి ఈ చిరునవ్వు కనబడింది. ఒక అజ్ఞాతావేగంతో

అతనిగుండె కొట్టుకోసాగింది. అతను కొంచెం తమాయించుకొని "నా సంగతు లేమున్నాయి, నీకు బైటపెట్టి చెప్పడానికి?" అన్నాడు.

కిరణ్మయి అతనికేసి చూస్తూ నుంచుని "ఇంతసేపటినుండీ బోధించిం దంతా గాలికిపోయిందా? ఒక్కసారి నీ గుండెమీద చెయ్యివేసుకు చూచుకో. అక్కడ ఏదో భీకరవిషయం కలవరం పుట్టిస్తూ వుందో లేదో! నిజం చెప్పు" అని అడిగింది.

దివాకరుడు మంత్రముగ్ధునిలాగ "ఏవిషయం వదినా? నాకేం బోధిం చావు?" అన్నాడు.

"నువ్వు నన్ను ఆశ్చర్యచకితురాలను చేశావు. ఇంతపెద్దవాడ వయ్యే వరకు కేవలం మోసమే నేర్చుకున్నావా? హృదయము విప్పి నువ్వూ నేనూ చెప్పుకోపోయినంత మాత్రాన ఎవరిహృదయాలూ బ్రద్దలుకావు" అనివంగి దివాకరుని గడ్డంపట్టుకు వూగించి గదిలోంచి బైటికి వెళ్ళిపోయింది. దివాకరుడు కొయ్యలాగ కూర్చుని వుండిపోయాడు. కిరణ్మయి ఎన్నిసార్లు ఎన్నివిధాల అతనితో పరిహాసమాడింది; అనేక వంకలతో, అనేకసార్లు అతన్ని స్పర్శ చేసింది. కాని నేటి ఈ పరిహాసము, ఈ స్పర్శ అతని నరాలన్నిటినీ జివ్వు మనిపించింది. తన రక్తప్రవాహానికి ఇంతవేడి, వేగమూ వున్నట్టు అత నింతవరకు ఎప్పుడూ గుర్తించలేదు.



# 3౨

చాలా కాలానికి ఇవ్వాళ ప్రొద్దున్నే అఘోరమయి పొరుగు ముసలమ్మలతో కలసి కాళీదర్శనానికి వెళ్లింది. వెళ్ళేప్పుడు అమ్మవారికి హారతి యిచ్చి వచ్చేటప్పటికి కొంచెం ప్రొద్దుపోతుందనికూడా చెప్పింది.

ఎనిమిదిగంటలౌతుంది. దివాకరుడు పక్కమీద మెదలకుండా పడి వున్నాడు. అతని తలవైపున పట్టె ప్రమిద ఒకటి మినుకు మినుకుమంటూ వుంది. కొంత కాలంనుండి ఈ మసక కాంతిలోనే అతను 'దుర్గేశనందిని' అను నవల చదువుతున్నాడు. పుస్తకం మొహంమీద పెట్టుకొని అతను ఏదో ఆలోచిస్తూ వుండేప్పటికి కిరణ్మయివచ్చి "నిద్రపోతున్నావా ఏమిటి చినబాబూ?" అన్నది.

దివాకరుడు మొహంమీద పుస్తకం తీయకుండానే "లేదు, తల నొప్పిగా వుంది" అన్నాడు.

"అయితే మంచి వైద్యంచేస్తున్నావు! తలవైపున దీపంలేకపోతే తలనొప్పి పోదాఏమిటి?" అన్నది కిరణ్మయి.

"ఈ పుస్తకం పూర్తిచేస్తున్నాను" అన్నాడు దివాకరుడు.

"కళ్ళు మూసుకొని ఆలోచిస్తుంటే పూర్తికాదుబాబూ, కళ్ళుతెరచి చదవాలి. భోంచేసిన తర్వాత పూర్తిచేస్తువుగానిలే. ఇకపద, అన్నంచల్లారి పోతూవుంది" అన్నది కిరణ్మయి.

దివాకరునికి లేవటానికి ఇష్టంలేదు. అతను వినయంగా "పిన్నివచ్చిన తర్వాత భోంచేస్తాలే వదినా!" అన్నాడు.

"ఆమె ఎప్పుడు వస్తుందో ఏమిఅంతూ ? ఇవ్వాళ నా వంట్లోకూడా బాగుండలేదు. ఆమెకు భోజనం గదిలోపెట్టి తల వాల్చుదామనుకుంటున్నాను. పద, నీకు వడ్డించి పని తీర్చుకొంటాను" అని ఆమె దివాకరుని చేతిలో పుస్తకము తీసుకొని దగ్గరగా దివాకరుని పెట్టెమీద కూర్చుని "లే !" అన్నది.

"నేను లేవదలచుకోలేదు వదినా! అంతకంటే ఏమైనా కబుర్లు చెప్పు చెప్పు వింటాను"

"కబుర్లతో కడుపునిండదు. వేళకు తిండితినాలి. లేస్తావా లేదా? చెప్పు."

దివాకరుడు క్షణంసేపు మెదలకుండా వుండి "నా స్నానానికీ, తిండికీ, పండుకుంటానికీ నీకింత శ్రద్ధ ఎందుకు వదినా?" అన్నాడు.

కిరణ్మయి నవ్వి "ఎందుకో నీకు తెలియదూ?" అన్నది.

"చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?"

"నువ్వు అబద్ధమాడుతున్నావు. చెప్పకుండాకూడా తెలుసుకోవచ్చు. నీకోసం నేనింత శ్రమపడేదెందుకో నీకు తప్పకుండా తెలుసు"

దివాకరుని మొహం సిగ్గుతో ఎర్రబడిపోయింది. అతను కొంచెంసేపు మెదలకుండా వూరుకొని కరుణస్వరంతో "నిన్ను ఒక్కసంగతి అడగనా వదినా?" అన్నాడు.

"తర్వాత ఒకటిగాదు, వంద అడుగుదువు గాని, ముందు భోంచేసి నాకు సెలవు యిప్పించు. తర్వాత తెల్లవార్లూ నీ మాటలకు సమాధానమిస్తూ కూర్చుంటాను. ఏమిటి? ఇష్టమేనా?" అని అమె చిరునవ్వు నవ్వసాగింది. దివాకరుడు ఈ పరిహాసానికి సమాధానమివ్వదలచి కృత్రిమ సానుభూతితో "రాత్రి తెల్లవార్లూ "నువ్వు ఈ ఇనపపెట్టెమీద కూర్చునేనా నా మాటలకు సమాధానమిచ్చేది వదినా?" అన్నాడు. కిరణ్మయి మొహంతిప్పి నవ్వుకొని "నేను దీనిమీద కూర్చున్నందువల్ల నీ మనసుకి కష్టంగావుంటే మెత్తని నీ పరుపుమీదకే వచ్చి కూర్చుంటాను. అప్పుడు నీకేం కష్టముండదుగా?" అన్నది.

దివాకరునిమొహం మళ్ళా కందగడ్డయైపోయింది. సిగ్గుతో వత్తిగిలాడు. కిరణ్మయి దగ్గరకువచ్చి "లేచి పద. నాకు పనికానీ. ఇలా సోమరితనాన్ని ఎందుకు పెంచుకుంటావు పండుకొని" అన్నది.

వంటిట్లోంచి పనిగత్తె పిలుపు వినిపించింది. "నాకు ఇక్కడికి వినపడుతూవుంది మీకు వినపడటంలేదు అమ్మగారూ? కింద అత్తగారు కేక పెడుతూన్నారు.

కిరణ్మయి మళ్ళీ ఆ పెట్టెమీదకు వెళ్ళి కూర్చుని పనిమనిషిమీద మండిపడుతూ "నువ్వు నెత్తిన ఎక్కుతున్నావు. నేను వెళ్లి తియ్యనా తలుపు? నువ్వు తియ్యలేవూ?" అన్నది.

"నా చేతిలో పనివుందని అన్నాను అమ్మగారూ!" అని పనిగత్తె ఖంగారుగా గబగబా క్రిందకు దిగిపోయింది. తలుపు తియ్యగానే అఘోరమయి మండిపడి "జామునేపటినుండి కిందపడి అరుస్తూన్నాను, వినపడటంలేదూ? మీ యిద్దరిచెవులు పూడిపోయాయా ఏమిటి?" అన్నది.

ఈ సారి పనిమనిషి మండిపడి "గుడ్డిదాన్నీ, చెవిటిదాన్నీ కాకపోతే మీ యింటికి నౌకరీ చేసుకోడానికి వచ్చానా అమ్మా! ఇంకెవరినైనా కన్నూ, చెవీ వున్నదాన్ని చూచుకోండి, నేను వెళ్లిపోతాను. నాకు వినపడదు" అన్నది.

అఘోరమయి వుల్లిపడి "అమ్మగారు ఎక్కడవున్నారు?" అన్నది.

పనిగత్తె యీసడింపుతో 'ఎక్కడవుంటారు! పగలస్తమానమూ మరదితో సరసాలాడుతూ కూర్చుంటారు. నా చేతిలో పనివుంది అమ్మగారూ తలుపు తియ్యమని అనేప్పటికి నా మీద మండిపడి నువ్వు నెత్తికెక్కి కూర్చుంటున్నావు." వెనక్కితిరిగి చూసి "పెదబాబుగారు........." అని సిగ్గుతో ఒకపక్కకెళ్ళి నుంచున్నది.

అఘోరమయి వెనక్కితిరిగి చూసి "రా నాయనా వుపేంద్ర! పైకిరా" అన్నది.

"వస్తున్నాను పదపిన్నీ" అని వుపేంద్రుడు అఘోరమయి వెనుకనే మెట్లు ఎక్కి వెళ్ళాడు. పనిగత్తె మాటలన్నీ అతను విన్నాడు.

పైకివచ్చి అఘోరమయి కంఠస్వరంతో "ఎక్కడ వున్నావు అమ్మాయి! కొంచెం బైటికిరా, వుపేంద్రుడు వచ్చాడు. అతనికి........." అన్నది.

చీకటిగదిలో కూర్చునియున్న కిరణ్మయి గుండె అదిరిపోయింది పక్కమీద పడుకొనియున్న దివాకరుని వళ్ళు వల్లబడిపోయింది.

"ఎక్కడికి వెళ్ళావే? వుపేంద్రుని మంచోబెడతావా ఏమిటి? ఒక చాప తీసుకొచ్చి వెయ్యి" అఘోరమయి మళ్ళా కేకపెట్టింది.

కిరణ్మయి బైటకువచ్చి వసారాలో ఒక చాపవేసింది. ఆమె నోటివెంట చప్పున మాటరాలేదు. వుపేంద్రుడు ఆమె దగ్గరకువచ్చి నమస్కరించి "బాగున్నావా వదినా?" అన్నాడు.

కిరణ్మయి సంభాళించుకొని తల పంకించి "ఆఁ నువ్వేలా వున్నావు? అక్కడ బాగుందిగా? తలవనితలంపుగా వచ్చారే?" అన్నది. కిరణ్మయి కంఠస్వరం విని వుపేంద్రుడు ఆశ్చర్యపడ్డాడు. స్వరంలో మాధుర్యం లేశమాత్రమైనా లేకుండా శుష్కంగా నీరసంగా వుంది!

"క్లయింటులడబ్బు నన్నిక్కడికి లాక్కొచ్చింది వదినా! మళ్ళా రేపు ప్రొద్దున్నే తిరిగివెళ్ళాలి. దివాకరుని సంగతులేమిటి? వుత్తరం పత్రంకూడా రాయటంలేదు. ఇంట్లో లేడా ఏమిటి?" అన్నాడు వుపేంద్రుడు.

"తల నొప్పిగా వున్నదని పడుకున్నాడు. నిద్రపోయాడేమో" అన్నది కిరణ్మయి.

అఘోరమయి మనస్సు ఇవ్వాళ బాగుండలేదు. కాస్త సందు దొరికితే చాలు. కోడలిమీద నేరాలు ఆరోపించటానికి ఆమె ఏమీ వెనకాడదు. ఇవ్వాళ దివాకరునియందుకూడా ఆమె మనస్సు సంతృప్తిగా లేదు. ఇవ్వాళ ప్రొద్దున అతన్ని తనవెంట కాళీఘాట్ కు రమ్మన్నది. కాని పని వున్నదనే వంకతో అతను వెళ్ళలేదు. కటువుగా "ఇప్పుడేగా అతని గది లోంచి వస్తున్నది. నిద్రపోతున్నాడో, మేలుకొనివున్నాడో కూడా తెలియదూ?" అన్నది.

"తెలియదు" అని కిరణ్మయి అత్తవంక అస్వాభావికదృష్టితో చూచింది. ఉపేంద్రుడు "దివాకర్!" అని బిగ్గరగా పిలిచాడు.

చడీ చప్పుడూ లేదు.

"నిద్రపోతున్నావా దివాకర్" మళ్లా పిలిచాడు.

అతను లేస్తున్నాడు. ఈ పిలుపును నిర్లక్ష్యం చెయ్యలేక 'వస్తున్నాను' అని మెల్లగా బైటికివెళ్ళి నుంచున్నాడు. నమస్కరించి అస్పష్టస్వరంతో "ఎప్పుడు వచ్చావు అన్నయ్యా?" అన్నాడు.

"ప్రొద్దున. తలనొప్పిగా వుందా?"

"కొద్దిగా."

అఘోరమయి "తలనొప్పీలేదు, ఏమీలేదుబాబూ! మొదట్లో కొంచెం అటూఇటూ తిరిగి వస్తూవుండేవాడు. ఇప్పుడు బొత్తిగా ఇంట్లోంచి కదలనే

కదలటంలేదు. ప్రొద్దున నావెంట కాళీఘాటుకు రారా బాబూ! అంటే నాకు పనివుంది పిన్నీ! రాను అన్నాడు. ఏమిపనో కొంచెం చెబుదూ?" అన్నది.

దివాకరుడు మెదలకుండా నుంచున్నాడు.

"వుత్తరం పత్రంకూడా రాయటంలేదు! ఏ కాలేజిలో చేరావు?" అన్నాడు ఉపేంద్రుడు.

దివాకరుడు కోమలస్వరంతో "కాలేజీలు తెరవగానే చేరతాను." అన్నాడు.

"ఇంకా చేరలేదు? కాలేజీలు తెరవగానే చేరుతావా?" క్రోధంతో వుపేంద్రుని కళ్ళు చింతనిప్పుల్లాగ ఎర్రబడ్డాయి. కాలేజీలు తెరచి పదిహేను రోజులైనా నీకు అంతులేదూ?"

దివాకరుని మొహం వెలవెలపోయింది. రాతివిగ్రహంలాగ నిలబడ్డాడు.

సదుందొరికేప్పటికి అఘోరమయికూడా మొహం చిట్లించుకొని "ఎలా తెలుస్తుంది వుపేంద్ర్? రాత్రింబగళ్లు ఇద్దరూ నవ్వులూ, పరిహాసాలతో ఏమేమి చెప్పుకుంటారో ఎవరికి తెలుసు. నేను అనేకసార్లు చెప్పిచూచాను. పరాయిబిడ్డ అమ్మా, చదువుకోటానికి వచ్చాడు. పగలస్తమానమూ అతనివద్ద కూర్చుని ఏమిచేస్తావని. మరది అయితేమట్టుకు వయసుకుర్రాడికి కొంచెం వెనక్కి తగ్గుతూవుండాలి. కాని నా మాట వినేదెవరూ?" వుపేంద్రుని కేసిచూచి "నువ్వు వుండబట్టిగాని లేకపోతే ఈపాటికి నా గొంతు నలిపి పారేసేది. దైవసాక్షిగా చెబుతున్నాను ఉపేంద్ర్. తప్పంతా ఈ నిర్భాగ్యురాలిదే" అన్నది.

కిరణ్మయి దగ్గరే నుంచునివుంది. ఒక్కమాటకూడా ఆమె సమాధానమివ్వలేదు. మెల్లగా వంటింటివైపుకు వెళ్ళింది.

అఘోరమయి క్రోధస్వరంతో అలాగే "ఒసీ కాలిపోయినదానా! నేను పగల్లా వుపవాసమున్నాను. భోజన ఏర్పాట్లు ఏమైనా చేస్తావా లేదా? ఎక్కడికి ఆ పోయేది?" అన్నది.

కిరణ్మయి వెనక్కి తిరిగి నుంచుని స్వాభావికంగా "అందుకేగా వెళుతూవున్నది!" వుపేంద్రునితో "పారిపోబోకు బాబూ! పూరీలు చేయటానికి పది నిమిషాలకంటె ఎక్కువ పట్టదు" అన్నది.

స్తబ్ధుడైయున్న దివాకరునితో "నీకుగూడా అన్నం వడ్డించుతాను. పద చినబాబూ! పనిమనిషిని కొంచెం బజారుకు పంపు అత్తా! బాబుగారికి కొంచెం మిఠాయి తీసుకొస్తుంది!" అన్నది.

అఘోరమయి, వుపేంద్రుడు ఇద్దరిలో ఎవరూ ఆమెమాటలకు సమాధానం చెప్పలేకపోయారు.

గంటసేపైనతర్వాత అఘోరమయి సంధ్యాపూజ చెయ్యటానికి వెళ్ళింది. కిరణ్మయి వుపేంద్రుని దగ్గరకువచ్చి "నా గదిలో నీకు ఫలహారం పెట్టి వచ్చాను. పదబాబూ!" అన్నది.

వుపేంద్రుడు మెదలకుండా లేచివచ్చి పీటమీద కూర్చున్నాడు. కిరణ్మయి దగ్గిరగా చాపమీదకూర్చుని "ఇవ్వాళిటికి ఇంతటితోనే సరిపెట్టుకో మరదీ! ఇప్పుడు వంట పెట్టుకుకూర్చుంటే పొద్దుపోతుంది" అన్నది.

ఉపేంద్రుడు తలెత్తిచూచాడు. మినుకు మినుకు మంటున్న దీపపు వెలుగులో ఆమె వదనం కఠినంగా వున్నట్లగపడింది. అన్నపు పళ్ళెం ఒక వైపుకు నెట్టి "ఇది సరిపోతుందిగాని వదినా! నేను ఇవ్వాళ భోజనానికి రాలేదు. మిమ్ము ఏకాంతంగా రెండు మాట లడిగిపోదా మని వచ్చాను" అన్నాడు.

"నాకు పరమభాగ్యం! కాని భోజన మెందుకు చెయ్యవు?" అన్నది కిరణ్మయి.

ఉపేంద్రుడు ఒక్కక్షణంసేపు ఆమె మొహంకేసి చూచాడు. కాని ఆమె మొహంలోని కాఠిన్యత మరింత పెరిగింది. "నీ చేతికూడు తినటానికి ఇవ్వాళ నాకు వెగటనిపిస్తూవుంది" అన్నాడు.

కిరణ్మయి మెదలకుండా తలవంచుకు కూర్చుంది. కొంచెంసేపైనతర్వాత మెల్లగా మళ్ళా తల పైకెత్తి చిరునవ్వుతో "వెగటనుపించే విషయమే! కాని నీ నోటివెంట ఇలాంటి మాట వస్తుందని నే నెప్పుడూ అనుకోలేదు. ఈ విధంగా వెగటుతో పళ్ళెం నెట్టివెయ్యగలవ్యక్తి ఒక్కడే వున్నాడు. సతీశుడు. నువ్వుకాదుబాబూ" అన్నది.

ఉపేంద్రుడు క్రోధవిస్మయాలతో స్తబ్ధుడైపోయాడు. కిరణ్మయిఅలాగే శాంతంగా కఠోరభావంతో "నామీద నీకే కోపమూ వెగటూ అన్నీ దివా

కిరుని కోసమేకదూ? నాలాంటి విధవకు నువ్వులాంటి వాడవో అతనూ అలాంటివాడే. అతనితో నా సంబంధం ఎంతవరకో ఎలాంటిదో నా ఆత్మకు తెలుసు. ఇది మీ అనుమానంమాత్రమే. కాని నా నోటిమీదుగా నీయందు ప్రేమయున్నదని చెప్పించాలోజూన నా చేతితో పెట్టిన అన్నపుపళ్ళెం ఈ విధంగా త్రోసివెయ్యలేకపోయావు. తనవారికిందకు పంపియిస్త్రీ పెట్టిన మిఠాయిలో ప్రేమమాధుర్యం అంత అధికంగా వుంటుందేమిటి?" అన్నది.

ఉపేంద్రుడు లోపలి కోపాన్ని చాల కష్టంమీద అపుకుని "నీముందు ఆమె పేరెత్తటంకూడా ఆమెకు అవమానం చేసినట్టే. అయినా ఇంకా మా సురబాల బతికేవున్నదని మళ్ళా ఒకసారి జ్ఞాపకం చేస్తున్నాను! ఒకసారి ఒకరిని ప్రేమించినవారు మరొకరిని ప్రేమించే అధికారం లేదంటుంది ఆమె. ఈ నమ్మకంతోనే దివాకరుని నీ చేతి కప్పజెప్పాను. ఈ విషయంలో సురబాల వల్ల ఏమీ పొరపాటేమీ జరగదని అనుకున్నాను. కాని......" అన్నాడు.

మాట పూర్తికాకముందే కిరణ్మయి ఒక్కసారి రెండు చేతులు ఎత్తి "ఆగుబాబూ. ఆమె పొరపడింది, నువ్వు పొరపడలేదని గట్టిగా ఎలా నమ్మావు?" అన్నది.

ఉపేంద్రుడు దిగ్గునలేచి కూర్చుని "ప్రొద్దుపోతూవుంది, వాదించటానికి నాకు తీరికలేదు వదినా! నేను నిన్ను బాగా ఎరుగుదున్నాను. నువ్వు ఎవరినీ ప్రేమించలేవనటం నీ సామర్థ్యానికి మించినదని గట్టిగా తెలుసుకో. నువ్వు ఎవరినైనా సర్వనాశనం చేస్తావు, ఛీ! ఛీ! ఆఖరికి దివాకరునికూడా......" అన్నాడు.

అతనిగొంతు పొడారిపోయింది. కిరణ్మయికేసి చూచాడు. ఎవరో ఆమె గుండె చీల్చినట్లు మొహం వివర్ణమైపోయింది.

"భోజనమైనదా ఉపేంద్ర?" అడిగింది అఘోరమయి బైటనుండి

"లేదు పిన్నీ. తినలేదు. వంట్లో బాగుండలేదు"

"వంట్లో బాగుండలేదూ? అయితే వెళ్ళవద్దు ఇవ్వాళ్ళికి ఇక్కడే వుండు నాయనా!"

"లేదు పిన్నీ, నేను వెళ్ళాలి" అని ఉపేంద్రుడు బైటికి వచ్చాడు. దివాకరుని గది వాకిటివద్దకు వచ్చి "దివం" అని పిలిచాడు.

దివాకరుడు దీపం తగ్గించి పండుకోబోతున్నాడు. అతని హృదయావస్థ అంతర్యామికితప్ప ఇంకెవరికీ తెలియదు. అస్పష్టస్వరంతో "ఆఁ" అని వణికిపోతూ బైటికి వచ్చాడు.

"నీ సామాను సర్దుకో, నా వెంటతీసుకెళ్తాను"అన్నాడు వుపేంద్రుడు.

అఘోరమయి త్రుళ్ళిపడి గాబరాతో "ఇదేమిటి వుపేంద్ర్? ఈ రాత్రి కాడ పిల్లవాడు ఎక్కడికి వెళతాడు?" అన్నది.

"నా వెంట వస్తాడు పిన్నీ. చింతేమున్నది? సామానంతా త్వరగా సర్దుకో. నేను బండి తీసుకువస్తాను."

అఘోరమయి వుపేంద్రుని చేయిపట్టుకొని "ఈ అమావాస్యరోజున వాణ్ణి ఎక్కడికి తీసుకుపోవద్దుబాబూ! పిల్లవాడు, ఏదైనా చెయ్యరాని పనే చేశాడనుకో! ఇక్కడ వుంచకపోతే లేపో రెుల్లుండో తీసుకు వెళుదువుగాని. ఈ రాత్రి నే నెక్కడికీ కదలనివ్వను" అన్నది.

ఇలా అడ్డుతగలటం చూచి వుపేంద్రుడు హతాశుడై "వాణ్ణి ఇక ఇక్కడ ఒక్కనిమిషంకూడా వుంచటానికి ఇష్టంలేదు పిన్నీ! అయితే ఇవ్వాళ, ఈ అమావాస్యరాత్రి గడచిపోనీ, కాని రేపుప్రొద్దున మట్టుకు ఆపవద్దు "అని అఘోరమయికి నమస్కరించి త్వరత్వరగా కిందికి దిగిపోయాడు. తలవాకిలి వద్ద వెనకనుండి వైపంచ లాగినట్టుండి వెనక్కితిరిగి చూచేప్పటికి కిరణ్మయి వంగి అతని పాదాలుపట్టుకుంది. "నా గుండె పగిలిపోతుందిబాబూ! నీ స్థానంలో నే నెప్పుడైనా దివాకరుని......" అన్నది.

"నోరత్తరు" అని వుపేంద్రుడు ఏవగింపుతో ఆమెతలను ఒక నెట్టు నెట్టి త్వరత్వరగా బైటికి వెళ్ళిపోయాడు.

కిరణ్మయి మెరపులాగ దిగ్గునలేచి కూర్చుంది. అరుస్తూ ఏదో అనాలనుకున్నదిగాని గొంతు పెగిలిరాలేదు. వాకిలికేసిచూస్తూ మాత్రం వూరుకుంది. కళ్ళవెంట నిప్పుకణాలు రాలినై.

కొంతకాలంక్రితం వుపేంద్రుడు సతీశుని వెంటబెట్టుకు వచ్చినరోజున ఈ చీకటిప్రదేశంలోనే ఆమెకళ్ళల్లో ఇలాంటి వున్మత్తదృష్టే, ఇలాంటి వుజ్వలజ్యోతులే కనబడ్డాయి. ఇవ్వాళ కడసారి సెలవురోజున మళ్ళా అతని యందు ఆ కళ్ళే అలాగే అగ్ని కురిపించసాగినై.

"ఇక్కడ కూర్చున్నారేమిటి అమ్మగారూ?"

"[illegible] వెళ్తున్నావా ముక్తా?" అని కిరణ్మయి దిగ్గునలేచి [illegible] చేయ్యి పట్టుకొని "[illegible] నా గదిలోకి పద, నీతో రెండు మాటలు [illegible]" అని [illegible] దాసీని [illegible] గదిలోకి తీసుకువచ్చి దీపము [illegible], [illegible] తీసి తన [illegible] డబ్బు [illegible] ఆమె [illegible] "[illegible] అమ్మాయికి [illegible] ఇస్తున్నాను. దీనిని తీసుకోకపోతే [illegible] తీసుకోమే నా" అని ఆమె ఏడ్వసాగింది. కళ్లవెంట

"ఏమి మాటలు అమ్మగారూ?" దాసీ ఆతురతతో ఆమె ముఖం చూసి మళ్ళీ అడిగింది.

కిరణ్మయి కళ్లు తుడుచుకుంటూ "నీకంటె నాకు ఆత్మీయులెవరూ లేరు, నన్ను రక్షించు, నన్ను కాపాడు. నన్ను ఇక్కడనుంచి తప్పించు. ఇక్కడ వుంటే నా హృదయం పగిలిపోతుంది" అన్నది.

దాసీది మాట్లాడకుండా కిరణ్మయిని పైనించి క్రిందకి చూచింది. ఒక నిట్టూర్పు విడచి "అంతా తెలుసు అమ్మగారూ! నేనూ ఆడదాన్నేగా! మా వారు చెయ్యి పట్టుకుని ఏడుస్తూ 'వెళుతున్నాను ముక్తా! మళ్ళీ ఇంకెప్పుడూ కలియనేమో!' అన్నప్పుడు నేనుకూడా ఆయన పాదాలమీద పడి విలపిస్తూ 'నన్నుకూడా వెంట తీసుకెళ్ళు. ఒంటరిగా వదలిపెట్టి వెళితే నా గుండె పగిలి పోతుంది' అన్నాను. అయితే రేపు ప్రొద్దున చినబాబుగారు ఇక్కడనుంచి వెళ్ళిపోతారా ఏమిటి?" అన్నది.

"అవును ముక్తా! కాని ఇక మేము కలకత్తాలో వుండలేము. ఎక్కడికి వెళ్లి వుండాలో చెప్పు" అన్నది కిరణ్మయి.

దాసీది ఏమీ ఆలోచించకుండానే "అరకాన్ వెళ్లు అమ్మగారు, సుఖంగా వుంటారు. అక్కడ మా చెల్లెలుకూడా వుంది. నా పేరు చెబితే అక్కడ నిన్ను నెత్తిన పెట్టుకుంటుంది. ఇవ్వాళ మంగళవారం. రేపు ప్రొద్దున బైలుదేరుతుంది బోటు అమ్మగారూ!" అన్నది.

కిరణ్మయి ముక్తను కౌగిలించుకొన్నది. ఆమె కిరణ్మయి కన్నీళ్ళు తుడిచి ధైర్యం చెబుతూ "అయితే మీరు ప్రయాణమై వుండండి. నేను తెల్లవారు ఝామున బండి తీసుకువచ్చి మీ ఇద్దరినీ తీసుకువెళతాను. మీ రెక్కడికి వెళ్ళారో పురుగుకుకూడా తెలియదు. వెళ్ళు అమ్మగారూ, వెళ్ళు! చిన్న బాబుగారు లేనిదే మీరు బతకలేరు" అని కంట తడి పెట్టింది.

♦ ♦ ♦ ♦

"మరదీ!"

బహుశా తెల్లవారివుంటుంది. దివాకరుడు త్రుళ్ళిపడిలేచి కూర్చున్నాడు. ఎదురుగా కిరణ్మయి నుంచునివుంది. నల్లంచు సిల్కుచీర కట్టుకొంది. దీపపు వెలుతురులో వంటిమీద నగలు మెరుస్తూ ఉన్నాయి.

దివాకరుడు చకితుడై "నువ్వా వదినా?" అన్నాడు.

"అవునుబాబూ! నేనే" అని కిరణ్మయి వ్యాకులపాటుతో నిద్ర మత్తులోనున్న దివాకరుని వక్షంమీదికి ఒరిగి "నన్ను వదలి వెళ్లిపోతావా బాబూ! ఎక్కడికి వెళతావు?" అన్నది.

సమాధానంగా దివాకరుడు ఒక్కమాటకూడా మాట్లాడలేక పోయాడు. అతని కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించసాగినై.

కిరణ్మయి లేచికూర్చుని పయిటచెంగుతో అతని కన్నీళ్ళు తుడిచి "మగవాడవై యుండి ఏడుస్తున్నావా?" అన్నది.

"నా స్వాధీనంలో ఏమీ లేదువదినా. చిన్న అన్నయ్య ఇవ్వాళ ప్రొద్దున నన్ను తీసుకెళతానని చెప్పాడు."

ఉపేంద్రుని పేరు తలవగానే కిరణ్మయితల వేడెక్కిపోయింది. తీవ్ర స్వరంతో "వారెవరు? నీకు వారు నాకంటె ఎక్కువ ఆత్మీయులా? నిన్ను చూడకపోతే వారిగుండెకూడా పగిలిపోతుందా? లేదుబాబూ! ప్రపంచంలో మనిద్దరినీ వేరుచేసే అధికారం ఎవరికీలేదు. బైట బండి నుంచునివుంది, పద. మన మిద్దరం వెళ్లిపోదాం?" అన్నది.

"ఎక్కడికి వదినా!"

"నేను తీసుకువెళ్లిన చోటికి."

"సరే" అని దివాకరుడు లేచాడు. ఇంకా నిద్రమత్తు వదలలేదు. కల గంటున్నానేమో ననిపించింది. కిరణ్మయివెంట గదిలోంచి బైటికివచ్చి నుంచున్నాడు.

---

# 33

కిరణ్మయి ఏదో మంత్రశక్తితో అర్ధచేతనా భ్రాంతచిత్తుడైన దివాకరుని ఓడరేవుదగ్గరకు తీసుకువచ్చి టిక్కెట్టుకొని అరకాను వెళ్లే ఓడ మీదకెక్కి కూర్చుంది. ఓడలో జనం ఎక్కువగా లేకపోవటంవల్ల దివాకర కిరణ్మయులను దంపతులనుకొని వారికి ప్రత్యేకంగా ఒక కేబిన్ యిచ్చారు. దివాకరుడు కిరణ్మయిని కేబిన్‌లో కూర్చోబెట్టి తను డెక్‌లో ఏకాంతంగా రేలింగుపట్టుకొని మెదలకుండా నుంచున్నాడు. చూస్తూచూస్తూ వుండగానే డెక్‌మీద యాత్రికుల గుంపు శాంతించింది. కూలీల గల్లంతు తగ్గింది. లంగరు మోతతో దివాకరుని హృదయం కదిలిపోయింది. నిమిషంలో ఓడ గంగ మధ్యకు వచ్చి అపార సాగరంలో ప్రవేశించడానికి గతిని చేకూర్చుకోసాగింది. ఓడ కదిలిం తర్వాత దివాకరుని కళ్ళనిండా నీళ్లు తిరిగినై. అతను రెండు చేతులతో మొహం కప్పుకొని దుఃఖావేగాన్ని ఆపుకున్నాడు. పూర్వప బాలసూర్యుని అరుణ కిరణాలు ఆకాశాన్ని రక్తమయం చేస్తున్నాయి. తన రాకకై కించిత్తు కూడా సందేహపడని, వుపేంద్ర అన్న జ్యోతిషబాబుగారి యింట్లో ప్రాతఃకాలపు సుఖనిద్ర ననుభవిస్తూ వుంటాడు. ఇంటినుండి కదిలేవరకు కనపడని భయంకరదుఃఖం దివాకరుని హృదయంలో అతనికి తెలియకుండానే పేరుకోసాగింది. దాని అంతిమ ఫలితం ఎంతబీభత్సంగా వుంటుందో ఇప్పుడు అతని

కళ్ళకు కట్టినట్లు కనపడసాగింది. కులమర్యాదలుగల కుటుంబంలోని విధవను తను ఈ విధంగా దేశాలమీద తీసుకుపోతానని కలలోకూడా అనుకోలేదు. ఓడ కదిలినకొద్దీ అతను తన శిక్షాసంస్థానికీ, చరిత్ర - జాగ్రఫీలకూ, మిత్ర-బాంధవులకూ, అన్నిటికన్న మిన్నయైన వుపేంద్రబాబుకూ నిర్దాక్షిణ్యంగా, దూరమై పోతున్నానని గ్రహించాడు. వుపేంద్రబాబుముందు తను ఇవ్వాళకూడా చిన్నపిల్లవాడే. ఈ కబురు విని అతని మనసులో భావం ఎలావుంటుందోనని ఆలోచించుకొనేప్పటికి అతని గుండె ఆగిపోయినట్లయింది. అక్కడే మోకాళ్ళసందున తల యిరికించుకు కూర్చుని కన్నీరు కార్చసాగాడు. కిరణ్మయి ఎదుటకు వచ్చి నుంచుని అతని తల నిమురుతూ "పదబాబూ! గదిలో కూర్చుందువుగాని" అన్నది ప్రేమగా.

ఎంతో ప్రయత్నముతో దివాకరుడు కన్నీళ్ళు తుడుచుకులేచి తల వంచుకునుంచుని మెల్లగా కిరణ్మయివెంట కేబిన్‌లోకి వచ్చాడు. కిరణ్మయి కేబిన్ తలుపువేసివచ్చి దివాకరుని చెంత కూర్చోబెట్టుకుని అతని చేతులు రెండూ తన చేతులలోనికి తీసుకొని అతని ముఖంలోకిచూస్తూ అత్యంత కరుణాస్వరంతో "ఏడుస్తున్నావా?" అన్నది. దివాకరుని కళ్ళల్లో మళ్లా నీళ్ళు తిరిగినై.

కిరణ్మయి తన పైటచెంగుతో అతని కన్నీళ్లు తుడిచి "నిజం చెప్పు బాబూ! నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా?" అన్నది.

దివాకరుడు సమాధానం చెప్పలేక పోయాడు. చిన్న పిల్లవాడిలాగ అధైర్యపడి కుమిలి ఏడ్వసాగాడు.

కిరణ్మయి కన్నీళ్లతో తడిసిన అతని ముఖాన్ని తన హృదయంమీదికి లాక్కుని చేత్తో తలనిమురుతూ ఓదార్చసాగింది. కిరణ్మయి ముఖంమీద ఒక వింతైన పరిహాసం, వినోదం లాస్యంచేస్తూవున్నాయి. ఆమె వాటిని కప్పి పెట్టుకోటానికి ప్రయత్నిస్తూవుంది. ఇది దివాకరుడు చూడలేదు.

ఈ విధంగా చాలసేపు గడచిపోయింది. కన్నీటిధారలు వాటంతటవే ఆగిపోయినయి. మొదటికంటె అతని మనస్సుకూడా కొంచెం శాంతించింది. మెదలకుండా తలుపుతీసుకొని గదిలోంచి బైటికిపోయాడు. ఓడ మందగమనంతో ఒడ్డువెంట సముద్రంకేసి పోతూవుంది. చిన్న నావలు ఓడ విసురికి ఆగలేక దూరదూరంగా పోతున్నాయి.

చాల సేపటివరకు ఈ విధంగా నిశ్చలభావంతో వున్నతర్వాత ఆమెకు దివాకరుడు ఇంతవరకు తిరిగి రాలేదేమో నని జ్ఞప్తికివచ్చింది. బైటకు వెళ్ళి చూచింది. దివాకరుడు ఎక్కడా కనిపించలేదు. తర్వాత తిరిగివచ్చితలుపువేసి చాపమీద చతికిలపడి "నొసటయిదికూడా వ్రాసివుందా?"అని అప్రయత్నంగా నేలఆమెనోటివెంట వచ్చింది. కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహించ సాగినై.

బైటకువచ్చి దివాకరుడు స్తిమితంగా వుండలేకపోయాడు. అటూఇటూ తిరుగుతూ మూడవతరగతి ప్రయాణీకులు క్రిక్కిరిసి కూర్చుని వున్నచోటికి వెళ్ళి చూచాడు. పలు ప్రాంతాలనుంచి వచ్చిన పలురకాలైన మనుష్యుల మధ్యకూర్చుని కాలం గడపవచ్చు ననుకున్నాడు. ఈ భారత దేశంలో ఎన్ని రకాలైన జాతులవారున్నారు! ఎన్నిరకాలైన వేష భాషలు ఆచరణలో వున్నాయి! ఈ సంగతులన్నీ దివాకరునికి బొత్తిగా కొత్త. అతను ఆశ్చర్యంతో నోరు మెదల్పలేకపోయాడు. ఈ నానాభాషల సమ్మిశ్రణవల్ల వచ్చిన అభినవ శబ్దజాలము చాల విచిత్రంగా వుంది! దివాకరుడు మెట్లుదిగి ఆజనసమూహంలోకి వెళ్ళి ఆశ్చర్యంతో స్తబ్ధుడై నిలబడిపోయాడు.

ఇంతకుముందు కాస్తచోటులో కూర్చునేందుకు ప్రయాణీకులలో కలవరం చెలరేగింది. కాని ఇప్పుడు వారు తమతమ ఆక్రమితస్థానాలయందు పక్కలు పరచుకొని, సామానుసర్దుకొని కూర్చున్నతర్వాత పక్కయాత్రికుల వైపుకు ధ్యానం తిప్పటానికి సావకాశం దొరికింది. ప్రతివాడూ తనప్రక్క వారిని పరిచయం చేసుకోటానికీ, వారితో కుంగాసాగా కబుర్లుచెప్పుకోటానికీ కుతూహలపడుతున్నాడు. ఈ అద్భుత శబ్దరాశి వుత్సుకకంఠాలతో అడిగే - చెప్పే ఆ ప్రశ్నోత్తరాల కూడికేనని తెలుసు న్నాడు దివాకరుడు.

ఇంతలో ఒక బెంగాలీ నిలబడి "ఇటురా బాబూ, ఇటురా" అని బిగ్గరగా పిలుస్తూవుండటం కనబడింది దివాకరునికి. అతనిచెంత ఒక ప్రౌఢ స్త్రీ కూర్చునివుంది. ఆమె కూడా భర్త ఆహ్వానాన్ని సమర్థిస్తున్నట్లు దివాకరునికేసి వుత్సుక నేత్రాలతో చూస్తూవుంది. దివాకరుడు ఎంతో యాతనతో ప్రయాణీకుల విదిలింపులు ఈసడింపులు సహించి గుంపు మధ్య జాగ్రత్తగా అడుగులు వేసుకొంటూ అతనివద్దకు చేరుకున్నాడు. దగ్గరకురాగానే అతను దగ్గరవున్న పెట్టె చూపిస్తూ "దానిమీద కూర్చోండి. మీరెవరు?" అన్నాడు.

వెంటనే అతడు దివాకరునికి నమస్కరించి "ఈ నాలుగురోజులు ఎలా గడుస్తుందా అనుకున్నాను. మీరు దొరికారు అదృష్టవశాత్తూ. అయితే మీ రెక్కడ కూర్చున్నారు?" అన్నాడు.

దివాకరుడు పైకి చూపించి "కేబిన్‌లో" అన్నాడు.

"ఎక్కడైనా వుండండి. సాయంత్రం వచ్చి ఒకసారి దర్శనమాత్రం యిచ్చి వెళ్ళండి. రంగూన్ వెళతారా ఏమిటి?" అన్నాడు. దివాకరుడు తల కాయతిప్పి "లేదు, అరకాన్" అన్నాడు.

"నేనుకూడా అరకాన్‌లోనే వుంటున్నాను. అక్కడ నివాస మేర్పరచుకొని ఇరవై సంవత్సరాలైంది. ఇంతకు ముందెప్పుడూ మిమ్మల్ని అక్కడ చూడలేదు. ఇదే మొదటిసారి వెళ్ళటమా? అక్కడ మీ బంధువు లెవరైనా వున్నారా? లేకపోతే మాత్రమేమి! మీరేమీ చింతపడ నవసరంలేదు. మీ దయవల్ల నేనక్కడ ఒక యిల్లు కట్టించుకున్నాను. చాలా గదులు ఖాళీగా పడివున్నాయి. ఆఁ మావెంటే వస్తున్నాగానీలే" పక్కనున్న స్త్రీనిచూపించి "మా ఇంటావిడ" అన్నాడు..

ఇంతసేపటినుండీ రెప్పవాల్చకుండా దివాకరుని చూస్తూన్న ఆ స్త్రీ "మీ ఆవిడకూడా వుందా వెంట?" అన్నది.

దివాకరుడు సిగ్గుతో తలవంచుకుని "ఆఁ వున్నది" అన్నాడు. మాటలనుబట్టి ఆమె బంగాళీలాగ లేదు. మొహాన బొట్టు వున్నది. పాపట్లో సిందూరచిహ్నమున్నది. ముక్కున పుడక, రెండు చెవులనిండా కుట్టు పోగులూ వున్నాయి. "మా వెంట రావటం చాల మంచిదైంది. అరకాన్ చాల చెడ్డ ప్రదేశం. రౌడీలకు పుట్టినిల్లు. కాని మా ఇంటివైపే కన్ను వాల్చటానికికూడా ఎవడికీ ధైర్యముండదు. నేను అలాంటి ఇల్లాలిని కూడా కాదు. కామినీదాసి పేరు చెప్పగానే గడగడలాడని వాడెవడుంటాడు! మీరు మా ఇంట్లోనే వుండండి. భయమేమీ వుండదు. అద్దె అయిదు రూపాయలు, కాని మీరు నాలుగు రూపాయలే ఇవ్వండి. మళ్లీ భర్తకేసిచూచి "ఏమయ్యా ఇంటాయనా! మీ కార్ఖానాలో వీరికేమైనా వుద్యోగం దొరుకుతుందా?" అన్నది.

ఇంటాయన కొంచెం ఆలోచించి "ఆఁ దొరకవచ్చు" అన్నాడు.

"మీ పేరు?" దివాకరుడు అడిగాడు.

"హరీశభట్టాచార్యులు. కాని నేను బ్రాహ్మణ్యానికోవస్తు, వైష్ణవుణ్ణి. అందరూ ఆదరంగా భట్టాచార్యులు అంటారు. చేపలు, మాంసం తినను. మెళ్లో రుద్రాక్షమాల వేసుకున్నాను. వెయ్యి వెయ్యిన్నర రూపాయలు ఖర్చుపెట్టి దేశమంతా తిరిగివచ్చాను. ఇంట్లో దేవీ ప్రతిష్ఠచేసి నాలుగు సంవత్సరాలైంది. నాకు వలసినది ఇంకేమీ లేదు. అందుకని 'ఆర్ కాన్‌షస్నెస్ కాస్త అమ్ముకుని ఏతీకసలలోనో వృందావని' ఆ టూవ్వు టౌను దీనితో" అని మహా సంతోషంతో సైకిమాస్తా మెదలకుండా పూరుకున్నాను. ఇల్లాలు సావ్ఫ్ఘానిస తన పెద్దగొంతుతో "నేనూ అదే ఆ టూవ్వు టౌను" అని మొహం కప్పుకుంది. దివాకరుని బుద్ధి ఇంకా సక్రమం చేపట్టలేదు. పశ్చిముడెలాంటి వాడు. అందుచేత ఈ మాటలన్నిటి గూఢార్థాలు అతను తెలుసుకోలేక మెదల కూర్చున్నాడు.

"అయితే, ఇక అటుకులు నానపెట్టనా?" అన్నది ఇల్లాలు.

ఇంటాయన ధ్యానభంగమైంది. "నాంజ్పా" అన్నాడు మెల్లగా.

ప్రపంచానుభవహీనుడైన దివాకరుడు ఈ సంజ్ఞతో తాత్పర్యం గ్రహించి లేచినుంచుని "ఇక నేను వెళ్ళి మళ్ళీ వస్తాను" అన్నాడు.

దివాకరుడు హారీశునివద్ద సెలవుతీసుకుని వచ్చాడు కాని ఇంతవరకు స్నానం చెయ్యలేదు. భోంచెయ్యలేదు. ఇక్కడనుంచి వెళ్ళి అతను డెక్ మీద ఒక పడకకుర్చీలో కూర్చున్నాడు. ఆతనికి ఓడ నుంచినీటి నదిలోంచి వుప్పు నీటి సముద్రంలో ఎప్పుడు ప్రవేశించిందోకూడా తెలియదు–ఏదో కోలాహాలంతో సెలకువవచ్చి చూచేప్పటికి పడమటికొండ ఎర్రబడుతూవుంది! చాలమంది తిర్కానితర్కాలు చేసుకుంటూ ఇదే చూస్తున్నారు. సూర్యాస్తమయాన్ని గురించిన వర్ణన అతను ఇంగ్లీషు, బెంగాలీ పుస్తకాల్లో అనేకచోట్ల చదివాడు. ఇదేనా సూర్యాస్తమయం? ఇదేనా సముద్రం? నలు వైపుల వ్యాపించియున్న అనంత జలరాశికేసి పరికించి చూచాడు. అస్తాచల సూర్యుని నమస్కరించి లేవగానే అతని కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. సూర్యాస్తమయమైన తర్వాతకూడా అతను ఆశూన్యంలోకి చూడసాగాడు. ఆకాశం ధూమిల

ఏమనుకున్నదో తెలియదుగాని, చప్పునవంగి దివాకరుని పెదవులమీద ఒక్క ముద్దుపెట్టుకొని పకపక నవ్వసాగింది.

ఈ విషాదపూరిత చుంబనాన్ని, ఈ నిష్ఠుర పరిహాసాన్ని దివాకరుడు తనశక్తినంతటినీ ఏకత్రంచేసి సహించగలిగాడు. కాని రాత్రి ఒక్కపక్కమీదే పండుకొనే ఏర్పాట్లు జరుగుతూవుండేటప్పటికి అతను సహించలేక పోయాడు. లేచి నుంచుని "అలా వీలుగాదు వదినా! నేను అలా చెయ్యలేను. నన్ను వదిలిపెట్టు. నేను బైట ఎక్కడైనా పడివుంటాను, కాని నీ ఈ ఆజ్ఞను శిరసా వహించి నేనీగదిలో రాత్రంతా గడపలేను. ఏవిధంగానూ గడపలేను, గడప లేను" అన్నాడు.

కిరణ్మయి పక్క వేస్తూవుంది. త్రుళ్ళిపడి తిరిగి నుంచుంది. దివాకరుడు మళ్ళా దృఢస్వరంతో "అది ఏవిధంగానూ వీలుగాదు" అన్నాడు.

కిరణ్మయి మొదట నవ్వటానికి ప్రయత్నించింది. కాని నవ్వురాలేదు. "ఏమిటి? ఇక్కడ పండుకోటానికి వీలుగాదూ?" ఈసారి ఆమెకళ్ళు దెబ్బ తిన్న ఆడసింహంకళ్ళలాగ మెరిశాయి. పళ్ళు పటపటకొరికి "నువ్వేమను కుంటున్నావు? కుల మర్యాదలు గల కుటుంబంలో పడుచును లేవతీసుకు రావటం ఇంత తేలికనుకున్నావా? ఏపనిచేస్తే ఏం ఫలితం కలుగుతుందోనని తెలుసుకోలేక పోవటానికి నువ్వేమీ పాలుతాగే పసిపిల్లవాడివి కాదుగా! నేరమంతా నా నెత్తిన రుద్ది యింటికి వెళ్ళి బుద్ధిమంతుడిలాగ వుపేంద్ర అన్న కాళ్ళుపట్టుకొని 'నాకేం తెలియదని' వట్టువేసుకు చెబుదామనుకుంటున్నావు కామాను! మీ వుపేంద్రబాబు తలెత్తుకు తిరుగుతాడనేమీ కాదు. నా సంగతు లన్నీ తెలుసుకోడు. తెలుసుకోవలసిన అవసరంకూడా లేదు. నువ్వు బుద్ధి మంతుడవైనా, కాకపోయినా నాకేమీ చింతలేదు. అవమానభారంతో నా తల వంగిపోయినప్పుడు మీ వుపేంద్రబాబు తలఎత్తుకు తిరగగలగటానికి ఏ సంగతీ దాచను. ఇదిమాత్రం నిశ్చయమని తెలుసుకో" అని ఆమె మళ్లా పక్క వెయ్యసాగింది. దగ్గర బెంచీమీద దివాకరుడు ఖిన్నుడై తల వంచుకు కూర్చున్నాడు.

రాత్రి ఇద్దరూ ఒక్కపక్కమీదే పండుకున్నారు. అదృష్టం వెనక్కి మరలేప్పటికి సర్వస్వం దానంచేసి హరిశ్చంద్రుడు చండాలునిచేత పడినట్టు

దివాకరుడు ఈ ఘోరపరిస్థితిపక్కన పడుకొని ఆత్మ సమర్పణ చేసుకున్నాడు. కాని అతని హృదయంలో కలిగిన అపరిమిత ఏహ్యాము, ఈర్ష్య, కిరణ్మయికి కూడా తెలియక పోలేదు.

రాత్రంతా తంద్రావస్థలో అతని చెవులలో ఎక్కడనుంచో రోదనం ప్రవాహంలాగ రాసాగింది. మధ్యమధ్య ఎవరివో క్రోధనిశ్వాసాలు వుండి వుండి భీకరశబ్దాలలాగ వినిపించసాగినై. తెల్లవారేముందు వర్లు బాగా కదలటం వల్ల అతను నిద్రలేచి చూచాడు. గాలి విసురికి ఓడ కదులుతూవుందని గ్రహించాడు. అతని గుండెమీద కిరణ్మయి కుడిచెయ్యి నిద్రపోతున్న కాలసర్పములాగ పడివుండటం కళ్ళారాచూచాడు. లేచి కాటువేస్తుందేమోనన్న భయముతో తీయటానికి ధైర్యంలేక మళ్ళీ కళ్ళుమూసుకుని పడుకున్నాడు. గాలివిసురు క్రమంగా ఎక్కువకాసాగింది. ఓడ వూపుకూడా క్రమంగా అధికమౌతూవుంది. కిరణ్మయి కళ్ళుతెరచి దివాకరుని గుండెమీద వున్న చేతిని కొంచెం అదిమి "బైట మోత ఏమిటి? తుఫానువచ్చిందా?" అన్నది.

"అవును" అన్నాడు దివాకరుడు.

"అయితే వుపాయం?"

దివాకరుడు మాట్లాడలేదు.

కిరణ్మయి లోలోన నవ్వుకొని "ఓడ మునిగిపోతే చాలా బాగుంటుంది కదూ? భగవంతుణ్ణి ప్రార్థించేది ఇదేనా?" అన్నది.

"కాదు" అన్నాడు దివాకరుడు.

"కాదు అని ఒక్కమాటఅంటేచాలా? మధ్యమనిషివి కాదా? శిలవా?" అని ఆమె బలవంతంగా దివాకరుని దగ్గరకులాక్కొని రొమ్ముకి అదిమిపెట్టుకొని "ఓడ మునిగిపోయినా మనమిద్దరం ఇలాగే మరణించి మనిద్దరినీ అలలు ఈ రూపంతోనే-ఈ విధంగానే ఒడ్డుకు చేర్చితే, లోకులుచూచి పత్రికల్లోవేస్తే, మీ వుపేంద్రబాబుచూచి చదివితే బాగుంటుంది కాదు?" అన్నది.

పరిహాసంగా కిరణ్మయి అన్నమాటల్లో ఏ అంశమూకూడా దివాకరునికి నచ్చలేదు. అతను లోలోన భయంతో ఆశంకతో కలంకితుడై మెల్లగా బాహుబంధన పాశంనుండి విముక్తుడై లేచి కూర్చున్నాడు. తూలుతూ, వూగుతూ బైటికి వచ్చాడు.

# 3౪

బైటకు రాగానే రాత్రంతా పేరుకున్న దుఃఖాగ్ని అంతా 'తూమంత్ర' మైపోయింది. తుఫాను ఇంకా తీవ్రరూపం ధరించింది. సాగరజలం వికట విరాటరూపంతో వుంది. నలువైపులా జలమయం. ఎక్కడా దాపే దాపూ కనపడటంలేదు. అతను ఒక కుర్చీలో కూర్చుని తదేకధ్యానంతో ఆ జలరాశికేసి చూస్తున్నాడు. హృదయంలో చెలరేగిన కలవరాన్ని స్పష్టంగా ఆలోచించటమేగాక, విచారించి హృదయంగమము చేసుకోలేకపోయాడు. పెద్దపెద్ద సముద్రకెరటాలు ఘర్షించివచ్చిన కెరటాలు ఓడను కొట్టుకుని ముక్కలుముక్కలై నీరసమైపోతున్నాయి. మళ్ళా ఎదుర్కొని మళ్ళా నీరసమైపోతున్నాయి. ఈ విధమైన ఘాత ప్రతీఘాతపు ఆటను దివాకరుడు ఆత్మవిస్మృతుడై ముగ్ధ నేత్రాలతో చూస్తున్నాడు. తూర్పున ఆకాశంలో మేఘమాలలు పిల్లఏనుగుగున్నలలాగ పరుగులిడుతున్నాయి. వాటిమూలాన సూర్యోదయమైందో లేదోకూడా తెలియటంలేదు. సరంగు ఆతురతతో అటూఇటూ పరుగు లిడుతున్నాడు. పైన కప్తాను మాటమాటకీ గంట వాయిస్తున్నాడు. తుఫాను విసురు క్రమంగా ఎక్కువకాసాగింది. ఆకాశంమీది మేఘాలను బట్టీ, సముద్రతరంగాలనుబట్టీ కప్తాను దగ్గరనుండి కామినీదాసీవరకూ తుఫాను ఇంకా తీవ్రమయ్యే సూచనలు కనపడుతున్నాయని గ్రహించారు. ఇంతలో ఒక సరంగు వచ్చి "తుఫాను రాబోతూవుందిబాబూ! కేబిన్‌లోకివెళ్ళి ఏమిజరుగుతూ వుందో చూడండి" అన్నాడు.

దివాకరుడు వుద్విగ్నుడై "ఏమిజరుగుతూవుంది?" అన్నాడు.

సరంగు చిటగాంగు సాయిబు. చిరునవ్వుతో "ఏమీలేదు. ఓడ బాగా కదులుతూవుంది. లోపలికెళ్ళి ఆడంగులు ఏమిచేస్తున్నారో చూడండి. స్త్రీలు ఇంత కదుల్లాట సహించలేరు!" అన్నాడు.

సరంగు చెప్పినది నిజమేనని, దివాకరుడు లేచి నుంచున్నాడు. సరంగు అతన్ని పట్టుకొని "పదబాబూ, మిమ్మల్ని పంపించి వస్తాను" అని దివాకరుని కేబిన్ వాకిటివరకు పంపించాడు. దివాకరుడు కేబిన్ తలుపులు తీసి చూచే ప్పటికి కిరణ్మయి.పక్కమీదనుంచి లేచిపోయి దగ్గరనున్న ఇనుప బెంచిని

గట్టిగా పట్టుకు పడివుంది. దివాకరుడు మెల్లగా ఆమె తలవైపుకు వెళ్ళి కూర్చుని "భయంగావుందా కిరణా?" అన్నాడు.

కిరణ్మయి మాట్లాడనూలేదు, తలెత్తనూలేదు. దివాకరుని వీపుమీద మెల్లగా చెయ్యిసంత్రాణం చేసింది. ఓడ తల్లకిందు లౌతూవుంది. గాలి మోత లేస్తూనేవుంది. పెద్దపెద్ద కెరటాల తాకిడివల్లనేమో అలలు ఇప్పుడిప్పుడే దాటవస్తున్నాయి. తుపాను చినుకులు కిటికీ అద్దాలమీదికి చిందుతున్నాయి.

గదిలో ఇంకా చీకటి వదలలేదు. కింద నిన్న సాయంత్రం వేసిన పక్క ఇంకా అలాగే పడివుంది. నిమిషంలో అతనికి రాత్రి సంగతులన్నీ జ్ఞాపక మొచ్చాయి. తల గిర్రున తిరిగింది. ఆ యువకుడు బెంచీమీదే కిరణ్మయి ఒడిలో తలపెట్టి పడుకున్నాడు.

కిరణ్మయి చేత్తో తలనిమిరి మృదుస్వరంతో "పడుకుంటావా? తల తిరుగుతూవుందా ఏమిటి?" అన్నది.

"అవును"

కిరణ్మయి కొంచెంసేపు మౌనంవహించి "అయితే బాబూ! తుపాను క్రమంగా ఎక్కువైతూంది. ఓడ మునిగిపోతుందా ఏమిటి?" అన్నది.

"అవును, లేదు"

"మళ్ళా ఆ అవును, లేదేనా? కోర్టులో సాక్ష్యమేమైనా చెబుతున్నావా ఏమిటి?" అని కొంచెం సేపు కదలకుండా వూరుకుని తర్వాత మెల్లగా "ఒకవేళ మునక్కపోయినా ఈ విధంగా ఎంతకాలం నడుస్తుంది?" అన్నది. దివాకరుడు మాట్లాడకపోవటం చూచి కిరణ్మయి దివాకరుని తల పట్టుకు వూగించి "వింటున్నావా?" అన్నది.

"వింటున్నాను, నడచినంతవరకు!"

"ఆతర్వాత?"

"ఆతర్వాత సముద్రపునీరు వుండనేవుంది. లేకపోతే గొంతుకు వురి వేసుకోటానికి కాస్త తాడుముక్క దొరక్కపోతుందా! ఈ రెంటిలో ఏదో ఒకదాన్ని ఆశ్రయించకతప్పదు."

ఇంతసేపటికి దివాకరుని నోటివెంట ఒక కటువైన మాటవిని కిరణ్మయి కొంతసేపు మెదలకుండా వూరుకొని "అలా చెయ్యక ఇంటికి తిరిగిపో. నువ్వు మగాడివి. ప్రాథేయపడితే చిక్కు వదిలిపోతుంది. అదికూడా అవసరములేదేమో. మీ చుట్టు-పక్కాలు ఈ విషయాన్నెత్తుకు సందరగోళం చేస్తారని తలవటంలేదు నేను" అన్నది స్వాభావికంగా.

దివాకరుడు మాట్లాడలేదు. అది ఎలాంటి లోభపూరిత నిశ్చయమైనా అతను దాన్ని గ్రహించలేకపోయాడు. చాలసేపు మౌనంగావుండి "మరి నువ్వు?" అన్నాడు.

కిరణ్మయి సహజ శాంతస్వరంతో "నేనా? నేను వెళ్ళుతున్న చోటే వుండవలసివస్తుంది" అన్నది.

దివాకరునికి సందేహం కలిగింది. "ఎలా వుంటావు వదినా? అక్కడ ఎవరు వున్నారు?" అన్నాడు.

"ఎవరూ లేరు"

"అయితే ఎలా?"

"అయినా వుండాలి"

దివాకరుడు వుత్కంఠతో లేచి కూర్చుని "నిజంచెప్పు వదినా! ఎవరూ లేరంటున్నావు? అక్కడ వంటరిగానే వుంటావా?" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వునవ్వింది. ఈ చిరునవ్వు దివాకరుడు చూడలేదు. చూస్తే చకితుడయ్యేవాడే. కొంచెంసేపు మెదలకుండా వుండి మెల్లగా "లేదు, వంటరిగా వుండను. నాది అలాంటి వయసుకూడాకాదు, వంటరిగా వుండటానికి. కాని ఈ సంగతులన్నీ విని ఏమిచేస్తావు బాబూ?" అని దివాకరుని చెయ్యి తన చేతిలోకి తీసుకొని మరింత వ్యధిత కంఠంతో "నేను నిన్ను చాల కష్టపెట్టాను. దానికి క్షమాపణ కోరుకుంటున్నాను" అన్నది.

దివాకరుడు మళ్ళీ మెదలకుండా పండుకున్నాడు. సంగతులన్నీ అతనికి సరిగా అర్థం కాలేదు. ఇంటికి మరలిపోయే అంధకార మార్గంలో ఆశాదీపం ఆర్పివేసే సమయం వచ్చిందనిమాత్రం అనుకున్నాడు. దీపం ఆరిపోయింది. కాని అది ఆరిపోగానే గాలిలో నిండిన దుర్గంధంతో అతని గుండె

బద్ధలై పోసాగింది. వేదనాపూరిత నిశ్వాసంతో లేచికూర్చుని "అయితే కదినా, ఇంతసేపటివరకూ నాతో ఇలా పరిహాస మాడేది ఎందుకు?" అన్నాడు బిగ్గరగా.

స్వాభావికంగా పిచ్చి, వినయా లున్న దివాకరునిలోని ఈ కాఠిన్యం చూచి కిరణ్మయి చకితురాలై పోయింది. "పరిహాస మేముందిబాబూ?" అన్నది.

"నేను ఇంటికి తిరిగి పోతానన్న సంగతి తీసుకొచ్చి పరిహాసమాడే అవసర మేమున్నది?"

"పరిహాస మేముంది?"

"అయితే ఇది నిజమేనా?"

"నిజమే అనుకో."

"నువ్వు ఒంటరిగా వుండిపోవటం కూడా నిజమేనా?"

"అదీ నిజమే?."

"ఓహో! అందుకనేనా అరకాన్ వెళ్ళేది! అయితే ఎవరి దగ్గర వుంటావు? ఏరూపంతో వుంటావు?"

సమాధానంగా కిరణ్మయి ఒక నిట్టూర్పు విడిచింది. ఈ విధంగా దివాకరుడు పారిపోవటము ఎంత అస్వాభావికమో, దానికై పిచ్చితో ఎంత క్రుంగి పోవలసి వస్తుందో ఇదంతా కిరణ్మయికి తెలుసు. ఈ మహాసంకటంలోపడి అతని మనస్సు ఎంత ఆరాటపడుతుగా వుందోకూడా ఆమెకు తెలుసు. ఆమె దివాకరుని ప్రేమించినా, ప్రేమించక పోయినా అతన్ని విచారంగచూచి కిరణ్మయి లోలోన వ్యథపడటమే ఆశ్చర్యం!

కాని దివాకరుడు కటుస్వరంతో అడిగిన కటుప్రశ్నలలో దాగియున్న ఈర్ష్యాజ్వాలలను గుర్తించివెంటనే కిరణ్మయి అంతర్యంలో అణగియున్న వేదన సంతోషంగా మారిపోయింది. ఈ భావ పరివర్తనకు ఒక పెద్ద కారణమున్నది. బుద్ధివికాసహీనుడైన ఈ నవయువకుడు ఈ ఆశ్చర్యమయనారీరూపంవైపు ఆక ర్షింపబడుతూవుంటే కిరణ్మయి చూచికూడా చూడనట్టు వూరుకుంది. లోలోన నవ్వుకొని "ఏరూపంతో వుంటానో,ఎవరివద్ద వుంటానో తెలుసుకుంటే

నీకుకలిగే లాభమేముంది? తిరిగివెళ్ళిపోయేప్పుడు అనవసరమైన ఈ కుతూహలానికి సార్థకత ఏముంది?'' అన్నది.

దివాకరుడు కొంచెంసేపు స్తిమితంగావుండి "తిరిగి వెళతానని నేను ఒక్కసారిగూడా అనలేదు. ఇది నీ నోటిమాట. నాది కాదు'' అన్నాడు.

''అది నిజమే. నానోటివెంట వచ్చిందే నా నీ మనసులో మాటేగా'' అని ఆమె తీవ్రవిమర్శకోసం ఎదురుచూస్తూవుంది. కాని ప్రతివిమర్శ జరగలేదు. కిరణ్మయి ఆతనికి ఆలోచించటానికి అవకాశమిచ్చి, ధైర్యంచూపించి పెదవుల కుండా వూరుకుంది. ఇలా కొంతసేపు నడిచిపోయింది. గాలివిసురులకు ఓడ కంపించసాగింది. మధ్యమధ్య గుండెలదరజేసే తరంగుల కోలాహలం స్పష్టంగా కనబడుతూవుంది. కిరణ్మయి ధైర్యం సన్నగిల సాగింది. కాని ఈ చిన్నగది లోని నిస్తబ్ధతమాత్రం అలాగే స్థిరంగా వుండిపోయింది.

దివాకరుడు ప్రతివిమర్శ చెయ్యడని నమ్మకం కలిగినతర్వాత కిరణ్మయి ఒక నిట్టూర్పు విడిచి మెల్లగా "అయితే నువ్వు తిరిగి వెళ్ళిపోవటమే నిశ్చయమైందా?" అన్నది.

"లేదు"

కిరణ్మయి మళ్ళీ ఏమీ మాట్లాడలేదు.

---

## 3౫

ఆ రాత్రే తుపాను తగ్గిపోయింది. ఉన్మత్త సాగరం పగలంతా హోరు పెట్టి రాత్రికి సొమ్మసిల్లిపోయినట్టు ప్రొద్దు పోవటంతోనే నిమ్మళించింది. కాని ఆకాశం ఇంకా నిర్మలం కాలేదు. మలినవదనంతోనే వుంది.

సూర్యుడు ప్రొద్దున మొహంచూపించి సగం చచ్చిన ప్రయాణీకులకు ధైర్యంచెప్పి పోయాడో, కళ్ళెర్రజేసి అంతర్థాన మయ్యాడో అర్థం కావటం లేదు.

దివాకరుడు బైటికి వచ్చి ఒక కేన్వాసు కుర్చీమీద కూర్చున్నాడు. దుఃఖాగ్ని ఇదివరకులాగ ఇవ్వాళ ఎందుకు వ్యధపెట్టటం లేదో అర్థం కావటంలేదు. లజ్జాసముద్రంకూడా ఇవ్వాళ అతనికి అంత దుస్తర మని పించటంలేదు. పచ్చ పైరులతో నిండిన వస్తు అతనికి కనుచూపు మేరలో కన పడినట్టుంది. ఈ విధంగా హృదయభారం కొంత తగ్గిన తర్వాత అతను స్తిమి తంగా కిరణ్మయి వాదనను సానుభూతితో ఆలోచించ సాగాడు. "ఎవరైనా న్యాయబద్ధమైన అధికారంనుండి మన్ని వంచించినప్పుడే మనం అన్యాయం చేస్తాం. అందుచేత దేనిలోనైనా చెయిజేసుకోబోయేముందు-మనం ఎవరి అధికారాన్నైనా భగ్నం చేస్తున్నామా లేదా అని చూడాలి. ఈ అధికారం లోపల ఎంత వుంటుందో బైటా అంతే వుంటుంది. తనవాడైనంత మాత్రాన ఎవరికంటేనూ న్యూనంకాదు, తుచ్ఛంకాదు. ఆ అధికారాన్ని క్రమించి దేనిలోనైనా చెయిచేసుకోటం తనను తాను అన్యాయం చేసుకోవటమే" అని కిరణ్మయి నిన్న రాత్రి వాదించింది.

కొంచెంసేపు మెదలకుండా వూరుకుని ఆమె ఇంకా "ఇతరుల అధి కారంలో చెయి జేసుకోవటం తాగుబోతుకు డబ్బుయివ్వటంలాంటిది. డబ్బిచ్చి మనం మరింత అధోగతిపాలు చేస్తున్నాం. సంఘాన్నుండి దూరం చేస్తున్నాం" అన్నది.

దివాకరుడు మెదలకుండా వింటూవుండటంచూచి కిరణ్మయి, "సంఘ వ్యక్తుల ఈ అధికారం అత్యంత విశాలమైనదైనా దానికి అంచూ హద్దూఅంటూ వుంటుంది. అక్కడ అడుగు పెట్టినంతమాత్రాన అనధికారప్రవేశంకాదని

అనేక వాదనలు వున్నాయి. అనేక అభిప్రాయము లున్నాయి. అసలు హద్దు అంటూ ఏదోవుంది. దానిలో సందేహమేమీ లేదు" అన్నది మళ్ళా. "ఈ హద్దు దాటేశక్తి ఎవరిలోనూలేదు. సంఘానికికూడాలేదు. సంఘం ఈ హద్దు దాటి యితరులను నష్టపర్చటమే కాకుండా తన్నుతానే బలహీన పర్చుకుంటుంది. నువ్వు ఈ విషంగా మనసులో విచారం పెట్టుకువుండకపోతే, ఈ విషయాన్ని గురించి ఆలోచించి చూచేవాడివి. నేను ఎవరిఅధికారంలోనైనా నా చేయిజేసుకున్నానా లేదా!" అని "నేను విధవను. నామీద న్యాయబద్ధమైన అధికారం ఎవరికి లేదు. నువ్వు అవివాహితుడవు. నీ హృదయంమీదకూడా ఎవరికీ అధికారం లేదు. నన్ను ప్రేమించి నువ్వేమీ ఎవ్వరికీ అన్యాయంగానీ, అపకారంగానీ చెయ్యలేదు.

దివాకరుడు ఆశ్చర్యపడి "ఇదేమిటి వదినా? వైధవ్య ప్రేమకూడా అన్యాయం కాకపోతే ప్రపంచంలో ఇంకా అన్యాయ మనేది ఏముంటుంది?" అన్నాడు.

దానిమీదట కిరణ్మయి "వైధవ్యమని ఎందుకనుకోవాలి? అలా అనుకోనే నీ సంస్కారం ఉన్నతమైనదికాదు. అయితే ఈ సంగతిచెప్పు-నువ్వు దానిని వైధవ్యమని ఎందుకనుకుంటున్నావు?" అన్నది.

దివాకరుడు వుత్తేజితుడై "వివాహంతో పవిత్రం కానిదీ, సంఘం ఆదరించినదీ, ఆత్మీయులు మిత్రబాంధవులు ఘృణితదృష్టితో చూచేదీ వైధవ్యం. తిన్నని విషయమేగా" అన్నాడు.

కిరణ్మయి నవ్వి "తిన్నని విషయ మెలాఅవుతుంది? కొంచెం ఆలోచించుకుచూడు - తిన్నని విషయాలుకూడా అప్పుడప్పుడు వక్రంగా కనిపిస్తాయి. ప్రపంచంలో అనేక వక్రవిషయాలే వాటిముందు తల ఒగ్గవలసి వస్తుంది. నీ యీ పవిత్రతాపవిత్రతాజ్ఞానం సంపూర్ణముగా పరిమార్జితము కాదని నీకనేకసార్లు చెప్పాను. ఈ దృష్టికోణంతో పవిత్రమనిపించుకోని స్త్రీ పురుషులు ప్రపంచంలో అనేకమంది వున్నారు. నేను వుదాహరణలతో ప్రసంగం పెంచదలచలేదు. నీ యిష్టమైతే చరిత్రలు పురాణాలు చదివిచూడు. ఆ సాహచర్యా లన్నింటినీ సంఘం ఆమోదించింది. వివాహ మంత్రాలతో పవిత్రం చేసింది. మా పధరియాఘట్టాలోనే కణ్వమహాఋషి ఆశ్రమముంటే

శకుంతల చేసిన రహస్యప్రణయసంబంధానికి కేవలం మునిపుంగవులలో తన బంధుబాంధవులలోనే గాదు, పధరిగాఘట్టాప్రజలంతా జాతిచ్యుతు లవ్వవలసివచ్చేది. ఆ ప్రేమకథ చదివితే ఏ సాధ్వి మొహం సిగ్గుతో ఎర్రబడదు?"

"ఆతుర పడబోకు బాబూ, నేను సతీమతల్లులను పరిహాసమాడటం లేదు. ఈ కాలంతో ఆకాలాన్ని పోల్చటమూ లేదు. ఈ కాలాన్ని ఇలాగే వుండనీ, వారిని అక్కడే సుఖంగా వుండనీ. నా కేమీ చింతలేదు. ఆనాటి శకుంతలయందు నేటి ప్రజలకు ఏహ్యాభావం ఎందుకని కలగలేదో అదే విచిత్రం."

కొంచెంసేపు మెదలకుండావుండి "వారెందుకని ఏవగించుకోవటంలేదో తెలుసా? దానికి కారణం - వారి సాంగత్యం ఎలావున్నా, సాంగత్యాదర్శాన్ని వారు ఆవిష్కృతరూపంలో వుంచారు. క్షణంలో అంకురించిన ప్రేమబంధాన్ని బలపర్చటంలో ఏవిధమైన సందేహమూ సంకోచమూ వుంచుకోలేదు. వారు సంకోచపడి సత్యాన్ని మరుగు పరిచివున్నట్లయితే కాళిదాసు ఎంత రసవంతంగా ఎంత మాధుర్యంగా రాసినా శకుంతలనాటకం ఎవరిహృదయాన్నీ ఆకర్షించ గలిగేదిగాదు. అసలువిషయాన్ని బాగా ఆలోచించిచూడు" అన్నది.

దివాకరునికి ఒక్కమాటకూడా నచ్చలేదు. అయిష్టంతోనే "ఆదర్శం ఎలావున్నా, ఇప్పటి సమాజం దానిని సంపూర్తిగా వప్పుకోదు. సంఘంలో వుండి సంఘానికి అపకారం చెయ్యటం, ఆత్మహత్య చెయ్యటం, రెండూ ఒకటే" అన్నాడు.

"సంఘానికి అపకారం చెయ్యటం, సంఘముయొక్క అహంకారానికి అపకారం చెయ్యటం, రెండూ ఒక్కటికాదు బాబూ! ప్రతివస్తువుకీ ఒక నిజమైన జన్మహక్కు వుంటుందని మొదటే చెప్పాను. సంఘం అహంకారంతో సత్యాన్ని అతిక్రమించిపోయేటప్పుడు దెబ్బ తినవలసివస్తుంది. ఆ దెబ్బవల్ల సమాజం నాశనమవ్వదు. ఇంకా బాగుపడుతుంది. కాని దానియందు వ్యామోహం తగ్గుతుంది. విద్యనభ్యసించటానికిగానీ, దేశసంచారంకోసంగానీ, విదేశాలకు వెళ్లటం సంఘం వప్పుకోదు. ఈ విషయంలో అది అనేకసార్లు దెబ్బతినవలసివచ్చింది. కాని నేటివరకు దాని మొండి ప్రాణం అలాగేవుంది. ఏదిఏలావున్నా, అయితే బాబూ! సంఘంయొక్క వివేచనాబుద్ధిని నీవు ప్రశంసిస్తావా?

నువ్వు దాని అభిప్రాయాలు తిన్నని అనుకుంటున్నావా?" అని అడిగింది కిరణ్మయి.

"లేదు, అనుకోవటం లేదు. తిన్ననివి అనుకోటానికి ఏమీ కారణం లేదు," అన్నాడు దివాకరుడు.

"కారణంలేదు. అయితే సందేహరహితమైన ఈ సమాధానం ఎక్కడ సంపాదించావు? నీ వివేచనాబుద్ధితో నేనా?" అన్నది కిరణ్మయి

దివాకరుడు వుత్తేజితుడై "ప్రతివాడూ, ప్రతిపనికీ ఆలోచించటం మొదలెడితే సమాజ మెక్కడ నిలుస్తుంది?" అన్నాడు.

"ఇంత సేపటినుంచీ నేను నీకు ఈ సంగతి చెప్పటానికే ప్రయత్నిస్తున్నాను. ప్రతిపనికీ ప్రతివాడూ తనబుద్ధిని వినియోగిస్తూ వుంటే సంఘమెలా నిలువలేదో, సమాజంకూడా ఎల్లప్పుడూ ప్రతిపనికీ తనఅభిప్రాయాలనే చలాయించదలచుకొంటే మనిషి కూడా అలాగే నిలువలేడు. అన్యాయాలు చేయటంగానీ, పొరపాట్లు పడటంగానీ మనిషికేగాని సంఘానికి తెలియదా? రెంటికీ నిర్దిష్టమైన ఒకహద్దుంటూవుంది. మూర్ఖత్వం చిత్త చాంచల్యంతో గానీ, అనవసరమైన పట్టుదలతోగాని ఆ హద్దును దాటితే అనిష్టం చేకూరుతుంది" అన్నది కిరణ్మయి.

దివాకరుడు దీనికి సమాధానంగా ఏమీ చెప్పలేదు. కిరణ్మయి కొంచెంసేపు మెదలకుండావుండి "ఆ హద్దు ఏ సంఘంలోనూ ఎప్పుడూ ఒక్క చోట నిలిచివుండదు. అవసరాన్ని బట్టి జరిగిపోతూ వుంటుంది" అన్నది మళ్లా.

"అయితే దాన్ని జరిపేది ఎవరు?" దివాకరుడు అడిగాడు.

"ఈ బ్రహ్మాండమంతా నడిచేనియమం ప్రకారమే ఈ హద్దుకూడా దానంతటదే జరుగుతూవుంటుంది. కాని అది జరుగుతూవుందో లేదో దెబ్బ తగిలినప్పుడుగాని తెలియదు" అన్నది కిరణ్మయి.

ఇంతసేపటినుండి దివాకరుడు కిరణ్మయి వాదనలన్నింటినీ తన వూహకు అనుకూలంగా చేయటానికి ప్రయత్నిస్తున్నాడు. కాని మనసులో బాధగానే వుంది. ఈ పనిలోని నికృష్టతనుగురించి అతనికి సందేహమేమీ లేదు. నేరాలన్నిటినీ వినయంగా వప్పుకోటానికి అతను సిద్ధంగానే వున్నాడు. కాని

ఈ గర్వితనారి ఇంత మహాపరాధాన్నికూడా అసంతోషంగా ఎంచక, సంఘాన్నే దోషిగా నిరూపిస్తోందని స్పష్టంగా తెలుసుకున్న తర్వాత అతనికి ఆమె మాటలయందు అసహ్యం కలిగింది. కటువుగా మాట్లాడటంకూడా అతనికి చాలా కఠినమైనపని. అందుకని అతను సాపేక్షకంగా "మంచిదే, కాని సంఘానికి మనవల్ల తగిలిన దెబ్బమూలకంగా సంఘముమునందు ఆసక్తి, ఆదరం ఎంతో తగ్గుతుంది" అన్నాడు.

ఈ మాటవిని కిరణ్మయి కొంచెంసేపు మౌనంవహించింది. కాని మళ్ళీ వెంటనే గొంతు మార్చుకొని దివాకరుని ముఖంకేసిచూస్తూ "మనం దెబ్బ కొట్టింది ఎక్కడబాబూ? భయంతో పరుగుమాపటం, పరుగుమాపి దెబ్బ కొట్టటం-రెండూ ఒకటేనా-సానువర్పా భిన్నం భావించటానికి? కాని నువ్వు బి. ఎ. వరకు చదివినావు" అని ఆమె చప్పున పడుకొని నిండా ముసుగు పెట్టుకుంది.

కాని ఈ విధంగా వాగ్వాహిని ఆగదు. అది అడ్డుతగిలిన ప్రవాహం లాగ లోలోన పొంగి మరింత వేగాన్ని చేకూర్చుకుని ఒక్కసారి అడ్డుకట్టలు తెంపుకొస్తుంది. అలానే జరిగిందికూడా. ఈ వాగ్వివాదము వ్యుద్రేక పరచింది. వినయస్వభావంగల దివాకరుని మనసులోకూడా కలవరం రేకెత్తించింది. నువ్వు బి. ఏ. వరకు చదివావుకదూ? అన్న కిరణ్మయి చివరిమాట అతని అంతరాళంలో మారుమ్రోగింది.

చదువుకున్నానని అతనెప్పుడూ అభిమాన పడలేదు. కాని ఈ యువతి అన్న ఈ కటు వాక్యము అతని హృదయాన్ని వాగ్యుద్ధానికి ఆయత్తపరచేట్లు చేసింది. కాని ఏవిధంగా యుద్ధప్రకటన చెయ్యాలో, ఈ నీరసతను ఎలా భగ్నంచెయ్యాలో దివాకరుడు నిశ్చయించలేక పోయాడు.

మందగించిన గాలివానలోంచి - ఓడగంట పన్నెండుసార్లుమోగింది. కిరణ్మయి అణచుకొన్న గొంతుతో "బాబూ?" అని పిలచేప్పటికి దివాకరుడు త్రుళ్ళిపడ్డాడు. హృదయంలో ఆశ-భయము ఒక్కసారి కల్లోలపర్చసాగినై. "ఏమిటి వదినా?" చప్పున సమాధానం యిచ్చాడు.

"నువ్వు తిరిగివెళ్ళిపో" అన్నది కిరణ్మయి.

"అలా ఎప్పటికీ జరగదు" అన్నాడు దివాకరుడు గట్టిగా.

"ఎందుకని జరగదు ? తెలిసో తెలియకో ఒకసారి కాలుజారి బాడిలో పడినంతమాత్రాన జీవితపర్యంతం దానినే పులుముకు తిరుగుతావా? అంత అవసర మేమొచ్చింది ?"

"అవసరం నీకు కనపడదు. నాకు కనపడుతూంది. తిరిగి వెళ్లినంత మాత్రాన బాడి వదులుతుందా?"

"ఇవ్వాళే వదులుతుందని చెప్పలేను. కాని రెండురోజులుంటే వదల కుండామాత్రం వుండదు."

"అయితే వెళ్ళేది ఎక్కడికి?" దివాకరుడు వినయంగా అడిగాడు.

"మీ యింటికి, మీ ఆత్మీయులవద్దకు, మీ వుపేంద్రఅన్న దగ్గరకు, అంతా నీవారేగా!" అన్నది కిరణ్మయి.

దివాకరుడు కొంచెంసేపు మెదలకుండావుండి "నావా రనుకుంటున్న వారెవరూ, నావారు కాదని నీకూ తెలుసు. వుపేంద్రబాబు మాత్రంవున్నాడు. అతని దగ్గరకే నువ్వు తిరిగి వెళ్ళమంటున్నావా?" ఈ మాటలు నోటివెంట రాగానే అతను లోలోన కంపించిపోయాడు. కిరణ్మయికూడా ఇది గ్రహించి లోలోన నవ్వుకొంటూ "అవును. అతని దగ్గరకే వెళ్ళు" అన్నది.

దివాకరుడు కొంచెంసేపు మెదలకుండా వూరుకున్నాడు. తర్వాత మెల్లగా "నువ్వు అతన్ని బాగా అర్థం చేసుకోలేదు. నేనుకూడా అర్థంచేసుకోలేదు. బహుశా అతన్ని ఈ లోకంలో ఎవరూ అర్థం చేసుకో లేరనుకుంటాను. కాని చిన్నప్పటినుంచి అతనివద్ద వుంటూ అతని ఆదర అభిమానాలతో పెరగటంవల్ల కొంత అర్థంచేసుకున్నాను. అతను ఎదుటకువెళ్ళి నుంచునేకన్న అగ్నిగుండములో పడటం మంచిది" అన్నాడు.

కిరణ్మయి ఒక్కసారి చకితురాలైపోయింది. వెనక్కితిరిగి దివాకరుని మొహంవంకచూచి "ఎందుకని? అత నంత నిర్దయుడా ఏమిటి? దీనిలో నీ తప్పేమీ లేదని తెలుసుకున్నాకూడా దండిస్తాడా? అది ఎప్పటికీ జరగదు!" అన్నది.

దివాకరుని ధ్యానం కిరణ్మయి ఈ ఆకస్మిక వృత్తాంతంవైపు పోలేదు. గోడమీద వెలుగుతూవున్న చిమ్నీకేసి పరధ్యానంతో చూస్తూ "అతనికి ఏవిషయమూ నచ్చచెప్ప నవసరంలేదు. ఎట్లాగో-వారంతా గ్రహిస్తారు. నేను చేసినదానిలో తప్పేమీ లేదని నీలాగనే నేననుకోలేను. కాని అనుకుంటే నిజంగానే నిర్దోషినై అతని ఎదుటకు వెళ్లినరోజున అంతా గ్రహిస్తాను. ఆ రోజునే నా విషయంలో నిజమైన నిర్ణయం కలుగుతుంది నీవు దండిస్తున్నావు. అతను ఇంకా ఎలాంటి దండన విధిస్తాడని అనుకోను కదినా? అతను నన్నెప్పుడూ దండించలేదు. ఇవ్వాళ........" ఇకముందు అతడేమీ మాట్లాడలేక రెండుచేతులతో మొహం కప్పుకున్నాడు.

కిరణ్మయి ఏమీ మాట్లాడలేదు. కళ్లప్పగించుకొని అతని మొహంకేసి చూడసాగింది. ఆమె హృదయంలో చెలరేగిన కల్లోలం ఆ అంతర్యామికి తప్ప ఇంకెవ్వరికీ తెలియదు.

కొంచెంసేపున్న తర్వాత దివాకరుడు మరింత వ్యధితకంఠంతో "ఎప్పుడూ నేను సరిగా చెప్పలేదు. ఇవ్వాళకూడా నా మనసులోనిమాట నీతో చెప్పలేను. కాని అతని విషయం వదలిపెట్టమని నిన్ను ప్రార్థించుకొంటున్నాను. నా విషయం నేను సహించగలను. కాని అతన్ని గురించిన మాటలను ఎలా సహించగలను?" కొంచెసేపు ఆగి "రెండు రోజులనుంచి కేవలం నేను అతన్ని గురించే ఆలోచిస్తున్నాను. మేము కలకత్తా వచ్చినరోజున అతను నా గదిబైట నుంచుని, పుస్తకాలన్నీ సర్దుకున్నావటరా? అని కేకవేశాడు. నేను 'సర్దాను' అన్నాను. దానిమీదట అతను 'జాగ్రత్తగా వుండు. ఏమైనా అవసరమైతే నాకురాస్తూవుండు, తెలిసిందా!' అని నాముందు ఒక నోట్ల బొత్తి పారేసి వెళ్లిపోయాడు.

కొంచెంఆగి అతను మళ్లా "అందుకే నేను చింతపడేది. నేను వారికి విధించిన దండనకు నన్నెంత దండించినా, ఎలాంటి దండన విధించినా తక్కువే ననిపిస్తుంది" అన్నాడు.

దివాకరుని చెక్కిళ్ళవెంట కారిన కన్నీటి చుక్కలు దీపపువెలుగున మిల మిల మెరవసాగినై. కిరణ్మయి మెదలకుండా శిలావిగ్రహంలాగ వాటికేసి

చూస్తూ కూర్చున్నది. అతను కొంచెంసేపున్న తర్వాత లాల్చీ చెంగుతో కన్నీళ్లు తుడుచుకొని గంభీరస్వరంతో "ఉపేంద్రబాబును తలవంపులు చేస్తానన్నావు నిన్న. ఆ రాత్రి మీలో ఏమిసంభాషణ జరిగితే ఇలాంటిమాటన్నావో నాకింత వరకు అర్థంకావటంలేదు. నీ వుద్దేశం ఏమైనా, తలవంపులు చేసినందువల్లకలిగిన దుఃఖం ఎంత బాధకరంగా వుంటుందో నీకు తెలిసినట్లయితే నీనోటివెంట అలాంటి మాటలు ఎన్నటికీ వచ్చేవికాదు. అదీగాక వారికితలవంపులైనందువల్ల మనం మాత్రం తలెత్తుకు తిరగగలమా? నీకా ప్రయత్నంవద్దు. వారు మనవైపు తలెత్తి చూడనంతవరకు, వారిని తలవంపులు చేయగలశక్తి విధాతకు కూడా లేదని ఇవ్వాళ నీకు గట్టిగా చెబుతున్నాను" అన్నాడు.

అంతటితో ఆప్రసంగము ముగిసింది. సంఘము సంసారము, మంచీ చెడ్డా, వ్యష్టి సమిష్టి, అధికారము అనధికారము, తనది పరాయిది, సుఖము దుఃఖము మొదలైన విషయాలమీద వాగ్వివాదము ఆ ఒక్క మాటతో ఆగిపోయింది.

ఈ నిశీథమధ్యంలో ఈ ప్రతికూల శక్తులు రెండు అకస్మాత్తుగా, ఏదో అజ్ఞాత ఆకర్షణతో అడ్డులేనిచోట, మాట్లాడటంకంటె మాట్లాడించుకోవాలనీ చెప్పటంకంటె చెప్పించుకోవాలనీ ప్రబలాకాంక్ష చెలరేగినచోట, బుద్ధి మాంద్యమువచ్చి మాట్లాడకుండా మౌనం వహించి మననం చేసుకోవలసిన చోటువచ్చి కలిసినాయి. అక్కడికి వచ్చి రెండునిండు హృదయాలు బలబలపొంగిపోయాయి. తలంచుకొని లోలోన దుఃఖపడుతున్న దివాకరునిలోనికి ఇంతకు పూర్వపు భగ్నాశ సపరివారంగా ఏ అజ్ఞాతపథంమీదుగా, ఎప్పుడు వచ్చిందో ఎవరికి అంతుపట్టలేదు.

ఉదయం మెలకువవచ్చి లేచిచూచేప్పటికి నిద్రిస్తున్న కిరణ్మయి చెయ్యి నిన్నటిలాగ ఇవ్వాళకూడా అతని గుండెమీద పడివుంది. అది పారిజాతమాలనిగానీ, విషసర్పమనిగానీ అతను భ్రమించలేదు. లేచి వచ్చేప్పుడు అతను ప్రసన్న చిత్తంతో, మమతతో ఆచేతిని మెల్లగా పక్కమీదపెట్టి వచ్చాడు.

దివాకరుడు ఉదయం పక్కమీదనుంచి ఎప్పుడు లేచిపోయాడో కిరణ్మయి చూడ లేదు. అందుచేత నిద్ర లేపగానే ఆమె దివాకరునికోసం

ఆతురతపడ సాగింది. నిన్నటిరాత్రి సంభాషణనుబట్టి కిరణ్మయి అతనినిగురించి అనేక సంగతులు తెలుసుకొంది. దివాకరుడు నిజంగా ఎంత నిస్సహాయుడో, వుపేంద్రబాబును త్యజించిరావటం అతనికి ఎంతదుఃఖమో తెలుసుకున్న తర్వాత ఆమెకు ఏకాంతంలో కూడా శాంతి లేకపోయింది. పాపమీ అమాయకపు యువకుని జీవిత ప్రారంభంలోనే బ్రహ్మచర్యభ్రష్టునిచేసిన దోషం ఆమెను నిద్రలోవుండగానే బాధించ సాగింది. అందుచేత మెలకువరాగానే మాతృప్రేమతో, వ్యథితహృదయంతో ఆ నిరపరాధుని కోసం కన్నెత్తి చూచింది కాని పక్కమీద లేడు. కంగారుపడింది. ఓడసరంగును పిలచి వెతకమని చెప్పింది. కాని అతనికి కూడా కనపడలేదు.

కిరణ్మయి అతనిరాకకు ఆతురతతో ఎదురుచూస్తూ వుంది, కాని ఈ వుత్కంఠలో కలిగిన బహుదూరాన్నుండి వచ్చిన సుగంధంలాంటి అలౌకికానందంతో ఆమె హృదయం పొంగిపోయింది.

ఆమె ఓడమీద అడుగు పెట్టినప్పటినుంచి ఏనాడూ తన్ను హృదయపూర్వకంగా ప్రేమించలేని తుచ్ఛదివాకరునితో సంసారంచెయ్యాలా? ప్రేమాభినయంచెయ్యాలా? అని ఆమెహృదయ తంతువులను ఈదుఃఖపుపోటులతో మోగించింది. కాని ఆనాదము ఆమె అంతర్యామికి తప్ప ఇంకెవ్వరికీ వినపడలేదు.

కాని ఆదుఃఖం అంతటితోనే అంతంకాలేదు. ఈ కల్పితప్రేమ మాత్రం ఒకనాడు కాకపోతే మరొకనాడైనా తెగక తప్పదు! ఇది ఒకనాడు రహస్యంగా విషపూరిత మవుతుంది. డాక్టరు అనంగమోహనుడు దీనికి తగిన పాఠం చెప్పిపోయాడు, ఆ దుర్దినాన, ఆ చెడులగ్నాన మెడకుపడేత్రాడు ఈసడింపు వురి, ఏశస్త్రంతో తెగుతుందా అనే దుశ్చింతే ఆమెను రాత్రింబగళ్లు వ్యథపెట్టసాగింది. కాని నిన్నటి చీకటిరాత్రిలో వుపేంద్రుని రాజసింహాసనం ముందు కూర్చుని ఇద్దరూ సంధిపత్రంమీద సంతకం చేసినతర్వాత ఆమెకు మెలకువ వచ్చినట్లయింది. పాపమీ అమాయకపు యువకునికోసం ఆమె వ్యథపడినట్లుగానే అటు ఘృణితవిభీషికనుండి ముక్తి చెంది అతను ఒక నిట్టూర్పు విడచి శాంతి నందాడు.

ఏకాంతంగా కూర్చుని నిట్టూర్పులు విడుస్తూ "ఇప్పుడు నాకేం భయం లేదు. ప్రేమించలేకపోయినా ప్రేమతో అతని హృదయమాలిన్యాన్నైనా

వదిలించగలనుగా!" అని మాటిమాటికీ అనుకోసాగింది. కాని దివాకరుడు అగ్ని మీద మమతను అణచుకోలేని పతంగంలాగ ఆహుతి కావటానికి ప్రయత్నిస్తే ఏమిచెయ్యాలి? తన రూపంలో ఎంతమహత్తర ఆకర్షణ శక్తివుందో ఆమెకు తెలుసు!

ఆమెకు తన పతిసంగతి జ్ఞాపకమొచ్చింది. ఆ నీరస, కఠోరవిద్యామూర్తి విజ్ఞానదుర్గంలో పడి అత్యంతగా రూక్షతతో రాత్రింబగళ్లు తన స్వాతంత్ర్యాన్ని రక్షించుకుంటూ వుండేవాడు. అతనిదగ్గరకు తను ఒక్కనాడుకూడా వెళ్ళలేక పోయినా, కాలం గడచిపోయింది, రాయటం చదవటం, వంటచెయ్యటం, అత్తవదిలింపులు సహించటం. పగలంతా గడచిపోయేది. రాత్రి ప్రకృతికి విరుద్ధంగా, ఆత్మకు వ్యతిరేకంగా పోరాడి దుఃఖాన్ని రగిల్చి గదిగోడలను తిట్ల విసుగుతో నింపి అలసిపోయిన తర్వాత ఏదో విధంగా నిద్రపోయేది. మర్నాడు పొద్దు పొడిచేది, ప్రొద్దుగుంకేది. ఈ విధంగా నెలలమీద నెలలు, సంవత్సరాలతరబడి సంవత్సరాలు గడచిపోయినాయి. ఏ ముష్టివాడూ వాకిట్లోకి ముష్టికి వచ్చేవాడు కాడు. ఏ పొరుగింటి ఇల్లాలూకూడా ఎప్పుడూ ఎలావున్నావని అడిగేది కాదు. ఆ ఇంట్లో సూర్యకిరణాలు ఏనాడూ వెలుగు నిచ్చి ఎరగవు. ఆకాశ పవనాలు ఒక్క నిమిషంసేపు దారి తప్పియైనా ఆ ఇంట్లో ప్రవేశించ లేదు. ఏదోవిధంగా పదిసంవత్సరాలు గడచిపోయినాయి. తల్లిదండ్రుల సంగతే జ్ఞాపకం లేదు. చిన్నతనంలో కాలనా గ్రామంలో మామగారి ఇంటివద్ద ఎదిగాననీ, కోడలినై అక్కడనుండి ఈ ఇంట్లో ప్రవేశించాననీ మాత్రం జ్ఞాపకం! పతి పసివిద్యార్థినిలాగ ఆమెను స్వీకరించాడు. అప్పటినుంచి మరణించేవరకు వారిద్దరిమధ్య గురుశిష్యుల ఆ కఠోర సంబంధం అలాగే వుండిపోయింది. పతి ఒక్కనాడుకూడా ఆదరించి యెరుగడు. ప్రేమించేవాడో లేదో కూడా తెలియదు.

తెలుగు, సంస్కృతం, ఇంగ్లీషు చెబుతూ వుండేవాడు. పాఠాలు అప్పజెప్పకపోతే కోప్పడుతూ వుండేవాడు, కొట్టేవాడుకూడా. తనకు కోపంవచ్చి అలిగినాకూడా వూరుకునేవాడు కాదు. ఏడ్చిఏడ్చి నిద్రపోయేది. ఒక్కొక్క రోజున తిండికూడా వుండేది కాదు. ఇదే ఆమె పత్నీ జీవితచరిత్ర !

అత్తపరీక్ష మరింత కఠినంగా వుండేది! ఆమెవద్ద మామూలు చిన్న తప్పుకుకూడా క్షమాపణంటూ వుండేదికాదు. వంటింటి తెడ్డు గంటె దగ్గర

చెప్పేమాటలు. మనుష్యుడు తరచుగా తన కెలా సుఖం చేకూరుతుందనే తెలుసుకో గలుగుతాడు. అదికూడా అన్ని సమయాలలోనూ, అన్ని పరిస్థితులలోనూ కాదు. తన్ను గురించే పోతూన్న మనుష్యునికి లోకంలోని బాధ్యతలన్నీ నిర్వహించాలని ధైర్యమున్నా నాకుమాత్రం వుండదు. ఆ జనపనార మిల్లువారు వీలైతే కాశీదేవాలయాల నన్నిటినీ పడగొట్టించి జనపనారమిల్లులను కట్టించితే మానవసుఖం అభివృద్ధవుతుందని అనుకుంటూ వుండవచ్చు, కాని అందరూ అలాగే అనుకోగలరా? సుఖమంటే ఏమివస్తువో నువ్వు నాకు చెప్పలేనంతవరకు నేనేమాట వినను?" అని కిరణ్మయి లేవటంచూచి హారన్ చెయ్యిపట్టుకొని "కూర్చో కొంచెం. ఇంత చదువుకున్నా కూడా నీ కింత కోపమైతే ఎలా? ఇటుచూడు కిరన్, నేను నీతో నిజంచెబుతున్నాను. సుఖమంటే ఏమివస్తువో నాకు తెలియదు. ప్రపంచంలో ఎవరికైనా తెలుసని కూడా నాకు నమ్మకంలేదు. బహుశా అది తెలుసుకోలేనంత అగాధ విషయం. చాల కాలంక్రిందట మన దేశంలో మూడురకాలైన దుఃఖనివృత్తిమార్గా లుండేవి. ఆ మూడింటినీ వేరుపరచిన తర్వాత మిగిలేదే సుఖ మంటే కూడా లాభంలేదు" అంటూ వుండేవాడు.

కిరణ్మయి ఈ మాటలను ధైర్యంగా వినగలిగేదికూడా కాదు. ఆ ధైర్యంతో "ఏమన్నా లాభంలేనప్పుడు ఇతరుల సుఖకల్పనలను పరిహసించటం ఎంత అసంగతమో మామూలుగా ప్రపంచసుఖపరిమాణాన్ని అభివృద్ధి చెయ్యాలనటంకూడా అలాంటి పిచ్చితనమే. మంచిచెడ్డలను తూచేముందు నీత్రాసు సరిగా వుందోలేదో చూడటం అవసరం. నువ్వు దాన్ని ఏ ఆదర్శంతో సరిచేస్తావో నాకు అర్థం కావటంలేదు" అనేది.

హారన్ క్షణంసేపు మౌనంగా వుండి "నీ మనోగతి ఎటు మొగ్గిందో నాకు తెలుసు కిరణ్. కాని కాలము, ఆత్మ, భగవంతుడు ఆదిగా గల కల్పనలను మనసునుండి తొలగించ నంతవరకు నీ కీ సంశయం వుండనే వుంటుంది. సుఖమే జీవితానికి చరమలక్ష్యం అని తెలుసుకోనుకూడా తెలుసుకోలేవు. బహుశా మరికొంత మిగిలి వుంటుంది. ఆ మరికొంతను వెతికినా లాభం లేదన్న భావం మనసులోమాత్రం కలుగుతుంది. అది నిన్ను ఆవరించి వుంటుంది. ముందుకు సాగనియ్యదు. నీలో ఆశలను రేకెత్తిస్తుంది. కాని సంతృప్తి నివ్వదు. బాటను గురించి చెబుతుంది గాని, బాట చూపించలేదు" అనేవాడు.

కిరణ్మయి ఈ విధంగా విద్యాసంసారంలోపడి పసిపిల్ల, తెలివిగల ఆడదై తేలింది. ఇవ్వాళ ఆమెకు ఒక్కొక్కటిగా సంగతులన్నీ జ్ఞప్తికి రా సాగినై. ఆమె విచారవాహిని వర్తమానదుఃఖాన్ని దాటి చాలదూరం పోయి పూర్వ జీవితపు అగాధ దుఃఖసాగరంలో దిగబడ పోసాగింది. ఆమె తన వదనాన్ని ప్రేమరంజితమైన చిరునవ్వుతో రంజింపచేసి "ఏమిటి చి తనో తిరుగుతున్నావు? ఏమిటిబాబూ? తిండి తిప్పలూకూడా అవసరంలేనా ఏమిటి? ఆఁ మంచి పిల్లడివే!" అన్నది.

ఆమె కంఠస్వరం విని దివాకరుడు ఒక్కసారి త్రుళ్ళిపడ్డాడు. ఎప్పుడూ వదినె అలాంటి కంఠస్వరం వినపడలేదు.

కిరణ్మయి మళ్ళా చిరునవ్వుతో "పొద్దుటినుంచి ఎక్కడ వున్నావు బాబూ?" అన్నది.

"కింద" అన్నాడు దివాకరుడు మెల్లిగా.

"కిందా? ఇంతసేపటినుంచి క్రింద ఏమిచేస్తున్నావు? ఒకసారి పైకి వచ్చి నాలుగు మెతుకులు నోట్లోవేసుకోటానికికూడా తీరిక లేకపోయిందా?"

సమాధానంగా దివాకరుడు రెప్పవేయకుండా ఆమె మొహంవంక చూడసాగాడు. నోటివెంట ఒక్కమాటకూడా రాలేదు.

"అయితే క్రింద ఏమిచేస్తున్నావు?" కిరణ్మయి మళ్ళా అడిగింది.

దివాకరుడు కలకత్తా వచ్చినప్పుడు మొట్టమొదటగా విని కృతార్థుడైన నిర్మల ప్రేమపూరిత పరిహాసం, గొంతులో అదే మాధుర్యం కనపడింది. ఆనందంతో అతని కళ్ళల్లో నీరు తిరిగినాయి. కాని ఎలాగో కన్నీళ్ళు నాపుకొని "కింద ఒక బెంగాలీ పత్నీసహితంగా అరకాన్ వెళుతున్నాడు. అక్కడ అతనికి ఇల్లుకూడా వుందట వదినా" అన్నాడు.

"కిరణ్మయి వుత్సుకతతో "ఏమిటీ అంటావు?" అన్నది.

"నిజంగా వారు నాకు చాల మంచివారుగా కనబడ్డారు" అన్నాడు దివాకరుడు.

కిరణ్మయి మధ్యలోనే "అలా అయితే మనిద్దరంకూడా వారింటివద్దే దిగవచ్చు. అయితే నేను వారితో మాట్లాడటానికి వీలుంటుందా?" అన్నది.

దివాకరుడు సంతోషంతో "ఎందుకుండదు? ఇంటావిడకూడా నిన్ను కలుసుకోవాలని కుతూహల పడుతూవుంది" అన్నాడు.

కిరణ్మయి ఆశ్చర్యంతో "ఇంటావిడ ఎవరు?" అని అడిగింది.

దివాకరుడు క్లుప్తంగా కామినీదాసిని పరిచయంచేసి "హరీశబాబు భార్యను ఈ పేరుతోనే పిలుస్తాడు. అక్కడ వారికి ఒకయిల్లుకూడా వుందట" అన్నాడు

ఇదివిని కిరణ్మయి మాట్లాడలేదు. ఇప్పు అద్వైతుడివ్వడంవల్ల ఇంటావిడ అని పిలువబడే ఆసనాన్ని సంసారంలో లెక్కచేయరు. అందుచేత దివాకరుడు ఆమెను పిలుచుకు రావటానికి సంసిద్ధపడేటప్పటికి కిరణ్మయి చిరునవ్వునవ్వి సందిగ్ధంగా "ఆవిడ మంచిదేనా బాబూ?" అన్నది.

దివాకరుడు తలకాయతిప్పి వుత్సాహంగా "కాకేం! మంచిదే. అయినా ఒకసారి మాట్లాడిచూడు..." అన్నాడు.

"ఇవ్వాళ వద్దులే, ఇంకెప్పుడైనా........." అన్నది కిరణ్మయి.

"కాదునదినా! నీతోడు, ఆమె ఇక్కడికి వస్తానంది. వాళ్ల ఇంటివద్ద దిగదలచినప్పుడు ఆమెకు ఒకసారి..." అని దివాకరుడు ధైర్యంతో లేచి నుంచున్నాడు. అతని పంచేంద్రియాలలోని స్నేహపూరితమైన హాసం కిరణ్మయి తప్పును తప్తశూలంలాగ ఛేదించింది. ప్రబలవేదనాతరంగాలు నరనరంలోనూ వ్యాపించాయి. కిరణ్మయి కళ్లల్లో నిండిన అశ్రువులను కప్పి పుచ్చాలనే తలంపుతో మొహంతిప్పుకొని అణచుకొన్న గొంతుతో "అయితే వెళ్లు" అన్నది.

అది నిజమే. క్రొత్తచోటుకు ఎక్కడికైనా వెళ్లేప్పుడు స్నేహితు లెవరైనా దొరకటం చాల ఆనందమైన విషయం. చివరికి ఈ సంగతి ఆలోచించుకొనే ఆమె దివాకరుని కుతూహలానికి తలఒగ్గింది. కాని అతను నిజంగా ఆమెను పిలుచుకు రావటానికి త్వరత్వరగా వెళ్లుతుండేప్పటికి తనసంబంధాన్ని గురించిన సమస్య కిరణ్మయి హృదయంలో చెలరేగింది ఆమె ఇప్పుడువస్తుంది. ఆంధ్ర స్త్రీ, ప్రౌఢావస్థ. ఆమెకళ్లను కట్టలేం! దివాకరునివయసుకీ తనవయసుకీ ఎంత వ్యత్యాస ముంటుందో అంత వ్యత్యాసం ఆంధ్రదేశపుభార్యాభర్తలలో

కిరణ్మయి వీనికై పొద్దుటినుండీ సిద్ధంగానేవుంది. "తలంటుకుంటే పోలేదు బొట్టు. బాబుగారికి జబ్బుచేసింది. బ్రతుకుతారని ఎవరికీ ఆశలేక పోయేప్పటికి పసుపు కుంకం కాళికియిస్తానని మొక్కుకున్నాను. కుంకాన్ని యిచ్చి యీ గాజుల్ని నిలబెట్టుకున్నాను" అని ఆమె ఒక నిట్టూర్పు విడచి దివాకరునికేసి క్రీగంటితో చూచింది. అతని మొహం సిగ్గుతో పూర్తిగా వివర్ణమైపోయింది.

"ఒహో! అదా సంగతి" అని ఇంటావిడ సానుభూతి చూపించింది. "అయితే మా అరకాన్‌లోకూడా కాళీ ఆలయముంది. వెళ్ళగానే పూజచేసి మొక్కుతీర్చుకో. లేకపోతే పలుగురూ పలువిధాల అనుకుంటారు. అరకాన్ లాంటి ముదనష్టపు పూరుమూకులోకాల్లో ఎక్కడా లేదు! కాని నాభయంతో రౌడీమూకంతా గడగడలాడతారు. లేకపోతే........." అన్నది.

కిరణ్మయి చిరునవ్వుతో "ఈ రెండు రోజులనుండీ బాబుగారితో మాట్లాడేది ఈ సంగతులేనా? మీరుచేసిన వుపకారాన్ని గురించి మీ ముందేమి చెప్పను? ఓడమీద అడుగుపెట్టింది లగాయతూ భయంతో ప్రాణాలు గుప్పిక్కుంచి పోతున్నాయి" అన్నది.

మాట పూర్తికాకముందే "భయమేముంది అమ్మా?" అని అభయమిచ్చి ఇంటావిడ ఆత్మస్తుతి సాగించింది.

దివాకరుడువచ్చి దగ్గరగా కుర్చీలో కూర్చున్నాడు. కిరణ్మయి వెరపనేది లేకుండా ధీమాతో ఎలాంటి అబద్ధాలు చెప్పగలదో చూచి దివాకరుడు కొయ్యలాగ అయిపోయినాడు. కొంతసేపటికి తెలివివచ్చి బైటకు బైల్దేరాడు. ఇది చూచి కిరణ్మయి "తిండీ తిప్పలూ తినకుండా ప్రొద్దుటినుంచీ వున్నావు. ఇంకా అటుపోతా వెక్కడికి?" అన్నది. సమాధానంగా దివాకరుడు ఏమన్నాడో ఆమె వినకపోయినా గ్రహించింది. కిరణ్మయి వ్యస్తురాలై "వద్దు వద్దు. నువ్వు బైటకి వెళితే త్వరగా రావని నాకు బాగా తెలుసు" అని ఇంటావిడ మొహంకేసి చూచి చిరునవ్వుతో "మా అత్తమామ లెవరూ లేరు. తిండితిప్పలనుగురించి నేనే అజ తీసుకోవలసి వస్తుంది" అని కొంచెంసేపు ఆగి నుళ్ళా చిరునవ్వుతో "నేనుకాబట్టి ఇలా బలవంతంగా ఇంత తినిపించ గలుగుతున్నానుగాని ఇంకొక ఆడదైతే వుపవాసాలుచేసి చచ్చేది" అన్నది.

దివాకరుని తల సిగ్గుతో ఒక్కసారి వంగిపోయింది.

ఇంటావిడ నవ్వి "పరాయిచోట్ల మీరిద్దరూ ఇలాగే కాపురం చేస్తారా బాబూ? మా ఇంట్లో వుంటే అలా సాగదు. నువ్వు అమ్మాయిని అలా యాతన పెట్టటానికి వీలుండదు" అని కిరణ్మయి మొహంవంక చూచి "బాబుగారు వయస్సులో నీకంటే చిన్నవారిలాగ వుంటారు. అయినా ఇద్దరిదీ ఒకే వయస్సై వుంటుంది." కిరణ్మయి తల కాస్త తిప్పి చిరునవ్వుతో "కులీన కుటుంబమైపో యింది. నేను వయస్సులో పెద్దదాన్ని కాకపోవటం నా అహోభాగ్యం! ఇద్దరిదీ ఒకేప్రాయము. వారు వైశాఖమాసంలో పుట్టారు. నేను ఆషాఢమాసంలో పుట్టాను. ఈ రెణ్ణెల్ల వ్యత్యాసం. చాలమంది వయసులో నేనే పెద్దదాన్నంటారు. ఎంత సిగ్గుమాలినమాట!" అని కిరణ్మయి మొహం చాటుపెట్టుకొని నవ్వసాగింది.

కాని ఇంటావిడ ఆ నవ్వులో పాల్గొనకుండానే గంభీరంగా "కులీన కుటుంబాలలో సిగ్గుమాలిన విషయమేమీ వుండదని విన్నాను. పదేళ్ళ పిల్లాడికి ఏభైఏళ్ళ ముసలిదాన్ని కట్టినా సరవాలేదు. అరకాన్ వెళ్ళినతర్వాత మొక్కు తీర్చుకొని తప్పకుండా బొట్టుపెట్టుకో. లేకపోతే ఎవరూ సధవ అనుకోరు. సరే వెళ్ళుతున్నాను. మీరు భోజనాలు చెయ్యండి. తీరిగ్గావుంటే సాయంత్రం మళ్ళా ఒకసారివస్తాను" అని ఇంటావిడ కిరణ్మయికి నమస్కరించి వెళ్ళి పోయింది.

---

# 3౬

సతీశుని వనవాసస్థితి ఈ నాటికీ అలాగే వున్నా, అతని వైరాగ్య సాధనాధారమాత్రం దారినుండి దూరంగా తొలగిపోయింది. రెణ్ణెల్లక్రిందట అతన్ని చూచినవారందరికీ ఈ విషయం చులకనగానే బోధపడుతుంది.

ఆత్మబంధులనూ, ప్రాణస్నేహితులనూ విడచి బుద్ధిపూర్వకముగా ప్రవాసం స్వీకరించి ఏకాంత జీవితము గడుపదానుకున్న వ్యక్తిహృదయంలో అకస్మాత్తుగా ఈ మార్పు కలగటానికి కారణమేమిటి? పక్షుల కలకూజనముల స్థానే ప్రయత్నపూర్వకంగా పెట్టెలో పెట్టి బంధించిన సంగీతపుస్తకాలను మళ్ళా బయటకుతీయటానికి కారణ మేమిటి? సారంగి, సితారు, ఆదిగాగల సంగీత సాధనాలు నిర్లక్షితస్థానాలు వదలి మళ్ళా మొదటిలాగ పరిశుభ్రమైన బల్లమీదకు ఏలావచ్చాయి? అతని మొహంలోని మలినచ్ఛాయలు ఒక్కసారి ఎలా వదలిపోయినాయి? ఇవన్నీ ఆలోచించవలసిన విషయాలు.

నిజంగా రెండుమూడునెల్లలోపల సతీశునిలో చాలామార్పు వచ్చింది. అతన్ని గుర్తింపటమే కష్టమైపోయింది. ఈ విపరీత పరివర్తనకు కారణం తెలుసుకోకపోయినా జరిగిపోతుంది. పెండ్లివిషయాలు స్పష్టంగాకపోయినా చెప్పకపోయినా ఆత్మబంధువులకు సతీశ సరోజిని అంతర్యాల విషయాలు స్పష్టంగా తెలిసాయి.

సరోజిని తల్లి జగత్ తారిణి ప్రయత్నమే ఈ విషయంలో అన్నిటికన్న ప్రబలంగా వుందన్న సంగతి సంవత్సరంక్రిందటే కలకత్తాలో తెలిసింది. కాని వ్యగ్రతా, వ్యాకులతలు ఎక్కువగా వుంటంవల్లే శిక్షాభిమానంగల తనకుమార్తెకు ప్రాచీనసమాజమూ, సంస్కారము నచ్చదనీ, సతీశుని చేసుకోటాని కిష్టపడదనీ సందేహం కలిగింది. ప్రస్తుతం జగత్ తారిణి తనకన్నవారింటికి శాంతిపురం వెళ్ళింది. తిరిగివచ్చినతర్వాత ఏసంగతీ నిశ్చయంగా చెబుతా నన్నది.

ఇవ్వాళ ప్రొద్దున సతీశుడు సారంగిమీద కొత్తగేయం ఆలాపిస్తున్నాడు. ఇంతలో బిహారివెంట ఎవరో ఒక వ్యక్తిలోపలికి వచ్చాడు. అతను జ్యోతిష్ బాబుగారి గుమాస్తా. జగత్ తారిణివెంట శాంతిపురం వెళ్ళి వచ్చాడు.

గుమాస్తా నమస్కారం చేసి "ఇవ్వాళ అమ్మగారు మీకు విందు చేస్తారు. అక్కడికి భోజనానికి పిలుచుకు రమ్మన్నారు" అన్నాడు.

ఈ మాటవిని సతీశుడు చకితుడై "ఆమె ఎప్పుడు తిరిగివచ్చింది?" అన్నాడు.

"మూడు నాలుగు రోజులైంది" అన్నాడు గుమాస్తా.

ఈ వారంరోజులనుంచి సతీశుడు అటు వెళ్లటం లేదు. తన సంబంధం విషయం బాగా తెలిసిన తర్వాత జ్యోతిష్‌బాబుగారి ఇంటికి వెళ్లటం అతనికి సిగ్గుగా వుంది. "సరే, పది పదకొండు గంటలకు వస్తానని చెప్పండి" అన్నాడు.

గుమాస్తా నమస్కరించి వెళ్లిపోయాడు.

సతీశునికి విందు చెప్పికూడా జగత్తారిణి భోజనంఏర్పాటేమీ చెయ్యలేదు. సతీశుడు సాయంత్రంగాని రాడని ఆమెకు తెలుసు. కాని గుమాస్తా నోటివెంట ఈ కబురువిని ఆమె చాల వ్యాకులపడింది. కొంచెం కోపంకూడా వచ్చింది.

ఇవ్వాళ ఏకాదశి. అందుచేత ఆమెకు భోజనఏర్పాట్లుచెయ్య వవసరం లేదు. ఆమెకు వంటచేసిపెట్టే విధవబ్రాహ్మణికూడా రెండుమూడురోజుల నుండి మలేరియా జ్వరంతో బాధపడుతూవుంది.

ఆమె చాలా విసుక్కుని గుమాస్తాతో "ఈపూట విందు చెప్పటానికి ఎందుకువెళ్ళావు? కొంచెం ఇంట్లో ఆలోచించి వెళ్లకూడదూ?" అన్నది.

గుమాస్తా భయపడుతూ "నేను ఈపూట రమ్మనమనలేదు. వారే స్వయంగా వస్తానన్నారు. ఇంకా నేనేంచేస్తాను?" అన్నాడు.

ఈమాట విని జగత్తారిణి క్రోధస్వరంతో "అయితే మీరే వెళ్ళి మంచిచేప లెక్కడైనా దొరుకుతాయేమో తీసుకురండి" అన్నది.

ఇవ్వాళ ప్రొద్దున్నే ఆమెకోపంగా వుండటానికి కారణముంది. సతీశునికి విందు పిలుపు పంపినతర్వాత శశాంకమోహనుడు నిన్నటిరాత్రి మళ్లా వచ్చాడని కబురు తెలిసింది. అతను వేషభాషలుమార్చి, సరోజినిని చేసుకోటానికి కుతూహల పడుతున్నాడని విన్నప్పటినుంచి ఆమెకంట్లో నలుసులాగ కనపడుతున్నాడు. ఇరవైరోజులక్రితం ఏదోవంకతో అతను కలకత్తా

నుండి వచ్చినప్పుడు తన కుమార్తెను ఇవ్వటం అసంభవమని ఒక విధంగా స్పష్టంగానే చెప్పింది. అయినా అతను పిలవకుండానే మళ్లీవచ్చి కూర్చున్నాడని వినగానే ఆమె మనసుకి కంపరమెత్తి పోయింది. అదీగాక ఈ కబురు ఆమెకు కొంచెం ముందు తెలిసినట్టయితే ఇవ్వాళ సతీశునికి విందు చెప్పేది కాదు. ఈ కబురు ఆమెకు ముందుగా ఎందుకుచెప్పలేదా అని ఆమె జ్యోతిష్ దగ్గరనుండి ఇంట్లో నౌకరుమీద వరకు మండిపడుతూవుంది. సరోజిని బైట కదిలించి ఏదోవిధంగా తల్లికంట పడకుండా పైకిపోతూవుంది. శశాంక మోహనుడు వచ్చినసంగతి ఆమెకు ఇంతవరకు తెలియదు. జగత్తారిణి ఆమెను ఆపాదమస్తకం ఒక్కసారి చూచి క్రోధాన్ని మనసులో అణచిపెట్టుకొని "తిరుగుడు అయిపోయిందా? కొంచెంసేపు చెప్పులూ మేజోళ్లూ విప్పు తల్లీ! సతీశుడు ఇవ్వాళ యిక్కడే భోంచేస్తాడు. నేను స్వయంగా వంటచెయ్యక పోతే ఈ కిరస్తానీవాళ్ల ఇంట్లో అతను పచ్చినీళ్లుకూడా మింగడు. వెళ్లి గౌను విప్పి కొంచెం వంటింట్లోకి రా. ముసలి తల్లికి కొంచెంసాయంచేస్తే నీ ఏసుకి కోపమేమీ రాదులే అమ్మా!" అన్నది.

జగత్తారిణి కోపమొచ్చినప్పుడు ఎలా మండిపడేదీ, వెనకా ముందూ ఆలోచించకుండా ఏమాటబడితే ఆమాటఅనేదీ అందరికీ తెలిసినవిషయమే, సరోజిని ఆగి "ఇప్పుడే వస్తానుఅమ్మా!" అన్నది.

కాని తల్లికోపము తగ్గలేదు. "వచ్చిమాత్రం ఏంచేస్తావు? పదిహేడు, పద్దెనిమిది ఏళ్ల వయసు వచ్చినా ఇంతవరకు అన్నం వండటం తెలియదు. నేనూ కలవాళ్లయింట్లోనే పుట్టినా నీవయస్సునుండీ సంసారంచేస్తున్నాను. ఇవ్వాళ వంటబ్రాహ్మణివెళ్లి పోతే పస్తు ఉండాల్సి వచ్చింది. ఆచారాలు ధర్మాలు లేనియింట్లో బిడ్డలు ఎందుకు?" అని మొహం చిట్లించుకొని జగత్తారిణి స్వయంగా వంటింట్లోకి వెళ్ళింది. కాని తనకొడుకు కూతుళ్లయందు, తన ఇంట్లో ఆచార వ్యవహారాలయందు ఆమెకు ఇంత కోపమెందుకో ఆమె పూర్వచరిత్రవల్ల చాలవరకు విదితమౌతుంది.

జగత్ తారిణి భర్త కీ. శే. పరేశనాథుడు ప్లీడరీచేసి చాలా డబ్బు గణించాడు. కాని ఇంకా ఎక్కువ సంపాదించాలనే ఆశతో వయసు మళ్లినా కూడా బారిష్టరు చదువుదామనుకొనేప్పటికి భార్య ఏడ్చి, విలపించి,

వుపవాసాలుచేసి - అనేక విధాలైన అడ్డంకులతో అతన్ని వెళ్ళకుండా చెయ్యటానికి ప్రయత్నించింది. కాని సఫల కాలేకపోయింది. పరేశనాధుడు ఆమెమాట ఒక్కటికూడా చెవిని పెట్టలేదు. పన్నెండేళ్ల కొడుకు జ్యోతిష్‌ని, ఆరేళ్ళ కూతురు సరోజినిని వదిలిపెట్టి విదేశాలకు వెళ్లాడు. మొదట కొన్నిరోజులవరకు జగత్‌తారిణి పూర్తిగా నిరాశ చెందింది. కాని తర్వాత ధైర్యం చేసుకొని గుమాస్తాలు - నౌకర్లసాయంతో పనిపాటలు చేసుకో సాగింది. కాని భర్తయందు ఆమెకు పూర్తిగా విరక్తి కలిగింది. కొంతకాలానికి పరేశనాధుడు అనుకొన్నదానికంటె ఎక్కువడబ్బు గడింప సాగాడు. కలకత్తాలో ఒక పెద్ద భవంతి కట్టించాడు. నూతనపద్ధతులలో ఇంటిని అలంకరించాడు. కాని జగత్‌తారిణి భర్తపనులకు ఏమీ సాయం చెయ్యకుండా మెదలకుండా వూరుకుంది. ఈ విధంగా భార్యాభర్తల అంతర్యాలు రోజురోజుకీ దూరంకాసాగినై. మాట్లాడుకోటం మానేశారు, పరస్పర యోగక్షేమాలు తెలుసుకోటంకూడా బహుశా ఆగిపోయే వుంటాయి.

ఒకరోజున జ్యోతిష్ ఆమెవద్దకు వచ్చి "నాన్నగారు నన్ను విదేశాలకు పంపా లనుకుంటున్నారు అమ్మా" అన్నాడు.

తల్లికి మొదటనుంచీ ఈ సంశయముంది. ఆమె మరింత కఠినంగా "ఎప్పుడు?" అన్నది.

"ఒకటి రెండు నెలలలో" అన్నాడు జ్యోతిష్.

తల్లి 'సరే' అని గంభీర ముఖంతో తనపనిమీద వెళ్లిపోయింది. జ్యోతిష్ విదేశానికి ప్రయాణమైన రోజున ఆమె తన గదికి తాళంవేసుకు లోపల కూర్చుంది. అతను గదిబైట నుంచునే తల్లికి నమస్కరించి వెళ్ళిపోయాడు. పరేశనాధుడు సరోజినిని వెంటతీసుకొని కొడుకును పంపిరావటానికి బొంబాయివరకు వెళ్లాడు. తిరిగి వచ్చేటప్పటికి జగత్‌తారిణి కన్నవారింటికి శాంతిపురం వెళ్ళిపోయిందని చెప్పారు. ఎందుకు వెళ్ళిపోయిందో ఆచోకీ తెలిసిన మీదట - ఈ మధ్య ఆమె అన్నగారు గోవిందబాబు వచ్చినట్టూ, ఈ ఇంట్లో భోజనం చెయ్యకుండా వెళ్ళిపోయినట్టూ తెలిసింది. దానినిబట్టి అతనికి భార్య కన్నవారింటికి వెళ్లిపోయిన కారణం తేలిగ్గానే అర్థమైంది.

రమ్మని మనిషిని పంపాడు, కాని జగత్ తారిణి రాలేదు. పరేశనాథుడు సరోజినిని ఒక బోర్డింగుహౌసులో చేర్పించి ఇంతకుముందు అలవాటులేని పనులన్నీ చేసుకోసాగాడు. జగత్ తారిణి కన్నవారింటివద్ద వుంటూవుండగానే భర్తకష్టాలన్నీ వినికూడా రావటానికి సంసిద్ధపడలేదు. తనసంఘాన్నుండి వెలిపెట్టిన భర్తమీద ఆమె కోపము లేశమాత్రము కూడా తగ్గలేదు

ఈ విధంగా ఆరుదీర్ఘవత్సరాలు గడచినాయి. జ్యోతిష్ తిరిగి వచ్చాడు. తల్లిని తీసుకురావటానికి వెళ్ళాడు. కాని తల్లి పంతంపట్టుకు కూర్చుని రాలేదు. ఏడుస్తూ "అంతా విన్నాను జ్యోతిష్, మీరు సుఖంగా బతకండి. కాని నన్ను మాత్రం ఆ నరకకూపంలోకి తొయ్యకండి. నేను సహించలేను" అన్నది.

"మేము వేరేవుంటాము అమ్మా! నువ్వు ఆ ఇంటిఛాయకుకూడా రావద్దు. నా సంపాదనతో మా పొట్టపోసుకుంటాము. నువ్వుపద" అన్నాడు జ్యోతిష్.

జగత్ తారిణి కొడుకును కలకత్తాలో వేరే ఇల్లుకోసం ప్రయత్నం చెయ్యమని రావటానికి అతికష్టంమీద అంగీకరించింది. జ్యోతిష్ ఒక వారం రోజులలోపల యిల్లు మాట్లాడి వచ్చి తీసుకెళతానని తల్లిదగ్గర సెలవు తీసుకున్నాడు. కాని తిరిగిరావటానికి అన్నిరోజులుకూడా పట్టలేదు. అయిదవ నాడే మళ్ళావచ్చాడు. అతని మొహంకేసి చూచి జగత్ తారిణి గావురుమంది. జ్యోతిష్ కలకత్తానుండి వెళ్ళిన మూడవరోజునే పరేశనాథుడు అకస్మాత్తుగా ఏదో హృద్రోగంతో చనిపోయాడు.

అత్యంత దుఃఖంతో జగత్ తారిణి ఐదేళ్ల క్రితం వదిలిపెట్టి వెళ్ళినయింటికి ఇవ్వాళ మళ్ళా తిరిగివచ్చింది - కాని పతినిమాత్రం చూడలేకపోయింది.

కూతుర్ని బడిమాన్పించి ఇంటికి తీసుకువచ్చింది. ఆమె వేషభావాలలోనూ, ఆచార్య వ్యవహారములలోనూ ఇదివరకటికీ ఇప్పటికీ కలిగిన మార్పును చూచి భయవిస్మయాలతో స్తంభించిపోయింది. జ్యోతిష్‌ని చాటుకు పిలచి "ఇప్పుడు చెల్లెలి పెళ్ళి ఎట్లాచేస్తావో చెప్పు?" అన్నది.

జ్యోతిష్ తల్లి మనసులోని భావాన్ని గ్రహించి చిరునవ్వుతో "ఇంతకంటె ఎక్కువ వయస్సు పిల్లలకు కూడా పెళ్ళిళ్లవుతున్నాయి. అమ్మా! నీకెందుకు? నువ్వు నిశ్చింతగా వుండు" అన్నాడు. జగత్తారిణి ఆశ్చర్యంతో కళ్ళప్పగించుకొని చూస్తూ "నిశ్చింతగా వుండనా? నీ తండ్రి చేసిపోయిన దానికి ఇప్పు డేవుపాయమూ లేదు. కాని నేను నాగొంతులో ప్రాణముండగా పెళ్ళిగాకపోయినా మా బాగేగాని బ్రాహ్మణపిల్లను ఏ తురకాడికో ఏ కిరస్తాని వాడికో అంటగట్టలేను. నీ కేచింతాలేదు, ప్రాయశ్చిత్తంచేసుకుంటే సరిపోతుంది. దానికి వుపాయం మాపినతండ్రిచెప్పాడు. కాని వెయ్యి ప్రాయశ్చిత్తాలుచేసినా పిల్లకాయ వయసు తగ్గించలేము. దాని కేం వుపాయ ముంటుంది?" అన్నది.

"నువ్వు వయసుతగ్గించే అవసరమేమీ లేదమ్మా! కొన్ని రోజులపాటు ఓర్చుకోవలసివుంటుంది. నేను కులీనబ్రాహ్మణకుర్రవాణ్ణే తీసుకువస్తాను. నువ్వేమీ కిరస్తానీ ముసల్మానీల ఇళ్లకుపో నవసరంలేదు" అన్నాడు జ్యోతిష్.

జగత్తారిణి కోపగించుకొని "నువ్వు ఇంకా ఓర్చుకోమంటున్నావా జ్యోతిష్?" అన్నది.

"ఓర్చుకో మన్నానన్న నేరం నామీద వెయ్యటానికి దానిలో నా తప్పేమీ లేదమ్మా! తప్పు నీది, నాన్నదీని. నేను విదేశంలో వున్నా" అన్నాడు జ్యోతిష్.

అతను అన్నది యథార్థమని జగత్తారిణి గ్రహించింది, కాని మంచి బ్రాహ్మణకుర్రాడు ఎక్కడ దొరుకుతాడా అన్న విషయంమీదే ఆమె ధ్యానం పోయింది. "నీ మనసొచ్చినట్టు చెయ్యి నాయనా, నేనే విషయంలోనూ చెయిజేసుకోనని మొదటే చెప్పాను" అని హృదయభారంతో తనపనిమీద వెళ్లిపోయింది.

జ్యోతిష్ ప్రాయశ్చిత్తం చేసుకొని తండ్రి శ్రాద్ధంచేశాడు. కొంత కాలానికి మంచివరుడు దొరికా డనుకున్నారు. అతను విదేశాలనుండి తిరిగి వచ్చిన బెంగాలీ యువకుడు. బారిష్టరు పాసయివచ్చి రెండుసంవత్సరాలైంది.

శశాంకమోహనుని రూపం దేశీయమైనా స్వభావంమాత్రం పూర్తిగా విదేశీయం. అతను బెంగాలీ స్వచ్ఛంగా మాట్లాడతాడు, గానీ ' ఇంగ్లీషులో

తప్పులు పడుతూ వుంటాయి. కొద్దిరోజులనుండి అతను ఇక్కడికి రావటం అధికమైంది. సరోజినియందు అతని మనసులోని భావంకూడా అస్పష్టంగానే స్పష్టమై పోయింది.

జగత్తారిణి తలుపుచాటునుండి కాబోయే అల్లుణ్ణిచూచి క్రోధంతో మండిపడింది. కాని ఆకోపం కూతురిమీద చూపించింది. కూతుర్ని వంటరిగా పిలిచి గద్దించుతూ "ఎవరిముందుబడితే వారిముందు హద్దువిడిచి తిరుగుతావు, సిగ్గులేదు?" అన్నది.

సరోజిని సిగ్గుతో క్రుంగిపోయి మెదలకుండా వచ్చి నుంచున్నది. క్రుద్ధ తల్లికూడా ఏమీమాట్లాడకుండా మరోవైపుకుపోయింది. శశాంకమోహనుడు తర్వాత ఎన్నిసార్లువచ్చినా తనకుకావలసినవ్యక్తి కనపడటంలేదు. తల్లి అనుజ్ఞ ననుసరించి సరోజిని బైటికి రావటంలేదు. జ్యోతిష్‌కి ఇది కటువుగా తోచింది. ఒకరోజున అతను చెల్లెలితో "నువ్విప్పుడు అలా పొంచిపొంచి తిరుగుతున్నా వెందుకు సరోజా?" అని అడిగాడు.

సరోజిని తలవంచుకొని స్పష్టంగా "అమ్మ........." అని చెప్పి ఇంకేం చెప్పలేకపోయింది. జ్యోతిష్ మెదలకుండా వెళ్ళిపోయాడు.

షుమారు రెణ్ణెల్లతర్వాత, జ్యోతిష్ తల్లిదగ్గర శశాంకమోహనుని సంబంధం విషయం ఎత్తి చివాట్లు తిన్నాడు.

కొడుకు మెదలకుండా వుండటంచూచి తల్లి కొంచెం మెత్తబడి "నువ్వూ విదేశాలకు వెళ్ళావుగాని అలా అయిపోయావా నాయనా?" అన్నది.

"అందరూ ఒకవిధంగా వుంటారా అమ్మా? అంతమాత్రంచేత ఆ సంబంధం పోగొట్టుకోటం మంచిదా? శశాంకుడు బారిష్టరు పాసయి వచ్చాడు. ఈ మధ్య అతను మంచి పేరుకూడా సంపాయించాడు. అతనికిచ్చి చెయ్యటంవల్ల సరోజిని సుఖపడుతుంది. అభిప్రాయాల్లో ఏదో కొద్ది భేద ముంటే తర్వాత సర్దుకుపోకూడదూ" అన్నాడు జ్యోతిష్ మెల్లగా.

"అతనెప్పటికీ బాగుపడడని నాకు తెలుసునాయనా! అదీగాక పరదేశానికివెళ్ళి పరదేశియై వచ్చినవాణ్ణి ఎప్పటికీ నమ్మకూడదు. బిహారువెళ్ళి

బిహారీనై, కాబూల్ వెళ్ళి కాబూలీనై, కటక్ వెళ్ళి పురియాత్రికురాలై పోతే వాళ్ళ ఎలా నమ్ముతారు? వీలులేదు. జ్యోతిష్! అదన్నీ పనికిరావు. వాడు మనిషి కాదు. కోతి. కోతికి నాబిడ్డను అంటగట్టదలచుకోలేదు" అన్నది తల్లి.

ఏ అపరాధం కోసమైతే జగత్తారిణి ధర్మమునుకూడా త్యజించిందో అలాంటి అపరాధాన్ని ఎంత చెప్పినా క్షమించదని నిశ్చయపూర్వకంగా తెలుసుకొని జ్యోతిష్ మెదలకుండా వెళ్ళిపోయాడు. కాని కొంచెంసేపటికి మళ్ళీ తిరిగివచ్చి "మరోమాట వుందమ్మా, దాన్ని గురించి నువ్వు బాగా ఆలోచించి చూడు" అన్నాడు మళ్ళీ.

"ఏం మాట నాయనా?" తల్లి అడిగింది.

"సరోజినికి మీరు చెప్పించిన చదువును బట్టి చూస్తే ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా పెండ్లి చేయటమూ మంచిది కాదనిపిస్తున్నది. చిన్నతనంనుండి ఆమె మీ అదుపులో పెరగలేదు. ఇంగ్లీషు దొరసానుల చేతుల్లో పెట్టారు. ఇప్పుడు ఈడొచ్చింది. ఆమె మనసులో అభిప్రాయమెలావుందో తెలుసుకొనటం కష్టమేమీ కాదు" అన్నాడు జ్యోతిష్.

ఈ మాటను ఆమె మనసులో కాదనలేక పోయింది, పైకి అవు ననా లేకపోయింది.

కొంచెంసేపు మౌనంగావుండి "సరే జ్యోతిష్! మీరు కిరస్తానీ దొరలూ దొరసానులూ కాదలచుకుంటే కాండి. కాని ముందు నన్ను కాశీకి మాత్రం పంపు! నేను ఇంతవరకు సహిస్తూ వచ్చాను, కాని ఇక సహించలేను" అన్నది.

జ్యోతిష్ తల్లికి నమస్కరించి "నేను కూడా కాశీ వచ్చివుంటాను. తల్లిని వదిలిపెట్టి నేనెక్కడవుంటాను? ఈ విషయం నేను విదేశంనుండి తిరిగి వచ్చినప్పుడే నిశ్చయించుకొన్నాను" అన్నాడు చిరునవ్వుతో.

జగత్తారిణి అతని మొహంవంక చూచింది. ఆమె హృదయంలోని క్రోధాగ్ని అంతా క్షణంలో చల్లబడిపోయింది. కొంచెంసేపటివరకు స్నేహ దృష్టితో కొడుకు మొహంకేసి చూచి నిట్టూర్పుతో "వద్దు, కాశీలో ఇల్లు

కాళీచెయ్యమని వృత్తరం యిస్తాయనా! ఎప్పుడూ నేను మీ వెంటవుంటూ-నా ధర్మాచారాలతో మిమ్మల్ని కష్టపెట్ట దలచుకోలేదు" అన్నది.

జ్యోతిష్ చిరునవ్వు నవ్వి "అయితే పద, అందరమూ కాశీలోనే వెళ్ళి వుందాం" అన్నాడు.

జగత్తారిణి సతీశునిచూచింది. అతని మెళ్ళో లావాటిజందెం వుంది. సంధ్యావందనం చేస్తాడు, నిష్ఠగలవాడు. అతని తండ్రివద్ద చాలా డబ్బు కూడా వుంది. జగత్తారిణి ఒక్కసారి ముగ్ధురాలైపోయింది.

సతీశుడు విదేశాలకు వెళ్ళి ఏమీ చదువుకురాకపోయినా సరోజినికి అతనిని గౌరవ మర్యాదలతో చూస్తుందని గ్రహించింది. బహుశా ఆమె మనసులో...అప్పటినుంచి జగత్తారిణి మనసులోనున్న సందేహం కాస్తా తొలగిపోయింది. ఇంతికాలంనుండి కూడబెట్టుకున్న మనఃక్లేశం దూరమై పోవటానికిగూడా దారి దొరికింది. సతీశునినోటితో అత్తా! అని పిలిపించు కునే సౌభాగ్యం కూడా కలిగి వచ్చుకుంది.

కాని తర్వాత చాలకాలందాకు సతీశుడు కనపడలేదు. అప్పటినుండి ఆమె హృదయంలో కొంచెం బాధపడసాగింది. అయినా ఆమె స్వయంగా ఈ పనికి మరోదారి చూచుకోటానికి ప్రయత్నించలేదు. ప్రయత్నించినా చివరికి మొండిచెయ్యి బైటపడుతుందేమోనని ఆమెకు చాలభయంగా వుంది.

పెళ్ళి కాకపోవటం పిల్ల ఇష్టానిష్టాలమీద ఆధారపడి వుంటుందని ఆమెకు బాగా తెలుసు. కాని ఈ విషయంలో వుపేంద్రు డేమీ కాదనలేదు. కాని అతని ముసలితండ్రి వున్నాడు. అదీగాక సతీశుడు విదేశాలకు వెళ్ళివచ్చిన వ్యక్తి కుమార్తెను చేసుకోటానికి సందేహిస్తా డనటానికి కూడా ఏమీ నిశ్చయం లేదు.

ఈ విషయంగా చాలారోజులు చాలా దుశ్చింతలలో గడపింది. ఆమె వైద్యనాథలో - సతీశుడు సరోజిని ఎదురుగా కూర్చుని మాట్లాడుతూ వుండటం చూచేప్పటికి ఆమె కళ్ళల్లో ఆనందాశ్రువులు నిండాయి సతీశుడు దగ్గరకువచ్చి నమస్కరించాడు.

అతను కలకత్తానుండి ఇక్కడికివచ్చి అజ్ఞాతవాసం చేస్తూ వుండగా సరోజిని ఒకరోజున అకస్మాత్తుగా అతన్ని వెతికి పట్టుకున్న సంగతి జ్యోతిష్ తల్లికిచెప్పాడు. తనకూతురిని ఆపదనుండి కాపాడిన సంగతి విని సతీశుని ఆశీర్వదిస్తూ "నువ్వు మాకు చేసిన వుపకారాన్ని జీవితంలో ఎప్పుడూ మర్చిపోలేను నాయనా! కాని ఈ అడవిలో ఒంటరిగా పడివున్నావెందుకు బాబూ? నువ్వు నావాడివి. మేము ఇక్కడ వున్నకాలం మా ఇంటికివచ్చి ఎందుకు వుండకూడదు?" అన్నది.

సతీశుడు చిరునవ్వునవ్వుతూ "నాకు ఇక్కడ కష్టమేమీలేదు అత్తా! చాల హాయిగా వుంటున్నాను" అన్నాడు.

"కష్టంసంగతి కాదు నేననేది - కాని ఒంటరిగావుంటే ఆపదలు ఎన్ని వస్తాయి నాయనా! మా ఇంటివద్ద చాలా ఖాళీగదులు వున్నాయి. వచ్చి ఒక గదిలో వుండరాదూ?" అన్నది జగత్తారిణి.

"వస్తే కులభ్రష్టుడౌతాడు అమ్మా" అన్నది సరోజిని.

జగత్తారిణికి ఇంతవరకు ఆమె ఆంతర్యంలోని సంగతులు తెలీవు. మనసులోవిసుక్కుని "అలా మాట్లాడతావేమే! మనమెవరమేమిటి? మన యింటివద్దవుంటే కులభ్రష్టుడు కావటానికి? దీనిమాటలు నమ్మబోకు నాయనా! అలాఅయితే వుపేంద్రబాబు భార్యతో అన్నిరోజులు మా ఇంట్లో ఎందుకు వుంటాడు? అతను కులభ్రష్టుడయ్యాడా ఏమిటి?" అటువంటి వాగుడు ఎప్పుడూ వాగకు సరోజా!" అన్నది.

సరోజిని మొహం తిప్పుకొని నవ్వసాగింది. "కులభ్రష్టతే ఎందుకవుతుంది అత్తా! నేను ప్రతిరోజూ ఇక్కడికి వస్తూనే వుంటాను. అప్పుడప్పుడూ భోంచేస్తూ వుంటానుకూడా" అన్నాడు సతీశుడు.

ఈ సంగతివిని జగత్తారిణి సంతోషంతో "అలాగే వస్తూవుండు నాయనా! నేను ఇక్కడ ఉన్నంతకాలము ఇక్కడికేవచ్చి భోంచేస్తూవుండు" అని ఆమె భోజన సామగ్రికోసం వెంటనే వెళ్ళిపోయింది. "నువ్వు నాకు సంగీతం నేర్పుతానన్నావుకాదూ!" అన్నది సరోజిని సతీశునితో.

"నేను ఇక్కడికి రోజూ వస్తూవుంటానుగా, నేర్చుకోవేం?"

"నువ్వు రాగానే నీ పాటవినటానికే నలుగురూ వచ్చి పోతుంటారు. పాట నేర్చుకొనేది ఇంకెలా?"

సతీశుడు చిరునవ్వునవ్వి "అయితే ఎవరినీ రానవద్దని వాకిటివద్ద మనిషిని కాపలీపెట్టరాదూ?" అన్నాడు.

"దానికన్నా అమ్మమాట విని ఇక్కడవుంటేనే బాగుంటుంది. ఆ అడవిలో పడివుండే అవసరమేమిటి?"

"అవసరమేమిటో—ఈ సంగతి ఇంకెవరితోనైనా చెప్పవచ్చును గాని సరోజినితో చెప్పలేను" అని సతీశుడు మొదలకుండా వూరుకున్నాడు.

"అన్నయ్య అయిదారు రోజులలో కలకత్తా వెళతానంటున్నాడు. అప్పుడు మా ఇంటివద్ద ఎవరుంటారు?" అన్నది సరోజినీ మళ్ళీ.

"అక్కడ ఎన్ని రోజులుంటాడు?" సతీశుడు అడిగాడు.

"బహుశా పది పదిహేను రోజు లుండవలసి వస్తుంది" అన్నది సరోజిని.

"నిజంగా వారు వెళ్ళవలసివస్తే ఈ ఏర్పాటుకూడా అతనే చేసి పోతాడు" అన్నాడు సతీశుడు.

సరోజిని చిరునవ్వునవ్వి "ఏర్పాటు చేసిపోతే సరే! లేకపోతే నువ్వే వుండవలసి వస్తుంది" అన్నది.

"కాని ఇంత భయం దేనికి? మీరు మా ఇంటిఆడవాళ్ళలాగ ఘోషా స్త్రీలుకాదుగా—మగవారులేకపోతే ఇబ్బందిపడటానికి? మీరు ఎంతవుంది మగవాళ్ళకి..." అన్నాడు.

సరోజిని మొహం ఒక్కసారి ఎర్రబడింది. "ఆఁ అవును. అగా లెందుకు? మేమే చేస్తున్నాం? మగవాళ్ళ చెవులు పట్టుకు లాగుతున్నామా? మేము హిందూ కుటుంబాలలో పిల్లలమే కామా?" అన్నది.

సతీశుడు సిగ్గుపడి ఆ మాట తోసివెయ్యటానికి ఏదో అందుకోబోయేప్పటికి జ్యోతిష శశాంకమోహనుని వెంటబెట్టుకొని రావటమూ కనపడింది.

గదిలోకిరాగానే శశాంకమోహనుడు త్వరత్వరగా ముందుకువచ్చి సరోజినీకి షేక్‌హాండిచ్చి యోగక్షేమా లడిగినతర్వాత "నేను కల

కత్తాలో వుండలేకపోయాను. ఏదో తలవని తలంపుగా స్టేషనుకువచ్చి దేవఘర్ కు ఫస్టుక్లాసు టిక్కెట్టు తీసుకొన్నాను. దీనికి కారణం-ఇంతవరకు నేనుకూడా తెలుసుకోలేక పోయాను" అని ఒకకుర్చీ దగ్గరకు లాక్కొని తెప్పరిల దాన సాగాడు. కాని సరోజిని పలకకుండా కూర్చుంది.

తర్వాత కొంచెంసేపటికి సతీశుడు పలకకుండా వెళ్ళిపోవటం చూచి శశాంకమోహనుడు గొంతు సరిచేసుకొని "వీరి నెక్కడో చూచినట్టుగా వుంది. కాని జ్ఞాపకం రావటంలేదు" అన్నాడు.

"ఎక్కడ చూచారో తెలియదు?"

కొంచెంసేపైన తర్వాత జగత్తారిణి సతీశుని భోజనానికి రమ్మని పిలవనంపినప్పుడు అతను చెప్పా చెయ్యకుండా వెళ్ళిపోయాడని తెలిసింది.

తర్వాత రెండుమూడు రోజులవరకు సతీశుడు కనబడకపోయేసరికి జగత్తారిణి క్రుద్ధురాలై పోయింది. కోపంతోనూ మాటుకలిపి "శశాంకుడూ అక్కడ ఇంకెన్నాళ్ళని వుంటాడు? అక్కడికి రావద్దని గట్టిగా చెప్ప రాదూ!" అన్నది.

జ్యోతిష తల్లిగారింటను ఎలా పాలించాడో చెప్పలేముకాని వెళ్ళిపోయే ముందు శశాంకమోహనుడు తను ఆశపెట్టుకుని కస్తున్న వస్తువు చేజిక్కదనీ, సతీశుడే అదృష్టవంతుడనీ తెలుసుకున్నాడు.

బాబుగారి మొహం తెల్లబడిపోయింది. కాని ఈ దెబ్బను అతను లాంఛనగా తట్టుకున్నాడు. చివరికి వెళ్ళేప్పుడు సరోజినితోకూడా చెప్ప లేదు.

బండి కదలబోయేముందు అతను తలవని తలంపుగా "సతీశ్ బాబు డాక్టరు చదువుతున్నాడా? చదివాడా జ్యోతిషబాబూ?" అని అడిగాడు.

జ్యోతిష తలకాయ ఊపి "పూర్తికానట్టుంది. కొంతకాలం ఏదో హోమియోపతీ పాఠశాలలో చదివాడనుకుంటాను" అన్నాడు.

"ఓహో! హోమియోపతీ పాఠశాలలోనా?" అని మరో ప్రసంగం ఎత్తాడు.

# 30

తమ్ముడికి జబ్బుగా వున్న దన్న తంతి చూచుకొని జగత్తారిణికి తలవని తలంపుగా శాంతిపురం ప్రయాణం కట్టవలసివచ్చింది. అందుచేత సతీశుని ముందు ఈ ప్రస్తావన తీసుకొచ్చే అవకాశం కలుగలేదు. ఇవ్వాళ అతనికి పుష్టిగా భోంచెయ్యబెట్టి ఈ ప్రసంగం తీసుకొద్దామనే సంకల్పముతో వుదయము లేవగానే ఆమె సతీశునికి విందుచెప్పిరమ్మని గుమాస్తాను పంపింది. ఈ మధ్యలో ఎవరూ వూహించనటువంటి ఈ ఘటన జరిగింది. జగత్తారిణి పేరు చెబితేనే మండిపడే శశాంకమోహనుడు ప్రొద్దున బండికి వచ్చాడని విని ఆమె క్రోధానికి అంతులేకపోయింది. మానవుని అత్యంత ఈప్సిత వస్తువు ప్రాప్తించటంలో ఏదైనా అడ్డంకు వస్తేసరి సందేహాలకు అంతువుండదు. అందుచేత బైటనుంచి సరోజిని రావడంచూచి ఆమె శరీరమంతటా విషజ్వాలలు చెలరేగాయి. శశాంకమోహనుని తలవనితలంపురాక ఈహతభాగిని పిలుపువల్లేనోనని ఆమె సందేహపడింది. అసలు అతనిదికూడా తప్పంటానికి వీలులేదు. తన బారిష్టరు కొడుకుని ఆమె పూర్తిగా ఎప్పుడూ నమ్మదు. ఆచారభ్రష్టులైన తన కొడుకూ కూతురు సతీశుని ఆచారనిష్ఠను ప్రేమదృష్టితో చూస్తారన్న నమ్మకం ఆమెకు పూర్తిగాలేదు.

కూతుర్ని నానాతిట్లూ తిట్టి, వంటింట్లోకి వెళ్ళి దాసీకి వంటసామగ్రి తియ్యమని చెప్పి స్నానానికి వెళ్ళింది. కాని గంటసేపైనతర్వాత వచ్చి కూతురు వంక చూచి తల్లి ఆశ్చర్యపడిపోయింది. సరోజిని ఇంతలో స్నానంచేసి పట్టుబట్ట కట్టుకొని అలవాటులేని చేతులతో కూరగాయలు తరుగుతూవుంది. దాసీది పక్కనకూర్చుని చెబుతూవుంది.

జగత్తారిణి క్షణంసేపు మెదలకుండావుండి "బ్రాహ్మణపిల్లకు ఇంతకంటే ఏచీరలు శోభిస్తాయి? నిన్ను చూచినతర్వాత ఇప్పుడు కలిగినంత సంతోషం నాకు ఎప్పుడూ కలుగలేదు అమ్మా!" అన్నది.

సరోజిని సిగ్గుతో తలవంచుకొని పనిచెయ్యసాగింది. తల్లి అతన్ని వుద్దేశించి వ్యంగ్యంగా "నాకు అంతా తెలుసు. అతను ఎంతపరీక్షలు పాసయినా వాణ్ణి నేను కోతి అంటాను. ఆ సిగ్గుమాలినవాడు ఎవరి పిలుపునుబట్టి మళ్ళా

వచ్చినా నేను బ్రతికివుండగా అలా ఎప్పటికీ జరగనియ్యను. ఇదే ప్రతిజ్ఞపట్టి చెబుతున్నాను" అన్నది.

కొంచెంసేపు మాట్లాడకుండా వుండి "బాల్యమునుండి ఎటువంటి విద్య అలవడుతుందో వారిమనసు అటువైపుకే మొగ్గుతుందంటారు శాస్త్రకారులు. కాని నేను అలా అనుకోను. కోటూ బూటూ వేసుకోనివాడు నెగడని ఏ శాస్త్రంలో రాసివుంది?" అన్నది మళ్ళీ.

హేమంటు, కోటుసంగతి ఏ శాస్త్రంలోనైనా రాసివుందో లేదో సరోజినికి తెలియదు. ఆమె తలవంచుకొని కూర్చుంది.

సామానంతా సర్దుకొని జగత్తారిణి వంటఇంట్లో కూర్చుని "భగవంతుడు నామనోభీష్టాన్ని పూర్తిచేస్తే - నువ్వు చూస్తావుగా తల్లీ - అంత కంటే - ఆనందముంటుందా?" అన్నది.

సరోజిని తలవంచుకొని తల్లి మనోకామనను స్పష్టంగా వినాలనే కుతూహలంతో కూర్చుంది. కాని జగత్తారిణి బైటపెట్టక వంటింట్లో నిమగ్నమై పోయింది. దాదాపు పదిగంటలకు గుమాస్తా ఎక్కడ్నో వెతికి వేసారి ఒక వాలుగ చేప తీసుకొచ్చాడు. జగత్తారిణి వంటింట్లోంచి చేపను తొంగిచూసి సంతోషంతో "ఎంత మంచిచేప! కాని......" అన్నది.

"సతీశబాబు రావటానికి ఇంకా ఆలస్యముందమ్మా! ఇప్పుడు ఇంకా పదిగంటలుకూడా కాలేదు" అన్నది సరోజిని.

జగత్తారిణి చిరునవ్వునవ్వి "రావటం రాకపోవటం సంగతి కాదు. ఇవ్వాళ ఏకాదశి. నేను చేపను ముట్టుకోను. మావంటమనిషి వండుతాడేమోనని ఆలోచిస్తున్నాను. సరే, చూచిరా సుకేశీ, ఆఇంట్లో వంట ఎంతవరకు అయిందో?" అన్నది.

దాసీది బైటకువెళ్ళిపోగానే సరోజిని సిగ్గుపడుతూ మెల్లగా "నువ్వు చెబుతూవుంటే నేను వండలేనా అమ్మా?" అన్నది.

జగత్తారిణి ఆశ్చర్యంలో "నువ్వు వండగలవా?" అన్నది.

"వండగలనమ్మా, నువ్వు చెబుతూవుంటే."

అంత మంచిచేప కాని శాలిచేతిలో పడి చెడిపోతుందనే భయంతో దానిది అక్కడేనుంచుమని "కుదురుతుందా? ఒకవేళ చెడిపోతే?" అన్నది.

జగత్తారిణి ఏదో ఆలోచిస్తూ మళ్ళీ అన్నది, "సతీశుడు పరాయి మనిషికాదు, మన ఇంటిబిడ్డే గా! సుకేశీ! నువ్వు నుంచోక ఆపొయ్యి బాగా అంటించి చేప కొయ్యి, నువ్వొక్క పద్ధతి చొంగు తోపుకో అమ్మా!" చిరునవ్వు నవ్వి "ఇవ్వాళ నీకు పాకవిద్యాభ్యాసము. ప్రతిసంవత్సరము ఈరోజున నువ్వు చేపలు వండుతావని ఆశీర్వదిస్తున్నాను" అన్నది.

ఈ ఆశీర్వాదంతో సరోజిని తల మరీ వంగిపోయింది. కొంచెం సేపటికి ఏదోపనిమీద జ్యోతిషు తల్లిదగ్గరకు వంటింటివాకిట్లోకి వచ్చి ఆశ్చర్యంతో చూడసాగాడు. కళ్ళారాచూచి "వంటచేసేది ఎవరు అమ్మా! సరోజినా ఏమిటి?" అన్నాడు.

తల్లి కొంచెం నవ్వి "చూడు గుర్తిస్తావో లేదో" అన్నది.

"నిజంగా ఆమె వంటచేస్తూవుందా, బలవంతంగా నువ్వుపట్టుకు కూర్చోబెట్టావా?"

"వంట చెయ్యటం హిందూకుటుంబాలలో పిల్లలకు నేర్పాలా ఏమిటి? పుట్టుకతోనే మేము నేర్చుకుంటాము—కాని..."అన్నది తల్లి.

"సందేహ మేమిటి?"

జగత్తారిణి కొడుకును కొంచెం చాటుకు తీసుకెళ్ళి "అయితే సతీశుడు ఆమె వంటచేసిందని వింటే భోంచేస్తాడో లేదోనని చింతగావుంది" అన్నది.

జ్యోతిషు నవ్వకానే సరోజిని తలెత్తి చూచింది. "సతీశుణ్ణి నువ్వు మనువనికాని, పరాయివాడనిగాని అనుకుంటున్నావా అమ్మా!" అన్నాడు జ్యోతిషు.

"కాని అతను మీరంటే విశ్వాసకలవాడేగా!" అన్నది తల్లి.

"ఏమినిష్ఠ, అదివరకుకూడా చెబుతాను. ఆ రాత్రి సరోజినే వంటచేసి వడ్డించింది, తెలిస్తే చిన్నకొయ్య పళ్ళు ఏరుకోవలసి వచ్చేది—తెలుసా?" అన్నాడు జ్యోతిషు.

తల్లి ఆశ్చర్యంతో "ఎప్పుడు? ఎప్పుడు?" అన్నది.

జ్యోతిషు ఆరాత్రి ఘటనంతా వివరంగా చెప్పాడు. విని ఆమె ఆనందోత్సాహంతో "ధన్యురాలవు తల్లీ! నేను ఎప్పటినుండో అనుకుంటున్నాను. నువ్వు మాట్లాడకుండా కూర్చున్నావా?" అన్నది కుమార్తెతో.

జ్యోతిషు చిరునవ్వునవ్వి "ఆమె కేమి తెలుసు నువ్వు మనసులో అనుకునేది? కాని ఆరోజున నేను తినలేదు. ఇవ్వాళ తినిచూస్తాను. అభ్యాసము లేకుండానే పాకవిద్య ఆమె ఎలా నేర్చుకొందో?" అని జ్యోతిషు మరోవైపుకు వెళ్ళిపోయాడు.

జగత్తారిణి సిగ్గుతో వంగుకొన్న కుమార్తె మొహంకేసి చూచి ఆప్యాయంగా "సిగ్గుపడతావేనమ్మా! ఆత్మ బంధువులకు వంటచేసి పెడుతున్నావు. స్త్రీజాతికి అంతకన్న సౌభాగ్యమైన విషయ మేముందమ్మా! ఇంతలో నేను పూజచేసివస్తాను" అని వెళ్ళిపోయింది.

రెండు ఝాములుప్రొద్దెక్కినా సతీశుడు అంతులేడు. రాని కారణం కూడా ఎవరూ వచ్చి చెప్పలేదు. జగత్తారిణి పగలంతా అతనికోసం వేచియుంది. సాయంత్రం కొడుకును పిలచి "అతని వంట్లో బాగుండలేదేమో! ఎవరినైనా కనుక్కురమ్మనకపోయావా జ్యోతిషు?" అన్నది.

జ్యోతిషు నిర్లక్ష్యంగా "అంతదూరం ఎవరినిపంపనమ్మా!" అన్నాడు.

జగత్తారిణి ఆశ్చర్యంతో "నౌకర్ని ఒకసారి పంపకూడదూ!" అన్నది.

"అవసర మేముంది?"

"నువ్వు అనేది ఏమిటి జ్యోతిషు? అతనివంట్లో బాగున్నదో లేదో తెలుసుకోవాలిగా."

"అంత అవసర మేముంది? మనకు ఆత్మబంధువా కాడు. ప్రాణస్నేహితుడుకూడా కాడు. అతనికోసం ఇంత చింతతో బాధపడవలసిన అవసర మేమీ లేదనుకుంటాను నేను" అని జ్యోతిషు బైటకు వెళ్ళిపోయాడు.

సతీశుని విషయంలో కొడుకు నోటివెంట అలాంటి సమాధానం విని జగత్తారిణి హతాశురాలై పోయింది.

మెల్లగా పైకివెళ్ళి మంచంమీద పండుకొని సరోజినిని పిలచి ఆమె మొహంవంక చూచి మరీ భయపడిపోయింది. కొంచెంసేపు మెదలకుండావుండి "సతీశుడు ఎందుకని రాలేదో నీకు తెలుసా సరోజినీ?" అన్నది.

"తెలియదు."

కుమార్తె సమాధానం విని జగత్తారిణి లేచికూర్చుని "తెలియకపోతే మనిషిని పంపించకూడదా? అదికూడా నేనే చెప్పాలా?" అన్నది.

సరోజిని మెల్లగా "మనిషిని పంపవసరంలేదన్నాడు అన్నయ్య" అన్నది.

"ఎందుకు అవసరంలేదో? అదే నేను తెలుసుకోవాలనుకునేది. వెళ్ళి వెంటనే నౌకర్ని పంపి అతనికబురు తెనుక్కురమ్మను."

"అతను లేడమ్మా! అన్నయ్య ఉపేంద్రబాబుకు తంతియివ్వటానికి పంపాడు."

"ఉపేంద్రబాబుకా? ఇంత తొందరగా అతనికి తంతినిచ్చే అవసరమేముంది?"

"నాకా సంగతులన్నీ తెలియవు అమ్మా! నువ్వు అన్నయ్యనడుగు" అని సరోజిని తల్లిని ఒకవిధంగా ఉపేక్షించి మరోవైపుకు వెళ్ళిపోయింది. తప్పకుండా సతీశుని రావద్దని రాసి వుంటారని మనసులో అనుకుంది జగత్తారిణి. దీనికి కారణమేమిటో ఎవరూ చెప్పకపోయినా ఏదోవిశేషకారణం తప్పకుండా వుండివుంటుంది. ఈ మహారిష్టానికి కారణం శశాంకమోహనుడు, వీడు ఆ దుష్టుణ్ణి వెంటబెట్టుకొని వచ్చాడు. దానిలో సందేహమేమీలేదు. కారణం ఎంత భయంకరమైనదైనా ఆమెవుండగా కొడుకూ-కూతురూ సతీశుని రావద్దన్నారేమోనని తలంపుకురాగానే ఆమె హృదయం క్రోధంతో నిండిపోయింది.

వెంటనే సుకేశిద్వారా జ్యోతిషుని పిలిపించి "నువ్వు సతీశుని రావద్దన్నావా?" అన్నది.

జ్యోతిషు ఆశ్చర్యచకితుడై "నీకీ సంగతి చెప్పింది ఎవరు? అన్నాడు.

"సతీశుని విషయంలో నువ్వు ఉపేంద్రునికి తంతి నిచ్చావా?"

"అవును"

"ఎందుకు? సతీశుడు ఏమిచేశాడు?"

జ్యోతిషు కొంచెం ఆగి "చేసింది నిజమైతే ఇక అతనితో మన కెటు వంటి సంబంధమూ వుంచుకోము" అన్నాడు.

"ఈ కీసంగతి ఎవరుచెప్పారు. శశాంకమోహనుడా? వాడు దుష్టుడు, దురాత్ముడు, వాడి మాటలు నేను వీసంకూడా నమ్మను"

"నేను నమ్ముతాను. అతనిమాటలలో సగమైనా నిజమైతే, ఇప్పుడే చెబుతున్నాను అమ్మా, సతీశుని ఈ ఇంటి నీడనుకూడా తొక్కనివ్వను" అన్నాడు సూర్యేశు.

కొడుకు వంక చూచి జగత్తారిణి మొత్తుకుంటూ "అయితే సరిగా చెప్పరాదు నాయనా! ఏం జరిగిందేమిటి? సతీశుడు ఏమైనా చేశాడా అన్ని ఇంటి నీడకూడా తొక్కనీకపోవటానికి? యువకత్వం పొరపాటువల్ల ఏదైనా తప్పు చేసి వుండవచ్చు. కాని తర్వాత సరిచేసుకొనే వాళ్ళు లోకంలో ఎంతమంది లేరు?" అన్నది.

సూర్యేశుడు తలకాయ వూగిస్తూ "లేదమ్మా! ఆ తప్పులు క్షమించతగినవి కావు. ఇంకెవరైనా క్షమించగలిగినా సరోజినిమాత్రం క్షమించలేదని స్పష్టంగా చెప్పగలను" అన్నాడు.

జగత్తారిణి కొంచెం ఆలోచించి "ఆ తప్పేమిటో కొంచెం చెప్పు, వింటాను" అన్నది.

"రేపు వింటువుగానిలే అమ్మా! వృషేంద్రుని దగ్గరనుండి సమాధానం రానంతవరకు ఈ విషయమే వద్దు" అని సతీశుడు గదిలోంచి బైటకు వెళ్ళిపోయాడు.

ఇంతసేపటినుండి ఆవేశంతో జగత్తారిణి మంచంమీద కూర్చునివుంది. కొడుకు వెళ్ళిపోయినతర్వాత నిస్త్రాణిలాగ ఒక్కసారి మంచంమీద వడ్డిగిలి నిట్టూర్పుతో "భగవంతుడా! ఈ కలికాలంలో నువ్వు ఎవరినీ నమ్మటానికి యోగ్యునిగా చేయలేదుగదా!" అన్నది.

రాత్రి కూతుర్ని పిలువనంపింది. కాని సుకేశి సరోజిని అలికిడి వినగలక పోయేప్పటికి తిరిగివచ్చి "నిద్రపోతూవుంది" అన్నది.

ఆమె రెండుచేతులతో తల బాదుకొని-అలాంటి చెడువార్త వినికూడా నిశ్చింతగా నిద్రపోతూవుందా? - సతీశునికంటె ఆ కోతిమీద ఆమెకు ఎక్కువ అపేక్షవుంది. దీనిలో సందేహమేమీలేదు-అనుకున్నది. మనసులో కూతురి మీద క్రోధం మరీ పెరిగిపోయింది.

మర్నాడు మూడుగంటలప్పుడు సతీశుడు సైకిలు వాకిట్లో నిలబెట్టి పైట కచేరీ సావిట్లోకి వచ్చాడు.

"మీ వంట్లో బాగుండలేదా సతీశబాబూ!" అన్నాడు జ్యోతిషు.

సతీశుడు మొహంమీదికి నవ్వు తెచ్చిపెట్టుకోటానికి ప్రయత్నించి, "లేదు" అన్నాడు.

అంతా మెదలకుండా వూరుకున్నారు. ఎవరూ మాట్లాడకుండా వుండటం చూచి సతీశుడు చాల ఆశ్చర్యపడ్డాడు. ఇవ్వాళ వెళ్లగానే రకరకాలైన నిందలు ఆరోపించ బడతాయని అనుకుంటూ వస్తున్నాడు! అందుచేత అతను ఇంట్లోకి అడుగుపెడుతూ 'ముందుగా నిన్నటి అపరాధానికి అత్తని క్షమాపణకోరి వస్తాను, తర్వాత మాట్లాడుకోవచ్చు" అన్నాడు.

శశాంకుడు ఇంతసేపటివరకు సతీశునివంక తీవ్రదృష్టితో చూస్తున్నాడు. "అత్తగారు నిద్రపోతూవుంది, ఆమెనులేపి క్షమాపణ కోరవలసినంత తొందరేమీ లేదు. కొంచెం కూర్చోండి, మీతో మాట్లాడాలి" అన్నాడు.

అతను మాట్లాడేపద్ధతిచూచి సతీశుడు చాల ఆశ్చర్యంతో "నాతోనా? ఏమిమాటలు?" అన్నాడు.

"ఇష్టంలేకపోయినా చెప్పక తప్పదు" జ్యోతిషుకేసి వేలెట్టి చూపించి సతీశునితో "నేను వీరికి పరమబంధువునని మీకు తప్పకుండా తెలుసు. మీరు లేచారెందుకు జ్యోతిషుబాబూ? మీరు వెళ్ళిపోతే పనెలా సాగుతుంది? నా విన్నపము మీముందు పెట్టదలచాను. మీ యిద్దరూ కూర్చోండి" అని సరోజినికేసి క్రీగంటితో చూచాడు. కాని సరోజిని అతన్ని చూడనట్టు తలవంచుకు కూర్చుంది.

శశాంకమోహనుడు ఎదురుగానున్న బల్లమీద గుద్దుతూ "ప్రేమించిన వారినిగురించి కళ్లుమూసుకొని వుదాసీనంగా వుండటం నా స్వభావంకాదు. అందుచేత ఇతని రహస్యవృత్తాంతం విని- అది మంచిదికాదని మనసులో అనుకున్నాను. సతీశబాబుగారి ఏకాంతవాసాన్ని గురించి తెలుసుకోవాలి. మీకు బహుశా కోపంవస్తుందేమో సతీశబాబూ! కాని నేను నా స్వభావానికి విరుద్ధంగా నడువలేను. ఏమంటావు జ్యోతిష్ బాబు?" అన్నాడు.

జ్యోతిష్ తలవంచుకొని మెదలకుండా కూర్చున్నాడు. సతీశుడుకూడా మెదలకుండా చూస్తూవుండిపోయాడు.

శ్రోతలందరి మౌనంలో శశాంక మోహనుని వుత్తేజనకూడా దానంతటదే తగ్గిపోయింది. అతను మరింత కుంశయకంఠంతో "జ్యోతిష్ నాకు పరమ బంధువు. అందుచేత నేను మిమ్మల్ని ఏమైనా అడగటానికి అధికారముంది. మీకు తెలుసుగా.........?" అన్నాడు.

మధ్యలోనే సతీశుడు తల పంకించి "నాకు చుట్టరికం సంగతి తెలియదు. కాని మీ ప్రశ్న ఏమిటో అడగండి" అన్నాడు.

శశాంక మోహనుడు గొంతు సరిజేసుకొని "ముందు మీరు ఇక్కడికి వచ్చినకారణం నేను తెలుసుకోదలచాను" అన్నాడు.

"తమరు ఇంకేమైనా అడగదలచారా?" అన్నాడు సతీశుడు.

కొంచెం కుంఠితుడై జ్యోతిష్ మొహంకేసి చూచి "కలకత్తాలో సతీశ బాబు మకాం తెలుసుకోటానికి నేనెంతో కష్టపడవలసి వచ్చింది రాఘవ బాబును మీరెరుగున్నారా? అతను చెప్పాడు........" అని ఏదో చెప్ప సాగాడు. సతీశుని కళ్ళురెండూ నిప్పుముద్దలైనాయి. "రాఘవబాబు వల్ల కాదుగాను మీరు మీ సంగతి చెప్పండి" అన్నాడు.

ఈసారి జ్యోతిష్ తలెత్తి "నా బలవంతంవల్ల శశాంక మోహనుడు మిమ్మల్ని విషయా లడుగుతున్నాడు సతీశబాబూ! మీకు ఇష్టంలేకపోతే సమాధానం ఇవ్వకుండా వుండురుగాని, అతన్ని అవమానంమాత్రం చెయ్యకండి. మీ పూర్వ చరిత్రనుబట్టి చూస్తే మిమ్మల్ని ఇంకేమి అడగవలసిన అవసరం లేదు. కాని మా అమ్మ మూలకంగా మీ నోటివెంట ఒకసారి చెప్పించుకోన వలసిన అవసరమొచ్చింది. సరే, నేనే అడుగుతాను. సావిత్రి ఎవరు? ఆమెతో మీకున్న సంబంధం ఎలాంటిది?" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు కదలకుండా వూరుకొని తర్వాత "సావిత్రి ఎవరో నాకు తెలియదు. ఆమెతో నా సంబంధం ఎలాంటిదో, దీనికి సమాధానం ఇచ్చే అవసరంకూడా లేదనుకుంటున్నాను" అన్నాడు.

"ఎందుకని?"

"చెప్పినా మీరు అర్థం చేసుకోలేరు కాబట్టి."

"కాని మేము తెలుసుకోవటం చాల అవసరం. సరే, ఆమెను ఎక్కడ తీసుకొచ్చి వుంచావో చెబితే బహుశా మేము అర్థం చేసుకుంటామేమో"

సతీశుడు జ్యోతిష్ కేసి కళ్లెర్రజేసి చూచి శాంతంగా "జ్యోతిష్‌బాబూ! ఏనాడు నేను మీ దయాదాక్షిణ్యాలకోసం మీతో సంబంధం పెట్టుకోటానికి ప్రయత్నించలేదు. అనవసరమైన ప్రసంగాన్ని పెంచే అవసరంకూడా కనిపించటంలేదు. కాని మీరు అడిగిన వుద్దేశం నేను గ్రహించాను. అందుచేత మీరు తెలుసుకోదలచుకున్న విషయమంతా నేనే స్వయంగా చెబుతాను. సావిత్రి ఎక్కడికి వెళ్ళిందో-ఆ సంగతి నాకు తెలియదు. ఆ సంగతి మీకెందుకు? ఆ సంగతులన్నీ అనవసరం. సావిత్రి ఎవరైనా, తనబుద్ధిపూర్వకంగా నన్ను విడచి వెళ్ళిపోక పోయినట్లయితే, ఆమె బ్రతికివున్నంతవరకు నెత్తిమీద పెట్టుకొనేవాణ్ణి! ఈ సంగతి మీ ముందేకాదు, సమస్తప్రపంచంముందు అంగీకరించటానికికూడా నేనేమీ సిగ్గుపడను. మీ కడిగేది ఇంకేమీ లేదనుకుంటున్నాను. వున్నా నేను జవాబు చెప్పలేను" అన్నాడు.

కుండ బద్దలుగొట్టినట్లు చెప్పిన సతీశుని సమాధానం చూచి అందరూ నిశ్చేష్టులై రాతిబొమ్మల్లాగ కూర్చుని వుండిపోయారు. జ్యోతిష్ చాలసేపటివరకు స్తంభితుడైకూర్చునివుండి ప్రయత్నంతో సంభాళించుకొని తలకాయతిప్పి "మేము మిమ్మల నడిగేది ఇంకేమీలేదు. వున్నదికాస్తా వుపేంద్రుని సమాధానంలో పూర్తవుతుంది" అని అతను కవరులోంచి తంతితీసి సతీశునిముందుకు విసిరివేశాడు.

"వుపేంద్రబాబుఏమంతా? ఏది చూస్తాను?" అని సతీశుడు ఆతురతతో కాగితం తీసుకున్నాడు. అంతా చదివి, కాగితం తిప్పి యిచ్చేసి కొంచెంసేపు మెదలకుండా వూరుకున్నాడు. తర్వాత ఒకదీర్ఘ నిశ్వాసం విడిచి "అంతా యథార్థమే. మా ఉపేంద్రబాబు ఎప్పుడూ అబద్ధమాడడు. నిజంగానే నేను మంచివాణ్ణి కాదు. నిజంగానే నాతో ఎవరికీ ఎలాంటి సంబంధం వుండటం మంచిదికాదు. నేనుకూడా స్వయంగా ఈ విషయమే ఆలోచించాను" అంటూ వుండగానే ఏదో మంత్రబలంతో అతని గొంతు నిండుకొచ్చింది. కాని ఎవరూ ఏమీ మాట్లాడలేదు. సతీశుడుకూడా స్తబ్ధుడై కూర్చున్నాడు. కాని మళ్ళీ వెంటనే అతని స్థిరహృదయంలోని ఒక దీర్ఘ నిశ్వాసంతోపాటు

ఒక జటిలసమస్య వచ్చిపడింది. నిన్న ప్రొద్దున జగత్తారిణి విందుకు పిలిచి నప్పుడు ఎన్నో ఆలోచనలు అతని మనసులోకొచ్చాయి. సరోజినిని పొందా లన్న ఆ కాంక్ష మొట్టమొదటగా అతని హృదయంలో ఎప్పుడు కలిగిందో అతనికిప్పుడు జ్ఞాపకంలేదు. కాని అంతర్యంలో ఆమెయందు ఆ కాంక్ష గుప్తంగా వుంటూవచ్చింది. కాని అలా ఎందుకు జరిగింది? ఏ సముద్రమథనంలో ఈ అమృతం పుట్టింది? ఈ వ్యతిరేకసమాజ శాసనంలో నేను ఈ అమృతం తెచ్చు కుని ఏమిచెయ్యాను? ఎక్కడవుంచను? ఎలా గ్రహించను? మథితసముద్రాన్ని ఎలా శాంతింపర్చను? చాల రోజులనుండి ఈ చింత లోలోన నన్నెందుకు పీడిస్తూవుంది? సావిత్రిని పోగొట్టుకున్నప్పుడు యువతి మనసును పొందటం ఒక ఎత్తు, దానిని వ్యవహరించటం మరొక ఎత్తు-అని తెలుసుకున్నాను. ప్రాప్తించే పని స్త్రీ-పురుషుల హృదయాలలో రహస్యంగా పూర్తవుతున్నప్పుడు బైట వారికి అంతు వుండదు. పొందేవాడు సర్వాధీనమైపోయినప్పుడు-ఆమెకు చెప్పకుండా ఒక్క అడుగుకూడా ముందుకువేయలేనిరోజు చాల దుఃఖ ప్రదంగా వుంటుంది అలాంటి వస్తువును పొందటం ఎంతకష్టమో ఈ విష యాన్ని గురించి బైటవారు ఆలోచించరు. కేవలం శాస్త్రాలు, సంఘము, లోకాచారాలను పట్టుకొని గల్లంతుచేస్తూ తిరుగుతారు, బాధిస్తారు. అలా చేయటం వారికవసరమున్నట్టు. సరోజినిని పొందాలన్న కోర్కె సతీశుని హృదయంలో కలగకపోతే ఈ చింత వారి హృదయాలలో శూలాలలాగ వచ్చి గుచ్చుకునేది".

నాకు వ్యతిరేకమైన సమాజమూ, నన్ను కోరని సమాజము నాకు ఏ ఆశతో నూడిమొకంతచోటు యివ్వటానికి అంగీకరిస్తుంది?

నిన్నకూడా వృద్ధతండ్రి విచారపడటం జ్ఞాపకమొచ్చింది. ఉపేంద్ర బాబు గారింటి భట్టాచార్యులు తీవ్రస్వరముతో అనేకసార్లు నా చెవులకు చిల్లు లొడిచాడు. మిత్రులు-శత్రువులు తల వూగించటం నా హృదయానికి చాల బాధ కలిగింది. అప్పుడుకూడా ఈ శత్రుపక్షపు సమిష్టి వ్యతిరేకం, అవమానకరమైన వ్యవహారాలమధ్యకూడా సరోజినీమోహనవదనమే నన్ను బలవంతుణ్ణి, శక్తివంతుణ్ణి చేసింది. కాని ఇప్పుడు, ఇవ్వాళ నాకేం భయం లేదు. ఒక్కరోజులోనే అనాలోచితంగానే ముడులన్నీ విడిపోయాయి. విపత్తి తొలగిపోయింది!

ఈ విషయాలు ఆలోచిస్తూ వుండగానే అతను త్రుళ్ళిపడి కళ్ళుపైకెత్తి చూచాడు. అంతా తలలొంచుకొని మెదలకుండా అలాగే కూర్చున్నారు. సరోజిని మొహంకేసి ఆశాపూరిత నేత్రాలతో చూశాడు. కాని అక్కడ కూడా ఏ భావమూ కనపడలేదు! అప్పుడు ఆమెను సంబోధించి "నువ్వు ఆ రోజున కలకత్తాలో మా యింటివద్ద ఆరేసివుండగా చూచిన చీర సావిత్రిదే. ఆ రోజుసంగతులన్నీ చెబుదా మనుకున్నాను. కాని, అలాంటి సదవకాశం ఎప్పుడూ కలగలేదు, ధైర్యంకూడా లేకపోయింది" అన్నాడు.

అతను లేచి నుంచుని "తప్పు నాదేనని-నాకు తెలుసు, జ్యోతిష్‌బాబూ! అందుచేత నా మనసు అశాంతిగావున్నది." మళ్ళా కొంచెంసేపు ఆగి "నేను ఏ విషయంలోను ఎవరినీ మోసంచెయ్యలేదు. మోసం చెయ్యాలన్న సంకల్పం కూడాలేదు అంతే, ఇక నేనుచెప్పేది ఏమీలేదు" అన్నాడు.

జ్యోతిష్ తల పైకెత్తి ఏదో చెప్పబోయాడు కాని నోట మాట రాలేదు.

సతీశుడుకూడా ఒక దీర్ఘ నిట్టూర్పు విడచి "నేను వెళుతున్నాను. నన్ను గురించి ఆలోచిస్తూ మీ బుర్రలు పాడుచేసుకో వద్దని నా ప్రార్థన. నేనే వంకతోకూడా మళ్ళీ మీ ఎదుటకు రాను. మీరు నన్ను మర్చిపోండి" అని అతను మెల్లగా బైటికి వెళ్ళిపోయాడు.

జ్యోతిష్ తలెత్తి చూచాడు. సరోజిని తలవంచుకు కూర్చుంది. "సరోజినీ! సరోజినీ" అని అతను పిలవగానే సరోజిని మూర్ఛిలి కుర్చీమీదనుంచి కింద పడిపోయింది.

అభిమానావమానక్రోధాలతో జ్యోతిష్‌ని బుద్ధి ఆ సంగతికూడా తెలుసుకోనంత మందగించింది. చాలసేపు శుశ్రూషచేసినతర్వాత సరోజినికి తెలివి వచ్చి తడబడుతూ తన గదిలోనికి వెళ్ళిపోయి నప్పుడు జ్యోతిష్ నెత్తి మీద ఒక వజ్రాఘాతం పడినట్లయింది.

"చెల్లెల్ని జ్యోతిష్ ప్రాణపదంగా ప్రేమిస్తాడు. సర్వాంగ సుందర లావణ్యవతి, సుశిక్షితురాలైన చెల్లెలి ఆత్మమర్యాదా జ్ఞానమునందుకూడా అతనికి పూర్తి నమ్మకముంది. కాని లోలోన ఇంత ప్రేమించ గలుగుతుందని గానీ, తన గుణగౌరవాలను మరచి అలాంటి హీనచరిత్రునికి సర్వస్వం అర్పించి

ఇలా మూర్ఛిలి పడిపోతుందనిగానీ అతను స్వప్నంలోకూడా అనుకోలేదు. ఆమె ముహంమీద జీర్ణించిపోయిన వ్యధ ఎంత గాఢమైందో నిరూపించే శక్తికూడా అతనిలో లేకపోయింది. అతను చాలసేపటివరకు శిలలాగ కూర్చుని వుండిపోయాడు. తర్వాత శశాంకమోహనునికేసి చూచి "మీరు ఈ రాత్రి బండికే వెళతారా కలకత్తా?" అన్నాడు.

"లేదు, అక్కడ అంత అవసరమైన పనేమీలేదు" అన్నాడు శశాంకుడు.

జ్యోతిష్ ఇంకే ప్రశ్న వెయ్యకుండా లేచి తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకొని పడుకున్నాడు. ఆ రాత్రి శశాంకమోహనుడు ఒక్కడే కూర్చుని భోజనం చెయ్యవలసి వచ్చింది.

జగత్తారిణి కొడుకు నోటివెంట సంగతులన్నీ విని నిట్టూర్పు విడచి చాలసేపటివరకు స్తబ్ధురాలై కూర్చుంది. తర్వాత "ఇదంతా నా రాత!" అని పోయినభర్తను తలచుకొని "వారుండగనే నేను మాడి చచ్చాను. ఇప్పుడు ఇంకా అనేది ఏముంది? మీ మూలకంగా మాడకపోతే ఇంకా పాపానికి ప్రాయశ్చిత్త మెక్కడ! సరేనాయనా! నీకు నచ్చినచోటే చెయ్యి చెల్లెలి పెళ్ళి. నేనేమీ మాట్లాడను" అని ఆమె ఒక నిట్టూర్పువిడచి "అందుకనే తలవని తలంపుగా అతని రాకచూచి నా గుండె కొట్టుకుంది" అన్నది.

కాని జ్యోతిష్ ఏమీ సమాధానమివ్వలేదు. ఈ పని అంత తేలికకాదు. అయిందేదో అయిపోయిందని వుపేక్షించి వూరుకుంటే కుదరదని అతను బాగా గ్రహించాడు. ఏనాడైనా ఈ హీనచరిత్రునివద్దకు స్వయంగా తాను వెళ్ళి బతిమాలి తిప్పి తీసుకురావలసి వస్తుంది.

నిన్న పగలంతా సరోజిని ఇంట్లోంచి బైటికి రాలేదు. ఇవ్వాళ సాయంత్రం కాఫీత్రాగటానికి బైటగదిలోకి వచ్చేప్పటికి ఆమె శశాంకమోహనునితో మాట్లాడుతూండటం కనపడింది. చెల్లెలి మొహం చూచి అతని హృదయంలోంచి ఒకవిధమైన భారం తగ్గినట్లయింది.

కాఫీ త్రాగిన తర్వాతకూడా కొంచెంసేపు సంభాషణ జరిగింది. కాని ఎవరూ ఆనాటి ప్రసంగం తీసుకురాలేదు. సాయంత్రం చెల్లెలు కొంచెం నిశ్చింతగా వుండటం చూచి ఆరోజు ఘటననుబట్టి కథ అనుకున్నంతదూరం

పోలేదనీ కొద్దిరోజులలోనే మళ్ళీ అంతా కుదటపడుతుందనీ అనుకున్నాడు జ్యోతిష్.

ఆ రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు స్నేహితు లిద్దరూ మాట్లాడుకుంటూ కూర్చున్నారు. జ్యోతిష్ తన ఆశావిషయం సూచించడానికికూడా ఏమీ వెనుకాడలేదు.

సరోజిని తన ఆంతరంగిక ప్రేమకు తగిలిన ప్రథమాఘాతాన్ని తట్టుకున్న తర్వాత సతీశుని దుష్టాచరణతో శశాంకుని గుణశీలాలు తప్పకుండా సరిపోల్చుకుంటుందన్న విషయంలో ఇద్దరూ ఏకాభిప్రాయానికి వచ్చారు.

మర్నాడు రెండు ఝాములకు భోజనమైనతర్వాత సరోజిని పై గదిలో కిటికీవద్ద ఒక కుర్చీ వేసుకుని బజారుకేసి చూస్తూ కూర్చుంది. ఒక సామానుబండి వెనుక యిద్దరు మనుష్యులు రొమ్ములు చాచుకు నడచి వస్తున్నట్టు కనపడ్డారు. వారిలో ఒకడు బిహారి. సరోజిని లేచి కిటికీ చువ్వలు పట్టుకు నుంచుని జాగ్రత్తగా చూచింది. బండి క్రమంగా కిటికీ దిన్నగా వచ్చింది. ఒక మనిషి తల పైకెత్తి కిటికీకేసి చూచాడు. చూడగానే అతను బిహారీయని స్పష్టంగా తెలిసి చేతితో సైగచేసి అతన్ని పిలచింది. బిహారి తన వెంట వస్తున్న వానిని సాగి పదమని గొడుగుమూసి కిటికీకిందకు వచ్చి నుంచున్నాడు. "వాకిటివద్దనే మెట్లున్నాయి, పైకిరా బిహారి" అన్నది సరోజిని. అప్పుడు ఇంట్లోవారంతా నిద్రపోతున్నారు. బిహారి వెంటనే మెట్లెక్కి గదిలోకి వెళ్ళి సరోజినికి నమస్కరించాడు.

సరోజిని మనసులో అతన్ని ఆశీర్వదించి "మీకు రాత్రి పదకొండు గంటలకుగాని బండిదొరకదు. ఇంకా చాలా సమయముంది. మాటమనిషికూడా వెంటవున్నాడు. సామాను అతను దింపిస్తాడులే, నువ్వు కొంచెంసేపు కూర్చో" అన్నది. సతీశుడు ఇక్కడనుండి ఎక్కడికో వెళ్ళిపోతున్నాడని సరోజిని అడగకుండానే తెలుసుకొంది.

బిహారి పైపంచ చెంగుతో మొహాన పోసిన చెమట తుడుచుకొని చాప మీద కూర్చున్నాడు.

సరోజిని కొంచెంసేపటివరకు మెదలకుండా వూరుకొని "బిహారీ, నువ్వు బ్రాహ్మణస్త్రీముందు ఎప్పుడూ అబద్ధమాడవుగా!" అన్నది.

బిహారీ నాలుక కొరుక్కొని "అలాచేస్తే నా బ్రతుకెందుకు? ఏడు జన్మాలు కాశీలో వున్నా పాపంపోదు" అన్నాడు.

సరోజిని స్నిగ్ధదృష్టితో ఆ పల్లెటూరి ధర్మభీరువైన వృద్ధుమొహంకేసి చిరునవ్వుతో చూచి "నువ్వు ఎప్పుడూ అబద్ధమాడవని తెలిసే అడిగాను బిహారీ! నువ్వు ఎవరితోనూ చెప్పవుగదా?" అన్నది.

"నాకు ఎవరితోనో చెప్పే అవసరమేమిటి అమ్మా!" అన్నాడు బిహారి.

సరోజిని గొంతు తడిచేసుకొని "అయితే, సావిత్రి ఎవరు బిహారీ? అన్నది.

బిహారి సరోజిని మొహంకేసి చూచి "సావిత్రి, మా సావిత్రా! ఆమెను నేను నా బిడ్డలాగ భావించి తల్లిలాగ ఆదరించాను. నువ్వు ఆమె సంగతేగా అడిగేది తల్లీ! ఆమె ఏ శాపంవల్ల భూమిమీద జన్మించి ఇంత దుఃఖపడుతూ వుందో తెలియదు. ఆహా! ఆమె సాక్షాత్ లక్ష్మీస్వరూపము" అన్నాడు.

చాలాకాలమైంది. ఈ మధ్య బిహారికి సావిత్రిపేరు తలచే అవసరం కూడా లేకపోయింది. ఆమెపేరు జ్ఞప్తికి రాగానే బిహారి కళ్ళల్లో నీరు తిరిగాయి.

బిహారి చేత్తో కళ్ళు తుడుచుకొని "మా తల్లి సావిత్రి, రాఘవబాబు గారి మెస్సులో పనికత్తెగా వచ్చింది. ఆమె ముందు అందరినోళ్ళూ కట్టుబడి పోయినాయి. ఒక స్వర్గీయానందం ఆమె మొహంమీద ఎప్పుడూ నాట్యం చేస్తూ వుండేది. రాఘవబాబు మేనేజరు, నేను నౌకర్ని. కాని సావిత్రికి అందరూ సమానులే. అందర్నీ సమానభావంతోనే చూస్తూ వుండేది. ఏకాదశి రోజున ఉపవాస ముండేది. కాని ఆమె మొహం ఎప్పుడూ వాడిపోయినట్టు కనపడేదికాదు" అన్నాడు.

నిట్టూర్పుతో మాట్లాడుతున్న మాటలనుబట్టి వృద్ధుకు ఆమెయందువున్న భక్తి అనురాగాలనుచూచి సరోజిని ముగ్ధురాలైపోయింది. ఆమె ఈర్ష్యాజ్వాల ఒక్కసారి కరిగి సగం చల్లబడిపోయింది. "ఏదో అపరాధానికి విష్ణుఅనుజ్ఞ ప్రకారం లక్ష్మీదేవి సేవికావృత్తి చేయవలసివచ్చిందని పురాణంలో రాసివుంది. మా సావిత్రికూడా ఏదో పాపంచేసుకొని ఆ నౌకరీ చేసుకోడానికి వచ్చింది.

అనేకవిధాలైన దుఃఖాలు సహించి చివరికి వెళ్ళిపోయిందికూడా-వెళ్ళిపోయిన రోజున నాకు ఇవ్వాళకూడా తలపుకువస్తూవుంటుంది" అన్నాడు బిహారి.

సరోజిని మెల్లగా "ఇప్పుడు-ఎక్కడవుంది బిహారి?" అన్నది.

బిహారి ఈ ప్రశ్నకు ఒక్కసారి సమాధాన మివ్వలేక ఆమె మొహం కేసి చూస్తూ వూరుకున్నాడు.

"తెలియదా ఏమిటి బిహారీ?" సరోజిని మళ్ళా అడిగింది.

బిహారి ఈసారి తలకాయవూగించి "సరిగా తెలియదు గాని కొంత వరకు ఎరుగున్నాను. ఆమెసంగతి ఎవరికీ చెప్పవద్దని వట్టువేయించుకు పోయింది."

"ఎందుకని చెప్పవద్దన్నది?" అడిగింది సరోజిని.

ఎందుకు చెప్పవద్దన్నదో ఆ విషయం బిహారీకికూడా ఒక సమస్య రైపోయింది. ఈ విషయంలో అతను చాలా ఆలోచించాడుకాని, ఏ నిశ్చయానికి రాలేకపోయాడు. అయినా ఎప్పుడూ ఈ నిషేధాన్ని పాలించి నడవాలి. సావిత్రి ఎలాంటిదో, జీవితం ఎలా గడుపుతూవుందో, ఏ అంతూ తెలియకపోవటం, ఆమెమళ్ళా కంటికి కనపడకపోవటం, ఇవన్నీ బిహారీకి ఎంత దుస్సహంగా వున్నాయో స్వయంగా అతనికే తెలుసు. సతీశుడు సావిత్రి మీద నీలాపనిందలు వేస్తున్నప్పుడు ఆవేగంతో చెప్పా లనిపిస్తూవుండేది. కాని, ఇంతవరకు సావిత్రికి యిచ్చిన మాటను దాటలేదు. ఆమె యథార్థవిషయం సతీశునికి చెప్పలేదు. ఏరోజునైనా అసహ్యాత తోచినప్పుడు-సావిత్రి నిరప రాధియైకూడా ఇంత కలంకాన్ని మెదలకుండా సహించినప్పుడు-తనకు తెలియ కుండా దాని అంతర్యంలో ఏదో వుంటుందని అనుకుంటూ వుండేవాడు. సావిత్రియందు అతనికి అమితమైన భక్తివిశ్వాసా లున్నాయి. కాని ప్రేమ పాత్రురాలైన ఒక బాలిక ఈ సంగతులన్నీ తెలుసుకోవాలని కుతూహల పడుతున్నప్పుడు - అతనుకూడా చెప్పటానికి ఆతురతపడ్డాడు. కొంచెంసేపు మెదలకుండావుండి "నువ్వు మా బాబుగారికి చెప్పకుండావుంటే చెబుతాను అమ్మా!" అన్నాడు.

సరోజిని మనసులో చాల ఆశ్చర్యపడింది. బిహారికి తెలిసింది సతీశునికి తెలియదు. అతనికే చెప్పవద్దని సావిత్రి నిషేధం. దీనికి కారణ మేమిటో ఆమె తెలుసుకోలేకపోయింది.

"నేను ఎవరితోనూ చెప్పను. చెప్పు బిహారీ!" అన్నది.

బిహారి కొంచెంసేపు మెదలకుండా వుండి దానివల్ల ఆడితప్పిన పాపం కలుగుతుందనే సందేహంతో మెల్లగా చెప్పసాగాడు. డాక్టరీ చదవటానికివచ్చి మొట్టమొదట సతీశుడు రాఘవబాబు మెస్సులో చేరినదగ్గరనుంచి ఈ నిర్జన ప్రదేశం వచ్చినుందేవరకు జరిగిన కథంతా చెప్పాడు.

సావిత్రి సతీశుని ప్రాణంతో సమానంగా ప్రేమిస్తుంది. ఆ కారణంవల్లే రాఘవుడు మండిపడి పోట్లాట పెట్టుకున్నాడు. అతనే సతీశుడు మెస్సు వదలి వెళ్ళిపోటానికి బాధ్యు డయ్యాడు. సతీశుడు అప్పుడు సారాయి త్రాగుతూ వుండేవాడు - ఆదిగాగల విషయాలలో బిహారి సరోజినిముందు ఏమీ దాచలేదు.

సరోజిని మంత్రముగ్ధురాలులాగ అంతా వింటూ కూర్చుంది. బహుశా అలాంటి ఏకాగ్రచిత్తంతో అలా ధ్యానంతో ఎవరూ ఎప్పుడూ ఎవరిమాటలూ విని వుండరు. సతీశుని గురించి శశాంకమోహనునికి చెప్పిన రాఘవుని చరిత్ర కూడా ఇవ్వాళే సరోజినికి తలవని తలంపుగా తెలిసింది.

సావిత్రి ఇల్లు ఎక్కడో ఆమె కన్నవారి, అత్తవారి పరిచయ మేమిటో సతీశునికి తెలియకపోయినా "ఆమె బ్రాహ్మణ యువతి, విధవ, అంద మైంది, బాగా చదువుకుంది. దురదృష్టంకొద్దీ నౌకరి చేసుకోటానికి వచ్చింది" అని బాబుగారు ఆమెను అంత ప్రేమించినా పులిముందు మేకలాగ భయ పడుతూ వుండేవాడు. త్రాగి మెస్సులోకి రావటానికి అతనికి ధైర్యముండేది కాదు. విపిన్ అనేవాని స్నేహానపడి తిరుగకూడనిచోట తిరుగుతూ, పోగూ డని చోటుకు పోతూ వుండే వాడు. ఈసంగతి సావిత్రికి తెలియగానే అతను అక్కడికి రావటం బందై పోయింది. సావిత్రిమాట దాటి అక్కడికి వెళ్ల టానికి ధైర్యం లేకపోయింది" అని బిహారి సగర్వంగా సరోజిని మొహంకేసి చూచాడు.

సతీశునిమీద ఒక స్త్రీకి అంత అధికారం వుందన్న విషయం సరోజిని హృదయంలో శూలంలాగ గుచ్చుకొంది. ఆమె మెల్లగా "అయితే బిహారీ, సతీశబాబు ఆమెఅంటే అంత భయపడటానికి కారణం?" అన్నది. దానికి సమాధానంగా "ఆమె చాలచుముక్కైంది. బాబుగారే కాదు, మెస్సువారంతా ఆమెకు భయపడేవారు. ఆమె మెస్సులోనుంచి వెళ్ళిపోయే రోజున సతీశుడు తప్ప తాగి తూలుతూ లేస్తూ మెస్సులో అడుగు పెట్టగానే సావిత్రి లోపలవుందని విని భయంతో చేతిలో సీసా బైట పారేశాడు" అన్నాడు బిహారి.

సరోజిని కొంచెంసేపు ఆగి "సతీశబాబు ఇప్పుడుకూడా తాగుతున్నాడా బిహారీ?" అన్నది.

బిహారి తలకాయతిప్పి "లేదుకాని, మళ్లా మొదలెట్టటం ఎంతసేపు? రెండురోజులనుండీ నేను ఇదే ఆలోచిస్తూవున్నాను - ఈ దుస్సమయంలో సావిత్రి ఒకసారివస్తే చాలాబాగుండేది అని" అన్నాడు.

సరోజిని వుత్సుకురాలై "ఎందుకు అలా అనుకుంటున్నావు బిహారీ?" అన్నది.

"నేనుచాలాకాలంనుండి చూస్తున్నాను. మనసు ఖరాబైతేనే త్రాగుడు మొదలెడతాడు. సతీశబాబు వుపేంద్రబాబుకి భయపడుతూ వుండేవాడు. అతనితోకూడా ఏమైందో తెలియదు. ఆరోజురాత్రి ఇంట్లో అడుగుపెట్టగానే సావిత్రి కంటపడింది. వారువెంటనే తిరిగి వెళ్లిపోయారు. తర్వాత ఒకరికొకరు తలవటంలేదు. ఆమెతప్ప బాబును అదుపులో పెట్టగలవారెవరో నువ్వే చెప్పమ్మా?" అన్నాడు బిహారి.

కొంచెం ఆగి బిహారిమళ్లా "జబ్బుసంగతి విని బాబుగారు ఈ అయిదారు రోజులు ఎలా గడిపాడో నాకళ్లతో స్వయంగా చూచాను. మొన్న నిద్ర మొహానేవచ్చిన తంతిమాడగానే ముసుకుపెట్టి పడుకున్నాడు. పండుకున్నట్టే వుండిపోయాడు. తర్వాత నన్ను వెనకసామాను వేసుకురమ్మని రాత్రిబండికి ఇంటికి వెళ్ళిపోయాడు" అన్నాడు.

సరోజిని వ్యాకులపడి "ఎవరికిజబ్బు చేసింది బిహారీ?" అన్నది.

బిహారి ఆశ్చర్యంతో "ఇక్కడినుంచి వెళ్ళేప్పుడు బాబుగారు మీతో ఏమీ చెప్పిపోలేదూ?" అన్నాడు.

సరోజిని తలకాయ తిప్పి "లేదు, జబ్బు ఎవరికి?" అన్నది.

బిహారి దీర్ఘమైన నిట్టూర్పు విడచి "పొరపాటున తిన్నగా వెళ్ళి పోయి వుంటాడు, ఈ ఇంటికి రాకుండా. ఇక్కడనుండి విందు చెప్పిరమ్మని గుమాస్తాని పంపిన రోజునే తండ్రికి జబ్బుగా వుందని ఇంటి దగ్గర నుంచి వుత్తరం వచ్చింది. అందుచేత భోజనానికి రాలేక పోయాడు. తంతి యిచ్చి సమాధానంకోసం పగల్లా పోస్టాఫీసు దగ్గర కూర్చున్నాడు. కాని ఏకబురూ రాలేదు. అటుపిమ్మట మొన్ననే చివరికబురు వచ్చింది. రాత్రిబండికి ఇంటికి వెళ్లిపోయారు" అన్నాడు.

సరోజిని త్రుళ్లిపడి "సతీశబాబు తండ్రి చనిపోయాడా?" అన్నది.

"అవునమ్మా"

"ఏం జబ్బు?"

"జబ్బేముంది? పెద్దతనం" అని బిహారి కళ్ళుతుడుచుకొని "మరెందుకూ చింతలేదు గాని తల్లీ! తండ్రి పోయిన తర్వాత సతీశబాబుకు - తనవారనుకొనేవారు ఎవరూ లేరనే చింత, ఇకనుండీ ఏమి తలపెడతాడో నని రెండు రోజులనుండి ఆలోచిస్తున్నాను" అని వృద్ధు పైపంచెకొంగుతో మళ్లా కన్నీటికళ్లను తుడుచుకున్నాడు. సరోజిని కళ్లల్లో నీళ్ళు తిరిగినాయి. "ఇక నుండి సతీశుడు బాగుపడవచ్చునేమో! చెడుదారి తొక్కుతాడని నీకు భయమెందుకు బిహారీ?" అన్నది ఆమె.

బిహారి పరధ్యానంగా "ఏమో నమ్మా" అని తర్వాత తలెత్తి "నీ వాక్కు వలనను బాబుగారు నరే చెడుదారి తొక్కకుండా - బాగు పడనీ" అన్నాడు. వెళ్ళేప్పుడు "పోనీ ఒకవిధంగా మంచే జరిగింది. లోకంలో ఇంకెవరికోసమూ చింతపడ నవసరంలేదు. నీతో నిజం చెబుతున్నాను తల్లీ! ఆ కబురు విన్నదగ్గరనుండీ గుండెల్లో పికరగా వుంది. ఇక చేతిలోకి అంతులేని డబ్బు వస్తుంది. బాబుగారి స్నేహితులుకూడా సుస్వభావులు కాదు. చెడుదారిని పోనీకుండా ఇక ఆపేదిఎవరు? ఆమె ఒక్కతే వుంది!" అని బిహారి మళ్ళా ఒకసారి సరోజిని హృదయాన్ని గాయపర్చాడు.

సరోజిని బాధను సహించి మృదుస్వరంతో "అయితే ఆమెను రమ్మని వుత్తరం రాయకూడదు. బిహారి?" అన్నది.

"జాడ తెలియదు. ఒక్కసారి కాశీ వెళ్ళగలిగితే ఏదోవిధంగా అంతు కనుక్కువస్తాను. కాని నాకు అంత తీరిక ఎక్కడ? బాబుగారిని ఒంటరిగా వదిలి వెళ్ళటానికి మనసొప్పటంలేదు. అదీగాక ఎప్పుడూ కాశీ వెళ్ళలేదు. పట్నంసంగతి నాకేమీ తెలియదు" అని నిరుపాయునిలాగ సరోజిని మొహం కేసి చూచాడు. కాని సరోజిని ఏమీ మాట్లాడలేదు.

"సరే, ఇక వెళతాను" అని బిహారి సరోజినికి నమస్కరించి గదిలోంచి బైటకువచ్చాడు-కాని మళ్ళా వెంటనే వెనక్కితిరిగివచ్చి చేతులుజోడించి సరోజిని ఎదుటకువచ్చి నుంచున్నాడు.

"ఏమిటి బిహారి?" అన్నది సరోజిని.

"ఒక మనవి."

బిహారి అలాగే చేతులు జోడించి వినయంగా "నేను పల్లెటూరి వెట్టిగొల్లను. అయినా పెద్దవాణ్ణి! ఇంతసేపటినుండి మాట్లాడిన దానిలో పొరపాట్లుగానీ, కటుత్వంగానీ వుంటే క్షమించండి" అన్నాడు.

సరోజిని కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. కాని ప్రయత్నపూర్వకంగా, ఆపుకొని "సరే" అన్నది.

ఆమె నోటివెంట "సరే" అన్న శబ్దము విని బిహారి భయం పోయింది. అతను పల్లెటూరి వెట్టిగొల్ల మొదలుగా గల శబ్దాలతో తన బుద్ధిహీనతను పరిచయం చేసినప్పటికీ అతను నిర్దోషి. సరోజిని సావిత్రి సంగతు లడగటానికి బజారులోంచి ఎందుకు పిలిచిందో, ఆమె సంగతులన్నీ ఇంత ధ్యానపూర్వకంగా ఎందుకు విన్నదో-వీటి అంతర్యం ఒక్కసారి ఇప్పుడు అతనికి స్పష్టంగా తెలిసింది. ఆమె మనసులో సంగతి తెలుసుకోలేక ఇంతసేపటినుండి ఆ యువతిని వ్యథపెట్టినందుకు చాల పశ్చాత్తాపపడ్డాడు. ఈసారి బిహారి చాల కరుణస్వరంతో "బాబుగారు మీ మాటలు ఎప్పుడూ వుపేక్షించడని నాకు తెలుసు. ఇష్టమైతే బాబుగార్ని మీరుకూడా-చెడుతోవ తొక్కకుండా రక్షించవచ్చుతల్లీ! కాని నువ్వు వారిని త్యజించావని నా అంతరాత్మ చెబుతూవుంది" అన్నాడు.

బిహారి సరోజినిని 'తల్లీ!' అని సంబోధించింది ఇదే మొదటిసారి. తల్లీ అని పబ్బం గడుపుకునే పద్ధతి వృద్ధుకు బాగా తెలుసు. సరోజిని ఈ సారి

కన్నీటి ప్రవాహాన్ని ఆపుకోలేక పోయింది. రెండుకళ్లనిండా నీళ్లునిండి బలబల కారసాగినై. కాని వెంటనే తుడుచుకొని "లేదు బిహారీ! నావల్లేమీ కాదు. నేనిప్పుడు వారి విషయంలో చెయి చేసుకోలేను" అన్నది.

బిహారి తలకాయ తిప్పి "నేను నీ సేవకుణ్ణి. ఏమైనా అపరాధం జరిగి వుంటే అది నా పొరపాటని ఒప్పుకుంటాను" అని మళ్ళీ సరోజిని పాదాలకు నమస్కరించి "నువ్వు మా బాబుగారిని ఎరుగున్నావు. ఈ ఆపద సమయంలో క్రోధంతో రోషంతో నువ్వు వారిని చంపుతావా? నేను దాన్ని కళ్ళారా చూస్తూ వుంటానా? అది నా వల్లకాదు" అన్నాడు.

సరోజిని హృదయం ఒక్కసారి మైనంలాగ కరిగిపోయింది. సతీశుని క్షమించటానికి సంసిద్ధపడింది. కాని వెంటనే వృద్ధు నోటివెంట విన్న సావిత్రిని గురించిన సంగతులు జ్ఞప్తికి వచ్చాయి. ఆమె ద్రవిత హృదయం క్షణంలో శుష్కించి కఠినమైపోయింది. ఆమె తలకాయ తిప్పి ధైర్యం తెచ్చుకొని కఠిన స్వరంతో "నువ్వు భయపడ నవసరం లేదు బిహారీ, సావిత్రి రాగానే అంతా కుదట పడుతుంది. నావల్ల మీకు కలిగే వుపకార మేమీలేదు" అన్నది.

ఆమె అంత కఠినంగా సమాధాన మిస్తుందనుకోలేదు బిహారి. తన వినయ విధేయతలముందు, అంత కఠినమైన సమాధానం వచ్చేప్పటికి బిహారి ఏమీ మాట్లాడలేదు. మెదలకుండా సరోజినికి మళ్ళీ నమస్కారం చేసి బైటికి వెళ్ళిపోయాడు.

---

## 3౮

ఇంటికి వెళ్లిన తరువాత సతీశుడు 'తండ్రిగారు పోయారు, ఈ సమయంలో మనసులో అభిమానాలు పెట్టుకుకూర్చుంటే బాగుండ'దనుకొని వుపేంద్ర బాబుగారింటికెళ్లి "వుపేంద్రబాబూ! వుపేంద్రబాబూ!" అని కేక పెట్టాడు.

మహేశ్వరి సామానుగదిలో వుంది. సతీశుని కేక విని బైటికి వచ్చి అతని తండ్రిని తలచుకొని ఏడ్వసాగింది. సతీశుడుకూడా మొహం తిప్పుకుని కళ్లు తుడుచుకో సాగాడు.

చాలా సేపటివరకు కన్నీరుకార్చి గతించిన సతీశుని తండ్రి కీర్తినిగురించి స్తుతించింది. కొంచెం శాంతించిన తర్వాత "వుపేంద్రబాబు ఎక్కడ వున్నాడు?" అన్నాడు సతీశుడు.

మహేశ్వరి దుఃఖస్వరంతో "ఇక్కడ లేడు" అన్నది.

"ఎక్కడికి వెళ్లాడు? ఎప్పుడు వస్తాడు?" అన్నాడు సతీశుడు.

మహేశ్వరి కొంచెం ఆశ్చర్యంతో "నువ్వు వినలేదాఏమిటి? సురబాల జబ్బు ఎక్కువైంది. క్షయన్నాడు వైద్యుడు. ఇవ్వాళికి మూడురోజులక్రిందట ఆమెను తీసుకొని కొండకు వెళ్లాడు. కొండ వాతావరణానికి తగ్గితే తగ్గినట్టు. కాని ఆ ఆశా కనపడటం లేదు" అన్నది.

ఈకబురు విని సతీశుడు స్తంభించి పోయాడు. చిన్న వదెనకు క్షయ వచ్చింది-జీవించే ఆశలేదు. అతని మనసులో ఒక తుపానులాగ చెలరేగింది.

సురబాల జీవించకపోతే వుపేంద్రబాబు భవిష్యజ్జీవితం ఎలావుం టుందో - వాటి దృశ్యాలన్నీ బయస్కోపులో బొమ్మల్లా అతని కళ్లముందు కనపడ సాగినై.

"కన్నవా రింటికెళ్లి పదిహేనురోజు లుంది. అక్కడ నుంచి ఏమి రోగం తెచ్చిపెట్టుకుందో తెలియదు. సంసారాన్ని ఒక్కసారి ముంచింది. ఆ దురదృష్టపుది మొదట చెప్పినట్టయితే ఏమైనా ఆశవుండేదేమో! నెల, నెలా పదిహేను రోజులవరకు రోగాన్ని కప్పిపెట్టుకొని చివరికి బుటిక్కన ముం చింది" అన్నది మహేశ్వరి

సతీశుడు ఆశ్చర్యపడి "వుపేంద్రబాబుకు కూడా తెలియదా ఏమిటి?" అన్నాడు.

"తెలియదు. జ్వరం సంగతి ఆమె పూర్తిగా దాచేవుంచింది. పది రోజుల కిందట ఆమె దొంగతనం బైటపడింది" అని ఆమె మళ్ళా కన్నీరు కార్చసాగింది.

"వారి వెంట దివాకరుడు కూడా వెళ్లాడా?" అన్నాడు సతీశుడు.

మహేశ్వరి తలకాయ తిప్పి "లేదు. ఎవరూ వెళ్ళలేదు. దివాకరుడు కలకత్తాలో చదువుతున్నాడు. బహుశా అతనికి జబ్బుసంగతి కూడా తెలియ దేమో? వుపేంద్రుడి పిచ్చి పట్టు నీకూ తెలుసుగా సతీశ్. అంటురోగ

మని నన్నుకూడా వెంట రానివ్వ్యలేదు. నేను విధవరాలను. చస్తేం-బ్రతికితేం? నా ప్రాణాలకు విలువేముంది? అయినా నన్ను దగ్గరకు రావద్దని శుశ్రూషలన్నీ అతనే చేసేవాడు. అయిందేంటో అయిపోయింది. ఇప్పుడు వుపేంద్రుని దిగులుతో నాకు అన్నంకూడా సహించటంలేదు. వాడిక్కూడా జబ్బు చేస్తుందేమో నని ఘడియఘడియకూ ఆలోచిస్తూ వుంటాను" అన్నది.

వుపేంద్రుని ఇంటివద్దనుండి బైటకు వచ్చిన తర్వాత సతీశుని మనస్సు చాల కలవర పడింది. చిన్నతనం నుండీ అతను వుపేంద్రఅన్నకు ఏ విపత్తు వచ్చినా తన బలిష్ఠ భుజస్కంధాలతో సంభారం వహించడానికి ఎప్పుడూ వెనకాడలేదు. ఇవ్వాళ కూడా మహేశ్వరి ద్వారా ఈఘోరవిపత్తు సంగతి విని అలవాటుచొప్పున వుపేంద్ర అన్నదగ్గరకువెళ్ళి సేవచేద్దా మనుకున్నాడు. కాని అది అసంభవమని అతనికి మళ్లా వెంటనే జ్ఞాపక మొచ్చింది. మహామహా విపత్తుల్లో కూడా వుపేంద్రబాబు న్యాయదండం ఎటూ మొగ్గకుండా సరి సమానంగానే వుంటుంది. నా సహవాసం చెడ్డదని ఒకసారి అతను నన్ను వదిలిపెట్టిన తర్వాత ఎటువంటి సేవాశుశ్రూషలు చేస్తానన్నా మళ్ళా స్వీకరించడు.

అదీగాక క్షయరోగం వస్తే అతను దివాకరునికి కూడా కబురుచెయ్యలేదు. మహేశ్వరినికూడా వెంట తీసుకెళ్లటం మంచిది కాదనుకున్నాడు. కష్ట భారమంతా స్వయంగా వహించటానికి సిద్ధంగా వుండే సతీశుని విషయంలో తన సంకల్పం మార్చుకుంటాడా? ఈ సంగతి సతీశునికంటే మరొకరికి ఎవరికి తెలుసు? అతనికి వుపేంద్రుని వద్దకు వెళ్ళే మార్గ మేమీ కనపడటం లేదు. కాని అతని పితృశోకహృదయం జబ్బులోవున్న వదిన అనిష్టాన్ని తలచుకొని లోలోన వ్యాకులపడి విలపించ సాగింది. ఆరాటపడ సాగింది.

దారివెంట నడుస్తూవుంటే అతనికి ఏదో మహాపాపకారణంగా తన దేహాన్ని కలి ఆవహించిం దనిపించింది. అతను జాగరూకతతో వుండా లను కుంటాడు. కాని ఎక్కడికి వెళ్ళినా అతనికి సుఖశాంతులు దొరకటం లేదు. సావిత్రి తన హృదయాన్ని గాయపర్చి, సంబంధమంతా వదులుకొని కలకత్తాలో మొదటి మెస్సు వదలి మరో ఇంట్లో వుంటూవుంది. చాల రోజుల వరకు ఏ కబురూ లేదు. సావిత్రి తను ప్రేమించిన వానితో సుఖంగా జీవిస్తూ వుందనుకొని అతను తన ఆశలను, ఆకాంక్షలను అణచుకొని - ఒకవిధంగా

త్యజించి శాంతంగా జీవిస్తున్నాడు. అలాంటి సమయంలో సావిత్రి శనిగ్రహం లాగ మళ్ళా ఎక్కడనుంచో ఒకరోజున అకస్మాత్తుగా వచ్చింది. అది అతని దురదృష్టదినం! నృపేంద్రనాథునిలాంటి ప్రాణమిత్రుడూ, హితుడూ అతన్ని వదలిపోయాడు. అక్కడనుండి సంధ్యాల పరగణాలో ఏకాంతజీవితం గడుపుతున్నాడు. ఈ ఏకాంతజీవితంలో సరోజిని ఎక్కడినుంచి వచ్చి అతని నెత్తిన పడిందో తెలియదు! అక్కడ ఆ నిర్జనవాతావరణంలో కూడా అతన్ని ఆ శనిగ్రహం వదలిపెట్టలేదు. సావిత్రి చేసిపోయిన గాయం మరొకవ్యక్తి కరుణ స్పర్శతో మానుతూ వుంటే శశాంకమోహనుడు ఆ చేతినికూడా వజ్రాయుధంతో ముక్కలు చేశాడు.

ఇంటికి వెళ్ళి చూచాడు. ఇల్లంతా తండ్రి శ్రాద్ధానికి వచ్చినమిత్రబాంధవులతో నిండివుంది. ఈ వ్యథితహృదయంతో అతిథులు అభ్యాగతులతో నిండియున్న ఇంట్లో అడుగు పెట్టటానికి అతనికి ధైర్యం లేకపోయింది. గంగానది వద్దనుండి స్కూలు మైదానంవరకు వచ్చిన కాలిబాటను పట్టాడు. తన అదృష్టాన్ని ఒకసారి సింహావలోకనం చేసుకోవాలని బుద్ధిపుట్టింది

ఒకరోజున దివాకరుడు - పోయిపోయి చొక్కా చెప్పులు విడచి నారాయణ పూజ చేసిపోయిన పాతరేవువద్దకు చేరుకున్నాడు. ఆ రాళ్ళకుప్ప మీదే సతీశుడుకూడా మొదలకుండా కూర్చున్నాడు. సంధె వెన్నెలతో గంగ పువ్వులరూపం ధరించింది. అటువైపుచూచి అతను తనలో తాను 'నేను ఎవరి ఎదుట ఏమితప్పు చేసాను-వారి అభిశాపంవల్ల-నా ప్రియవస్తువుల నన్నిటి నుంచి వంచితు నవటానికి?' అనుకున్నాడు.

అతనికి సావిత్రి జ్ఞాపకమొచ్చింది. అనేకసార్లు, అనేకవిధాల ఆలోచించినా ఏ నిర్ణయమూ కాకపోయిన విషయాన్ని గురించే మళ్ళ ఒకసారి ఆలోచించాలని కూర్చున్నాడు. ఎన్నిసార్లు ఆలోచించినా అన్ని విషయాలలో నేను సావిత్రికన్న గొప్పవాడననీ, సావిత్రి చిన్నదనీ అనుకోటం అలవాటైపోయింది. మనం సతీశుణ్ణికూడా దోషి అని నిరూపించలేము. మానవుల వ్యథితహృదయాన్ని బహుశా ఈ సనాతననియమాన్నే అనుసరిస్తూ వుంటాయి.

రాత్రింబగళ్ళు ఆలోచించి కళ్ళు నలుపుకున్నా చీకట్లో కనపడనిదారి ఏదో ఒకనాడు తలవనితలంపుగా దానంతటదే కనపడుతూ వుంటుంది. సతీశు

నికికూడా ఇవ్వాళ అలాగే జరిగింది. మసకవెన్నెల వెలుగులో ఆ దరి సైకత స్థలికేసి చూస్తూచూస్తూ అతని వ్యథ ఒక్కసారి మరో ఆలోచనా మార్గంలోకి దారితీసింది. అతను మహేశ్వరివద్ద సెలవు తీసుకొని బజారులోనికి వచ్చేప్పటికి అతనికి శ్రీవాత్సవ వంటపంతులు దుఃఖితగాథ జ్ఞప్తికి వచ్చింది. దాని ప్రభావం మెల్లగా అతని హృదయంలో వ్యాపిస్తున్నట్టు అతనికి తెలియలేదు. నోటితో అతను ఎలా మాట్లాడినా దేవతలను, భూతప్రేతాలను, గ్రహాలను, ఉపగ్రహాలనూ ఎప్పుడూ నమ్ముతూవచ్చాడు. వాటికి భయపడతాడు. శ్రీవాత్సవ వంటపంతులు దౌర్భాగ్యంవల్ల కోసి వండిన చేపకూడా బ్రతికి పారిపోయిందన్న సంగతి అతనికి అకస్మాత్తుగా జ్ఞప్తికి వచ్చింది. అది చేపస్వభావమా? కాదు, అది దాహాన్నార్పే నీటి నైజమూ కాదు. దాని పెదవులకు తగిలికూడా ఎప్పుడూ దూరంగానే తొలగిపోతూ వుంటుందా?

ఈ కొత్తదారి తొక్కినతర్వాత—ఇంతకాలంవరకు తన అసమాన దుఃఖాలకు ఇతరులు కారణమనుకోటం వ్యర్థమనిపించింది. అసలు సావిత్రి తప్పేమీ లేదు; సరోజినిదీ తప్పులేదు. శశాంకమోహనునిదీ పొరపాటుకాదు. కారణం లేకుండా తన్ను పరిత్యజించిన ఉపేంద్రునికికూడా బాధ్యతలేదు. ఆఖరికి అతని కళ్ళకు పరమనీచుడు, కృతఘ్నుడైన విపినునితప్పుకూడా ఏమీ కనపడలేదు.

"ఆహా! ప్రాణాలు కుదుటపడ్డాయి' అని అతను పొంగిపోయాడు. అతని కెవరూ అపకారం చెయ్యలేదు. అతనుకూడా అసలు ఎవరికీ అపకారి కాడు. ఇది కేవలం ఏదో ఒక క్రుద్ధదేవీ ప్రకోపం. దానిమూలకంగా అతను పొరపాటున తప్పులు చేశాడు. కాని దేవీప్రకోపం శాశ్వతంకాదు. ఒక రోజున అది ప్రసన్నమౌతుంది. ఆ రోజున అందరూ అపరాధాలనన్నిటినీ మర్చిపోయి తిరిగివస్తారు. అతను ఆవేశంతో గమ్మున నీళ్ళలోదూకి చాల సేపటివరకు ఈదుతూ, కొట్టుకుంటూ అలసిపోయిన తర్వాత కొంతసేపటికి ఒడ్డుకు చేరుకున్నాడు.

ఇంటికి తిరిగి వెళ్ళేప్పటికి బిహారి వచ్చాడు. చిరునవ్వుతో "భోం చేశావా? దారిలో ఏమీ ఇబ్బంది పడలేదు గదా? వంటపంతులు ఏడి?" అన్నాడు సతీశుడు.

బిహారి యజమాని హావభావాలు చూచి ఆశ్చర్యపోయాడు. రెండు రోజుల క్రితం తండ్రి మరణవార్త విన్న దుఃఖంతో పరుగెత్తుకు వచ్చినవాడు ఇంత తొందరగా - మనసులోంచి వాటినన్నిటినీ మరచిపోతాడన్న నమ్మకం లేదు అతనికి.

ధనవంతుల బిడ్డ! తాళ్ళచేతులు చేతికొచ్చిన కులాసా అనుకున్నాడు బిహారి కొంచెంసేపు. కాని వెంటనే వ్యధపడి నాలుక కొరుక్కుంటూ "రామ! రామ! అలాంటి యజమానిని గురించి ఇలాభావిస్తే నరకంలో కూడా చోటు దొరక" దనుకున్నాడు. కాని దానికి కారణం మాత్రం తెలుసుకోలేక పోయాడు.

"వచ్చేప్పుడు ఒకసారి వారింటికి వెళ్ళిరాకపోయావు బిహారి? " అన్నాడు సతీశుడు.

"ఎవరింటికి బాబూ?" అడిగాడు బిహారి.

"జ్యోతిష్ బాబుగారి యింటికి. వచ్చేప్పుడు తొందరలో వారికి నే నీ కబురుకూడా చెప్పిరాలేకపోయాను. కొంచెం బుద్ధి వినియోగించి ఈ కబురు వారిచెవిని పడవేసివస్తే కొంత బాగుండేది!" అన్నాడు సతీశుడు.

"కబురు చెప్పివచ్చానుబాబూ!" అన్నాడు బిహారి మెల్లగా.

"చెప్పి వచ్చావా? కాని అప్పుడు ఎవరెవరు వున్నారు?విని ఏమన్నారు? అమ్మగారు చాల విచారపడి వుంటారుకాదు బిహారి?" అన్నాడు. బిహారి లోలోన వుద్విగ్నుడై"అవును బాబూ!విచారపడవలసినవిషయమే!"అన్నాడు.

సతీశునికి సరిగా అర్థంకాలేదు. సంతోషంతో తలకాయవూగించి "అలాంటి కబురువిని విచారపడకుండా ఎవరు వుండగలరు? అయితే అక్కడ ఎవరెవరు వున్నారు? ఎవరికి చెప్పావు?" అన్నాడు.

"రెండుజాము లప్పుడు వెళ్ళాను. ఎవరూ లేరు. సరోజినిఅమ్మగా రొక్కతే వుంది" అని చెప్పాడు బిహారి.

సతీశుడు మరింత కుతూహలంతో "సరోజిని ఏమంది?" అన్నాడు.

"విని చాల విచారపడింది" అన్నాడు బిహారి క్లుప్తంగా.

"కేవలం విచారపడటమేనా? నాతో ఏమీ చెప్పమని చెప్పలేదు?"

బిహారి తలకాయ తిప్పి "లేదు" అన్నాడు.

సతీశుని మొహం వుదాసీనమై పోయింది. కొంచెంసేపు మెదలకుండా వుండి "అమ్మగారినికూడా కలుసుకొని చెప్పివస్తే బాగుండేది బిహారీ! చెప్పకుండా బుర్ర వుపయోగించి నువ్వేపని చేస్తావు! అందుకనే లోకులు మీజాతిని వెర్రిగొల్లలని పేరుపెట్టి సార్థకపరిచారు. బాబుగారు తొందరలో చెప్పిపోయారో లేదో! ఒకసారి అమ్మగారిని కలుసుకుని చెప్పిపోదామన్న తెలివిలేకపోయిందా దున్నపోతా!" అని సతీశుడు వెళ్ళిపోయాడు.

బిహారికి ఇలాంటి ఆదరసత్కారాలను పొందటం అలవాటై పోయింది. అతను తొణకకుండా బొడ్లోంచి చుట్టతీసుకొని నిప్పుకోసం లోపలికి వెళ్ళాడు. శ్రాద్ధకర్మలన్నీ సమాప్తమైన తర్వాత సతీశుడు అన్నతో "మన వూళ్లో ఇల్లు పాడయిపోతూ వుంది. నేను అక్కడికి వెళ్ళి వుంటాను అన్నా!" అన్నాడు.

సతీశుని అన్న తన భార్యా బిడ్డలతో ప్లీడరీ వృత్తిలోనే రాత్రింబగళ్లు మునిగి వుంటాడు. సతీశుని మాటను గురించే కాదు-ఇంకా దేన్ని గురించి ఆలోచించటానికైనా అతనికి తీరిక వుండదు. అతను తలవూగించి "మంచిదే, నువ్వు వెళ్ళితే గుమాస్తాలూ, నౌకర్లయినా భయంగా వుంటారు" అన్నాడు.

సతీశుడు గ్రామంలో ఇంటికి వెళ్లేందుకు ఏర్పాట్లు చేస్తున్నాడు. "అక్కడ మలేరియా ఎక్కువగా వుందని విన్నానుబాబూ. కలకత్తాలోగాని మరెక్కడైనా పడమటకువెళ్ళి వుండకూడదూ?" అన్నాడు బిహారి.

దీనిమీదట సతీశుడు పకపకనవ్వి "మలేరియా! అయితేనేం బిహారి! కలరా, స్ఫోటకం, ప్లేగు - ఇవన్నీ ఎక్కడ వుండవు?" అన్నాడు.

బిహారి భయపడుతూ "వుంటే?" అన్నాడు.

"అందుకనేగా వెళ్ళేది నేను జమీందారీ చూచుకోటానికి వెళుతున్నాననుకున్నావా? నాకు అంత అవసరమేముంది ? ఇంత కష్టపడి నేను డాక్టరీ చదివింది వృథాపోతుందనుకోకు" అతనికి సావిత్రిసంగతి జ్ఞాపకం వచ్చింది. చాలాకాలంక్రితం సతీశుడు తన యీ సంకల్పాన్ని సావిత్రిముందు పెట్టేప్పటికి ఆమె అంగీకరించి ఈ శుభకార్యం సఫలంకావటానికి ఎన్నో ప్రయత్నాలు చేసింది. కాని ఇవ్వాళ సతీశుడు నిజంగా దాన్ని కార్యరూపంలో పెట్టబోతున్న సమయంలో సావిత్రి ఎక్కడవున్నది ?

సతీశుడు ఏదో ఆలోచించటంచూచి బిహారి సాహసించి "అందుకనే చెబుతున్నాను, అలాంటిచోటికి బుద్ధిపూర్వకంగా ఎవరు వెళతారు బాబూ? అంతకన్న......" అన్నాడు.

సతీశుడు మధ్యలోనే అడ్డగించి "నేనుకూడా కోరేదిఅదేగా బిహారీ? అక్కడ మనకు రెండు ఇళ్ళు వున్నాయి. వాటిల్లో డిస్పెన్సరీ పెడతాను ధర్మం! ఎవరిదగ్గరా కానీ తీసుకోను. నేనే చికిత్సచేస్తాను. మంచి అనుభవ మున్న ఒక డాక్టర్ని కూడా తీసుకవస్తాను. పేదలకు వుపయోగపడని ఈ ధనం వృథా బిహారీ! అవసరమైతే కిందగదుల్లో కొంతమంది రోగులుకూడా వుండవచ్చు" అన్నాడు.

సతీశుని మాటలనుబట్టి బిహారి సందేహం ఎక్కువైంది. గలనొప్పి మూలకంగా నిద్రరావటంలేదు. ఇప్పుడు అతను ఎక్కడ వుండాలి? ఆ చోటు ఎటువంటిదో ఏమితెలుసు? యమలోకపు ద్వారం అక్కడికి ఎంత దూర ముందో? అదిగాక అనేకరకాలైన రోగులను తన చేతులతో లేపటం కూర్చో బెట్టడంకూడా ఒక యాతనేగా!

దీనదుఃఖితులయందు బిహారీకి స్వాభావికంగానే ప్రేమవుంది. కాని యజమాని కేదైనా విపత్తు కలుగుతుందనే సంశయం ముందు అతను ఎవరినీ లెక్కచెయ్యడు. అక్కడ అతను కళ్లుమూసుకుని బొత్తిగా అంధుడై పోతాడు. సతీశుని సమాధానానికి అతను కొంచెం క్రుద్ధుడై "అలా వీలుకాదు బాబూ! డబ్బువుంటే నౌకర్లను పెట్టుకొని ఎన్ని ఆస్పత్రులైనా పెట్టించుకోండి, కాని రోగులమధ్యకుమాత్రం మిమ్మ వెళ్ళనివ్వను" అన్నాడు.

సతీశుడు ఆశ్చర్యపడి "ఎందుకని? చెప్పు? నేనులేకపోతే వారి మంచి చెడ్డలు ఎవరుచూస్తారు? కేవలం నౌకర్లతో......" అన్నాడు.

"కాకపోతే కాకపోయిందిలే. పేదలు మందులు-మాకులు లేకుండా ఎప్పుడూ చస్తూనేవుంటారు. వారు నా తాతలు-తండ్రులు కాదు; జీవితమంతా వారిసేవాశుశ్రూషలకే అర్పించటానికి?" అన్నాడు బిహారి.

అతని ఆవేశంచూచి సతీశుడు నవ్వుకున్నాడు. బిహారి స్వామిభక్తి అతనికి తెలియకపోలేదు. అయినా మొహంమీదికి గాంభీర్యత తెచ్చిపెట్టుకొని "నువ్వింత కాకపడతావు దేనికి బిహారీ? అక్కడికి వెళ్ళితే మనుష్యులు చస్తారా? మనుష్యులు అక్కడమాత్రం వుండటంలేదూ? వెర్రివాడివై

పోయావా ఏమిటి?" అన్నాడు. బిహారి ఏమీ సంకోచించకుండానే "చస్తు న్నాడో లేదో అంతు తెలుసుకోవలసినంత అవసరం నాకేముంది? మనము అక్కడికి వెళ్ళటానికి వీలుండదు అంతే-" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు మెదలకుండా ఊరుకున్నాడు. తర్వాత గంభీ రుడై "నిజమే బిహారీ, మనుష్యుడు బతుకుతాడు చస్తాడన్న విషయం చెప్పలేం. కాని నాకు ఎవరున్నారు? ఎవరికోసం ప్రాణాలమీద మమత వుంచుకోను? ఒకవేళ చనిపోతానే అనుకో-ఎవరికోసం ప్రాణా లర్పిస్తున్నానో వారు నా అంత్యకర్మలు చెయ్యరూ? నాకు దానికి విచారమేమీలేదు అందుకనే అంటు న్నాను-నువ్వు నా వెంట రానవసరంలేదని. నీకు పెద్దతనంకూడా వచ్చింది. నీకు కొంతడబ్బు యిచ్చిపోతాను. ఇంటికి వెళ్ళి పిల్లాజెల్లాతో హాయిగా బతుకు" అన్నాడు.

బిహారి కొంచెంసేపు మెదలకుండావుండి తర్వాత అతని మొహంవంక చూచి "నేను నౌకరును-ఇష్టమొచ్చినట్లు మాట్లాడండి. మిమ్మల్ని యమ లోకంలోకి పంపి నా యీ అరవైయేళ్ళ కట్టెను కాపాడుకోటానికి డబ్బు తీసుకుని ఇంటికి వెళ్ళనా? సరే ఈవుపాయమే బాగుందా?" అతను కన్నీటిని ఆపుకుంటూ త్వరత్వరగా బైటికి వెళ్ళిపోయాడు.

---

## 38

ఆయిదారునెలలు నైనిటాలులోవుండి వుపేంద్రుడు భార్య అంతిమ కోర్కెప్రకారం బక్సర్ తీసుకువచ్చాడు. ఆరోజున సురబాల కొంచెంసేపటి వరకు దీపపుకాంతికేసి ధ్యానంతో చూచి మెల్లగా భర్తచేతిమీద తన కుడి చెయ్యివేసి "నీమాటయందు నా కెప్పుడూ సందేహంలేదు. ఇవ్వాళ నాకు ఒక్కసంగతి నిజం చెబుతావు?" అన్నది.

వుపేంద్రుడు మరణశయ్యనున్న భార్య మొహందగ్గరకు వంగి "ఏం సంగతి పశూ?" అన్నాడు.

సురబాల క్షణంసేపు మెదలకుండావుండి "నేను నిన్ను తిరిగి కలుసుకుంటానా?" అన్నది.

వుపేంద్రుడు భార్య మొహంమీది ముంగురులను సర్దుతూ శాంతంగా, దృఢంగా "ఎందుకు కలుసుకోవు?" అన్నాడు.

"ఎప్పుడు కలుసుకుంటాను? నేను కొద్దిరోజులలోనే మిమ్మల్ని విడిచిపోతున్నాను. కాని ఇన్నిరోజులు నీకోసం ఎదురుచూస్తూ ఎక్కడ కూర్చోను?"

"స్వర్గంలో వుంటావు. అక్కడే నన్ను ఎప్పుడూ చూస్తూనేవుంటావు."

"కాని ఒంటరిగా నేనెట్లావుండగలను? డాక్టర్లంతా ఇక లాభంలేదని చెప్పారా? నన్ను బతికించే మందేమీ లేదూ? నేను పోయినతర్వాత మీరు ఎన్ని ఇబ్బందులు పడతారో?

వుపేంద్రుని కన్నీటిబిందు వొకటి సురబాలమొహంమీద పడింది. అది ఆమె హృదయాన్నంతా మథించి "భర్తహృదయంలో ఇంత ప్రేమ నిచ్చావుగాని భగవంతుడా! కాస్త ఓర్పు నివ్వలేకపోయావే?" అని గొణుక్కున్నది.

సురబాల తన దుర్బలమైన చేతితో పతికన్నీరు తుడిచి "నీ కన్నీరు నే చూడలేను. నామాటొకటి నెరవేర్చుతావూ?" అన్నది.

వుపేంద్రుడు తలకాయతిప్పి "ఆఁ నెరవేర్చుతాను" అన్నాడు.

"అయితే మాచెల్లెలు శశిని మన దివాకరుడి కిచ్చి పెండ్లిచెయ్యి. నేను అతన్ని చూచి చాలరోజులైంది. రెండుమూడు రోజులకే అతనిచదువేమి పాడవుతుంది? కలకత్తానుంచి ఒకసారి వచ్చిపొమ్మని తంతియివ్వు"అన్నది

వుపేంద్రుని హృదయంలో మళ్ళా ఒకసారి శూలం గుచ్చుకొంది. దివాకరుని సురబాల ఎంతగా ప్రేమిస్తూవుండేదో అతనికి తెలుసు. కాని - ఆమె చివరి కోర్కె తీర్చే వుపాయమేమీ కనపడటంలేదు. అతను ఇంతవరకు దివాకరుని కలుషితకృత్యాలను భార్యవద్ద దాస్తూవచ్చాడు. ఇవాళకూడ అతను వాటిని బైటపెట్టలేదు. తెలివిగా విషయం తోసిపుచ్చి "శశిని అతని కివ్వటం మొదట నీకు ఇష్టంలేదు. నా బలవంతాన వప్పుకొన్నావు. ఇప్పుడు నావుద్దేశం మారిపోయింది. శశికి చాలా మంచిసంబంధం మరొకటి కుదుర్చుతాను. ఈ సంబంధంవద్దు పకూ?" అన్నాడు.

"అలా వీలుకాదు. శశిని దివాకరుని కిచ్చే వివాహం చెయ్యాలి" అన్నది సురబాల.

ఉపేంద్రుడు ఆశ్చర్యంతో "ఇవ్వాళ అంతపట్టుపడుతున్నా వెందుకు?" అన్నాడు.

"నువ్వు ఆమెను ఒకకంటితో కనిపెట్టుకువుంటే - మాకెప్పుడూ పరాయివాడివి కాలేవు. అదీగాక ఆమె ఇంట్లోవుంటే నీ సేవాశుశ్రూషలు కూడా చేస్తూవుంటుంది" అన్నది సురబాల.

ఉపేంద్రుడు పరధ్యానంలో "సరే, వీలుగావుంటే అలాగే చేస్తాను" అన్నాడు.

తర్వాత మూడురోజులకు కబురుతెలుసుకొని ఉపేంద్రుడు వద్దన్నా మహేశ్వరి అక్కడికివచ్చింది. సురబాల ఆమెవళ్ళో తలపెట్టి "నేనుపోయిన తర్వాత కనిపెట్టుకునివుండు. వారు మళ్ళీ పెళ్ళిచేసుకోరని నాకు తెలుసు. కాని చాల ఇబ్బందిపడతారు" అంటూవుండగానే ఆమెకళ్లల్లో నీరుతిరిగినై.

మహేశ్వరికూడా ఆమె వక్షంమీద తలపెట్టి ఏడ్వసాగింది. కాని నోటివెంట ఒక్కమాటకూడా రాలేదు.

ఈవిధంగా మరి నాలుగైదురోజులు గడచిపోయింది. తర్వాత ఒక రోజు ప్రొద్దున భర్తవళ్లో తలపెట్టి-ఆ వీధివారందర్నీ దుఃఖసాగరంలో ముంచి స్వర్గధామానికి పోయింది సురబాల

ఉపేంద్రుడు మనసు కుదటపరచుకొని భార్య శ్రాద్ధకర్మలన్నీ పూర్తి చేసి మహేశ్వరిని వెంటబెట్టుకొని వెళ్ళిపోయాడు. ఉపేంద్రుని తండ్రి శివ ప్రసాద్‌బాబు కొడుకుకోసం చాల ఆతురతపడ్డాడు. కానికొడుకు తిరిగివచ్చిన తర్వాత అతనుకూడా నిశ్చింతగా వూరుకున్నాడు. అతను మనసులో భయపడ వలసిందిదేమీలేదు, అనుకొని వీలైనంత త్వరలో ఒకఅందమైన కోడల్ని తీసుకు రావాలన్న ఆశకూడా పెట్టుకున్నాడు హృదయంలో.

మర్నాడు ప్రొద్దున్న ఉపేంద్రుడు నెత్తికి తలగుడ్డ చుట్టుకొని యథా ప్రకారంగా కోర్టుకు వెళ్ళుతుండటంచూచి శివప్రసాద్ చాల సంతోషించాడు. ఆ ఆనందంపట్టలేక కొడుకును దగ్గరకుపిలచి లోకంలోని అనిత్యాన్ని గురించి అనేక సంగతులుచెప్పి చివరికి "నీకు తెలియనిదేముంది బాబూ! లోకంలో ఏమి శాశ్వతం! ఇవ్వాళ వున్నది. రేపువుండదు. ఎవరికీ ఏమీవుండదు, అంతా మిథ్య,

అంతా మాయ, అని ఎప్పుడూ జ్ఞాపకం పెట్టుకో. నాయనా! పరలోకాన్ని పాడుచేసుకోకు. ఎవరెవరికౌతారు? 'చలాచల మిదం సర్వం కీర్తి ర్యస్య సజీవతి' అని రాసివుంది శాస్త్రాలలో. మానాభిమానాలన్నీ కేవలం ధనంవల్లే కలుగు తాయి. ఇదంతా రూపాయలు, డబ్బుమీదే అంతా ఆధారపడివుంది. చూడు, సతీశుని తండ్రి ఎలాధనం సంపాయించిపోయాడో" అని అతనుగంభీరంగా తల కాయ తిప్పసాగాడు. వుపేంద్రుడు తలవంచుకొని అంతా విని కోర్టుకు వెళ్లి పోయాడు.

కోర్టులో సతీశునిఅన్న కనపడి-ఈ దుర్ఘటననుగురించి చాల విచార పడి ఆఖరికి సతీశునిసంగతి తీసుకొచ్చాడు. తండ్రి చనిపోయినతర్వాత సతీ శుడు ఇంటివద్దే వుంటున్నా డనుకున్నా డు వుపేంద్రుడు. కాని అతను దేశంలో వుంటున్నా డని యిప్పుడు తెలిసింది. టూనాబాబు నవ్వి "యీ కొద్దిరోజుల లోనే ముప్పై నలభైవేల రూపాయలు ఖర్చుపెట్టి రెండు పెద్దపెద్ద డిస్పెన్స రీలు పెట్టాడు. నెలకువందరూపాయలు జీతమిచ్చి ఒకడాక్టర్ని తీసుకొచ్చాడు. అదీగాక ఇంటినే ఆస్పత్రిగా తయారు చేశాడు" అన్నాడు.

వుపేంద్రుడు సహజంగా "అలాచెయ్యాలని అతను చాలారోజులనుంచి అనుకుంటూవున్నా డు. కాని చేతిలో డబ్బులేకపోవటంవల్ల ఇన్నిరోజులనుంచీ ఏమీ చెయ్యలేకపోయాడు" అన్నాడు,

టూనాబాబు వ్యంగ్యంగా చిరునవ్వుతో "అది నాకూ తెలుసు వుపేంద్ర్, నీకు కేవలం డిస్పెన్సరీ తెరచినసంగతే తెలుసా. యోగసాధనా లను గురించికూడానా? అన్నాడు.

వుపేంద్రుడు ఆశ్చర్యపడి "యోగసాధనా లేమిటి? అన్నాడు.

"సతీశుడు ఇప్పుడు ఒక పెద్ద యోగసాధకుడైపోయాడు. కాషాయ వస్త్రాలు, పెద్దగడ్డము, పెంచినజుట్టూ, మెళ్ళో రుద్రాక్షమాల, మొహాన విభూతి వున్నాయి. కళ్ళు ఎప్పుడూ తిరుగుతూవుంటాయి. అతని అంతు తెలుసుకోమని రాసి బిహారిని పంపాను. కాని అతను భయంతో రెండు రోజులవరకు అతనివద్దరకు వెళ్ళటానికికూడా సాహసించలేకపోయాడు. ఈ వుత్తరం చదివిచూడు. నా పేర బిహారీ వ్రాశాడు—ఇంతవరకు సమాధానం రాయలేకపోయాను-ఇంకా జేబులోనే పడివుంది" అని అతను వుత్తరము ఒకటితీసి వుపేంద్రుని చేతికిచ్చాడు.

తొందరగా ఇంటికి వెళ్ళు. నీ జీతం నేను ప్రతినెలా మీయింటికి పంపుతూ వుంటాను" అన్నాడు.

బిహారి తలవంచుకొని "తమ ఇష్టము" అన్నాడు.

అతను విచారపడనూలేదు. క్షమాపణ కోరుకోనూ లేదు. రెండువందల రూపాయలు పంచెచెంగున మూటకట్టుకొని బాబుగారికి నమస్కరించి ప్రొద్దు గూకకముందే వూరు వెళ్ళిపోయాడు.

బిహారి ఇంటికి వెళ్ళడంతో సతీశుడు నైతే ఆ విస్తుపోయి చూస్తూ నుంచున్నాడు. అతను వీధిమలుపు దగ్గర కనుమరుగైపోయిన తర్వాత సతీశుడు దీర్ఘనిట్టూర్పు విడచి "వెళ్ళిపోయాడా, ఇంతకాలానికి బిహారికూడా వెళ్ళి పోయాడు!" అన్నాడు

ఈసారి ఆశ్వీజమాసపు మొదటివారంలోనే దేవీపూజ. ఇంకా చాలా కాలమున్నా సతీశుని బంధుకోటి ఈసారి పూజలో ఏమిచెయ్యాలా అని ఆలోచిస్తూనేవుంది. మహోత్సవానికి ఇప్పటినుంచీ సిద్ధంగా వుండాలి. కాని భాద్రపదమాసం మధ్యలో మలేరియా మహా తీవ్రంగా వుంది.

కొంతకాలంనుంచి సతీశుని వంట్లో బాగుండటంలేదు. ఏకాదశిమూలాన అలావుందనుకొని జ్వరాన్ని తోసిపుచ్చుకు తిరగాలనుకున్నాడు. కాని అది ఒకపెట్టున వదిలిపెట్టే జ్వరంగాదు. చివరికి అతను తన శరీరంలో స్వస్థతగా లేదని వప్పుకోవలసివచ్చింది.

తర్వాత మూడురోజులకు, చతుర్దశిరాత్రి, పూజా ప్రయత్నాలు మహా డంబరంగా జరుగుతున్నాయి. కాని సతీశుడు ఈసారి తను పాల్గొన దలచుకోలేదు. మధ్యాహ్నం గురువుగారు సతీశుని శిరస్సున మంత్రజలం చల్లటానికి కమండలం చూపించి చిరునవ్వుతో "దానిమీద నీ అధికారమేమీలేదు నాయనా! అదీగాక నువ్వు మూలాధారుడవు. సర్వస్వము నీవే-నువ్వు లేక పోతే అంతా వ్యర్థం" అన్నాడు.

సతీశుడు గురువుగారిమాటను దాటిపోలేడు. అందుచేత ఇష్టంలేక పోయినా అంగీకరించక తప్పలేదు. బిహారి వెళ్ళిపోయినతర్వాత అతను తన వర్తమానస్థితిని గురించి ఆలోచించవలసివచ్చింది. అప్పటినుంచి ఇవేవీ అతనికి ఇష్టముండటం లేదు. బిహారి వెళ్ళిపోయాడు. అతను మళ్ళా తిరిగి వస్తాడని అతనికి నమ్మకం లేకుండావుంది. అతన్ని వీలైనంత త్వరలో తీసుకురావాలని

అతని మనసు వ్యాకులపడ సాగింది. అవేగాక మరో చింతకూడా అతన్ని లోలోపల దుఃఖపెడుతూ వుంది. బిహారీ ఇంటికి వెళ్ళిపోయాడో లేక తన పడమటి యింటికి వెళ్ళాడో? అక్కడ ఈ సంగతులన్నీ బైటపెట్టి గల్లంతు చేయడుగదా! ఏమైనా అతన్ని ఒక్కసారి మళ్ళీ కంటితో చూడకుండా సతీశుడు వుండలేకపోయాడు.

సాయంత్రం పైఅంతస్తు గదిలోకి సతీశుడు అందరితోపాటు తనూ రెండు కప్పులు సారాయి పుచ్చుకున్నాడు. దానితో అతని తెలివికాస్తా కొంతవరకు దూరమైపోయింది. కాని హృదయంలోని పీడ, దుఃఖమూ అతన్ని లోలోన వ్యథపెడుతూ వున్నాయి. సరిగ్గా ఆసమయంలోనే పక్కనుండి బిహారిమాట విని సతీశుడు పులకితుడైపోయాడు. ఆశ్చర్యంతో "ఎవరు? బిహారీ ఏమిటి?" అని అరిచాడు బిగ్గరగా.

బిహారి వాకిటివద్దకువచ్చి నుంచుని "అవును బాబూ? ఏమిటి?"అన్నాడు. గురువుగారి మొహం తెల్లబోయింది. "ఈ గాడిద మళ్ళీ వచ్చాడు. ఈ గదిలో ఎందుకు అడుగుపెట్టావురా, వెధవా?" అన్నాడు.

ఈ గదిలోనే అతని నిశీథప్రయత్నచక్రాలన్నీ జరుగుతూవుంటాయి.

సతీశుడు వీటియం దేమీ ధ్యాసముంచక "నువ్వు ఇంటికి పోలేదా బిహారీ?" అన్నాడు.

"లేదు, కాశీ వెళ్ళాను" అన్నాడు బిహారి.

"కాశీయా? కాశీ ఎందుకు వెళ్ళావు?"

"అమ్మగారిని తీసుకురావటానికి వెళ్ళాను."

సతీశుడు త్రుళ్ళిపడ్డాడు. బిహారి అమ్మగారని ఎవరి నంటాడో సతీశునికి తెలుసు. "ఆమె కాశీలో వుంటోందా ఏమిటి? అన్నాడు.

"అవును."

"నీకు ఆమెజాడ తెలుసా ఏమిటి?"

"తెలియదు. కాని అమ్మగారు అక్కడ వుంటే ఒకనాడైనా విశ్వనాథ మందిరంలో కనపడుతుందని నాకు తెలుసు" అన్నాడు బిహారి.

"కనపడిందా?"

"అవును."

సతీశుని హృదయంలో ఒక తుఫాను చెలరేగింది. అతను కొంచెంసేపు మౌనంగా వుండి తమాయించుకొని "నాతో చెప్పకుండా నువ్వు అక్కడికి ఎందుకు వెళ్ళావు? మంచిపనిగాదు-అలాంటి ఆడవాళ్ళకి మానమర్యాదలు గాని సిగ్గు అభిమానాలుగానీ వుండవు. నువ్వు వెనక చేప్పటికి ఆమె నీ వెంటపడి వస్తే ఇవ్వాళ నువ్వు ఎంతచిక్కుల్లో పడేవాడవో చెప్పు?" అన్నాడు.

బిహారి మెదలకుండా నుంచున్నాడు.

"ఇంట్లో అడుగుకూడా పెట్టనివ్వేవాణ్ణి కాను. వాకిట్లోంచే నాకరుతో గెంటించేవాణ్ణి. ఆమెను తీసుకొస్తే ఈరాత్రి కొంత ఇబ్బంది పడేవాడివో ఆలోచించుకో! లోకులు నిన్ను ఈ విషయం తెలిస్తే వెర్రివాళ్ళ అంటారు. కాలీచరణ్! ఒక గ్లాసు యివ్వు బాబూ" అన్నాడు.

అనుజ్ఞ కాగానే కాలీచరణుడు సతీశునికి చేతికి ఒక గ్లాసు ఇచ్చాడు.

బిహారి మృదుస్వరంతో "అమ్మగారు మిమ్మల్ని పిలుస్తున్నారు" అన్నాడు. సతీశుడు గ్లాసునోటి దగ్గర పెట్టుకోబోతూ త్రుళ్ళిపడ్డాడు. "ఎవరు పిలిచేది?" అన్నాడు.

"అమ్మగారు?" అన్నాడు బిహారి.

సతీశుడు గాబరాపడి గ్లాసు కిందపారేసి "ఇక్కడికి వచ్చిందా ఏమిటి? అయితే ముందుగా చెప్పలేదేం?" అన్నాడు.

బిహారి దానికేమీ సమాధానమివ్వకుండానే "ఆమె మిమ్మల్ని వెంటనే రమ్మంటూంది" అన్నాడు మళ్ళీ.

"బాబుగారికి జ్వరం వచ్చింది, చూట్టానికి స్నేహితులొచ్చారు. అరగంట ఆగి వస్తానని వెళ్ళి చెప్పు!" అన్నాడు.

బిహారి కంటితో వాకిటికేసి సైగ చేసి "ఆమె అక్కడే నుంచునివుంది. రండి" అన్నాడు.

సతీశుడు చకితుడై "గదిలోనా" అన్నాడు.

బిహారి తలకాయ తిప్పి "ఔను, ఈ గదిలోనే" సమాధానమిచ్చాడు.

సతీశుడు చప్పున రెండు లవంగాలు నోట్లో వేసుకొని మెల్లగా బైటికి వచ్చి చూచాడు. తలుపుచాటునుండి సావిత్రి పైటచెంగు కనపడుతూవుంది. ఆమె ఇప్పుడు తన చెవులతో అంతా వింది. దానిలో అనుమానమేమీ లేదు.

బిహారీని రెండు చెంపదెబ్బలు కొడదామనుకుంటూ వుండేప్పటికి సావిత్రి తొంగిచూచి "లోపలికి రా" అన్నది.

ఈ కంఠస్వరంతో సతీశుని హృదయ తంత్రులన్నీ ఒక్కసారి తెగిపోసాగినాయి. గదిలో అడుగు పెట్టగానే "జ్వరంవచ్చిందా?" అన్నది.

సతీశుడు తలకాయవూగించి "అవును, జ్వరం వచ్చింది" అన్నాడు.

"ఏదీ, చూస్తాను?" అని సావిత్రి దగ్గరకువచ్చి చెయ్యి సతీశుని మొహం మీద పెట్టింది. అతని వంటికి చెయ్యి తగలగానే జ్వరతీవ్రత వున్నదని త్రుళ్ళిపడింది. "నిజంగా జ్వరం వచ్చింది. తాపంతో వళ్ళు మండిపోతూవుంది. పద, గదిలో పక్క వేస్తాను, పడుకో" అని సావిత్రి మూడవఅంతస్తు మెట్లు కేసి వెళ్ళింది. ఆమె ఇంటికి రాగానే బాబుగారి పడకగది బిహారిని అడిగి తెలుసుకుంది.

మంచంమీద పక్క వేసేవుంది. సావిత్రి దానిని పమిటచెంగుతో దులపగానే సతీశుడు బుద్ధిమంతుడిలాగ కిమ్మనకుండా పడుకున్నాడు. ఆమె తలవైపు కిటికీతలుపులు వేసి "సాదుబాబా ఏగదిలో వుంటున్నాడు?" అని అడిగింది బిహారిని.

బిహారి పక్కగది చూపించాడు. "అతని సామానంతా కిందకు దింపు; కింద చాలా గదులు ఖాళీగా వున్నాయిగా. దానిలో ఏదో ఒక దానిలో విశ్రాంతిగా వుంటాడు" అన్నది సావిత్రి.

బిహారి వెళ్ళబోతూ వుండేప్పటికి సావిత్రి పిలచి "బాబుగారిని ఎవరైనా చూట్టానికి వస్తే వీలులేదనిచెప్పు బిహారీ! బాబుగారికి జ్వరం తీవ్రంగా వుంది, కిందకు దిగిరాలేరు" అన్నది.

సతీశుడు మొహంనిండా ముసుగు పెట్టుకు పండుకున్నాడు.

బిహారి సగర్వంగా ఆజ్ఞతీసుకొని వెళ్ళిపోయాడు బిహారి వెళ్ళి పోయింతర్వాత సావిత్రి "ఇక లేవబోకు. నేను వంటఏర్పాట్లు చేసివస్తాను" అని తలుపువేసి మెల్లగా వెళ్ళిపోయింది.

బహుశా గురువుగారు కిందకు దిగటానికి ఇష్టపడడని ఆమె సందేహం. అందుచే ఆమె తలుపుచాటుకువచ్చి నుంచున్నది.

ఆ సమయంలోనే బిహారి మరోవాకిటిగుండా బైటికివచ్చి "మీరంతా ఇంటికి వెళ్ళిపొమ్మంటూంది అమ్మగారు. బాబుగారికి జ్వరం తీవ్రంగావుంది.

ఏమీ తోచక బిహారి సతీశుని అన్నకు ఒక ఉత్తరం రాశాడు. ఈ స్థితిలో ఏమి చెయ్యవలెనని?

బాల్యస్నేహితుడు, తన కుడిభుజము, సతీశుడు, ఇవ్వాళ ఇంత అధఃపతనమైపోయాడు! బ్రాహ్మో బహిరంగంగా ఆ కులటదాసీని వెంట వుంచుకొని అలా ఉండి కుత్సితపు పనులు చేయటానికి అంగీకరించి సిగ్గుపడలేదు. కాని ధర్మసాధన అనే వంకతో దురాచరణ చేస్తున్నాడు. అదీగాక బిహారి చెవులదాకా — బ్రాహ్మో అనేమాట నిర్విఘ్నంగానూకూడా చుట్టూ చేరారని తెలుస్తూవుంది.

పశ్చాత్తాపంతో వృషేంద్రుడు ఉత్తరం జేబులో పెట్టుకుని కోర్టునుండి వెళ్ళిపోయాడు. టూనాబాబుకు ఉత్తరం తిరిగి యివ్వటం మర్చిపోయాడు.

బిహారి ఉత్తరం పోస్టులోవేసి మొదట కొన్ని రోజులవరకు టూనాబాబు సమాధానంకోసం ఎదురుచూస్తూ వున్నాడు. కాని తర్వాత నిరాశ చెంది కాలం గడపసాగాడు. రోజు వెంబడి రోజు గడుస్తూవుంది. పెదబాబుగారూ రాలేదు. అతని ఉత్తరమూ రాలేదు.

ఖాకీబాబా ఆచారాలనూ సాధనవిధులనూ చూచి బిహారి మరీ గాబరా పడిపోయాడు. అతను తాంత్రిక సన్యాసి. సిద్ధపురుషుడని పిలుచుకుంటూ వుండేవాడు. సతీశునికి ఉపదేశమిచ్చిన గురువు. అతని స్వభావము ఎనిమిది ఝాములూ సారాయి గంజాయి ప్రభావంతో దుర్వ్యసనపరుడికన్నా ఎక్కువ కాకగా వుంటుంది. నోరు మంచిది కాదు.

బహుశా తాంత్రిక గురువులు ఇలాగే వుంటారేమో అనుకొని బిహారి మొదలకుండా అంతా వింటూ, సహిస్తూవుండేవాడు. అదీగాక అతను సతీశుని గురువుకూడానూ. అతనియందు బిహారికికూడా భక్తిశ్రద్ధలు తక్కువేమీ కాదు. సతీశునికి ఏదైనా అపకారం జరుగుతూవుందని అనుమానం కలిగితే బిహారికి మర్యాదామర్యాదలు తెలియవని మొదటే చెప్పాము.

గురుదేవుడు బోధించినట్లు సతీశుడు, అతని సహచరులతో అర్ధరాత్రి వేళ ఏకాంతంగా చక్రసాధన, అంతకంటెకూడా రహస్యమైన అనుష్ఠానాలతో చేస్తూవున్నంతకాలం బిహారి వాటినన్నిటినీ ఏదోవిధంగా సహిస్తూ వచ్చాడుకాని, బాబుగారు గురువుగారి ప్రసాదమనుకొని గంజాయి, సారాయి సేవనం మొదలుపెట్టటం చూచి సహించలేకపోయాడు. సతీశుడు లేనప్పుడు

అతను గురువుగారి గదిలోకి వెళ్ళి చేతులు జోడించి భక్తిపూరితస్వరంతో "తమరు పగటిపూ టొస్పాసా బాబుగారిని సారాయి, గంజాయి తాగటం మాన మనండి! అన్నాడు.

అగ్నిగుండంలో ఆజ్యం పడినట్లయింది. గురువుగారు వెంటనే క్రోధ స్వరంతో "సారాయిరా వెధవా?" అన్నాడు.

బిహారి వినయంగా "నాకేం తెలుసు బాబూ! మా ఇంటివద్ద సారాయే అంటాము" అన్నాడు.

"మళ్ళా సారా అంటాడు? నీదేమదిరా గాడిదా? మాట్లాడటానికి నువ్వెవరవు?" అన్నాడు గురువు.

బిహారికికూడా గురువుగారిమాటలు అసహ్యం కలిగినాయి. అతను కూడా దృఢస్వరంతో "నేను బాబుగారి నౌకరును" అన్నాడు.

"నౌకరికి యింత పొగరా!" అని గురువుగారు పండ్లు పటపట కొరుకుతూ "నేను నీ యజమానికికూడా యజమానిని. తెలుసా?" అన్నాడు.

బిహారి కూర్చున్నవాడల్లా చివాలునలేచినుంచుని "అంతటితో కట్టిపెట్టు. నా యెదుట అలాంటివాగుడు వాగమాకు. ఇదే చెబుతున్నాను" అన్నాడు బిగ్గరగా.

గురువుగారి స్వభావమే ఎప్పుడూ చిటపటలాడిన ట్లుంటుంది. బిహారి అదురుపాటుచూచి ఒక్కసారి మండిపడ్డాడు. "ఏమిటిరా అంటావు వెధవా? నువ్వు నన్నేమిచేస్తావు?" అని కాలి కొయ్యచెప్పు తీసి బిహారి మొహంమీదకు విసిరికొట్టాడు. బిహారి ముక్కువెంట రక్తం ఒక్కసారి పొంగులెత్తింది. చివ్వున మూలనున్న త్రిశూలం చేతపట్టుకొని గురువుగారిమీదకు పోయాడు. గురువుగారు భయంతో ఒక్క వెర్రికేక పెట్టాడు. అతను త్రిశూలం అక్కడేవేసి ముక్కుల్లోంచి వచ్చే రక్తం తుడుచుకుంటూ బైటికివెళ్ళి సంగతంతా సతీశునికి చెప్పాడు.

"నిజమా?" సతీశుడు అడిగాడు.

"అవును" అన్నాడు బిహారీ. కాని తన దెబ్బ ం తెలుచుకోనేలేదు.

సతీశుడు క్షణంసేపు మెదలకుండా వుండి "నిన్ను ఇక ఈ యింట్లో వుంచను. నిన్ను నౌకరీలో వుంచను. రెండువందల రూపాయలు తీసుకుని

ఇవ్వాళ కిందకు రాలేదు" అన్నాడు ఓరగా.

తర్వాత గురువుగారికేసి చూసి "మీ సామానంతా కింద నివారంది ముందు పెట్టేశాను. మీకు ఏమైనా కావలిస్తే అతన్నే అంతా చెబుతాడు" అన్నాడు.

ఈ మాటలు వినికూడా గురువుగారు ఆతురత కనపర్చలేదు శాంతంగా "ఆమె ఎవరు బిహారీ?" అన్నారు.

బిహారి మండిపడి "ఎవరైతేనేం? మీకు అనవసరం? గుచ్చిగుచ్చి అడగటానికి మీకేంపని? నేను చెప్తున్నది విని మెదలకుండా కిందకు దయ చెయ్యండి" అన్నాడు.

బిహారి మాటలువిని ఆ ఇద్దరూ ఒకరి మొహాలొకరు చూసుకొని అక్కడి నుంచి వెళ్ళిపోయారు. ఎవరికీ ఏమీ అర్థంకాలేదు.

బిహారి వంటింట్లోకి వెళ్ళి చూశాడు. సావిత్రి వంటసామానులతో పాలు కాయిస్తూ వుంది. "చాలా ప్రొద్దుపోయింది. నువ్వు ఇంతవరకు స్నానసంధ్య లేమీ చెయ్యలేదు. పగలంతా ఎండలో వున్నావు. ఒక గుక్కెడు మంచినీళ్లు కూడా తాగలేదు. పద, స్నానంచేసి సంధ్యవు గాని. ఇంతలో బాబుగారి పాలు కాగుతాయి" అని బిహారి ఒకవిధంగా బలవంతంగానే సావిత్రిని అక్కడ నుంచి తీసుకెళ్ళాడు.

తర్వాత బిహారి సతీశునికి సిగరెట్టుతీసుకొని మెదలకుండా తలుపుతీసి లోపలికి వెళ్ళాడు. సతీశుడు మెదలకుండా నుంచునివున్నాడు. కళ్ళు నలుపుకొని "ఎవరు? బిహారి!" అన్నాడు.

"సిగరెట్టు తీసుకొచ్చాను బాబూ"

"ఇటు తే, ఆమె ఎక్కడవుందిరా?"

"ప్రొద్దుటినుంచి ఆమె గుక్కెడు నీళ్ళుకూడా ముట్టలేదు. ఇప్పుడే స్నానానికి పంపి వచ్చాను" అన్నాడు బిహారి.

"మంచిపని చేశావు. నేను నిన్ను వెతుకుదా మనుకున్నాను బిహారీ!" అన్నాడు సతీశుడు.

"లేదు బిహారీ! అందుకనే నిన్ను వెతుకుదా మనుకుంటున్నది. తలుపు గొళ్ళెంపెట్టి కొంచెం నాదగ్గరకు వచ్చి కూర్చో" అన్నాడు సతీశుడు తలకాయ తిప్పి.

బిహారీ తలుపు గొళ్ళెంవేసి అనుమానంతో యజమాని పాదాల దగ్గరకు వచ్చి కూర్చున్నాడు.

"గ్రహాలమీద నీకు నమ్మకముందా బిహారీ?" అన్నాడు సతీశుడు.

బిహారి ఆతురతతో "గ్రహాలమీద నమ్మకం లేకేం బాబూ? పంచాంగంలో వ్రాసినది అబద్ధమౌతుందా?" అన్నాడు.

సతీశుడు కొంచెంసేపు కదలకుండా వుండి "ఈసారి నా గ్రహం ఒకటి బాగుండలేదు బిహారీ!" అన్నాడు.

బిహారి కంపించి "అలా అనకండి బాబుగారూ!" అన్నాడు. సతీశుడు [illegible] "యిది నా గండజ్వరం అనుకుంటాను బిహారీ! ఈసారి నేను బతకను" అన్నాడు.

బిహారి యజమాని కాళ్ళు రెండూ పట్టుకొని "అలాంటి మాటలు నోటి వెంట రానివ్వకు బాబూ! మీ గ్రహాలు తీసుకొని నేను చస్తాను. నా ఆయుష్షు పోసుకొని మీరు చిరంజీవిగా వుండండి. లేకపోతే మనమంతా ఒక్కసారి చచ్చాం బాబూ! ఒక్క ప్రాణంకూడా వుండదు" అని బిహారి వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

సతీశుడు గంభీరంగా "చావూ బతుకూ మన చేతుల్లోని పని కాదు బిహారీ! బహుశః నేను బతకనేమో! అందుచేత నిన్ను ఒక సంగతి అడుగుతాను. నిజం చెబుతావా?" అన్నాడు.

బిహారి ఏడుస్తూ "మీ పాదాలంటి చెబుతున్నాను బాబూ! ఏమి అడుగుతారో అడగండి. చెబుతాను" అన్నాడు.

"ఏమీ దాచవుగా?"

"లేదు, ఒక్క మాటకూడా దాచను."

"అయితే కూర్చో."

బిహారి కన్నీళ్ళు తుడుచుకొని కూర్చున్న తర్వాత "సావిత్రిని నువ్వు ఎక్కడ నుంచి తీసుకొచ్చావో చెప్పు." అన్నాడు.

"చెప్పానుగా బాబూ—కాశీనుంచని."

"అయితే అక్కడ విపినబాబును కలుసుకోలేదా?"

బిహారి నాలుక కొరుక్కొని ఏవగింపుతో "అతను నా కెవరు కలుసుకోడానికి!" అన్నాడు.

"కాని నువ్వు కళ్ళార సావిత్రిపక్కమీద..." అన్నాడు సతీశుడు.

సతీశుని మాట పూర్తిగాకముందే బిహారి రెండుచేతులూ యెత్తి మరి త ఆవేశంతో రెండుచెంపలూ వాయించుకొని "దానికి శిక్షయిదే! యిదే! యిదే! తెలిసీ తెలియకుండా చెప్పాను. అందుకనే నలుగురికీ మొహం చూపించ గలుగుతున్నాను. లేకపోతే-నా నాలుక పూడిపోయేదే" అన్నాడు.

సతీశుడు ఆశ్చర్యంతో లేచి కూర్చుని "ఏమిటి వాగుతావు?" అన్నాడు.

అప్పుడు బిహారి సిగ్గుపడి లేచి కూర్చుని, ఒక్కొక్కటిగా సంగతులన్నీ చెప్పసాగాడు. అతనుఏమీ పెంచలేదు, దాయాలేదు. అతను స్వయంగా ఎరుగున్నదీ, మోక్షదా-చక్రవర్తులద్వారా విన్నదీ, సావిత్రి మాటలవల్ల తెలిసింది అంతా చెప్పాడు.

సతీశుడు రాతిబొమ్మలాగ నిశ్చలంగా కూర్చున్నాడు. బిహారికూడా మెదలకుండా కూర్చున్నాడు.

చాలాసేపైనతర్వాత సతీశుడు ఒక దీర్ఘ నిట్టూర్పు విడచి "అయితే ఇంతవరకు ఈ సంగతులన్నీ నువ్వు నా కెందుకు చెప్పలేదు బిహారీ?" అన్నాడు.

"చెప్పాలని ఎప్పటినుండీ నా కడుపు వుబ్బుతూ వుందనుకున్నారు బాబూ! కాని నోరు విప్పి చెప్పలేక పోయాను" అన్నాడు బిహారి.

"ఎందుకని?"

"ఆమె నన్ను చెప్పవద్దని ఒట్టు వేయించుకుంది."

సతీశుడు మళ్ళీ కొంచెంసేపు మెదలకుండావుండి "సరే, పోనీ బిహారీ, ఆరాత్రి-సావిత్రే తను విపినునివద్దకు తప్ప ఇంకెక్కడికీ వెళ్ళదలచుకోలేదని స్పష్టంగా చెప్పింది. ఆమె అతనివద్దకే వెళతానంటంలో వుద్దేశ మేమిటి? ఏమైన చెప్పగలవా?" అన్నాడు.

"దానివుద్దేశమేమిటో నాకు తెలియదు బాబూ, కాని అదంతా బొట్టి అబద్ధమని గట్టిగా చెప్పగలను! అది అబద్ధం కాకపోతే నా బిడ్డలంతా పోతారు బాబూ! అమ్మగారు వెళ్ళేప్పుడు నేను ఏడ్చి 'లేనిపోని అపవాదుకి నెత్తిన రుద్దుకుంటా వెందుకు?' అన్నాను. అయినా ఆమె బైటపెట్టటానికి అనుజ్ఞ యివ్వలేదు. ఆమె ఏడుస్తూ 'బాబుగారితో ఈ మాటలన్నీ చెప్పవద్దు. వారు నన్ను ఏవగించుకొని, ఎప్పుడు నా మొహం చూడకుండావుంటేనే బాగుం

టుంది. నా కాళ్ళమీద నేనే గొడ్డలివేసుకొని వెళ్ళిపోయానని చెప్పవద్దు బిహారీ "అన్నది." ఆరాత్రి సంగతులన్నీ బిహారికి జ్ఞాపకమొచ్చేప్పటికి చాలబాధ కలిగింది. కళ్ళవెంట బొటబొట నీళ్ళు కారినై.

కాని యజమాని కళ్ళవెంట ధారలుగా పడుతున్న కన్నీటికేసి బిహారి ధ్యానంపోలేదు.

చాలాసేపటికి సతీశుడు మెదలకుండా కన్నీరు తుడుచుకొని "నీకు తెలియదు బిహారి! ఆమె తన కాళ్ళమీద తనే ఎందుకు గొడ్డలిపెట్టు వేసుకుందో నేను తెలుసుకున్నాను. కాని అబద్ధానికి న్యాయంవుండదు బిహారీ..." అన్నాడు.

బైటనుంచి తలుపుకొట్టిన చప్పుడైంది. "ఇదేమిటి? తలుపు గొళ్ళెం వేసుకొని నిద్రపోయావా ఏమిటి? కొంచెం గొళ్లెం తియ్యి."

బిహారి యజమాని మొహంకేసి చూచాడు. అతను మెదలకుండా కళ్లు మూసుకొని చప్పుడు పండుకున్నాడు.

బైటనుండి మళ్ళా పిలుపువచ్చింది. "చెయి కాలుతూవుంది. తలుపు తియ్యి!"

బిహారి లేచి తలుపుతీసి మెదలకుండా బైటికి వెళ్ళిపోయాడు.

# ౪౦

సావిత్రి వేడిపాలగిన్నె చేతపట్టుకొని గదిలోకి వచ్చి ముక్కాలిపీటమీద పెట్టింది. తెల్ల సిల్కుచీర ఆమెవంటిమీద చక్కగావుంది. తడి వెండ్రుకలు వీపుమీదకు వేలాడుతున్నాయి. కొన్ని మొహంమీదా చెక్కిళ్ళ మీదా చిందులేస్తున్నాయి. సతీశుడు కనుకొలకుల్లోంచి చూచాడు, అతనికి ఇవ్వాళే సావిత్రిని మొదటిసారిగా చూచా ననిపించింది.

కాని సావిత్రి దీపపువెలుగులో సతీశుని సజలనేత్రాలను చూడలేకపోయింది. దగ్గరకువచ్చి చిరునవ్వునవ్వి "తలుపువేసుకొని యజమానీ నౌకరు

ఏమిటి మాట్లాడుకుంటున్నారు? ఈ చిల్లగొండిదాన్ని ఎలా వెళ్లగొట్టాలా అనే కాదు?" అన్నది

సతీశుడు ఏమీ మాట్లాడలేదు. మాట్లాడితే తనగొంతు ద్వారా హృదయంలోని బలహీనత బైట పడుతుందేమో నని భయంతో అసలు పెదవుల కూడా వూరుకున్నాడు.

"చిన్నప్పుడు నువ్వు పిల్లి మెడలో గంట... కథ చదివే వుంటావు. ఇక్కడ గంట కట్టటానికి ఎవరు ముందు వస్తారా అని చూడదలచుకున్నాను. నువ్వే స్వయంగానా, మీ గురువుగారా!" అన్నది.

ఈసారి కూడా సతీశుడు ఏమీ మాట్లాడలేదు. ఎట్లా కూర్చున్నవాడు అట్లాగే కూర్చొని వుండిపోయాడు.

సావిత్రి ఒక కుర్చీ లాక్కొని కూర్చుంది. కాని ఈసారి ఆమె పరిహాసము - చంచల కంఠస్వరం గంభీరమైపోయింది. "పరిహాసం పోనీ, అసలు విషయమేమిటో నాకు చెప్పగలవా? మహేంద్రబాబుతో పోట్లాడి వచ్చావు. చివరికి సరోజినితో కూడా పోట్లాడి వచ్చావుకదూ! పోట్లాటలు ఏదో ఒక రోజున సర్దుకుపోతాయి. కాని ఇదంతా ఏమిటి? నా చేతిలో చెయ్యివేసి-సారాయి తాగనని ఒట్టువేసుకున్నావు గాదు. సారాయే గాక గంజాయి కూడా ప్రారంభించావు. అదీ చాటుమాటుగా కూడా కాదు. ఈ బైరాగుల్ని తీసుకొచ్చి కాషాయవస్త్రాలు ధరించి తంత్రమంత్రాలతో నగారా మోగించి మరీ తాగుతున్నావు కదూ!" అన్నది.

సావిత్రి నోటివెంట సరోజిని పేరువిని సతీశుడు ఉలిక్కిపడ్డాడు. బిహారి అంతా చెప్పాడని తెలుసుకున్నాడు.- నీమూలానే నా సర్వనాశనమైంది. నువ్వే నాకు శనిగ్రహం- అనాలని పెదవులమీదకు వచ్చింది కాని, ఆమాటను అణచిపెట్టుకొని గంభీరంగా "సారాయిగానీ, గంజాయిగానీ తాగితే తప్పేముందీ?" అన్నాడు.

"తప్పేమిటో నీకు తెలియదూ?"

"తెలియదు."

"సరే. తెలియకపోతే - ఇంతమాత్రం తెలుసుగా - నాచేతిలో చెయ్యి వేసి ఇకఎప్పుడూ తాగనని ఒట్టు వేసుకున్నావు."

"నువ్వు నా కేవరివేమిటి? బలవంతంగా ఒట్టువేయించుకొని మాన్పించ టానికి?"

సావిత్రి ఏదోవిధంగా నవ్వు నాపుకొని తలకాయతిప్పి "నేను నీ కేవ రినీ కాదూ? నిజంగానే అంటున్నావా?"

సతీశుడు కూడా తలకాయతిప్పి "ఎవరివీ కాదు."

"అయితే, సారాయి గ్లాసు క్రిందపారేసి లవంగం చప్పరిస్తూ వచ్చా వెందుకు?"

"కేవలం నువ్వు గల్లంతు చేస్తావనే భయంతో!"

సావిత్రి నవ్వి "అయినా సావిత్రి ఏమీకాదు? సరే, ఇక కొంచెం పాలుతాగి పండుకో" అని ఆమె పాలగిన్నె చేతపట్టుకొని సతీశుని ఎదుటకు వచ్చి నుంచుంది. సతీశుడు మెదలకుండా లేచి కూర్చుని పాలన్నీ త్రాగి నిద్రపోయాడు.

సావిత్రి గిన్నెతీసుకొని వెళ్లబోతూవుండేప్పటికి సతీశుడు పిలచి "నువ్వు స్నానం చేసావా?" అన్నాడు.

సావిత్రి వెనక్కుతిరిగి "ఆఁ" అన్నది.

"ఏమి తిన్నావు?"

"ఇంకా భోజనం చేయలేదు ఇప్పుడువెళ్ళి భోంచేస్తాను"

"ఎక్కడ పండుకుంటావు?"

"వాకిటిముందు ఏస్థైనా ఖాళీవుందో లేదో చూస్తాను. లేకపోతే చెట్టుకింద పండుకుంటాను" అని ఆమె తనలోతాను నవ్వుకొని "ఈమాటంటే నీకు కష్టంగా వుంటుందా! ధన్యుడవు!" అని ఆమె ప్రేమతో సతీశుని మొహంమీద పడివున్న జుట్టు చేత్తో సరిచేస్తూ అతని నొసటితాపం చూచి త్రుళ్ళిపడింది. బిహారి గదిలో అడుగుపెడుతూ "అమ్మగారూ మీ పక్క..." అన్నాడు.

సావిత్రి పక్క గదికేసి చూపించి "ఈ గదిలో. బాబుగారికి జ్వరం మండిపోతూవుంది. నేను ఈ ప్రక్కగదిలోనే పండుకుంటాను. మధ్య వాకిలి తీసివుంటుంది. నువ్వుకూడా ఇవ్వాళ ఇక్కడే పండుకుందువుగాని" అన్నది.

"ఇక ఎక్కువ మేల్కొని వుండక పోయి పండుకో" అన్నాడు సతీశుడు. తర్వాత ఆమె మెల్లగా తలుపువేసి కిందకు వెళ్లిపోయింది:

సావిత్రి భోంచేసివచ్చి పక్కగదిలో ఒక చాపవేసుకు పడుకుంది. అలసిపోయిన ఆమె కళ్లు రెండూ గాఢనిద్రలో మునిగిపోయాయి.

సావిత్రి తెల్లవారుఝామున మెలకువవచ్చి - ఆ గదిలోకి వెళ్ళి చూసే ప్పటికి సతీశుడు ఆరాటపడుతున్నాడు. తలమీద చెయ్యేసి చూసింది. జ్వరం మండిపోతూంది. ఆమె చల్లని చెయ్యి తగలగానే సతీశుడు కళ్ళు తెరిచాడు. రెండుకళ్ళు నిప్పుల్లాగ ఎర్రగావున్నాయి. జ్వరతీవ్రత చూసి సావిత్రి ఆ పక్క మీదే కూర్చొపడిపోయింది. కాని ఏమీ మాట్లాడటానికీ శక్తిలేకపోయింది.

సతీశుడు ఆమె చేతిని తన నొసటిమీద పెట్టి "యిది నాకడసారి జ్వరం. ఈసారి నేను బతకనని నిన్నే చెప్తాను బిహారికి" అన్నాడు.

సావిత్రికి-అతనికి ధైర్యం చెప్పడానికికూడా శక్తిలేకపోయింది. దుఃఖంతో ఆమె నోటివెంట మాటరాలేదు. రాత్రంతా నిశ్చింతగా ఎందుకు పడుకున్నానా అనే దుశ్చింతతో వ్యథపడసాగింది.

"నువ్వు నాదగ్గరవున్నావు, ఇదే నా ఆశ" అని సతీశుడు వత్తిగిలి పండుకున్నాడు.

నిన్నరాత్రి అతను-అభిమాన గర్వంతో నువ్వు నా కెవరవుగావు అన్న వ్యక్తే-ఆత్మీయురాలైంది.

క్షణంసేపు సావిత్రికి బిహారీని పిలచి డాక్టర్ని పిలుచుకురమ్మని చెప్ప టానికికూడా శక్తి లేకపోయింది. సతీశుని భుజంమీద చెయ్యివేసి రాయిలాగ కూర్చుని వుండిపోయింది.

కొంచెంసేపటికి సతీశుడు మరోవైపుకు వత్తిగిలి పండుకున్నాడు. మళ్ళా సావిత్రి చెయ్యి తన నొసటిమీదకు తెచ్చుకొని "నేనుకూడా కొంత కాలం డాక్టరీ చదివాను. సాయంకాలానికి నాకు ఈ తెలివికూడా వుండదు. ఇప్పుడు నేను మంచి తెలివిలోనే వున్నాను. నాకు మళ్ళా ఈ తెలివి రాక పోతే ఆ పెట్టెలో నా వీలునామా వుందని వుపేంద్రబాబుతో చెప్పు. నేను బ్రతికివుండగా వారు నా ముఖం చూడరని నాకు తెలుసు. నేను చనిపోయిన తర్వాత నా తుది కోర్కెకు అవమానం కలిగించ దనికూడా తెలుసు.

నీతర్వాత ప్రపంచంలో అతనుతప్ప నాకు ఆత్మీయులు ఇంకెవరు లేరు సావిత్రీ!" అన్నాడు.

వీలునామా చర్చ సావిత్రిని ఆత్మవిస్మృతురాలుగా చేసింది. ఇంత కాలంనుండి కాపాడుకొంటూ వస్తున్న సంయమశక్తి ఇవ్వాళ క్షణికావేశంలో విచ్ఛిన్నమైపోయింది. సతీశుని వక్షంమీద శిరస్సుపెట్టి పసిపిల్లలాగ ఏడ్వసాగింది.

బిహారి రాత్రంతా మేలుకొనివుండి తెల్లవారినతర్వాత నిద్రపోయాడు. త్రుళ్ళిపడిలేచి కూర్చుని వెర్రిగా చూడసాగాడు

సతీశుడు రెండుచేతులతో సావిత్రి మొహం పైకెత్తి-క్షణంసేపు గాఢంగా చూచి మళ్ళా మెదలకుండా పండుకున్నాడు. అతని మొహము-అంతా సావిత్రి కన్నీటిధారలతో తడిసిపోయింది. ఈదృశ్యానికి బిహారి ముగ్ధ వుశ్వాల నేత్రాలుతప్ప-మరొకటి సాక్ష్యంలేదు.

బైట శరత్ ప్రభాతము ఆరంభమైంది. సావిత్రి తమాయించుకులేచి కూర్చుని పయటచెంగుతో కళ్లు తుడుచుకుని - సతీశుని మొహంమీద కన్నీటి చారికలన్నీ తుడిచి - గదికిటికీలు - తలుపులూ అన్నీ తీసింది. తలుపులు - కిటికీలు తియ్యగానే సూర్యుని సువర్ణ కిరణాలతో గది నిండిపోయింది.

అప్పుడు బిహారీ కళ్ళల్లో నీరు తిరిగాయి. సావిత్రి తన నాలుకను ఎంతో ప్రయత్నంతో స్వాధీనం చేసుకొని సహజశాంతస్వరంతో "భయపడవలసిన విషయమేమీలేదు బిహారీ! నేనుండగా వీరి కేమీ ప్రమాదం జరుగదు. బాబుగారికి నయమౌతుంది. నేను బాబుగారిపక్క దులిపివేస్తూవుంటాను. ఇంతలో నువ్వు డాక్టర్ని పిల్చుకురా" అని ఆమెమళ్ళా సతీశుని మంచంమీద కొచ్చి కూర్చుంది.

డిస్పెన్సరీ డాక్టరువచ్చి - సతీశుని బాగా పరీక్షించి చప్పరిస్తూ "నిమోనియా లక్షణాలు కనపడుతున్నాయి. కాని భయపడ నవసరములేదు. రోగం యింకా ముదిరిపోలేదు" అన్నాడు.

డాక్టరు అభయమిచ్చి మందు చేసుకురావటానికి కిందకు వెళ్ళిపోయాడు. సతీశుడు నవ్వటానికి ప్రయత్నిస్తూ సావిత్రి మొహంకేసి చూచి "నేను మృత్యువుకి ఏమీ భయపడటంలేదు." అని దిండుకి ఆనుంచి తాకప్పు

గుత్తి ఒకటి పైకితీసి చూపిస్తూ "వీటిని చూచావా సావిత్రీ? అవి ఇదివరకు నీ పచ్చటిచెంగున వుండేవి. ఇవ్వాళ మళ్ళీ నేను స్వయంగా నీ పచ్చటిచెంగుకు కడుతున్నాను" అని సతీశుడు కన్నీటితో తడిసిన సావిత్రి పచ్చటిచెంగుతీసి మెల్లగా తాళపుచెవులగుత్తిని ముడేసి - ఏదో పెద్దభారం నెత్తిమీదనుండి దిగిపోయినట్టు దీర్ఘమైన నిట్టూర్పు విడచి వత్తిగిలాడు.

సావిత్రి తనందు బిహారికి పూర్తి నమ్మకముంది. ఆమె దీనంగా చూచి అతను మొదట సంతోషించాడు, కాని అతను పిల్లవాడు కాడు. కాని కొన్నాళ్ళకు సావిత్రి మొహంమీద వుదాసీనత చూచి అతను లోలోన భయపడ్డాడు. ఈ అపూర్వకర్మిష్ఠి శాంతవదనంమీద తెలిమబ్బుఛాయలు క్రమంగా దట్టమవటం అతను స్పష్టంగా చూచాడు.

ఎనిమిది పదిరోజుల తర్వాత అతను సావిత్రిని దగ్గరగా పిలిచి రుద్ధకంఠముతో "ఈ వృద్ధునిముందు దాచిపెడతా వెందుకమ్మా! నీకోమలహృదయం సహించగలిగిందీ, ఈ వృద్ధుని ఎముకలగూడు సహించలేదూ? సంగతులన్నీ నువ్వు నాకు పైటపెట్టి చెప్పు. నా చేతనైనంత సహాయం మేదైనా వుంటే చూస్తాను" అన్నాడు.

సావిత్రి కొంచెం స్తిమితపడి "నీకు ఇంతవరకు చెప్పలేదు బిహారీ! నీ పేరుతో ఇవ్వాళప్రొద్దున ఉపేంద్రబాబుగారికి ఒక ఉత్తరం రాశాను. రెండురోజులవరకు ఎదురుచూస్తూవుంటాను. అతను రాకపోతే స్వయంగా నువ్వే ఒకసారి వెళ్ళి రావలసివస్తుంది" అన్నది.

బిహారి వుత్కంఠితుడై "నన్ను అడుగకుండా యీ పని ఎందుకు చేశావు?" అన్నాడు.

"ఏమిటి బిహారీ! అతను రాడా ఏమిటి?"

బిహారి తలకాయతిప్పి "వస్తాడేమో, ఒకసారి నన్ను అడిగితే యేం?" అన్నాడు.

"ఎందుకు బిహారీ?"

బిహారి సంకోచంతో మెదలకుండావూరుకున్నాడు. చెప్పటం అవసరమే కాని మహా హానికరమైనమాట ఒక్కసారిగా అతని నోటినుండి రాలేదు.

"ఈ సమయంలో అతను రావటం చాలా అవసరం బిహారీ?" అన్నది సావిత్రి.

బిహారి అతి కష్టంమీద సంకోచం వదలి "ఆ సంగతి తెలుసుకాని, నువ్వు కూడ లేకపోతే దేశంమీదవాళ్ళంతావచ్చి బాబుగారి మంచంచుట్టూ చేరే వారు. వారు దక్కటం మరీ కష్టం. ఈ విషయం ఎందుకు ఆలోచించవు?" అన్నాడు.

"అంతా ఆలోచించాను బిహారీ! నేను వారికి కనపడకుండా ఇంట్లో పనిపాటులు చేసుకుంటూ వుంటాను. వుపేంద్రబాబు రానిదే పని జరుగదు. అదిగాక నేను ఆడదాన్ని - ఈ ఆపదసమయంలో మంచిచెడ్డలను గురించి ఎవరు ఆలోచిస్తారు? కాదులే బిహారీ, అతను వస్తేనే మంచిది" అన్నది సావిత్రి.

"నాకు వుపేంద్రబాబుగారి సంగతి తెలియదుగాని, మా బాబుగారి సంగతి తెలుసు. నేను మూర్ఖుణ్ణయినా అరవై ఏళ్ళనుంచి లోకాన్ని చూచాను. నీకన్న మంచిచెడ్డలు ఎంతమంది మగవాళ్ళకు తెలుసు? అవన్నీ వదలి పెట్టు. నువ్వు వెళ్ళిపోతే బాబుగారికి ఈసారి నయంకావటం కష్టం. నీ పాదాలంటి వేడుకొంటున్నాను - అలాంటి పనిచెయ్యకు. బాబుగారిని వదిలి ఎక్కడికీ వెళ్ళబోకు" అన్నాడు బిహారి.

ఈవిషయం సావిత్రికన్న బిహారికి ఎక్కువ తెలుసుననేమీ కాదు. అయినా ఆమె మెదలకుండా వూరుకుంది. ఆమె లేకపోతే తన వ్యాకులత ఎంత ఎక్కువౌతుందో సతీశునికే తెలుసు. కాని అలాంటి ప్రమాదకరమైన జబ్బు స్థితిలో సావిత్రి సతీశుని వదిలి ఎలావుండగలదు? తనంటేనూ-సతీశుడంటేనూ-వుపేంద్రునికి ఏవగింపని ఆమెకు తెలుసు. అతనువస్తే ఆమె తప్పుకు తిరగాలి. ఈ సంగతులన్నీ సావిత్రి బాగా ఆలోచించి చూచింది. ఇన్ని దుఃఖాలు సహించిన వ్యక్తికోసమే ఈ దుఃఖంకూడా సహిస్తానని స్థిరపరచుకొని అతని రోగం సంగతులన్నీ వుపేంద్రునికి రాసి పంపించింది. అతన్ని రమ్మనికూడా బలవంతం చేసింది. సావిత్రి దృఢంగా "నేను బిహారీ, అలా జరుగనియ్యను. అతను ఎల్లుండివరకు రాకపోతే నువ్వు స్వయంగా వెళ్ళి పిలుచుకురావాలి" అన్నది.

బిహారి వుదాసీనభావంతో "అలా అంటావెందుకు అమ్మా! నేను నీ నౌకరువా ఏమిటి, నువ్వు చెప్పినవన్నీ చెయ్యటానికి? కాని నేనుకూడా మనిషినే. నువ్వు వుండలేకపోతే, చాటుమాటుగా నన్ను తిట్లుమాత్రం తిట్ట

లేదు, ముందుగానే చెబుతున్నాను" అని అతను ఉదాసీనవదనంతో వెళ్ళి పోయాడు.

కాని సావిత్రి మాత్రం ఉపేంద్రునికి అందలేదు. తండ్రీ, మహేశ్వరి మాటిమాటికీ బలవంతం పెట్టడంవల్ల తన ఇష్టంలేకపోయినా—గాలి మార్పుకి ఇంటిదగ్గరనుండి పూరీవచ్చి ఒక నెలరోజులైంది.

అక్కడ ఎవరితోనూ పరిచయం లేకపోవటంవల్ల మొదటిరాత్రి అతను ఒక చిన్న హోటల్‌లో ఆగవలసివచ్చింది. మర్నాడు ఉదయాన మంచిహోటల్ కింకెక్కడికైనా వెళ్దామనుకున్నాడు. కాని హోటల్ యజమాని భువన ముఖోపాధ్యాయులు అతన్ని బాగా ఆదరించాడు. అతనికి ఏవిషయంలోను ఇబ్బందికలుగకుండా శ్రద్ధవహించాడు. ప్రత్యేకంగా ఒకగదిలో బస ఏర్పాటు చేసి ఎంతకాలమున్నా మీ సేవాశుశ్రూషలలో ఏమీ లోటు రానివ్వనని మాట యిచ్చాడు.

ఉదయం ఒక ప్రౌఢస్త్రీ పాచిపనిచెయ్యటానికి వచ్చి ఉపేంద్రబాబు మొహంకేసి ధ్యానంతో చూచిచూచి, చీపురు అవతల పారేసి అతని కాళ్ళ మీద పడింది. "ఒంట్లో ఏమైనా జబ్బు ఏర్పడిందా బాబు, చాల చిక్కిపోయి నట్లున్నారు. మొహంలో ఇదివరకంత తేజస్సులేదు, ఒంట్లో పుష్టి కనబడటం లేదు" అన్నది.

ఉపేంద్రుడు ఆశ్చర్యంతో "నువ్వు నన్ను ఎరుగున్నావా?" అన్నాడు.

"నేను మీ దాసీ మోక్షదాను. మిమ్మల్ని ఎరగనూ?" అన్నది ఆమె.

కొంచెంసేపటికి ఉపేంద్రునికి మోక్షదాసంగతి జ్ఞాపకమొచ్చింది. చాల కాలంక్రితం ఆమె ఉపేంద్రుని ఇంట్లో పనిగత్తెగా వుంటూ వుండేది. "నువ్వు ఇక్కడ నౌకరీచేస్తున్నావా ఏమిటి?" అన్నాడు.

మోక్షదా కొంచెం సిగ్గుపడి "కాదు. అవునుబాబూ! ఒకవిధంగా నౌకరీయే చేస్తున్నాను. కలకత్తాలో ఏమిపడివుంటాం, ఏ పుణ్యక్షేత్రానికో వెళ్ళి వుందాం — లేకపోతే — ఒకహోటలు పెట్టుకొని...... అన్నాడు ముఖోపాధ్యాయులుగారు........." అన్నది.

ఉపేంద్రుడు మధ్యలోనే "హోటల్ బాగా సాగుతూ వుందా?" ఆమె మాటలు వినటానికి ఉపేంద్రునికి ఇష్టంలేదని మోక్షదా అతని మొహన్ని బట్టి

తెలుసుకుంది. "ఏదో సాగుతూవుంది. ఈ వయస్సులో నేను నౌకరీ చెయ్యలేను. ముఖోపాధ్యాయులుగారి ఆశ్రయమూ వదిలిపెట్టలేను. దాన్ని ఒక విధంగా నేనే పెంచి పెద్దదాన్ని చేశాను. నన్ను పిన్నీ అంటూవుండేది. నాబిడ్డలాగ హృదయానికి హత్తుకువుంచాను. ఆమె ఎవరో తెలియదు? అవేవీ నావల్లకాదు పిన్నీ అనేది సావిత్రి. నేను బాబుగారి మెస్సులో నౌకరీ కుదిర్చాను. బాబులు ఆమెను నౌకరు అనుకునేవారుకాదు. ఇంటి యజమానురాలనుకునేవారు. ఆమె వెళ్ళిపోకపోతే నేను ఇవ్వాళ ఇదంతా చెయ్యవలసివచ్చేదికాదు. మనలో మాట-చిన్నబాబుగారిమూలానే మేము ఇవ్వాళ ఈ కష్టాలన్నీ పడవలసి వచ్చిందిబాబూ!" అన్నది.

వుపేంద్రుడు వుత్సుకతతో "చిన్నబాబుగారు ఎవరు? సతీశుడా?" అన్నాడు.

"అవును. ఆపిల్ల చిన్నబాబును ఏ కళ్ళతో చూచిందోకాని-అతను ఆమెకోసం సర్వస్వం అర్పించాడు. ఇంతిచేసినా ఆమె చిన్నబాబును వంటిమీద చెయ్యికూడా వెయ్యనిచ్చిందనుకున్నావా? ఎప్పుడూలేదు. విపినబాబులాంటి లక్షాధికారికూడా నా వాకిటిముందుకు వచ్చి నెలకు పదివేల రూపాయలిస్తానన్నాడు. కాని పిల్ల అతనికేసి కన్నెత్తికూడా చూడలేదు. ఆమె మొహంలో ఒక అపూర్వతేజస్సు వుంది! పది-పదిహేనువేల రూపాయల కానుకలనుకూడా ఈసడింపుతో కాలదన్ని అన్నీ వదిలిపెట్టి కట్టుబట్టతో వెళ్ళిపోయింది. చేతలాలో ఎవరో బ్రాహ్మలవద్ద ఆరునెల్లపాటు నౌకరీచేసింది. పని చేస్తూచేస్తూ పాప మా చిన్నకొయ్యకు బోమికలు బైటపడ్డాయి. అక్కడనుంచి ఎక్కడికి వెళ్ళిందో ఆకాశీతల్లికి తెలుసు! పాపం, బతికేవుందో, చనిపోయిందోకూడా అంతులేదు......" అంటూ వుండగానే మోక్షదా కళ్ళల్లో నీరు తిరిగినై.

వుపేంద్రుడు మొదలకుండా ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

మోక్షదా కళ్ళు తుడుచుకొని రుద్ధకంఠంతో "ఇప్పుడు చిన్నబాబు ఎక్కడ వున్నాడుబాబూ! ఒకసారి కనబడితే అడుగుతాను-ఆమె అంతు ఏమైనా కనుక్కున్నాడో లేదో?" అన్నది.

వుపేంద్రుడు చిరునవ్వుతో "ప్రస్తుతం సతీశు డెక్కడున్నాడో నాకూ సరిగా తెలియదు. తనవూరికి వెళ్ళిపోయాడనిమాత్రం విన్నాను. ఆ సావిత్రి ఎవరు, మోక్షదా?" అన్నాడు.

మోక్షదా క్రోధంతో మండిపడి "ఎవరా? ఒక కులీన బ్రాహ్మణ బిడ్డ! తొమ్మిదేళ్ళ వయసులోనే విధవయైనది. పాడుమొహమాడు - పెళ్ళి చేసుకుంటాను - రాణిని చేస్తానని ప్రోత్సహించి లేవదీసుకొచ్చాడు. తర్వాత నట్టేట్లో వదిలిపెట్టి పారిపోయివచ్చాడు. ఇతనితో వేగుతూవుంది నేనొక్కదాన్నే - వీడు బ్రాహ్మడు కాడు, మాదిగాడు. మాదిగవాడిచేతి నీళ్లయినా తాగవచ్చుగాని వీడి చేతినీళ్ళు తాగితే పంచపాపాలు చుట్టుకుంటై" అన్నది.

వుపేంద్రుడు ఈ సంగతులన్నీ సరిగా తెలుసుకోలేక పోయాడు. "ఎవరిసంగతి చెబుతున్నావు మోక్షదా?" అన్నాడు.

మోక్షదా మొహం చిట్లించుకొని "ఇదే, ఈ పాడు మొహపు భువన ముఖోపాధ్యాయులు - అలాంటి నీచుడు మూడులోకాలలో ఎవరున్నారు? ఇతనే ఆమె అక్కమొగుడు, ఆతనిపనే ఇది" అన్నది.

వుపేంద్రుడు ఆశ్చర్యంతో "ఈ హోటలు యజమానా?" అన్నాడు.

"ఔరే బాబు! ఈ పాడుమొహమాడే. వీడు ఆమెను ఏమి చేయగలిగాడు? అగాధసముద్రములో ముంచాడు. అంతకు తప్ప ఆమె ఒంటిమీద చెయ్యికూడా వెయ్యగలిగాడనుకున్నావా? తీసుకొచ్చిన తర్వాత వీడు- ఇవ్వాళకాదు, రేపు అని నెలరోజులుదాటేసి ఆఖరికి పెళ్ళిచేసుకోనన్నాడు. అప్పుడు ఆమె వీడి మొహంమీద తన్ని వచ్చింది. చిన్నతనం, లోకానుభవము లేదు. అయినా తర్వాత ఆమె గడపకూడా తొక్కగలిగాడా? ఆమె మోక్షదాకాదు-రెండు తియ్యని మాటలు చెప్పగానే నీరైపోటానికి! ఆమె సావిత్రి. పదివేల రూపాయల నగలనుకూడా కాలదన్నిన సావిత్రి!" అన్నది మోక్షదా.

వుపేంద్రుడు కొంచెంసేపు మెదలకుండా వుండి "మీ ముఖోపాధ్యాయుని కొంచెం పిలుస్తావు? అతన్ని రెండు మాటలు అడగాలి" అన్నాడు.

"బజారుకు వెళ్లాడు." కొంచెం ఆగి "ఈ మధ్య ఒకరోజున దారిలో చక్రవర్తి కనపడ్డాడు. అతను ఏడుస్తూ 'ఆమెను అంతా ప్రేమించుతారు. రూపానికి తగినగుణం. అలాంటివే దయాదాక్షిణ్యాలుకూడా వున్నాయి ఆమెలో" అన్నాడు

"చక్రవర్తి ఎవరు?" వుపేంద్రుడు అడిగాడు.

"బాబుగారి మెస్సులో వంటచేస్తూ ఉండేవాడు: అతనికిఅంతా తెలుసు. విహారినోటినుండి విని చేతిలాలో ఎవరో బ్రాహ్మణుల ఇంటివద్దనౌకరీ చేసుకుంటూ వుండగా జబ్బుపడి పాప నూపసిది సెలవుఅడిగింది. అప్పుడు ఆ నిర్దయుడు 'నీఋంటుమాకులకు ఏడురూపాయలైనాయి. ఇచ్చి కదలమన్నాడు' అని విన్నాను. బ్రాహ్మణులు అంతకతిను లుంటారా? డబ్బుకని బాబుగారివద్దకు నడిచివచ్చింది. ఇటు బాబుగారి స్వభావముకూడా కొంచెం విశాలమైంది. డబ్బు దస్కం ఎవరడిగినా లేదనటంలేదు! కాని దాని దురదృష్టం-ఆరాత్రే - బాబుగారి తెలిపితెక్కువ స్నేహితుడొకడు సపరివారంగా అక్కడికి వచ్చాడు. చిన్నకోమ్య స్నానంచేసి ఇంట్లోకి - వస్తూవుంది. ఇది వారు చూచారు. - ఆ రాత్రివుండవచ్చునా! ఆమెను చూడగానే క్రోధంతో భార్యను తీసుకొని తిరిగి వెళ్లిపోయాడు. చిన్న బాబుగారు విభ్రాంతులైపోయారు. కాని మా సావిత్రి చాల అభిమానం కలది. ఈ అవమానం సహించుకలిగింది దనుకున్నావా? ఇక అక్కడ పచ్చినీళ్ళుకూడా ముట్టకుండా వెంటనే వెళ్ళిపోయింది. అప్పటినుండి ఆమె అంతేమీ తెలియటంలేదు" అన్నది మోక్షదా.

వుపేంద్రుడు స్తబ్ధుడై కూర్చొబడిపోయాడు. ఆరాత్రి ... నిష్ఠుర చరిత్రంతా అతని కళ్లల్లో మెల్లగ సాగింది. మోక్షదా మాటల్లో సగమైనా నిజముంటే- నేను ఇంతకాలంనుండీ ఈసడిస్తూన్న సావిత్రి ఎంత విచిత్రమైన వ్యక్తి అన్నప్రశ్న చెలరేగింది.

మోక్షదా తన పనిమీద వెళ్ళిపోయింది. కాని వుపేంద్రుడు అక్కడే ఆలోచిస్తూ కూర్చుని వుండిపోయాడు. ఆరు నెలలకు పూర్వం ఈ సంగతులన్నీ అతను వినుకూడా లేదు. అసత్యం, మిథ్య, కలంకాలతో కలుషితమైనదానిని విషంలాగ పరిత్యజించటం తప్పనిసరి. అందుకనే అతను సతీశునిలాంటి బాల్య స్నేహితునికూడా పరిత్యజించాడు. కాని ఇవ్వాళ మోక్షదామాటలలో అతని రెప్పలు బరువెక్కినాయి. స్ఫటికమణిలాంటి స్వచ్ఛమైన అతని కఠినహృదయం ఇవ్వాళ ఒకఅజ్ఞాతనారియొక్క కలంకిత ప్రణయవేదనాగాథ చెవిని పడగానే ఆ స్వచ్ఛతమీద కొంచెంమచ్చపడింది. దీనినిగురించి అతను ఆలోచించివట్లయితే ఈ బలహీనం ఇంతవరకు ఆ స్ఫటికపురాతిక్రిందే వుందని గ్రహించేవాడు. సురబాల అతని సగంశక్తి హరించిపోయినతర్వాత - ఈ అవకాశం చూచుకొని ఇవన్నీ ఒక పెద్దప్రవాహంలాగా అతని రాతిగుండెను ఛేదించుకొని పైటికి

వచ్చాయి. సురబాల అతన్ని ఎంత శక్తిహీనుణ్ణి చేసిందో తెలుసుకున్న తర్వాత ఉపేంద్రుడు భయపడిపోయాడు.

కాని అతని ధ్యానం అటుపోలేదు. కేవలం అతను శూన్య దృష్టితో చూస్తూ కూర్చున్నాడు. ఏదో అపరిచిత సావిత్రి ప్రేమగాథ సురబాల సూది చూపులాగ అతని మనసులో నాటుకుపోయింది.

భువనముఖోపాధ్యాయుని పిలుపుతో అతని ధ్యానం భంగమైంది. అతను దగ్గుతూ గదిలో అడుగుపెట్టి "మీరు నన్ను పిలిచారా?' అన్నాడు.

"కూర్చో. నువ్వు సావిత్రిని ఎరుగున్నావా?" అన్నాడు ఉపేంద్రుడు.

ముఖోపాధ్యాయులు తలవంచుకొని "ఆఁ ఎరుగున్నాను" అన్నాడు.

"ఆమెను గురించి నీకు తెలిసినంతవరకు నాతో చెప్పగలవా?"

"ఎందుకు చెప్పను?" అతను గంభీరంగా తన అపరాధగాథనంతా చెప్పి వినిపించాడు. చివరికి "నేనూ వృద్ధుల కుటుంబములో దిక్కునే బాబూ! కాని మొదట నేను ఈ విషయం గ్రహించినట్టయితే ఈ బాటలోకి వచ్చేవాణ్ణి కాదు! ఇవ్వాళ నేను పరాయి దేశంలో ఈ హోటలు పెట్టి పొయ్యి దగ్గర కూర్చుని పొట్టపోసుకొనే అవసరమూ వుండేది కాదు. ఆమె బ్రతికి వుండగా ఆమె నెవరూ చెరచలేరని నా నమ్మకం" అన్నాడు.

"ఇప్పుడేం చేస్తాం నీ యీ నమ్మకాన్ని పెట్టుకొని?"

"అయినా ఆమె ఏమీ చెడిపోలేదని పరలోకంలో సమాధానమివ్వగలను" అన్నాడు ముఖోపాధ్యాయుడు.

అతను వెళ్ళిపోయిన తర్వాత ఉపేంద్రుడు నిశ్చేష్టుడిగా మూగవాడిలాగ కూర్చుని వుండిపోయాడు. 'నీవు చేసింది మంచిది కాదు ఉపేంద్ర! అలాంటి మహాప్రలోభాలను కూడా తృణప్రాయంగా జయించగలిగిన నిస్సహాయ స్త్రీని అవమానపరిచే అధికారం నీకేమీ లేదు' అని అతని మనసు మాటిమాటికి అంకుశంతో పొడవసాగింది.

ఆ సాయంత్రమే ఉపేంద్రుడు భువనముఖోపాధ్యాయుని హోటలు వదలి మరోచోటికి వెళ్ళిపోయాడు.

కాని సముద్ర వాతావరణం అతనికి స్వస్థత చిక్కించ లేదు. ప్రొద్దెక్కినకొద్దీ అతనికి జ్వరం ఎక్కువ కాసాగింది. రోజురోజుకీ అతన్ని పరలోక

వాసిని-పతి వియోగ సురబాల దాపుకు చేర్చుతూవుందని అతను లోలోన గ్రహిస్తూవున్నాడు.

ఈ విధంగా సముద్రతీరపు ఈ నిర్జన ప్రదేశంలో ఈలోకపు జీవితావధి నిత్యా తగ్గిపోతూవుండగా ఒకనాడు బిహారీ వుత్తరం ఇంటివద్దనుండి తిరిగి అతని చేత పడింది.

తలుపుకురాగానే అతని హృదయంలో నూదిలాగ బాధకలిగేవ్యక్తిని అనవసరంగా అనాలోచితంగా త్యజించిన వ్యధ నిత్యా వృద్ధికాసాగింది. ఇది అతని అంతర్యామికే తెలుసు. కాని ఇవ్వాళ బాల్యమిత్రుని భయంకర రోగాన్ని గురించి చికిత్స, పథ్యపానాదులు సరిగా లేకపోవటం ఆదిగాగల విషయాలు బిహారీ ఉత్తరంద్వారా తెలుసుకొని-ఎంతోకాలానికి ఇవాళ వుపేంద్రుని కుష్కాధరాలమీద సన్నని చిరునవ్వురేఖలు పరుగెత్తాయి. ఇక అతని రోజులుకూడా దగ్గరకు వస్తున్నవని పాప మాతనికి తెలియనే తెలియదు. అతని చేతికి మరొకవ్యక్తి సేవాశుశ్రూషల గురుతరభారం అప్పగించ దలచు కున్నాడు. ఏమైనా ఆరోజునే వుపేంద్రుడు తన సామాను సర్దుకుని ప్రయాణ మయ్యాడు.

## ౪౧

జ్యోతిష్ హైకోర్టునుంచి తిరిగివచ్చి ఇంట్లో అడుగుపెట్టగానే ఎదు రుగా సరోజినీ, శశాంకుడు ఈజీచైర్లమీద కూర్చుని మాట్లాడుతూ వుండటం చూచాడు.

శశాంకమోహనుడు లేచి నుంచుని చిరునవ్వుతో "ఇవ్వాళ పనులు త్వరగా అయిపోయినయి. ఇక్కడే కాఫీత్రాగి కలిసి క్లబ్‌కు వెళ్ళవచ్చు నను కుని వచ్చాను" అన్నాడు.

"మంచిదే! మంచిదే!" అని జ్యోతిష్ నవ్వు ఆపుకొని ఇంట్లోకి వెళ్ళి పోయాడు.

సరోజిని అన్న వెంట లోపలికి వెళ్ళుతూ వుండేప్పటికి జ్యోతిష్ చూచి వెనక్కి తిరిగి నుంచుని గదమాయిస్తూ "అతిథిని ఒంటరిగా వదిలిపెట్టి నువ్వూ... నీ తెలివి ఏమైంది సరోజినీ!" అన్నాడు.

సరోజిని మళ్ళా కుర్చీదగ్గరకు వెళ్ళి కూర్చుంది. ఆమె మొహం ఎర్రబడింది.

తల్లి అభ్యాసానుసారంగా కోర్టునుండి వచ్చిన తర్వాత కోటు హేటుతీసి కాళ్ళుచేతులు కడుక్కొని కాఫీ తీసుకోనవలసివస్తుంది. తల్లిదగ్గరకువెళ్ళి "శశాంకమోహనుడు వచ్చాడు. కాఫీ బైటకి పంపించుఅమ్మా!" అన్నాడు జ్యోతిష్.

"సరే, సరోజిని బైటవుందా?" అన్నది తల్లి.

"జ్యోతిష్ తలకాయ వూగించి "వున్నది" అన్నాడు. తర్వాత మళ్ళా కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "అయితే, ఏ కళంకమూలేని మనిషి ప్రపంచంలో ఎక్కడైనా వున్నాడా అమ్మా!" అన్నాడు.

జగత్తారిణికి ఈ ప్రశ్న నచ్చలేదు. "మాటిమాటికి నువ్వు నన్ను అలాంటి ప్రశ్న వేస్తావెందుకు జ్యోతిష్? ఇక నాదేమీ లేదని నీకు నేనెన్నోసార్లు చెప్పాను. నీకు నచ్చినవాడికే యిచ్చిచెయ్యి సరోజినిని" అన్నది.

"కళంకంలేనిమనిషి ఎవరమ్మా? నేను అనేకవిధాల ఆలోచించి చూచాను. ఈ సంబంధం చేసినందువల్ల సరోజిని ఏమీ కష్టపడదు. ఇదీగాక ఇప్పుడామె పెద్దదికూడా అయింది-ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా ఏపని చేయటమైనా మంచిదికాదు" అన్నాడు జ్యోతిష్. ఇంతలో సరోజిని అన్నదగ్గరకువచ్చి నుంచున్నది.

తల్లి సామానుగదిలోంచి పూళ్ళాడుతూవుంది. అందుచేత కూతురుని చూడలేదు. జ్యోతిష్మాటకు ఆమె విసుక్కొని "ఆమె అభిప్రాయం తెలుసుకోకుండా పెళ్ళిచెయ్యమని నేనెప్పుడూ అనలేదు నాయనా! నా మనోవాంఛ మీ అన్నాచెల్లెలూ ఇద్దరుకలిసి తీర్చకపోవటం-ఆమె మనసులో భావాన్ని తెలుసుకోవటంవల్లనేనా? నాకు అంతా తెలుసు నాయనా! తెలిసే నోరుమూసుకు కూర్చున్నాను. ఇప్పుడునాకు........" అని ఆమె కాఫీ సామాను బైటికి తీసికొచ్చింది. సరోజిని సిగ్గుతో కుంగిపోతూవుంది. కాని

తల్లికి ఏమీ తెలియదు. జ్యోతిష్ సమాధానం చెప్పకముందే తన మాటల ధోరణిలో "ఆమెకు ఎవరిని చేసుకోవాలని కుతూహలంగా వుంటే అతనికే యిచ్చి చెయ్యి నాయనా! మాటిమాటికి నా అభిప్రాయం తెలుసుకునేంత అవసరమేమిటి! నా వుద్దేశం స్పష్టంగానే చెప్పేశానుగా" అన్నది.

చెల్లెలి సిగ్గుచూచి జ్యోతిష్‌కూడా చాలసిగ్గుపడ్డాడు. కాని తన మనసులో వుద్దేశాన్ని ఆపుకొని చిరునవ్వుతో "ఆ వుద్దేశమే సంతోషపూర్వకంగా యివ్వాలి అమ్మా!" అన్నాడు.

"సంతోషపూర్వకంగానే యిస్తున్నాను నాయనా! ఇకమీరు నన్ను యాతన పెట్టకండి" అన్నది జగత్ తారిణి.

జ్యోతిష్ కొంచెంసేపు మెదలకుండా వూరుకొని-ప్రసంగం ఇంతవరకు వచ్చినప్పుడు ఇవ్వాళే ఏదోవిధంగా తేల్చుకోవాలని నిశ్చయించు కొన్నాడు. కారణం క్లబ్బులోను లైబ్రరీలోనూ - అంతటా ఈ విషయాన్ని గురించే ఆలోచన జరుగుతూవుంది. కాని చివరికి ఏమికానున్నదో అర్థంకావటంలేదు. ఇంట్లో ఈ ప్రసంగం రాగానే వెంటనే ముగిసిపోయేది. ముందుకు సాగి పోయేదికాదు. శశాంకుణ్ణికూడా ఈ పీకులాటలో ఇంకెక్కువకాలం యాతన పెట్టటం మంచిదికాదు. "అయితే మనవారి నలుగురిమధ్య వచ్చేఆదివారంనాడు ఖాయపరుచుకుందామా? ఏమంటావు అమ్మా?" అన్నాడు.

"మంచిదే!" అన్నది తల్లి.

సరోజిని మెల్లగా తన గదిలోకి వెళ్ళిపోయింది.

ఆదివారం ఉదయం జ్యోతిష్‌కచేరి బంధు మిత్రులతో నిండి వుంది. సంబంధం ఖాయమై వివాహం నిశ్చయమైన తర్వాత - భోజనా లవీ కూడా ఇక్కడే జరుగుతాయి.ఇవ్వాళ శశాంకుని వేషవిన్యాసాలలోనేకాదు-విశేషం కనపడేది - అతని వదనంమీదకూడా చిరునవ్వు నాట్యం మాడుతూవుంది. కొంతమంది స్త్రీలుకూడా వచ్చారు.కాని ఆశ్చర్య మేమిటంటే సరోజినిమాత్రం రాలేదు. మనిషి పంపిన తర్వాత ఎంతసేపటికీ రాకపోయేప్పటికి జ్యోతిష్ స్వయంగా వెళ్ళి రమ్మని పిల్చాడు. మరొకనాడు ఆమె ఇలాంటిపనిచేస్తే నేర స్థురాలుగా పరిగణించబడేది. కాని ఇవ్వాళ ఆమె క్షమార్హురాలు.

తర్వాత పిలుపులమీద పిలుపులువెళ్ళిన తర్వాత తొమ్మిదిగంటలకు సరోజిని వచ్చింది. ఆమె మొహంచూచి అందరూ ఆశ్చర్యపోయారు. మొహం నల్ల

బడింది, కళ్ళు ఎర్రబడ్డాయి-రాత్రంతా నిద్రలేనట్లు. జ్యోతిష్ స్థిరదృష్టితో ఆమె మొహంకేసిచూచి మాటలుకూడ పోయాడు. కాని కొంచెంసేపు వున్న తర్వాత అంతకంటె ఎక్కువ ఆశ్చర్యం కలిగేది అతనికి తెలియదు. ఆ మహాశ్చర్యం వుపేంద్రుని ఛాయలో నే ఎదురుగావున్న పరదా తొలగించి ఇంట్లోకివచ్చింది. జ్యోతిష్ త్రుళ్ళిపడి "ఎవరది? వుపేంద్ర?" అన్నాడు.

"వుపేంద్రబాబు?" అన్నది సరోజిని.

పగటివేళ కాకపోయినట్లయితే బహుశా మీరు వుపేంద్రుని గుర్తించేవారే కారేమో! మనుష్యుని మొహం ఇంతమారిపోతుందా అని వారికెవ్వరికీ నమ్మకం కలగటంలేదు. వుపేంద్రుడు ఒక కుర్చీమీదకూర్చుని "ఒంట్లో బాగుండ లేదు. పూరినుంచి వస్తున్నాను. ఇవ్వాళ ఇదంతా ఏమిటి?" అన్నాడు.

సరోజిని దగ్గరకువచ్చి అతనిచెయ్యి తనచేతిలోకి లాక్కుని మొహం కేసిచూస్తూ "జబ్బుపడ్డావా ఏమిటి వుపేంద్రబాబు?" అంటూ వుండగానే ఆమె కళ్లనిండా నీళ్లు తిరిగినాయి. వుపేంద్రుడు తన శుష్కవదనంమీదికి చిరునవ్వు తెచ్చిపెట్టుకొని "జబ్బేమీ లేదమ్మా!" అన్నాడు.

వుపేంద్రుడు ఆమెను ఇవ్వాళే మొదటిసారిగా 'అమ్మా'అని సంబోధనతో పిలవటం. సరోజిని వెంటనే కన్నీళ్లుతుడుచుకొని "పద, ఆగదిలోకెళ్ళి కూర్చుందాం" అని అతనిచెయ్యిపట్టుకొని మెల్లగా ఆ గదిలోంచి బైటికివెళ్ళి పోయింది. దానితోపాటు ఆగదిలో నున్న ఆనందోత్సవంకూడా ఒక్కసారి అణగిపోయింది. జ్యోతిష్‌వచ్చి "వుపేంద్రుడు కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటాడు, నువ్వు ఒక్కసారి ఆగదిలోకి పద" అనేప్పటికి సరోజిని తలకాయి తిప్పి స్పష్టంగా "ఇవ్వాళిటికి ఆగు" అన్నది.

జ్యోతిష్ ఆశ్చర్యంతో "ఆగేది ఎలాగ?" అన్నాడు.

సరోజిని మళ్లా అలాగే తలకాయ తిప్పి "కాదు అన్నయ్యా, ఇవ్వాళికి ఆగు" అన్నది.

జగత్ తారిణి కబురుతెలిసి ఏడుస్తూవచ్చి "ఇదేంజబ్బు నాయనా! నువ్వు ఇంకెక్కడకీ వెళ్లవద్దు వుపేంద్ర్! ఇక్కడేవుండి డాక్టరువద్ద మందుతీసుకో, లేకపోతే రోగం నయంగాదు" అన్నది.

సరోజిని దాన్ని బలపరుస్తూ "అవును వుపేంద్ర్ అన్నా! నువ్వు మావద్దే వుండాలి" అన్నది. ఆమెకూడా ఇవ్వాళే మొదటిసారిగా వుపేంద్రుని 'అన్నా'

అని పిలిచింది. ఉపేంద్రుడు వైద్యానికని వూరునుండి బయలుదేరి వచ్చాడు. ఈ సంగతి అడగకుండానే అంతా గ్రహించారు.

ఉపేంద్రుడు చిరునవ్వు నవ్వి "సరే. వుంటానుగాని, ఇవ్వాళే నన్ను వదలి పెట్టండి" అన్నాడు.

జగత్ తారిణి ఆశ్చర్యంతో "ఇవ్వాళా? ఎందుకు?" అన్నది.

ఉపేంద్రుడు సతీశుని కఠినరోగం సంగతీ, అతని ధర్మవైద్యాలయాన్ని గురించీ - తెలిసినంతవరకు చెప్పి జేబులోంచి బిహారి వుత్తరం తీసి సరోజిని చేతికిచ్చి "పదకొండున్నరకు బండివున్నది. భోజనం చేసినతర్వాత అతనిదగ్గరకి వెళ్ళాలి. తిరిగి రాగలిగితే మీ ఆశ్రయంలోనే వుంటాను" అన్నాడు.

జగత్ తారిణి హృదయం కదిలిపోయింది. ఆమె కళ్ళల్లో మళ్ళానీళ్ళు తిరిగాయి. ఆమె సతీశుని మనసులో గాఢంగా ప్రేమిస్తుంది. ఆ సతీశుడు ఇవ్వాళ జబ్బుగావున్నాడు. రోగంతో కృశించిపోయిన వుపేంద్రుడు అతని సేవచెయ్యటానికి వెళుతున్నాడని విని ఆమె హృదయం క్రుంగిపోయింది. ఆమె కళ్ళు తుడుచుకుంటూ వుపేంద్రుని భోజనఏర్పాట్లు చెయ్యటానికి అక్కడనుంచి లేచి వెళ్ళిపోయింది.

సరోజిని వుత్తరం మొదటినుంచి చివరివరకు రెండుమూడుసార్లు చదివి మళ్ళా తిప్పియిచ్చి కొంచెంసేపు స్తబ్ధురాలై కూర్చుంది. తర్వాత "నీవెంట నేనుకూడా వస్తానుబాబూ!" అన్నది.

"ఇప్పుడు అనవసరంగా స్టేషనుకువచ్చి ఏమిచేస్తావు అమ్మాయి?" అన్నాడు వుపేంద్రుడు.

"స్టేషనుకుకాదు, సతీశబాబుగారింటికి. నన్నుకూడా వెంట తీసుకెళ్లు ఉపేంద్రబాబూ!" అన్నది సరోజిని.

"వెర్రిదానవయ్యావా ఏమిటి? నువ్వెలా వస్తావు?" అన్నాడు ఉపేంద్రుడు.

"నీ వెంట వస్తాను."

"చా! అదెలా వీలవుతుంది? వీరు నిన్నెలా రానిస్తారు? నువ్వెలా వస్తావు?" అన్నాడు వుపేంద్రుడు.

సరోజిని తల వూగించి "లేదు, నేను తప్పకుండా వస్తాను" అని వెళ్ళిపోయింది.

జ్యోతిషు గదిలో కూర్చొని ఏకాంతంగా శశాంకునితో మాట్లాడుతున్నాడు బహుశా సరోజని సంగతులై వుంటాయి. ఆ సమయంలో సరోజని మెల్లగా అన్న వెనుకకు వెళ్ళి నుంచుని వీపుమీద చెయ్యివేసింది. జ్యోతిషు త్రుళ్ళిపడి వెనక్కి తిరిగిచూచి "ఏమిటి సరోజా?" అన్నాడు.

సరోజని మొహం అన్న చెవిదగ్గరకు తీసుకెళ్ళి మృదుస్వరంతో "సతీశ బాబుకు చాల జబ్బుగా వుందట" అన్నది.

జ్యోతిషుబాబు చాలచింతిపడుతూ "అవును, నేనుకూడా ఇప్పుడే వింటున్నాను. అయితే వుపేంద్రబాబు ఈ సరికి బయలుదేరి బండికేనా వెళ్ళేది?" అన్నాడు.

"అవును, వారివెంట నేనుకూడా వెళుతున్నాను" అన్నది సరోజని.

"నువ్వుకూడా వెళతావా? ఎక్కడికి వెళతావు?" అన్నాడు జ్యోతిషు ఆశ్చర్యంతో.

"అక్కడికే!" అన్నది సరోజని.

జ్యోతిషు సరోజనికి కేసి తిరిగి "అక్కడికి అంటే? సతీశుని ఇంటికా?" అన్నాడు.

"అవును" అన్నది సరోజని.

శశాంకుడు విస్మయనేత్రాలతో ఆమెకేసి చూస్తూ వుండిపోయాడు. జ్యోతిషు వుత్తేజితస్వరంతో "నీకు పిచ్చెత్తిందా ఏమిటి? అతను జబ్బుపడితే నీకేం? నువ్వు వెళ్ళట మెందుకు?" అన్నాడు.

సరోజని శాంతంగా దృఢస్వరంతో "నేను వెళ్ళకపోతే ఎవరు వెళతారు? నిజంగా వారు జబ్బుగావున్నారు అన్నయ్యా! నేను వెళ్ళక......" ఆ తర్వాత ఆమె మాట్లాడలేకపోయింది. గొంతు నిండుటచే అన్న భుజంమీద మొహంపెట్టి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

జ్యోతిషుని కళ్ళముందునుండి ఒక మబ్బుతెర తొలగిపోయినట్లయింది. హతబుద్ధునిలాగ కొంచెంసేపు కదలకుండా కూర్చుని మళ్ళా చేత్తో మెల్లగా చెల్లెలి తల నిమురుతూ "సరే వెళ్ళు. ఒకమనిషినికూడా వెంట తీసుకువెళ్లు. వెళ్ళగానే ఎలావుందో తంతియిస్తే డాక్టరు రమణీరమణను తీసుకొని నేనుకూడా వస్తాను" అని అతను ఆమెను తల ఎత్తించాలని చూచాడు. కాని

సరోజిని సిగ్గుపడి రెండుచేతులతో మొహం కప్పుకొని గదిలోంచి తుర్రున పోయింది.

శశాంకమోహనుడు వెర్రివాడిలాగ చూస్తూ మళ్ళా అదే ప్రశ్న వేశాడు. "సతీశబాబుకి జబ్బుగావుంటే ఈమె వెళ్ళటమెందుకు? ఇదంతా ఏమిటో నాకేం అర్థంకావటంలేదు, జ్యోతిషబాబూ!"

ఈ మాట జ్యోతిషు చెవులవరకూ పోయిందో లేదో చెప్పలేం. స్వప్నములో త్రుళ్ళిపడి లేచిన మనిషిలాగ "అతనికోసం ఈమె ఇంత వ్యాకుల పడుతుందని నేను కలలోకూడా అనుకోలేదు! ఆమె చెప్పేది ఒకటి, చేసేది మరొకటి. ఇదంతా ఏమిటో నాకేం అర్థంకావటలేదు" అంటూ బైటికి వెళ్ళిపోయాడు.

స్టేషనులోదిగి ఉపేంద్రుడు సతీశుని వూరిదారి అడిగివచ్చి క్లిష్ట విశాత్తు ఆ డిస్పెన్సరీ కాంపౌండరై పోయాడు. ఏదో పనిమీద స్టేషనుకు వచ్చాడు. తనయజమాని యింటికే వెళతారన్న సంగతి విని అటూఇటూ పరుగు లెత్తి సరోజినికి మేనా కుదిర్చాడు. తర్వాత వుపేంద్రునితో "ఆ కనపడేదే మహేశపురము. కబుర్లు చెప్పుకుంటూ వెళుతుంటే అరగంటకంటె ఎక్కువ పట్టదు. ఎద్దులబండితప్ప ఇంకేబండి దొరకదు. కాని దానిమీద వెళితే చాల ఆలస్య మౌతుంది" అన్నాడు.

ఉపేంద్రుడు నడవగల స్థితిలో లేకపోయినా ఎద్దుబండనేప్పటికి- అతను నడచి వెళ్ళటానికే వప్పుకున్నాడు.

సరోజినిని మేనాలో కూర్చోబెట్టి ఉపేంద్రుడు ఆ యువకుని వెంట నడుస్తున్నాడు. వయసు పదిహేడు - పద్ధెనిమిదికన్న ఎక్కువలేవు. మంచి చురుకైనవాడు. పేరు రామదీన్. ఇంకా రెండుమూడేళ్లు ఏదోవిధంగా తన డాక్టరుబాబువెంట వుంటూవుంటే-తర్వాత ప్రత్యేకంగా ప్రాక్టీసు పెట్టుకో వచ్చునని అతని ఆశ. వైద్యం ఏమీలేదు. చచ్చేవారు చస్తారు. బ్రతికేవారు బ్రతుకుతా రని అతని వుద్దేశం.

వుపేంద్రుడు కొంచెం సేపుండి "మీ బాబుగారికి ఎలావుంది?" అన్నాడు.

"బాబుగారా? ఇరవై రెండు లంకణాలు. ఇప్పుడు కొంచెం స్వస్థత చిక్కింది. మందు నేనే యిస్తున్నాను మహాశయా!" అని అతను అనేకసార్లు

తన బొమ్మ విరుచుకున్నాడు.

ఉపేంద్రుడు కొంచెం స్తిమితపడి "రోగం అంత ఎక్కువైందా ఏమిటి రామ్‌దీన్?" అన్నాడు.

"చాలాఎక్కువైంది! ఒకవిధంగా ఆశలే వదులుకున్నాం. సమయానికి అమ్మగారు రాకపోయినట్లయితే స్వస్థత చిక్కటమే కష్టమైపోయేది. రోగం ఎలావున్నా-మీరే చెప్పండి- ఆ వైరాగితో కలసి రాత్రింబగళ్లు గంజాయి తాగుతూవుంటే-ఇంకేం నయమౌతుంది! అమ్మగారు రాగానే గురువుగారి పెత్తనం వూడగొట్టింది. జోలీ, శంఖూ, త్రిశూలం అన్నీ దూరంగా పారేసింది. ఆ ధూర్తమానవుడు తర్వాత పెత్తనం సాగించాడా? తనే బాబుగారితో ప్రవర్తించాడు. ఒకరోజున వీణ్ణికొట్టా, ఒకరోజున వాణ్ణికొట్టా. ఒకరోజున నామీదకూడా విరుచుకుపడ్డాడు. నాకు తగూలు పోట్లాటలు అంటే గిట్టదు. మరొకడెవడైనా అయితే ఆరోజున ఆ గాడిద డొక్క చీల్చేవాడు" అన్నాడు రామదీన్.

"ఆ అమ్మగారు ఎవరేమిటి?" అడిగాడు ఉపేంద్రుడు.

"అది తెలియదు. అంతా ఆమెను అమ్మగారు అంటారు. నేనూ అంటాను" అన్నాడు రామదీన్.

"నువ్వు ఆమెను చూచావా?"

"ఆఁ చూచాను."

"ఆమె వయస్సు ఎంతవుంటుందో చెప్పగలవా?"

రామదీన్ కొంచెం ఆలోచించి "బహుశా నలభై-ఏభై సంవత్సరాలుంటాయి. ఆమె రాకపోయినట్లయితే బాబుగారిని ఎవరు అదుపులో పెట్టగలిగేవారు! ఆమె రాకపోతే బాబుగారు బ్రతికేవారు కాదని అన్నాడు డాక్టరు" అన్నాడు రామదీన్.

ఉపేంద్రుడు రామ్‌దీన్ వెంట సతీశుని ఇంటికి వచ్చేప్పటికి సూర్యాస్తమయం అవుతూవుంది. సరోజిని మేనా ముందుగానే చేరుకుంది. బోయీలు వాకిటిబైట రావిచెట్టుకింద మేనా దింపి ఉపేంద్రునికోసం ఎదురు చూస్తున్నారు. ఎదురుగా ఆస్పత్రిచుట్టూ జనం మూగివున్నారు.

రామదీన్ అందరినీ తీసుకొనివెళ్ళి వరండాలో కూర్చోబెట్టి బిహారీని పిలుచుకురావటానికి లోపలికివెళ్ళాడు. కాని అతను లేడు. డాక్టరుగారు

రోగులను చూట్టానికి వెళ్ళాడు.

ఉపేంద్రునికి అమ్మగారిని గురించి అనుమానంగా వుంది. అందుకని సరోజినిని అక్కడే కూర్చోమని చెప్పి పైకివెళ్ళాడు.

సతీశుడు మంచంమీద నిద్రపోతున్నాడు. సావిత్రి అతని తలవైపున కూర్చుని ధ్యానంతో చూస్తూవుంది. కిటికీలోంచి సంధ్యకిరణాలు గోడమీద పడుతున్నాయి

ఆ సమయంలో వాకిటిపరదా తొలగించిన శబ్దం విని సావిత్రి తలెత్తి చూచేప్పటికి పరిచితవ్యక్తి కనపడ్డాడు.

ఆమె చప్పున పయిటచెంగు సర్దుకుని లేచి నుంచోబోతూ వుండటం చూచి ఆగంతుకుడు దగ్గరకు వచ్చి "లేవవలసిన అవసరమేమీ లేదు. నేను వుపేంద్రుణ్ణి. నువ్వేనా సావిత్రివి!" అన్నాడు.

సావిత్రి తలకాయ వూగించి "అవును" అన్నది. లజ్జతో ఆమె ఒక్కసారి భూమిలో కలిసిపోవా లనిపించింది.

"సతీశుడు నిద్రపోతున్నాడా? అతని వంట్లో ఎలా వుంది?" అన్నాడు వుపేంద్రుడు.

సావిత్రి తలకాయ వూగించి "కులాసాగానే వుంది" అన్నది.

వుపేంద్రుడు మెల్లగావచ్చి మంచంమీద ఒకమూల కూర్చున్నాడు. తన కర్తవ్యాన్ని అతను మొదటే నిశ్చయించుకున్నాడు. "ఆ వుత్తరం నాకు మీరు వ్రాశారా? నన్ను రమ్మని వ్రాయకపోతే తమ సుఖదుఃఖాలను తుచ్ఛంగా తలుస్తాననిగానీ, ఆ సంగతులు నాకు తెలియవనిగానీ అనుకోవద్దు. మంచిపని చేశారు. ఇదే ఆత్మీయతాపరిచయం" అన్నాడు.

సావిత్రికి స్వప్నంచూస్తున్నానా, వీరు మరో వుపేంద్రుడేమో నని పించింది. వీరు బహుశా సతీశుని వుపేంద్ర అన్నగారేమో!

వుపేంద్రుడు కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "నీకంటె వయస్సులో నేను పెద్దవాణ్ణి. నేను నిన్ను సావిత్రీ అంటాను. నువ్వు నన్ను అన్నా అని పిలువు. ఇవ్వాళనుంచి నువ్వు నాకు చెల్లెలివి" అన్నాడు.

సావిత్రి మెదలకుండా లేచి వుపేంద్రుని పాదాలకు నమస్కరించి తల వంచుకునే "మీరు ఇంత ఆలస్యంగా వచ్చారేం? వుత్తరం సకాలానికి అంద లేదా?" అన్నది.

"మొన్న పూనేలో ప్రెండేగా అందింది. అక్కడినుంచే బైలుదేరి వస్తున్నాను. కాని నువ్వు మరో కఠినమైనపని చెయ్యవలసివుందమ్మా!" అన్నాడు సహజభావంతో.

తర్వాత ఉపేంద్రుని నోరాడలేదు.

సావిత్రి ఉపేంద్రునిబూట్లు ఒకమూల ఉంచి "ఏమిపని?" అన్నది.

ఈసారికూడా ఉపేంద్రుడు నోరు మెదల్పలేదు. తర్వాత ఎంతో బలవంతాన సంకోచాన్నణచుకొని "నీవుతప్పు అనాంటి పని చెయ్యాలవారు ఇంకెవ్వరూలేరు. చెయ్యాలశక్తి ఉన్నది-మరొకరికి-కాని ఇప్పుడామెలేదు" అన్నాడు.

సావిత్రి నందుని మెదలకుండా అతనిమాటలు వింటోంది. ఇది చూచి వుపేంద్రుడు "సరోజిని పేరు విన్నావా?" అన్నాడు.

"విన్నాను" అన్నది సావిత్రి.

"బహుశా ఇప్పుడే విన్నావేమో!"

ఆమెకు అంతా తెలుసున్నట్టు తలకాయతిప్పింది. అప్పుడు ఉపేంద్రుడు "నావెంటపడి వచ్చింది. కిందగదిలో కూర్చునివుంది. ఆమె కేదైనా వుపాయం చూడమ్మా!" అన్నాడు.

సావిత్రి కొంచెం ఆతురతతో "ఆమె వచ్చిందా? నేను ఇప్పుడే వెళ్ళి .........అయితే నేను ఆమెదగ్గరకు వెళ్ళవచ్చునా?" అన్నది.

ఈ సైగను ఉపేంద్రుడు తేలిగ్గా గ్రహించి ముక్తకంఠంతో "ఎందుకు వెళ్ళకూడదూ? మా చెల్లెలు లోకంలో ఏ స్త్రీకంటె హేయ-తలెత్తుకు తిరగలేకపోవటానికీ, సంకోచపడటానికీని? మా చెల్లెలవటమంటే భూమిమీద మామూలు పరిచయమా?" అన్నాడు.

సావిత్రి సహించలేక ఒక్కసారి వుపేంద్రుని రెండు కాళ్లమీద పడింది. ఆమె కళ్ళవెంట అశ్రుధారలు ప్రవహిస్తున్నాయి. వుపేంద్రుడు కన్నీటితో తడిసిన ముఖమండలంమీద నారీచరిత్రలోని మహామహిమను ధ్యానంతో చూడసాగాడు.

సావిత్రి కళ్ళు తుడుచుకొని ఇంట్లోంచి బైటికి వెళ్ళిన తర్వాత వుపేంద్రుడు వెనుకనుంచి వెళ్ళి "అక్కా! తన పరిచయం చేసినయామెకు మా అక్క తమ్ముళ్ళం నేటివరకు ప్రపంచంలో చేయరాని పని ఏమీ చేయలేదని

చెప్పు" అన్నాడు.

సావిత్రి వెళ్ళిపోయింది. వుపేంద్రుడు నిద్రపోతూవున్న సతీశునికేసి చూచి "సతీశ్! సతీశ్!" అని పిలిచాడు.

సతీశునికి మెలకువ వచ్చింది. అతను చివ్వున లేచి కళ్లు నలుపుకొని చూడసాగాడు.

"నీ వుపేంద్ర అన్నను గుర్తించలేదా ఏమిటి?"

"వుపేంద్ర అన్నవా!" సతీశుడు వ్యాకులిత నేత్రాలతో చూడసాగాడు.

"ఇంకా నన్ను గుర్తించలేదూ?"

సతీశుని నిద్రమత్తు ఇంకా వదలలేదు. అలసట నేత్రాలతో చూచి "ఆఁ గుర్తించాను. నువ్వా? వుపేంద్ర అన్నా!" అన్నాడు.

"అవును తమ్ముడూ, నేనే."

"అయితే ఒకసారి కాళ్ళిట్లా పెట్టు, నీ పాదాలంటి చాలాకాలమైంది"

వుపేంద్రుడు చేతులు రెండూ జాపి ప్రాణబంధువును హృదయానికి హత్తుకున్నాడు కొంచెం సేపటివరకూ ఇద్దరూ అచేతనమూర్తులులా ఒకరి కౌగిలిలో ఒకరు వుండిపోయారు. తర్వాత వుపేంద్రుడు మెల్లగా "ఇక ఆలస్యం చెయ్యకు సతీశ్, నీతో చాలా పనులున్నాయి" అన్నాడు.

"ఏమి పని? వుపేంద్ర!" అని సతీశుడు వెనక ఏదో అడుగుల చప్పుడయ్యేప్పటికి వెనక్కి తిరిగి చూచి ఒక్కసారి స్తంభించి పోయాడు. సావిత్రి చెయ్యి పట్టుకొని సరోజిని నడచి వస్తూవుంది.

అతను ఒకసారి వుపేంద్రునికేసి చూచి-మళ్లా కళ్లు నలుపుకొని ఆ రమణు లిద్దరి మొహాలకేసి మెదలకుండా చూస్తూ వుండిపోయాడు.

సరోజిని కొంచెంసేపు సతీశుని జీర్ణవదనంకేసి చూచి చివ్వున ముందుకు వచ్చి సతీశుని కాళ్లదగ్గర మొహంపెట్టి దుఃఖావేగాన్ని అణచుకోటానికి ప్రయత్నించింది. ఎవరూ మాట్లాడలేదు. కాని ఈ రోదనంలో ఎంతవ్యధ అణగివుందోమాత్రం అంతా గ్రహించారు. సతీశుడు మెదలకుండా కొయ్యబొమ్మలాగ కూర్చుని వుండిపోయాడు. అతని హృదయాంతర్భాగం ఏదో ఒక విధమైన అవ్యక్త ఆనందతరంగాలలో పొంగిపోసాగింది. మరోవైపున ఒక కఠినసమస్యాఘాతప్రతీఘాతంలో ఛితిలిపోసాగాడు. చాల సేపటివరకు ఎవరినోటివెంటా మాటరాలేదు. గోధూళివేళ ఆ నిశ్శబ్దగృహంలో సరోజిని

దుఃఖావేగాన్ని బలవంతంగా అపుకున్నా నిట్టూర్పుల చప్పుడుమాత్రం వస్తూనే వుంది. వుపేంద్రుని కంఠస్వరం ఆ శాంతాన్ని భగ్నపరచింది. అతను చేతితో మెల్లగా సరోజినితల నిమురుతూ "నేరం ఎవరిదైనా, ఇప్పుడుదాన్ని మనసులో పెట్టుకోకు సతీశ్. నా చెల్లెల్ని నువ్వు ఇవ్వాళ క్షమించాలి. చాలకాలంనుండి ఈ హృదయంలో సంచితం చేసుకున్న సుఖం ఇవ్వాళ నీసేవకోసం నావెంట పంపింది. నిజం సావిత్రీ! నువ్విలా ముఖం వేలవేసుకుంటే పని కాదు. నువ్వు ఈ మరణోన్ముఖసోదరుని కష్టాలను, బాధ్యతను ఇవ్వాళ నుండి నువ్వు భుజాన ఎత్తుకోవాలి. రా అమ్మా! నాదగ్గరకు వచ్చికూర్చో" అన్నాడు.

సావిత్రి పేరువిని సరోజిని సిగ్గూ - దుఃఖమూ - క్షోభా అన్నీ ముంచి తలపైకెత్తుకోని నుంచున్నది. ఇంతసేపటినుంచీ సరోజిని సావిత్రి వుపేంద్రునికి ఏదో ఆత్మబంధు వనుకుంటూవుంది.

సావిత్రి మెదలకుండా వుపేంద్రుని పాదాలదగ్గరకు వచ్చి కూర్చున్నది. వుపేంద్రుడు ఆమె తలమీద చెయ్యివేసి "నేను నిన్ను క్షమాపణ కోరుకోని, నిన్నవమానపర్చుతున్నా ననుకోవద్దు సావిత్రీ! కాని నన్ను నువ్వుమాత్రం క్షమించాలి. సతీశ్. నే నిదివరకు నిన్ను చేసిన అవమానాలూ, అనిష్టాలూ అన్నీ మర్చిపో" అన్నాడు.

సతీశు డేమంటాడు? అతనికేమీ అర్థంకాలేదు. అతను నోటిమాట లేకుండా కళ్లప్పగించుకొని చూస్తూ వుండిపోయాడు.

వుపేంద్రుడు వుదాసీనంగా నవ్వి "మీ రేమనుకుంటున్నారో నాకు తెలుసు సతీశ్! గంభీరంగావుండే మీ వుపేంద్రఅన్న పిల్లవాడిలాగ ఇలా వాగుతా డేమా అనుకుంటున్నారు. కాని నీ వుపేంద్ర అన్న నాలుక ఎప్పటి నుండి కట్టుబడిపోయిందో నీకు తెలియదు. అందుకని మనసులో కూడబెట్టుకున్న విషయాలన్నీ ఇవ్వాళ పెకలిబైటికివస్తున్నాయి. ఎలా అణచను?" అన్నాడు.

వుపేంద్రునిమాటల ధోరణిచూచి సతీశుని గుండె ఏదో అజ్ఞాత ఆశంకతో కొట్టుకోసాగింది. అతను ఒకవిషయం తెలుసుకోదలచుకున్నాడు. కాని అతని నోరావతలేదు. అలా కళ్ళప్పగించుకొని చూస్తూ వుండిపోయాడు

ఉపేంద్రుడు సరోజిని మొహంకేసిచూచి సతీశునితో "నీకు నయమవుతుంది. సుఖంగా వుంటేమని ఆశీర్వదిస్తున్నాను. నేను మా చెల్లెల్ని తీసుకు

వెళ్ళిపోతాను" అని నృపేంద్రుడు మెల్లగా వేళ్ళతో సావిత్రితల నిమురుతూ "నా భారం వహించేవారు నువ్వు మినహా ఇంకెవరూ లేరు సావిత్రీ! మహోచ్చెడ్డ రోగం. ఎవరిని దగ్గరకు పిలవటానికి ధైర్యం చాలటంలేదు. మంచిదీకాదు. పరోపకారంకోసం జీవిస్తూండే నీబోటి సోదరికి నాభారమంతా అప్పగించ దల చాను. వస్తావా నావెంట? సతీశుని వదలి పెట్టటంవల్ల కష్టంకలిగితే కలగనీ! ఇంతకంటె ఎన్ని కష్టాలనో దుఃఖాలనో సహించితేగాని భగవంతుడు మను ష్యుని జ్ఞానిగా తయారు చేయలేడు" అన్నాడు.

అదేప్రశ్న సతీశుని మనసులో మెరుపులాగ వచ్చింది. "మావదిన బాగుందా నృపేంద్రబాబూ! ఆమె జబ్బులో వుండగానే నేను ఇక్కడికి వచ్చేశాను" అన్నాడు తలవని తలంపుగా.

నృపేంద్రుడు కొంచెంసేపు పళ్ళతో పెదవులను కరచి పట్టుకున్నాడు. తర్వాత తన అలవాటుచొప్పున ఒకసారి పైకిచూచి "ఈ లోకంలోలేదు సతీశ్! నన్నొదలిపోయింది" అన్నాడు.

"సురబాల వదిన చనిపోయిందా?" సరోజిని ఒక్కసారి అరచింది.

"పోయింది" అన్నాడు నృపేంద్రుడు. సతీశుడు దిండుమీద మూర్ఛా హతుఎలాగ ఆనుకొని శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు.

"సురబాలలేదు, చనిపోయింది" ఈమాట నృపేంద్రుని నోటివెంట చాల చులకనగానే వచ్చింది. కాని యీ వుండకపోవటమేమిటో సతీశునికంటె ఎవరికి ఎక్కువ తెలుసు? సరోజినికంటె ఎవరు ఎక్కువ చూచారు? సావిత్రికంటె ఎవ రెక్కువ విన్నారు?

అయినా సురబాలలేదు. చనిపోయింది. సతీశుని మొహంకేసిచూచి నృపేంద్రుడు కొంచెం చిరునవ్వునవ్వి "భగవంతుడు చెంత చేర్చుకున్న దానికి ఇంకా విచారించి లాభమేమిటి! కాని ఆ అంతిమసమయంలో దివాకరుడు దగ్గర వున్నట్టయితే బాగుండేది. వాడికి తల్లిదండ్రులు లేరు. చిన్నతనంనుండి పెంచి-పోషించి ఇంతవాణ్ణి చేశాను. ఎక్కడికి పోయాడో అంతులేదు. చనిపోకముందు అతన్ని చూడాలనో లేదో తెలియదు" అన్నాడు.

సతీశుడు అదేవిధంగా మూర్ఛితునిలాగ వుండి "దివాకరుడు ఏమ య్యాడు నృపేంద్రబాబూ!" అన్నాడు.

"ఏమయ్యాడో ఎవరికి తెలుసు? కలకత్తాలో హారన్‌బాబుగారింటివద్ద వుండి చదవమని చెప్పాను. ఈ సిగ్గుమాలినమాట ఎవరితోనూ చెప్పతగిందికూడా కాదు-చెప్పటానికి ఇష్టంకూడాలేదు. ఇంటివద్దవారు ఇప్పుడుకూడా వాడు కలకత్తాలోనే చదువుతున్నాడనుకుంటున్నారు. సురబాల వాణ్ణి ఎంతగానో ప్రేమిస్తూవుండేది; పాపం, చనిపొయ్యేముందు వాడిని చూడాలన్నదికూడాను. కాని ఆమె కోర్కె తీర్చలేకపోయాను. వాడు హారన్‌బాబు భార్యను తీసుకుని ఎక్కడికి లేచిపోయాడో అంతులేదు" అన్నాడు వుపేంద్రుడు.

తర్వాత ముగ్గురూ మెదలకుండా వూరుకున్నారు. గదిలో జనశూన్య స్మశానంలా నీరవత వ్యాపించింది.

ఎవరూ వుపేంద్రుని మొహంలోకి చూడలేకపోయారు.

సావిత్రి సతీశునిద్వారా సంగతులన్నీ విన్నది. ఈ మనిషి అలాంటి శూన్యతను ఏవస్తువుతో నింపివుంచాడా? ఈ వ్యక్తితో అతను తన నిత్య జీవితయాత్ర ఎలా సాగిస్తున్నాడా? హృదయంలోపల ఇంత హాహాకారం వున్నా పైకి ఏమీ లేదేమా? అతను ఎవరినుండీ ఏమి పొందాడా? అతను సుఖదుఃఖాలను ఇంత తేలికగా చేశాడేమా?' అని ఆలోచించసాగింది.

ఆమె వుపేంద్రుని పాదాలు వత్తుతూ "ఇలాంటి జబ్బులో మీకు గాలి, మార్పు అవసరం" అన్నది.

వుపేంద్రుడు ఆమెతలమీద చెయ్యిపెట్టి "అవునమ్మా! అదే డాక్టరు కూడా చెబుతున్నాడు. కాని భగవంతుడి పిలుపు దగ్గరకు వస్తున్నవాడికి ఏమిలాభం?" అన్నాడు.

"లేకపోనీయండి. కాని మనం కొండమీదికే వెళ్ళివుందాం" అన్నది సావిత్రి.

వుపేంద్రుడు నవ్వి "సరే, అలాగే వెళదాం" అన్నాడు.

దుర్గాపూజ దగ్గరకువచ్చింది. సతీశునికి స్వస్థత పూర్తిగా చిక్కక ముందే బెంగాలీల సర్వశ్రేష్ఠఆనందోత్సవదినాలు సుఖస్వప్నంలాగ గడిచిపోయినాయి. మరి కొన్నిరోజులు ఇక్కడ వుండాలనివున్నా వుపేంద్రుని శరీరావస్థచూచి సావిత్రి త్రయోదశిరోజునే ప్రయాణం నిశ్చయించింది. వుపేంద్రుడు అడ్డుపెట్టగా "అలా వీలుగాదు బాబూ! సతీశ బాబుకి ఇప్పుడు స్వస్థత చిక్కింది. శరీరంలో పుష్టివచ్చేవరకు నేను

ఇక్కడవుంటే-రోజురోజుకీ కృశిస్తున్న నీ యీ శరీరంకూడా దక్కదు. నువ్వు అడ్డుపెట్టకుబాబూ'' అన్నది సావిత్రి.

వుపేంద్రుడు చిరునవ్వునవ్వి "సరే వస్తాను. కాని అక్కడికి వెళితే మాత్రం దక్కుతుందా?" అన్నాడు.

సావిత్రి ఇంకేం వాదించకుండా తనపనిమీద వెళ్ళిపోయింది. వుపేంద్రుని జీవితం ఇక్కడ శాంతంగా గడుస్తూవుంది. అందుచేత అతనికి వెళ్ళవలసిన తొందరేమీ లేదు. ప్రయాణం ఇంత దాపుకు వస్తుందని అతనికి నమ్మకం కూడా లేదు. కాని సతీశుని మొహం వాడిపోయింది. సావిత్రి హృదయంతో అతనికి బాగా పరిచయ ముంది. ఆమె ఎవరిమాటా వినదు. ఆమె పంచకు వచ్చినవారు - చివరివరకు అణగి వుండవలసిన సంగతి అతనికి బాగా తెలుసు. అందుచేత త్రయోదశి తిథి ఏవిధంగానూ వెళ్ళనివ్వదు. దీనిలో అతనికేమీ సందేహంలేదు. కాని అతనేమీ మాట్లాడలేదు. మర్నాడుకూడా అతనీ విషయమై ఏమీ మాట్లాడలేదు. అతని ఎదుటే బిహారి సజలనేత్రాలతో "మళ్ళా ఎప్పుడు కనపడతావమ్మా" అన్నాడు. సతీశుడు మెదలకుండా వూరుకున్నాడు.

సావిత్రి సతీశుని మొహంకేసి కనుకొలకులలోంచి చూచి గంభీరంగా "మీ బాబుగారి వివాహానికి మళ్ళీవస్తాను. బిహారీ! మీ బాబుగారు జ్ఞాపకముంచుకొని పిలవనంపితే......" అన్నది.

పదిరోజులక్రితం సరోజినిని తీసుకువెళ్ళటానికి జ్యోతిష వచ్చిన రోజునే వుపేంద్రుని మధ్యవర్తిత్వాన సరోజనీసతీశ్‌ల వివాహం నిశ్చయమైంది.

సతీశుడేమీ అడ్డుపెట్టలేదు. సావిత్రికూడా మౌనంవహించింది.

వెళ్ళటానికి వుపేంద్రుడు కొంచెం విచారపడి "నీ శరీరం అలా అస్వస్థతగా వున్నట్టు కనపడుతుందేం సతీశ్? రేపటినుంచి నువ్వు చాల విచారంగా వుంటావా!" అన్నాడు.

సతీశుడు వుదాసీనస్వరంతో "స్వస్థతగానే వుంది. విశేషమేమీ లేదు" అన్నాడు.

ఉపేంద్రుడు బైటికి వెళ్ళిపోయిన తర్వాత సావిత్రి లోపలికివచ్చింది. అతని కళ్ళు రెండు ఎర్రబడి వున్నాయి. రెప్పలు-కన్నీటితో తడిసి బరువెక్కి

నాయి. ఈ సంగతి అతనికేసి చూస్తూంటేనే కనపడుతూవుంది. సావిత్రి పట్టువేయించుకొని "మాట తప్పవుగా?" అన్నది.

"తప్పను."

"సారాయి, గంజాయి ఎప్పుడు ముట్టవుగా?"

"ముట్టను"

"నన్నడగకుండా మంత్రతంత్రాల వైపుకుకూడా మొగ్గవుగదా?"

"మొగ్గను."

"స్వస్థత సరిగా చిక్కేదాకా రెణ్ణాళ్ళ కొకసారి వుత్తరం రాస్తూ ఉంటావుగదూ?"

"రాస్తాను"

"దానిలో ఏమీ దాచవుగదా?"

"అయితే వెళ్లివస్తాను" అని సావిత్రి చప్పున చేతులుజోడించి తల వంచుకు బైటికి వెళ్ళిపోయింది.

సతీశుడు మంచంమీద కూర్చుని వున్నవాడు పడుకున్నాడు. పంపి రావటానికి కిందకుదిగి వెళ్ళే ప్రయత్నంకూడా చెయ్యలేదు.

బైట రెండు మేనాలు సిద్ధంగావున్నాయి. సావిత్రి దప్పటి కప్పుకుని మెల్లగా బైటికివచ్చి మరోగదిలోకి వెళుతూవుండేప్పటికి బిహారి పరుగెత్తుకు వచ్చి "ఒకసారి వచ్చి వెళ్ళు అమ్మగారూ? బాబుగారు ఏదో అవసరమైన పని వుందని పిలుచుకురమ్మన్నారు" అన్నాడు.

సావిత్రి తిరిగివచ్చింది. వుపేంద్రుడు మాట్లాడుతూ వున్నా అతని ధ్యానమంతా ఇటే వున్నది. చివరికి సతీశుడు ఏమైనా అడ్డుపెడతా డేమోనని సావిత్రికి మొదటినుంచీ భయంగానే వుంది-సతీశుని గదిలోకి వెళ్ళి చూచింది-సతీశుడు మరోవైపు మొహంపెట్టి పడుకొనివున్నాడు. మంచందగ్గరకు వెళ్ళి సావిత్రి నవ్వుతూ "ఏమిటిబాబూ! మమ్మల్ని ఈ బైగ్గికు వెళ్ళనివ్వవా ఏమిటి?" అన్నది. సతీశుడు చప్పున సావిత్రి కేసి తిరిగి చెయిజాపి ఆమె దుప్పటి గట్టిగా పట్టుకొని, "కూర్చో! నిన్ను వెళ్ళనివ్వను. ఇది నావూరు, నా యిల్లు, నా యిష్టంలేకుండా నిన్ను పదిమంది వుపేంద్రులువచ్చినా తీసుకువెళ్ళలేరు." అన్నాడు.

సావిత్రి స్తబ్ధురాలై పోయింది. సతీశుని కళ్ళు హింసాపూరితమైపోయినాయి. అతని ఈదృష్టి అతని స్వభావానికి పూర్తిగా వ్యతిరేకం.

అదిలింపులు బలవంతాలవల్ల పనిజరగదని సావిత్రి గ్రహించింది. ఆమె మంచంమీద ఒక పక్కగా కూర్చుని ఆప్యాయంగా స్నేహపూరితస్వరంతో "ఛా ! ఎలాంటిమాటలు మాట్లాడతావు ? వారు నన్ను బలవంతంగా తీసి కెళ్ళటంలేదు. వారికి భార్యలేదు. తమ్ముడు లేడు-. నువ్వు లేవు - అలాంటి కఠినరోగంలో శుశ్రూష చేసేవారు ఎవరూలేరు. అందుకనే వారు నిన్నడిగి నన్ను తీసుకెళుతున్నారు? దీనిని బలవంతంగా తీసికెళ్లటమంటారా?"అన్నది.

సతీశుడు తల గట్టిగా తిప్పి "ఇది అబద్ధం, మోసపుచ్చటం. వారు జ్యోతిష్‌బాబు మొహంచూచి నిన్ను నావద్దనుంచి తొలగించదలచారు. రెండు రోజులనుండీ ఎడతెరిపిలేకుండా ఆలోచించి ఆలోచించి - నేను ఈ నిశ్చయానికే వచ్చాను. మెదలకుండా సహిస్తున్నవాడిమీదే-అందరూ అన్ని అత్యాచారాలు చెయ్యాలనుకుంటారు. దీనికి కారణం ఏమైనాకానీ, నిన్ను మాత్రం వెళ్ళనియ్యను. పోనీ, యీవిషయాన్ని తర్కంలోకి దింపి బుర్రలు చెడగొట్టుకోటం నాకు ఇష్టంలేదు. బిహారీ! కిందికివెళ్ళి చెప్పు......"

సావిత్రి చప్పున చేత్తో అతనినోరు మూసి "నువ్వు పిచ్చివాడివై పోయావా ఏమిటి? అతని వుద్దేశం బాగుండలేదనే అనుకుందాం. కాని నన్ను వుంచుకొని నువ్వు ఏమిచేస్తావు చెప్పు?" అన్నది.

సతీశుడు క్షణంసేపు మెదలకుండా వూరుకొని "నేను నిన్ను పెళ్ళిచేసుకుంటానని చెబితే?" అన్నాడు.

"దీనికి నాకు ఇష్టంలేదని అంటే?" అన్నది సావిత్రి.

"నీ యిష్టానిష్టాలతో వచ్చేదీ పోయేదీ ఏమీలేదు" అన్నాడు సతీశుడు.

సావిత్రి భయపడుతూ చిరునవ్వు నవ్వి "అయితే నన్ను బలవంతంగా పెళ్లిచేసుకుంటావా?" అని చిరునవ్వును గంభీరంగామార్చి సతీశుని మొహం మీదవెంట్రుకలను ప్రేమతో చేత్తో మెల్లగా తొలగిస్తూ "ఛా! అలాంటి మాట పొరపాటునకూడా ఎప్పుడూ మనసులోకి రానియ్యకు. నేను విధవను. కులభ్రష్టురాలను. సంఘంలో వంచితురాలను. నన్ను వివాహం చేసుకున్నందువల్ల ఎంత దుఃఖపడవలసివస్తుందో నీకు తెలియదు! జన్మతోనే పవిత్రమైనవారు, శోకాగ్ని కాల్చి కరగించి ముత్యంలాగ స్వచ్ఛంచేసినవారు - తెలిసే బుద్ధిపూర్వ

కంగా ఈ దురదృష్టపు దానికి ఆశ్రయమివ్వటానికి తనవెంట తీసుకెళ్తున్నారు. అత్యంత ఆవేశంలో వుండటంవల్ల వారి శుభాకాంక్ష ఇవ్వాళ నీమనసులోకి రాదు. అందుకని వారిమీద దోషారోపణచేసి నిన్ను హీనపర్చుకోకు" అంటూ వుండగానే ఆమె కళ్లల్లో నీళ్ళు తిరిగినాయి.

ఈ కన్నీళ్ళు ఇవ్వాళ సతీశుని శాంతిపర్చలేకపోయినాయి. అతను అత్యంత వుత్తేజితుడై "అంతా అబద్ధం. నువ్వు అలాగే నానుండి ప్రత్యేకంగా వుండి నాసర్వనాశనంచేశావు. నువ్వు ప్రపంచంలో ఎవరికంటెనూ హీనురాలవు కావని ఉపేంద్రబాబే చెప్పాడు. నిజం" అన్నాడు.

"అది నిజంకాదు. ఉపేంద్రబాబు ఇప్పుడు సమాజంనుండి, ఈలోకం నుండి బాహ్యంగా వున్నాడు. అందుచేత అతని నిజంకూడా ఇతరులకు, నిజంకాదు. నిజమో, అబద్ధమో, నాకు సమాజంతో పని లేదంటావు నువ్వు. కాని నేను అలా అనలేను. సమాజం నన్ను కోరదు, నన్ను వప్పుకోదు. ఈసంగతి నాకు తెలుసు. కాని సమాజాన్ని నేను కోరతాను. నేను వప్పుకుంటాను. ఆదరంముందు ప్రేమ ఆగలేదని నాకు తెలుసు. సమాజం సన్మానస్థానం ఇవ్వని స్త్రీకి-బలవంతంగా స్థానమివ్వటం యే భర్తకీ నవ్వులాటకాదు. ఇటు చూడు-ఇలాంటి అసాధ్యమైన పనికి ప్రయత్నించకు" అన్నది సావిత్రి.

సతీశుడు తన చేతులతో సావిత్రి చేతులు రెండూ గట్టిగా పట్టుకొని "ఇవ్వాళ నాకు ఈమాటలన్నీ వినటానికీ - అర్థంచేసుకోటానికీ ధైర్యంలేదు సావిత్రీ! ఇవ్వాళ నన్నంటి ఈ యథార్థాన్ని సరిగా చెప్పు. నన్ను ప్రేమిస్తున్నావో లేదో?" అని అతను సమాధానంకోసం సావిత్రి మొహంకేసి చూడసాగాడు.

అతని వ్యథిత వ్యగ్రనేత్రాలకేసి చూచి సావిత్రికళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. "ప్రేమించకపోతే-దీనికోసం నాకింత యాతన ఎందుకు? చూడు, ఇందుకే నేను చాలకాలంనుండి నిన్నింత దుఃఖపెడుతూ వచ్చాను, గాని నా యీ శరీరాన్ని నీకప్పగించకలేక పోయాను" అని పయటచెంగుతో కన్నీళ్లు తుడుచుకొని "ఇవ్వాళ నీతో నేనేవిషయమూ దాచను. నాయీశరీరం ఇంతవరకు మలినంకాలేదు. కాని దీన్ని నీపాదాలముందు అర్పించే సామర్థ్యంకూడా నాలో లేదు. ఈ దేహంతో నేను బుద్ధిపూర్వకంగా చాలమంది మనసుల మోహింపజేశాను. ఈవిషయాన్ని నేనెన్నటికీ మర్చిపోలేను. దానివల్ల ఎవరికి మేలు

కలిగినా నీకుమాత్రం ఏవిధంగానూ కాదు. నిజంగా నిన్ను వదలి వెళ్ళగలిగే దాన్నే కాదు" అన్నది మళ్ళా.

సతీశుడు స్తబ్ధభావంతో కొంచెంసేపు పడిఉండి అకస్మాత్తుగా "అయితే, నాకు నీ శరీరం అవసరంలేదు. నేను కోరేది-నీ మనస్సును మాత్రమే-దానితో నువ్వెవరినీ మోహింప జేయలేదుగా! అదినాదే" అన్నాడు.

సావిత్రి తక్షణమే "అది ఏనాడూ, ఎవరినీ మోసపుచ్చలేదు- అది నీదే. దానిమీద చాలకాలంనుండి నీ అధికారమే ఉంది." ఆమె రొమ్ముమీద చెయ్యి పెట్టుకొని "నేను బతికినంతకాలం, ఏ భావంతోనైనా నీ దాసినై ఉంటాను. ఇది ఈ అంతర్యామికే తెలుసు" అన్నది.

సతీశుడు చప్పున ఆమె చేతిని తన ఎడమచేతిలోకి తీసుకొని "నేటి నీ స్వీకారోక్తి నాకుచాలు. ఇంతకంటె నాకు కావలసిందేమీ లేదు"అన్నాడు.

అతనిమాటల్లో భావంచూచి సావిత్రి లోలోన శంకించింది.

ఆ సమయంలోనే బిహారి వాకిటిబైటనుండి "బాబుగారు ఇక సమయం లేదంటున్నారు అమ్మగారూ!" అన్నాడు.

"పద, వస్తాను" అని సావిత్రి లేవబోయింది. సతీశుడు ఆమెను గట్టిగా పట్టుకొని "నిన్ను ఏమీ కోరటంలేదు. ఇవ్వాళ వెళ్ళేప్పుడు నాకు ఒక భిక్ష పెట్టి పోతావు?" అన్నాడు.

"నా వద్దఏముంది, నీ కియ్యటానికి? కాని ఆ కోరే దేమిటో కొంచెం చెప్పుదూ?"

"ఎవరైనా ఎప్పుడైనా మనిద్దరి సంబంధాన్ని గురించి అడిగితే నా స్వామిత్వాన్ని అంగీకరిస్తావుకదూ? చెప్పు, ఇదే నే నడిగే భిక్ష" అన్నాడు సతీశుడు.

సావిత్రికికూడా సరిగా ఇదే సందేహం కలిగింది. కాని ఈ అద్భుతావరోధంచూచి ఆమెకు నవ్వువచ్చింది. "అలాంటి ప్రతిజ్ఞ చేయించదలచేది ఎందుకు? సాక్ష్యబలంతో చివరికి బలవంతంగా నన్ను మీ ఇంట్లోనే పడేసి ఉంచవుగదా?" అన్నది.

"నీలో ఉన్న అంతర్యామే మనిద్దరికీ సాక్ష్యం. ఇతర సాక్ష్యాలు నాకవసరంలేదు. బైటి సాక్ష్యాల బలంవల్ల చివరికి నిన్ను ఇంట్లో ఉంచుతాననే

గానీ-నీకు భయం? ఒకవేళ అడిగినా అర్థగించే దెవరు?" అన్నాడు సతీశుడు.

సావిత్రి మొదలకుండా వూరుకొంది. "నువ్వు ఎక్కడబడితే అక్కడ నీ ఇష్టం వొచ్చినట్టు ఉండటం నాకిష్టంలేదు. దానివల్ల నా సుఖ్యవపోతుంది" అన్నాడు సతీశుడు.

సావిత్రి మొహం క్రమేణా నల్లబడుగాచేసింది. కాని ఈ స్థితిలో సతీశుడు ఉద్రేకిస్తే ఏంచేస్తాడనే భయంతో ఆమె మొదలకుండా వూరుకొంది. "ఉన్నవే ప్రజాంగ ప్రాణదేవత. సక్రమంగా ఉన్న స్వర్గదేవతైతే నేను వెంట పడేవాణ్ణి కాను. సరే, ఇన్నాళ్ళ కెళ్ళు. కాని ఎక్కువరోజులు నువ్వు అక్కడ ఉన్నావంటే నాకు బాగుండదు" అన్నాడు సతీశుడు.

"నీ ఇష్టం" అని సావిత్రి తలవంచుకొని బైటికి వెళ్ళిపోయింది.

---

## ౪౨

సాయంత్రం ఐదున్నర గంటలకు కర్రల కార్ఖానా వదిలిపెట్టిన తర్వాత దివాకరుడు ఆరకాన్‌లో ఒకగాగాడువెంట పోతున్నాడు. దుమ్ము-ధూళి-రంపపు బూరదతో అతనివళ్ళంతా నిండిపుంది. వంటిమీది ఒక చిరుగుల చొక్కావుంది. పంచెకూడా దాదాపు అలాంటిదే. ఎడమకాలి బూటు మొన చిరిగిపోవటంవల్ల వేళ్లు బైటికి తొంగిచూస్తున్నాయి. ఇప్పుడు దివాకరుడు ఆ దివాకరుడు కాదు. త్వరగా గుర్తించటంకూడా కష్టం. పగలంతా అన్నంలేదు- ఈ స్థితిలోనే అతను రొప్పుతూ రొజుతూ కామినీదాసీ ఇంటికివచ్చి చేరాడు. కింది అంతస్తులో నాలుగురూపాయల బాడిగకు ఒకగదితీసుకొని వుంటున్నాడు. చిన్నవసారాలో ఒకపక్కని వంటచేసుకుంటారు. మరోపక్కని కట్టెలు, కుండా చట్టీ ఒకదానిమీద ఒకటి పెట్టివుంటాయి.

దివాకరుని అడుగులచప్పుడు విని పక్కగదిలోంచి ఇంటియజమానురాలు బైటికివచ్చి గొంతుకొంచెం పెద్దదిచేసి "వచ్చారూ? మీరు ఈ చేసేదంతా

ఏమిటిబాబూ?-రాత్రింబగళ్ళు ఎప్పుడూ జగడాలు, కీచులాటలు. ఇదంతా మమ్ములను వెర్రివాళ్ళను చెయ్యటానికి పన్నుగడా ఏమిటి?" అన్నది. దివాకరుడు వుదాసీనతతో తలవంచుకున్నాడు. అతను పొద్దున రెండుజాములకు భోజనానికివచ్చి కిరణ్మయితో కీచులాడి తిండితినకుండానే పనిలోకి వెళ్ళి ఇప్పుడు కార్ఖానా వదలిపెట్టినతర్వాత వచ్చాడు. కాని అతని స్థితిచూచి ఇంటావిడకోపం తగ్గలేదు. "ఆవిడ నువ్వు పెళ్ళాడిన ఇల్లాలుగాదు బాబూ, ఇలా అధికారం చలాయించటానికి. లేవదీసుకువచ్చినా ఆమెకూడా ధర్మం, నీతి కాపాడింది. ఈనాలుగైదునెలలూ నగలూ-నాణ్యాలూ అమ్ముకొని ఏదోవిధంగా నీకు తిండిబెట్టింది. ఇంటిఅద్దెఇచ్చింది. ఇప్పుడునీకు నౌకరీకుదిరింది. నువ్వు ఆమెతో వేగలేకపోతే వేరే వెళ్ళి వుండుగాని అనవసరంగా ఆమెను యాతనపెట్టకు. అంత చక్కని పిల్ల తిండీ తిప్పలూ లేక ఎండి పుల్లయిపోయింది." కొంచెంఆగి- "నువ్వు లేకపోయినా, నువ్వు ఆమెను ఇలా బంధించి వుంచక పోయినా-ఆమెకు చింతేమీలేదు. ఆగొందిలోవుండే సెట్టిగారు నాదగ్గరకు రోజూ మనిషిని పంపుతున్నాడు. వళ్ళంతా బంగారంతో కప్పేస్తానంటున్నాడు. ఆడదానికి చింతేమిటిబాబూ! బియ్యం చిమ్మేవారికి కాకులకేమి కొరవ? నామాటవిని పో, ఇక వెళ్ళిపో! ఎన్నిరోజులనుండి చెబుతున్నాను? ఇంతవరకు జరిగిపోయిం దేదో జరిగిపోయింది. ఇక మీయిద్దరికీ పొత్తుకుదరదు" అన్నది.

దివాకరుడు ఆమెను వెంటనేఆపి "చాలు,సరిపెట్టు. ఇంతకంటె నువ్వు చెప్పవలసిన అవసర మేమీలేదు. కాని ఆమెమనస్సు ఏమిటో అదికూడా కొంచెం తెలుసుకో. నువ్వు ఆమెకు సలహా చెప్పవచ్చావా?" అన్నాడు.

సరిగా ఆసమయంలోనే కిరణ్మయి గదిలోంచి బైటికివచ్చింది. స్థితి మారేప్పటికి మనుష్యుని దైహిక, మానసిక-పరివర్తనలు ఎంత తొందరగా జరుగుతాయో, ఎంత విచిత్రంగా జరుగుతాయో చూచి ఆశ్చర్యచకితులవ్వవలసి వస్తుంది.

ఇవ్వాళ ఆమెనుచూచి - ఆసౌందర్యరాశి కిరణ్మయేనని ఎవరనగలుగుతారు?

ఆరు నెలలకిందట ఈమె సంఘాన్ని, ధర్మాన్నీ తిరస్కరించి మానవత్వాన్ని కాళ్ళకింద నలిపి, అమాయక - యువకుని, రూపమూ, ప్రేమా అనే

మిథ్యామోహంలో ముంచి - అన్నివిధాలా వంచితునిచేసి ఇక్కడికి తీసుకొచ్చింది. ఆ మోసపు వురిత్రాటిని కిరణ్మయి ఇవ్వాళ స్వయంగా తనగొంతుకు తగిలించుకుంటూ వుంది.

పాపంతోపాటు చేసిన నిష్ఫలప్రయత్న ఫలస్వరూపంగా దివాకరుని హృదయంలోంచి బైటకువచ్చిన వాసనారాక్షసి—నుండి ఆత్మరక్షణ చేసుకోటానికి దానితో పోరిపోరి కిరణ్మయి నేటికి జర్జరితయై పోయింది.

ఆమె తల వెంట్రుకలు నూనెలేక రేగివున్నాయి. బట్టలు మురికితో చిరుగులతో జీరాడుతూవున్నాయి. మొహంమీద ఒకవిధమైన శుష్కక్షుధ అధైర్యపుపరమసీమకు చేరుకుంది. శరీరంలోని సౌందర్యహీనత చూచి కళ్ళకు చింత కలుగుతావుంది. మూర్తిస్వరూపమైన పేదలక్ష్మిలాగ ఆమె మెల్లగా వచ్చి స్తంభాన్నానుకొని నుంచుని మెదలకుండా రెండువైపులా చూస్తూవుంది.

ఆమెను చూడగానే దివాకరుడు దెబ్బతిన్న తోడేలులాగ నోరెత్తాడు.

సిగ్గుమాలినతనం హద్దుమీరిపోయింది. ఆ కూబిదివాకరుడు ఇవ్వాళ ఇంతనుందిముందు అలాంటిమాటలు నోరెత్తి అనగలుగుతాడని ఎవరనుకోగలరు? కాని యథార్థంగా అతను "ఏమివదినా, ఇదేనా సంగతి? ఇప్పుడు నీకు మార్వాడీలు, తురకలు, మద్రాసీలు- అవసరమయ్యారా? అందుకేనా రాత్రింబగళ్లు ఈ పోట్లాటలు! అందుకేనా నేను నీకు కంటకమైపోయింది?" అన్నాడు.

కిరణ్మయి ఏమీ తెలుసుకోలేక మెదలకుండా అతని మొహంకేసి చూస్తూ వుండిపోయింది. కాని ఇంటావిడ అతనికి సమాధాన మిచ్చింది. ఆమె ఒక అడుగు ముందుకువేసి చెయ్యి ఆడిస్తూ కళ్లు మిటకరిస్తూ "ఎందు కవసరం లేదు? మేము గృహస్థులమేమీ కాము-జీవితమంతా ఒకడినే పట్టుకు వేలాడడానికి. స్వేచ్ఛగా విహరించే పక్షులము. ఎవరిదగ్గర సుఖంగావుంటే, ఎక్కడ సువర్ణధ్యానం వుంటే వారిదగ్గరకు వెళ్ళి వాలతాం. దానిలో సిగ్గుపడవలసిందేముంది?" అన్నది.

దివాకరుడు క్రోధంతో మండిపడి-"నోరు ముయ్యి వెధవముండా! నేను అడిగినదాన్ని సమాధానం చెప్పనియ్యి. నువ్వు అరుస్తా వెందుకు?" అన్నాడు.

ఈసారి ఇంటావిడకూడా ఫిరంగిగుండులాగ భగ్గుమని కొట్టవచ్చినట్లు-"ఏమిటిరా? నా ఇంట్లోవుంటూ నన్ను వెధవముండ అంటావా? పో వెధవా! నా ఇంట్లోనుంచి, ఇప్పుడే?" అన్నది.

దివాకరునికికూడా కోపంవచ్చింది. ఒక నీచస్త్రీ నోటివెంట ఇంత అవమానకరమైన మాటలు వినికూడా నడుం బిగించి ఆమెతో ఇంత వాద వివాదాలు చేస్తానని అతను దుస్స్వప్నంలోకూడా తలచలేదు. కాని ఇప్పుడు అతను వుపేంద్రబాబు సురబాల ప్రేమానురాగాలతో పెంచబడిన దివాకరుడుకాదు. అందుచేత అతనుకూడా కళ్లెర్రజేసి "నే నెందుకుపోతాను! నువ్వు అద్దె పుచ్చుకోటంలేదా ఏమిటి?" అన్నాడు.

ఇంటావిడకూడా ఏమీ తొణక-బెణకకుండా "మహా అద్దె ఇచ్చేవాడు బైలుదేరాడు. నీ బతుకూ నువ్వూ పాడుగాను. ఆడదాని సంపాదన మీద బతుకుతూ ఇంత అదిరిపాటా? ముక్కు మూసుకుని మునిగి చావటానికి కాసిని నీళ్లుకూడా దొరకలేదూ? పో ఇక్కడనుంచి. లేకపోతే చీపురుతో దిగదుడుపులు పెట్టి ఇంటినుంచి గెంటిస్తాను" అన్నది.

"అయితే పోతాను" అని అతను పళ్లు నూరుతూ వెర్రివాడిలాగ పరుగెత్తుకువచ్చి కిరణ్మయి గొంతుమీద చెయ్యివేసి ఒక్కతోపు తోశాడు. పగలంతా తిండి తిప్పలూలేక నిర్జీవిలాగ అలసివున్న కిరణ్మయి తోపుకు తట్టుకోలేక బాల్టీమీదకళ్ళి వెల్లికిలపడింది.

వున్మత్త దివాకరుడు ఆమె వీపుమీద ఒక్క తన్ను తన్ని "పద-నడువు, నీ మార్వాడీ ఎవరో చూస్తాను" అని ఇంట్లో చొరబడ్డాడు.

ఇంటావిడ వికటాట్టహాసంతో అరచింది. అప్పుడే కార్ఖానానుండి వచ్చి పంపువద్ద మొహమూ-చేతులూ కడుక్కునేవాళ్ళల్లా చేతిలో సబ్బు అవతల పారేసి పరుగెత్తుకువచ్చారు. ఇంటావిడ గుండె కొట్టుకుంటూ "పాప మా పిల్లను చంపాడు ఈ దొంగముండాకొడుకు. వీణ్ణి ఇక మా యింటికేసి తిరిగిచూడకుండా తన్నండి!" అన్నది.

ఇంటావిడ ఫిర్యాదు విని వాకిట్లో కూడినగుంపు ఇంట్లో దూరబోతూండేప్పటికి కిరణ్మయి లేచి నుంచుని పయట సర్దుకుంటూ కఠిన స్వరముతో "పోట్లాటలూ-కీచులాటలూ ఎవరింట్లో లేవు? నన్ను కొడితే మీ

కేమైనా బాధ కలిగిందా? పోండి, మీ మీ ఇళ్లకి పోండి" అని ఆమె చప్పున ఇంట్లోకి వెళ్ళి తలుపువేసుకుంది.

పొరుగువాళ్ళు చూసిపెట్టటానికి వచ్చినవారంతా అలాంటి సదవకాశం పోయినందుకు విచారపడుతూ వెళ్ళిపోయారు. పైట నుంచునివున్న ఇంటావిడ బుగ్గను వేలెట్టుకుని తనలో తాను "ఎంత వినమ్రశీల!" అనుకుంది.

తలుపువేసి కిరణ్మయి నిప్పులపుల్ల గీచి దీపం వెలిగించింది. విశాలమైన గది కాకపోయినా—పొడుగ్గా వుంటుంది. ఒకవైపున ఒక్క నారతాడు మంచంమీద దివాకరునికి పక్క వుంది—రెండవవైపున బల్లమీద కిరణ్మయి పక్క చుట్టివుంది. కాళ్ళవైపున మట్టిపెంకులు ఒకదానిమీద ఒకటి దొంతర్లు పెట్టివున్నాయి. ఆ మూలవంకనే బూర్లెమూకుడు, సీసాలవీ తగిలించి వున్నాయి. ఇదే వీరి సంసారము. ఇవే వీరిద్దరి గృహోపకరణాలన్నీ.

దీపం వెలిగించి కిరణ్మయి వాకిటిదగ్గరకు వచ్చి స్తిమితంగా కూర్చుంది. ఎవరూ నోరువిప్పి మాట్లాడలేదు. మంచంమీద దివాకరుడు తలవంచుకొని మెదల కుండా కూర్చున్నాడు. ఈ విధంగా చాలసేపటివరకు ఇద్దరూ మెదలకుండా కూర్చున్న తర్వాత కిరణ్మయి లేచి మెల్లగా ఎదుటకువచ్చి సహజభావంతో "కుండలో అన్నం వుంది. వడ్డిస్తాను" అన్నది.

దివాకరుడు రుద్ధకంఠంతో "వద్దు" అన్నాడు.

అతని కంఠస్వరాన్నిబట్టి ఇప్పటివరకు అతను ఏడుస్తున్నట్లు తెలుస్తూ వుంది.

"ఎందుకని వద్దు? పగల్లూ ఏమీ తినలేదు. ఇవ్వాళ తినకపోయినా రేపు తినక తప్పదు. అన్నవస్త్రాలమీద అలిగితే లాభంలేదు. చేతులూ-ముఖం కడుక్కొని వచ్చి భోంచెయ్యి-వడ్డిస్తాను" అన్నది.

దీనికి సమాధానంగా దివాకరుడు-ఊఁ ఆఁ అనికూడా అనలేదు. అతను మరింత ఆత్మగ్లానితో వ్యథపడుతున్నాడు. అతను నిజంగా కిరణ్మయిని హృదయపూర్వకంగా ప్రేమిస్తాడు.

ఇక్కడికి వచ్చినతర్వాత చాలాకాలంవరకు-బైట ఎవరికీ ఏమీ తెలియకపోయినా నిత్యం ఆ యిద్దరిలో జరుగుతూవుండే-ఆసక్తి-విరక్తుల-అవిరమ సంగ్రామ విసురులను దివాకరుడు మెదలకుండా సహిస్తూ వచ్చాడు.

కొంతకాలంనుండి ఈ సంఘర్షణ బహిరంగము - మరింత క్లిష్టమూ అయింది. ఇలాంటి వుద్రేజనాగ్ని అనేకసార్లు రగిలింది. కాని ఇంతకుముందు ఎప్పుడూ అతను ఇలా వళ్ళుమరచి ఇలాంటి పాశవికచర్య చెయ్యలేదు. ఏకారణంవల్ల, ఏ అత్యాచార ఫలితంగా కిరణ్మయిమీద అతను చెయ్యెత్తగలుగు తాడో-ఇవ్వాళే మొదటిసారిగా ఎత్తాడో-వస్తుతః ఈ సంగతులేవీ అతనికి తెలియదు.

మొదట అతను-ఆత్మవిస్మృతునిలా ఇంట్లోదూరి నుంచంమీదకువచ్చి కూర్చున్నాడు. కాని కిరణ్మయి స్వయంగా తన్ను తన్నటానికి పరుగెత్తుకు వచ్చిన వారినుండి కాపాడి లోపల గొళ్ళెంపెట్టిన తర్వాత అతనికి తెలివివచ్చి తను చేసినదానికి పశ్చాత్తాప పడసాగాడు. అతను అకస్మాత్తుగా కిరణ్మయి పాదాలమీద ఒక్కసారిపడి వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. ఏడుస్తూనే "నేను పశువును. క్షమించు వదినా!" అన్నాడు.

కిరణ్మయి స్తిమితంగా నిర్వికారభావంతో క్షణంసేపు మెదలకుండా వుండి స్వాభావికంగా "నీ తప్పేమీలేదు. క్షణికావేశాలు మానవునికూడా పశువుని చేస్తాయి. నన్ను పశువుని చెయ్యటానికి కాస్తకూడా లోటు వుంచలేదు" అన్నది.

దివాకరుడు తలకాయతిప్పి "లేదు, లేదు. నాకింకెవరితోనూ పనిలేదు వదినా! కాని ఇవ్వాళ నా అపరాధానికి ప్రాయశ్చిత్తమేమిటో చెప్పు. ప్రాణ మిచ్చి అయినాసరే నేను దానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటాను" అన్నాడు.

"నువ్వు అలాంటి అపరాధ మేమిచేశావు? క్రోధంలో మనుష్యుని మనిషి హత్యచేస్తాడని వినలేదూ? నువ్వుమాత్రం ఏంచేశావు! ఒక్క తన్ను తన్నావు. నేనుమాత్రం ఏమీ తప్పు చేయలేదా బాబూ! అంతా నీ తప్పేనా? అదంతా పోనీ. అభియోగ అనుయోగాలన్నీ నేటితో అంతమైనాయి-దానితో భవిష్యత్తులో నీకూ అవసరంలేదు. ఇక వెళ్ళి కాళ్ళుచేతులు కడు క్కొని భోంచెయ్యి. నేనిక నుంచోలేను" అన్నది కిరణ్మయి.

దివాకరుడు మెల్లగా లేచి కూర్చున్నాడు. ఆమె ఇంకెక్కువ మాట్లాడ దలచుకోలేదని ఆమె గొంతునుబట్టి తెలుసుకున్నాడు.

పగలంతా పస్తున్నతర్వాత దివాకరుడు కడుపునిండా తిని మూతి కడుక్కోటానికి బైటికివెళ్ళాడు. బహుశా అతని మనఃక్లేశంకూడా వదిలి

పోయింది. మూతి కడుక్కొని ఇంట్లోకివచ్చి చూచి దివాకరుడు కొంచెం ఆశ్చర్యచకితుడైపోయాడు. కిరణ్మయి అతని పక్క మట్టి మంచంకింద పెట్టింది.

"నా పక్క కిందపెట్టావెందుకు?" అడిగాడు.

కిరణ్మయి స్థిరంగా "మొదట చెబితే బహుశా నువ్వు భోంచేసేవాడివి కాదు. ఇవ్వాళనుండి మన సంబంధం తెగతెంపులైంది. ఇంకెక్కువ పొద్దు పోలేదు. ఇవ్వాళకి కాళీమందిరానికి వెళ్ళి పడుకో. రేపు నీకు వీలున్న చోట ఇల్లు కుదుర్చుకుందువుగాని. ఒకవేళ ఈ దేశంలో వుండటానికి ఇష్టం లేకపోతే ఎల్లుండి స్టీమరు బైలుదేరుతుంది. డబ్బు యిస్తాను. ఇంటికి వెళ్ళిపో. నీకు ఎలా వీలుగావుంటే అలా చెయ్యి. ఇక నాతో నీకు కించిత్ కూడా సంబంధంలేదు" అన్నది.

దివాకరుడు హతబుద్ధునిలాగ ఈ మాటలన్నీ వింటున్నాడు. ప్రేమరహితమైన కిరణ్మయి కటువాక్యాలు కొండరాళ్లలాగ వారిద్దరిమధ్యా అభేద్యమైన ఒక పెద్దగోడ నిలబెడుతున్నాయా అనిపించింది అతనికి.

ఆమెమాటలు ముగిసినతర్వాత అతను స్వప్నంలోంచి లేచినట్టు "మరి నువ్వు?" అన్నాడు.

"నా సంగతి తెలుసుకున్నందువల్ల నీకు కలిగేలాభమేమీ లేదు,అయినా ఈ దేశంలోవుంటే రేపూ ఎల్లుండిలో వినవే వింటావు!" అన్నది కిరణ్మయి.

"అయితే ఇంటావిడమాటే నిజమా? ఆ సభ్యతలేని శెట్టి ........." అన్నాడు దివాకరుడు.

కిరణ్మయి శాంతంగా, కాని కటుస్వరంతో "అదీసంభవమే. ఏమైనా నీభుజస్కంధాలమీదుగా నీచమార్గంలోకి దిగివచ్చినప్పుడు - చివరివరకు నిన్నాశ్రయించుకునే నడవాలా ఏమిటి? అది అర్థంలేనిమాట. నావంట్లో బాగుండలేదు. వెళ్ళి పడుకుంటాను. ఇంకెక్కువ ఆలస్యంచేయక వెళ్లు. రేపు పొద్దున - నీ సామానంతా నీకు పంపుతాను" అన్నది.

"ఇంత తొందరా!ఈ రాత్రికికూడా నన్ను ఇక్కడ వుండనియ్యవా?" అన్నాడు దివాకరుడు.

"ఉండనియ్యను."

దివాకరుడు కొంచెంసేపునిమ్మళించి "అయితే కేవలం నన్ను సర్వనాశనం చెయ్యటానికే ఈదారినలాక్కొచ్చావా? ఎన్నడూ ప్రేమించలేదూ?"అన్నాడు.

“లేదు. నిన్ను కాదు, మరొకమనుష్యుని సర్వనాశనం చెయ్యాలనుకొని సర్వనాశనంచేశాను. మరి నేను? నాసంగతి వదిలిపెట్టు - నేను మొదటనుంచి చివరివరకు అన్నీ పొరపాట్లే చేశాను. ఆ తప్పుల కోసమే ఇవ్వాళ నీ కాళ్లట్టుకొని క్షమాపణ కోరుకుంటున్నాను” అన్నది కిరణ్మయి.

ఆ నిర్వికారమూర్తి మొహంకేసి చూచి దివాకరుడు ఒకదీర్ఘమైన నిట్టూర్పు విడుస్తూ - “నా సర్వనాశనాన్ని గురించి నువ్వు వూహించను కూడా లేదు - అందుకనే నువ్వింత చులకనగా క్షమాపణ కోరగలిగావు. కాని ఈ సర్వనాశనాన్ని నా ప్రేమ అధిగమించి పోయింది. అందుకనే ఇంతవరకు జీవించి వుండగలిగాను. లేకపోతే ఏనాడో నా హృదయం బద్దలైపోయేది. నేను చనిపోయేవాణ్ణి. ఎవరికీ ఏమీ తెలిసేదికాదు. ఇవ్వాళ నువ్వు వెళ్ళబోయేవానియందు కూడా ప్రేమలేదు. ఇంకా నన్ను వదిలిపెట్టి అతనివద్దకు వెళ్ళేది ఎందుకు? నేనెప్పుడూ నీకే అపకారమూ చెయ్యలేదు! నిజంగా నువ్వు ఇంకెవ్వరివద్దకైనా వెళుతున్నావా?” అన్నాడు.

కిరణ్మయి తలకాయతిప్పి “అవును, వెళుతున్నాను” అన్నది. తర్వాత చాలసేపటివరకు నేలకేసి చూస్తూ వూరుకొని - మళ్ళా తలెత్తి - “లేదు, ఇవ్వాళేమీ దాయను. నేను భగవంతుణ్ణినమ్మను, ఆత్మనునమ్మను. పునర్జన్మలను-స్వర్గనరకాలనూ వీటేటినీ నమ్మను. ఇవన్నీ నాకు నిస్సారం, అంతా మిథ్య. నేను నమ్మేది - ఈ దేహాన్ని, ఈ లోకాన్ని. ఈజీవితంలో నేను ఒకవ్యక్తి దగ్గరమాత్రం ఒక రోజున తలవంచుకోవలసి వచ్చింది. ఆమె సురబాల. పోనీ ఆవిషయాలన్నీ. నేను ఈలోకాన్నీ, ఈదేహాన్నీ మాత్రం వప్పుకుంటాను. ఈ జీవితంలో ఈ పాడుశరీరం ఏమీ అపేక్షించలేదు. కేవలం ప్రేమను మాత్రం అపేక్షించింది! దానికా భిక్ష ఎవరూ పెట్టలేకపోయారు, ఇక పెట్టలేరుకూడా. కాని నేను నా అహంకారానికి ప్రతీకారం చెయ్యలేను. అందుచేత డాక్టరు అనంగునికూడా ఒకరోజున నేను వలలోవేసుకోవాలని చూచాను. కాని నా అదృష్టం ఎదురైంది” అని ఒక చిన్న నిట్టూర్పువిడచి, కిరణ్మయి మెదలకుండా వూరుకుంది. తర్వాత కొంచెంసేపటికి ఒక్కసారి సాహసమొచ్చినట్టు “ఆతర్వాత ఒకరోజున - నిజంగా నేను ప్రేమించినరోజున - నా శరీరమంతా ఇంతకాలంనుండి దేనికోసం తీవ్రోత్కంఠతో తహతహలాడుతూ వుందో గ్రహించాను” అన్నది.

దివాకరుడు ఆతురతతో "దేనికోసం?" అన్నాడు.

కిరణ్మయి చిరునవ్వునవ్వి - "నా యీ ప్రేమతో సమానమైంది స్వర్గంలోకూడా లేదనుకున్నాను. కాని నాగర్వం ఎంతోకాలం నిలవలేదు. ఆరోజున పరలోకాన్నిగురించి వాదవివాదాలుచేసి ఓడించివచ్చినదాన్ని మళ్లా ఓడిపోవలసివచ్చింది. ఈలోకం ప్రేమద్వంద్వంలోకూడా ఆమె ముందు తలవంచి తిరిగి రావలసివచ్చింది! మోహాతెరలు పటాపంచలైపోయినాయి. నీలాంటి కోట్లకొలది రూపవంతులుకూడా ఆమెను మోసపుచ్చలేరని స్పష్టంగా తెలుసుకున్నాను" అన్నది.

దివాకరునికి కళ్ళముందునుండి ఒక నల్లనితెర తొలగి పోతూవుందని పించింది.

"ఆవిడవద్ద నాకొక్కవిషయము నేర్చుకోవలెనని చాల కుతూహలంగా వుండేది. పతిని ప్రేమించటం బహుశా నేర్చుకోగలిగేదాన్నికూడా. కాని నా దురదృష్టంకల్ల ఆదారికూడా రెండురోజులలోనే కట్టుబడి పోయింది. అయితే, నువ్వుఅడిగింది ఏమిటి? నువ్వు ఎందుకు ప్రేమించలేదనే కదూ? ప్రేమించలేదని ఎవరంటారు? తప్పకుండా ప్రేమించాను. కాని వయసులో నేను నీకంటె పెద్దదాన్ని. మీావుపేంద్ర అన్న నిన్ను నాచేతి కప్పగించిన దగ్గరనుంచి నేను నిన్ను తమ్మునిలాగ ప్రేమించాను. అందుకనేగా ఈ ఆరు నెలలనుండి ఒక ఇంట్లో వుంటున్నాకూడా నీకీ దేహాన్ని అర్పించలేదు. అందుచేత నీ నోటివెంట ప్రేమప్రార్థనలు వింటూంటే నా శరీరమంతా సిగ్గూ-భిడియాలతో కంపించిపోయింది. అందుకనే నీ తమ్ముతిని ఇవ్వాళ నామనస్సు ఈ విధంగా విరక్తి జెందింది- పో దివాకర్! వెళ్లిపో! నాకు పాపపుణ్యాలు-స్వర్గనరకాలు ఏమీలేవు. కాని ఈ శరీరంమీద నీలుబ్ధదృష్టులు నాటుకు పోయాయి. అవి నిన్ను నరకాంధకూపంలో జన్మజన్మాంతరాల వరకు ముంచివుంచుతాయి. అది నాకు ఇవ్వాళ తెలిసివచ్చింది" అంటూవుండగానే ఆమె నేత్రాలు రెండూ ఏదో తీవ్రజ్వాలతో అకస్మాత్తుగా ప్రజ్వలించినాయి. దివాకరుడు దెబ్బతిన్న కుక్కలాగ భయంతో వాకిటివద్దకు జరిగివెళ్లాడు.

కిరణ్మయి పక్కచుట్టయెత్తి దివాకరుని ముందుకువిసిరివేసి "ఇక నీమీద నాకేమీ నమ్మకంలేదు. నాతమ్ముడొకడుమాత్రం ఇంకా జీవించే వున్నాడు.

ఆసతీశుని మొహం చూచుకొని నేను సదా నీనుండి ఆత్మరక్షణ చేసుకోవలసి వచ్చింది. నువ్వు వెళ్లిపో" అన్నది.

దివాకరుడు ఇంకేం మాట్లాడకుండా పక్కచుట్ట చేతపట్టుకొని చీకట్లోకి వెళ్ళిపోయాడు.

---

# ४3

ప్రొద్దున్నే కిరణ్మయి అలసటతో-ఆయాసంగా పనిపాటలు చేసుకుంటూ వుంది. కామినీదాసి వచ్చి వాకిట్లోనుంచుని చిరునవ్వుతో "మోడు వెళ్ళి పోయాడూ! నిన్న నామీదపడి కొట్టబోయాడు. లేకపోతే ఆడదాన్ని వుంచుకోటం సామాన్యమా? వ్యవసాయానికి మేకలు పనికివస్తే ఎడ్లను కొనట మెందుకు?" అన్నది.

కిరణ్మయి తలపైకెత్తి "అతను వెళ్ళిపోయాడని ఎవరన్నారు?"అన్నది.

ఇంటావిడ చిరునవ్వునవ్వి "ఓహో, ఇప్పుడు నా కన్నే కప్పవచ్చావా? ఎవరన్నారు! నేను - ఇంటికామందును - రెండో వాళ్లు చెప్పటానికి ఎవ రొస్తారు! నేను నాచెవులార అంతా విన్నాను. ఇంతమాత్రంకూడా తెలుసుకో కుండా వున్నట్టయితే - ఈ పాటికి-ఈ ఇల్లు ఎవరి చేతుల్లో పడిపోయేదో! నా చేతుల్లోంచి లాక్కుని పంచభూతాలు స్వాధీనం చేసుకొనేవి" అన్నది.

కిరణ్మయి మెదలకుండా తన పనిపాటలుచేసుకుంటూవుంది. సమాధానం రాకపోయేప్పటికి కామిని, స్వయంగా "ఆ ఆపదను తొలగించమని నేను నీకెన్నడో చెప్పాను. ఎక్కడికో వెళ్లాడని చింతపడితే లోకంలో నిర్వహించటం కష్టం. తిను, కట్టుకో, అత్తర్లు - సెంట్లురాసుకో. బంగారు నగలు పెట్టుకో - ఇక వంటినిండా బంగారం - చేతినిండా డబ్బు - ఇదొక ప్రేమా తల్లీ!" అన్నది.

కిరణ్మయి ఒకసారి తలపైకెత్తి మళ్ళా వంచుకుంది. తన వుపదేశం పనిచేస్తూ వుందనుకొని ఇంటావిడ, మళ్ళా వుత్తేజంతో "మరి ఇదేంటమ్మా? ప్రేమించే సమయ మిదేనా? ఇంకా నువ్వు వయస్సులో వున్నావు. రెండు చేతులతో దోచుకుంటావు. నాలుగు డబ్బులు చేతబడినతర్వాత కాలుమీద కాలువేసుకొని తింటూ - ప్రేమించుదుగాని-నిన్నెవరు కాదంటారు? చేతిలో డబ్బు వుంటే - నువ్వు ఏమి చెయ్యాలన్నా చెయ్యగలవు" అన్నది.

కిరణ్మయి పరధ్యానంతో "అతను అంతా విన్నాడో లేదో, ఏసమాధానమూ చెప్పలేదు" అన్నది.

ఇంటావిడ పనిపాటలు ఇంకా కాలేదు. అందుకని మళ్ళా రెండుఝాములకు వస్తానని చక్కాపోయింది.

ఈఇంట్లో వుండేవారంతా దాదాపు కార్ఖానాలో పనిచేసేవారే. ప్రొద్దున పనికిపోతారు. పన్నెండుగంటలకు మళ్ళా ఇంటికివచ్చి స్నానం-భోజనంచేసి మళ్లీ వెళతారు. మళ్ళా సాయంత్రానికి తిరిగి వస్తారు.

ఇవ్వాళకూడా అంతా పనులకు వెళ్లిపోయినతర్వాత రెండూరెండున్నర గంటలకు ఇంటావిడమళ్ళా కిరణ్మయి గదివాకిట్లోకివచ్చినుంచుని "భోంచేశావా అమ్మాయి? ఏమికూరవండావు?" అన్నది స్నిగ్ధకంఠముతో.

ఇవ్వాళ కిరణ్మయి పొయ్యికూడా రాజెయ్యలేదు. అయినా తలకాయి వూగించి "ఆఁ భోంచేశాను. రా, కూర్చో" అన్నది.

ఇంటావిడ వాకిట్లోకూర్చుంది. ఆమె గదిలో అడుగు పెట్టగానే - ఇవ్వాళ కిరణ్మయి మనస్సు సరిగాలేదని గ్రహించింది. అందుచేత సానుభూతి స్వరంతో "అలాగే వుంటుం దమ్మా! రెండుమూడురోజులవరకు మనసు సరిగా వుండదు. పెంచుతున్న పిట్ట ఎగిరిపోయినా మనసుకు విచారంగా వుంటుంది. ఇతను మానవుడు, ఆరేడునెల్లు అతనితోవున్నావు. అందుచేత దిగులుగా వుండటం స్వాభావికం. ఇంకా రెండు మూడురోజులుంటే అతనిపేరుకూడా తలవవు. ఇలా ఎంతమందిని చూచాను?" అన్నది.

కిరణ్మయి అనిచ్ఛాపూర్వకంగానే చిరునవ్వు నవ్వి "నువ్వుచెప్పేది నిజమే?" అన్నది.

కామినీదాసి విసుక్కొని "నిజంకాదూ? నువ్వేచెప్పమ్మా! కాదూ? అతను పోతే పోయాడులే. మరొక కొత్తవాణ్ణి తీసుకొచ్చి- సుఖంగావుండు.

మనసులో విచారమంతా గుప్పున ఎగిరిపోతుంది. ఏమంటావు నిజమేనా అమ్మా?" అన్నది.

కిరణ్మయి తలకాయపూగించి సానుభూతి తెలిపింది. కాని ఆమె మాటలను చూచి గుండె కొట్టుకోసాగింది.

కామినీదాసి కళ్లుమిటకరించి మెల్లగా "బాగా జ్ఞాపకం వొచ్చిందమ్మా! ఆ మనిషికి నేను ప్రొద్దున్నే కబురంపాను. అతను నిన్ను కలుసుకోటానికి తహతహ లాడుతున్నాడు. అంతా పనిలోకి వెళ్ళిపోయినతర్వాత రెండుఝాములకు వస్తానని చెప్పి పంపాడు. బహుశా వస్తున్నాడేమో......" అన్నది.

కిరణ్మయి భయపడుతూ "ఇక్కడికి ఎందుకువస్తాడు?" అన్నది.

కామినికి కిరణ్మయి మాటవిని నవ్వువచ్చింది. అయినా ఆమె కల్పిత క్రోధంతో "వచ్చినదానా!అతను రాకపోతే నువ్వెక్కడికి వెళతావు! నామాట వింటే..."అని ఆమె లేనిపోని నవ్వు తెచ్చి పెట్టుకొని కిరణ్మయిమీద పడింది.

కిరణ్మయి ఏమీమాట్లాడలేదు. కొంచెం జరిగికూర్చుంది. కామినీదాసి ఆత్మీయావేశంతో ఇవ్వాళే మొట్టమొదటగా 'నువ్వు' అని సంబోధించింది.

కాని ఆ ఆత్మీయతాసంబోధన ఆ నీచస్త్రీ నోటినుంచి వచ్చేప్పటికి కిరణ్మయిచెవులలో బాణంలాగ తగిలింది. కాని తమాయించుకొని మెదలకుండా వూరుకుంది.

కాని కామినీదాసీధ్యానం అటుపోలేదు. ఆమె తన ధోరణిలోనే "ఆలోచించకు తల్లీ! ఆరునెలల్లో నీభాగ్యం పండకపోతే నన్ను కామినిదాసీ అని పిలవకు. నువ్వు నేను చెప్పినట్టుమాత్రం నడుస్తూవుండు, ఇంకేం అవసరం లేదు" అన్నది.

కిరణ్మయికి ఆమెమాటలు వినటానికి ఇష్టంలేకపోయినా వినక తప్ప లేదు.

"పెద్దశెట్టి. డబ్బుకేమీ కొదువలేదు. మోజులో పడ్డాడు. ఈ అవకాశంలోనే రెండుచేతులతో జుర్రు. తర్వాత తగులు. ఇంకెంతమంది వచ్చిపడతారో! నువ్వు ఇలా విచారంతో కుమిలి పోతున్నావుగాని లేకపోతే నీరూపం మామూలు రూపమా?" అన్నది కామినీదాసి.

అదేసమయంలో బైట వసారాలోంచి ఎవరో అణచుకున్న గొంతుతో "ఇంటావిడా!" అని పిలిచారు.

"నే పోతాను" అని కామినీదాసి వెళ్ళబోతూ వుండేటప్పటికి కిరణ్మయి రెండుచేతులతో ఆమెపయట పట్టుకులాగి "పోవద్దు. నువ్వు ఇక్కడే వుండు-ఎవరినీ ఇంట్లోకి అడుగు పెట్టనియ్యకుండా" అన్నది.

కామిని త్రుళ్ళిపడి ఆశ్చర్యంతో "ఎందుకు? ఇక్కడికి ఎవరైనా వచ్చారా ఏమిటి?" అన్నది.

కిరణ్మయి దృఢస్వరంతో "వచ్చినా, రాకపోయినా, నువ్వు ఇక్కడ నుంచి కదలవద్దు" అన్నది.

పిలచినవ్యక్తి కాళ్లచప్పుడు క్రమంగా దగ్గరకు రాసాగింది. కామినీదాసీ క్షుబ్ధురాలై "నువ్వు పెళ్ళిచేసుకున్న ఇల్లాలివి కాదు. బాబులు నీయింటికి వస్తారు, కూర్చుంటారు. దీనికి భయమెందుకు? నువ్వూ వేశ్యవేగా?" అన్నది.

"నే నెవరిని? వేశ్యనా?" కిరణ్మయి బిగ్గరగా అరచింది.

ఏదో ఒక మెరపు ఆమె నరాలను చీల్చుకొని తల పగులగొట్టుకొని బైటకు వెళ్ళినట్టనిపించింది.

ఆమె ఎర్రనికళ్ళు, తీవ్రస్వరమూ చూచి కామిని ఆశ్చర్యంతో మొహం చిట్లించుకొని "కాకేమిటి? నీ యీ రూపం చూచి నావళ్ళు మండుకుపోతూ వుంది. ఇప్పుడు మేమేస్థితిలో వున్నామో నువ్వూ అదేస్థితిలోవున్నావు. మంచి వారెవరైనా వస్తే, రానీ, ఆదరించి ఇంట్లో కూర్చోబెట్టు" అన్నది.

ఈ మంచివాని దగ్గరనుంచి ఇంటావిడ డబ్బు గుంజింది. ఇంకా గుంజాలని ఆశ. అతను వాకిటదగ్గరకు వచ్చి నుంచుని ఇకిలిస్తూ "బాగున్నావా కామినీ?" అన్నాడు.

ఇంటావిడ కిరణ్మయి చేతిలోంచి పయిటచెంగు లాక్కొని వినయంగా "మీదయవల్ల బాగానేవున్నాము బాబూ!లోపలికివచ్చి కూర్చోండి. తమల పాకులు తీసుకొచ్చి యిస్తాను" అనికొంచెం చిరునవ్వునవ్వి "ఈనాటినుంచి ఈయిల్లు వాకిలీ అంతా మీది బాబూ! - నేను ముందుగానే చెబుతున్నాను. దీన్ని బాగా - అలంకరించాలి" అన్నది.

"సరే! అంతా సిద్ధమైందా?" అని అతను సంకోచ మేమీ లేకుండా సరాసరిని ఇంట్లోకివచ్చి మంచంమీద కూర్చోబోతున్నాడు.

కిరణ్మయి ఎంతో బలవంతాన ఇంతవరకు సహిస్తూ వచ్చింది. కాని ఇక

సహించలేక తన రూపయౌవనాలను కొనే ఈ అపరిచితవ్యక్తి లోపల అడుగు పెట్టగానే ఆమె వేరుతెగిన చెట్టులాగ కిందపడిపోయింది.

అతను త్రుళ్ళిపడి ఈ ఆకస్మికవిపత్తికి నొతబుద్ధుడై పోయాడు. ఇంటావిడ గల్లంతువూచి ఇంటిల్లపాదీ నిద్రమంచాలమీదనుంచి లేచి పరుగెత్తుకు వచ్చారు. కొందరు నీళ్ళుతెచ్చి మొహాన చల్లారు. కొందరు విసనకర్రతో విసిరారు. అంతా చాల పరిశ్రమతో పాప మావిడకు శుశ్రూష చేయసాగారు.

కామినీదాసీ బల్లమీద కూర్చుని బిగ్గరగా "ఈపనికే వళ్లు చల్లబడింది. ఇంతవరకు అటువంటి-ఓర్పు-నేర్పుకోలేదూ? ఇంటికివచ్చిన హితుణ్ణి నవ్వుతూ పలకరించటమే తెలియదు!" అంటూవుంది.

అదే సమయంలో బైటనుండి మళ్ళా ఎవరిదో పిలుపు వచ్చింది. తల వాకిటవద్ద ఎవరో అపరిచితవ్యక్తి దివాకరుని-కిరణ్మయిని పేరెత్తి పిలుస్తున్నాడు. నౌకరువచ్చి లోపల ఈకబురు చెప్పాడు.

నౌకరుని ఇంటావిడ వాకిట్లోనున్న బాబుగారినిగురించి అడుగుతూ వుంది. ఇంతలో ఒడ్డూ-పొడుగూ గల ఒక యువకుడు చేతిలో తోలుసంచి పట్టుకొని తిన్నగా లోపలికివచ్చి "వదినా!" అని పిలిచాడు గంభీరంగా.

అతని ఎడమచేతి ఉంగరపు పుష్యరాగపు రాయి సూర్యకిరణాలకు మెరుస్తూవుంది. కామినీదాసి దిగ్గునలేచి నుంచుని "ఎవరికోసంబాబూ?" అన్నది.

"దివాకరుడు వుండేది ఇక్కడేనా?"

"అవును."

"మావదిన కిరణ్మయి ఏగదిలో వుంటోంది??

కామినీదాసీతోపాటు మరి ఇద్దరుముగ్గురు స్త్రీలుకూడా ధ్యానంలో ఆ యువకునికేసి చూస్తూవున్నారు. ఒకరు "ఆమె మూర్ఛతో పడివుంది" అన్నది.

"మూర్ఛతో పడివుందా! ఎక్కడ? అని అతను గదిలోకి వచ్చాడు.

కిరణ్మయి అప్పటికింకా మూర్ఛతోనే కిందపడివుంది. వళ్ళంతా చెమటతో తడిసివుంది. కళ్ళు మూతలుపడ్డాయి. మొహం నల్లబడింది. వెంద్రుకలు తడిసి చెల్లాచెదరై వున్నాయి. ఆ వచ్చినవ్యక్తి సతీశుడు. అతని దృష్టి శెట్టి మీద పడింది. అదేసమయంలో అతను దగ్గరకువచ్చి ధ్యానంతో కిరణ్మయికేసి చూస్తున్నాడు. సతీశుడు విస్మయంతో -వుగ్రుడై "నువ్వెవ్వరవు?" అన్నాడు.

అతనితరఫున ఇంటావిడ సమాధానమిచ్చింది. "మా శెట్టిగారు. వారు ఇక్కడ........."

కాని పరిచయం తెలుసుకోకముందే సతీశుడు ఆవ్యక్తికి వాకిలి చూపిస్తూ "బైటికిపో!" అన్నాడు.

శెట్టి డబ్బుగలవాడు, కొత్తస్నేహితుడు. అదీగాక ఇంతమంది ఆడవాళ్లలో-అతను ఈ అవమానాన్ని సహించలేక పోయాడు. అందుచేత సాహసించి "ఎందుకని?" అన్నాడు.

సతీశుడు ఈవాదవివాదాలకు సిద్ధంగా నేవున్నాడు ఇక సహించలేక కాలు నేలకేసికొట్టి బెదిరింపుతో "బైటికిపో గాడిదా!" అన్నాడు.

అందరితోపాటు ఇల్లుకూడా ఈకేకకు అదరపోయింది. శెట్టి మెదలకుండా బైటికి వెళ్లి పోయాడు.

సతీశుడు చెదరిపోయిన కిరణ్మయి చీర సరిచేసి విసనకర్ర చేతపట్టుకొని బాగా విసరసాగాడు. వారిద్దరిచుట్టూ మూగిన ఆడవాళ్ళంతా కోలాహలం చెయ్యసాగారు. వారి గుసగుసలనుబట్టి కాసేపట్లోనే సతీశుడు చాలా సంగతులు తెలుసుకున్నాడు. కామినీదాసి మరింత ఆశ్చర్యంచూపెడుతూ "నాకింతవయస్సువచ్చింది-ఇంత విచిత్రమైన ఆడదాన్ని ఎక్కడా చూడలేదు ఇదేమి సోధ్యమమ్మా! వేశ్యను వేశ్యంటే-కళ్లుతిరిగి-వళ్లుపెరిగి పడిపోయింది?" అన్నది.

షుమారు ఇరవై నిమిషాలకు కిరణ్మయికి తెలివివచ్చి పయట సర్దుకొని లేచి కూర్చుంది. క్షణంసేపు ధ్యానంలో చూచి మెల్లగా "చిన్నబాబూ!" అన్నది.

సతీశుడు ఆమెపాదాలకు నమస్కరించి "అవును. నేనేవదినా! కాని అసలు విషయమేమిటో కొంచెంచెప్పు!" గుడ్డలుఎలావున్నాయో మొహమూ, వళ్ళూకూడా అలాగేవుంది. ఆమె సతీశుని వదెన అని ఎవరంటారు? ఎవరో దిక్కులేని పిచ్చిదానిలాగవుంది! "చిన్నతనంలో అనేకం చేశావు. ఇక రేపటి ఓడకు ఇంటికిపద" ఆ స్త్రీలకేసిచూచి "ఇకమీరు అవసరంలేదు. మీ ఇళ్ళకు పొండి" అన్నాడు.

కిరణ్మయి శిలాప్రతిమలాగ తలవంచుకు కూర్చుంది. ఆమెలోని వ్యథ అంతర్యామికే తెలుసు. కాని బైట ఎవరికీ తెలియదు. స్త్రీలు బైటకు వెళ్ళి

పోయిన తర్వాత "ఆ పంది ఎక్కడున్నాడు వదినా?" అన్నాడు.

కిరణ్మయి తలవంచుకొని "ఇంతవరకు ఈ ఇంటోనే వున్నాడు. నిన్న రాత్రి మరోచోటికి వెళ్లిపోయాడు" అన్నది.

"ఎందుకని?"

"నేనే వెళ్లిపొమ్మని చెప్పాను."

"అయితే పిలవనంపితే వస్తాడా?"

"పిలవనంపి చూస్తాను" అని కిరణ్మయి బైటకువెళ్ళి ఇంటినౌకరును కాళీమందిరానికి పంపి మళ్ళా తిరిగివచ్చి "నువ్వు వస్తావని కలలోకూడా అనుకోలేదు" అన్నది.

"నాగ్గూడా నాకు స్వప్నబాహ్యమైన విషయంకాదా వదినా?" అన్నాడు సతీశుడు.

"అదీ నిజమే" అని కిరణ్మయి మళ్ళా తలవంచుకుంది. సతీశుడు ఇంట్లో దాసీ నడిగి జాడతెలుసుకుని ఇక్కడికి వచ్చాడని తెలుసుకోటం కష్టమేమీ కాదు. కాని ఇంతకాలమైనతర్వాత ఇవ్వాళ అకస్మాత్తుగా జాడతెలుసుకొని ఇంతదూరంవచ్చి తిరిగి తీసుకెళ్ళటానికి యథార్థకారణం వూహించటంమాత్రం కఠినమైనసంగతే."

వచ్చినకారణం స్వయంగా సతీశుడే బైటపెట్టాడు. "రేపు ఓడవెళుతుంది. నేను మిమ్మల్ని తీసుకెళ్ళటానికే వచ్చాను" అన్నాడు.

కిరణ్మయి తలపైకెత్తి "వుపేంద్రబాబు పంపాడా ఏమిటి? సరే, దివాకరుని తీసి కెళ్ళు. చెయ్యెత్తి నమస్కరిస్తాను-అతనిని తప్పకుండా తీసికెళ్ళు" అన్నది.

"కేవలం ఇతరుల ఆజ్ఞనుపాటించి నేనింతదూరం రాలేదు వదినా! అంతకంటెకూడా నాకీవిషయంలో చాలచింతగావుంది. ఇంతకాలంగడచిన తర్వాతెందుకని అంటావు నువ్వు? కాని ఎంతవెతకినా నువ్వు ఎక్కడవున్నావో అంతు తెలిస్తేగా! తండ్రిగారు చనిపోయారు. నేనుకూడా పోవటానికి సిద్ధంగావున్నాను. కలుసుకునేవాళ్లముకూడా కాదేమో" అన్నాడు.

కిరణ్మయి తలెత్తి చూచింది. ఆమె నేత్రద్వయంతో ప్రపంచంలో నున్న స్నేహాన్నంతటినీ సతీశుని వంటిమీద అంతటా కురిపించింది. క్షణం

సేపుండి కరుణకంఠంతో "నేను ఎవరిదగ్గరకు వెళ్తాను బాబూ! ప్రపంచంలో నావాళ్లు ఎవరున్నారు?" అన్నది.

"నాదగ్గరకు రా వదినా—నేనున్నానుగా!"

"నాకు ఆశ్రయ మివ్వటం మంచిదా?"

"నీకు జ్ఞాపకం లేదా వదినా! చాలకాలం కిందటే నువ్వు మఱిది అని పిలిచిన రోజునే—మంచిచెడ్డల నిశ్చయం జరిగిపోయింది. నువ్వేమైనా అన్యాయం చేస్తే దానికి సమాధానం నువ్వే చెప్పవలసివస్తుంది. కాని—నేను నీచిన్నమఱిదిని. నిన్ను గురించి ఆలోచించే అధికారం నాకేమీలేదు" అన్నాడు సతీశుడు.

సతీశుని ఈమాటలు విని కిరణ్మయికి ఎక్కడిలేని నాసారిపోయి—కడుపార ఏడవాలనిపించింది. కాని ఆ ఆవేగాన్ని అణచుకొని "కాని సమాజం......?" అన్నది.

సతీశుడు మధ్యలోనే "చేతిలో డబ్బున్నవాడికి, శరీరంలో బలమున్నవాడికి వ్యతిరేకంగా సమాజంకూడా ఏమీచెయ్యలేదు. చెయ్యలేదు. అవిరెండూ నాదగ్గర పుష్టిగావున్నాయి వదినా!" అన్నాడు.

అతను చెప్పే ధోరణి చూచి కిరణ్మయికి నవ్వొచ్చింది. కొంచెంసేపు మెదలకుండా వూరుకొని "ధనం, శరీరబలాలతో నువ్వు సమాజాన్ని ఆపితే ఆపవచ్చు, కాని ఈపాపిష్టిని ఎలారక్షిస్తావు?" అన్నది.

సతీశుడు అధైర్యంతో "నాకు చదువుసంధ్యలు రావు. నేను పల్లెటూరి మూర్ఖుణ్ణి. అన్నిటికీ సమాధానంకూడా చెప్పలేను. ఇంతసూక్ష్మంగా లోకుల మంచిచెడ్డలనుగురించి ఆలోచించటంకూడా నేను నేర్చుకోలేదు. ఇది సత్యయుగమా ఏమిటి—వుపేంద్ర అన్నలాగ అందరూ యుధిష్ఠిరులై కూర్చోటానికి? ఇది కలియుగం. అన్యాయాలు—అనిష్టాలూ చేస్తూనే వుంటారు? వాటి జమాఖర్చులు ఎవడు రాస్తూ కూర్చుంటాడు? నా వుద్దేశం మాత్రం దీనికి వ్యతిరేకం—లోకులు, ఎవరేపని చేస్తున్నారో నేనూ చూస్తున్నాను వదినా! హారన్‌బాబు మృత్యుసమయంలో నీ పతిసేవ నా కళ్ళారా చూచాను. నువ్వు కులటవైపోతావని నేను చనిపోయినాకూడా నమ్మను. ఏమైనాకానీ, నేను నిన్ను తప్పకుండా తీసుకెళ్తాను వదినా! రోగం నన్ను కొంత సుస్తీ

చేయించింది. నీకు సాయంచేసి నిన్ను నా చేతుల్లోంచి లాక్కెళ్ళటానికి ఈ సీధివారికి సాహసముందా? రేపు నిన్ను వీపుమీద వేసుకొని ఓడమీదకు తీసుకెళ్ళి పడేస్తాను-నువ్వెంతకాదన్నా!" అన్నాడు.

కిరణ్మయి ఫక్కుమన్నది. అపరాధమలిన మంతా దూరమైంది. సరల స్నిగ్ధహాసంలో ఆమెవదనం వికసించింది. క్షణంసేపు తనేమీ నిందనీయమైన పని చెయ్యలేదనుకున్నది. కోపంతో రెండురోజులపాటు అత్తవారింటివద్ద నుండి కన్నవారింటికి పోయింది. ప్రేమపాత్రుడైన మగడు తిరిగి తీసుకెళ్ళ టానికి వేడుకొంటున్నాడు.

అదేసమయంలో దివాకరుడు బైటనుంచి పిలచి గదిలోకి వచ్చాడు. అతని మొహంమీది వుదాసీనతంతా ఏదో మంత్రబలంతో ఒక్కరోజులోనే తొలగిపోయిందా—అని కిరణ్మయి ఆశ్చర్యంతో చూచింది.

గదిలోనికి వచ్చి అలవాటు చొప్పున కిరణ్మయికి నమస్కరించి "నువ్వ నన్ను పిలవనంపావా వదినా?" అంటూవుండగానే అతను మంచంకేసి చూచి ఏదో భూతమా అన్నట్టు త్రుళ్ళిపడ్డాడు.

అతను బైట ఎండలోంచి గదిలోకి వచ్చాడు. అందుచేత మొదట అతనికి సతీశుడు కనపడలేదు. చూచిన తర్వాత అతని మొహం వుదాసీనమై పోయింది.

సతీశుడు చిరునవ్వు నవ్వి "నేను వుపేంద్రబాబును కాదు, సతీశ బాబును. దుష్టపనులకు దిట్ట. నన్ను చూచి ఈవిధంగా నిలువున నీరైపోయేంత అవసరం లేదు. కూర్చో, కూర్చో. వుపేంద్రబాబుగారి అనుమతిపై వచ్చాను. రేపు ప్రొద్దున ఆరున్నరగంటలకే ఓడ బైలుదేరుతుంది. జ్ఞాపకం పెట్టుకో" అన్నాడు.

దివాకరుడు అక్కడే చతికిలబడి రెండుకాళ్ళసందున తల యిరికించి కొంచెంసేపున్న తర్వాత "నేను రాను సతీశ్ బాబూ!" అన్నాడు.

"నీ శిరస్సు తీసి తీసుకెళతాను. వుపేంద్రబాబుగారి అనుజ్ఞ-విద్రోహి దివాకరుని శిరసు కావాలి-ప్రాణ మున్నా లేకపోయినాసరే! - అర్థమైందా?" అన్నాడు సతీశుడు.

"అయితే శిరస్సే తీసుకెళ్ళు సతీశ్ బాబూ! దాన్ని నీకు వుదయం ఆరుగంటలముందే ఇవ్వగలను" అన్నాడు దివాకరుడు.

సతీశుడు చకితుడై "అరే బాబు! కుర్రవాడికోపం చూడు! అయితే నువ్వు రాంది ఎందుకని?" అన్నాడు.

"నీకు పిచ్చెత్తిందా ఏమిటి? ప్రపంచంలో నా కెవరున్నారు?- వెళ్లి తలెత్తుకు ఎదురుగా నిలబడ గలగటానికి?" అన్నాడు దివాకరుడు.

"సరే, తలెత్తుకోటానికి కష్టంగా వుంటే వంచుకే తిరుగుదు కాని; వెళ్ళటంమాత్రం తప్పదు అరే, నువ్వంత మహాపరాధం చేశావా-సిగ్గుతో చచ్చిపోవటానికి? ఈమధ్య నేను చేసిన దుష్కృత్యాలన్నిటినీ అక్కడికి వెళ్ళినతర్వాత విందువుగాని. భూసిద్ధి, భేతాళసిద్ధి-ఈ పేర్లన్నీ ఎప్పుడైనా విన్నావా? లేదు, పద. వుపేంద్రబాబు కాదు- మే మైదుగురము కలసి ఒక విధంగా అన్నీ-ఒప్పించాము. సర్దుకోవలసిన దేవో సర్దుకో వదినా, నేను టిక్కెట్లు కొనుక్కు రావటానికి వెళతాను" అన్నాడు సతీశుడు.

అతని చివరిమాట కిరణ్మయి చెవులకు కటువుగా తగిలింది. "ఒప్పించిన విషయమేమిటి బాబూ?" అన్నది.

సతీశుడు బిగ్గరగా నవ్వి "అక్కడికి వెళ్ళిన తర్వాత అంతా వింటావు, చూస్తావుగా వదినా!" అన్నాడు.

"కాని నేను నీతో రానని చెప్పాను బాబూ!" అన్నది కిరణ్మయి.

దివాకరుడు కూడా దృఢస్వరంతో "నేనుకూడా-ఎటూ రాను సతీశ్ బాబూ, అనవసరంగా నాకోసం డబ్బు నష్టపర్చకు" అన్నాడు.

సతీశుడు లేచి వెళ్ళబోయి హతాశుడై మళ్ళా కూర్చోబడ్డాడు. వుపేంద్రుని జబ్బుసంగతి అత నింతవరకు దాచివుంచాడు. కాని దాచివుంచితే లాభం లేదని చూచి "నేను వారిద్దరినీ గట్టిగా తీసుకువస్తానని-అతనితో గట్టిగా చెప్పివచ్చాను. మీరు నామాట నెగ్గించకపోయినా సరేగానీ- అతను మీకు అలాంటి మహాపరాధ మేమిచేశాడు - దానికి ప్రతీకారంగా -ఈ శిక్ష విధించటానికి? నేనొక్కణ్ణే తిరిగి వెళితే వారెంత దుఃఖపడతారో చెప్పలేను- అలాంటి అన్యాయం చెయ్యకు దివాకర్-నిన్ను చూడటానికే అతని ప్రాణాలు ఇంతవరకు నిలచివున్నాయి-లేకపోతే ఈపాటికి పోయి వుండేవి" అన్నాడు!

అతని మాటలు విని ఇద్దరూ ఒక్కసారి హాహాకారాలు సలిపారు.

"ఈ మాఘమాసాంతంలో పసువదిన క్షయరోగంతో ఈ లోకాన్ని వదిలి పోయినప్పుడే-వుపేంద్రబాబు కూడా దక్కడని సందేహపడ్డాం. కాని ఆతనికి ఇంత తొందరగా కాలం దాపురిస్తుందని ఎవరూ అనుకోలేదు. చాల కాలంనుండి తక్కువగా మాట్లాడుతున్నాడు. స్వర్గరథం వాకిటిముందుకు వచ్చేవరకూ వారు వెళ్ళటానికి సిద్ధంగా వున్నారని ఎవరికీ తెలియదు. నీకేం భయంలేదు దివాకర్, నిర్భయంగా పద. మన వుపేంద్రబాబు ఇప్పుడా వుపేంద్రబాబుకాదు. ఇప్పుడు వేయితప్పులనుకూడా తప్పులుగా భావించటం లేదు. చిరునవ్వు నవ్వి వూరుకుంటున్నాడు. ఛీ! ఈవిధంగా కింద పడుకోకు వదినా! సరే మేము బైటికి వెళుతున్నాము. వెళ్ళి మంచంమీద పడుకో" అని సతీశుడు చప్పున లేచి ఆమె పాదాలంటేప్పటికి-ఆమె స్పృహ తప్పి కింద పడిపోయింది. బుద్ధిపూర్వకంగా పండుకోలేదని గ్రహించాడు.

సతీశుడు దివాకరుడు ఒకరి మొహాలు ఒకరు చూచుకొని స్తబ్ధులై పోయారు. కొంచెంసేపున్న తర్వాత సతీశుడు మెల్లగా "నాకు సంశయం కలిగింది దివాకర్. నాకు తెలుసు-ఈ కబురు వదిన విని సహించలేదని" అన్నాడు.

దివాకరుడు చకిత దృష్టితో సతీశుని మొహంకేసి చూడసాగాడు. సతీశుడు ఆశ్చర్యంతో "ఇంతకాలం ఒక్కచోటవున్నా నీకీ సంగతి తెలియదు దివాకర్! బహుశా వదినను నేను చంపటానికే తీసుకు వెళ్లుతున్నానని భయంగావుంది. కాని తీసుకెళ్ళక తప్పదు. ఈ ప్రపంచంలో యిద్దరే ఈ దుఃఖాన్ని ఏవిధంగానూ సహించలేరు. ఒకరు స్వర్గంలో, మరొకరు...కాని వెళ్ళి త్వరగా నీవ్పుతీసుకురా దివాకర్! నేను విసురుతాను! అదే! మాట్లాడవేం" అన్నాడు.

దివాకరుడు ఒక్కసారి ఆపాదమస్తకం కంపించిపోయాడు. అతను తక్షణమే కిరణ్మయి పాదాలమీద పడి "నాకంతా తెలిసింది వదినా! నువ్వు నాకు పూజ్యురాలవు. అయినా యింతవరకు ఈ సంగతి దాచి నన్నెందుకు నరకకూపంలో వుంచావు? నేను ఈ మహాపాపాన్నుండి ఎలా ముక్తి పొందుతాను?" అన్నాడు.

# ౪౪

నా యీ అస్థికలను ఎప్పుడు గంగలో కలుపుతావు సావిత్రీ? ఎన్ని జ్వాలలతోనో అలమటించి పోతున్నాను - కొంచెం చల్లబడనైనా చల్లబడు తుంది” అన్నాడు వృపేంద్రుడు.

సావిత్రిని ఇప్పుడు వృపేంద్రుడు ‘నువ్వు’ అని పిలుస్తున్నాడు. సావిత్రి అతని శేషకోర్కెగా చికిత్సకోసం కొంతకాలంక్రిందట కలకత్తాలో ఒక చివరిల్లు తీసుకుంది. ఇవ్వాళ సాయంత్ర కొంచెం మసుకగానున్నది. కాని ఆకాశం ప్రశాంతంగానే వుంది. వృపేంద్రుడు కొంచెంసేపున్న తర్వాత అలసిన కళ్లు నలుపుకొని మెల్లగా “కొంచెం ఆ కిటికీతలుపు తియ్యి అమ్మా - ఆ పెద్ద నక్షత్రాన్ని ఒకసారి చూస్తాను” అన్నాడు.

సావిత్రి ఆతని మొహాన పడివున్న వెంట్రుకలను మెల్లగా సరిచేస్తూ మృదుస్వరముతో “వంటికి చల్లగాలి తగులుతుంది” అన్నది.

“తొగలనీ తల్లీ! ఇంకా దానికి జడిసి ఏమిచేస్తావు? ఇవ్వాళే ఎందుకు? నా శరీరముమీద జరిగే అత్యాచారాల బాధ్యత సురబాలతోనే పోయింది.” అన్నాడు. కాని సావిత్రి భయంమాత్రం పోలేదు. శ్వాస వున్నంతవరకు ఆమెకు ఆశవున్నది. అందుకనే మృత్యుదేవత వచ్చి తలవైపున కూర్చున్నా- ఆమె చల్లని గాలిని లోపలికి రానియ్య నిష్టగించలేక. ఆమె అయిష్టత కనపర్చుతూ “నక్షత్రాలు - చుక్కలు కనబడటం లేదు. ఆకాశంలో మేఘాలు కమ్మివున్నాయి” అన్నది.

నృపేంద్రుడు ఆసక్తితో కళ్ళు రెండూ తెరచి “మేఘాలా! వేసవ యంలో మేఘాలు! కిటికీ తలుపు తెరువు అమ్మా!- ఒకసారి చూస్తాను -మళ్లా వాటిని చూట్టానికి కనపడవేమో” అన్నాడు.

బైట చలిగాలి తీవ్రంగా వీస్తోంది. సావిత్రి నొసటిమీద, వక్షం మీద చెయివేసి చూసింది. జ్వరం బాగావుంది. అందుచేత ఆమె వినయంగా “నయమైతే, ఎన్నో మేఘాలు చూస్తావు బాబూ! బైట ఈదరగాలి వేస్తూ వుంది. కిటికీ తియ్యను” అన్నది.

ఆమె చేతిని తనచేతిలోనికి తీసుకొని వృపేంద్రుడు హాసంతో “నా మేలుకోరితే - తియ్యి సావిత్రీ! లేకపోతే వర్షంలో మేఘాలు కమ్మితే విల

పించి చస్తావు - ఈ సంగతి జ్ఞాపకం పెట్టుకో. నాకు మళ్ళా వాటినిచూచే అవకాశం దొరకదు" అన్నాడు.

సావిత్రి అతన్ని ఎదిరించలేక పోయింది. కన్నీళ్లు తుడుచుకొని లేచి వెళ్ళి కిటికీ తలుపు తీసింది.

ఆ కిటికీలోంచి దివాకరుడు తదేకధ్యానంతో చూస్తూవుండిపోయాడు. ఆకాశంలో - అదృశ్య ప్రాంతాలలో క్షణక్షణానికీ మెరపులు మెరుస్తున్నాయి. ఆ మెరపులముందు కారు మేఘాలు కమ్ముకొస్తున్నాయి. వాటిని చూడాలన్న వుపేంద్రుని పిపాస ఎంతసేపున్నా తగ్గనట్టున్నది.

సావిత్రికూడా అటువైపు చూస్తూ మెదలకుండా కిటికీదగ్గర నుంచు న్నది. ఆమెను చూడగానే వుపేంద్రుడు మనసులో నవ్వుకొని "సరే, ఇక కిటికీ తలుపు వేసి దగ్గరకువచ్చి కూర్చో. ఇంతమమత పనికిరాదు. కాస్తగాలి కూడా నా వంటిమీద సోకనియ్యవుగదా! నేను చనిపోయినతర్వాత ఏమి చేస్తావు?" అన్నాడు.

కిరణ్మయి కిటికీ వేసి దగ్గరకువచ్చి కూర్చుని "ఎందుకు? నువ్వే అన్నావుగా - నేను నీకు పని అప్పగించిపోతానని. నేను జీవితమంతా అపనే చేస్తూ వుంటాను. నువ్వు నా కళ్ళముందు రాత్రి-బగళ్లు తిరుగుతూ వుంటావు!" అన్నది.

"చేయగలవా?"

సావిత్రి మెల్లగా "ఎందుకు చెయ్యలేను? నీ మాటంటే అత నెప్పుడూ కాదనడు" అన్నది.

వుపేంద్రుడు నవ్వుతూ "అత నెవరు? సతీశుడా—?" అన్నాడు.

సావిత్రి తలవంచుకుని మెదలకుండా వూరుకుంది.

వుపేంద్రుడు ఆమె లజ్జావదనంకేసి చూచి ఒక దీర్ఘ నిట్టూర్పు విడచి "సతీశుడు నా కేమౌతాడో ఇతరులు తెలుసుకోటం కష్టం సావిత్రీ. బైట కనబడేదాన్ని బట్టి - అతను నా స్నేహితుడనీ, నా జన్మసఖుడనీ తెలుస్తూ వుంది. కనపడని సంబంధాన్ని బట్టి - సతీశుడు నా తమ్ముడు, నా శిష్యుడు నా అనురాగసేవకుడు. ఆరాత్రే నువ్వు - నీ పరిచయం తెల్పి మమ్మల్ని తిప్పి తీసుకెళ్ళినట్టయితే నా శేషజీవితం ఇంతదుఃఖాలతో గడిచేదికాదు.

దివాకరుడుకూడా నన్నింత దుఃఖపెట్టే అవకాశం పొందేవాడుకాదు" అన్నాడు.

సావిత్రి కన్నీటి కళ్ళతో "నిన్ను తిప్పి తీసుకురావా లనుకున్నాను బాబూ! కాని అత నేవిధంగానూ కదలనియ్యలేదు. అతను వాకిటికి అడ్డంగా నుంచుని - నువ్వు వెళ్ళటం అతనికి అవమానం చెయ్యటమే అవుతుంది అన్నాడు" అన్నది.

"అతని యిష్టం" అని వుపేంద్రుడు పైవంక చూచి ఒక దీర్ఘనిట్టూర్పు విడచి మెదలకుండా వూరుకున్నాడు.

ఇంటిదగ్గర వుపేంద్రుని తండ్రి శివప్రసాద్ వాతరోగంతో మంచం పట్టాడు. అతన్ని -ఇల్లు, వాకిల్ని వదిలిపెట్టి మహేశ్వరి అతని వెంట రాలేక పోయింది. కాని రెండవవాడు వుపేంద్రుని సేవాశుశ్రూషలకోసం వెంట వచ్చాడు.

అతను తక్షణమే వైద్యుని వెంటబెట్టుకుని గదిలోకి వచ్చాడు. వైద్యుడు నాడి చూచాడు. జ్వరపరీక్షచేసి మందుమార్చాలని చెప్పాడు. ఈ మాట విని వుపేంద్రుడు చేతులు జోడించి "నన్ను క్షమించండి వైద్యులుగారు! ఈ అంత్య సమయంలో నన్నింకా బాధపెడతా రెందుకు?" అన్నాడు.

వృద్ధ వైద్యుని కళ్ళల్లో నీరుతిరిగాయి "మేము వైద్యులము. అంత్య సమయం వరకు నిరాశచెందము బాబూ! అదీగాక భగవంతుడు ఆశలన్నీ వదిలించినా వుపశాంతికి మందు యివ్వటమే మంచిది" అన్నాడు.

వుపేంద్రుడు ఇంకెక్కువ వాదించకుండా మెదలకుండా వూరుకున్నాడు.

అప్పుడు మందుమార్చి పథ్యం వగైరాలనుగురించి చెప్పి వైద్యుడు వెళ్ళి పోయాడు. అతనికి ఆశ కించిత్తుకూడా లేదు. మృత్యువు క్షణక్షణానికి దాపుకు వస్తూవుందని ఇవ్వాళే బాగా గుర్తించాడు.

మూడురోజుల తర్వాత సోమవారం ప్రొద్దున్నే సావిత్రి ఒక తంతి చేతపట్టుకుని గదిలోకి వచ్చింది. సావిత్రి చేతిలో తంతిచూచి వుపేంద్రుడు ఆతురతతో "సతీశు డిచ్చాడా? ఏమి రాశాడు?" అన్నాడు.

"నిన్న ప్రొద్దున వారు ఓడ ఎక్కారట" అన్నది సావిత్రి.

"సతీశుడు ఎవరిపేరూ రాయలేదూ? ఏది చూస్తాను?"

"ఏరు లేదు" అని సావిత్రి వుపేంద్రుని చేతికి టెలిగ్రాము యిచ్చింది.

వుపేంద్రుడు కాగితాన్ని తిరగ బోర్లవేసి చూచి - మళ్ళా సావిత్రి చేతికిచ్చి ఒక నిట్టూర్పు విడిచాడు. అతని భావాన్ని సావిత్రి పూర్తిగా తెలుసుకుంది.

వెళ్ళేప్పుడు సతీశుడు ఏకాంతంగా-కిరణ్మయి కనపడితే ఏదోవిధంగా తీసుకొస్తానని చెప్పాడు. అతను తన వదినా-మరదుల సంబంధాన్నికూడా చెప్పి పోయాడు.

ఈ విచిత్రరమణిని చూడటానికి సావిత్రి చాలాకాలంనుండి కుతూహల పడుతూవుంది. కాని సతీశుడు ఆమెను ఇంటికి తీసుకువస్తాడన్న సందేహం కూడా ఆమె మనస్సులో పూర్తిగావుంది. "అతను ఏపనీ అన్ని విధాలా ఆలోచించి చెయ్యడు. కిరణ్మయిని ఇక్కడికి తీసుకొస్తాడని నాకు భయంగా వుంది", అన్నది.

ఉపేంద్రుని శుష్కాధరాలమీద చిరునవ్వు రేఖ లగపడినాయి. "ఆమె ఈ ఇంటిముందుకి వస్తుందమ్మా? ఆమె దేహానికి తిరిగి రాకపోయినా దాని కేదైనా కారణముంటుందని తెలుసుకో. కాని ఆమె సావిత్రికాదు. చాల తెలివితక్కువది. నీలాగ ఆమె ఈ లోకాన్ని పరలోకాన్ని సమానంగా ఉంచి కూర్చోలేదు. ఆమె తెలిసిఉండే ఈ భయంకర అగాధంలో ఎందుకు అడుగు పెడుతుంది?" అంటూవుండగానే సావిత్రియందు పొంగిపొరలివచ్చే ప్రేమ, శ్రద్ధా, కరుణా వేదనలతో అతని కంఠస్వరం కంపించింది.

సావిత్రి కళ్లు కిందకు తిప్పుకుని ఎంతో బలవంతాన కన్నీళ్ళు ఆపుకుంది. కొంచెం తమాయించుకుని "మరొక ఆశ్చర్యకరమైన విషయముంది తెలుసా సావిత్రీ? ఒకప్పుడు నిజంగా ఆమె నన్ను ప్రేమించినట్టు తెలుస్తూఉంది."

ఈ మాట విని సావిత్రికి చాల ఆశ్చర్యం కలిగింది - కారణం-ఈమాట ఆమె సతీశునిద్వారా ఎప్పుడూ వినలేదు. "కాని నేను - ఆమె పతిసేవను గురించి విన్నాను - ఆ సంగతి నిజమేనా ?" అన్నది.

"ఆ సంగతికూడా నిజమే. కాని అది విచిత్రమైన విషయం. నువ్వూ సురబాలతప్ప అలాంటి సేవ ఇంకే స్త్రీ చెయ్యలేదనిపిస్తుంది. ఏ స్త్రీ తనపతిని అంత ప్రేమించనుకూడా లేదేమో!" అన్నాడు ఉపేంద్రుడు.

"ఆ మాట ఎప్పటికీ అబద్ధం కాదు" అన్నది సావిత్రి.

ఉపేంద్రుడు వెంటనే ఆమె మాటలతో పాటుకలిపి "అవును, ఎప్పటికీ అబద్ధం కాదు. ఆమె ఎప్పుడూ ఎవరికీ చూపి వదలుకోలేదు, తప్పు వలచుకోలేదు. ఆమె పతిసేవకు సాక్షి వేపలం ఫలితం పొందుతుంది. ఇంకా సహిస్తూ- నేనుకూడా వున్నాను" అన్నాడు.

కొంతసేపటికి ఉపేంద్రునికి అనంతమోహనుని సంగతి జ్ఞాపకం వచ్చింది. "ఇవ్వాళ నా కెవరిమీదా కోపంలేదు, ద్వేషంలేదు. హృదయ్య పేదు - ఆమె జీవితమంతా వ్యర్థంగా అటూ ఇటూ తొందరలో సాగిపోయింది. ఆమె చేతికేమీ చిక్కలేదని నా మనసులో చాలా బాధగా వుంది. ఆమె నన్నుకూడా ప్రేమించలేదు. ఏ కొంచెం ప్రేమించినా నన్నింత వ్యధపెట్టగలిగేదా? తనవా కరుణ నా క్షేమాలాడో ఆమెకు తెలుసు. ఆమె కోసకే ప్రాణాన్ని అర్పించి వచ్చాను. నా ప్రేమవస్తువును - ఆమెకూడా ప్రేమదృష్టితో చూస్తుందనుకున్నాను! కాని ఎంతపొరపాటు జరిగింది!" అన్నాడు.

కొంచెంసేపు కదలకుండా వుండి "ఆమెకు భర్త వున్నాడు సావిత్రీ! అలాంటి స్థితిలో నన్ను ప్రేమించటం అన్యాయం కాదూ? అయినా ఆమె ఇప్పుడు పడిన పతనకూపంలాంటి కూపంలో పడేది కాదు!" అన్నాడు. సావిత్రి మెదలకుండా కూర్చుని వుండిపోయింది. భర్తసన్నిధానికి, చేతినిండా పతిసేవ చేసే అవకాశం కలగానికి ఈ దుర్గతా? అసలు ఆమె పనులన్నీ కలుషపూర్ణమైనవి. ఈ కృతజ్ఞతాచరిత్రను తలుచుకొని కిరస్కరించినప్పుడు ఆమె హృదయం కోపంతో నిండిపోయింది.

"అందుకనే హరిహరుడు వెనక ముందేమీ ఆలోచించకుండా ఆ దరిని తీసుకొని ఇక్కడికే వస్తాడేమోనని ఆలోచిస్తున్నాను" అన్నాడు ఉపేంద్రుడు.

సావిత్రి గట్టిగా తలకాయ తిప్పి "లేదు. అలా ఎప్పటికీ జరగదు. తన వదినె వుండటానికి ఏర్పాట్లు అతనే చేసుకుంటాడు. ఇక్కడామె ఒక్క నిమిషం నిలవటానికికూడా వీలులేదు. జబ్బుసంగతి విని ఆమె స్వయంగా ఇక్కడికి వస్తానంటుందేమో బాబూ!" అన్నది.

ఉపేంద్రుడు ఏదో చెప్పాలనుకున్నాడు. కాని నోటిలోమాట నోటిలోనే వుండిపోయింది. అదేసమయంలో అఘోరమయి ఎలాగో జబ్బుసంగతి

విని వుపేంద్రుని గుణాలను తలచుకుంటూ ఏడుస్తూ ఇంట్లోకి వచ్చింది.

వుపేంద్రుని రోగం ఎంతవరకో అఘోరమయికి తెలియకపోయినా "ఈ దౌర్భాగ్యురాలు ఎవరిదగ్గరకైనా వెళ్ళి యాచించుకునే దారికూడా పోయింది. ఇక గుప్పెడు అన్నంకూడా దొరకదు. పస్తులుండి చావవలసి వస్తుంది. వుపేంద్రుని ఆపదల నన్నిటినీ నెత్తిన వేసుకొని నేనెందుకు చావ లేను?" అని విలపించసాగింది.

వుపేంద్రుడు అంత దుఃఖంలోకూడా నవ్వుతూ "మీకు జీవితం గడచే ఏర్పాట్లు ఎందుకు చెయ్యలేదు పిన్నీ?" అని మళ్లా సావిత్రికేసి మొహంతిప్పి "నేను పోయినా మా యీ చెల్లెల్ని వదలి పోతున్నాను. మీకే కష్టమూ వుండదు" అన్నాడు.

అఘోరమయి సావిత్రిని ఇంతవరకు ముందెప్పుడూ చూడలేదు. అందు చేత కఠినపరిశ్రమ మానసిక దుఃఖంతో వడిలిపోయిన ఈ అపరిచితసోదరికేసి చూచి ఆమె ఆశ్చర్యానికి అంతులేకపోయింది. తన ఆశ్చర్యం తీర్చుకోవటానికి ఆమె ఏదో అడగబోతూ వుండేప్పటికి సావిత్రి ఏదోవంకతో వప్పున అక్కడ నుండి వెళ్ళిపోయింది.

బుధవారంనాడు షుమారు పన్నెండు గంటలకు సతీశుడు ఓడదిగి రేవు దగ్గర దిగి బాడుగబండి మాట్లాడుతూ వుండేప్పటికి బిహారి కనపడ్డాడు. యజ మానిని చూచి బిహారి దగ్గరకువచ్చి నమస్కరించాడు. కిరణ్మయి చెంత నుంచుని వుంది. ఆ స్త్రీ ఈమేనని అతనికి సంశయం కలిగింది. అతను ఇంతకు ముందెప్పుడూ ఆమెను చూడలేదు. ఆమె అసాధారణ రూపవతి అనిమాత్రం విన్నాడు. కాని రూపవిశేషం లేమీ ఈ మలినవస్త్రాలలోగానీ ఈ మామూలు స్త్రీలలోగానీ కనబడకపోయేప్పటికి ఈమె మరెవరో ననుకున్నాడు. అందుచేత మెల్లగా "అమ్మగారు వస్తే ఇంకెక్కడైనా వుంచి మీ యిద్దరినీ అక్కడికి రమ్మన్నది సావిత్రి. ఆమెను వెంటతీసుకురాకండి" - అన్నాడు.

సతీశుడు ఆకలిదప్పులతో అసలే అలసివున్నాడు. దానిమీదట బిహారి ఈ అవమానకర విషయము కిరణ్మయిముందే చెప్పేప్పటికి ఒక్కసారి మండిపడి "ఎందుకని? వీరిని ఎక్కడ వుంచను? మేమెవరమూ అక్కడకు రాదలచుకో లేదని వెళ్ళిచెప్పు" అన్నాడు.

బిహారి మొహం తెల్లబడిపోయింది. కిరణ్మయి దగ్గరకు వచ్చి ఒక

శుష్కనవ్వు నవ్వి "అతను చెప్పేది బాగానేవుంది బాబూ! దీనిలో కోప గించుకోవలసిన విషయమేమీ లేదు. అయితే-ఇప్పుడు బాబుగారికి ఎలావుంది బిహారీ?" అన్నది.

బిహారి సమాధానం రాకముందే సతీశుడు మరింత క్రుద్ధుడై "నిన్నీ మాట చెప్పమని పంపింది ఎవరు? సావిత్రా? ఆమె తల పొగరెక్కి-కట్టు కన పడుతూ వుంది" అన్నాడు.

సావిత్రిని అన్న అలాంటి కఠినమైనమాట విని బిహారి చాల దుఃఖించి కిరణ్మయి మొహంకేసి చూచి "నువ్వు అన్నది నిజమేనమ్మా. బాబుగారు తెలుసుకోకుండానే మండిపడతారు. అలాంటి పాడురోగంలో రోగియింటికి ఎవరు వెళ్ళి నిచ్చగిస్తారు? వుపేంద్రబాబు నిన్న సావిత్రి అమ్మగారిని పిలచి స్వయంగా 'భయమేమీ లేదు. కిరణ్ వదిన నా రోగం సంగతి విని ఈ ఇంటికే కాదు. ఈ పంచకుకూడా రాదు, అమ్మగారిలాగ అందరూ జీవితం మీద...అన్నాడు" అన్నాడు.

పాలిపోయిన కిరణ్మయి మొహం ఒక్కసారి వివర్ణమై పోయింది. "ఈ మాట బాబుగారు అన్నారా బిహారీ?" అన్నది ఆమె.

బిహారి తలకాయతిప్పి ఏదో చెప్పబోతూ వుండేప్పటికి సతీశుడు గదిమి "నోరుముయ్యి గాడిదా!" అన్నాడు.

బెదరింపుతో బిహారి మెదలకుండా వూరుకున్నాడు. "ఈ వృద్ధునిమీద కోపగించుకుంటే ఏమివస్తుంది బాబూ!" అన్నది కిరణ్మయి. తర్వాత బిహారి కేసి చూచి "భయపడవలసిన అవసరమేమీ లేదు. వారి అనుమతిలేకుండా నే నక్కడికి రానని మీ బాబుగారితో చెప్పు" అని సతీశునితో "ఇవ్వాళ నన్ను ఏ హోటలులోనైనా వుంచుబాబూ! ఒక చిన్నయిల్లు అద్దెకు దొరకదూ?" అన్నది.

సతీశుడు వుత్తేజితుడై "కలకత్తాలాంటి పట్నంలో ఇంటి కేమి కరువు వదినా! నిమిషంలో నేనంతా సిద్ధంచేస్తాను. కొంచెం కాలుసాగించి నడువు దివాకర్" అని అతను కిరణ్మయిని పిలచి బండిమీద ఎక్కించి తను బండివాని దగ్గరకెళ్ళి కూర్చున్నాడు.

బండి సాగి వెళ్ళిపోయిన తర్వాత బిహారి వుదాసీనవదనంతో ఇంటి కేసి వెళ్ళిపోయాడు.

అవకాశం చూచుకొని అప్పుడప్పుడు సావిత్రి గంగాస్నానం చేస్తూవుంది.

నాలుగైదు రోజుల తర్వాత ఒకరోజున సావిత్రి గంగలో స్నానంచేసి బైలుదేరబోతూ వుండేప్పటికి ఒకవైపున ఏదో గల్లంతు వినపడింది. ఒక వృద్ధ బ్రాహ్మణుడు స్నానంచేసి మంత్రాలు చదువుతూ ఇంటికి పోతున్నాడు. ఎక్కడినుంచో ఒక పిచ్చిది వచ్చి అతన్ని అడ్డగించింది. ముట్టుకుని గంగా స్నానపు పుణ్యమంతా మట్టిపాలు చేస్తుందనే భయంతో ఆ వృద్ధబ్రాహ్మణుడు గాబరాపడుతున్నాడు. పిచ్చిది ఎడతెరిపి లేకుండా "మీరు భగవంతుణ్ణి నమ్ముతారా బాబూ? అతన్ని పిలిస్తే వస్తాడా? మీరు అతన్ని ఎలా పిలుస్తారు? నేనెందుకు పిలవలేక పోతున్నాను? నాకు నమ్మకం ఎందుకు కలగటం లేదు?" అని ప్రశ్నలు గుప్పిస్తూవుంది.

బ్రాహ్మణవృద్ధుడు ముట్టుకుంటుందనే భయంతో "తప్పుకో, లేకపోతే పోలీసులను పిలుస్తాను..." అంటున్నాడు.

నలుగురైదుగురు ప్రౌఢస్త్రీలుకూడా చుట్టూమూగి తమాషా చూస్తున్నారు. వారిలో ఒకావిడ "పిచ్చిదికాదు. రాత్రంతా తప్ప తాగినట్టు వుంది" అన్నది.

ఈ మాటవిని పిచ్చిది ఏడుస్తూ "లేదు. లేదు. నేను వున్నతకుటుంబంలో బిడ్డనే. తాగినాన్ని కాదు — ఇక్కడే వుంటున్నాను. నేను కేవలం చేతులు జోడించి - నిజంగా భగవంతుడున్నాడా లేదా అని అడుగుతున్నాను? మీరు వారినిగురించి చింతనచేస్తారా? పారాయణం చేస్తారా? నేను మొన్నటినుంచి వారిని ఎంతో పిలుస్తున్నాను" అంటూవుండగానే ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగినాయి.

సావిత్రికూడా ఆమెను పిచ్చిదనుకున్నది. కాని ఆ అపరిచిత ఏడుస్తూ విలపిస్తూ రుద్ధకంఠంలోంచి వచ్చిన వ్యాకులతాపూర్ణ అద్భుతప్రార్థన ఆమె దుఃఖాలతో జర్జరమైన హృదయానికి తగిలి-హాహాకారం చేసింది. అప్పుడే ఆమె కళ్లనిండాకూడా నీళ్లు తిరిగినాయి. పిచ్చిదానిదృష్టి ఇటుపడగానే పాపమామె వృద్ధబ్రాహ్మణుని వదలి సావిత్రి దగ్గరకు వచ్చి "నువ్వుకూడా పూజా పునస్కారాలు చేస్తావుగా! చెప్పగలవా?" అన్నది.

చుట్టూ జనం మూగారు. ఇదిచూచి సావిత్రి చప్పున ఆమె చెయ్యి పట్టు

కుంది. చెయ్యి పట్టుకోగానే ఆమె త్రుళ్ళిపడి "నన్ను ముట్టుకున్నావా?" అన్నది.

"దానిలో తప్పేమీలేదు. మీరు ఇంటికిపదండి దారిలో మీసందేహాల కన్నిటికీ సమాధానాలూ చెబుతాను. ఇక్కడ చుట్టూ జనం మూగివున్నారు" అని ఆమె ఆ పిచ్చిదాని చెయ్యిపట్టుకొని బాటకువచ్చింది.

రెండుమూడుమాటలలోనే ఆమె పిచ్చిదిగాదని సావిత్రి గ్రహించింది. మాట్లాడుతూ మాట్లాడుతూ వుండగానే పిచ్చిది మధ్యలో చప్పున "నేను రాత్రింబగళ్లు భగవంతుణ్ణి ప్రార్థిస్తున్నాను. వారిముందు నేననేక అపరాధాలు చేసాను, వారిజబ్బు నాకుయిచ్చి వారిని బ్రతికించమని. ఏం అక్కా! అలా జరుగుతుందా? వుపవాసాలు చేసి రాత్రింబగళ్లు ప్రార్థిస్తే నిజంగా ఆ మనకు దయకలుగుతుందా? నీకు తెలుసా?" అని ఆమె సావిత్రి మొహంకేసి రెప్ప వాల్చకుండా చూచింది.

ఆమె కేమి సమాధానంచెప్పాలో సావిత్రికి తోచలేదు. కాని ఎక్కువ సేపు ఆమె ఆలోచింప నవసరం లేకపోయింది. అదేసమయంలో ఆమె సావిత్రి చెయ్యి వదిలిపెట్టి "వెళుతున్నాను. గంగలో స్నానం చేసివస్తాను. గంగలో స్నానంచేస్తే పాపాలన్నీ పరిహారమై పోతాయికదూ?" అని ఆమె సమాధానంకోసం ఎదురు చూడకుండానే వచ్చినదారిన గబగబా నడచిపోయింది.

---

## ౪౫

సావిత్రి ఏకధారగా కన్నీరుకార్చి అతని హృదయాన్ని తడుపుతూ వుంది. ఇవ్వాళ ఆమె వడిలో వుపేంద్రుడు మరణశయ్య పరిచాడు. అతని దుర్బలపాదాలమీద తలపెట్టి దివాకరుడు లోలోన కుమిలికుమిలి తన ఆంతరంగిక వ్యధను తెలుపుతున్నాడు. అతని పరితాపం, అతని వ్యధా అంతర్యామికి తప్ప ఇంకెవరికీ తెలియదు! అటువైపు గదిలో మహేశ్వరి కిందపడి గొంతు చించుకుని ఏడుస్తూవుంది. ఈ మహాశోకసమయంలో సతీశు డొక్కడే స్తిమితంగా కూర్చుని వున్నాడు.

ఇవ్వాళ పుదయం నుండి వుపేంద్రుని నోటివెంట ప్రవహిస్తున్న రక్తధార ఎంతప్రయత్నించినా ఆగలేదు. శ్వాస క్రమంగా అతికష్టమై పోతూ వుంది. ఆదుస్సహక్లేశాన్ని సహించి వుపేంద్రుడు కళ్లుమూసికొని మెదలకుండా పడివున్నాడు. ఒకసారి కన్నెత్తి సావిత్రి మొహంకేసి చూచి అస్ఫుట స్వరంతో మెల్లగా "ఇంకెంత ప్రొద్దున్నదమ్మా! ఈ రాత్రికూడా గడవదా ఏమిటి?" అన్నాడు.

సావిత్రి అతని పెదవులమీది రక్తాన్ని పయటచెంగుతో తుడిచి "ఇంకెక్కువ ప్రొద్దులేదు. బాధ ఎక్కువగా వున్నదా ఏమిటి?" అన్నది.

"లేదు. అందరికీ ఎలావుంటుందో అలాగే వుంది. ఎక్కువగా ఎందుకు వుంటుంది?" అన్నాడు వుపేంద్రుడు.

కొంచెంసేపు మెదలకుండా వుండి అదే భావంతో "వదినె అంతు తెలియలేదా ఏమిటి సతీశ్?" అన్నాడు.

ఇవ్వాళిటికి నాలుగురోజుల నుంచి కిరణ్మయి అంతు బొత్తిగా తెలియటం లేదు. కలకత్తావచ్చిన రోజునే సతీశుడు దగ్గరగా ఒకయిల్లు అద్దెకు తీసుకొని, ఒక పనిమనిషిని పెట్టి, అవసరమైన ఏర్పాట్లన్నీ చేసివచ్చాడు. కాని వుపేంద్రుని రోగం ఎక్కువగా వుండటంవల్ల రెండుమూడు రోజుల వరకు అటు వెళ్లలేదు. మూడవరోజున వెళ్లి చూచేప్పటికి కిరణ్మయి ఒక్క వస్తువుకూడా ముట్టలేదు. కొత్తపాత్రలన్నీ వుంచినచోటే కదిలించకుండా వున్నాయి. పొయిలో బూడిద నామమాత్రానికి కూడాలేదు. పనిమనిషి వచ్చి "పని ఎవరికి చెయ్యాను బాబూ! అమ్మగారు వచ్చినదగ్గరనుంచీ కిటికీ దగ్గర బజారుకేసి వూరికే చూస్తూ కూర్చుంటుంది. కదలదు. మెదలదు. స్నానం లేదు. సంధ్యలేదు. ఈమూడు రోజులనుంచీ గుక్కెడు నీళ్లుకూడా తాగలేదనుకుంటాను. పక్క వేసింది వేసినట్లే వుంది. కొత్త వడ్డిగిలీన పాపాన పోలేదు. నిన్న ప్రొద్దుటినుంచి ఆమె ఎక్కడికి పోయిందో, ఎటు పోయిందో, కనపడటంకూడా లేదు. సామాను, బట్టలు ఏమి చేస్తావో చెయ్యి బాబూ! నేను ఇలాంటి కొంపకి కావలి వుండలేనుబాబూ!" అన్నది.

ఈ కబురు విని సతీశుడు నెత్తిమీద చెయ్యిపెట్టుకొని కొంచెంసేపు కూర్చున్నాడు. తర్వాత పనిమనిషి చేతికి ఐదురూపాయలిచ్చి వెళ్ళిపోయాడు. అప్పటినుండి అతను ఆమెను వెతకడంలో కొంచెంకూడా లోటు వుంచలేదు.

కొంచెం జరుగు అక్కా! నేనుకూడా మరదిదగ్గర కూర్చుంటాను" అన్నది.

సరోజిని ఆమె చేయిపట్టుకుని "నన్ను గుర్తించావా వదినా?"అన్నది.

కిరణ్మయి అత్యంత సహజభావంతో "ఎందుకు గుర్తించలేదు? నువ్వు సరోజినివి కాదూ?" అన్నది.

"పద వదినా! మనం ఆగదిలోకివెళ్ళి మాట్లాడుకుందాం"అని ఆమె ఒకవిధంగా బలవంతంగా ఆమెను పక్కగదిలోకి ఈడ్చుకెళ్ళింది.

ఆమె గదిలోంచి బైటకు వెళ్ళగానే వుపేంద్రుడు మగతతో కళ్ళు మూసాడు.

సావిత్రి అతని శిరస్సును వడిలో పెట్టుకు కూర్చుంది. ఇవ్వాళ నోట్లో ఒక బొట్టునీళ్ళు పొయ్యటానికికూడా తెరవలేదు.

రాత్రంతా మగతలోనే గడిచిపోయింది. కాని సాయంత్రం జ్వరం హెచ్చినకొద్దీ వుపేంద్రునికి తెలివి వచ్చింది.

కన్ను తెరవగానే అతనిదృష్టి సావిత్రిమీద పడింది. అతను క్షీణ స్వరంతో "నువ్వు కూర్చుని వున్నావా అమ్మా! నిన్ను వదిలి వెళుతున్న సంగతి తలంపుకు రాగానే నాకళ్ళల్లో నీరు తిరుగుతున్నాయి. నావెంట వస్తావా సావిత్రీ?" అన్నాడు.

"వస్తాను బాబూ! నన్ను కూడా తీసుకెళ్ళు" అన్నది సావిత్రి.

వుపేంద్రుడు క్షణంసేపు మెదలకుండా వుండి "నువ్వు నావెంటవస్తే యీ అభాగ్యుల అభాగ్యరాంద్ర మంచి చెడ్డలు ఎవరు చూస్తారు? వద్దు తల్లీ! సమయం వొచ్చినప్పుడు వద్దువుగాని. అక్కడ మేమిద్దరమూ నీరాక కోసము ఎదురుచూస్తూ వుంటాము సతీశు డెక్కడ?" అన్నాడు.

దివాకరుడు మెదలకుండా వుపేంద్రుని కాళ్ళదగ్గర కూర్చున్నాడు. కిందకు దిగివెళ్ళి సతీశుని పిలుచుకు వచ్చాడు.

"ఆపెట్టె-పైన ఒక కవరుపెట్టివుంది తీసుకురా సతీశ్!" అన్నాడు ఉపేంద్రుడు. అతను పెట్టెతెరచి కవరు తీసుకొచ్చాడు. "దానిలో నా వీలు నామా వుంది. దివాకరుని పిలువు. చదివి వినిపించుతాడు"అన్నాడు మళ్ళా.

వీలు చాలా క్లుప్తంగావుంది-గట్టిగా. ఉపేంద్రుడు తన 25 వేల రూపాయలు సావిత్రికి ఇచ్చాడు. దానిలో ఏమరతూలేదు. చదవటం పూర్తి అయిన తర్వాత అంతా స్తబ్ధులై కూర్చున్నారు.

ఉపేంద్రుడే మళ్ళా "వదిన ఎక్కడవుంది సతీశ్?" అన్నాడు.

"కిందగదిలో నిద్రపోతూవుంది ఆమెను నేను దృష్టిలోనే వుంచాను" అన్నాడు సతీశుడు

"నీచేతికి అప్పగించ దలుచున్న పనిని ఇవ్వాళే అప్పగించనా సావిత్రీ?" అన్నాడు.

వుపేంద్రునిస్థితి ఎవరికీ తెలియంది కాదు. అందుచేత ఈమాట వినగానే ఆమె గావురు మన్నది. "ఇవ్వాళే యెందుకు బాబూ?" అన్నది.

"నీకు తెలియదు తల్లీ! ఇవ్వాళ రాత్రి గడిస్తే ఉదయంకూడా గడుస్తుందా? దగ్గరకు రా దివాకర్! ఈసోదరి చేతికి నిన్ను అప్పగించిపోనా? నువ్వుకూడా రా సతీశ్!" సావిత్రి మొహం కేసిచూచి కొంచెంసేపు మెదలకుండా వుండి "నీ కెక్కువ చెప్పవలసిందిలేదు ఈ నిర్భాగ్య సోదరులిద్దరినీ నీచేతి కప్పగించి పోతున్నాను. రెండవ చేతిలో—నాయిద్దరు చెల్లెలనూ అప్పగించుతున్నాను. నీకు సాధ్యమైతే దివాకరుని మనిషినిచేసి శశి నిచ్చి వివాహం చెయ్యి. సురబాల అంతిమకోర్కె ఇదే. ఆ తర్వాత నీయిష్టమొచ్చినట్టు చేసుకో" అన్నాడు.

తర్వాత సతీశ్ దివాకరుల చేతులు సావిత్రి ఎడమచేతిలో వుంచి "మీరిద్దరూ నా యీ మాట జ్ఞాపకం పెట్టుకోండి. నేను యిక్కడినుండి పోయినా ఈసోదరిలో ఎప్పుడూ మూర్తీభవించే వుంటాను. ఈ మెను మీరు పొరపాటునకూడా అనాదరం చెయ్యకండి" అన్నాడు.

సతీశుడు కళ్ళు తుడుచుకొని "దివాకరుని భారం నేను వహించాను ఉపేంద్రఅన్నా! అదీగాక ఇవ్వాళనుండి నీ భారాలన్నీ నా నెత్తిమీద పడ్డాయి. నేను వాటికి యోగ్యుణ్ణయేటట్టు ఆశీర్వదించి పో" అని అతను ఉపేంద్రుని పాదాలంటాడు.

సావిత్రి వారిద్దరి పాదాలవద్దపడి విలపిస్తూ "నన్నీవిధంగా బంధించి వదలకుబాబూ! నన్ను విముక్తురాలను చేసిపో! నేనింతబరువు ఎత్తలేను" అన్నది.

"నువ్వెత్తలేకపోతే ఎవరెత్తుతారు?" అని మృత్యుసమయపు మలినాధరాలమీద చిఱునవ్వు తెచ్చి పెట్టుకొని "అదేసంగతైనా-ఇంతకాలం ప్రాణాలొడ్డి నా సేవ ఎందుకు చేశావు? ఇది కలికాలమని తెలియదు? దాని

నుండి విముక్తి పొందటం అంత సులభంగాదు. ఈ పిచ్చివాళ్ళకుకూడా కొంత కాలం సేవచెయ్యి. అప్పుడే ఈ సేవకు ప్రతిఫలం దక్కుతుంది!" అని నవ్వటానికి ప్రయత్నించగా అతని నోటివెంట అతని గుండెపగిలి కిందపడిందా అన్నట్టు ఒక పెద్ద రక్తపుముద్ద పడింది.

అంతా గొల్లుమన్నారు. కిందనుండి రెండవవాడు పరుగెత్తుకువచ్చాడు. మహేశ్వరికూడా వచ్చింది. సావిత్రి పయటచెంగుతో రక్తాన్ని అదిమి పెట్టింది. కాని నృపేంద్రుడు మూసినకన్ను మళ్లా తెరవలేదు. మాట్లాడను కూడాలేదు.

అంతా అతన్ని కిందకు దింపి తీసుకొచ్చారు. అరగంటలోనే నిష్కళంకమైన నృపేంద్రుని ప్రాణం తన సురబాలకోసం పయనమై పోయింది.

అంతా గొంతులు చించుకు ఏడ్వసాగారు. ఆ కరుణరోదనాలతో ఇల్లంతా కంపించిపోయింది. కాని కిందగదిలో కిరణ్మయి ఉద్వేగరహితంగా గుర్రుపెడుతూ నిద్రపోతూవుంది.

సంపూర్తి

---